శ్రీరస్తు.

శ్రీనాథపణ్డితప్రణీత

# పరహితసంహిత

ఆంధ్రతాత్పర్యవివరణసహితము

(సాధారణకాణ్డము)



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే బ్రకటితము

1952.

# పీఠిక

"ప్రణమ్య జగదుత్పత్తిస్థితి సంహారకారణమ్
స్వర్గాపవర్గయోర్ద్వారం త్రైలోక్యశరణం శివమ్."

పరులకు (ప్రాణులకు) హితము సమకూర్చునది యేది కలదో అది పరహితము, దానిని బోధించుశాస్త్రము పరహితసంహిత. గ్రంథకర్త దీనిని పరహితతంత్రమనియుఁ జెప్పియున్నాఁడు. ఈతంత్రమును చదివి చికిత్సావిధానమున శాస్త్రీయపద్ధతి నవలంబించుటచే సమర్థులయిన వైద్యవరులు రోగుల కుచితచికిత్స యొనర్చి వారికి ఆరోగ్యరూపమయినహితము సమకూర్ప నర్హు లగుదురు. కేవలము ద్రవ్యసంపాదనాదిరూపమయిన ఆత్మహితమును మాత్రమే అపేక్షించియుండక చికిత్సచేయుట చికిత్సకుని పరమధర్మము. అట్టియుత్కృష్ట వైద్యధర్మము నవలంబించి పరుల కుపకృతిచేసి యారోగ్యభాగ్య మొసగుటకు ఈవైద్యకతంత్రము ముఖ్యసాధనము గావున పరహిత మను పేరు దీని కన్వర్థముగ నున్నది. ప్రధానముగ పరహితార్థమయియే యిది యేర్పడినను ఆనుషంగికముగ తన హితమునకుఁగూడ నుపకరించును.

ఈతంత్రము అష్టాంగములకు సంబంధించినచికిత్సలు సంపూర్ణముగ వివరించును. ఆ చికిత్సలు ఫలవంతములై లోకహితార్థ ముపయోగ్యములగును. కనుకనే దీనికి పరహిత మను నామ మన్వర్థ మగును. ఈతంత్రము సాధారణకాండము, అష్టాంగకాండము రసకాండ మను మూఁడుకాండములు గలది. చికిత్సాసామాన్యమగు సాధారణవిషయముల నెల్ల వివరించునది సాధారణకాండము: దీనినే చరకాదులు సూత్రస్థాన మను పేర వ్యవహరించియున్నారు. ప్రస్తుతము ముద్రణభాగ్యమును బడసిన దీసాధారణకాండమే. "ఇతి శ్రీనాథ పండితకృతౌ పరహితసంహితాయాం సాధారణకాండః ప్రథమస్సమాప్తః" అనుటచే నిది విదితము. రెండవకాండము అష్టాంగచికిత్సలను వివరించుభాగము. దానిని చరకాదులు చికిత్సాస్థాన మనిరి. మూఁడవకాండము రసగంధకపాషాణాదిఖనిజపదార్థముల శోధన మారణాది సంస్కారములచే భస్మాదిరూపాంతరపరిణామము నొందించి వానిని రోగముల కుపయోగించువిధానమును బోధించును గనుక దానికి రసకాండ మను పేరు కలిగినది. అట్టి యీగ్రంథము

"నిదానే మాధవశ్శ్రేష్ఠః సూత్రస్థానేతు వాగ్భటః,
శారీరే సుశ్రుతఃప్రోక్తః చరకస్తు చికిత్సకే."

అనుప్రథగాంచిన యుత్తమోత్తమవైద్యగ్రంథశ్రేణిలోఁ జేరఁదగినదై యున్నది.

ఈ గ్రంథమునకుఁ గర్త శ్రీనాథపండితుఁడు. ఇతఁడు పరహితవంశమునకుఁ జెందిన ఆంధ్రదేశస్థుఁడు; ఆయుర్వేదవైద్యశ్రేష్ఠుఁ డనియు పండితులు నిర్ణయించియున్నారు. వీరి యింటిపేరు అసలు "కాశీనాథభట్టు" వారనియు పరహితవిద్యయగు వైద్యవృత్తి నభ్యసించి నందున ఆవంశమూలపురుషునకు పరహితనామధేయము కలిగి గృహనామముగా స్థిరపడిన దనియు పండితులు రూపించియున్నారు. ఈ శ్రీనాథుఁడు క్రీ. శ॥ 14-వ శతాబ్దమున నుండియుండవచ్చునని యొకయూహ కలదు కాని "హైందవరాసాయనికశాస్త్ర చరిత్ర" ను రచించిన శ్రీ సి పి. రాయిగారు క్రీ. శ॥ 1260-వ ప్రాంతమున శార్ఙ్గధరునకు పూర్వము ఒక "శ్రీకాంతు" ని పేర్కొని యుండుట చూడఁగా శ్రీనాథ శ్రీకాంతులు ఒక్కరే యగుదురా యని యనుమానము కలుగుచున్నది. ఈవిషయమును వైద్యచారిత్రికపరిశోధకులే నిర్ణయింపఁదగిన సమర్థులు.

1951-వ సం॥ ఆగష్టునెల ధన్వంతరి పత్రికలో "పరహితసంహితా" ప్రశంస కలుగగా ఆనెల 13-వ తారీఖు త్రిలిఙ్గపత్రికలో శ్రీ వావిళ్లవారు తమవద్ద నున్న ప్రతి కీ॥ శే॥ గంగపట్టము సుబ్రహ్మణ్యదేవరగారు మైసూరినుండి వ్రాసి తెచ్చిన దనియు అది కీ. శే॥ శ్రీ రామస్వామిశాస్త్రులవారినుండియు తమయింటనున్న దనియు అది ధన్వంతరీసంపాదకుల యొద్దనున్న ప్రతికంటె భిన్నమైనదనియు నొక ప్రకటన కావించిరి. ఆ ప్రకటనను పరామర్శించుచు అక్టోబరు నెలలో ఒకపత్రికలో వెలువడిన వ్యాసభాగమును పరిశీలించిన వారివాద మంతయు పరహితసంహితలో రెండవదగు అష్టాంగకాండ నాశ్రయించియుండుటచేతను, వావిళ్లవారి ప్రతి మొదటిదగు సాధారణకాండ యగుటచేతను రెండును ఒకదానికొకటి భిన్నములే యనుట నిర్వివాదాంశము.

బహువ్యయప్రయాసముల కోర్చి ఆంధ్రలోకమునకు వైద్యగ్రంథరత్నముల సుపరిచయముగావింప సంకల్పించిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఇదివరలో అష్టాంగహృదయము, చరకసంహిత, సుశ్రుతము చక్రదత్త, శార్ఙ్గధరసంహిత, వైద్యచింతామణి, బసవరాజీయాద్యమూల్యగ్రంథజాలమును ప్రచురించియున్నారు; ఇప్పు డీపరహితసంహితను వెలిపఱిచి ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులైరి.

ఈ గ్రంథమునకు కీ॥ శే॥ నుదురుపాటి విశ్వనాథశాస్త్రిగారు తెలుఁగు టీకాతాత్పర్యములు రచించిరి. వారివైదుష్యమెంతయు కొనియాడఁదగినది. శీఘ్రకాలములోనే తక్కిన కాండములనుసైతము ముద్రించి ఆంధ్రలోకమున కందఁజేయుభాగ్యము కలుగునట్లు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సహాయమొనర్చిన నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాళెము వాస్తవ్యులు డిల్లీ పార్లమెంటుసభ్యులు గా॥ శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు సంస్తవనీయులు.

చెన్నపురి
28-1-52.

ఇట్లు,
వేదము లక్ష్మీనారాయణశాస్త్రి

# పరహితసంహిత

## సాధారణకాణ్డము

### విషయసూచిక

# వైద్యగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అజీర్ణమంజరి | ... | 0 | 6 |
| అనుపానమంజరి | ... | 0 | 12 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 8 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 6 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 4 | 0 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 0 |
| ఆయుర్వేదసారసంగ్రహనిధి | ... | 4 | 0 |
| ఇలాజుల్ గుర్బా, యూనానివైద్యము | ... | 5 | 0 |
| చరకసంహిత, సూత్రస్థానము | ... | 8 | 0 |
| " శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు | ... | 6 | 0 |
| " చికిత్సాస్థానము | ... | 10 | 0 |
| " సిద్ధి-కల్పస్థానములు | ... | 4 | 0 |
| కాలజ్ఞానము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| వైద్యశతశ్లోకి " | ... | 0 | 8 |
| రావణకుమారతంత్రము " | ... | 0 | 8 |
| గదనిగ్రహము " | ... | 5 | 0 |
| ఘృతతరంగము " | ... | 1 | 4 |
| చికిత్సాసారము " | ... | 4 | 0 |
| బసవరాజీయము " | ... | 12 | 0 |
| భేషజకల్పము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| దేహతత్త్వనిర్ణయము " | ... | 0 | 6 |
| దేశీయవైద్యవిజ్ఞానము, తెనుగువచనము | ... | 1 | 8 |
| చారుచర్య, భోజరాజకృతము, ఆంధ్రపద్యలఘుటీకలతో | ... | 0 | 6 |
| రసరత్నాకరము, ఆంధ్ర తాత్పర్యము | ... | 8 | 0 |
| రాజమార్తాండము " | ... | 0 | 12 |
| లోలంబరాజీయము, సద్వైద్యజీవనము | ... | 0 | 12 |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | ... | * | |
| వైద్యచింతామణి, సాంధ్రతాత్పర్యము | ... | 16 | 0 |
| వృక్షాయుర్వేదము, తాత్పర్యసహితము | ... | 0 | 0 |
| శార్ఙ్గధరకృతత్రిశతి " | ... | 6 | 12 |
| సుశ్రుతశారీరము " | ... | 3 | 0 |



# పరహితసంహిత

## సాధారణకాణ్డే, ప్రథమోఽధికారః

మూలమ్,—

వన్దే పూరిత పూర్ణిమ చన్ద్రమణ్డలనిభం (గతం) శ్వేతారవిన్దాన(స)నం
మన్దాకిన్యమృతాబ్జకున్దకుముదక్షీరోదభాసం హరిమ్,
ముద్రాపుస్తకశఙ్ఖచక్రవిలసచ్ఛ్రీమద్భుజామణ్డలం
నిత్యం నిర్మలభారతీపరిమళం విశ్వేశమశ్వాననమ్. ౧

### వ్యాఖ్యాప్రారమ్భః

సజయతి సుధయా పూర్ణం కలశం కలయన్ కరామ్బుజే విమలమ్,
లోకానాముపకృతయే పయోనిధే రవతతార యః కుతుకాత్.

అవతారిక:—శ్రీమన్వైద్యవిద్యాపారంగతుడును చికిత్సాకుశలుండును నగు శ్రీనాథపండితుడను విద్వాంసుడు కాయచికిత్స, బాలచికిత్స, భూతవిద్య, ఊర్ధ్వాంగ చికిత్స (శాలాక్యము), శల్యతంత్రము, విషచికిత్స (అగదతంత్రము) రసాయన తంత్రము, వాజీకరణ తంత్రమునను నీ యెనిమిదియంగములతోఁగూడిన పరహితసంహిత యను నాయుర్వేదతంత్రమును సంగ్రహరూపముగ చెప్పదలంచి "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాన్తానిచ శాస్త్రాణి ప్రథన్తే వీరపురుషకాణి ఆయుష్మత్పురుషకాణి చ భవన్తి, అధ్యేతారశ్చ "ప్రవక్తారో భవన్తి" అను మహాభాష్యకార శాసనము నవ లంబించి, విఘ్నవిఘాతాది నిమిత్తము తా జేసిన యిష్టదేవతా నమస్కారరూపమైన మంగళమును శిష్య శిక్షార్థమై గ్రంథాదియందు "వన్దేపూర్ణిమ—మశ్వాననమ్" అను శ్లోకముచే జెప్పుచున్నాడు.

వ్యాఖ్య:—పూర్ణిమ—నిభమ్—పూర్ణిమనాటి చంద్రమండలమునుబోలిన కాంతి కల్గినవాడును; శ్వేతార—ననం, తెల్లతామరనుబోలిన ముఖముకలవాడును; మన్దాకి—భాసం—ఆకాశగంగ అమృతము శంఖము మొల్లలు తెల్లకలువ పాలసముద్రము అనువానితో సమానమైన (తెల్లని) కాంతికల్గినవాడును; ముద్రాపుస్తక—మణ్డలం,

జ్ఞానముద్ర పుస్తకము శంఖము చక్రము అనునీనాల్గిటిని నాల్గుచేతుల ధరించిన వాడును; నిత్యం—ఉత్పత్తి వినాశరహితుడును; నిర్మల—పరిమళం—నిర్దుష్టమైన వాక్కుచే ప్రకాశించువాడును, విశ్వేశం = ప్రపంచమునెల్ల పాలించువాడును; అశ్వాననం - గుఱ్ఱముముఖమువంటి ముఖముకలవాడును; హరిం - విష్ణుస్వరూపుడునైన హయగ్రీవమూర్తిని; వన్దే - నమస్కరించెదను. (పున్నమనాటిచంద్రుని, ఆకాశగంగ అమృతము శంఖము ముత్యాలు తెల్లకలువలు పాలసంద్రము అనువానిని బోలె తెల్లని శరీరకాంతియు, తెల్లదామరపువ్వువంటి మొగంబును గల్గి; తననాల్గుచేతుల యందును జ్ఞానముద్రను పుస్తకమును శంఖమును చక్రమును ధరించి; లోకములనెల్ల కాపాడుటకై హయగ్రీవావతారము నెత్తిన యాపరమకారుణికుండగు శ్రీ విష్ణుదేవునికి నమస్కరించెద నని భావము)

ఇచ్చట "పూర్ణిమచన్ద్రమణ్డలనిభం" అను పదముచేత నమృతకిరణుడైన చంద్రుని సాదృశ్యము హయగ్రీవునకు చెప్పబడినది. అట్టిదేవుని నమస్కరించుటచే తా వచించు చికిత్సాశాస్త్రమునందలి యోగములెల్ల నమృతప్రాయములై జరావ్యాధినాశకములై యుండునని తెలియుచున్నది. "నిర్మలభారతీపరిమళం" అనుటచేత నిరంకుశమైన వాగ్ధోరణిగలవాడైన భగవంతుని స్మరించుటంజేసి తా రచింపంబూనిన గ్రంథము నిర్విఘ్నముగ సమాప్తియగు నని తెలియందగు.

మంగళాంతరము

మూ. కామస్య కాలస్య చ శాసితారం తం వైద్యనాథంశరణంప్రపద్యే,
నిజాని యస్మిన్ పతిరోషధీనాం శస్త్రాణి వహ్నిః సలిలం రసశ్చ. ౨

వ్యా:—ఏపరమేశ్వరునియందు ఓషధులకెల్ల నధిపతియగు చంద్రుడును, శూలము మొన్నగు శస్త్రంబులును, ఫాలనేత్రరూపమైనయగ్నియు, ఆకాశగంగారూపమైన జలంబును, తనయొక్క రేతోరూపమైన రసంబును (పారదమును), తనకు స్వాధీనములై యుండునో; మన్మథుని, సకలప్రాణుల నంతమొందించు యముని, శిక్షించి జయించిన యట్టి పురాతనవైద్యవరు డగు భగవంతుని నేను శరణుజొచ్చెదను.

ఇచ్చట కోరికలకెల్ల నెలవైనకాముని జయించిన యీశ్వరుని శరణంబువేడుటచే లోకమున లేనిపోని కోరికలచే సంభవించిన మిథ్యాహారవిహారాదులచేగల్గు రోగములచే బాధ సంభవించుట లే దనియు, యమునిజయించిన పరమేశ్వరుని వేడుటంజేసి యకాల మృత్యువుచే బాధకలుగదనియు సూచింపబడినది. మఱియు—నానావిధములగు నోషధులకెల్ల నధిపతి యగు చంద్రుని ధరించినవాడనుటవలన అట్టి యోషధులు భగవంతుని

యధీనము లగుటంజేసి భగవదనుగ్రహమువలన నుత్తమఫలదాయకములగుననియు, నేత్రరూప మైనయగ్నిని, గంగాజలమును ధరించిన వాడనుటవలన ఉష్ణశీతరూపములగు రెండువిధములైన యోషధుల ప్రసాదింపసమర్థు డనియు, ఆయుధముల ధరించినవాడనుటచే శస్త్రచికిత్సోపయుక్తములగు యంత్రుల ప్రసాదింప సర్థు డనియు, రసము తన వీర్యంబగుటంజేసి రసకాండమున జెప్పంబడు రసౌషధముల కల్పనాశక్తిని కల్గించు ననియు పై శ్లోకమునందు సూచితములు.

అష్టాంగచికిత్సలకు సంబంధించిన ఉష్ణశీతవీర్యవంతములైన యోషధులును, అందును శస్త్రసాధ్యములైన శల్యతంత్రంబును, రసకాండమున రసప్రధానములగు నౌషధంబులును, ఈ తంత్రమున జెప్పంబడునని "నిజాని యస్మిన్ ......రసశ్చ" అను శ్లోకార్థముచే తాను గ్రంథమున జెప్పంబోవు విషయము ధ్వనితము. "కామస్య కాలస్య చ శాసితారం" అనుటచే నీతంత్రమున స్వస్థపరిపాలన రోగనివృత్తి పూర్వకముగ నప మృత్యునివారణము ఈ తంత్రమునకు ముఖ్యఫలం బని ధ్వనితము.

మఱియు పైజెప్పినరీతిగ ధాతుసామ్యరూపమైన యారోగ్యము ముఖ్యప్రయోజన మనియు, హేతులింగ-ఔషధ ప్రతిపాదక మగుటచే జేసి యామూడును విషయములనియు, స్వస్థసంరక్షణమును రోగనివృత్తిని అపమృత్యునిరాసమును అభిలషించువారు అధికారులనియు, విషయములకును ఈ గ్రంథమునకును ప్రతిపాద్యప్రతిపాదకరూప సంబంధ మనియు తెలియుగునది. ఇత్తెఱంగున నీగ్రంథమునకు విషయము, సంబంధము, ప్రయోజనము, అధికారియునను అనుబంధ చతుష్టయము ఈ శ్లోకముచే సూచింపబడినది.

## ప్రతిజ్ఞ

**మూ. అథ సాధారణాష్టాఙ్గరసకాణ్డైరలఙ్కృతమ్,**

**తన్త్రం పరహితం వక్ష్యే యత్ర పూర్ణం చికిత్సితమ్. 3**

వ్యా. సాధారణకాణ్డము, అష్టాఙ్గకాణ్డము, రసకాణ్డమునను మూడుకాణ్డములచే నొప్పుచు పలుతెఱంగులైన చికిత్సలు పూర్తిగగల్గియుండు పరహితమను వైద్యతన్త్రమును జెప్పెద నని యర్థము.

ఇచ్చట అథ శబ్దము మఙ్గళవాచకము కావున గ్రంథారంభమున మంగళార్థమై చెప్పబడినది. 'ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతే బ్రహ్మణః పురా, కణ్ఠం భిత్వావినిర్యాతే తస్మాన్మాఙ్గలికావుభౌ" అను భాష్యప్రామాణ్యముచే నథశబ్దము మంగళవాచక మని తెలి

జ్ఞానముద్ర పుస్తకము శంఖము చక్రము అనునీనాల్గిటిని నాల్గుచేతుల ధరించిన వాడును; నిత్యం—ఉత్పత్తి వినాశరహితుడును; నిర్మల—పరిమళం—నిర్దుష్టమైన వాక్కుచే ప్రకాశించువాడును, విశ్వేశం = ప్రపంచమునెల్ల పాలించువాడును; అశ్వాననం - గుఱ్ఱముముఖమువంటి ముఖముకలవాడును; హరిం - విష్ణుస్వరూపుడునైన హయగ్రీవమూర్తిని; వన్దే - నమస్కరించెదను. (పున్నమనాటిచంద్రుని, ఆకాశగంగ అమృతము శంఖము మొల్లలు తెల్లకలువలు పాలసంద్రము అనువానిని బోలె తెల్లని శరీరకాంతియు, తెల్లదామరపువ్వువంటి మొగంబును గల్గి; తననాల్గుచేతుల యందును జ్ఞానముద్రను పుస్తకమును శంఖమును చక్రమును ధరించి; లోకములనెల్ల కాపాడుటకై హయగ్రీవావతారము నెత్తిన యాపరమకారుణికుండగు శ్రీ విష్ణుదేవునికి నమస్కరించెద నని భావము)

ఇచ్చట "పూర్ణిమచన్ద్రమణ్డలనిభం" అను పదముచేత నమృతకిరణుడైన చంద్రుని సాదృశ్యము హయగ్రీవునకు చెప్పబడినది. అట్టిదేవుని నమస్కరించుటచే తా వచించు చికిత్సాశాస్త్రమునందలి యోగములెల్ల నమృతప్రాయములై జరావ్యాధినాశకములై యుండునని తెలియుచున్నది. "నిర్మలభారతీపరిమళం" అనుటచేత నిరంకుశమైన వాగ్ధోరణిక హేతుడైన భగవంతుని స్మరించుటంజేసి తా రచింపంబూనిన గ్రంథము నిర్విఘ్నముగ సమాప్తియగు నని తెలియందగు.

మంగళాంతరము

మూ. కామస్య కాలస్య చ శాసితారం తం వైద్యనాథంశరణంప్రపద్యే,
నిజాని యస్మిన్ పతిరోషధీనాం శస్త్రాణి వహ్నిః సలిలం రసశ్చ. ౨

వ్యా:—ఏపరమేశ్వరునియందు ఓషధులకెల్ల నధిపతియగు చంద్రుడును, శూలము మున్నగు శస్త్రంబులును, ఫాలనేత్రరూపమైనయగ్నియు, ఆకాశగంగారూపమైన జలంబును, తనయొక్క రేతోరూపమైన రసంబును (పాదరసమును), తనకు స్వాధీనములై యుండునో; మన్మథుని, సకలప్రాణుల నంతమొందించు యముని, శిక్షించి జయించిన యట్టి పురాతనవైద్యవరు డగు భగవంతుని నేను శరణుజొచ్చెదను.

ఇచ్చట కోరికలకెల్ల నెలవైనకాముని జయించిన యీశ్వరుని శరణంబువేడుటచే లోకమున లేనిపోని కోరికలచే సంభవించిన మిథ్యాహారవిహారాదులచేగల్గు రోగములచే బాధ సంభవించుట లే దనియు, యముని జయించిన పరమేశ్వరుని వేడుటంజేసి యకాల మృత్యువుచే బాధకలుగదనియు సూచింపబడినది. మఱియు—నానావిధములగు నోషధులకెల్ల నధిపతి యగు చంద్రుని ధరించినవాడనుటవలన అట్టి యోషధులు భగవంతుని

యధీనము లగుటంజేసి భగవదనుగ్రహామువలన నుత్తమఫలదాయకములగుననియుం, నేత్ర రూప మైనయగ్నిని, గంగాజలమును ధరించిన వాడనుటవలన ఉష్ణశీతరూపములగు రెండువిధములైన యోషధుల ప్రసాదింపసమర్థు డనియుం, ఆయుధముల ధరించినవా డనుటచే శస్త్రచికిత్సోపయుక్తములగు యంత్రముల ప్రసాదింప సమర్థు డనియుం, రసము తన వీర్యంబగుటంజేసి రసకాండమున జెప్పంబడు రసౌషధముల కల్పనాశక్తిని కల్గించు ననియుం పై శ్లోకమునందు సూచితములు.

అష్టాంగచికిత్సలకు సంబంధించిన ఉష్ణశీతవీర్యవంతములైన యౌషధులును, అందును శస్త్రసాధ్యములైన శల్యతంత్రంబులు, రసకాండమున రసప్రధానములగు నౌషధంబులును, ఈ తంత్రమున జెప్పంబడునని "నిజాని యస్మిన్......రసశ్చ" అను శ్లోకార్థముచే తా ను గ్రంథమున జెప్పంబోవు విషయము ధ్వనితము. "కామస్య కాలస్య చ శాసితారం" అనుటచే సీతంత్రమున స్వస్థపరిపాలన రోగనివృత్తి పూర్వకముగ నప మృత్యునివారణము ఈ తంత్రమునకు ముఖ్యఫలం బని ధ్వనితము.

మఱియుం పైజెప్పినరీతిగ ధాతుసామ్యరూపమైన యారోగ్యము ముఖ్యప్రయోజన మనియుం, హేతులింగ-ఔషధ ప్రతిపాదక మగుటంజేసి యామూడును విషయము లనియుం, స్వస్థసంరక్షణమును రోగనివృత్తిని అపమృత్యునిరాసమును అభిలషించువారు అధికారులనియుం, విషయములకును ఈ గ్రంథమునకును ప్రతిపాద్యప్రతిపాదకరూప సంబంధ మనియుం తెలియంగునది. ఇత్తెఱంగున నీగ్రంథమునకు విషయము, సంబంధము, ప్రయోజనము, అధికారియునను అనుబంధ చతుష్టయము ఈ శ్లోకముచే సూచింప బడినది.

## ప్రతిజ్ఞ

**మూ॰ అథ సాధారణాష్టాఙ్గరసకాణ్డైరలఙ్కృతమ్,**

**తన్త్రం పరహితం వక్ష్యే యత్ర పూర్ణం చికిత్సితమ్.** 3

వ్యా॰ సాధారణకాణ్డము, అష్టాఙ్గకాణ్డము, రసకాణ్డమునను మూడుకాణ్డములచే నొప్పుచు పలుతెఱంగులైన చికిత్సలు పూర్తిగకల్గియుండు పరహితమను వైద్యతన్త్రమును జెప్పెద నని యర్థము.

ఇచ్చట అథ శబ్దము మఙ్గళవాచకము కావున గ్రంథారంభమున మంగళార్థమై చెప్పబడినది. 'ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతే బ్రహ్మణః పురా, కణ్ఠం భిత్వావినిర్యాతే తస్మాన్మాఙ్గలికావుభౌ" అను భాష్యప్రామాణ్యముచే నథశబ్దము మంగళవాచక మని తెలి

నెడి. మఱియు గ్రంథమును రచియింప నుద్దేశించినవారు తొలుత విషయము లెల్ల మన సున క్రోడీకరించుకొని పిదప గ్రంథము నారంభించుట సంప్రదాయసిద్ధము; కావున నీ తన్త్రకారుడును తా నుద్దేశించిన గ్రంథమున గల విషయము లెల్ల మనసున క్లుప్తముగ నిర్ణయించుకొని ఆ విషయముల నెల్ల సాధారణ-అష్టాంగ - రసకాండములుగ జెప్పెద నని ప్రతిన చేసెను; కావున—"అథ"—చెప్పదలచిన విషయముల నెల్ల మనస్సున సంగ్రహించిన పిదప, కాణ్డత్రయాత్మకమై చికిత్సాపూర్ణమైన వైద్యతంత్రమును చెప్పెద నని ప్రతిజ్ఞ చేసెను. (అథశబ్దమానంతర్యమును దెలుపు నది యనిభావము.)

పైజెప్పిన మూడు కాణ్డములలో సాధారణకాండము మొదటిది. చికిత్స చేయ నుద్యమించునపుడు, దోషములు, దూష్యములు, ప్రకృతి, జాఠరాగ్ని, సత్వము, బలము, రోగియొక్క వయస్సు, జాంగలాదిదేశము గ్రీష్మాదికాలము, సాత్మ్యము, ఆహారము, ఓషధులగుణరూపాదులు మున్నగువానిని చక్కగ గమనించి చికిత్స చేయ వలెను. కావున నీవిషయములు చికిత్సాసామాన్యముగ సాధారణములై యుండును. అట్టి సాధారణవిషయము లెల్ల నీకాణ్డమున వివరింపబడును; కావున నీకాణ్డము సాధారణకాండమనియు నన్వర్థముగ జెప్పబడును. ఇట్టి సాధారణవిషయముల బోధించు ప్రకరణమునే చరక సుశ్రుతవాగ్భటాదిభిషగాచార్యులు సూత్రస్థాన మను పేర వ్యవ హరించిరి.

రెండవది అష్టాంగకాండము—కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, విషచికిత్స, రసాయనచికిత్స, వాజీకరణచికిత్స యని యాయుర్వేదమునకు నెనిమిదియంగములు. ఈ విషయమునే "కాయబాలగ్రహోర్ధ్వాఙ్గ శల్య దంష్ట్రాజరావృషాన్, అష్టావఙ్గాని తస్యాహుశ్చికిత్సా యేషు సంశ్రితా" అను వాక్యముచే సంగ్రహముగ వాగ్భటాచార్యుడు నుడివెను. అట్టి యష్టాఙ్గ చికిత్సలను వివ రించునట్టి ప్రకరణము అష్టాంగకాండము. ఈ ప్రకరణమునే చికిత్సాస్థాన మని చర కాదులు నుడివిరి.

మూడవది రసకాండము:—రసగంధకపాషాణాది ఖనిజపదార్థముల శోధనమార ణాది సంస్కారములచే భస్మాదిరూపాంతరపరిణామము నొందించి వానిని రోగముల కుప యోగించు విధానమును వివరించు ప్రకరణము రసకాండ మని చెప్పబడును. దీనిని రస తంత్ర మని రసరత్నసముచ్చయాదులయందు వ్యవహరించిరి.

పై వివరింపబడిన మూడు ప్రకరణములను దెలుపు మూడుకాండములచే నొప్పెద ముగ నీతంత్రమును. జెప్పెద నని గ్రంథకారుడు ప్రతిజ్ఞ చేసెను.

పరహితము:— ఈ తంత్రమును జదివి చికిత్సావిధానమున శాస్త్రీయపద్ధతి నవలంబించి యారితేరిన విద్వద్వైద్యులు ఇతరులైన రోగులకు దగినచికిత్స జేసి వారికి ఆరోగ్యరూపమైనహితమును గల్పింప సమర్థులగుదురు. వైద్యవరులు కేవలము ద్రవ్యసంపాదనాదిరూపమైన తమహితమునుమాత్రము గోరక చికిత్సచేయుట చికిత్సకుని పరమధర్మము. ఈ విషయమును చరకాచార్యు లిట్లు శాసించిరి:— "నాత్మార్థం నాపికామార్థం అథభూతదయాం ప్రతి, యోవర్తతే చికిత్సాయాం ససర్వానతివర్తతే" (తనకొఱకును, ధనసంపాదనాదికామ్యములకును తాను నటించక ప్రాణులవిషయమై తాను దయగల్గి చికిత్సావిధానముచేయును వైద్యుడు మిక్కిలి హితకారియై యుండునని తాత్పర్యము) అట్టి యుత్కృష్టమైన వైద్యులధర్మము నవలంబించి పరుల కుపకృతిచేసి యారోగ్యభాగ్యమొసంగ నీ వైద్యకతంత్రము ముఖ్యసాధనము కావున పరహితమను పేరు తంత్రమున కన్వర్థముగ గ్రంథకర్త యొసంగెను. పరహితార్థ మీతంత్రము ముఖ్యముగ నేర్పడినను, ఆనుషంగికముగ తనహితమునకుగూడ నుపయోగించును. ఈ భావమునే యీ గ్రంథకర్త మూడవకాండము చివర నిట్లు చెప్పెను. "నిజహిత మఖిలానాం సమ్మతం సత్స్వరూపం సుఖమిహాపరలోకే వా సర్వశాస్త్రార్థ సారమ్, స్వహిత పరహితేఽస్మిన్ సత్క్రియా సాధిభూతే వికచితమనువేలం కర్తుమర్హన్తి సన్తః."

అష్టాంగములకు సంబంధించిన చికిత్సలు ఈతంత్రమున పూర్ణములుగ వివరింపబడినవనియు, అట్టిచికిత్సలు నామమాత్ర ప్రధానములుగాక ఫలవంతములై లోకహితార్థ ముపయోగ్యము లనియు, దానంజేసి యీ తంత్రమునకు పరహిత మను నన్వర్థనామ మిడబడిన దనియు, అట్టి యీతంత్రము సాధారణకాండము, అష్టాంగకాండము, రసకాండము నను కాండత్రయాత్మకముగ నుండు ననియు ఫలితార్థము.

### చికిత్సాలక్షణము

మూ. చతుర్ణాం భిషగాదీనాం శస్తానాం ధాతువైకృతే,
ప్రవృత్తిస్సాతు సామ్యార్థా చికిత్సేత్యభిధీయతే. ౪

వ్యా. 'భిషగ్ద్రవ్యాణ్యుపస్థాతా రోగీపాదచతుష్టయమ్, చికిత్సతస్య నిర్దిష్టం' అను వాగ్భటవచనప్రకారము వైద్యుడు, ఔషధమున కుపయోగింపదగిన త్రికటుకత్రిఫలాదిద్రవ్యములు, రోగికి ఆయాకాలముల నుపచరింపదగిన సేవకుడు, ఔషధమును సేవింపసమర్థుడగు రోగి, అను నీనాల్గును చికిత్సకు పాదములై యుండును. వాతాదిధాతువులు మిథ్యాహారవిహారాదులంజేసి వికృతిచెంది రోగములను గల్గించినపుడు, పైజెప్పిన భిషగ్ద్రవ్యాదులు నాల్గును వానివానికి జెప్పిన మంచిలక్ష

ణములతో గూడి ప్రశస్తములై పైజెప్పినరీతిగ విషమగతిజెందిన వాతాదిధాతువులను సమస్థితి నొందింప దగుతగు వ్యాపారములయందు ప్రవర్తించుటయే చికిత్సయనబడును.

వ్యాధిప్రతీకారరూపార్థకమైన కితధాతువుచే చికిత్స యనుశబ్దము నిష్పన్నమైనది కావున చికిత్సాపదమునకే రోగప్రతీకారరూపమైన క్రియయని యర్థమేర్పడుచుండ, అట్టియర్థమునే పైశ్లోకముచేత గ్రన్థకర్త వివరించె నని యెఱుంగనగును.

విషమస్థితినుండు ధాతువుల సమస్థితికి దెచ్చుటయే యాతంత్రమునకు ప్రయోజన మని సూచింపబడినది. ఈ విషయమే "ధాతుసామ్యక్రియాచోక్తా తన్త్రస్యాస్య ప్రయోజనమ్." అని చరకాచార్యులు నుడివిరి.

ద్వాదశపదార్థములు

మూ. అథద్వాదశపదార్థ సఙ్గ్రహః—

దోషాః ప్రకృతయో వహ్నిః దూష్యాస్సత్త్వం బలం వయః,
దేశ కాలౌ తథా సాత్మ్యం ఆహారో భేషజాని చ. ౫
ఏతాని సర్వథా నిత్యం వీక్ష్య ద్వాదశ తత్త్వతః,
చికిత్సాం యోజయేత్ప్రాజ్ఞః నయోగై రేవ కేవలైః. ౬

వ్యా. వాతాదిదోషములు, వాతపిత్తకఫప్రకృతులు, విషమాదిభేదములుకల జఠరాగ్ని, రసరక్తాది దూష్యములు, సత్త్వము, బలము, వయస్సు, జాంగలాదిదేశములు గ్రీష్మాదికాలములు, సాత్మ్యము, ఆహారము, ఔషధములు, అను నీ పండ్రెండును చికిత్సకు సంబంధించిన పదార్థములు. ఈ పండ్రెండుపదార్థముల గుణదోషములను తారతమ్యమును జ్ఞానవంతు డగు వైద్యుడు మిక్కిలి బుద్ధికౌశలముచే గమనించి చికిత్సజేయవలయునుగాని, కేవలము ఔషధయోగములమాత్రము పరిశీలించి చికిత్సజేయరాదు.

మరియు వాగ్భటాచార్యుడు ఈ విషయమును విస్పష్టముగ నిట్లు చెప్పెను—"దూష్యం దేశం బలం కాలం అనలం ప్రకృతిం వయః, సత్త్వం సాత్మ్యం తథాహారం అవస్థాశ్చ పృథగ్విధాః. సూక్ష్మసూక్ష్మాః సమీక్ష్యైషాం దోషౌషధనిరూపణే, యోవర్తతే చికిత్సాయాం నసస్ఖలతి జాతుచిత్," వైద్యుడు వాతాదిదోషములను దానగల్గు రోగములను, అందుకుతగిన యౌషధమును నిర్ణయించునపుడు దూష్యములు, జాంగలాది దేశము, బలము, కాలము, జాఠరాగ్నిభేదము, వాతాదిప్రకృతి, రోగియొక్క వయోభేదము, సత్త్వము, సాత్మ్యము, ఆహారము, అను వానియొక్క సూక్ష్మసూక్ష్మలగు అవస్థాభేదములను పరిశీలించి ఔషధమును తత్తదనుగుణముగ కల్పించి చికిత్స చేసినచో నొక ప్పుడును వైద్యుడు పొరబడ డని భావము.

## దోషములు, వానిస్వరూపము

మూ. వాయుః పిత్తం కఫశ్చేతి త్రయో దోషాస్సమాసతః,
వికృతాఽవికృతా దేహం ఘ్నన్తి తే వర్ధయన్తి చ. 2

వ్యా॰ వాయువు, పిత్తము, కఫము ననిదోషములు మూడు తెఱంగులు. అయ్యవి మిథ్యాహారవిహారాదికారణములచే వానివాని పరిమాణాదిస్థితినిదొరంగి వికృతిచెందినచో (రోగములగల్గించి) శరీరమునుచెఱిచి తుదకు చంపును. అటుగాక సమస్థితినుండి వికృతి జెందనినాడు శరీరమున రోగాదుల గల్గింపక పోషించుచుండును

"దూషయన్తీతి దోషాః" అను వ్యుత్పత్తిచేత వికృతిచెందినపుడు శరీరేంద్రియ మనస్సులను చెఱచునుగాన దోషము లని చెప్పబడును. ఇవియే వికృతిచెందక సమస్థితి నున్నపుడు శరీరమును పోషించును కావున ధాతువు లనియుం చెప్పబడును.

'దోషాః' అను బహువచన నిర్దేశముచేతనే మూడుదోషము లనునియమము తెలియుచున్నను, మరల 'త్రయః' అను సంఖ్యానియమము రక్తమునకు దోషసంజ్ఞ లేదని సూచించుటకై చెప్పబడినది.

వాతాదిదోషములు పరస్పర సంసర్గ సన్నిపాత తరతమాదిభేదములచే ననేక విధముల భేదములుగల్గినను ప్రధానముగ వాతాదిభేదములచే మూడువిధములే యగునని సూచించుటకై "సమాసతః" అని చెప్పబడినది.

మిథ్యాహార విహారాదులచే వికృతిచెందినపుడు శరీరమునుచెఱిచి, వికృతిజెంద కుండునపుడు శరీరమును పోషించునవి దోషము లని దోషసామాన్యలక్షణ మనియుం; అయ్యవి వాత-పిత్త-కఫభేదములచే మూడు తెఱంగులనియుం వ్యాఖ్యార్థము.

## వాతగుణములు

మూ. తత్ర రూక్షో లఘుశ్శీతః ఖర స్సూక్ష్మశ్చలోఽనిలః,

వ్యా॰ పైజెప్పిన మూడుదోషములలో వాతము రూక్షత్వము (జిడ్డులేకుండుట), లఘుత్వము (తేలిక), శీతత్వము (చల్లదనము), ఖరత్వము (గరగరలాడుట), సూక్ష్మత్వము, చలత్వము (ఎల్లపుడును నిల్కడలేక చలించుచుండుట) అను నీగుణముకల్గి యుండును.

మఱియు నీవాతము శీతద్రవ్యముతో సంబంధించినపుడు శీతలంబును, ఉష్ణద్రవ్యముతో సంబంధించినపుడు ఉష్ణంబునై యుండును. ఇదియే యోగవాహిత్వము. కావున అట్టి యోగవాహియగువాతము శీతప్రధానమైన కఫముతో కలసినపుడు శీతలం

బును, ఉష్ణగుణప్రధానమైన పిత్తముతోఁగూడినపుడు ఉష్ణంబునై యుండును. ఈవిషయమునే తంత్రాన్తరమున నిట్లు చెప్పిరి:—"యోగవాహః పరం వాయుః సంయోగా దుభయార్థకృత్, దాహకృ త్తేజసా యుక్తః శీతకృత్సోమసంశ్రయాత్. పవనే యోగ వాహిత్వాత్ శీతం శ్లేష్మయుతే భవేత్, దాహః పిత్తయుతే".

పైజెప్పిన రీతిగ వాతమునకు యోగవాహిత్వముచే సాహచర్యవస్తు సంబంధమునం జేసి శీతోష్ణగుణములు నియమములేక అస్థిరత్వమును సూచించుచున్నను స్వభావసిద్ధమైన శీతగుణము తాత్కాలిక ఉష్ణసంబంధమునం జేసి పోస్తుగ నశింపదనియు, శీతగుణమునకు విరుద్ధమైన యుష్ణగుణముగల చికిత్స జేయుటచే శాన్త మగు ననియు తెలియుటకై యిచ్చట 'శీతః' అని ప్రధానముగ జెప్పబడెను.

## పిత్తగుణములు

మూ. పిత్తం సస్నేహ తీక్ష్ణోష్ణం లఘు విస్రం సరం ద్రవమ్. ౧౦

వ్యా. పిత్తము స్నిగ్ధత్వము (జిడ్డు), తీక్ష్ణత్వము ఉష్ణము (వేడిమి), లఘుత్వము (తేలిక), విస్రము (పక్వముగాని దుర్గంధము), సరత్వము (వ్యాపించుస్వభావము), ద్రవత్వము అనునీగుణములు గల్గియుండును.

## కఫగుణములు

మూ. స్నిగ్ధ శ్శీతో గురుర్మన్దః శ్లక్ష్ణో మృత్స్నః స్థిరః కఫః,

వ్యా. కఫము స్నిగ్ధత్వంబును, శీతత్వంబును, గురుత్వంబు (భారము)ను, మందత్వంబును (చిరకాలమునకు కార్యముజేయు స్వభావము), మృదుత్వంబును, స్థిరత్వంబును (నిల్కడ) కల్గియుండును.

మరియు వాతపిత్త కఫములకు వేర్వేఱుగ పైజెప్పబడిన గుణములుగల ద్రవ్యములచేతను పనులచేతను ఆయాదోషము వృద్ధినొందును. అట్టిగుణములకు విరుద్ధములైన గుణములుగల ద్రవ్యములచేతను పనులచేతను క్షీణించును. (వాతమునకు జెప్పిన రూక్షాది గుణములుగల ద్రవ్యములచేతను పనులచేతను వాతము వృద్ధినొందుననియు, అట్టి రూక్షాది గుణములకు విరుద్ధములైన స్నిగ్ధత్వాదిగుణములచే వాతము క్షీణించు ననియు, పిత్తమునకు జెప్పిన స్నేహాదిగుణములుకల ద్రవ్యములచేతను క్రియలచేతను పిత్తమువృద్ధినొందుననియు, విరుద్ధగుణములుకల ద్రవ్యక్రియాసంబంధముచే క్షీణించు ననియు, కఫమునకునుగుణములగు గుణములుకల ద్రవ్యాదులచేతను కఫమువృద్ధి నొందుననియు; విరుద్ధగుణములైన ద్రవ్యక్రియాదులచే క్షీణించుననియు; భావము) ఈ విషయమునే "వృద్ధిస్సమా నై స్సర్వేషాం విపరీతై ర్విపర్యయః" అని వాగ్భటాచార్యులును;

"సర్వేషాం సర్వదా వృద్ధిః తుల్యద్రవ్యగుణక్రియైః, భావైర్భవతి భావానాం విపరీతైర్విపర్యయః" అని యిత్తరతంత్రకారులును వివరించిరి.

వాతస్థానములు

మూ. పక్వాశయకటీసక్థిశ్రోత్రాస్థిస్పర్శనేన్ద్రియమ్,
స్థానం వాతస్య; తత్రాపి పక్వాధానం విశేషతః. ౯

వ్యా. పక్వాశయము, నడుము, తొడలు, చెవులు, అస్థులు, స్పర్శనేంద్రియము, (త్వక్కు) ఇవి వాతమునకు స్థానములు. అందు పక్వాశయము వాతమునకు ముఖ్యస్థానమై యుండును.

పిత్తస్థానము

మూ. నాభిరామాశయః స్వేదో లసీకా రుధిరం రసః,
దృక్స్పర్శనం చ పిత్తస్య నాభిరత్ర విశేషతః. ౧౦

వ్యా. నాభి (బొడ్డు), ఆమాశయము, స్వేదము (చెమట), లసీక (మాంసమునకును పైచర్మమునకు నడుమ నీళ్లవలె ద్రవరూపముగ నుండురసము), రక్తము, రసము (ఆహారము పక్వమైనతోడనే ద్రవరూపముగ నుండురసము), కన్నులు, స్పర్శనేన్ద్రియము (త్వగింద్రియము) ఇవి పిత్తమునకు స్థానములు. వానిలో నాభిస్థానము పిత్తమునకు ముఖ్యస్థానమై యుండును.

పైశ్లోకమున త్వగింద్రియము వాతమునకు స్థానమని చెప్పబడినది. ఇచ్చట త్వగింద్రియము పిత్తమునకును స్థానమని చెప్పబడినది. ఈరెండిటికిని సమానస్థానము ఎట్లు సంగతమగునన్నచో; "పిత్త మగ్ని రితిస్మృతః" అను ప్రమాణముచే పిత్తము అగ్నిస్వరూపమని తెలిసెడి. అగ్ని వాతమునకు స్నేహభావము (మిత్రత్వము) కలదిగాన అగ్నిస్వరూపమైన పిత్తమునకును వాతమునకును త్వగింద్రియము స్థానముగ నుండుట విరుద్ధముగాదని యెరుంగునది.

కఫస్థానము

మూ. ఉరః కంఠశిరఃక్లోమపర్వాణ్యామాశయో రసః,
మేదో ఘ్రాణం చ జిహ్వా చ కఫస్య; సుతరాముర:. ౧౧

వ్యా. రొమ్ము, కంఠము, శిరస్సు, * క్లోమము (కడుపులో కుడిప్రక్క నుండుమాంసఖండము), శరీరమునందలికీళ్లు, ఆమాశయము, రసము, మేదస్సు, నాసిక, నాలుక,

* క్లోమ మనగా "క్లోమస్యా ద్గలనాడికా" అను ప్రమాణముచొప్పున నూపిరితిత్తులకు నడుమనుండు తరుణాస్థివలయములతోగూడిన నాళమని తెలియుచున్నది.

అనునవి కఫమునకు స్థానములు. అందును ఉరస్థానము కఫమునకు ప్రధానస్థానముగ నుండును.

—॥ వాతమునకు బలాధిక్యకారణములు ॥—

మూ. విభుత్వాదాశుకారిత్వాద్బలిత్వాదన్యకోపనాత్,
స్వాతన్త్ర్యాద్బహురోగత్వాత్ దోషాణాం ప్రబలోఽనిలః. ౧౨

వ్యా. దోషములతో వాతము వ్యాపించుస్వభావము కలది. పిత్తకఫములకన్న నతి శీఘ్రముగ రోగముల గల్గించునది. తాను ప్రకోపమునొంది యితరములగుపిత్తకఫముల గూడ ప్రకోపింపజేయును. దోషాంతరమునకు తాను లొంగక స్వతంత్రముగ నుండును. పిత్తకఫములచే జనించురోగములకన్న నధికసంఖ్యాకములగు రోగముల గల్గించును. ఇట్టి విశేషములు వాతమునకు దక్క తక్కినపిత్తకఫములకు లేవు. పైజెప్పినకారణములచే పిత్త కఫములకన్న వాతము మిక్కిలి బలవత్తరమైనది.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—వాతమునకు చంచలగుణము స్వభావసిద్ధ ముగ నుండుటంజేసి పలుదెఱంగుల వ్యాపించుశక్తి గల్గియుండును. "పిత్తం పంగు కఫః పంగుః పంగవో మలధాతవః, వాయునా యత్రనీయన్తే తత్రగచ్ఛన్తి మేఘవత్" అని తంత్రాన్తరవచనముచే పిత్తకఫములు రెండును తమకు నియతములగుస్థానములవదలి యితర స్థానములకుబోవు సామర్థ్యము లేకుండుననియు, అయ్యవివాతము యెచ్చటికి గొనిపోవునో అస్థానములయంజెల్ల వాతముతోగూడ తామును వ్యాపించిపోవుచుండుననియు తెలిసెడి. ఈప్రమాణముచేత పిత్తకఫములకు స్వతంత్రశక్తి లేదనియు, తమంతట (వాతసంబంధము లేక) వ్యాప్తించుశక్తి లేదనియు, ఇతరదోషముల ప్రకోపింపజేయుశక్తి లేదనియు నేర్పడినది. వాతమునకు పైజెప్పినగుణములు కల్గియుండుటంజేసి అతిశీఘ్రముగ స్వతంత్ర ముగనే వ్యాపించి రోగముల గల్గించును.

మఱియు వాతపిత్తకఫముల వేరువేరజనించు రోగముల పరిగణించునపుడు అష్టాంగ సంగ్రహమున వాగ్భటాచార్యు డిట్లు చెప్పెను:—"అశీతిర్వాతజా రోగాశ్చత్వారింశచ్చ పిత్తజాః. వింశతి శ్లేష్మజాశ్చైవ" ఈవాక్యముచే వాతమున గల్గురోగములు ఎనుబది యనియు, పిత్తజనితములు నలువదియనియు, కఫమున జనించునవి యిరువదియనియు తెలియుచున్నది. ఈపరిగణనముచే వాతజనితరోగసంఖ్య మిక్కిలి యధికముగ నున్నది గాన పైజెప్పినకారణములచే కఫపిత్తములకన్న వాతము మిక్కిలి బలిష్ఠమని చెప్పదగి యున్నది.

అవతారిక:—పైజెప్పిన వాతపిత్తకఫములచే వేరువేరుగ జనించుటంజేసి వాత ప్రకృతి, పిత్తప్రకృతి, కఫప్రకృతి యని ప్రకృతులు మూడువిధములు. వీనిస్వరూపము

వాగ్భటాచార్యునిచే నిట్లు చెప్పబడెను:—"శుక్రార్తవస్థైర్జన్మాదౌ విషేణేవ విషక్రిమిః. తైశ్చ తిస్రః ప్రకృతయో హీనమధ్యోత్తమాః పృథక్, సమధాతు స్సమస్తా సు శ్రేష్ఠా నింద్యాః ద్విదోషజాః" మనుజులపిండోత్పత్తికి తల్లిదండ్రుల శుక్రశోణితములకూటమి ముఖ్యకారణము. అట్టి శుక్రశోణితములు నియమముగ త్రిదోషములసంబంధము కల్గియే యుండును. అట్టి మూడుదోషములలో నేదోషభాగము శుక్రశోణితములయం దధికముగ నుండునో ఆశుక్రశోణితసమవాయముచే జనించినపురుషుడు ఆప్రకృతి కల్గియుండును (వాతం బధికముగ నుండునెడ వాతప్రకృతియు పిత్త మధికంబగునేని పిత్తప్రకృతియు, కఫం బధికముగ నుండునెడ కఫప్రకృతియుం గల్గుననుట) అట్టి ప్రకృతి యుత్పత్తి కాల మననే సంక్రమించుటంజేసి మనుజులను విషువనోపదుగాని విషమున జనించినపురుగుకు విషముచే బాధకల్గకుండునిధముగ అట్టి ప్రకృతిమాత్రముచేత మనుజులకు రోగములబాధ సంభవింపనోపదు. పైజెప్పిన మూడు ప్రకృతులలో వాతప్రకృతి హీనంబును, పిత్తప్రకృతి మధ్యమంబును, కఫప్రకృతి యుత్తమంబు నగును. త్రిదోషములలో న్యూనాధిక్యములులేక సమములై శుక్రశోణితముల సంక్రమించియుండునపుడు పుట్టినమనుజుడు సమప్రకృతి యగును. ఇది యుత్తమోత్తమమైనది. మరియుం మూడుదోషములలో రెండేసిదోషము లధికములుగ నుండుతరి ద్విదోషప్రకృతి (వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ ప్రకృతి) సంభవించును. త్రిదోషములును సమకాలమున వానివాని ప్రమాణమునకన్న నధికముగ నుండునపుడుపుట్టినమనుజుడు సన్నిపాతప్రకృతి యగును. ఈద్విత్రిదోషప్రకృతి రోగములకు కారణమగుటంజేసి నింద్యము అని పైవాక్యముల కర్థము. అట్టి ప్రకృతుల ననుసరించి చికిత్సావిధానమును గల్పించుట యవసరము గావున నీక్రింద వానిలక్షణములు వేరువేర జెప్పంబడును.

### వాతప్రకృతిలక్షణము

మూ. ప్రాయోఽతఏవ పవనాధ్యుషితా మనుష్యాః
దోషాత్మకాః స్ఫుటితధూసరకేశగాత్రాః,
శీతద్విషశ్చలధృతిస్మృతిబుద్ధిచేష్టా
సౌహార్దదృష్టిగతయోఽపి బహుప్రలాపాః. ౧౩
అల్పపిత్తకఫజీవితనిద్రాస్సన్నసక్తిచలజర్ఝరవాచః,
నాస్తికా బహుభుజస్సవిలాసాః గీతవాద్యమృగయాకలిలోలాః.
మధురామ్లకటూష్ణమాంసకాంక్షాః కృశదీర్ఘా కృతయస్సశబ్దియాతాః,
న దృఢా న జితేన్ద్రియా నచార్యాః న చ కాన్తాదయితాః బహుప్రజా వా. ౧౪

నేత్రాణి చైషాం ఖరధూసరాణి కృశాన్యచారూణి మృతోపమాని,
ఉన్మీలితానీవ భవన్తి సుప్తా శ్శైలద్రుమస్థో గగనం చ యాతి. ౧౬
అధన్యా త్వాక్స్థిరాద్ధాతసిరా ప్రోద్ధాతపిణ్డికాః,
శ్వసృగాలోష్ట్రగృధ్రాఖుకాకానూకాశ్చ వాతికాః. ౧౭

వ్యా. వాతప్రకృతికల మనుజులు వాతదుష్టములగు శరీరములు గల్గియుందురు. వారివెంట్రుకలు శరీరంబును కొసలయందు చిట్లి ధూళిగప్పినవిధముగ నుండును. చల్లని వస్తువులయందును శీతోపచారములయందును ద్వేషంబును గల్గును. ధైర్యము, స్మృతి (జ్ఞాపకశక్తి), బుద్ధి, చేష్టలు, ఇవి నిల్కడలేక చంచలములై యుండును. ప్రీతియు దృష్టియు గమనంబును మిక్కిలి చంచలములై యుండును. విసువులేక యధికముగ మాటలాడుదురు. అట్టివారికి పిత్తకఫంబులును జీవితంబును నిద్రయు స్వల్పముగ నుండును. తొడలు మిక్కిలి కృశించి యుండును. వాక్కు చంచలమై గద్గదస్వరము కల్గియుండును. వారు నాస్తికమతము నవలంబించి యధికముగ భుజించెదరు. విలాసముతోగూడి సంగీతమునందును, వాద్యములయందును, వేటయందును, కలహమునందును ఆసక్తి కల్గియుందురు. మధుర ఆమ్లకటురసములయందును, ఉష్ణపదార్థములయందును, మాంసమునందును మిక్కిలి యాసకల్గియుందురు. కృశించి మిక్కిలి నిడుదలైనయాకారముకల్గి నడచునపుడు పాదములచప్పుడు కల్గియుందురు. శరీరము దృఢముగాక యింద్రియముల జయింపనేరక అనార్యవర్తనులై యుందురు. కాంతలకు వారు ప్రియులుగారు. వారికి సంతాన మధికముగ నుండదు. వారికన్నులు కర్కశములై ధూళిగ్రమ్మినవిధములై కృశించి సుందరములుగాక చచ్చినవానికన్నులబోలియుండును. నిదురించునప్పుడు కన్నులు అరమోటుప్పగల్గి తెరువబడినట్లు కానబడును. స్వప్నమునందు పర్వతములపైని వృక్షములపైని ఆకసముపైని నడచినట్లు కలగనును. వానిశరీరమునందలి ధమనులును సిరలును వాతపూరితములై మాంసపుకండరములు అదరుచుండును. ఇట్టిలక్షణములు కల్గినమనుజులు వాతప్రకృతికలవారని యెరుంగునది. ఈవాతప్రకృతికలవారు ప్రశస్తులు కారు. మరియు కుక్క నక్క ఒంటె గ్రద్ద ఎలుక (పందికొక్కు) కాకి అను నీజంతువులబోలిన స్వభావము కల్గియుందురు.

## పిత్తప్రకృతి లక్షణము

మూ. పిత్తం వహ్నిర్వహ్నిజం వాయదస్మాత్
పిత్తోద్రిక్తస్తీవ్రతృష్ణాబుభుక్షుః,

గౌరోష్ణాఙ్గః తామ్రహస్తాఙ్ఘ్రివక్త్రః
శూరో మానీ పిఙ్గకేశోఽల్పకామః (రోమా) ౧౮

దయితమాల్యవిలేపనమణ్డనస్సుచరితశ్శుచిరాశ్రితవత్సలః,
విభవసాహసబుద్ధిబలాన్వితో భవతి భీషుగతిర్ద్విషతామపి. ౧౯

మేధావీ ప్రశిథిలసన్ధిబన్ధమాంసో నారీణామనభిమతోఽల్పశుక్రకామః, ఆవాసః పలితతరఙ్గనీలికానాం భుఙ్క్తేఽన్నం మధురకషాయతిక్తశీతమ్. ౨౦

ఘర్మద్వేషీ స్వేదనః పూతిగన్ధః భూయశ్చాపక్రోధపానాశనేర్ష్యః,
సుప్తః పశ్యేత్కర్ణికారాన్ పలాశాన్ దిగ్దాహోల్కావిద్యుదర్కానలాంశ్చ. ౨౧

తనూని పిఙ్గాని చలాని చైషాం తన్వల్పపక్ష్మాణి హిమప్రియాణి,
క్రోధేన మద్యేన నిమేషభావో (రవేశ్చభాసా) రాగవహాన్త్యాశు విలోచనాని. ౨౨

మధ్యాయుషో మధ్యబలాః పణ్డితాః క్లేశభీరవః,
వ్యాఘ్రర్క్షకపిమార్జాలయక్షానూకాశ్చ పైత్తికాః. ౨౩

వ్యా. పిత్తము అగ్నిస్వరూపము లేక యగ్నివలన బుట్టినది. కావున అట్టి పిత్త ప్రకృతికలమనుజుడు మిక్కిలి తీవ్రమైనయాకలిదప్పులుకల్గియుండును. వానిశరీరము గౌరవర్ణంబును ఉష్ణంబునై యుండును. అరకాళ్లును అరచేతులును ముఖంబును తామ్రవర్ణము కల్గియుండును. వాడు మిక్కిలి శూరుడును అభిమానియు. పింగళవర్ణము లైన వెండ్రుకలుకల్గి స్వల్పమైనకామము కలవాడు నగును. మరియు పుష్పమాలికలయందును చందనాద్యనులేపమునందును భూషణములయందును మిక్కిలి యాసగల్గి; పుణ్యవంతుడును పరిశుద్ధుడును తన్నాశ్రయించినవారియందు ప్రీతికలవాడును, వైభవము, సాహసము, బుద్ధి, శరీరబలమును కలవాడై శత్రువులకును భయమును బుట్టించుగమనము కల్గియుండును. మిక్కిలి మేధావంతుడును, శిథిలములగు సంధిబంధములును మాంసమును, మిక్కిలి కొంచెమైన శుక్రంబును కామంబునుకలవాడై స్త్రీలకు ఇష్టములేనివాడగును. అట్టిమనుజుడు తలనెరయుట, శరీరము ముడుతలుపడుట, నల్లనిమచ్చలు వీనికాటపట్టయినవాడగును. మధురంబును కషాయరసంబును తిక్తరసంబును శీతంబును నగు నాహారపదార్థముల భుజించును. ఎండయందు ద్వేషించును. శరీరమున చెమటబట్టి దుర్గంధము కల్గియుండును. వానికి

మాత్రము క్రోధము దప్పి అశనము పరులశ్రేయమునకోరువజాలమి ఇవి మిక్కిలి అతిశయముగ నుండును. వాడు నిదురించునపుడు స్వప్నమున కొండగోగుపూవులను మోదుగ పువ్వులను తగలబడుచుండుదిక్కులను కొరివికట్టెలను మెరపును సూర్యుని అగ్నిని చూచును. వానికన్నులు మిక్కిలి సూక్ష్మములును పింగళవర్ణంబులును చంచలంబులును స్వల్పములగు రెప్పవెండ్రుకలు కల్గినవియునై చలువను గోరుచుండును. మరియు నవి క్రోధముకల్గినప్పుడును మద్యపానము జేసినప్పుడును రెప్పలల్లార్చుచు అతిశీఘ్రముగ నెఱ్ఱవారియుండును. అట్టిలక్షణములుకలవారు పిత్తప్రకృతికలవారని యెరుంగునది. మరియు వీరికి ఆయువును బలంబును మధ్యములై యుండును. మిక్కిలి పండితులై కష్టముల కోరువలేకయుందురు. పెద్దపులి ఎలుగుబంటి కోతి పిల్లి యక్షులు, వీనిస్వభావము కల్గియుందురు.

## కఫప్రకృతి లక్షణము

మూ. శ్లేష్మా సోమశ్శ్లేష్మల స్తేన సౌమ్యో గూఢశ్లిష్టస్నిగ్ధసన్ధ్యస్థిమాంసః, క్షుత్తృట్ దుఃఖక్లేశఘర్మైరతప్తో బుద్ధ్యా యుక్తస్సాత్వికస్సత్యసన్ధః, ప్రియఙ్గుదూర్వాశరకాణ్డశస్త్రగోరోచనాపద్మసువర్ణవర్ణః, ప్రలమ్బబాహుః పృథుపీనవక్షాః మహాలలాటో ఘననీలకేశః. మృద్వఙ్గస్సమసువిభక్తచారువక్త్రో బహ్వోజో రతిరసశుక్రపుత్రభృత్యః, ధర్మాత్మా వదతి న నిష్ఠురం చ జాతు ప్రచ్ఛన్నం వహతి దృఢం చిరం చ వైరమ్. ౨౬

సమదద్విరదేన్ద్రతుల్యయాతో జలదామ్భోధిమృదఙ్గసింహఘోషః, స్మృతిమానభియోగవాన్వినీతో నచ బాల్యేఽప్యతి రోదనో న లోలః. ౨౭

తిక్తం కషాయం కటుకోష్ణతీక్ష్ణం అల్పం చ భుఙ్క్తే బలవాంస్తథాపి, రక్తాన్తసుస్నిగ్ధవిశాలదీర్ఘ సువ్యక్తశుక్లాఽసితపక్ష్మలాక్షః. అల్పవ్యాహారక్రోధకోపాశనేర్ష్యః ప్రాజ్ఞ్యాయుర్విత్తో దీర్ఘసూత్రః (దర్శీ), వదాన్యః, శ్రాద్ధో గమ్భీరః స్థూలలక్షః క్షమావాన్ నార్యో నిద్రాళుః దీర్ఘదర్శీ కృతజ్ఞః. ౨౮

ఋజుర్విపశ్చిత్సుభగస్సలజ్జో భక్తో గురూణాం దృఢసౌహృదశ్చ, స్వప్నే సపద్మాన్ సవిహంగమాలాన్ తోయాశయాన్

పశ్యతి తోయదాంశ్చ. ౩౦

బ్రహ్మరుద్రేన్ద్రవరుణతార్క్ష్యహంసగజాధిపైః,
శ్లేష్మప్రకృతయస్తుల్యాః తథాసింహాశ్వగోవృషైః. ౩౧

వ్యా॰ శ్లేష్మము సోమాత్మకమైనది. (చంద్రునిబోలె చల్లదనము మున్నగు గుణములుగలదియనుట). కావున శ్లేష్మము అధికముగ (ప్రకృతిగ) కలమనుష్యుడు సౌమ్యుడనబడును (శీతాదిగుణములు గల్గియుండుననుట). అట్టి సౌమ్యప్రకృతికలవానికి సంధిబంధములును అస్థులును శరీరమునందలి మాంసంబును గూఢములై ఒండొంటజేరి స్నిగ్ధములై యుండును. (శరీరమునందలి కీళ్లు కనబడక యొండొంట కలిసి యస్థులును మాంసంబును జిడ్డుకల్గి యుండుననుట). వాడు ఆకలిదప్పులకును దుఃఖమునకును కష్టములకును ఎండకును ఓరువగల్గి వానిచే శ్రమనొందకుండును. సూక్ష్మబుద్ధి కల్గి సత్వగుణము ప్రధానముగగలవాడై దబ్బరలాడక సత్యమును బల్కుచుండును. వానిశరీరవర్ణము కొఱ్ఱలను గెరుకను రెల్లును శస్త్రమును గోరోచనమును తామరపువ్వులను బంగరును బోలి యుండును. బాహువులు జానుపర్యంతము వ్రేలుచుండును. రొమ్ము విశాలమై బలిసియుండును. నుదురు విశాలముగను వెండ్రుకలు దట్టమై నల్లగ నుండును. శరీరము వేరువేరుగ నేర్పడిన యవయవములతోగూడి మృదువుగనుండును. ఓజస్సును, క్రీడాసక్తియు, రసధాతువును, శుక్రంబును అధికముగకల్గి; పుత్రులును, భృత్యులును విశేషముగ గల్గియుండును. వాడు మిక్కిలి ధర్మమునందాసక్తికల్గి యొకప్పుడును నిష్ఠురోక్తుల బల్కక యితరులయందు తనకు కల్గినవైరమును వెలిబుచ్చక చిరకాలమువరకును అణచికొని యుండును. అట్టి వైరము చలింపక దృఢమై చాలకాల మనుసరించియే యుండును. వాడు మదించిన యేనుగవలె మిక్కిలి గంభీరముగ నడచును. వానికంఠధ్వని మేఘగర్జనమును, సముద్రఘోషమును మృదంగధ్వనిని సింహనాదమునుబోలె మిగుల గంభీరముగ నుండును. ఒరులుచేయు నుపకారాదుల మరువక మిక్కిలి ప్రీతికల్గి వినయసంపన్నుడై బాల్యమునందైనను మిక్కిలి రోదనముచేయు స్వభావము లేకుండును. ఒకప్పుడును చపలచిత్తుడుగాకుండును. తిక్తకషాయకటురసములుకల్గి ఉష్ణంబును తీక్ష్ణంబునైన యాహారపదార్థముల భుజించును. అట్టి యాహారమును కొంచెముగ భుజించును. అయినను మిక్కిలి బలశాలియై యుండును. వానికన్నులు కొసలయందు రక్తవర్ణములై నిగనిగలాడుచు విశాలములును నిడుదలునై స్ఫుటముగ గనబడుచుండు శుక్లకృష్ణభాగములును కనురెప్పలును కల్గియుండును. మాటలును, *క్రోధంబును, కోపంబును, అశనంబును, అసూయయు వానికి మిక్కిలి

* క్రోధ మనగా నెదుటనే మండిపడుట, కోప మనగా మనసులోబెట్టుకొని యుండురోషమని యిచ్చటి భేదమును గ్రహించవలెను.

స్వల్పముగ నుండును. ఆయువును ధనంబును మిక్కిలి యధికముగ నుండును. పనులు మిక్కిలి చాలకాలము యోచించిచేయును. దానశీలుండును, శ్రద్ధావంతుడును, గంభీర స్వభావముకలవాడును, మిక్కిలి యోచనకలవాడును, ఓర్పుకలవాడును, కృతకృత్యుడును, నిద్రయం దాసక్తికలవాడును, చాలకాలము యుక్తాయుక్తముల యోచించువాడును, కృతజ్ఞుడు నగును. కుటిలవర్తనుడుగాక ఋజుబుద్ధికలవాడును, పండితుండును, సులభముగ ననునయింపదగినవాడును, లజ్జకలవాడును, గురువులయందును, పెద్దలయందును భక్తికలవాడును, స్థిరమైన మైత్రికలవాడునునై యుండును. వాడు నిదురించునపుడు స్వప్నమునందు తామరపువ్వులతోడను పక్షులతోడను గూడినసరస్సులను, మేఘబృందమును జూచును. బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, వరుణుడు, గరుడుడు, హంస, ఏనుగు, సింహము, గుఱ్ఱము, వృషభము అనువానితో సమానమైన స్వభావముగలవాడై యుండును. (కఫప్రకృతికల మనుజుడు పైజెప్పిన లక్షణములు కల్గియుండునని భావము.)

## ప్రకృతులతారతమ్యము

మూ. సమధాతుస్సమః; తాసు శ్రేష్ఠో నిన్ద్యాః ద్విదోషజాః. ౩౧

వ్యా. జననకాలమున వాతపిత్తకఫములు మూడును పైజెప్పినరీతిగ న్యూనాధికములుగాక సమములై తలిదండ్రుల శుక్రశోణితముల గలసియున్నచో నట్టిబీజమున జనించినమనుజుడు సమప్రకృతియగును. రెండేసిదోషములు అధికములుగ నుండునపుడు జనించినవారు ద్విదోషప్రకృతి కల్గియుందురు. అట్టి ప్రకృతు లన్నిటిలో సమప్రకృతి చాల శ్రేష్ఠము. ద్విదోషజ (వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ సన్నిపాత ప్రకృతులు) నాల్గును నింద్యములు (రోగకారణములనుట). ఏకదోషజప్రకృతులు మూడును మధ్యములని యర్థముచే లభించును. అందును "తైశ్చతిస్రః ప్రకృతయో హీనమధ్యోత్తమాః పృథక్" అని వాగ్భటాచార్యులు చెప్పిరిగాన వాతప్రకృతి హీనమనియు, పిత్తప్రకృతి మధ్యమమనియు, కఫప్రకృతి యుత్తమమనియు తారతమ్యము నెఱుంగునది.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—శారీరస్థానమున మూడవయధ్యాయమున వాగ్భటాచార్యు డిట్లు చెప్పెను. శుక్రా స్సృగ్గర్భిణీ భోజ్య చేష్టా గర్భాశయర్తుషు, యస్స్యాద్దోషోఽధికస్తేన ప్రకృతి స్సప్తబోధితా" ఈవాక్యమును బట్టి గర్భిణిగ నుండు సమయమున శుక్రార్తవములయందును ఆహారవిహారములయందును గర్భాశయ ఋతువులయందును వాతాదిదోషములతో నే దోషము అధికముగ నుండునో అట్టి ప్రకృతి గర్భమునందలి శిశువునకు సంభవించుననియు, అయ్యది వాతాది దోషములచే వేరువేరుగను, రెండేసిదోషముల సంసర్గముచేతను సన్నిపాతముచేతను, త్రిదోషసామ్యముచేతను

సంభవించుటం జేసి (వాత, పిత్త, కఫ, వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ, సన్నిపాత, భేదములచే) యేడువిధములగుననియుం తెలిసెడి. ఇట్లుండ ఏకదోషప్రకృతుల లక్షణములు మాత్రము చెప్పి సంసర్గసన్నిపాతలక్షణము లెందుకు జెప్పలేదనిన దోషద్వయసంసర్గలక్షణములబట్టియు మూడుదోషముల లక్షణముల సంసర్గమునుబట్టియు ద్విదోష త్రిదోష ప్రకృతుల నూహింపదగునని మూలకారుని యభిప్రాయము చేతనే "సమస్తాసు శ్రేష్ఠో నిన్ద్యాః ద్విదోషజాః" అని సంగ్రహించెను. పైజెప్పినసంసర్గసన్నిపాతప్రకృతుల లక్షణములనే వాగ్భటాచార్యులు "ప్రకృతీః ద్వయసర్వస్థాః ద్వన్ద్వసర్వగుణోదయే" అనువాక్యముచే శారీరస్థానమున మూడవయధ్యాయమున సంగ్రహముగ చెప్పెను.

మానసికదోషములైన సత్వరజస్తమోగుణములచే గల్గు ప్రకృతులను శౌచము ఆస్తిక్యము మున్నగు గుణములబట్టి నిర్ణయించునది. ఈవిషయమును వాగ్భటాచార్యుడు శారీరస్థానమున మూడవయధ్యాయమున "శౌచాస్తిక్యాదిభిశ్చైవం గుణైర్గుణమయీర్వదేత్" అనువాక్యముచే జెప్పిరి.

## అగ్నిస్వరూపము, భేదములును

మూ. సమోఽగ్నిర్విషమస్తీక్ష్ణో మన్దశ్చేతి చతుర్విధః. 3 ౨

వ్యా. జాఠరాగ్ని సమము, విషమము, తీక్ష్ణము, మందము నని నాల్గుతెరంగుల నుండును. సకలప్రాణులకును భుజింపబడిన యాహారమును జీర్ణింపజేయుటకై జఠరమున నుండు అగ్ని యిచ్చట అగ్నిశబ్దముచే జెప్పబడును. అయ్యది వాతపిత్తకఫములయొక్క సమవిషమస్థితిచే సంభవించును. అది యెట్లులనిన:—వాతపిత్తకఫములు మూడును న్యూనాధికములుగాక సమస్థితినుండుతరి (దాన జనించిన) జాఠరాగ్ని సమాగ్నియగును. అటుగాక వాతముమాత్రము అధికమున నుండునెడ (దాన జనించిన) జాఠరాగ్ని విషమాగ్నియగును. పిత్తముమాత్రము అధికముగ నుండిన (దాన జనించిన) జాఠరాగ్ని తీక్ష్ణమనంబడును. కఫం బధికమైన (దానజనించినది) మందాగ్ని యనబడును. ఇట్టి యగ్నిభేదములు వాతాదులయొక్క తారతమ్యమున గల్గును. ఈ విషయము వాగ్భటాచార్యుడు "తైర్భవేద్విషమస్తీక్ష్ణో మన్దశ్చాగ్నిస్సమైస్సమః" అనువాక్యముచే స్ఫుటముగ జెప్పెను. వాగ్భటశారీరమున నగ్నిభేదముల నిట్లు నిరూపించును:—"సమస్సమానే స్థానస్థే విషమోఽగ్నిర్విమార్గగే, పిత్తాభిమూర్ఛితే తీక్ష్ణో మన్దోఽస్మిన్ కఫపీడితే" ఈవాక్యముచేత సమానవాతము తనకు నియమితనాభిస్థానముననే యుండునపుడు సమాగ్నియగుననియుం, అట్టి సమానవాతము తనమార్గమును వదలి మార్గాంతరమున సంచరించుతరి విషమాగ్ని

యగుననియు, పిత్తముతో గలిసినపుడు తీక్ష్ణాగ్నియగుననియు, కఫముతో గలిసినపుడు మందాగ్నియగుననియు భావము. వాయుసంబంధములేక అగ్నిజ్వలించుట లేదుగాన సమానవాతసంబంధముచే జఠరాగ్ని జ్వలించును. అయ్యది సమస్థితి నుండక పిత్తాదులం గలిసినపుడు పైజెప్పినరీతిగ మారుచుండునని ముఖ్యభావము.

నాల్గువిధములైన యగ్నుల ప్రత్యేకలక్షణము

మూ. యః పచేత్సమ్యగేవాన్నం సమ్యగ్భుక్తం సమస్త్వసౌ,
విషమోఽసమ్యగప్యాశు సమ్యగ్వాపి చిరాత్పచేత్. 33
తీక్ష్ణో వహ్నిః పచేచ్ఛీఘ్రం అసమ్యగపి భోజనమ్,
మన్దస్తు సమ్యగప్యన్నం ఉపభుక్తం చిరాత్పచేత్. 34
కృత్వాస్య శోషాధ్మానాన్త్రకూజనాధ్మానగౌరవమ్,

వ్యా. ఆహారనియమమున జెప్పినరీతిగ పరమాణాదుల ననుసరించి శాస్త్రీయముగ భుజింపబడిన యాహారమును చక్కగ పచనము నొందించి జీర్ణింపజేయునది సమాగ్ని యనబడును. దేశము కాలము మాత్ర మున్నగుపద్ధతి ననుసరింపక భుజింపబడిన యాహారమునుగూడ మిక్కిలి శీఘ్రముగ పచింపజేసినను; లేక దేశకాలమాత్రాదుల ననుసరించి యథోక్తముగ భుజింపబడిన యన్నమునుగూడ చిరకాలమునకు పచింపజేసినను, అట్టి యగ్ని విషమ మనంబడును. దేశకాలమాత్రాదుల ననుసరింపక శాస్త్రవిధి నుల్లంఘించియు భుజింపబడినయాహారమునుగూడ నతిశీఘ్రముగ పచింపజేయునది తీక్ష్ణాగ్ని యనబరంగును. దేశకాలాదివిధుల ననుసరించి విధ్యుక్తముగ భుజింపబడిన యాహారమునుగూడ నోరెండుట, కడుపులో గడబిడ, ప్రేవులకూతలు, కడుపుబ్బరము, గురుత్వము అను నీయుపద్రవముల గల్గించి చిరకాలమునకు జీర్ణింపజేయు జాఠరాగ్ని మంద మనబడును.

పాకము జెందుటకు కాలనియమము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది:—
"యామైశ్చతుర్భిర్ద్విర్వాభ్యాంచ భోజ్య భైషజ్య యోః స్సమే, పాకోఽగ్నౌ భుక్తయోః, ప్రాక్తు తీక్ష్ణే; మన్దే పునశ్చిరాత్, సభక్త మౌషధం తస్మాత్ మన్దాగ్నేరవచారయేత్"
సమాగ్నియందు భుజింపబడినయాహారము నాల్గుజాములకును, ఔషధము రెండుజాములకును పూర్తిగ జీర్ణమగును. తీక్ష్ణాగ్నియందు ఇట్టి కాలనియతిలేక అతిశీఘ్రముగ జీర్ణమగును. మందాగ్నియందు అట్టి కాలనియమము నుల్లంఘించి చిరకాలమునకు జీర్ణమగును, కావున మందాగ్నియందు ఆహారముతోగూడ చేర్చి యౌషధము నుపయోగించుట యుక్తము. (అట్లుజేసినచో నగ్నిదీప్తి కల్గునని భావము).

కోష్ఠభేదములు

మూ. కోష్ఠః క్రూరో మృదుర్మధ్యః* మధ్యశ్చేతి చతుర్విధః. 3౫

వ్యా. కోష్ఠము క్రూరమనియు, మృదువనియు, మధ్యమనియు, మధ్యమనియు నాల్గువిధములు.

చతుర్విధకోష్ఠలక్షణములు

మూ. ప్రభూతమారుతః క్రూరః కృచ్ఛ్రాచ్ఛ్యామాదికైరపి,
బహుపిత్తో మృదుః కోష్ఠః క్షీరేణాపి విరిచ్యతే. 3౬
†మధ్యస్సమమలస్సమ్యక్ సువమ్యోఽన్యఃకఫోదరే,

వ్యా. వాతం బధికముగ నుండుకోష్ఠము క్రూరముగ నుండును. అట్టి కోష్ఠముకల మనుజునకు నల్లతెగడ, (కంకుష్ఠము, జెనుడు) మున్నగుసౌషధములచే కష్టముగ విరేచనమగును. (సౌమ్యములగు సౌషధములచే విరేచనము కాదనుట).

పిత్తం బధికముగ నున్నపుడు కోష్ఠము మృదువుగ నుండును. అట్టి మృదుకోష్ఠము కలవారికి ఆవుపాలచేగూడ సులభముగ విరేచనములగును.

త్రిదోషములును సమములుగ నున్నపుడు కోష్ఠము (మధ్య) సమముగ నుండును. ఈకోష్ఠముకలవారికి విరేచనములు సాధారణముగ నగును.

కఫం బధికముగనున్నపుడును కోష్ఠము మధ్య మనంబడును. అట్టి కఫకోష్ఠమున సులభముగ వమనము చేయించదగును.

సప్తధాతువులు

మూ. రసాసృఙ్మాంసమేదోఽస్థిమజ్జాశుక్రాణిధాతవః 3౭
సప్తదూష్యాః.........

వ్యా. రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థులు, మజ్జ(క్రొవ్వు), శుక్రము, అను నీయేడును ధాతువులనియు దూష్యములనియు చెప్పబడును.

"శరీరం ధారయన్త్యేతే ధాత్వాహారాచ్చ సర్వదా" అని అష్టాంగసంగ్రహమున జెప్పినప్రకారము రసరక్తాదులు శరీరమును ధరించుటంజేసి ధాతువులనియు, దుష్టములగు త్రిదోషములచే నివి చెరుపబడునుగాన దూష్యములనియు చెప్పబడునని యెరుంగునది.

మలములు

మూ. .........మలామూత్రంశకృత్ స్వేదాదయోఽపిచ,

---

* "సమశ్చేతి" అనియుండిన సమంజస మగును. † "సమస్సమమలః" అని యుండవలెను.

వ్యా. మూత్రము, శకృత్తు, చెమట మున్నగునవి మలములనియు చెప్పబడును. ఇచ్చట 'అపిచ' అని చెప్పుటవలన రసాదిధాతువులచే మలమూత్రాదులు చెరుపబడుటంజేసి దూష్యములనియు, శరీరమును మలినముగ జేయుటంజేసి మలములనియు చెప్పబడునని యెరుంగునది.

సత్వము (రజస్తమోగుణములు)

మూ. స్వభావజం స్థిరం సత్వం అవికారి విపత్స్వపి. ౩౮

వ్యా. శరీరమున మనశ్శరీరములకు సంబంధించి స్వభావసిద్ధముగనే యుండి స్థిరమై ఆపత్తులు సంభవించినపుడును వికృతిజెందక యుండుశక్తియే సత్వమని చెప్పబడును.

ఇచ్చట సత్వశబ్దముచేత సత్వరజస్తమోగుణములు మూడును గ్రహింపబడును. ఈమూడును మానసికదోషములు. ఈమానసికదోషవైగుణ్యముచేత ఉన్మాదాదిమానసిక రోగములు సంభవించును.

బలము

మూ. సహజం కాలజం యుక్తికృతం దేహబలం త్రిధా,
తత్ర సత్వశరీరోత్థం; ప్రాకృతం సహజం బలమ్. ౩౯
వయఃకృతమృతూత్థాం చ కాలజం యుక్తిజం పునః,
విహారాహారజనితం తథోజస్కరయోగజమ్. ౪౦

వ్యా. శరీరముయొక్కబలము సహజము, కాలజము, యుక్తికృతము నని మూడు విధములు. అందు పైజెప్పిన సత్వరజస్తమోగుణములచేతను శరీరముచేతను శరీరమున తనంతనే పుట్టినబలము సహజ మనబడును. యౌవనవిశేషముననను, విసర్గకాలమున ఋతువిశేషమునంజేసియు కల్గినది కాలజబలము. బలకరంబులగు విహారాహారములచేతను, ఓజస్సును వృద్ధినొందించు నౌషధాదిప్రయోగములచేతను రసాయన వాజీకరణాది యోగములచేతను కల్గినశరీరబలము యుక్తిజ మనబడును.

వయోభేదములు

మూ. వయస్త్వాషోడశాద్బాల్యం తత్ర ధాత్విన్ద్రియౌజసామ్,
వృద్ధిరాసప్తతేర్మధ్యం తత్రావృద్ధిః పరంక్షయః. ౪౧

వ్యా. (కాలభేదమున కల్గుశరీరావస్థావిశేషము వయ స్సనబడును. అయ్యది బాల్యము, మధ్యము, వృద్ధత్వము నని మూడువిధములు) అందు శిశువు జనించిననాట నుండి పదునారవవత్సరమువరకు బాల్యము. అట్టి బాల్యవయసున రసాదిధాతువులును, చక్షురాదీన్ద్రియములును, ధాతువుల నాప్యాయత నొందించు నోజస్సును నానాట వృద్ధి

నొందును. పదునారవవత్సరము మొదలు డెబ్బదియవవత్సరము వచ్చువరకును మధ్యమ వయ స్సనబడును. ఈవయసున ధాతువులును ఇంద్రియంబులును ఓజస్సును వృద్ధినొందక పుష్టినొందును. అదిమొదలు (డెబ్బదియవవత్సరము మొదలుజేసి) ఆయుః పరిమితివరకును వృద్ధత్వ మనబడును. ఈవయసున ధాత్విన్ద్రియౌజస్సులు నానాట క్షీణించును.

ఇచ్చట నీవిషయము తెలుగునది:—పైజెప్పిన బాల్యవయస్సు క్షీరవృత్తి (పాలనుమాత్రము ఆహారము చేయువయసు), క్షీరాన్నవృత్తి (పాలను అన్నమును గూడ నాహారముచేయువయసు), అన్నవృత్తి (అన్నమునుమాత్రము ఆహారము చేయు వయసు), యనఁ నని మూడువిధముల నుండును. ఈవయసున "వయో హోరాత్రి భుక్తానాం తే న్తమధ్యాదిగాః క్రమాత్" అను వాగ్భటవాక్యప్రకారము కఫము ప్రధానముగ నుండును. కావున ఈబాల్యవయసున శరీరమున స్నేహము, మృదుత్వము, సౌకుమార్యము, సౌభాగ్యము మున్నగునవియు నానాట వృద్ధినొందును.

మధ్యమవయసుకూడ మూడువిధముల నుండును. పదునారవవత్సరము మొదలు ముప్పదియవవత్సరము వరకును యౌవనము. ఈవయసున పిత్తం బధికముగ నుండుటంజేసి జాఠరాగ్ని దీప్తంబైయుండును. ప్రజ్ఞాపరిపాకంబును కలుగును. రెండవది సంపూర్ణత్వము: నలుబదియవవత్సరము వరకును వ్యాపించును. ఈవయసున సకలధాత్వింద్రియౌజస్సులును, వీర్యంబును, పౌరుషంబును, స్మరణవిజ్ఞాన ప్రజ్ఞాదివిశేషంబులును సంపూర్ణములై యుండును. అదిమొదలు డెబ్బదియవవత్సరమువరకును మున్ను సంపూర్ణములుగ నుండుధాత్వింద్రియోజస్సులును స్మరణవిజ్ఞానాదులును హానిలేక యథాస్థితి నుండును.

డెబ్బదియవవత్సరము మొదలు ఆయుఃపరిమితి వరకును వృద్ధత్వము. ఈవయసున పూర్వవయసులలో నానాట వృద్ధినొంది సంపూర్ణదశనొందియుండు సకలధాత్వింద్రియాదులు నానాట క్షీణించుచు, శరీరమున వలీపలితాదులు కల్గి శరీరము నానాట శిథిల మగుచుండును. ఈవయసున వాతము వృద్ధినొందియుండును.

మరియు పైజెప్పబడిన దోషధాతు మలప్రకృతులు మున్నగునవి గుణవంతములై వానివానిపరిస్థితి మారకుండునెడ మనుజుడు నూరుసంవత్సరములు ఆయుఃపరిమాణముకల్గి ఐశ్వర్యము మున్నగు సకలభోగముల ననుభవించుచు జీవించియుండును. ఈవిషయమును వాగ్భటాచార్యుడు శారీరస్థానమున మూడవయధ్యాయమున నిట్లు చెప్పెను:—"ఇతి సర్వ గుణోపేతే శరీరే శరదాంశతమ్: ఆయుర్వైశ్వర్యమిష్టాశ్చ సర్వే భావాః ప్రతిష్ఠితాః"

దేశభేదములు

మూ. భూమిదేహప్రభేదేన దేశమాహురిహ ద్విధా,

వ్యా. భూమియనియు, శరీరమనియు దేశము రెండువిధములుగ నీయాయుర్వేద తంత్రములయందుఁ జెప్పంబడును.

భూమిదేశభేదములు

మూ. జాఙ్గలం వాతభూయిష్ఠమనూపం తు కఫోల్బణమ్. ౪౨
సాధారణం సమమలం త్రిధా భూదేశమాదిశేత్,
దేశోఽల్పవారిద్రునగో జాఙ్గలః స్వల్పరోగదః. ౪౩
అనూపో విపరీతోఽస్మాత్ సమస్సాధారణస్స్మృతః,

వ్యా. భూమియనుదేశము జాంగలము. అనూపము, సమము నని మూడువిధములు. అందు ఉదకంబును వృక్షంబులును పర్వతంబులును స్వల్పములుగనుండి వాతము ప్రబలముగనుండు ప్రదేశము జాంగలము. ఈదేశమున రోగములు స్వల్పముగ నుండును. (ఇందు జనించిన పశుపక్ష్యాదిజంతువులును మనుజులును ఓషధులును మున్నగునవి వాతభూయిష్ఠములై యుండును.)

పైజెప్పిన జాంగలలక్షణములకు విరుద్ధముగ (అధికమైన జలంబును వృక్షంబులును పర్వతంబులును గల్గి) నుండుప్రదేశము అనూపము. ఈదేశమున కఫము ప్రబలముగ నుండును. దానంజేసి యీప్రదేశమునందలి జనించినపురుషులు, మృగములు, పక్షులు, ఓషధులు మున్నగునవి కఫభూయిష్ఠములై యుండును. (ఈదేశమున వ్యాధు లధికముగ సంభవించును).

పైజెప్పిన జాంగలానూపలక్షణములు సమముగనుండు ప్రదేశము సాధారణదేశ మనబడును. ఇచ్చట వాతాదిదోషములు సమములుగ నుండును. (కావున నీప్రదేశము ఆరోగ్యకరముగ నుండును). ఈప్రదేశమునందలిమనుజులు పశుపక్ష్యాదిజంతువులు ఓషధులు మున్నగునవి సమములైన వాతాదిదోషములు గల్గియుండును.

దేహదేశము

మూ. దోషధాతుమలాధారో దేహఇత్యభిధీయతే. ౪౪

వ్యా. వాతాదిదోషములకును రసాదిధాతువులకును మూత్రపురీషస్వేదాదిమలములకును ఆధారమైనది శరీరదేశ మనబడును.

మాత్రాదికాలపరిమాణము, నాడికాముహూర్తాదికాలభేదములు

మాత్రాది ర్వ్యాధ్యవస్థాచ కాలో భేషజయోగకృత్,
లఘ్వక్షరో నిమేషోవా మాత్రా స్ఫోటోఽథవాఙ్గులేః. ౪౫
తాసాం సప్తసహస్రాణి ద్వేశతే వాపి నాడికా,
నాడికేద్వే ముహూర్తస్తేచత్వారః పాదవర్జితాః. ౪౬

యామః; తేషామహోరాత్రం పక్షస్తే దశపఞ్చ చ,
సమాసస్తౌ ద్వౌ నిదాఘః జ్యేష్ఠాషాఢకస్మృతః. ౪౭
ప్రావృట్ శ్రావణభాద్రౌ స్యాత్, శరదాశ్వినకార్తికౌ,
మార్గః పౌషశ్చ హేమన్తః శిశిరో మాఘఫాల్గునౌ. ౪౮
వసన్తశ్చైత్రవైశాఖౌ ఋతవష్షట్చ వత్సరః,
వ్యాధ్యవస్థావ్యయః కాలః తత్ర తత్రోపదేక్ష్యతే. ౪౯

వ్యా. కాలము మాత్రాదిపరిమాణమును వ్యాధియొక్క అవస్థాభేదమును అనుసరించియుండును. అట్టికాలము ననుసరించి కల్పింపబడిన యౌషధము ఆయావ్యాధులయందు చక్కగ పనిచేయును. (కావున అట్టికాలమును దెలిసికొనుట యావశ్యకము. అట్టి కాలము నిమిషము, ఘటిక, ముహూర్తము, యామము, పగలు, రాత్రి, అహోరాత్రము, పక్షము, మాసము, ఋతువు, వత్సరమనను భేదముల గల్గియుండును. అవియెల్ల నీక్రింద వివరింపబడును.)

ఒక లఘ్వక్షరము నుచ్చరించునంతకాలమైన కనురెప్ప నొకపరి యల్లార్చునంతకాలమైనను వ్రేళ్లతో నొకచిటిక వేయునంతకాలమైనను ఒకమాత్రాకాల మనబడును. అట్టి మాత్రలు ఏడువేలు రెండువందలు (౭౨౦౦) చేరినకాలము ఒకనాడిక (గడియ) యనబడును. అట్టిగడియలు రెండైన నొకముహూర్తము. అట్టి ముహూర్తములు పాతిక తక్కువగ (అరగడియ తక్కువగ) నాల్గుచేరినకాలము ఒకయామము. (ఏడున్నరగడియలు ఒకజాము అనుట) అట్టియామములు నాల్గైనచో నొకపగలు. నాల్గుజాము లొకరాత్రి. ఈరెండునుజేరి (ఎనిమిదిజాములు) ఒక యహోరాత్రము. అట్టి యహోరాత్రములు పదునైదుజేరి యొకపక్షము. అట్టిపక్షములు రెండుజేరిన యొకమాసము. అట్టి మాసములు రెండేసిచేరిన ఒక్కొకఋతువు. అందు జ్యేష్ఠాషాఢమాసములు రెండును నిదాఘము (గ్రీష్మఋతువు), శ్రావణభాద్రపదమాసములు రెండునుజేరి ప్రావృట్ కాలము (వర్షఋతువు), ఆశ్వయుజకార్తికమాసములు రెండునుజేరి శరదృతువు, మార్గశీర్షపుష్యమాసములు రెండునుజేరి హేమన్తఋతువు, మాఘఫాల్గుణమాసములు రెండును శిశిరఋతువు. చైత్రవైశాఖమాసములు రెండునుజేరి వసంతఋతువు, ఈయాఱుఋతువులును జేరి యొకసంవత్సరము. ఇది మాత్రాదికాలనిర్ణయము, వ్యాధులయొక్క అవస్థాభేదము ననుసరించినకాలభేదము అచ్చటచ్చట నాయావ్యాధుల ననుసరించి చెప్పబడును.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—పైజెప్పినఋతువు లాఱిటిలో వర్షశరద్ధేమంతఋతువులు మూడును దక్షిణాయనము. (అనగా సూర్యుడు దక్షిణమార్గమున సంచ

రించుకాలము). శిశిరవసంత గ్రీష్మఋతువులు మూడును ఉత్తరాయణము. (సూర్యుడు ఉత్తరమార్గముగ సంచరించుకాలము). మఱియు పైజెప్పిన ఉత్తరాయణమున సూర్యుడు మిక్కిలి తీవ్రములైన కిరణములతో తనప్రతాపమును పూర్తిగ జూపి భూమియందును మనుజులయందును ఉండుసౌమ్యగుణముల జెరచును. దానంజేసి మనుజుల శరీరబలమును భూమియందలిద్రవమును బోలై తనచండకిరణములచే నాకర్షించును. దానంజేసి మనుజులు మిక్కిలి బలహీనులై యుందురు. ఇత్తెరంగున భూమియందును మనుజులయందును గలసారము నాకర్షించుటంజేసి ఉత్తరాయణము ఆదానకాల మనంబరగును.

దక్షిణాయనమున చంద్రునియందలి సౌమ్యగుణ మధికమై వర్షములచే భూమి చల్లబడియుండును. అప్పుడు సూర్యుడు తనకు నైజమగు తీవ్రత నుడిగి మనుజులకు తాను మున్ను గ్రహించియుండిన బలమును నానాట నొసంగుచుండును. కావున దక్షిణాయనము విసర్గకాల మనంబడును. ఈవిషయమును వాగ్భటాచార్యు డిట్లు చెప్పెను:—

"శిశిరాద్యైః త్రిభిస్తైస్తు విద్యాదయనముత్తరం, ఆదానంచ యదాదత్తే నృణాం ప్రతిదినం బలమ్" "ఋతవో దక్షిణాయనమ్, వర్షాదయో విసర్గశ్చ యద్బలం విస్సృజత్యసౌ. సౌమ్యత్వా దత్ర సోమోహి బలవాన్ హీయతే రవిః, మేఘవృష్ట్య నిలైశ్శీతైః శాన్తతాపే మహీతలే"

## సాత్మ్యలక్షణము

మూ. సాత్మ్యం సహాత్మనాభ్యస్తం స్వాస్థ్యోత్పత్త్యనువృత్తికృత్,
దేశకాలవయోరోగదోషప్రకృతిసంశ్రితమ్. ౫౦

వ్యా. తాను కొంతకాలము ఉపయోగించి యలవాటు జేసియుండునపుడు అట్టి పదార్థములచే రోగాదులు సంభవించక శరీరస్వస్థతను కల్గించి అట్టి యారోగ్య మనుసరించి యుండునెడ అట్టి వస్తువు వారికి సాత్మ్యమని భావము. అట్టి సాత్మ్యము, దేశము, కాలము, వయస్సు, రోగము, దోషములు, ప్రకృతి అనువాని నాశ్రయించియుండును.

## దేశాదిసాత్మ్యవివరము

మూ. భూమిసాత్మ్యం దధిక్షీరం కరీరః మరువాసిషు,
క్షారః ప్రాచ్యేషు మత్స్యాస్తుసైన్ధవేష్వన్ధ్రికేషుతు. ౫౧
తైలామ్లం దశమూలాని మలయే కొంకణేపునః,
పేయామణ్డ ఉదీచ్యేషుగోధూమోఽవన్తిభూమిషు. ౫౨
దేహసాత్మ్యం ఘృతక్షీరం మద్యం మాసంతుకస్యచిత్,
పేయాయూషౌరసోఽన్యస్యగోధూమోఽన్యస్యశాలినః,

కాలసాత్మ్యం దివానిద్రా నిదాఘే బాలవృద్ధయోః,
వయస్సాత్మ్యం రుజాసాత్మ్యం ముస్తాపర్పాటకంజ్వరే. ॥13
సాత్మ్యంతైలం ఘృతం క్షౌద్రం దోషాణాంప్రకృతేఃపునః,
స్రంసనం సత్పయోగవ్యం భవతి గ్రాహికస్యచిత్. ॥14

వ్యా. మరుదేశములయందు పెరుగు పాలు వెదురుమోవులు ఇవి సాత్మ్యములై యుండును; తూర్పుదేశములయందు క్షీరంబులును, సింధుదేశంబున మత్స్యంబులును, ఆంధ్రదేశమున తైలము అమ్లరసంబులును, మలయస్రోతములయందు కందమూలంబులును, కొంకణదేశంబున పేయ యూను మండంబును, ఉత్తరమునను అవంతిదేశమునందును గోధుమలును, సాత్మ్యములై యుండును. (పైజెప్పబడినవి యన్నియు భూమి యను దేశమునకు సాత్మ్యములని భావము). దేహమునకు నెయ్యియు పాలును సాత్మ్యములగును. కొందరి శరీరములకు మద్యమాంసంబులు సాత్మ్యములగును. కొందరికి పేయయు, యూషంబును, మాంసరసంబును; కొందరికి గోధుమలును, కొందరికి వరిధాన్యంబులును సాత్మ్యము లగును. (పైజెప్పబడిన ఘృతక్షీరాదిసాత్మ్యము దేహమును దేశముయొక్క సాత్మ్యములు. ఇత్తెఱంగున భూమి దేహ భేదములచే రెండు తెఱంగులైన దేశమునకు సంబంధించి సాత్మ్యము నిరూపింపబడియె).

ఎండకాలమునను బాలవృద్ధులకును పగటినిద్ర సాత్మ్యముగ నుండును. (ఇది కాలసాత్మ్యము వయస్సాత్మ్యంబును). జ్వరమున తుంగగడ్డలును పర్పాటకంబును సాత్మ్యము లగును. (ఇది రోగసాత్మ్యము). దోషములతో వాతమునకు తైలంబును, పిత్తమునకు ఘృతంబును, కఫమునకు తేనెయు సాత్మ్యము లగును. (ఇది దోషసాత్మ్యము). వాతాది ప్రకృతులతో కొందరికి ఆవుపాలు స్రంసనంబును, కొందరికి గ్రాహియు నగును. (ఇది ప్రకృతిసాత్మ్యము. ఇత్తెఱంగున దేశ - కాల - వయో - రోగ - దోష - ప్రకృతి సాత్మ్యము లారును వివరింపబడియె).




మూ. ఆహారోఽన్నం

అన్నము మున్నగు భోజ్యపదార్థములను దేశకాలసాత్మ్యముల ననుసరించి భుజించుట యాహారము. (ఈయాహారభేదములను, వానిపరిమాణములను, గుణదోషములను, వాగ్భటాది తంత్రకారులు సవిస్తరముగ నిరూపించిరి. అందు భోజనపరిమాణమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—“అన్నేన కుక్షేర్ద్వావంశౌ పానేనైకం ప్రపూరయేత్, ఆశ్రయం పవనాదీనాం చతుర్థ మవశేషయేత్.” ఉదరమున రెండు

భాగములను అన్నముచేతను, ఒకభాగమును జలముచేతను, నిండించి నాలవభాగమును వాతాదిసంచారమునకై విడిచి భుజింపనగును అని భావము. ఇంకను భోజనమునకు సంబంధించినవిషయము లనేకములుగ తంత్రాంతరమున గనందగు. వానినెల్ల నీతంత్రకారుడు విస్తరభీతిచే విడచి "ఆహారోన్నం" అని సూచనామాత్రముగ తా నుపక్రమించిన "ఆహారో భేషజానిచ" అనునాహారవిషయమును జెప్పెను. దానివివరమును "అనుక్త మన్యతో గ్రాహ్యమ్" అనునార్యోక్తి ప్రకారము తంత్రాంతరములనుండి పాఠకులు తెలిసికొందురుగాక యని యాతంత్రకారుని యాశయముగ దోచెడి).

**ద్వివిధచికిత్సలు, వానిలక్షణములు**

మూ. ద్విధా ద్రవ్యమద్రవ్యంచేతి భేషజమ్,
ద్రవ్యం స్థానం రసాదీనాం అద్రవ్యంలఙ్ఘనాదికమ్. ౫౫

వ్యా. చికిత్స రెండుతెఱంగులు. అందు ద్రవ్యరూపములైన త్రికటు త్రిఫలాదులచే జేయబడునది ద్రవ్యచికిత్స యొకటి; రెండవది ద్రవ్యములేక లంఘన వ్యాయామాదిరూపమైనచికిత్స. ఇది అద్రవ్యచికిత్స. అట్టి ద్రవ్యము రసగుణవీర్యవిపాక ప్రభావములకు స్థానముగ నుండును. ఉపవాసాదిరూపమైనది అద్రవ్యచికిత్స.

**ద్రవ్యము రసాదులచే పనిచేయుక్రమము**

మూ. ద్రవ్యం రసేన కురుతే కర్మపాకేన చాపరమ్,
గుణాన్తరేణ వీర్యేణప్రభావేనైనకిఞ్చన. ౫౬

వ్యా. చికిత్సార్థమై యుపయోగింపబడిన ద్రవ్యములలో కొన్ని తనయందుకల మధురాదిరసములచేత పనిచేయును. కొన్ని ద్రవ్యములు విపాకముచేతను, మరికొన్ని మృదుత్వాదిగుణములచేతను, కొన్ని శీతాదివీర్యముచేతను, కొన్ని ప్రభావముచేతను పనిచేయును.

**షడ్రసములు**

మూ. రసాఃస్వాద్వమ్లలవణతిక్తోషణకషాయకాః,
షట్ ద్రవ్యమాశ్రితా తేనయథాపూర్వంబలావహాః. ౫౭

వ్యా. మధురము (తీపి), ఆమ్లము (పులుపు), లవణము (ఉప్పు), తిక్తము (చేదు), కటువు (కారము, ఇదియే ఊషణము), కషాయము (వగరు), నని రసము లారువిధములు. ఈయారురసములును పంచభూతాత్మకమగు ద్రవ్యము నాశ్రయించి యుండును. పైజెప్పిన యారురసములును ముందుముందు ఒకదానికన్న నొకటి మిక్కిలి బలవత్తరములై యుండును. (కషాయమునకన్న కటురసంబును, దానికన్న తిక్తరసంబును, దానికన్న లవణ

రసంబును, దానికన్న నమ్లరసంబును, వీనికన్నిటికన్న మధురరసంబును మిక్కిలి బలాధికముగ నుండు నని భావము).

మరియు పైజెప్పినరసము పరస్పరసంసర్గ తారతమ్యములచే నానావిధములుగ నున్నను ప్రధానముగ నారువిధములై యుండు నని తెలియుటకై 'షట్' అని సంఖ్యా నియమము చేయబడినది.

### మధురాదిషడ్రసములగుణములు

మూ. తత్రాద్యాః మారుతం ఘ్నన్తి త్రయస్తిక్తాదయః కఫమ్,
కషాయతిక్తమధురాః పిత్తమన్యేతు కుర్వతే. ౧౮

వ్యా. పైజెప్పినషడ్రసములలో మొదటనుండు (మధుర - అమ్ల - లవణ) రసములు మూడును వాతమును శమింపజేయును. ఇతరములగు తిక్తకటుకషాయరసములు మూడును వాతమును ప్రకోపింపజేయును. ఈరసములు మూడునే కఫమును శమింపజేయును. పైజెప్పిన మధురఅమ్లలవణ రసములు మూడును కఫమును ప్రకోపింపజేయును. కషాయతిక్త మధురరసములు మూడును పిత్తమును శమింపజేయును. తక్కిన అమ్ల-లవణ-కటురసములు మూడును పిత్తమును ప్రకోపింపజేయును.

మధురాదిగుణముల నీరీతి నెరుంగునది:—మధురరసము వాతపిత్తముల శమింపజేసి కఫమును ప్రకోపింపజేయును. లవణ అమ్లరసములు వాతమును శమింపజేసి కఫపిత్తముల బ్రకోపింపజేయును. తిక్తరసము కఫపిత్తముల శమింపజేసి వాతమును ప్రకోపింపజేయును. కటురసము కఫమును శమింపజేసి వాతపిత్తముల బ్రకోపింపజేయును. కషాయరసము కఫపిత్తముల శమింపజేసి వాతమును బ్రకోపింపజేయును.

### షడ్రసములవీర్యము

మూ. రసాఃకట్వమ్లలవణాః వీర్యేణోష్ణాయథోత్తరమ్,
తిక్తఃకషాయోమధురస్తద్వదేవచశీతలః. ౧౯

వ్యా. పైజెప్పినరసములలో కటు-అమ్ల-లవణ రసములు మూడును ఒకటికన్న నొకటి (కటురసమునకన్న అమ్లరసంబును, దానికన్న లవణరసంబును) అధికముగ నుష్ణవీర్యము కల్గియుండును. తిక్తకషాయమధురరసములు మూడును పైజెప్పినరీతి నొకటికన్న నొకటి యధికముగ శీతవీర్యము కల్గియుండును. (ఇచ్చట వీర్య మనగ శక్తి.)

### లవణాదిరసముల స్నిగ్ధత్వాదితారతమ్యము

మూ. పట్వమ్లమధురాఃస్నిగ్ధాః స్వాదువిణ్మూత్రమారుతాః,
తిక్తాఃకటుఃకషాయశ్చరూక్షాబద్ధమలాస్తథా. ౨౦

వ్యా. లవణ-అమ్ల-మధురరసములు మూడును స్నిగ్ధములై మలమూత్ర అపాన వాతములను వెడలించును. తిక్త-కటు-కషాయరసములు మూడును రూక్షగుణముకల్గి మల మూత్రవాతములను బంధించును.

లవణాదిరసముల గౌరవలాఘవతారతమ్యము

మూ. పటోఽకషాయః తస్మాచ్చమధురాః గురుః,
లఘురమ్లఃకటుఃతస్మాత్తస్మాదపిచతిక్తకః. ౬౧

వ్యా. లవణరసమునకన్న కషాయరసంబును, దానికన్న మధురరసంబును, మిక్కిలి గురుతరంబై యుండును. అమ్లరసము లఘువును, దానికన్న కటురసము లఘుతరంబును, దానికన్న తిక్తరసము లఘుతమంబునై యుండును.

త్రివిధవిపాకములు, విపాకస్వరూపము

మూ. త్రిధావిపాకో ద్రవ్యస్యస్వాద్వమ్లకటుకాత్మకాః,
జాఠరేణాఽగ్నినాయోగాత్ యదుదేతిరసాన్తరమ్. ౬౨
రసానాంపరిణామాన్తే సవిపాకఇతిస్మృతః.

వ్యా. నానావిధద్రవ్యంబులును మధురవిపాకము, అమ్లవిపాకము, కటువిపాకము నని మూడువిధములైన విపాకము కల్గియుండును. విపాక మనః—భుజింపబడిన యాహార ద్రవ్యములయందు జఠరాగ్నిసంబంధమునంజేసి జీర్ణంబైన పిదప మధురాదిరసములకు గల్గు రసాంతరపరిణామము విపాక మనబడును. అట్టివిపాకము మధుర - అమ్ల - కటుభేద ములచే మూడువిధములుగ నుండు నని భావము.

మధురాదిరసములకు విపాకము

మూ. స్వాదుః పటుశ్చ మధురం; అమ్లోఽమ్లం పచ్యతే రసః. ౬౩
త్రయాణాం కటురన్యేషాం; పాకస్తుల్యాబలో రసైః.

వ్యా. మధుర-అమ్లరసములుగల ద్రవ్యములు మధురముగ విపాకము జెందును. అమ్లరసము అమ్లముగనే విపాకము జెందును. తక్కిన కటుక - తిక్త - కషాయరసములు మూడును కటువిపాకము కల్గియుండును. ఈమూడువిపాకములును ఆయారసమునకు సమానమైనశక్తి కల్గియుండును. (మధురవిపాకము మధురరసముతో సమానబలంబును అమ్లవిపాకము అమ్లరసముతో సమానగుణంబును, కటువిపాకము కటురసముతో సమాన గుణంబును నగు నని భావము.)

వింశతిద్రవ్యగుణములు

మూ. గురుమన్దహిమస్నిగ్ధశ్లక్ష్ణసాన్ద్రమృదుస్థిరాః. ౬౪

గుణాస్ససూక్ష్మవిశదాః వింశతిస్సవిపర్యయాః.

వ్యా. గురుత్వము, మందత్వము, శీతలము, స్నిగ్ధత్వము, శ్లక్ష్ణత్వము, సాంద్రత్వము, మృదుత్వము, స్థిరత్వము, సూక్ష్మత్వము, విశదత్వము అను నీ పదియును వీనికి విరుద్ధములైన పదిటితోఁగూడి యిరువదియు గుణము లగును. (ఈయిరువదిగుణంబులును ఆయాద్రవ్యము నాశ్రయించి యుండును).

ఇచ్చట గురుత్వమునకు లఘుత్వంబును, మాంద్యమునకు తీక్ష్ణత్వంబును, శీతమునకు ఉష్ణంబును, స్నిగ్ధమునకు రూక్షంబును, శ్లక్ష్ణమునకు ఖరంబును, సాంద్రమునకు ద్రవంబును, మృదువునకు కాఠిన్యంబును, స్థిరమునకు సరంబును, సూక్ష్మమునకు స్థూలంబును, విశదమునకు పిచ్ఛిలంబును వరుసగ విపరీతగుణంబు లని యెరుంగునది.

స్నేహనరూక్షణౌషధములు

మూ. గురుశీతసరస్నిగ్ధ మందసూక్ష్మమృదుద్రవమ్,
ఔషధం స్నేహనం ప్రాయః విపరీతం విరూక్షణమ్. ౬౪

వ్యా. గురు-శీత-సర-స్నిగ్ధ-మంద-సూక్ష్మ-మృదు - ద్రవము లను నీయెనిమిదిగుణములు గల్గినద్రవ్యములు ప్రాయికముగ స్నేహనములై యుండును. పైజెప్పినగుణములకు విరుద్ధములైన గుణములు కలద్రవ్యములు ప్రాయికముగ రూక్షములై యుండును. (విరుద్ధ గుణములను పైనిచెప్పినప్రకారముగ నెరుంగునది).

స్వేదనస్తమ్భనౌషధములు

మూ. స్వేదనం గురుతీక్ష్ణోష్ణం ప్రాయస్తమ్భనమన్యథా,
ద్రవం స్థిరం సరం స్నిగ్ధం రూక్షం సూక్ష్మం చ భేషజమ్. ౬౬
స్వేదనం స్తమ్భనం శ్లక్ష్ణం రూక్షసూక్ష్మసరద్రవమ్,

వ్యా. గురువుగను తీక్ష్ణముగను ఉష్ణముగనుండు ద్రవ్యము ప్రాయికముగ స్వేదనముగ (చెమటబుట్టించునదిగ) నుండును. పైచెప్పిన గుణములకన్న విరుద్ధములగుగుణములు కలద్రవ్యములు స్తంభనకరము లగును. మరియు ద్రవము, స్థిరము, సరము, స్నిగ్ధము, రూక్షము, సూక్ష్మము, అను నీగుణములు కలద్రవ్యము స్వేదన మగును. శ్లక్ష్ణత్వము, రూక్షము, సూక్ష్మము, సరము, ద్రవము, అను నీగుణములు కలద్రవ్యము స్తంభనకర మగును.

ద్వివిధవీర్యము

మూ. ఉష్ణశీతగుణోత్కర్షాత్ వీర్యం ద్విగుణముచ్యతే. ౬౭

వ్యా. పైజెప్పినద్రవ్యములయందు ఉష్ణగుణ మధికముగ నుండుటచే నుష్ణవీర్యం బనియు, శీతగుణ మధికముగ నుండుటచే శీతవీర్య మనియుం వీర్యము రెండువిధములు.

ఇచ్చట నీవిమర్శనము నెఱుంగునది:—వీర్య మన నేవస్తువుచే నేవిధమైన క్రియ చేయబడునో అయ్యది వీర్యము. ఇదియే ద్రవ్యనిష్ఠమైనశక్తి, లోకమునం దేవస్తువైనను వీర్యము లేకయుండుట లేదు. అట్టి వీర్యముచేతనే నానావిధక్రియలను ద్రవ్యము చేయును. ఈవిషయమును వాగ్భటాచార్యుడు "వీర్యం తద్యేన యా క్రియతే క్రియా, నావీర్యం క్రియతే కిఞ్చిత్ సర్వావీర్యకృతాహిసా" అను నీవాక్యముచే జెప్పెను. పలుదెరంగులైన ద్రవ్యములయందును పైచెప్పబడిన గురుమందాదిగుణము లిరువదియున్నను అందుష్ణగుణాధిక్యముచే నుష్ణవీర్యంబును, శీతగుణాధిక్యముచే శీతవీర్యంబు నగును. భగవంతునిసృష్టికి లోనగువ్యక్తావ్యక్త ప్రపంచమెల్ల నానావిధస్వభావముల గల్గియున్నను అగ్నిసోములగుణము నతిక్రమించియుండుట లేదు కావున గురుమందాదిగుణములు కల్గియున్నను అందు అగ్నిగుణంబైన యుష్ణంబైనను, సోమగుణంబైన శీతంబైనను ప్రబలముగ ప్రతివస్తువునందు నుండును. కాబట్టి కొన్ని ద్రవ్యములు ఆగ్నేయంబులును, కొన్ని సౌమ్యంబులునై యుండును. అందు ఆగ్నేయములు ఉష్ణవీర్యంబులుగను, సౌమ్యంబులు శీతవీర్యములుగ నుండును. కావున వీర్యము ఉష్ణశీతభేదముచే రెండుతెరంగులగును. ఈవిషయమును వాగ్భటాచార్యులు:—"నానాత్మకమపి ద్రవ్యం అగ్నిసోమౌమహాబలౌ, వ్యక్తావ్యక్తం జగదిదం నాతిక్రామతిజాతుచిత్" అనువాక్యముచే శాసించెను.

### ఉష్ణ-శీతవీర్యముల ప్రత్యేకగుణములు

మూ. తత్రోష్ణం భ్రమతృట్గ్లాని స్వేదదాహాసుపాతితాః,
శమం చ వాతకఫయోః కరోతి శిశిరం పునః. ౬౮
హ్లాదనం జీవనం స్తమ్భం ప్రసాదం రక్తపిత్తయోః.

వ్యా. పైచెప్పిన ఉష్ణశీతవీర్యములలో నుష్ణవీర్యము భ్రమమును, దప్పిని, బడలికను, చెమటను, తాపమును బుట్టించును. ఆహారమును శీఘ్రముగ జీర్ణింపజేయును. వాతకఫములను శమింపజేయును. శీతవీర్యము తృప్తిని కల్గించి బలమును బుట్టించును. స్తంభన మగును. రక్తమును పిత్తమును శమింపజేయును.

### ద్రవ్యప్రభావ్యము

మూ. రసాదిసామ్యే యత్కర్మ విశిష్టం తత్ప్రభావజమ్. ౬౯
దన్తీ రసాద్యైస్తుల్యాపి చిత్రకస్య విరేచనీ,
మధుకస్యచమృద్వీకా ఘృతంక్షీరస్యదీపనమ్. ౭౦

వ్యా. ఔషధద్రవ్యముల రెండుద్రవ్యములు రసవీర్యవిపాకములచే నొకటితో నొకటి సమముగ నుండినను, ఆద్రవ్యములు వేరువేరుగ పనిచేసినచో నయ్యది ప్రభావ

మనబడును (రసాదులచే రెండువస్తువులు సమముగ నుండునప్పుడు ఆవస్తువులు రెండును ఒకవిధమైన పనిచేయుట సమంజసము; ఐనను అట్లుగాక ఆరెంటిలో నొకటి యొకవిధమైన కృత్యమును, వేరొకటి యింక నొకవిధమైనకృత్యమును జేసినచో నయ్యది ఆద్రవ్యనిష్ఠ మైన ప్రభావ మనబడును. ఇదియే వస్తునిష్ఠశక్తి) ఈవిషయమునే తంత్రాంతరమున నిట్లు చెప్పిరి:—"రసవీర్యవిపాకాదిగుణాతిశయవానలం, ద్రవ్యస్వభావో నిర్దిష్టః యః ప్రభావ స్సకీర్తితః." అని.

ఆప్రభావ మెట్టు లనః:—దన్తి (నేపాళపుగింజలు) రసవీర్యవిపాకాదులచే చిత్ర మూలముతో సమానమైనదైన నున్నను తనయందలి రసవీర్యవిపాకములకన్న నతిరిక్తమైన ప్రభావముచే విరేచనములంజేయును. చిత్రమూలము విరేచనముచేయుటలేదు. ద్రాక్ష పండు రసవీర్యవిపాకములచే నతిమధురమునకు సమానమైనను అట్టి రసాదుల నతిక్రమించి తనప్రభావమునంజేసి మృదువిరేచనకారి యగును. అతిమధురముమాత్ర మట్లు విరేచన కారికాదు. ఘృతము (నెయ్యి) రసవీర్యవిపాకములచే పాలతో సమముగ నున్నను రస వీర్యాదుల నతిక్రమించి అగ్నిదీప్తి కల్గించును. పాలుమాత్రము అట్లు చేయుటలేదు. ఇదియే వస్తునిష్ఠప్రభావము. ఇత్తెరంగుననే ఆయాద్రవ్యమునందలి ప్రభావమును ఆయా కార్యమునుబట్టి యెరుంగునది.

### ద్రవ్యములకు మాత్రాదిభేదముచే కృత్యభేదనిర్ణయము

మూ. ఇతి సామాన్యతః కర్మ ద్రవ్యాదీనాం పునశ్చ తత్,
మాత్రాయోగక్రియాదేశకాలావస్థాదిభేదతః. ౭౦
విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యభేదేన భిద్యతే.

వ్యా. ఇత్తెరంగున ద్రవ్యమునకు సంబంధించిన రసగుణవీర్యవిపాకప్రభావముల యొక్కయు, ద్రవ్యములయొక్కయు కృత్యభేదములు సామాన్యముగ జెప్పబడెను. మరియు నాద్రవ్యరసాదులకృత్యములు పరిమాణము, సంబంధము, సంస్కారము, దేశము, కాల, అవస్థ మున్నగువానిభేదములచేతను; విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యభేదముచేతను పైజెప్పినరీతికంటె భిన్నంబులై యుండును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—ద్రవ్యములు విచిత్రప్రత్యయారబ్ధము లనియు, సమానప్రత్యయారబ్ధము లనియు రెండుతెరంగుల నుండును. అందు ఏద్రవ్యముచే ద్రవ్యములలోని రసవీర్యాదులకు సామాన్యముగ జెప్పబడినకర్మ భిన్నంబుగ నుండునో ఏద్రవ్యమునందు రసాదులకు కారణములగు మహాభూతములు వేరుగనుండునో, ఆరసాదు లకు ఆశ్రయమైన ద్రవ్యములకు కారణములైన మహాభూతములు వేరుగ నుండునో అట్టిద్రవ్యము విచిత్రప్రత్యయారబ్ధ మనబడును.

ఏద్రవ్యమునందు రసాదులకు కారణములగు మహాభూతములును, ఆరసాదులకు ఆశ్రయమైనద్రవ్యమునకు కారణములైన మహాభూతములును వేరువేరుగాక ఒకటేవిధముగ నుండునో అట్టిద్రవ్యము సమానప్రత్యయారబ్ధము.

(ద్రవ్యము నాశ్రయించియుండు రసవీర్యవిపాకప్రభావములకును అట్టి రసవీర్యవిపాకాదుల కాశ్రయమైనద్రవ్యమునకును పంచమహాభూతములు కారణములు. అట్టి పంచభూతములు ద్రవ్యమునకును ఆద్రవ్యము నాశ్రయించిన రసవీర్యాదులకును ఒకటే విధముగ నుండుట సాజము. అట్లున్నచో నవి సమానప్రత్యయారబ్ధములు. ముఖ్యకారణములైన పంచమహాభూతములు ప్రత్యయములు. (అవి భిన్నములుగాక సమానములై వానిచే నారంభింపబడిన ద్రవ్యములు సమానప్రత్యయారబ్ధములు) అయ్యవి క్షీరము, చక్కెర, చెఱకు మున్నగునవి సమానప్రత్యయారబ్ధములు. ఇవి తమతమరసాదుల కనుగుణముగ కృత్యములం జేయును. పైజెప్పినరీతికి భిన్నముగ రసాదుల కాశ్రయములగు ద్రవ్యములకు కారణములైన మహాభూతములు ఒకతీరుగను, అట్టిద్రవ్యముల నాశ్రయించియుండు రసవీర్యవిపాకాదులకు కారణములైన పంచమహాభూతములు మఱియొకవిధముగను ఉండునో ఆద్రవ్యములు విచిత్రప్రత్యయారబ్ధములు. అయ్యవి గోధుమలు యవలు మున్నగునవి. ఇవి రసాదుల కనుగుణములగు కర్మల జేయనేరవు.) అందు సమానప్రత్యయారబ్ధద్రవ్యము లనేకములుగ నున్నను వానియొక్క రసాదుల నుపదేశించుటచే వాని పరిజ్ఞానముచేతనే వానికృత్యములు సులభముగ గ్రాహ్యము లగును. విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యములకు సంబంధించినకృత్యములు ప్రత్యేకముగ నుపదేశించిన గాని బోధపడజాలవు. కావున వానికి వేరువేరుగ నుపదేశించుట యావశ్యకము.

### మాత్రావశ్యకత, అందు కుదాహరణము

మూ. మాత్రయా సేవితం మద్యం హన్తి రోగాం స్తదుద్భవాన్. 22
నిషేవ్యమాణం తిలశో విషమప్యమృతాయతే,
భజతో విషరూపత్వం తుల్యాంశే మధుసర్పిషీ. 23
క్షారోఽమ్లరససంయోగే మధురో భవతి క్షణాత్,
ఉత్తుణ్డకాస్త్రిస్తుకేన తిక్తతామధురాయతే. 24

వ్యా. (మాత్ర యన పరిమాణము. ఇయ్యది యౌషధములుసేవించుటకును ఆహారమును భుజించుటకును ముఖ్యముగ నావశ్యకము. "అగ్నిమూలం బలం పుంసాం బలమూలం హి జీవితం" అనుప్రమాణముచే జీవితమునకు శరీరబలము ముఖ్యకారణ మనియు అట్టిబలమునకు జాఠరాగ్ని ముఖ్యకారణ మనియు దెలిసెడి. అట్టి జాఠరానలము ఆహారా

దుల పరిమాణము నాశ్రయించియుండును. దీనికి ఎంతపరిమాణము నిశ్చయింపబడినదో అంత కన్న నధికముగ నుపయోగించునెడ జాఠరానలము శిప్పక చెడును. కావున పరిమితి నను సరించి యాహారాదుల సేవింపందగు. గుర్వాదిగుణభూయిష్ఠములగు ద్రవ్యములు పరి మాణము నపేక్షించియే స్వకృత్యములజేయ సమర్థము లగును. ఈవిషయమునే వాగ్భటా చార్యులు "హోత్రాశీ సర్వకాలం స్యాత్ మాత్రావ్యాగ్నేః ప్రవర్తికా మాత్రం ద్రవ్యా ణ్యపేక్షన్తే గురూణ్యాపి లఘూన్యపి" అని యుపదేశించిరి. అట్టి మాత్రానుసారమున గల్గు గుణదోషము లీక్రింద నుదాహరణరూపముగ జెప్పబడును.)

మద్యము "యే విషస్య గుణాః ప్రోక్తాః తేஉపిమద్యేవ్యవస్థితాః" అనువచన ప్రకారను విషమునకు జెప్పినగుణములన్నియును కల్గి మిక్కిలి తీవ్రమై ప్రాణాంతకముగ నుండును: అట్టిమద్యమును తగినపరిమాణముచే సేవించినచో దాన సంభవించిన రోగముల నన్నిటిని పోనడచును. విషముప్రాణహరమైనను దానిని తగిన ప్రమాణముచే నూగింజంత మాత్రము నానాట సేవించి యభ్యాసముచేసినచో నమృతమునుబోలె రసాయనమై జరా మరణములగూడ బారందోలును. (ఇది మాత్రాభేదమున గల్గుగుణభేదము.) తేనెను నేతిని రెంటిని సమభాగములుగూర్చి కలిపి సేవించినచో విషరూపమునొంది ప్రాణాంతకమగును. క్షారము (ఉప్పు) అమ్లరసముతోగూడినచో క్షణకాలముననే మధురరసముగ పరిణమిం చును. కాకిదొండను ఈడపండుతో గూర్చినచో దానికి సహజముగ నుండుచేదును విడిచి మధురమగును. (ఈ రెండుయోగములును ద్రవ్యసంయోగమున గల్గుగుణవిశేషము).

## ద్రవ్యసంయోగమున గల్గుగుణభేదము

మూ. హిఙ్గుగైరికసిన్ధూత్థం గన్ధవర్ణరసాదికమ్,
పూగతామ్బూలసఙ్ఖేభ్యః గన్ధవర్ణరసోద్భవః. ౭౫

వ్యా. ఇంగువ, గైరికము (కావిరాయి), లవణము, ఈమూడునుచేరి గంధమును వర్ణమును రసమును కల్గించును. మరియు పోకచెక్కలు, తమలపాకులు, శంఖము (శంఖ ముచే నైనసున్నము) ఈమూడును పరిమళమును వర్ణమును ద్రవమును బుట్టించును.

మూ. కోద్రవో హన్త్యసృక్పిత్తం కరోత్యేవ విదాహిభిః,
కుష్ఠం తత్కార్యాపితిలాః హన్తి భల్లాతకైస్సహః. ౭౬
గుడః కర్తాஉగ్నిసంస్తమ్భం సహీనస్త్వభయాదిభిః,
జీవనీయమజాక్షీరం; విషం లేశేనమృత్యవే. ౭౭
తుల్యేஉపిహాతేஉన్యోన్యం విషే స్థావరజఙ్గమే,
చతుష్ప్యోஉపిహిగోధూమో వాతతోవాతహృద్భవః, ౭౮

గః డాత్త్రోయాచ్చు సుతరాం మూత్రలంగురు పానకమ్,
గరీయోగుడపథ్యుక్తం రసాలాచాపి శుక్రలా. ౭౯

వ్యా. ఆరుకలు రక్తపిత్తమును హరించును. అయ్యవి విదాహిద్రవ్యములతోఁగూడినచో రక్తపిత్తమును కల్గించును. నువ్వులను జీడిగింజలతోఁగూడజేర్చి యుపయోగించినచో కుష్ఠమును హరించును. బెల్లము జాఠరాగ్నిని స్తంభింపజేయును. అయ్యది కరకకాయ మున్నగువానితోఁగూడినపుడు అగ్నిని జ్వలింపజేయును. మేకపాలు బలకరము. స్థావరజంగమరూపముచే రెండువిధముల నుండువిషము లేశమాత్రమైనను చంపును. అయ్యవి గుణముచే తుల్యములయ్యును స్థావరవిషముచే జంగమ విషంబును. జంగమవిషముచే స్థావర విషంబును ఒకటిచే నొకటి హరించును. గోధుమలు నేత్రములకు హితములు; అటయ్యును వాతమును కల్గించును. యవలు గోధుమములబోలియున్నను వాతహారములు. బెల్లము జలముతో కలిసి పానక మగును. అయ్యది బెల్లమునకన్నను నీళ్లకన్నను గురుత్వము గల్గి మూత్రమును పుట్టించును. రసాలయనుద్రవము బెల్లముతోడను పెరుగుతోడను కూడి యున్నచో గురుత్వముకల్గి శుక్రమును వృద్ధినొందించును.

## సంస్కారవిశేషమున గల్గు గుణభేదము

మూ. ఆర్ద్రికాజ్జాయతే శుణ్ఠీ సంస్కారేణ లఘీయసీ,
లఘుభ్యోఽపిచ వస్తుభ్యో గురవస్సక్తుపిణ్డికాః. ౮౦
శాలిపిష్టో గరీయస్త్వం గోధూమాదపి గచ్ఛతి,
లఘుపిత్తహరా లాజాః వ్రీహితో గురుపిత్తళాత్. ౮౧
సజ్జాగ్రిహిణోలఘూర్ముద్గాత్ గుల్మార్శోభేదనాగురుః,
ఆమం గ్రాహికరం తక్రం నాగరీకృతమార్ద్రికమ్. ౮౨

వ్యా. అల్లమువలన శుంఠి కల్గును. అయ్యది సంస్కారవిశేషముచే లఘువగును. సత్తుపిండి లఘుపదార్థములచే చేయబడినను గురుత్వము కల్గియుండును. బియ్యముచే జేసిన సత్తుపిండి గోధుమసక్తువులకన్న గురువుగ నుండును. గురుత్వమును కల్గించునవియు పిత్తకరంబులునైన వడ్లచే చేయబడినను పేలాలు లఘుగుణంబులును పిత్తమును హరించునవియు నగును. మలమును బంధించునవియు లఘుగుణముకల్గినవియునైన పెసలచేసైన సత్తుపిండి గురుత్వముకల్గి గుల్మమును అర్శస్సును భేదించునది యగును. తక్రము ఆమముగ నుండినచో (పచ్చిమజ్జిగ) గ్రాహికర మగును. అల్లము సంస్కారవిశేషముచే శుంఠిగ మారినచో నదియు గ్రాహి యగును.

మూ. శ్లక్ష్ణం తనుః ఘనో లేపః చన్దనస్యాపి దాహకృత్,

త్వగ్గతస్యోష్ణణో ధాతోశ్శీతకృత్త్వన్యథా గురుః. ౮౩

వ్యా. చందనమును పలుచగ శరీరముపై బూసికొనిన శ్లక్ష్ణముగ నుండును. మిక్కిలి దట్టముగ బూసికొనిన తాపమును బుట్టించును. త్వగ్గతమైనవేడికిని రసధాతువునకును చలువ కల్గించును. వేరువిధముగ నుపయోగించిన గురుత్వము కల్గియుండును.

—— దేశకాలభేదముచే గల్గుగుణభేదము ——

మూ. ధాతకీ గుడతోయాని కారణం మద్యసుక్తయోః,

దృష్టస్పర్శే హిమం ద్రవ్యం శ్రోత్రస్యోష్ణం తు పూరితమ్. ౮౪

వాతలం వాతకోపీ చ వర్షాసు మధుశస్యతే,

దివాస్వాపాజ్జరాం యాతి శుక్తం పూర్వేద్యుఃపద్యతః. ౮౫

వ్యా. మద్యమునకును సుక్తము (పులిసినకల్లు) నకును ఆరెపువ్వు బెల్లము నీళ్లు ఈ మూడును కారణమై యుండును. అట్టి మద్యసుక్తములు రెండును వానికి కారణములైన ద్రవ్యములును స్పర్శమున చల్లనైనను చెవిలోబోసినచో నుష్ణస్పర్శమగును. వాతమును కల్గించునదియు వాతమును ప్రకోపింపజేయునదియు నగును. వర్షకాలమున మద్యము మిక్కిలి ప్రశస్తమగును. ముందుదినమున చేయబడినసుక్తము పగటినిద్రచే జీర్ణమగును.

—— కాలభేదమున గల్గుగుణభేదము ——

మూ. స్థూలస్థవిరబాలాదౌ వమనాదౌ నిషిధ్యతే,

వ్యా. పైజెప్పబడినసుక్తము స్థూలకాయులకును, ముసలివారికిని, బాలురు మున్నగువారికిని, వమనామనాదిరోగములచే బీడితులకును పానమున కర్హముకాదు.

మూ. రసాయనం కాకమాచో సద్యః పర్యుషితా విషమ్. ౮౬

ఛర్దిహృద్రోగగుల్మార్శ్సఃపమనేషు చికిత్స్యతే.

వ్యా. కాచిచెట్టు ఆకు మున్నగునవి అప్పుడే తేబడినవి రసాయనమగును. ఒక దినము మారినచో నదియే విషతుల్యమగును. అయ్యది వాంతులయందును, హృద్రోగము నందును, గుల్మమునందును, అర్శోరోగమునందును, మిక్కిలి హితకరముగ నుండును.

మూ. నిపీడమపి నిర్దిష్టం వస్తేరర్శసకుష్ఠినోః,

సర్వాఙ్గవ్యాపిసం వాదే శుక్రవత్సం శ్రితం విషమ్. ౮౭

తస్మాంసముపయోగాయ మాంసవస్త్రేషుపత్యతే.

వ్యా. అర్శోరోగమునందును కుష్ఠములయందును వస్తియంత్రపీడనము నిషిద్ధము కాదు. సర్వశరీరమున వ్యాపించినదానిని చెప్పునపుడు శుక్రమునుబోలె విషముకూడ సర్వ

శరీరమున వ్యాపించియుండునని చెప్పదగును, అట్టివిషము కలజంతువులమాంస ముపయోగించువిధము మాంసవర్గములయందు చెప్పబడెను.

మూ. మన్దాగ్నిర్భవతి ప్రాయః......... ౮౮

మూ. విషఘ్నినాపి పయసా దేహేఽహేర్వర్ధతే విషమ్,
 వినాపి చో పయోగే నమణిమన్త్రాదికార్యకృత్. ౮౯

వ్యా. పాలు సాధారణముగ రసాయనమై విషహరముగ నుండును; అయినను అట్టి పాలను త్రాగుటవలన సర్పములకు విషము వృద్ధినొందును. ("పయః పానంభుజఙ్గానాం కేవలం విషవర్ధనమ్" అను నార్యోక్తిచే పాలుద్రాగిన సర్పములకు విషము వృద్ధినొందునని తెలిసెడి). మణులు మన్త్రములు మున్నగునవి వానిని చికిత్సారూపముగ శరీరమునం దుపయోగింపకున్నను (విషమును హరించుట) మున్నగుకార్యములను జేయుచున్నవి.

నేతిసామాన్యగుణము

మూ. సర్పిస్స్నిగ్ధతరం హన్తి నార్దితం నవనీతవత్,

వ్యా. వెన్నకంటె నెయ్యి మిక్కిలి స్నిగ్ధమైనది. అట్లయ్యును అర్దితవాతమును వెన్నహరించినట్లు నెయ్యి హరింపనోపదు.

ఉల్లిగడ్డలచే గల్గినతాపశమనోపాయము

మూ. స్వేదైర్యాతిశమం దాహః ప్రాయోలశున వాసజః. ౯౦

వ్యా. ఉల్లిగడ్డలచే నైనమంట స్వేదముచే ప్రాయికముగ శాంతినొందును.

మూ. ఛర్దిఘ్నం మక్షికావిట్తు మక్షికైవమతానతు,

వ్యా. మక్షికల (తేనీగెల) మలరూపమైనతేనె వాంతులహరించును. తేనీగెలు మాత్రము వాంతుల హరించుటలేదు.

మూ. స.........శేభ్యో వృశ్చికానాం సముద్భవః. ౯౧
 తైరేవ తే పునర్దష్టాః సద్యో జహాతి జీవితమ్,
 స్వయమేవ విషం తీవ్రం తాన్పునర్నాతిబాధతే. ౯౨
 వాతప్రవృద్ధే తిమిరే సిరామోక్షో విధీయతే,
 దుష్టాస్రసంగమే పీష్టో నాస్రభీతే సిరావ్యధః. ౯౩
 అహితాస్సక్తవశ్శుష్కాః హితాస్తే తు ప్రమేహిణామ్,
 తదేవ మద్యం మద్యస్య విషస్య తు విషాన్తరమ్. ౯౪
 కఫే లఙ్ఘనసాధ్యేఽపి కస్యచిద్ జ్వరగుల్మయోః,
 తుల్యాపి దేశకాలాద్యా లఙ్ఘనంసనమంమతమ్. ౯౫

వ్యా. విషము స్వభావముచేతనే మిక్కిలి తీవ్రమైనది. అట్లైనను విసర్పాదులచే విషము జనించునో అట్టిజంతువుల బాధించుటలేదు. వాతవృద్ధిచే గల్గినతిమిరరోగమున సిరావ్యధనముచే రక్తమోక్షము విధింపబడినది. రక్తమును చూచి భయపడువారివిషయమున రక్తముచెడియున్నప్పుడును సిరావ్యధనముచే రక్తమోక్షముచేయుట యుక్తముకాదు. ప్రమేహరోగము కలవారికి ద్రవములేనిసత్తుపిండి హితముకాదు. అయ్యది ద్రవముతో గూడిన మిక్కిలి హితకరమగును. మద్యము మిక్కిలి తీవ్రమైనది. అయినను మద్యపానముచే గల్గినరోగములయందు ఆమద్యమే యౌషధమగును. ఒకవిషమునకు వేరొకవిషము ఔషధమగును. "కఫేలంఘనపాచనమ్" అని చెప్పినప్రకారము కఫము కేవలము లంఘనసాధ్యము; అయినను జ్వరమునకు గుల్మములకు కఫము కారణమైనపుడు ఈరెంటికిని దేశకాలములు సమములుగ నున్నను లంఘనము జ్వరగుల్మములురెంటికిని సమానచికిత్స కానోపదు. (కఫజ్వరమునకుమాత్రము లంకణము ఉచితచికిత్స యగునుకాని కఫజగుల్మమునకు తగదనుట).

### విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యగుణభేదములు

మూ. మధురం శ్లేష్మలం ప్రాయః జీర్ణాచ్ఛాలియవాదృతే,
ముద్గాద్గోధూమతః క్షౌద్రాత్ సితాయా జాఙ్గలామిషాత్. ౯౬

వ్యా. ప్రాయికముగ మధురరసము కల్గినపదార్థములు కఫమును వృద్ధినొందించును. ప్రాతవడ్లు, యవలు, పెసలు, గోధుమలు, తేనె, చక్కెర, జాంగలజంతువులమాంసము, ఇవి మధురరసములైయున్నను కఫమును వృద్ధినొందించుటలేదు.

మూ. ప్రాయోఽమ్లం పిత్తజనకం దాడిమామలకాదృతే,
అపథ్యం లవణం ప్రాయః చక్షుషోఽన్యత్ర సైన్ధవాత్. ౯౭

వ్యా. అమ్లరసముకల్గద్రవ్యములు ప్రాయికముగ పిత్తమును వృద్ధినొందించును. దానిమ్మపండ్లును ఉసిరికకాయలునుమాత్రము అమ్లరసములైనను పిత్తమును వృద్ధినొందించకుండుటయేకాక పిత్తమును శమింపజేయును. నేత్రములకు లవణరససామాన్యము హితము కాదు. సైంధవలవణముమాత్రము హితకరము.

మూ. తిక్తం కటు చ భూయిష్ఠమవృష్యం వాతకోపనమ్,
ఋతేఽమృతాపటోలీభ్యాం శుణ్ఠీకృష్ణారసోనతః. ౯౮
కషాయం ప్రాయశశ్శీతం స్తమ్భనం చాఽభయాం వినా,
స్వాదుర్గురుశ్చ గోధూమో వాతజిద్వాతకృద్యవః. ౯౯

వ్యా. తిక్తరసంబును, కటురసంబును కలద్రవ్యములు ప్రాయికముగ వృష్యములు గావు. వాతమును ప్రకోపింపజేయును. తిప్పతీగె, చేదుపొట్ల, శుంఠి, పిప్పళ్లు, వెల్లుల్లి పాయలు ఇవిమాత్రము కటుతిక్తరసములు కల్గియున్నను పైజెప్పినగుణములకు విరుద్ధముగ వృష్యంబులును వాతహరంబులు నైయుండును. ప్రాయికముగ కషాయరసము శీతవీర్యంబును స్తంభనంబు నై యుండును. కరకకాయలు మాత్రము కషాయరసము కల్గియున్నను ఉష్ణవీర్యమై స్రంసనమగును. గోధుమలు మధురరసంబులై గురుత్వము కల్గియున్నను వాతమును హరించును. అట్టి రసగుణములు కల్గియున్నను యవలు వాతమును వృద్ధినొందించును.

మూ. ఉష్ణామత్స్యాఃపయశ్శీతం కటుస్సింహోనసూకరః,

వ్యా. మత్స్యములు మధురరసంబును గురుత్వంబును కల్గియుండినను అందు నియతమైన శీతవీర్యములేక విరుద్ధమైన ఉష్ణవీర్యము కల్గియుండును. పాలుమాత్రము మధురరసంబును శీతవీర్యంబును కల్గియుండును. సింహామాంసము మధురరసంబును గురుణంబును కల్గియున్నను రసమున కనుగుణమైన విపాకములేక కటువిపాకము కల్గియుండును. పంది మాంసముమాత్రము రసగుణముల కనుగుణమైన విపాకము కల్గియుండును.

## ప్రభావమున గల్గుగుణభేదము

మూ. మణిమన్త్రౌషధాదీనాం తత్కర్మ వివిధాత్మకమ్. ౧౦౦
శల్యాకర్షణపుంజన్మరక్షాయుర్దివసాధికమ్,
దర్శనాద్యైరపి విషం యన్నియచ్ఛతి చాగదః (చాతకః). ౧౦౧
విరేచ యతియద్వృష్యమాశుశుక్రం కరోతి చ,
ఊర్ధ్వాధోభాగికం యచ్చ ద్రవ్యం యచ్ఛమనాది చ. ౧౦౨
కటుపాకరసస్నిగ్ధగురుత్వైర్వాః కఫవాతజిత్,
లశునే వాతకఫకృత్ స తు తైరేవ యన్గుణైః. ౧౦౩
మిథో విరుద్ధాన్ వాతాదీన్ రోహితాద్యాః జయన్తియత్,
కుర్వన్తి యవకాద్యాశ్చ తత్ప్రభావవిజృమ్భితమ్. ౧౦౪
హితాఽహితత్వేఽప్యేకాన్తనియమోఽస్మాదనిశ్చితః.

వ్యా. మణులు, మంత్రములు, కొన్నియౌషధములు మున్నగునవి (వానిని యౌషధరూపముగ నుపయోగింపకున్నను) శల్యాకర్షణము, పురుషజన్మము, పిశాచాది బాధలనుండికాపాడుట, నియతకాలమున నధికాయుష్యము మున్నగు నానావిధకార్యములను జేయుచున్నవి. (శరీరమునం దినుపముక్కలు గ్రుచ్చుకొనియుండిన కాంతమును

చూపినచో నాముక్కులు వెడలును. గర్భిణీస్త్రీకి పుంసవన సంస్కారమున మఱ్ఱియూడల రసమును 'పుంసవనమసి' ఇది మున్నగుమంత్రములచే నభిమంత్రించి ముక్కులోపిండిన పురుష శిశువు కలుగును. మంత్రప్రయోగమువలన భూతాదులు నివర్తించును. రసాయనాదిసేవనముచే ననంతమగునాయువు వృద్ధియగును. ఇవి మున్నగు కృత్యములు రసవీర్య విపాకాది సంబంధములేకయే కేవలము ప్రభావమున పైజెప్పిన మణిమంత్రాదులు చేయు నని భావము.

మరియు చాతకపక్షి (చకోరము) పాము కఱచినవానిని తనకంటితో చూచిన విష మును హరించును. వృష్యద్రవ్యము శరీరమునందలి శుక్రమును వెడలించి మరల నప్పుడే వృద్ధి నొందించును. మరియు కొన్ని ద్రవ్యములు శరీరమునందలి యూర్ధ్వభాగమున గల దోషములను (వమనాదులచేత) శమింపజేయును. కొన్నియౌషధములు (విరేచనములచేత) శరీరమునం దధోభాగముగ గలదోషముల శమింపజేయును.

వెల్లుల్లి కటురసంబును కటువిపాకంబును స్నిగ్ధత్వగురుత్వగుణంబులును కల్గియుం డును. అట్టిగుణములచేత కఫవాతముల హరించును. నీరుల్లి అట్టిగుణములు కల్గియున్నను పైజెప్పినకార్యమునకు విరుద్ధముగ కఫవాతముల వృద్ధినొందించును.

మరియు ములుకోడుగ మున్నగునవి పరస్పరవిరుద్ధములగు వాతాదిదోషముల హరించును. యవలు మున్నగు కొన్ని యౌషధులు రసవీర్యాదులకు విరుద్ధముగ వాతాదు లను కల్గించును. ఇట్టి కార్యములంజేయుట ద్రవ్యములు తమయందలి రసవీర్యవిపాకాదుల కన్న నతిరిక్తమై యచింత్యమైన ప్రభావముచేతనే యని భావము. ద్రవ్యములయందు పైజెప్పినరీతిగ రసవీర్యవిపాకాదులకన్న ప్రభావ మొకటి యతిరిక్తముగ నున్నది కావున నియతముగ నిది హితము, ఇది యహితము నని నిర్ణయించి చెప్పనలవిగాకున్నదని భావము.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—ద్రవ్యములయందు సాధారణముగ మృద్వాదిగుణంబులును, మధురాదిరసంబులును, శీతాదివీర్యంబులును, మధురాదివిపాకంబు లును కల్గియుండును. అట్టిద్రవ్యములు వానియందలి రసాదులచే తత్తదనుగుణములైన కృత్యములంజేయుచుండును. కొన్ని ద్రవ్యములు అటుగాక స్వనిష్ఠరసాదులకు విరుద్ధములగు కృత్యములంజేయును. విరుద్ధములగు కృత్యములంజేయుశక్తి ఆద్రవ్యములయందు కల్గియుం డును. అదియే ప్రభావమని పైనిచెప్పబడినది. అట్టిప్రభావము ద్రవ్యముల కెట్లు సంభవించె నన విచిత్రప్రత్యయారబ్ధములగుటచే గల్గినదని పైనినిరూపింపబడినది. విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యములు తమయందలిరసాదులకు వ్యతిరేకముగ ప్రభావముచే రసాదివిరుద్ధకార్యముల గల్గించును. సమానప్రత్యయారబ్ధద్రవ్యములు తమయందలిరసాదుల కనుగుణముగ సమాన కార్యములంజేయును. అట్టిప్రభావము ఆయాద్రవ్యముచే గల్గుకార్యమునుబట్టి యూహిం

పందగుసుగాని ఇది యిట్టి ప్రభావము కల్గినదని నిర్ణయించిచెప్ప శక్యంబుకాదు. ఈవిషయ మునే చరకాచార్యులు "ప్రభావోఽచిన్త్య ఉచ్యతే" అని యుపదేశించిరి. ద్రవ్యముల యందు ప్రభావ మొకటి రసాదులకన్న భిన్నముగ ననిర్వచనీయమై యుండుటంజేసి ఈద్రవ్యము హితము, ఇది యహితము నని నిరూపించిచెప్ప నలవికాదు. పైజెప్పినరీతిగ విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యములకృత్యములును, సమానప్రత్యయారబ్ధద్రవ్యములకృత్యంబు లును ఈతంత్రకారునిచే సంగ్రహముగ "రసాదిసామ్యే యత్కర్మ" అను నరువది తొమ్మిదవశ్లోకము మొదలుజేసి, "తత్ప్రభావవిజృమ్భితం" అను నూటనాల్గవశ్లోకమువరకుం గలగ్రంథముచే నిరూపింపబడినది. ఇది యుదాహారణరూపముగ జెప్పబడినదిగాన తక్కుం గలద్రవ్యములయందును విచిత్రప్రత్యయారబ్ధత్వ సమానప్రత్యయారబ్ధత్వభేదములను దానగల్గు ప్రభావవిశేషముమ వానికృత్యములబట్టి విజ్ఞు లూహించుకొనదగును.

విరుద్ధగుణసంయోగమున నధికగుణప్రాబల్యము

మూ. విరుద్ధగుణసంయోగే భూయసాల్పంహిజీయతే. ౧౦౫

వ్యా. ఒకద్రవ్యమునందు పరస్పరవిరుద్ధములగు రసవీర్యాదులు అనేకముగ జేరి యుండునపుడు అవివిరుద్ధగుణములలో నేవి యధికముగ నుండునో దానిచేత తక్కువగ నుండు రసవీర్యాదులు జయింపబడును. (తక్కువగనున్న రసాదుల తిరస్కరించి యెక్కు వగనున్న రసవీర్యాదులకృత్యమును ఆద్రవ్యముచేయు నని భావము).

ఇచ్చట నీయుదాహారణము నెరుంగునది:—ఆవుపాలయందు శీతవీర్యంబును, మధురరసముచేగల్గిన స్నేహగౌరవంబులును కలవు. ఇచ్చట శీతవీర్యముచే వాతమును వృద్ధిచేయవలసియున్నను, దానికి విరుద్ధములైన స్నేహగౌరవగుణములు రెండును బలిష్ఠ ములు. కావున అట్టిగుణబాహుళ్యమునంజేసి పాలు వాతహర మగును. తక్కుంగల ద్రవ్య ములయందును పరస్పరవిరుద్ధగుణముల యాధిక్యమునుబట్టి యిత్తెరంగుననే కార్యము నెరుంగునది.

రసాదినైసర్గికబలము

మూ. రసంవిపాకః తౌవీర్యం ప్రభావస్తాన్వ్యపోహతి,
బలసామ్యేరసాదీనాం ఇతినైసర్గికంబలమ్. ౧౦౬

వ్యా. రస-విపాక-వీర్య-ప్రభావములతో రెండేనియైనను, మూడేనియైనను, నాల్గు నైనను సమానబలములై యుండునేని రసమును విపాకంబును, రసవిపాకములరెంటిని వీర్యం బును, రసవిపాకవీర్యములమూటిని ప్రభావంబును తిరస్కరించి పనిచేయును. ఇదియ రసవిపాకవీర్యప్రభావములకు స్వాభావికమైన బలము. ఒకద్రవ్యమున మధురాదిరసంబును

విపాకంబులు సమానబలములై యుండునెడ రసమును ధిక్కరించి విపాకము పనిచేయును. నేనెయందు మధురరసము కలదు. కటువిపాకము ఈ రెండును సమానబలములు. అట్టియెడ కటువిపాకము వాతనాశకంబైన మధురరసమును తిరస్కరించి స్వకృత్యమైన వాత ప్రకోపమును జేయును.

ఒకద్రవ్యమున రసవిపాకవీర్యములు సమములుగనున్నయెడల రసవిపాకములరెండి టిని తిరస్కరించి వీర్యము తనకృత్యమును జేయును:—ఎనుబోతుమాంసము రసవిపాక ములచే మధురంబును, వీర్యముచే నుష్ణంబును నైయుండును. అట్టివీర్యము పిత్తశామకము లగు మధురరసవిపాకముల తిరస్కరించి తనకృత్యమగు పిత్తప్రకోపమును జేయును.

ఒకద్రవ్యమున రసవిపాకవీర్య ప్రభావములు నాల్గును సమానబలములై యున్న తరి రసవిపాకవీర్యములమూడిటిని ధిక్కరించి ప్రభావము తనకృత్యమును నిర్వర్తించును. అమ్లరసవిపాకంబులును ఉష్ణవీర్యంబునైనమద్యము తనయందలి రసవీర్యవిపాకముల మూడి టిని ధిక్కరించి ప్రభావమునం జేసి క్షీరమును వృద్ధినొందించును. ఇది రసవిపాకవీర్యములకు విరుద్ధము. ఇత్తెరంగున తక్కినద్రవ్యములకును రసవిపాకవీర్యప్రభావముల కుత్తరోత్తర ప్రాబల్యము నెరుంగునది.

### ద్రవ్యనిశ్చయమునకు శాస్త్రానుభవముల యావశ్యకత

మూ. తస్మాద్రసోపదేశేన నసర్వం ద్రవ్యమాదిశేత్,
దిశానయా శేషమపి స్వయమూహ్య తు బుద్ధిమాన్.
నశాస్త్రమాత్రకరణః నచాఽనామోచితాగమః. ౧౦౭

వ్యా. పైజెప్పినరీతిగ ద్రవ్యములు రసాదిబలముల భేదము ననుసరించి ఆయాకృత్య ములజేయును కావున కేవలము ద్రవ్యమునందలి రసమునుమాత్రము గమనించి ద్రవ్య కృత్యముల నిర్ణయింపదగదు. పైజెప్పినమార్గముననే తక్కినద్రవ్యములకును రసాదిభేదముల వానిబలాబలమును తనబుద్ధిచేతను శాస్త్రప్రమాణముచేతను గమనించి యుపయోగించునది. కేవలము శాస్త్రమాత్రమునైనను ఊహామాత్రముచేనైనను ద్రవ్యమును నిశ్చయింపంజనదు.

మూ. రసేనవీర్యేణగుణైశ్చకర్మ ద్రవ్యంవిపాకేనచయద్విదధ్యాత్,
సద్యోఽనవాతత్కురుతే ప్రవాసాత్ హితోఽరస స్తత్రనగోచరోఽస్తి.

ద్రవ్యము తనయందలిరసముచేనైనను, వీర్యముచేనైనను, గుణములచేనైనను, విపా కముచేనైనను పనిచేయును. అట్టిపనిని కొన్నియౌషధములు అప్పుడే చేయును. కొన్ని కొంతకాలమునకు పనిచేయును. కొన్ని పనిచేయక యూరకుండును. కావున రసమును మాత్రము గమనించి హిత మని నిర్ణయించుటకు వైద్యునకు సాధ్యము కానోపదు.

ఇతి శ్రీనాథపణ్డితకృతే పరహితసంహితాయాం
సాధారణకాణ్డే ప్రథమోఽధికారః

# పరహితసంహిత

## అష్టాఙ్గకాణ్డే, ద్వితీయో౽ధికారః

అవతారిక:— పైయధికారాన్తమున "రసేనవీర్యేణ...గోచరో౽స్తి" అనుశ్లోకము చేత ద్రవ్యము రసవీర్యగుణవిపాక ప్రభావములచే పనిచేయు నని చెప్పబడినది. అట్టిరస గుణాదులు పైయధికారమున నిరూపింపబడినవి. అయ్యవి ద్రవ్యము నాశ్రయించియుం డునుగాన నీరెండవయధికారమున రసాదుల కాశ్రయమైన ద్రవ్యభేదమును ఆయాద్రవ్య మునకు సంబంధించిన రసగుణాదులును వానికృత్యములును నిరూపింపబడును. అందును ఆహారమునకు సంబంధించి ధాన్యవర్గము శరీరధారణమునకు ప్రధానమగుటంజేసి ధాన్య వర్గము తొలుత చెప్పబడును. అట్టిధాన్యములు శూకధాన్యమనియు శింబిధాన్యమనియు రెండు తెరంగులు. ముండ్లు (నూగు) కల్గిన శాలిషష్టికములు మున్నగునవి శూకధాన్య మనియు, కవచమువలె నుండుకాయలతో నుండు మినుములు పెసలు కందులు సెనగలు మున్నగునవి శింబి(కాయ)ధాన్యమనియు నన్వర్థముగ జెప్పబడును. ఈరెంటియందును శూకధాన్యము కేవలము అన్నరూపమున శరీరధారణమునకు ముఖ్యముగ నుపకారకము కావున తొలుత జెప్పబడును.

అథ ద్రవ్యనిశ్చయాధికారః,—

రక్తశాల్యాదిశూకధాన్యభేదము వాని సామాన్యగుణములు

మూ. రక్తోమహాన్సకలమో యేచాన్యేశాలయశ్శుభాః,
స్వాదుపాకరసాః స్నిగ్ధావృష్యాః బద్ధాల్పవర్చసః. ౧
కషాయానురసాః పథ్యాః లఘవోమూత్రలాహిమాః,

వ్యా. రక్తశాలి (ఎఱ్ఱనిరాజనములు), మహాశాలి (పెద్దసంబావులు), కలమధాన్య ములు, ఇవిగాక సారాముఖములు, దీర్ఘశూకములు, మున్నగునవి శాలిధాన్యములని చెప్ప బడును. (వరిధాన్యము లనుట.) ఈవరిధాన్యములు రసపాకములచే మధురంబులును, స్నిగ్ధంబులును, వృష్యంబులును, మలమును కొద్దిగజేసి బంధించునవియు, కషాయరస మను రసమును గల్గినవియు, పథ్యకరంబులును, లఘుగుణంబులును, మూత్రకరంబులును, శీతవీర్యంబులు నై యుండును.

రక్తశాలిధాన్యగుణము

మూ. శూకజేషువర స్తత్ర రక్త స్తృష్ణాత్రిదోషహా, ౨

వ్యా. పైజెప్పిన శూకధాన్యములలో రక్తశాలిధాన్యము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఇయ్యది దప్పి నణచును. త్రిదోషముల హరించును.

యావకాదిధాన్యగుణము

మూ. యావకాః హాయనాః పాంసుబాష్పనైషధకాదయః,
స్వాదూష్ణాః గురవః స్నిగ్ధాః పాకేఽమ్లాః శ్లేష్మపిత్తలాః. 3
సృష్టమూత్రపురీషాశ్చ పూర్వం పూర్వం చ నిన్దితాః,

వ్యా. యావకము, హాయనము, పాంసు, బాష్పము, నైషధము మున్నగు వరిధాన్యములు మధురరసంబులును, ఉష్ణవీర్యంబులును, గురుగుణంబులును, అమ్లపాకంబులునై కఫపిత్తముల వృద్ధినొందించును. మలమూత్రముల వృద్ధిచేసి వెడలించును. పైజెప్పిన మూడుధాన్యములలో ముందుముందు ఒకటికన్న నొకటి సారహీనములుగ నుండును. (యావకము నిందితము. అంతకన్న హాయనాదు లొకటికన్న నొకటి నిస్సారములనుట).

శాలిధాన్యములకు దేశవిశేషమున గల్గు గుణభేదములు

మూ. శుద్ధాయామవనౌ జాతాః శాలయో లఘుదీపనాః. ౪
కషాయబద్ధవిణ్మూత్రాః రూక్షాః శ్లేష్మాపకర్షణాః,
స్థలజాః కఫపిత్తఘ్నాః లవణామ్లవివర్జితాః. ౫
కేదారజాస్తు మధురాః పిత్తఘ్నాః కఫశుక్రలాః,

వ్యా. పరిశుద్ధమైనభూమి గాని వైరుచేగల్గినధాన్యములు లఘుగుణంబులు, అగ్నిదీపనంబులును, కషాయరసంబులును, మలమూత్రముల బంధించునవియు, రూక్షగుణంబులును, కఫమును తగ్గించునవియు నగును. మెట్టపొలముల బుట్టిన వరిధాన్యములు లవణామ్లరసములు లేక కఫపిత్తముల హరించును. నీటిపారుదలకల పొలమున జనించిన వరిధాన్యములు మధురరసముకల్గి పిత్తమును హరించును. కఫమును శుక్రమును వృద్ధినొందించును.

అరువదినాళ్లసంబావుల (షష్టిక)గుణము

మూ. స్నిగ్ధో గ్రాహీ లఘుస్స్వాదుః త్రిదోషఘ్నః స్థిరో హిమః. ౬
షాష్టికో వ్రీహిషు శ్రేష్ఠో గౌరశ్చాఽసితగౌరవః,

వ్యా. షష్టికములు (అరువదినాళ్లసంబావులు) వరిధాన్యములలో మిక్కిలి శ్రేష్ఠములు. ధాన్యము స్నిగ్ధగుణంబును లఘుగుణంబును మధురసంబునుకల్గి మలాదుల బంధించును. త్రిదోషముల హరించును. శరీరమును దృఢముగజేయును. శీతవీర్యము కల్గియుం

డును. మరియు షష్టికములు గౌరము (గౌరవర్ణముకలది), అసితగౌరము (నలుపుకలిసిన గౌరవర్ణము కలది) యని రెండువిధములు. అందు అసితగౌరమునకన్న గౌరము మిక్కిలి శ్రేష్ఠము.

మహావ్రీహ్యాదిగుణములు

మూ. తతః క్రమాన్మహావ్రీహికృష్ణవ్రీహిజతూముఖాః. ౭
కుక్కుటాణ్డకలాభాక్షపారావతకశూకరాః,
వరకుద్దాలకౌజ్వాలచీరశారద దుర్ధరాః. ౮
గన్ధనాఃకురువిన్దాశ్చగుణైరల్పాన్తరామతాః. ౯

వ్యా. మహావ్రీహి (పెద్దవరి), కృష్ణవ్రీహి (నల్లవడ్లు), జతూముఖము, కుక్కుటాండము (కోడిగ్రుడ్డువంటియాకారములది), కలభాషము, పారావతకము, శూకరము, వరకము, ఉద్దాలకము, జ్వాలము, చీరము, శారదము, దుర్ధరము, గంధనము, కురువిందము, అనునీవిధధాన్యములు వరుసగ నొకదానికన్ననొకటి కొంచెము భేదముగలగుణములు కల్గియుండును. షష్టికములకన్న కొంచెము స్వల్పములగు గుణముల గల్గియుండును.

ఇతరధాన్యగుణములు

మూ. స్వాదురమ్లవిపాకోఽన్యోవ్రీహిః పిత్తకరో గురుః,
బహుమూత్రపురీషశ్చ త్రిదోషస్త్వేవపాటలః. ౧౦

వ్యా. పైజెప్పిన షష్టికములకన్న నితరములగు వరిధాన్యములు మధురరసంబులును, అమ్లవిపాకంబులును, గురుత్వము కల్గినవియునై పిత్తమును వృద్ధినొందించును.మూత్రపురీషములను అధికముగ గల్గించును. పాటలమనుధాన్యముమాత్రము త్రిదోషములను మిక్కుటముగ జేయును. (పాటలపుష్పమువంటి యాకారము కల్గినధాన్యము పాటలము). ఇయ్యది త్రిదోషముల వృద్ధినొందించునది కావున భోజనమున కగ్రాహ్యము కానోపదు.

ఇచ్చట ధాన్యవర్గమున జతూముఖము, ఉద్దాలకము, పతంగము, శకునాహృతము మున్నగుపేర్లు చెప్పబడినవి. ఇవి ఆయాపేరునుబట్టి వానియాకారము రంగు మున్నగునవి తెలియవలెను. కాని వీనిని ప్రత్యేకముగ నిర్ణయింప వీలుపడదు. ఒక్కొకదేశమున కొన్నికొన్నిధాన్యములు పైరుపెట్టబడును. కావున వానినామరూపాదిభేదములను ఆయాదేశములంగల కర్షకుల (పైరుసాగుచేయువారల) మూలమున దెలియందగునుగాని కేవలము శాస్త్రమునుబట్టి నిర్ణయింప వలనుపడదు. ఈవిషయమును అష్టాంగహృదయవ్యాఖ్యానమగు సర్వాంగసుందరమున నిట్లు సూచించిరి:—"ఏవం పతంగాదయో నానాదేశేషు కరతాదిభ్యోఽవధార్యాః" (అష్టాంగహృదయవ్యాఖ్యానము సూత్ర. 11. ఆరవయధ్యాయము) అట్టి ప్రాచీనవ్యాఖ్యాతలకే దురూహముగ నుండునపుడు ఇతరుల కెట్లు సాధ్యములు?

### కొఱ్ఱలు మొదలగుతృణధాన్యముల సామాన్యగుణములు

మూ. కఙ్గుకోద్రవనీవారశ్యామాకాది హిమం లఘు,
తృణధాన్యం పవనకృత్ లేఖనం కఫపిత్తజిత్. ౧౧

వ్యా. కంగు (కొఱ్ఱలు), కోద్రవము (వరగలు), నీవారము (నివ్వరిధాన్యము), శ్యామాకము (చామలు), ఇవి మున్నగునవి తృణధాన్యములు. (ఆదిశబ్దముచేత శిబిరము, ప్రశాంతికము, మధూళికము, గవేధుకము అడవిగోధుమలును తృణధాన్యమున జేరినవని తెలిసెడి). ఈతృణధాన్యములు శీతలంబులును లఘువులునై వాతమును ప్రకోపింప జేయును. లేఖనమగును. కఫపిత్తముల హరించును.

లేఖనమన:—"విలిఖత్యతి తైక్ష్ణ్యాద్ధాతూన్ తల్లేఖనం మతమ్" అనువచనముచే మిక్కిలి తీక్ష్ణతవలన రసాదిధాతువులను ఛేదించు నవి యని యెఱుంగునది.

### ప్రియంగుకోరదూషకవిశేషగుణములు

మూ. భగ్నసన్ధానకృత్తత్ర ప్రియఙ్గుర్బృంహణో గురుః,
కోరదూషః పరం గ్రాహీస్పర్శశీతో విషాపహః. ౧౨

వ్యా. పైజెప్పినతృణధాన్యములలో కొఱ్ఱలు విరిగినయెముకలు మున్నగువానిని అతుక జేయును. శరీరమును బలియజేయును. గురుత్వము కల్గియుండును అర్ల మిక్కుటముగ మలాదుల బంధించును. శీతలమైనస్పర్శము కల్గియుండును. విషమును హరించును.

కొఱ్ఱలు ఎరుపు పసుపు నలుపు తెలుపురంగులచే నాల్గుతెరంగులు. అందు క్రమముగ నొకదానికన్న నొకటి శ్రేష్ఠములు. రూక్షంబులును కఫహరంబులు నగును. ఈవిషయమును సుశ్రుతాచార్యు లిట్లుచెప్పిరి:—"రక్తాః పీతాశ్చ కృష్ణాశ్చ శ్వేతాశ్చైవ ప్రియఙ్గవః యథోత్తరం ప్రధానాస్స్యుః రూక్షాః కఫహరాస్స్మృతాః"

### ఉద్దాలకాదిగుణము

మూ. ఉద్దాలకస్తువీర్యోష్ణో నీవారశ్శ్లేష్మవర్ధనః,
గున్ద్రాఖ్యః కషాయమధురాః గురుపిత్తానిలాపహాః. ౧౩

వ్యా. ఉద్దాలకములు వీర్యముచే నుష్ణంబులగును. నివ్వరిధాన్యము కఫమును వృద్ధి నొందించును. గుంద్ర యనుధాన్యము కషాయమధురరసములుకల్గి గురుత్వముకల్గియుండును. పిత్తవాతముల హరించును.

### నందీముఖ, మధూలీగుణములు

మూ. నన్దీముఖీ మధూలీ చ మధురస్నిగ్ధశీతలే,

వ్యా. నందీముఖి, మధూలి అను నీరెండుధాన్యములును మధురంబులును స్నిగ్ధంబులును శీతలంబులునై యుండును. (నన్దీముఖమనునది సన్నగ నిడుపుగ నన్దీముఖమునుబోలె వంకరగనుండును. దీనిని వంకసంబావు అని కర్షకులు చెప్పుదురు).

యవలగుణము

మూ. రూక్షశ్శీతో గురుస్స్వాదుః సరో విడ్వాతకృద్యవః. ౧౪
వృష్యఃస్థైర్యకరో మూత్ర మేదఃపిత్తకఫాన్ జయేత్,
పీనసశ్వాసకాసోరు స్తమ్భకణ్ఠత్వగామయాన్.

వ్యా. యవలు రూక్షశీతగురుగుణంబులును మధురరసంబును కల్గియుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. మలమును వాతమును అధికముగ జేయును. శుక్రమును వృద్ధినొందించి దార్ఢ్యమును కల్గించును. మూత్రరోగమును, మేదోరోగమును, పిత్తకఫములను, పీనసమును (పడిసెము), శ్వాసకాసములను, ఊరుస్తంభవాతమును, కంఠరోగములను, చర్మగతరోగములను ఈరోగముల నన్నిటిని యవలు హరించును.

అనుయవ, వంశజయవ(వెదురుబియ్యము)ల గుణములు

మూ. న్యూనో యవాదనుయవో; రూక్షోష్ణో వంశజో యవః,

వ్యా. యవధాన్యములో జేరినవి అనుయవలు; ఇవి యవలకన్న కొంచెము తక్కువ గుణములు కల్గియుండును. వెదురుబియ్యముకూడ యవలలో చేరినవి, అయ్యవి రూక్ష ఉష్ణగుణంబులు కల్గియుండును.

గోధుమలగుణము

మూ. వృష్యఃశీతో గురుస్స్నిగ్ధః జీవనో వాతపిత్తహా. ౧౫
సన్ధానకారీమధురో గోధూమస్థైర్యకృత్సరః,

వ్యా. గోధుమలు శుక్రమును వృద్ధినొందించును. శీతగురు స్నిగ్ధగుణమును కల్గియుండును. బలమును కల్గించును. వాతపిత్తముల హరించును, విరిగిన అవయవముల నతుకజేయును. రసపాకములచే మధురముగ నుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించి దార్ఢ్యమును కల్గించును.

గోధుమలగుణము చరకమున నిట్లు చెప్పబడినది:—"స్థైర్యకృత్ సకషాయశ్చ బల్యశ్శ్లేష్మవికారహా, సన్ధానకృద్వాతహరో గోధూమస్స్వాదుశీతలః" ఈశ్లోకమున గోధుమలకు కషాయరసంబును కఫహారత్వంబును చెప్పబడినవి.

ఇది శూకధాన్యవర్గము.

అవతారిక:—అన్నమున నుపయోగించు శూకధాన్యవర్గమును జెప్పినపిదప వ్యంజ నాదుల నుపయుక్తములగు శింబీధాన్యములవర్గ మీక్రింద చెప్పబడును:—

శింబీధాన్యములు, వానిసామాన్యగుణములు

శింబీధాన్యవర్గః :—

మూ. ముద్గాఢకీమసూరాది శిమ్బీధాన్యం విబన్ధకృత్,
కషాయం స్వాదుసఙ్గ్రాహి కటుపాకం హిమం లఘు.
మేదశ్శ్లేష్మాస్రపిత్తేషు హితం లేపసేకయోః. ౧౬

వ్యా. పెసలు, కందులు, చిరుసెనగలు మున్నగునవి శింబీధాన్యము లనబడు. ఇవి సామాన్యముగ స్రోతస్సుల బంధించును. కషాయమధురరసములుకల్గి మలమును బంధించును. కటువిపాకముకల్గి శీతవీర్యంబును లఘుగుణము కల్గియుండును. మేహోరోగము నందును రక్తపిత్తమునందును కఫరోగమునందును వాతముగ నుండును. పూయుటకును పరిషేకమునకును వాతముగనుండును.

శింబీధాన్యము:—నంచివలె నుండుకోశము శింబి యనబడును, అందు కల్గిన ధాన్యము శింబిధాన్యము. (కాయధాన్యమనుట). మసూరాది యనునాదిశబ్దముచేత సెనగలు అనుములు నువ్వులు మున్నగునవి గ్రహింపబడును. కాయలతో పుట్టునవి యెల్ల శింబిధాన్యమని ఫలితార్థము.

సంగ్రాహిలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"ఖేదిత్వాత్ పిణ్డితాత్ భావాత్ శకృదాద్యాన్ భిన త్తియత్, విపరీతమతో గ్రాహి" పిష్టముగనుండు మలాదులను భేదించునది సంగ్రాహి యనబడును. దీనికి విరుద్ధముగ మలాదులబంధించునది సంగ్రాహి యని యర్థము. "ఇచ్చట విబంధకృత్" అనుపదమునకు స్రోతస్సుల బంధించునదియనియు, "సంగ్రాహి" యనుపదమునకు మలమును బంధించునది యనియు నర్థము.

మరియు "హరితాస్తేష్వపివరాః మకుష్ఠాః క్రిమికారిణః, వర్ణ్యాః పరంప్రలేపాద్యైః మసూరాః గ్రాహిణో భృశమ్" (పైజెప్పిన ముద్గాదిధాన్యములతో పిల్లపెసలు మిగుల శ్రేష్ఠములు. మకుష్ఠములు (పిదుపెసలు) క్రిముల గల్గించును. చిరుసెనగలు నలుగు పెట్టుట మున్నగుకృత్యములచే శరీరమునకు కాంతినిచ్చును. మలమును మిక్కిలి బంధించును) అని హారితాదిగుణవిశేషములు అష్టాంగసంగ్రహమున జెప్పబడినది.

పిల్లపెసలు, అడవిపెసలు, పెద్దపెసలు, బటానులు, వీనిగుణములు

మూ. హరితాస్తేష్వపివరాః వనముద్గాశ్చతైస్సమాః,
కషాయమధురాహృద్యాః గ్రాహిణో రూక్షశీతలాః. ౧౭

మకుష్ఠకాః ప్రశస్యాస్తే రక్తపిత్తజ్వరాదిషు,
వర్ణ్యాఃపరం ప్రలేపాద్యైః కలాయాః వాతలాః పరమ్. ౧౮

వ్యా. పెసలలో పిల్లపెసలు మిక్కిలి శ్రేష్ఠములు. అడవిపెసలును పిల్లపెసలతో సమానములుగ నుండును. మకుష్ఠములు (పెద్దపెసలు) కషాయమధురరసములుకల్గి హృదయమున కనుకూలములై మలమును బంధించును. రూక్షశీతగుణములు కల్గియుండును. రక్తపిత్తము జ్వరమువున్నగురోగములయందు మిక్కిలి ప్రశస్తములు. నలుగుపెట్టుకొనుటచే శరీరమునకు వర్ణమును కల్గించును. కలాయములు (బటానులు) మిక్కిలి వాతమును వృద్ధిజేయును.

కందులగుణము

మూ. ఆఢకీకఫపిత్తఘ్నీ గ్రాహిణీరూక్షశీతలా,
కషాయమధురాగుర్వీజ్వరాతీసారనాశినీ. ౧౯

వ్యా. కందులు కఫపిత్తముల హరించును. మలమును బంధించును. రూక్షశీతగుణంబులును కషాయమధురరసంబులును గురుత్వంబును కల్గియుండును. జ్వరమును అతిసారమును హరించును.

మినుములగుణము

మూ. మాషస్స్నిగ్ధోబలశ్లేష్మమలపిత్తకరస్సరః,
గుర్వూష్ణోఽనిలహాస్వాదుః శుక్రవృద్ధివిరేకకృత్. ౨౦

వ్యా. మినుములు స్నిగ్ధములుగ నుండును. శరీరబలమును మలమును పిత్తమును వృద్ధినొందించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. గురుఉష్ణగుణములు కల్గి మధురంబై వాతమును హరించును. శుక్రమును వృద్ధిజేసి స్రవింపజేయును.

కాకాండోలాదిగుణము

మూ. ఫలానిమాషవద్విద్యాత్ కాకాణ్డోలాత్మగుప్తయోః,

వ్యా. కాకాండోలయను కాయధాన్యమునకును దూలగొండి గింజలకును మినుములకు జెప్పినగుణములు కల్గియుండు నని యెరుంగునది.

అలచందులగుణము

మూ. రాజమాషోఽనిలకరో రూక్షో బహులకృద్గురుః. ౨౧

వ్యా. రాజమాషము (అలచందు) వాతమును వృద్ధినొందించును. రూక్షగుణముకల్గి మలమును వృద్ధినొందించును. గురుత్వము కలదు.

### ఉలవలగుణము

మూ. ఉష్ణాఃకులుత్థాఃపాకేఽమ్లాఃశుక్రాశ్మశ్వాసపీనసాన్,
కాసాఽర్శఃకఫవాతాంశ్చఘ్నన్తిపిత్తాస్రదాఃపరమ్. ౨౨

వ్యా. ఉలవలు ఉష్ణవీర్యంబును అమ్లవిపాకంబును కల్గియుండును; శుక్రమును, అశ్మరీరోగమును, శ్వాసకాసములను, పీనసమును, అర్శోరోగమును, కఫవాతములను హరించును. ఉష్ణవీర్యంబు లగుటంజేసి విశేషముగ రక్తపిత్తమును కల్గించును.

ఉలవలగుణము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది. "కషాయస్వాదురూక్షోష్ణాః కులుత్థారక్తపిత్తలాః, పీనసశ్వాసకాసార్శో హిక్కా నాహకఫానిలాన్, ఘ్నన్తి శుక్రాశ్మరీం శుక్రం దృష్టిం శోఫం తథోదరమ్" ఈవాక్యములచేత ఉలవలు కషాయమధురరసములు కల్గియుండుననియు, ఎక్కిళ్లను కడుపుబ్బరమును, శుక్రాశ్మరిని, శుక్రమును, దృష్టిని, శోఫమును, ఉదరమును హరించుననియు తెలిసెడి.

### నల్లనియుఉలవలు అడవియుఉలవలు వీనిగుణము

మూ. కృష్ణాఃప్రశస్తాఃవన్యాస్తునేత్రాభిష్యన్దనాశనాః,

వ్యా. ఉలవలు నలుపుతెలుపురంగులచే రెండువిధములు. అందు నల్లనివి మిక్కిలి శ్రేష్ఠములు. అడవియుఉలవలు నేత్రాభిష్యందరోగముల హరించును.

### అనుములగుణము

మూ. నిష్పావోవాతపిత్తాస్రస్తన్యమూత్రకరోగురుః. ౨౩
సరోవిదాహోదృక్శుక్రకఫశోఫవిషాపహః,

వ్యా. అనుములు వాతము, పిత్తము, రక్తపిత్తము, స్తన్యము (చనుబాలు) మూత్రము, వీనిని వృద్ధిచేయును, గురుత్వమును కల్గించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. తాపము పుట్టించును. దృష్టిని శుక్రమును కఫమును శోఫమును విషమును నశింపజేయును.

### నువ్వులగుణము

మూ. ఉష్ణస్త్వచ్యోహిమస్పర్శః కేశ్యోబల్యస్తిలోగురుః. ౨౪
అల్పమూత్రఃకటుఃపాకే మేధాగ్నికఫశుక్రకృత్,
కృష్ణఃప్రశస్తః తమనుశుక్లస్తమనుచారిణః. ౨౫

వ్యా. నువ్వులు ఉష్ణవీర్యము కల్గియుండును. చర్మమునకు చాల హితకరము. స్పర్శమున చల్లగ నుండును. వెండ్రుకలకు హితకరము. బలమును కల్గించును. గురుత్వము కల్గినది. మూత్రమును తగ్గించును. కటువిపాకము కల్గియుండును. బుద్ధిని జఠరాగ్నిని కఫ

మును శుక్రమును వృద్ధినొందించును. నల్లనినువ్వులు మిగుల ప్రశస్తములు. తెల్లనివి వీని గుణముల ననుసరించియుండును.

## అగసి-కుసుమవిత్తనముల గుణము

మూ. స్నిగ్ధోమాస్వాదుతిక్తోష్ణః కఫపిత్తకరీగురుః,
దృక్ఛుక్రహృత్కటుఃపాకేతద్వద్బీజంకుసుమ్భజమ్. ౨౬

వ్యా. అగసివిత్తులు స్నిగ్ధంబులును, మధురవిపాకంబులును, తిక్తరసంబులును, ఉష్ణవీర్యంబులునై కఫపిత్తముల వృద్ధినొందించును. గురుత్వమును కల్గించును. దృష్టిని శుక్రమును హరించును. కటువిపాకము కల్గియుండును. కుసుమవిత్తులును అగసివిత్తనములకు జెప్పబడినగుణములు కల్గియుండును.

## ఆవాలగుణము

మూ. కటుపాకరసస్తీక్ష్ణో రూక్షోష్ణఃకఫవాతజిత్,
పిత్తసృక్కోపిసిద్ధార్థః తద్వైవారుణసర్షపః. ౨౭

వ్యా. తెల్లనియావాలు కటురసంబును కటువిపాకంబును తీక్ష్ణరూక్షగుణంబులును ఉష్ణవీర్యంబును కల్గియుండును, కఫవాతముల హరించును. రక్తపిత్తమును ప్రకోపింపజేయును. ఎఱ్ఱనియావాలును పైజెప్పినగుణములు కల్గియుండును.

## ధాన్యములలోనుత్తమాధమములు

మూ. షష్టికాఃయవగోధూమాః లోహితాయేచశాలయః,
ముద్గాఢకీమసూరాశ్చధాన్యేషుప్రవరామతాః. ౨౮
మాషోఽత్రసర్వేష్వవరఃయావశూకస్తృణేషుచ,

వ్యా. పైజెప్పబడిన ధాన్యవర్గములో షష్టికములును, యవలును, గోధుమలును, ఎఱ్ఱనివరిధాన్యంబులును, పెసలును, కందులును, చిరుసెనగలును, ఈధాన్యములు మిక్కిలి శ్రేష్ఠములు. శింబీధాన్యములలో మినుములును, తృణధాన్యములలో యావశూకమను ధాన్యంబులును మిక్కిలి హీనములు. (అపథ్యకరములనుట).

## క్రొత్త-ప్రాతధాన్యములగుణములు

మూ. నవధాన్యమభిష్యన్దినైకకేదారజంచయత్. ౨౯
లఘువర్షోషితం దగ్ధభూమిజంస్థలజంభకిత్,
శీఘ్రజన్మతథాసాత్మ్యంనిస్తుషంయుక్తిభర్జితమ్. ౩౦

వ్యా. నూతనమైనధాన్యంబును (క్రొత్తవియనుట), అనేకవిధములైన పొలములలో పుట్టినధాన్యంబును అభిష్యంది (స్రోతస్సులద్రవమును కల్గించునది) యగును. ఒకసంవత్సర

కాలము ప్రాతపడినధాన్యంబును, అగ్నిచే దగ్ధమగు భూమిలో పుట్టినధాన్యంబును, మెట్ట భూమిలో ఫలించినధాన్యంబును లఘుగుణముకల్గి చుల్కనగ జీర్ణమగును. శీఘ్రకాలమున ఫలించినధాన్యంబును, అలవాటుచే శరీరమునకు సాత్మ్యమైనధాన్యంబును, యథోచితముగ వేయించి పుట్టుతీయబడిన ధాన్యంబును చుల్కనగ జీర్ణమగును.

ఇది శింబిధాన్యవర్గము.

అథ కృతాన్నవర్గః:—

అవతారిక:—పైవర్గములలెంటిచేత నాహారమున కుపయుక్తములగు శూకశింబీధాన్యములగుణాదులు చెప్పబడినవి. పిదప అట్టిధాన్యముల పక్వముజేసి యాహారరూపమున కుపయోగింపవలయుగాన కృతాన్నవర్గ మిక్రింద గుణాదులచే నిరూపింపబడును:—

మండపేయాదిస్వరూపము, మండగుణము

మూ. మణ్డపేయావిలేపీనామోదనస్య చలాఘవమ్. 3౧
యథాపూర్వం; శివస్తత్ర మణ్డో వాతానులోమనః,
తృట్ గ్లానిశేషదోషఘ్నః పాచనో ధాతుసామ్యకృత్. 3౨
స్రోతోమార్దవకృత్ స్వేదీసంధుక్షయతిచానలమ్,

వ్యా. మండము, పేయ, విలేపి, అన్నము, అను నీయపక్వాహారములు నాల్గును వెనుకటి కొకదానికన్న నొకటి లఘువుగ నుండును. (అన్నమునకన్న విలేపియు, దానికన్న పేయయు, దానికన్న మండంబును లాఘవముకల్గి చుల్కనగ జీర్ణమగుననుట). వానిలో మండమనునది మిక్కిలి హితకరమైనది. వాతమును అనులోమముగ సంచరింపజేయును. దప్పిని బడలికను వమనాదులనుజేసినపిదప శేషించియుండు దోషలేశమును హరించును. భుజింపబడిన యాహారమును జీర్ణింపజేయును. విషమములుగ నుండువాతాదిదోషములను సమస్థితికి దెచ్చును. స్రోతస్సులకు మృదుత్వమును కల్గించును. ఒడలిపై జెమటబుట్టించును. జాఠరాగ్నిని జ్వలింపజేసి యాకలిగల్గించును.

మండపేయాదిస్వరూపమును చరకాచార్యు లిట్లుపదేశించిరి:—"సిక్థైర్విరహితో మణ్డః పేయాసిక్థసమన్వితా ఘనసిక్థావిలేపీస్యాత్ యవాగూర్విరళద్రవా" (మెతుకు లేకుండ కాచబడినగంజి మండము. కొంచెముగ మెతుకులుండునట్లు కాచబడినగంజిపేయ, దట్టముగ మెతుకులుండునట్లు కాచబడినగంజి విలేపి, లేటగ కాచబడినగంజి యవాగువు)

"లాజామ్బు సైన్ధవకణా ధాన్యనాగరదాడిమైః, యుక్తో విమృదితః పూతో మణ్డః సంస్కృతఉచ్యతే, నిర్ద్రవ్యా ప్రాకృతా పేయా తత్ర దాడిమతణ్డులైః" అని మండపేయాలక్షణములు తంత్రాంతరమున జెప్పబడినవి. వరిపేలాలు, నీళ్లు, సైంధవలవణము

పిప్పళ్లు, దనియాలు, శుంఠి, దానిమ్మపండురసము వీనినిచేర్చి బాగుగ కాచి పిసికి వడియ కట్టబడినగంజి మండమనియు, మజ్జిగ, దానిమ్మపండ్లరసము, బియ్యము వీనినిజేర్చి మెతుకులు లేకుండ కాచబడినగంజి పేయ యనియు భావము.

లాజమండగుణము

మూ. లాజమణ్డోఽగ్నిమంథనోదాహమూర్ఛాదృపాకరః. 33
తృష్ణాతిసారశమనోధాతుసామ్యకరశ్శివః,

వ్యా. వరిపేలాలచే సిద్ధముచేయబడినమండము అగ్నిని పుట్టించును. తాపము మూర్ఛ మున్నగురోగముల బారందోలును. దప్పిని అతిసారమును శమింపజేయును. విషమ స్థితినుండువాతపిత్తకఫములను సమస్థితికి దెచ్చును. ఇయ్యది మిక్కిలి శ్రేష్ఠమైనది.

పేయాగుణము

మూ. క్షుత్తృష్ణాదిచదౌర్బల్యకుక్షిరోగజ్వరాపహా. 34
మలానులోమనీపథ్యా పేయాదీపనపాచనీ,

వ్యా. పేయ యనుగంజి ఆకలిదప్పులను, బలహీనమును, కడుపునొప్పిని, జ్వరమును హరించును. వాతాది తమతమమార్గములకు మరల్చును. మిక్కిలి పథ్యకరమైనది. జాఠరాగ్నిని దీపింపజేయును. భుజింపబడినయాహారమును జీర్ణింపజేయును.

యవాగుగుణము

మూ. తృడ్దాహహా శ్రమహరా పిత్తఘ్నీ దుర్జరాసరా. 35
గుర్వీయవాగూః భక్తోత్థా క్రిమిశ్లేష్మవివర్ధినీ,

వ్యా. అన్నముచేసి వార్చి సిద్ధమైనయవాగువు (గంజి) దప్పిని, తాపమును శ్రమమును హరించును. పిత్తమును హరించును. కష్టముగ జీర్ణమగును. శరీరమునందు శీఘ్రముగ వ్యాపించును. గురుత్వము కల్గియుండును. క్రిములను కఫమును వృద్ధినొందించును.

విలేపిగుణము

మూ. విలేపీ గ్రాహిణీహృద్యా తృష్ణాఘ్నీ దీపనీ హితా. 36
వ్రణాఽక్షిరోగసంశుద్ధ దుర్బలస్నేహపాయినామ్,

వ్యా. విలేపి యనునది మలమును గట్టిపరచును. హృదయమునకు వాతకరముదప్పి నణచును. వ్రణరోగముకలవారికిని, నేత్రరోగముకలవారికిని, వమనవిరేచనాదులచే దేహశోధనము జేసికొనినవారికిని, బలహీనులకును, స్నేహపానముజేసినవారికిని మిక్కిలి హితమైనది. (విలేపి యనగా జావ.)

## పక్వాన్నగుణము

మూ. సుధౌ తప్రస్రుతః స్విన్నస్త్యక్తోష్మాచౌదనోలఘుః. 3౭
యశ్చాగ్నేయౌషధక్వాథసాధితో భృష్టతణ్డులః,
విపరీతో గురుక్షీరమాంసాద్యైర్యశ్చ సాధితః. 3౮

వ్యా. బియ్యమును చక్కగ కడిగి కుడితిని (మూడుసార్లు) వంచి వండి చక్కగ నుడికింపబడి గంజివార్చి ఆవిరి తనంతనే యణఁగి (ఇగరఁరాని) నది యన్నము. అయ్యది మిక్కిలి లఘుగుణము కల్గియుండును. (చులకనగ జీర్ణమగుననుట). (చిత్రమూలముశుంఠి మొదలగు ఆగ్నేయౌషధములకషాయమున సిద్ధముచేయబడిన యన్నంబును, వేయించిన బియ్యముచే సిద్ధమైనయన్నంబును అంతకన్న లఘువుగ నుండును. పైజెప్పినదానికన్న విప రీతమైన (చక్కగ కడగక గంజివార్చక చల్లనైయుండు) అన్నము గురువుగ నుండును. మరియు మాంసము పాలు మధురపదార్థములు మున్నగ ద్రవ్యములజేర్చి సిద్ధముచేయ బడిన యన్నముకూడ గురువుగ నుండును.

"విపరీతః" అనుదానికి వివరమును • "అధౌత ప్రస్రుత స్విన్నశ్శీతశ్చాప్యోదనో గురుః"అని చరకాచార్యుడు చెప్పెను.

## శాకగుణము

మూ. స్విన్ననిష్పీడితం శాకం సహోద్యం సంస్కృతం హి తమ్,

వ్యా. శాకములను చక్కగ నుడికించి అందలిరసమును పిడిచి తిరుగమోతబెట్టి సంస్కరింపబడిన మిక్కిలి వాతకరము.

## మాంసరసగుణము

మూ. శుష్యతాం వ్యాధియుక్తానాం శుద్ధానాం శుద్ధికాంక్షిణామ్. 3౯
కృశక్షామక్షతోరస్కక్షీణ ధాత్విన్ద్రియౌజసామ్,
దృష్టి శ్రవణవహ్న్యాయుర్బలవర్ణస్వరార్థినామ్. ౪౦
భగ్నవిశ్లిష్టసన్ధీనాం వ్రణినాం వాతరోగిణామ్,
కాసినాం శ్వాసినాం పథ్యః ప్రీణనో మాంసజోరసః. ౪౧

వ్యా. మాంసమువలనపుట్టినరసము (అనఁగా మాంస ముడికించినసీరు) వ్యాధులచే శోషించినవారికిని, వమనాదులచే శోధనచికిత్సజేసికొనినవారికిని, శోధనమును కోరువారి కిని, శరీరము కృశించినవారికిని, ఉరఃక్షతరోగముచే శుష్కించినవారికిని, ఇంద్రియంబు లును రసాదిధాతువులును ఓజస్సును క్షీణించినవారికిని, దృష్టిపాటవమును శ్రవణశక్తిని

అగ్నిబలమును ఆయుర్వృద్ధిని శరీరకాంత్యాతిశయమును కంఠస్వరస్వారస్యమును గోరు వారికిని, విరిగి సడలిన సంధిబంధములుకలవారికిని, వ్రణములచే బాధితులకును, వాతరోగ పీడితులకును, కాసశ్వాసరోగములుకలవారికిని, (మాంసరసము) మిక్కిలి హితకరము. పై జెప్పిన రోగములయందు మాంసరసము మిక్కిలి యాప్యాయత నొందించును.

సామ్లు, అనమ్లమాంసరసగుణము

మూ. సామ్లో మాంసరసోవృష్యః బృంహణః పవనాపహః,
తస్మా ద్గురుతరోఽనమ్లః శుక్రతో బృంహణః పరమ్. ౪౨

వ్యా. పులుపునుజేర్చి పక్వముచేయబడిన మాంసరసము వృష్యంబును, (శుక్రవృద్ధి కరము), శరీరమును బలియజేయునదియు, వాతహారంబు నగును. పులుపులేకుండుమాంస రసము పైజెప్పినదానికన్న గురుతరమై శుక్రము నధికముగ వృద్ధిచేయును. శరీరమును మిక్కుటముగ బలియజేయును.

ముద్గరస (పెసరకట్టు) గుణము

మూ. మౌద్గస్తు పథ్యస్సంశుద్ధ వ్రణకణ్ఠాక్షిరోగిణామ్,

వ్యా. ముద్గరసము (పెసరకట్టు) వమనవిరేచనాదిచికిత్సచే శరీరశోధనముచేసి కొనినవారికిని, వ్రణరోగులకును, కంఠరోగమును నేత్రరోగమునుకలవారికిని మిక్కిలి హితకరము.

పెసరకట్టుస్వరూపము తంత్రాంతరమున నిట్లు చెప్పనబడినది:—"ముద్గానాం ద్విపలం తోయే శృతమర్ధాఢకోన్మితే. పాదస్థం మర్దితం పూతం దాడిమస్య ఫలేన తు. యుక్తం సైన్ధవవిశ్వాహ్వా ధాన్యకైః పాదకార్షికైః, కణా జీరకయోశ్చూర్ణాత్ శాణైకేనావచూర్ణితమ్, సంస్కృతో ముద్గయూషోఽయం పిత్తశ్లేష్మహరోమతః" (అర్ధాఢక పరిమితమగు జలమున రెండుపలములు పెసరపప్పువేసి నాల్గవపాలు మిగులునట్లుకాచి యారసమును చక్కగ మర్దించి వడియగట్టి అందు దానిమ్మపండురసమును, సైంధవలవ ణము, శుంఠి, దనియాలు, వీనిని ప్రత్యేకము కాలుకర్షమువంతున చూర్ణముచేసినవానిని కలిపి; పిప్పళ్లను జీలకఱ్ఱను ప్రత్యేకము శాణపరిమితమును చూర్ణముచేసి కలిపి తిరుగ మోతబెట్టిన నయ్యది ముద్గయూష మనబడును. (ఇదియే ముద్గరసము, పెసరకట్టు). ఈ ముద్గరసము పిత్తకఫముల హరించును. మిక్కిలి పథ్యకరము.)

ఉలవకట్టుగుణము

మూ. వాతానులోమీ కౌళుత్థో గుల్మతూనీ ప్రతూనిజిత్. ౪౩

వ్యా. కుళుత్థరసము (ఉలవకట్టు) ప్రతిలోమముగ నుండువాతమును అనులోమ ముగ సంచరింపజేయును. గుల్మమును, తూని ప్రతూని యను వాతరోగములను హరించును.

—— కుల్మాషగుణము ——

మూ. కుల్మాషా గురవో౽రూక్షా హితశాః భిన్నవర్చసః,

వ్యా. కుల్మాషములు (మినపపిండిచే చేయబడినకుడుములు) గురుత్వమును కల్గించును. వాతమును వృద్ధిజేయును. మలమును భేదించును.

—— మాషసూపగుణము ——

మూ. ప్రభూతాభ్యాస్తవమతో మాషసూపః పరఃస్మృతః. ౪౪

వ్యా. మినుపపప్పు లోపల మిక్కిలి మలమును వృద్ధినొందించును.

—— ఖలకాంబలికగుణములు ——

మూ. ఖలకామ్బలికౌ హృద్యౌ సాధితా స్త్వౌషధానుగౌ,

వ్యా. కొన్నియౌషధములజేర్చి పక్వముజేయబడినయూషము ఖండయూషమనియు కాంబలికమనియు రెండువిధముల నుండును. ఈరెండును మిక్కిలి హృదయమునకు వాతములు. ఇయ్యవి ఎట్టిగుణములుగల యౌషధములచే సిద్ధములగునో ఆయౌషధములకు జెప్పినగుణములు గల్గియుండును.

ఖలకాంబలికాదిలక్షణములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినవి:—"పిశితేన రసస్తత్ర యూషో ధాన్యైః ఖలః ఫలైః, మూలైశ్చ తిలకల్కామ్లప్రాయః కామ్బలికస్స్మృతాః, జ్ఞేయాః కృతాఽకృతా స్తేతు స్నేహాదియుతవర్జితాః, అల్పమాంసాదయః స్వచ్ఛాః దకలావణికాః స్మృతాః" మాంసమునుచేర్చి సిద్ధముచేయబడినది రసము. ముద్గాదిధాన్యములనుజేర్చి సిద్ధముచేయబడిన యూష మనబడును. ఫలములు వేళ్లను గూర్చి సిద్ధము చేయబడినది ఖలము, నువ్వులపిండిని పులిచింతాకునుజేర్చి సిద్ధముచేయబడినది కాంబలికము. వీనిలోనే స్నేహాదులజేర్చి సిద్ధముచేయబడినది కృతము. స్నేహాదులజేర్పక సిద్ధముచేయబడినది అకృతము, శుంఠి మున్నగునౌషధముల కొంచెముగజేర్చి సిద్ధముచేయబడినది దకలావణిక. అని యర్థము.

—— యూషాదులయందు గురుత్వతారతమ్యము ——

మూ. విద్యాద్యూషరసే సూపే శాకే చైవోత్తరోత్తరమ్. ౪౫
గౌరవం తనుసాన్ద్రామ్లస్వాదుత్వేతు పృథక్తథా,

వ్యా. యూషము, రసము, సూపము, శాకము, అనువానియందు గౌరవము వరుసగ నొకదానికన్న నొకదానియం దధికముగ నుండును. మరియు నివి పలుచగనైనను, చిక్కగనైనను, పులుపుగనైనను, మధురముగనైన నున్నపుడు గురుత్వము ఆయాభావమునకు దగినట్లు వేరువేరుగ నుండును.

తెలికపిండి మున్నగు వానిగుణములు

మూ. తిలపిణ్యాకవికృతి శుష్కశాకం విరూఢకమ్. ౪౬
శాణ్డాకీ వటకం దృష్ఘ్నం దోషలం గ్లపనం గురు,
పిణ్యాకో గ్లపనం రూక్షః విష్టమ్భో దృష్టిదూషణః. ౪౭

వ్యా. నువ్వులచేతను తెలికపిండిచేతను జేయబడినపదార్థములు, ఎండినకూర గాయలు, విరూఢకము (తరుగాకు మున్నగునవి), శాండాకి, వడియములు, ఇవియన్నియు నేత్రములకు హానిచేయును. వాతాదిదోషములను వృద్ధినొందించును. బడలికను కల్గించును. చిరకాలమునకు జీర్ణమగును. నువ్వులగానుగపిండి బడలికనిచ్చును. రూక్షగుణము కల్గి యుండును. మలమును బంధించును. దృష్టిని చెరచును.

వరిపేలాలగుణము

మూ. లాజాస్తృట్ ఛర్ద్యతీసార మేహమేదః కఫచ్ఛిదః,
కాసపిత్తోపశమనాః దీపనాలఘవో హిమాః. ౪౮

వ్యా. వరిపేలాలు దప్పిని, వాంతిని, అతిసారమును, ప్రమేహమును, మేదోరోగ మును, కఫమును హరించును. కాసమును పిత్తమును శమింపజేయును. జాఠరాగ్నిని దీపింప జేయును. తేలికగా జీర్ణమగును. శీతవీర్యము కల్గియుండును.

అటుకులు వేపుడుబియ్యము వీనిగుణములు

మూ. పృథుకాగురవోబల్యాః కఫవిష్టమ్భకారిణః,
ధానావిష్టమ్భినీరూక్షాంతర్పణీ లేఖనీ గురుః. ౪౯

వ్యా. అటుకులు గురుత్వముకల్గియుండును; బలకరములు; కఫమును వృద్ధిచేయును; మలమును బంధించును. వేపుడు మలమును బంధించును రూక్షగుణము కల్గియుండును. తృప్తినొందించును; వాతాదులను భేదించును. గురుత్వము కల్గియుండును.

సత్తుపిండిగుణము

మూ. సక్తవోలఘవఃక్షుత్తృట్ శ్రమనేత్రామయవ్రణాన్,
ఘ్నన్తిసన్తర్పణాఃపానాత్ సద్యఏవబలప్రదాః. ౫౦
నోదకాన్తరితా నద్వేఃననిశాయాంనకేవలాన్,
నభుక్త్వానద్విజైశ్ఛిత్త్వాసక్తూనద్యాన్నవాబహూన్. ౫౧

వ్యా. వేపుడుబియ్యపుపిండి సత్తువు (సత్తుపిండి) యనబడును. ఇయ్యది లఘువుగ నుండును. ఆకలిని, దప్పిని, శ్రమమును, నేత్రరోగములను, వ్రణములను హరించును. తృప్తినికల్గించును. దీనిని ఉదకముతోగూర్చి త్రాగినయెడల అప్పుడే బలమును కల్గించును.

అట్టి సత్తుపిండిని త్రాగునపుడు నడుమ నీళ్లు త్రాగకూడదు. దినమునకు రెండుపూటల యందును, రాత్రియందును త్రాగకూడదు. భుజించినపిదప దీనిని ఉపయోగింపరాదు. దీనిని జలము మున్నగు ద్రవద్రవ్యములతో గూర్చి త్రాగవలెనుగాని అటుగాక ఈపిండిని మాత్ర ముపయోగింపరాదు. పండ్లతో నమలి తినగూడదు. అధికముగ తినరాదు.

పర్పట (అప్పడముల) గుణము

మూ. పర్పటాలఘవో రుచ్యాః లఘుః క్షారపర్పటః. ౫౨

వ్యా. పర్పటము (అప్పడములు) తేలికగ జీర్ణమగును. రుచిని బుట్టించును. క్షార పర్పటము మిక్కిలి తేలికగా నుండును.

రాగషాడబగుణము

మూ. హృద్యారుచికరావృష్యాగురవో రాగషాడబాః,
ప్రీణనాః భ్రమతృట్ఛర్ది మదమూర్ఛాశ్రమచ్ఛిదః. ౫౩

వ్యా. రాగషాడబములు హృదయమునకు హితములు. రుచిని పుట్టించును. శుక్ర మును వృద్ధినొందించును. గురుత్వము కల్గియుండును. ఇంద్రియాదులకాప్యాయత నొందించును. భ్రమమును, దప్పిని, వమనములను, మదమును, మూర్ఛను, శ్రమమును హరించును.

రాగషాడబలక్షణములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినవి:— "క్వథితంతు గుడోపేతం సహకారఫలం నవమ్. తైలనాగరసంయుక్తం విజ్ఞేయో రాగషాడబః" "సితారుచకసిద్ధార్థైః సవృక్షామ్లపరూషకైః, జమ్బూఫలరసైర్యుక్తో రాగోరాజికయాన్వితః" "బెల్లము, మామిడిపండురసము ఈరెంటిని ఉదకమునజేర్చి కాచి అందు తైలమును శుంఠిని కలిపిన నయ్యది రాగషాడబ మనియు; పంచదార, ఉప్పు, తెల్లావాలు, చింత పండు, చిట్రీతపండు, నేరేడుపండ్లరసము, ఎఱ్ఱనిఆవాలు వీనినన్నిటినిగూర్చి చేయబడిన పానకము రాగ మనియు భావము.

రాగషాడబవిశేషగుణములు

మూ. తృట్ఛర్దిశ్రమనుత్ మణ్డమద్య పీతస్సద్యోబలప్రదః,
ప్రమేహక్షయకుష్ఠాని న చ స్యుః మన్థపాయినః. ౫౪

వ్యా. పైజెప్పిన రాగషాడబములను మద్యముతోగూడజేర్చి త్రాగినచో దప్పిని, వాంతిని శ్రమమును పోగొట్టి తోడనే బలమును కల్గించును. మంథమునజేర్చి త్రాగినచో ప్రమేహమును కుష్ఠమును క్షయమును హరించును.

### రసాలగుణము

మూ. రసాలా బృంహణీవృష్యా స్నిగ్ధా బల్యారుచప్రదా,

వ్యా. (పెరుగును చేలితో చిలికి, అందు మిరియాలును శుంఠిని పొడిచేసివేసి, చక్కెరనుగూర్చి చేయబడినది రసాల) అయ్యది శరీరమును బలియజేయును. శుక్రమును వృద్ధినొందించును. స్నిగ్ధముగ నుండుచు బలమును కల్గించును. రుచిని పుట్టించును.

### పానకగుణము

మూ. శ్రమతృట్ క్షుత్ క్లమహరం పానకం ప్రీణనం గురు. ౫౫
విష్టమ్భి మూత్రలం హృద్యం యథా ద్రవ్యగుణం చ తత్,
స్నేహనం తర్పణం హృద్యం వాతఘ్నం సగుడం దధి. ౫౬

వ్యా. చక్కెర బెల్లము మున్నగువానిచే జేయబడినపానకము శ్రమమును ఆకలిని దప్పిని బడలికను హరించును. తృప్తిని కలిగించును. గురుత్వము కలిగియుండును; మలమును బంధించును. మూత్రమును అధికముగ వెడలించును,హృదయమునకు హితకరము. మరియు నీపానకములయందు ఏవస్తువులనుచేర్చిన ఆవస్తువులగుణము కలిగియుండును.

### భక్ష్యవిశేషగుణములు

మూ. కూర్చికాదికృతా భక్ష్యాః గురవోఽనిలపిత్తలాః,
పైష్టికా గురవో భక్ష్యాః వీర్యేణోష్ణాః త్రిదోషలాః. ౫౭
భేదనా లఘవో రూక్షాః భృశం వాతప్రకోపనాః,
ముద్గాని జాస్తుగురవో యథా ద్రవ్యగుణానుగాః. ౫౮
ఘృతపక్వాలఘుతరాః తైలికాగురుపిత్తలాః,

వ్యా. (పాలనుకాచి అది తెర్లునపుడు పెరుగునైనను మజ్జిగనైనను సమభాగముగ కలిపిన నయ్యది విరిగి పెరుగుగడ్డకట్టి నీళ్లు వేరుగ నేర్పడును. అందు గడ్డగనుండునది కూర్చిక(జున్ను)అనబడును. అందు పెరుగుచేనైనది దధికయనియు, మజ్జిగచేనైనది తక్రకూర్చికయనియు చెప్పబడును) కూర్చికనుగూర్చి చేయబడినభక్ష్యములు గురుత్వముకలిగి వాతమును పిత్తమును హరించును. పిండిచే జేయబడినభక్ష్యములు గురుత్వముకలిగి ఉష్ణవీర్యములుగనుండును. త్రిదోషముల ప్రకోపింపజేయును మలమును భేదించును, కొన్నిలఘుగుణముకలిగి రూక్షములై వాతమును మిక్కుటముగ ప్రకోపింపజేయును. పెసలు మున్నగువానిచే జేయబడినభక్ష్యములు గురుత్వము కలిగియుండును. మరియు భక్ష్యములు ఏద్రవ్యముచే జేయబడునో ఆద్రవ్యగుణములు ఆభక్ష్యములకు కలిగియుండును. మరియు నేతిలో కాల్చబడినభక్ష్యములు మిక్కిలి లఘువుగ నుండును. నూనెలో కాల్చబడినవి గురుత్వము కలిగి పిత్తమును వృద్ధినొందించును.

ఫేనకాదిభక్ష్యములగుణములు

మూ. ఫేనకా లఘవః పథ్యాః మోదకాగురుబృంహణాః. ౫౯
యావకశ్శ్వాసకాసఘ్నః శష్కుల్యః కఫపిత్తలాః,

వ్యా. ఫేనకములు (పేణీలు) చుల్కనగ జీర్ణమగును. పథ్యకరములు. మోదకములు (కుడుములు) గురుత్వముకలిగి బలకరములై శరీరమును బలియజేయును. యవలచే జేయబడినభక్ష్యములు శ్వాసకాసముల హరించును. చక్కిలములు కఫపిత్తముల వృద్ధి నొందించును.

భక్ష్యములకుపాకాదిభేదములచేగల్గుగుణవిశేషములు

మూ. మృదుపాకాశ్చయే భక్ష్యాః స్థూలాశ్చ కఠినాశ్చయే. ౬౦
యేతోయ తారితాయేచ స్విన్నాశ్చాప్యమ్లసీ దుర్జరాః,
కుకూలకర్పటభ్రాష్ట్రకం ద్వంగారవిపాచితాః. ౬౧
ఏకయోనీః లఘూరాః విద్యాత్ అపూపాను త్తరోత్తరమ్,

వ్యా. పచ్చియుండునట్లు మృదుపాకముగ పక్వముచేయబడినభక్ష్యములును లావుగ నుండుభక్ష్యములును, ఉండలుగ నుండుభక్ష్యములును, నీళ్లలో నుంచిన పైన తేలుచుండు భక్ష్యంబులును, నీళ్లతో నుడికిన భక్ష్యములును జీర్ణము గావు. ఏరుడుపిడకల నిప్పునకాల్చినవియు, పెంకుపై కాల్చబడినవియు, మంగలమున కాల్చబడినవియు, పెనముపై కాల్చబడినవియు నగునపూపములు ఇవియన్నియు నేకజాతిగ నుండునెడ ఇవి వరుసగ నొకటి కన్ననొకటి లఘువుగ నుండును.

వేసవార-పక్వమాంసములగుణములు

మూ. వేసవారో గురుస్స్నిగ్ధః బలోపచయవర్ధనః. ౬౨
పరిశుష్కం స్థిరం స్నిగ్ధం ప్రీణనం బృంహణం గురు,
రోచనం బలమేధాగ్ని మాంసౌజ శ్శుక్రవర్ధనమ్. ౬౩
తదేవ పిష్టం పిష్టత్వాత్ పరిశుష్కసమం లఘు,
వృష్యం ఛర్దిహరం బల్యం పథ్యం శూల్యా మిషం లఘు. ౬౪
యదుద్ధృతరసం మాంసం న తత్పుష్టిబలావహమ్,
విష్టమ్భి దుర్జరం రూక్షం విరసం మారుతావహమ్. ౬౫

వ్యా. (శుంఠి, దనియాలు జీలకర, ఇంగువ, నెయ్యి మొదలగువస్తువులచేర్చి కలియగొట్టి పక్వముచేయబడిమాంసము వేసవారము). అట్టి వేసవారము గురుత్వముగల్గి స్నిగ్ధముగనుండును. బలమును శరీరపుష్టిని వృద్ధినొందించును.

మరియు ఇగరవండినమాంసము శరీరమునకు స్థిరత్వమును కల్గించును. స్నిగ్ధముగ నుండును ఇంద్రియాదులకు ఆహ్లాదమును కల్గించును. శరీరపుష్టి నిచ్చును. గురుత్వము కల్గియుండును; రుచి పుట్టించును. బుద్ధిని, జాఠరాగ్నిని, మాంసమును, ఓజస్సును, శుక్రమును, వృద్ధినొందించును.

మెత్తగ మర్దించి పక్వముచేయబడినమాంసము పిష్టముగ నుండుటవలన పరిశుష్కమాంసముతో సమగుణముకలిగియుండును. లఘుత్వము కలిగియుండును.

శూలమునఁ గ్రుచ్చి పక్వముచేయబడిన మాంసము శూల్యము. అయ్యది శుక్రమును వృద్ధినొందించును. వాంతులను హరించును బలకరంబును పథ్యంబు నగును; చుల్కనగ జీర్ణమగును.

వండి రసముదీయబడినమాంసము రసహీనమగుటంజేసి శరీరపుష్టిని బలమును గలిగింపనోపదు. మలమును బంధించును. చాలకాలమునకు కష్టముగ జీర్ణమగును. రూక్షగుణము కలిగి వాతమును వృద్ధినొందించును.

ఇది కృతాన్నవర్గము.

## అథ మాంసవర్గః —

అవతారిక:—కృతాన్నవర్గమును జెప్పినపిదప అన్నమునకు వ్యంజనరూపము గ నుపయోగింపందగిన మాంసశాకవర్గములలో మాంసము గుణోత్తరంబుకావున తొలుత మాంసవర్గము చెప్పబడును:—

### మృగభేదములు

మూ॥ హరిణైణకురఙ్గర్శ్యగోకర్ణమృగమాతృకాః,
శశశమ్బరచారుష్కశరభాద్యామృగాస్స్మృతాః. ౬౬

వ్యా॥ జింక, నల్లనిజింక, లేడి, ఎలుగుగొడ్డు, కణుదులు, ఎఱ్ఱనిజింక, చెవులపిల్లి (కుందేలు), జింకపోతు, చారుష్కము, శరభము ఇవిమున్నగుజంతువులు మృగజాతితో చేరినవి. ఇచ్చట ఆదిశబ్దముచేత పొడలయుఱ్ఱి, దుప్పి మున్నగునవియు మృగజాతిలోచేరిన వని యెరుంగునది.

### విష్కిరభేదములు

మూ॥ లావవర్తికవర్తీర రక్తవర్త్మక కర్కరాః,
కపిఞ్జలోపచక్రాఖ్య చకోరకురుబాహవః. ౬౭
వర్తకా వర్తికా చైవ తిత్తిరీ కృకరశ్శిఖీ,
తామ్రచూడాఖ్యకరకగోనర్దగిరివర్తికాః. ౬౮

తథా శారపదేన్ద్రాహ్వాః వరటాశ్చేతి విష్కిరాః,

వ్యా. లావుకపిట్ట, వర్తికము, వర్తీరము, రక్తవర్త్మకము, కర్కరము, కపింజలము (చిత్రవర్ణములగు రెక్కలుకలపక్షి), ఉపచక్రము, చకోరము, కురుబాహుకము, వర్తకము (వెలిచెపిట్ట), వర్తిక (మీనవల్లంకి), తిత్తిరి (తీతువుపిట్ట), కృకరము, నెమలి, కోడి, వరకము, గోనర్దము (బెగ్గురుపక్షి), గిరివర్తికము, శారపదము, ఇంద్రాహ్వము, వరట (ఆడహంస), ఈపక్షిజాతులు విష్కిరము లని చెప్పబడును. ("వికీర్యభక్షయన్తీతి విష్కిరః" అనువ్యుత్పత్తిచేత కాళ్లతో జిమ్ముచు ముక్కులో పురుగులు మున్నగువానిని తినునవి విష్కిరము లని యెరుంగునది).

## ప్రతుదవివరము

మూ. జీవం జీవకదత్యూహ భృఙ్గాహ్వా శుకశారికాః. ౧౯
లట్వా కోకిలహారీత కపోత చటకాదయః,
ప్రతుదాః................

వ్యా. జీవంజీవకము (వెన్నెలపులుగు), దత్యూహము (కూకురుగుడ్డంగి), భృంగాహ్వము (కాకటి మూగపిట్ట), చిలుక, గోరువంకపిట్ట, లట్వ (ఊరపిచ్చుక), కోవిల, హారీతము (పసరిపిట్ట), కపోతము (గువ్వపిట్ట), చటక (ఊరపిచ్చుక మగది), ఇవిమున్నగు పక్షులు ప్రతుదములు, "ప్రతుద్యభక్షయన్తీతి ప్రతుదాః" అను వ్యుత్పత్తిచేత ముక్కుతో మాంసాదులను పొడిచి తినుపక్షులు ప్రతుదము లని యెరుంగునది).

## బిలేశయములు

మూ. .........భేకగోధాహిశ్వావిదాద్యా బిలేశయాః. ౨౦

వ్యా. కప్ప, ఉడుము, పాము, ముండ్లపంది మొదలగునవి బిలేశయములు, (బొరియలయందు వసించునవి).

## ప్రసహములు

మూ. గోఖరాశ్వతరోష్ట్రాశ్వద్వీపిసింహర్క్షవానరాః,
మార్జాలమూషకవ్యాఘ్రవృకబభ్రుతరక్షవః. ౨౧
లోపాకజమ్బుకశ్యేనచాషవాన్తాదవాయసాః,
శశఘ్నీవాతకరకగృధ్రోలూకకులిఙ్గకాః. ౨౨
ధూమికా మధుహా చేతి ప్రసహా మృగపక్షిణః,

వ్యా. ఆవు, గాడిద, కంచరగాడిద, ఒంటె, గుఱ్ఱము, చిరుతపులి, సింహము, ఎలుగుబంటి, కోతి, పిల్లి, ఎలుక, పెద్దపులి, తోడేలు, ముంగిస, సివంగి, లోపాక (వరడు

నక్ర), నక్ర, అనునీమృగములును; శ్యేనము (డేగ), చాషము (పాలపిట్ట), వాంతాదము (వాంతిజేసినయశుద్ధమును తినుపక్షివిశేషము), కాకి, శతఘ్ని, కరకము, గృద్ధ, గుడ్లగూబ, కులిఙ్గకము (నల్లనిపిచ్చుక), ధూమిక, మధుహా, అనునీపక్షులును ప్రసహములు, ("ప్రసహ్యాభక్షయంతీతి ప్రసహాః" అనువ్యుత్పత్తిచేత తనకు లోబడినజంతువులను బలాత్కారముగ లాగికొని తినునట్టిజంతువు లని తెలిసెడి).

—— మహామృగములు ——

మూ. వరాహమహిషన్యఙ్కురురురోహితదారుణాః (వారణాః). ౭౩
సృమరశ్చమరః ఖడ్గో గవయాశ్చ మహామృగాః,

వ్యా. పంది, ఎనుబోతు, జింకబోతు, రురు(దుప్పి), రోహితము, ఏనుగు, సృమరము (చమరభేదము), చమరీమృగము, ఖడ్గమృగము, గవయము, అను నీజంతువులు మహామృగము లని చెప్పబడును. (మృగజాతిలో గొప్పవి మహామృగములు).

—— అప్చరములు ——

మూ. హంససారసకాదమ్బబకకారణ్డవప్లవాః. ౭౪
బలాకోత్క్రోశచక్రాహ్వమద్గుక్రౌఞ్చాదయో ప్చరాః,

వ్యా. హంస, సారసము (బెగ్గురుపక్షి), కలహంసము, కొంగ, కారండవము (నీరుకోడి), ప్లవము (నీటికప్ప), బలాక (తెల్లనికొంగ), ఉత్క్రోశము (పెన్నెడపులుగు), చక్రాహ్వము (చక్రవాకము), మద్గు (నీరుకాకి), క్రౌంచము ఇవి మొదలగుజంతువులు అప్చరములు (నీటియందు సంచరించునవి).

—— మత్స్యములు ——

మూ. మత్స్యా రోహితపాఠీనకూర్మకుమ్భీరకర్కటాః. ౭౫
శుక్తిశఙ్ఖార్ద్రిశమ్బూకశఫరీవర్మిచన్ద్రికాః,
జలూకనక్రమకరశింశుమారతిమిఙ్గిలాః. ౭౬
రాజీచిలచిమాద్యాశ్చ మాంసమిత్యాహురష్టధా,

వ్యా. రోహితము, పాఠీనము (అనేకదంతములు కలమత్స్యవిశేషము), తాబేలు, కుంభీరము (కారుమొసలి), ఎండ్రకాయ, ముత్యములుపుట్టునట్టిజలచరము, శంఖము (నత్తలు), ఆర్ద్రికము, నత్తగుల్లలు, శఫరి (బేడిసచేప), వర్మి, చంద్రిక, జలూక (జలగ) నక్రము, మకరము, శింశుమారము, (ఈమూడును పైజెప్పబడిన కుంభీర మనునదియు మొసలిజాతితో చేరినవి). తిమింగిలము (ఇది గొప్పచేప), రాజి (చారలుకలమత్స్యవిశేషము). చిలచిమము ఇవి మున్నగునవి మత్స్యజాతివిశేషములు. ఇత్తెరంగున మృగములు

మొదలుజేసి మత్స్యజాతివరకును జెప్పబడిన జంతుజాతు లెనిమిదియు మాంసమునకు ఉపాదానకారణము లగుటంజేసి మాంస మెనిమిదివిధములుగ నుండు నని ప్రాచీనమహర్షులు చెప్పెదరు. (పైజెప్పబడిన మృగములు, విష్కిరములు, ప్రతుదములు, బిలేశయములు, ప్రసహములు, మహామృగములు, అప్చరములు, మత్స్యములు, అను నీయెనిమిది జంతువులు మాంసమునకు కారణములు; కావున మాంసము ఎనిమిదివిధముల నుండు నని భావము).

చరకాచార్యులు జంతువర్గముల నిట్లు పరిగణనముచేసెను. "ప్రసహ్యభక్షయన్తీతి ప్రసహాస్తేన సంజ్ఞితాః, భూశయా బిలవాసిత్వాత్, ఆనూపానూపసంశ్రయాత్, జలేన వాసాజ్జలజాః, జలేచ ర్యాజ్జలేచరాః, స్థలజాజాఙ్గలాః ప్రోక్తాః మృగాఃజాఙ్గలచారిణః, వికార్యవిష్కిరాశ్చేతి, ప్రతుద్యప్రతుదాస్స్మృతాః, యోనిరష్టవిధా త్వేషాం మాంసానాం పరికీర్తితా" బలాత్కారముగ నాహారపదార్థమును లాగికొని తినునవి ప్రసహములు, భూమియందలి బొరియలలో నుండునవి భూశయములు. జలప్రాంతమున సంచరించునవి ఆనూపములు, నీటియందు పుట్టి యందుండునవి జలజములు (మత్స్యాదులు), జలముపై సంచరించునవి జలచరములు (నీటికోడి మున్నగునవి). మెట్టభూమియందుపుట్టి మెరకస్థలములయందు సంచరించునవి జాంగలములు అవియే మృగజాతికి చేరినవి. తాళ్లతో చిమ్ముచు నాహారమును తినునవి విష్కిరములు. మాంసాదులను ముక్కున బొడిచితినునవి ప్రతుదములు. ఈయెనిమిదిజంతువర్గములును మాంసముయొక్క ఉత్పత్తికి కారణములుగ నుండును. కావున మాంసము ఎనిమిదివిధములని భావము. ఈపరిగణనమునకును ప్రకృతగ్రంథమున జెప్పినదానికి భేదము కనప్పట్టదు. ఈశ్లోకములయందు ప్రసహాదిసంజ్ఞలకు నిర్వచనముచే నన్వర్థతచెప్పబడియె.

### జాంగల ఆనూపజంతువిభాగము

మూ. యోనిష్వజావీ వ్యామిశ్రగోచరత్వాదనిశ్చితే. 22
ఆద్యాన్త్యాః జాఙ్గలాఽనూపాః మధ్యౌ సాధారణౌ స్మృతౌ,

వ్యా. పైజెప్పినమాంసయోనివర్గము లెనిమిదింటితో మేక, గొఱ్ఱె అను నీరెండు జాతులును జాంగలానూపదేశనియములేక రెంటియందును సంచరించునుగాన ఇయ్యది జాంగలము ఇయ్యది ఆనూపము నని నిర్ణయించి చెప్పవలనుపడదు. కావున పైవర్గములతో జెప్పబడలేదు. మరియు పైజెప్పిన యెనిమిదిమాంసయోనివర్గములలో మొదట చెప్పబడిన మృగవిష్కిరప్రతుదములు మూడును జాంగలదేశమున సంచరించునవిగాన జాంగలము లని చెప్పబడును. కడపటనుండు మహామృగ అప్చరమత్స్యవర్గములు మూడును అనూపదేశమున సంచరించునవి కావున ఆనూపములని చెప్పబడును. నడుమనుండు తక్కిన

బిలేశయప్రసహావర్గములు రెండును జాంగలదేశమందును అనూపదేశమందును (రెండు దేశములయందు) సంచరించునవి కావున సాధారణము లని చెప్పబడును.

ఇచ్చట మధ్యౌ సాధారణౌ స్మృతౌ అని ద్వివచనమును నిర్దేశించుటచేత నడుమ నుండు రెండువర్గములు సాధారణములనియు, దానికిముందు మూడు వర్గములు జాంగలము లనియు, వెనుకటిమూడువర్గములు అనూపములనియు నూహింపదగియున్నది గాన నా రెండిటికిని వేరుగ సంఖ్యను నిర్దేశించుట యనవసరము.

జాంగలమాంసగుణము

మూ. తత్ర బద్ధమలాః రుచ్యాః మాంసానాముత్తమా హిమాః. ౭౮
కషాయస్వాదువిశదాః లఘవో జాఙ్గలాహితాః,
పిత్తోత్తరే వాతమధ్యే సన్నిపాతే కఫానుగే. ౭౯

వ్యా. పైజెప్పినమాంసములలో జాంగలజంతువులమాంసములు మలములను బంధించును. రుచిని బుట్టించును. అన్నిటిలో నీమాంసములు తక్కినవానికన్న మిక్కిలి శ్రేష్ఠములు. శీతవీర్యంబును, కషాయమధురరసంబులును విశదలఘుగుణంబులును కలిగియుండును. ఈమాంసములు పిత్తం బధికముగను వాతము మధ్యముగను ఉండి కఫమునను సరించిన సన్నిపాతమునందు మిక్కిలి వాతకరములు.

జింకమాంసగుణము

మూ. తామ్రోఽత్ర హారిణః కృష్ణస్త్రిణో హృద్యస్త్రిదోషజిత్,
లఘుర్యాకా షడ్రసశ్శీతః కటుశ్చాసౌ విపచ్యతే. ౮౦

వ్యా. జింకలలో నెఱ్ఱనిచారకలిగినది హారిణము. నల్లనిచారకలిగినది ఏణము. ఈ రెంటిమాంసము హృదంపమునకు హితకరమై త్రిదోషముల హరించును. చుల్కనగ జీర్ణమగును. మధురాదిరసము లారునుకలిగి శీతవీర్యమై యుండును. విపాకము జెందునపుడు కటువుగ నుండును.

కుందేటిమాంసగుణము

మూ. దీపనః కటుకః పాకే గ్రాహీరూక్షో హిమశ్శశః,

వ్యా. కుందేటిమాంసము అగ్నిని దీపింపజేసి యాకలి బుట్టించును. కటువిపాకము కలిగియుండును. మలాదులబంధించును. రూక్షగుణంబును శీతవీర్యంబును గలిగియుండును.

లావుకమాంసగుణము

మూ. లావాః కషాయమధురాః లఘవోఽగ్నివివర్ధనాః, ౮౧
విపాకే కటుకాః పథ్యాః సన్నిపాతేఽనిలావరే,

వ్యా. లావుకపిట్టలమాంసము కషాయమధురరసంబును లఘుగుణంబును అగ్నిని వృద్ధిచేయునదియు నగును. కటువిపాకము కలిగియుండును. వాతము హీనముగనుండు సన్నిపాతమున మిక్కిలి వాతకరము.

కపింజలమాంసగుణము

మూ. పిత్తశ్లేష్మవికారేషు సరక్తేషు కపిఞ్జలాః. ౮౨
మన్దవాతేషు శస్యన్తే శైత్యమాధుర్యలాఘవైః,

వ్యా. కపింజలమాంసము శీతవీర్యంబును మధురరసంబును కలిగి చుల్కనగ జీర్ణమగును. వాతము మందముగనుండు పిత్తకఫరోగములయందును, రక్తదోషమున గలిగిన రోగమునందును మిక్కిలి ప్రశస్తము.

వర్తికమాంసగుణము

మూ. కపిఞ్జలసమః పథ్యో వార్తికో వహ్నిదీపనః. ౮3
క్షయకాసజ్వరశ్వాసవ్రణకోష్ఠామయాన్ జయేత్,

వ్యా. వర్తిక మనుపక్షియొక్కమాంసము కపింజలమాంసముతో సమగుణముకలిగి పథ్యకరంబును అగ్నిదీపనకరంబు నగును. క్షయము కాసము జ్వరము శ్వాసము వ్రణములు కోష్ఠమున సంభవించు రోగములు వీనినన్నిటిని హరించును.

వర్తకాదిమాంసగుణము

మూ. ఈషదుష్ణా గురుస్నిగ్ధా బృంహణా వర్తకాదయః. ౮౪
తిత్తిరస్తేష్వపి వరో మేధాగ్నిబలశుక్రకృత్,
గ్రాహీ వర్ణ్యోఽనిలోద్రిక్తసన్నిపాతహరః పరమ్. ౮౫

వ్యా. వర్తకము మున్నగుజాంగలజంతువులమాంసములు కొంచెముగ నుష్ణము కలిగియుండును. గురుత్వముకలిగి స్నిగ్ధములై శరీరపుష్టిని కలిగించునవిగ నుండును. వానితో తిత్తిరిపక్షి (తీతువుపిట్ట) మిక్కిలి శ్రేష్ఠము. బుద్ధిని జాఠరాగ్నిని బలమును శుక్రమును వృద్ధినొందించును. మలమును బంధించును. శరీరకాంతిని కలిగించును. వాతాధికమైన సన్నిపాతమును ముఖ్యముగ హరించును.

నెమలిమాంసగుణము

మూ. నాతిపథ్యశ్శిఖీ పథ్యః శ్రోత్రస్వరవయోదృశామ్,
స్వాదుపాకరసస్నిగ్ధః బృంహణో బలకృద్గురుః. ౮౬

వ్యా. నెమలిమాంసము మధురరసంబును మధురవిపాకంబును స్నిగ్ధగుణంబునుకలిగి స్వల్పముగ పథ్యకరమగును. చెవులకును కంఠస్వరమునకును వయస్సునకును కన్నులకును మిక్కిలి హితకరము. శరీరపుష్టిని బలమును కలిగించును. గురుత్వము కలిగియుండును.

కోడిమాంసగుణము

మూ. ఉష్ణోవృష్యోఽనిలహరః స్వేదనశ్చాపి కుక్కుటః,
వృష్యో లఘుర్దీపనీయః గ్రామ్యస్తు శ్లేష్మతోగురుః. ౮౭

వ్యా. కోడిమాంసము ఉష్ణంబును బలకరంబును వాతహరంబును నగును. శరీరముపై చెమట బుట్టించును. శుక్రమును వృద్ధినొందించును. తేలికగ జీర్ణమగును. ఆకలిబుట్టించును. (ఇది అడవికోడిగుణము) ఊరకోడి గురుత్వముకలిగి కఫమును వృద్ధినొందించును.

వాగ్భటాచార్యుడు నెమలిమాంసగుణములచెప్పి "తద్వచ్చ కుక్కుటో జ్ఞేయః" అని చెప్పియున్నారు కావున నెమలిమాంసమునకు చెప్పినగుణములుకూడ అడవికోడిమాంసమునకు కలిగియుండునని యెరుంగునది.

కాక కపోతమాంసగుణములు

మూ. గురుస్సలవణః కాకః కపోతస్సర్వదోషకృత్,

వ్యా. కాకిమాంసము గురుత్వమును కలిగించును. ఉప్పగనుండును. కపోతమాంసము దోషముల నన్నిటిని కలిగించును.

చటకవల్లుజమాంసగుణములు

మూ. చటకస్సన్నిపాతఘ్నః కఫశుక్రవివర్ధనః. ౮౮
వల్లుజో మధురస్స్నిగ్ధః బద్ధమూత్రోఽతి మేదురః,

వ్యా. ఊరపిచ్చుకమాంసము సన్నిపాతమును హరించును. కఫమును శుక్రమును మిక్కిలి వృద్ధినొందించును. వల్లుజము అనుపిట్టమాంసము మధురంబును స్నిగ్ధంబును నగును. మూత్రమును బంధించును. మేదస్సును మిక్కుటముగ వృద్ధినొందించును.

బిలేశయాదివర్గములమాంససామాన్యగుణములు

మూ. గురూష్ణస్నిగ్ధమధురా వర్గాశ్చాతో యథోత్తరమ్. ౮౯
మూత్రశుక్రకృతో బల్యాః వాతఘ్నాః కఫపిత్తలాః,

వ్యా. పైజెప్పబడినవర్గములుగాక తక్కినవర్గములందలి జంతువులమాంసములు ఒక వర్గమునకన్న నొకవర్గము ఈచెప్పంబడుగుణముచే నొకదానికన్న నొకటి యధికముగ నుండును. గురుత్వము, ఉష్ణము స్నిగ్ధము అనుగుణములును, మధురరసంబును కలిగియుండును. మూత్రమును శుక్రమును బలమును వృద్ధినొందించును. వాతమును హరించును. కఫపిత్తముల వృద్ధినొందించును. (ఈగుణములు ఒకవర్గమునకన్న నొకవర్గమున నధికముగ నుండు నని భావము).

మహామృగ, ప్రసహములమాంసవిశేషగుణములు

మూ. శీతా మహామృగాస్తేషాం క్రవ్యాదాః ప్రసహాః పునః. ౯౦

లవణానురసాః పాకే కటుకా మాంసవర్ధనాః,
జీర్ణాఽర్శో గ్రహణీదోషశోషార్తానాం పరం హితాః. ౯౧

వ్యా॥ ఆవర్గములలో మహామృగములమాంసము శీతవీర్యము కలిగియుండును. మాంసమును తినునట్టి (పిల్లిగడ్డ మున్నగునవి) ప్రసహములు కొంచెము ఉప్పగ నుండును, కటువుగ విపాకము జెందును. మాంసమును వృద్ధినొందించును. జీర్ణమైన అర్శోరోగము నందును, గ్రహణిరోగమునందును, శోషరోగమునందును మిక్కిలి హితకరములు.

### గోధామాంసగుణములు

మూ॥ స్వాదుపాకరసా బల్యా గోధా పిత్తాఽనిలప్రణుత్,

వ్యా॥ ఉడుముమాంసము మధురరసంబును మధురవిపాకంబును కలిగియుండును. బలమును వృద్ధినొందించును. పిత్తవాతముల హరించును.

### గోమాంసగుణము

మూ॥ శుష్కకాసశ్రమాఽత్యగ్నివిషమజ్వరపీనసాన్. ౯౨
కార్శ్యకేవలవాతాంశ్చ గోమాంసం సన్నియచ్ఛతి,

వ్యా॥ గోమాంసము, శుష్కకాసము (పొడిదగ్గు)ను, శ్రమమును, మితిమీరిన జఠరాగ్నిని, విషమజ్వరమును, పీనసమును, శరీరకృశతను, కేవల వాతరోగములను వీని నన్నింటిని హరించును.

### మూషికాదిమాంసగుణము

మూ॥ మధురా లఘవో బల్యాః చక్షుష్యాః శోణితాహితాః. ౯౩
పిత్తలాః సృష్టవిణ్మూత్రాః కాసాఽర్శశ్శ్వాసనాశనాః,
మూషికాశ్శుక్లకృష్ణాశ్చ చిత్రాశ్చ సదృశా గుణైః. ౯౪
ఉన్దురుర్మధురం పాకే గుర్వభిష్యన్ది మేదురమ్,
కలిఙ్గాస్తిక్తమధురాః కషాయానురసా హితాః. ౯౫
వాతశోణితపిత్తేషు విశేషాత్ శ్లేష్మశుక్రలాః,

వ్యా॥ ఎలుకలమాంసము మధురరసంబును లఘుగుణంబునగును. బలమును కలిగించును. నేత్రములకు హితము; రక్తమునకు హితముకాదు. పిత్తమును వృద్ధినొందించును, మలమూత్రములను వెడలించును. కాసమును అర్శస్సును శ్వాసమును హరించును. ఎలుకలు శుక్లకృష్ణచిత్రవర్ణములచే మూడువిధముల నుండును. ఈమూడును సమానగుణము లై యుండును. చుంచెలుక పాకమున మధురముగ నుండును. గురుత్వము కలిగియుండును. శోణితస్సు ద్రవమును పుట్టించును. మేదస్సును వృద్ధినొందించును. కలింగములు తిక్త

మధురరసములు ప్రధానముగను, కషాయరసము పరసముగను కలిగియుండును. వాతరక్త వ్యాధియందును పిత్తరోగములయందును మిక్కిలి హితకరములు.

పందిమాంసగుణము

మూ. స్నేహనం బృంహణం వృష్యం శ్రమఘ్నమనిలాపహమ్, ౯౬
వారాహం పిత్తలం బల్యం స్వేదనం రోచనం గురు,

వ్యా. పందిమాంసము దేహమున స్నేహమును కలిగించును. శరీరపుష్టినిచ్చును. శుక్రమును వృద్ధినొందించును. వాతమును హరించును, పిత్తమును వృద్ధినొందించును. బలమును కలిగించును. చెమటపుట్టించును. రుచిని కలిగించును. గురుత్వము కలిగియుండును.

ఎనుబోతుమాంసగుణము

మూ. ఉష్ణో గరీయాన్ మహిషః స్వప్నదార్ఢ్యబృహత్వకృత్. ౯౭

వ్యా. ఎనుబోతుమాంసము ఉష్ణగుణముకలిగి మిక్కిలి గురుత్వముగలిగి యుండును నిద్రను కలిగించును, శరీరమును దృఢముగజేసి బలియజేయును.

ఈగుణములజెప్పి పిదప వరాహగుణముల జెప్పునపుడు "తద్వద్వరాహశ్శ్రమహా" అని వాగ్భటాచార్యులు చెప్పిరి గాన పైజెప్పిన మహిషమాంసగుణములు వరాహమాంసమునకును కలిగియుండునని యెరుంగునది.

హంసాదిమాంసగుణములు

మూ. స్వరవర్ణకరో హంసః బలాకా స్నేహనీ హిమా,
వస్తిశుద్ధికరః క్రౌఞ్చః స్వాదుపాకరసో హిమః. ౯౮
ఉద కుక్కుటికా వృష్యా శ్లేష్మలా వర్తనీ గురుః,

వ్యా. హంసమాంసము కంఠస్వరమును శరీరవర్ణమును బాగుచేయును. బలాక (హంసవిశేషము) శరీరమున స్నేహమును కలిగించును. శీతవీర్యమగును. క్రౌంచమాంసము వస్తిని శుభ్రపరచును, పాకమునందును రసమునందును మధురముగ నుండును. శీతవీర్యము కలిగినది. నీరుకోడిమాంసము వృష్యముగ నుండును. లావుకపిట్టమాంసము కఫమును వృద్ధిచేయును. గురుత్వముచేయును.

మత్స్యములగుణము

మూ. కఫపిత్తకరాః మత్స్యాః పరం పవననాశనాః. ౯౯
కషాయమధురా స్తేషాం శష్పశైవాలభోజినః,
రోహితో మారుతహరో నాత్యర్థం పిత్తకోపనః. ౧౦౦

వ్యా॰ మత్స్యములు కఫపిత్తముల వృద్ధినొందించును. ప్రభాసముగ వాతమును హరించును. వానిలో రోహితమను మత్స్యము లేతగానికను పాచిని తినుటవలన కషాయ మధురరసములు కలిగియుండును. కావున పిత్తమును విశేషముగ ప్రకోపింపదు.

పాఠీనకూర్మ మాంసగుణములు

మూ॰ పాఠీనం మధురం రుచ్యం స్యాద్విపాకరసం లఘు. ౧౧౧
మేదురం మధురం స్రంసి కూర్మం పిత్తహరం గురు.

వ్యా॰ పాఠీనమను మత్స్యము మధురరసము కలిగియుండును. రుచిని పుట్టించును. మధురవిపాకంబును లఘుగుణంబును కలిగియుండును. తాబేటిమాంసము మేదస్సును వృద్ధి నొందించును. మధురరసము కలిగియుండును. మలాదులపట్టు సడలించును. పిత్తమును హరించును; గురుత్వము కలిగియుండును.

కుళీరాదిగుణములు

మూ॰ కుళీరః పరమం వృష్యో బృంహణః ప్రీణనో గురుః. ౧౧౧
సాముద్రకర్కటాభేదీ మధురో భృశమేదురః,
పిత్తఘ్నాః శుక్తయస్సృష్టవిణ్మూత్రాః చక్షుషే హితాః. ౧౧౨
శమ్బూకస్సృష్టవిణ్మూత్రః మధురః పిత్తరోగహా,
శఙ్ఖశఙ్ఖనఖౌతద్వద్భేదనం చ పరం గురు. ౧౧౩

వ్యా॰ ఎండ్రకాయ మిక్కిలి శుక్రమును వృద్ధినొందించును. శరీరపుష్టి నిచ్చును. తృప్తినికల్గించును. గురుత్వము కల్గియుండును. సముద్రమునందలి యెండ్రకాయలు మల ముల భేదించును. మధురముగ నుండును. మేదస్సును మిక్కిలి వృద్ధినొందించును. ముత్యపుచిప్పలు పిత్తమును హరించును. మలమూత్రములను వెడలించును. కన్నులకు మిక్కిలి వాతకరములు. నత్తగుల్లలు మలమూత్రముల వెడలించును. మధురరసముగ నుండును. పిత్తరోగముల హరించును. శంఖము, శంఖనఖము ఈరెండును నత్తగుల్లలబోలె మలమును భేదించును. మిక్కిలి గురుత్వము కల్గియుండును.

పాటలాస్యాదిమత్స్యగుణములు

మూ॰ మధురం పాటలాస్యం స్యాత్ రుచ్యం మేధ్యమగుర్వపి,
వర్తితం మధురం మేధ్యం లఘురుచ్యమమేదురమ్. ౧౧౪
విదుళం పిచ్ఛిలం కిఞ్చిత్ మధురం శ్లేష్మలం గురుః,
అమేదురం రోమశరం స్యాన్మధురం లఘుపిత్తలమ్. ౧౧౫

వ్యా॰ పాటలాస్యమనుమత్స్యము మధురరసంబును రుచికరంబును బుద్ధిని వృద్ధి నొందించునదియు నగును. గురుత్వము లేకుండును. వర్తికము మధురంబును, బుద్ధికరంబును, లఘుగుణంబును, రుచికరంబును నగును. శరీరమును బలియజేయదు. వదుశమను మత్స్యము పిచ్ఛిలంబును కొంచెము మధురంబును కఫమును వృద్ధినొందించునదియు గురుగుణంబు నగును. రోమరమను మత్స్యము మేదురముగా నోపదు; మధురంబును లఘుగుణంబును పిత్తకరంబునగును.

## సహస్రదంష్ట్రగుణము

మూ॰ సహస్రదన్తి వక్త్రాంసి త్రిదోషం స్వాదుమేదురమ్,
మధురం కటుకం పాకే రుచ్యం తృష్ణం (కృష్ణః) ప్రమేహనుత్.

వ్యా॰ సహస్రదంష్ట్ర (అనేకదంతములుకల) అనుమత్స్యము మలమును వెడలించును. అందు బలిసియుండునది త్రిదోషములను వృద్ధినొందించును. మధురముగ నుండును. నల్లనివి మధురరసంబును కటువిపాకంబును కలిగి రుచికరముగ నుండును. ప్రమేహములను హరించును.

## వర్తిరమత్స్యగుణము

మూ॰ పిత్తతో మధురో మేధ్యో వర్తిరాఖ్యోఽమ్లసాధనః,
రుచ్యోఽగ్నిమాన్ద్యకృద్వృష్యో మతివిధ్వంసనోఽగ్నికృత్.

వ్యా॰ వర్తిరమనుమత్స్యము పిత్తకరము. మధురరసము కలిగినది. మేధాకరము. అయ్యది పులుపుచేర్చి పక్వముజేసినచో రుచికరంబగును. జఠరాగ్నిని మందగింపజేయును. శుక్రమును వృద్ధినొందించును. బుద్ధిని చెరచును. అగ్నిని దీపింపజేయును.

## పెద్దవి చిన్నవియగుమత్స్యముల గుణములు

మూ॰ కేవలం మేదురం రుచ్యం దోషలం శుక్రవర్ధనమ్. ౧౦౭
ఈషత్స్వాదురసః క్షుద్రమత్స్యో దోషత్రయాపహః,

వ్యా॰ మత్స్యజాతిలో పెద్దవియై బలిసియుండు మత్స్యములు సామాన్యముగ రుచికరములుగ నుండును. త్రిదోషములను శుక్రమును వృద్ధినొందించును. చిన్నవిగనుండు మత్స్యములు కొంచెముగ మధురరసముకలిగి దోషత్రయమును హరించును.

## సంస్కారవిశేషముచే మత్స్యగుణభేదము

మూ॰ విరసం తిక్తమధురం తణ్డులాఖ్యం వాతరోగి చ. ౧౦౮
మధురః ప్రియకోఽపథ్యో మధుకశ్లేష్మతో గురుః,
తద్వచ్ఛవాతతాతౌ ద్వ్యోవాతఘ్నా అమ్లసాధనా. ౧౦౯

వ్యా. మత్స్యములను చిక్కిశరతో జేర్చి పక్వముచేసినచో తిక్తమధురరసములు కలిగి రుచికరముగా నుండును. వాతహారముగ నుండును. ప్రియకమనుమత్స్యము మధుర రసంబును అపథ్యకరంబు నగును. మధుక మనునది కఫమును వృద్ధినొందించును. గురుత్వము కలిగియుండును. ఈరెండును వాతమును వృద్ధినొందించును. ఈరెండిటిని పులుసుచేర్చి పక్వముజేసినచో వాతహారము లగును.

గర్గరాదిమత్స్యగుణములు

మూ. అతిగుర్వతిమేధ్యం చ దోషలం గర్గరం విదుః,
అమేధ్యం మధుకం పథ్యం సర్వదోషహరం లఘు. ౧౧౦
మీనకం కటుకం పాకే తద్వర్ణేన ముచుణ్డికా,
చర్మలో మధురః పథ్యః బల్యః పిత్తహరో లఘుః. ౧౧౧
పాటలంతిక్తమధురం అమేధ్యం నాతిదోషలమ్,
సాముద్రః కిక్కసో మత్స్యో దీపనః కృశబృంహణః,
అరోచకహరః స్నిగ్ధః వృష్యశ్శ్లేష్మానిలాపహః. ౧౧౨

వ్యా. గర్గర మనుమత్స్యము మిక్కిలి పెద్దదియగునేని బుద్ధిని మిక్కిలి వృద్ధి చేయును. చిన్నది యగునేని బుద్ధికి వాతకరము కానోపదు. మధురంబై పథ్యకరమగును. త్రిదోషముల హరించును. మీనక మనునది కటువిపాకము కలిగియుండును. ముచుండిక యనునది వర్ణమును కలిగించును. చర్మల మనునది మధురంబును పథ్యంబును బలకరంబును పిత్తహారంబును నై లఘువుగ నుండును. పాటల మనునది తిక్తమధురరసములు కలిగి యుండును. బుద్ధికి హితముకాదు. దోషముల కొంచెముగ వృద్ధిజేయును. సముద్రమున పుట్టిన కిక్కస మనుమత్స్యము అగ్నిని దీపింపజేయును. కృశించినవారిని బలియజేయును. అరుచిని హరించును. స్నిగ్ధముగ నుండును. శుక్రమును వృద్ధినొందించును. కఫవాతముల హరించును. (ఇచ్చట మత్స్యవిశేషనామములు తెలియుటకు దురూహము కావున వాని నామభేదముల మత్స్యములబట్టు వారిమూలమున నరయందగును.)

మేకలుగొర్రెయలు వీనిమాంసములగుణములు

మూ. నాతిశీతం గురు స్నిగ్ధం మాంసమాజమదోషలమ్,
శరీరధాతుసామాన్యాదనభిష్యన్ది బృంహణమ్. ౧౧౩
విపరీతమతో జ్ఞేయమావికం బృంహణం తు తత్,

వ్యా. మేకమాంసము స్వల్పముగ శీతగుణము కలిగియుండును. గురుత్వము జేయును. స్నిగ్ధముగ నుండును. దోషములను స్వల్పముగ వృద్ధినొందించును. మేకలశరీ

రమునందలి మాంసాది ధాతువులు మనుజులశరీరమునందలి ధాతువులతో సమానములగు గుణములు కలిగియుండును గాన వానిమాంసము స్రోతస్సుల ద్రవింపకయే శరీరమునకు పుష్టిని కలిగించును. గొఱ్ఱెమాంసము పైజెప్పిన మేకమాంసమునకన్న వ్యతిరేకములగు గుణములు కలిగియుండును. శరీరమునుమాత్రము పుష్టినొందించును. (గొఱ్ఱెమాంసము అత్యుష్ణ గుణము కలిగియుండియు శరీరపుష్టిని కలిగించు ననుట.)

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—భూమిగుణంబును జలగుణంబును కల ద్రవ్యము బృంహణమగుట సాజము. అయ్యది స్రోతస్సుల ద్రవింపజేయకమానదు. ఇచ్చట మేకమాంసము అనభిష్యందమై బృంహణం బెట్లగునని యాశంక కల్గును. అయినను మేక మాంసము తనయందలి యచింత్యమగు ప్రభావమునం జేసి అనభిష్యందియు బృంహణంబు నగునని యెఱుంగునది.

భుజింపదగని మాంసము

మూ. అతిమేద్యం త్యజేన్మాంసం హతం వ్యాధివిషోదకైః. ౧౧౪
స్వయం మృతం చాయు పూర్ణం ఆగోచరమృతం కృశమ్,

వ్యా. అపరిశుద్ధమైన మాంసంబును మిక్కిలి బలసినజంతువులమాంసమును, వ్యాధుల చేతను, విషము చేతను, నీళ్ల చేతను, చచ్చినజంతువుయొక్క మాంసంబును, తనంతనే చచ్చిన జంతువులమాంసంబును, ఆమముచే నిండియుండుజంతువులమాంసంబును, తనకు తెలియని ప్రదేశమున చచ్చిన జంతువుల మాంసంబును మిక్కిలి కృశించినజంతువులమాంసంబును విడువం దగును (భుజింపజనదనుట), మరియు మాంసము నధికముగ భుజింపదగదు.

గ్రాహ్యమాంసము

మూ. సద్యోహతం వయస్థ్సం చ శుద్ధం సురభి శస్యతే. ౧౧౫

వ్యా. అప్పుడు చంపబడినజంతువులమాంసంబును, మంచివయసుననుండు జంతువుల మాంసంబును, సువాసనకలిగినమాంసంబును, దోషరహితమై శుద్ధముగ నుండుమాంసంబును తినుటకు ప్రశస్తముగ నుండును.

బాలాదిమాంసగుణవిశేషములు

మూ. గురూణ్యండాని బాలానాం కషాయమధురం పలమ్. ౧౧౬
వృద్ధానాం స్నాయుభూయిష్ఠమబల్యం గురుదోషలమ్,
పుంస్త్రియోః పూర్వపశ్చార్ధే గురుణీ గర్భిణీ గురుః. ౧౧౭

వ్యా. కోడిగ్రుడ్లు మున్నగునవి గురుత్వము కలిగియుండును. బాల్యవయసున నుండు జంతువులమాంసము కషాయము మధురరసములు కలిగించును. ముసలిజంతువుల

మాంసము స్నాయువులచే నిండియుండును. ఈమాంసములు గురుత్వముకలిగి దోషముల వృద్ధినొందించును. బలముసు గలిగింపనోపవు. మఱియు మగజంతువుల పూర్వశరీరము నందలి మాంసంబును, ఆడుజంతువుల వెనుకశరీరమునందలిమాంసంబును, చూటితోనుండు జంతువులమాంసంబును గురుత్వము కలిగియుండును.

మాంసములలో గురులఘుతారతమ్యము

మూ. లఘుః యోషిచ్చతుష్పాత్సు విహంగేషు పునః పుమాన్,
శిరస్స్కన్ధోరుపృష్ఠస్య కట్యాస్సక్థ్నోశ్చ గౌరవమ్. ౧౧౮
తథానుపక్వాశయయోః యథా పూర్వం వినిర్దిశేత్,
శోణితప్రభృతానాం చ ధాతూనాముత్తరోత్తరమ్. ౧౧౯
మాంసాద్గరీయో వృషణమేఢ్రవృక్కయకృద్గుదమ్,
మత్స్యానాం గురుపూర్వార్ధం మహాదేహాస్సగౌరవాః. ౧౨౦
లావరోహితగోధైణాః స్వే స్వే వర్గే వరాః పరమ్.

వ్యా. నాల్గుకాళ్లుకల (ఆవు మున్నగు) జంతువులలో నాడుజంతువులమాంసంబును, పక్షిజాతిలో మగజంతువులమాంసంబును లఘువుగ నుండును. ఏజంతువులయందును తల, భుజములు, వీపు, నడుము, తొడలు, అనునవయవములలో నుండుమాంసములు వెనుకకు వరుసగ నొకదానికన్న నొకటి గురుత్వము కలిగియుండును. (తొడలమాంసమునకన్న నడుముమాంసంబును, దానికన్న వీపుమాంసంబును, దానికన్న ముందరికాళ్ళ పైభాగము నందలిమాంసంబును, వీనికన్నిటికన్న శిరస్సునందలిమాంసంబును గురుత్వము కలిగియుండు ననుట). ఆమపక్వాశయముల నుండుమాంసములో పక్వాశయమాంసమునకన్న నామాశయ మాంసము గురుత్వము కలిగియుండును. రక్తాదిధాతువులలో నొకటికన్న నొకటి వరుసగ గురుత్వము కలిగియుండును. (రక్తమునకంటె మాంసంబును, మాంసమునకన్న మేదస్సును, మేదస్సుకన్న అస్థులును, అస్థులకన్న మజ్జయు, మజ్జకన్న శుక్రంబును గురుత్వము కలిగిన దనుట). మాంసమునకన్న వృషణంబులును, వృషణములకన్న మేఢ్రంబును, దానికన్న వృక్కములును, అంతకన్న యకృత్తును, దానికన్న యకృత్కును వరుసగ గురుత్వము కలిగియుండును. మత్స్యములశరీరమున పూర్వభాగంబును, గొప్పయాకారములు కలమత్స్యంబులును మిక్కిలి గురుత్వము కలిగియుండును. మఱియు లావంబును, లోహితమత్స్యంబును, ఉడుమును, ఏణంబును, వానివానివర్గములలో మిక్కిలి శ్రేష్ఠములు. (విష్కిరములలో లావుకపిట్టయు, మత్స్యములలో రోహితమత్స్యంబును, బిలేశయము లలో నుడుమును, మృగములలో నల్లనియిఱ్ఱియు మిగుల శ్రేష్ఠము లనుట).

ఇత్యామిషవర్గః (ఇదిమాంసవర్గము)

అథ శాకవర్గః—

అవతారిక:—ఆహారమున కుపయుక్తములగు వ్యంజనములతో మాంసవర్గమును చెప్పినపిదప శాకవర్గమిా క్రిందగుణాదులచే నిరూపింపబడును.

పాఠాదిశాకసామాన్యగుణములు

మూ. శాకం పాఠా శఠీ శూషా (వూషా) సునిషణ్ణసతీనజమ్,
త్రిదోషఘ్నం లఘు గ్రాహి సరాజక్షవవాస్తుకమ్. ౧౨౧

వ్యా. చిరుబొద్ది, శఠి, నల్లదురదగొండి, చెంచలి, సతనము (పెద్దపెసర), చిలుక కూర, చక్రవర్తికూర, అను నీశాకములు వాతాదిదోషముల మూటిని హరించును. చుల్కనగ జీర్ణమగును. మలమును బంధించును.

సునిషణ్ణాదిశాకములవిశేషగుణములు

మూ. సునిషణ్ణోఽగ్నికృద్వృష్యః తేషు రాజక్షవఃపరమ్,
గ్రహణ్యర్శోవికారఘ్నః వర్చోభేదితువాస్తుకమ్. ౧౨౨

వ్యా. పైజెప్పిన శాకములతో చెంచలికూర విశేషముగ నగ్నిదీప్తి కలిగించి యాకలిపుట్టించును. శుక్రమును వృద్ధిచేయును. చిలుకకూర గ్రహణిరోగమును అర్శో రోగమును హరించును. చక్రవర్తికూర మలమును భేదించును.

కాచాకు పులిచింతాకుకూరల గుణములు

మూ. హన్తిదోషత్రయం కుష్ఠం వృష్యా సోష్ణా రసాయనీ,
కాకమాచీ సరాస్వర్యా చాఙ్గేర్యమ్లాఽగ్నిదీపనీ. ౧౨౩
గ్రహణ్యర్శోఽనిలశ్లేష్మహితోష్ణాగ్రాహిణీలఘుః,

వ్యా. కాచియాకుకూర దోషత్రయమును హరించును. కుష్ఠములను పోగొట్టును. శుక్రమును వృద్ధినొందించును. కొంచెము ఉష్ణవీర్యముగ నుండును. రసాయనమై జరామరణముల పోనడచును. శరీరమునం దతివేగముగ వ్యాపించును. కంఠస్వరమునకు హితకరము. పులిచింతాకు పుల్లగ నుండును. అగ్నిని దీపింపజేయును. గ్రహణిరోగము, అర్శోరోగము, వాతకఫములు వీనియందు మిక్కిలి హితకరము. ఉష్ణవీర్యము కలిగియుండును. మలాదుల బంధించును. తేలికగ జీర్ణమగును.

చిఱ్ఱికూరగుణము

మూ. తణ్డులీయో హిమో రూక్షః స్వాదుపాకరసో లఘుః,
మదపిత్తవిషాస్రఘ్నః.............

వ్యా. చిట్టికూర శీతవీర్యంబును, రూక్షగుణంబును, మధురవిపాకంబును, మధుర రసంబును కలిగియుండును. తేలికగ జీర్ణ మగును. మదమును, పిత్తమును, విషమును, రక్త దోషమును వీనిని హరించును.

గృంజనగుణము

మూ. ............గృఞ్జనం (ముంజాతం) వాత పిత్తజిత్. ౧౨౪
స్నిగ్ధం శీతం గురుస్వాదు బృంహణం శుక్రకృత్పరమ్,

వ్యా. గృంజనము (నీరుల్లికూర) వాతపిత్తముల హరించును. స్నిగ్ధంబును శీతవీర్యంబును గురుగుణంబును మధురంబు నగును. శరీరపుష్టి నిచ్చును. శుక్రమును వృద్ధిచేయును.

భ్రామరశాకగుణము

మూ. భ్రామరం మధురం హృద్యం సుగన్ధం భక్తరోచినమ్. ౧౨౫
పిత్తానిలకరం వృష్యం గ్రాహి శ్లేష్మకరం న చ,

వ్యా. భ్రామర మనుశాకవిశేషము మధురముగను హృదయమున కనుకూలముగ నుండును. మంచివాసనగలిగి యన్నమున రుచిబుట్టించును. పిత్తవాతముల వృద్ధిజేసి శుక్రమును వృద్ధినొందించును. మలమును బంధించును. కఫమును మాత్రము వృద్ధినొందించదు.

అభీకశాకగుణము

మూ. అభీకా శీతమధురా త్రిదోషశమనీ లఘుః. ౧౨౬
హృద్యా రుచిప్రదా వృష్యా సుగన్ధా సృష్టమూత్రవిట్,

వ్యా. అభీక మనుశాకము శీతవీర్యంబును మధురరసంబును నై త్రిదోషముల శమింపజేయును. హృదయమున కనుకూలముగ నుండును. రుచిని కలిగించును. శుక్రమును వృద్ధినొందించును. మంచి పరిమళము కలిగియుండును. మలమూత్రముల వెడలించును.

పిల్లిపీచరమొలకలగుణము

మూ. శతావర్యఙ్కురాస్తిక్తాః వృష్యాః దోషత్రయాపహాః. ౧౨౭

వ్యా. పిల్లిపీచరమొలకలు తిక్తరసముకలిగి శుక్రమును వృద్ధినొందించును. త్రిదోషముల హరించును.

పొన్నగంటికూరగుణము

మూ. పత్తూరో దీపన స్తిక్తః ప్లీహార్శః కఫవాతజిత్,

వ్యా. పొన్నగంటికూర అగ్నిని దీపింపజేయును. తిక్తరసము కలిగియుండును. ప్లీహాభివృద్ధిని, అర్శోరోగమును, కఫవాతములను హరించును.

కసివెందగుణము

మూ. క్రిమికాసకఫోత్క్లేదాన్ కాసమర్దో జయేత్సరః. ౧౨౭

వ్యా. కసివెంద క్రిములను, కాసములను, కఫమును, ఓకళింతలను హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును.

కుసుంభసర్షపశాకములగుణములు

మూ. రూక్షోష్ణమమ్లం కౌసుమ్భంగురుపిత్తకరం సరమ్,
గురూష్ణం సార్షపం బద్ధవిణ్మూత్ర సర్వదోషకృత్. ౧౨౮

వ్యా. కుసుమకూర రూక్షగుణంబును, ఉష్ణవీర్యంబును, ఆమ్లరసంబును కలిగియుండును. గురుత్వమును జేయును. పిత్తమును వృద్ధినొందించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ఆవకూర గురుత్వంబును ఉష్ణవీర్యంబునుకలిగి మలమూత్రముల బంధించును. త్రిదోషములను ప్రకోపింపజేయును.

తూటికూరగుణము

మూ. లఘుపత్రాతు యాచిల్లీ సావాస్తుకసమామతా,

వ్యా. చిన్నఆకులుకల తూటికూర చక్రవర్తికూరకు సమానగుణములు కలిగియుండును.

బింబశాకగుణము

మూ. శీతం పిత్తహరం బిమ్బం అమేధ్యం తృడ్వినాశనమ్. ౧౩౦
వాతశ్లేష్మకరం స్వాదు సతిక్తం తత్ఫలం తథా,

వ్యా. దొండాకు శీతవీర్యంబును పిత్తహరంబును నై మేదస్సును కొంచెము తగ్గించును. దప్పి నణచును. దొండపండు వాతకఫముల వృద్ధినొందించును. మధురతిక్తరసములు కలిగియుండును.

పటోలాదిశాక సామాన్యగుణము

మూ. పటోలసప్తలారిష్టశార్ఙ్గేష్టాఽవల్గుజాఽమృతాః. ౧౩౧
వేత్రాగ్రబృహతీవాశాసుషవీతిలపర్ణికాః,
మణ్డూకపర్ణీకర్కోటీకారవేల్లకపర్పటాః. ౧౩౨
నాడీకలాయగోజిహ్వావార్తాకం వనతిక్తకమ్,
కరీరం కులకా నన్దీ కుచేలా శకునాదనీ. ౧౩౩
కటిల్లం కేముకం శీతం సకోశాతకకర్కశమ్,
తిక్తం పాకే కటు గ్రాహి వాతలం కఫపిత్తజిత్. ౧౩౪

వ్యా. పొట్ల, సంబరేణు, వేము, శాఙ్గేష్ఠ, బావంచి, తిప్పతీగె, వెదురుకొమ్ము, ములక, అడ్డసరము, సునవి, తిలపర్ణి, మండూకపర్ణి (సరస్వతియాకు), డావరడంగి, కాకర, పర్పాటకము, నాడీకలాయము, గోజిహ్వా (కర్పూరపుబెండ), వార్తాకము (వంగ), వన తిక్తకము (కొడిసెపాల), వెదురుమొలక, చిట్టితుమికి, నందివృక్షము, కుచేల, శకునాదని, ఎట్టిగలిజేరు, కేముకము, బీర, కర్కాశము, అను నీశాకములు సామాన్యముగ శీతవీర్యం బును కటువిపాకంబును, తిక్తరసంబును కలిగి మలాదుల గ్రహించును. వాతమును వృద్ధి దించును. కఫపిత్తముల హరించును.

## పొట్లగుణము

మూ. హృద్యం పటోలం క్రిమినుత్ స్వాదుపాకం రుచిప్రదమ్,
త్రిదోషశమనం చాస్య నాళంజ్వరనిబర్హణమ్. ౧౩౫
మూలంవిరేచనంపత్రంపిత్తఘ్నంకఫజిల్లతా,

వ్యా. పైజెప్పినశాకములలో పొట్ల హృదయమునకు హితకరము. క్రిములను పోగొట్టును. మధురవిపాకముగ నుండును. రుచిని బుట్టించును. త్రిదోషముల శమింప జేయును. మరియు నీపొట్లచెట్టుయొక్క కాడలు జ్వరమును హరించును. వేరు విరేచన ములజేయును. ఆకు పిత్తమును హరించును. తీగె కఫమును హరించును. (కావున నీపొట్ల త్రిదోషహర మనుట).

## చేంత్రాసి, సంబరేణుకూరలగుణము

మూ. ఝురశీ మూత్రలా తిక్తమధురా పాచనీ గురుః. ౧౩౬
సప్తలా ఝురశీ తుల్యా శర్కరాశ్మరినాశనీ,

వ్యా. ఝురసి (చేంత్రాసిఆకుకూర) మూత్రమును వెడలించును. తిక్తమధురరసములు కలిగియుండును. ఆహారాదుల పచింపజేయును. గురుత్వము కలిగియుండును. సంబరేణు కూరచేంత్రాసితో సమానగుణము కలిగియుండును. శర్కరాశ్మరిని హరించును.

## వేపాకు వేపపూతగుణము

మూ. తిక్తం కషాయం పిత్తఘ్నం చక్షుష్యం కఫపిత్తజిత్. ౧౩౭
మేధ్యం కఫహరం రుచ్యం పత్రం పుష్పం చ నిమ్బజమ్,

వ్యా. వేపఆకును వేపపూతయు తిక్తకషాయరసములు కలిగియుండును. అందు ఆకు పిత్తహరంబును, నేత్రములకు హితకరంబును, కఫపిత్తహరంబు నగును. వేపపూత మేద స్సును వృద్ధినొందించును. కఫమును హరించును. రుచిని పుట్టించును.

### గురుజగుణము

మూ. శార్జ్గేష్ఠా గ్రాహిణీ తిక్తా దీపనీ వాతపిత్తలా. ౧౩౮
సకషాయగురుశ్లేష్మగ్రహణీ పాణ్డురోగజిత్,

వ్యా. శార్జ్గేష్ఠ (గురుజ) మలాదుల నిరోధించును. తిక్తరసము కలిగియుండును. అగ్నిని దీపింపజేయును. వాతపిత్తములను వృద్ధినొందించును. కషాయరసము అనురసముగ నుండును. గురుత్వము కలిగియుండును. కఫరోగములను గ్రహణిరోగమును పాండురోగమును హరించును.

### బావంచివెదురుమోపులగుణము

మూ. అవల్గుజః కటుః పాకే తిక్తః పిత్తకఫాపహః. ౧౩౯
వేత్రాగ్రం క్రిమిజిత్తిక్తం రూక్షం పిత్తకఫాపహమ్,

వ్యా. బావంచికూర కటుపాకంబును తిక్తరసంబు కలిగియుండును. పిత్తకఫముల హరించును. వెదురుమోవు క్రిములను హరించును. తిక్తరసము కలిగియుండును. రూక్షంబై పిత్తకఫముల హరించును.

### చిన్నములకమొదలగువానిగుణములు

మూ. లఘ్వోర్వ్యా బృహతికా సింహీ కణ్టకారీనిదిగ్ధికాః. ౧౪౦
కటుతిక్తరసాః లఘ్వ్యః కఫవాతార్శసాంహితాః,

వ్యా. చిన్నముండ్లపంగ, చిన్నములక, చిన్నవాకుడు నిదిగ్ధికా (చిన్నతెల్ల వాకుడు), ఇవి కటుతిక్తరసములు కలిగియుండును. లఘుగుణములు, కఫవాతములయందును అర్శోరోగములయందును మిక్కిలి హితములు.

### సొరకాయమున్నగుశాకములగుణములు

మూ. అమ్లపక్త్రీలతాలాబుః వృత్తానాదేయరాజికాః. ౧౪౧
మహాబృహితోర్వ్యౌ మధురాః బృహిణాః స్నిగ్ధశీతలాః,
అభిష్యన్దకరాఃగుర్వ్యః పిచ్ఛిలాదృష్టిదూషణాః. ౧౪౨
వాతపిత్తహరాః వృష్యాః కుర్వన్తి చ కఫక్రిమీన్,
వృన్తం తు వమికాసఘ్నం రక్తపిత్తహరం పరమ్. ౧౪౩

వ్యా. సొరచెట్టు పొడవుగ నుండునదియు వర్తులంబుగ నుండునదియు రెండు విధములు. అయ్యది అమ్లవిపాకము కల్గియుండును. నాదేయము, రాజిక (ఆవ), పెద్ద ములక పెద్దవాకుడు మున్నగునవి మధురంబును, పుష్టికరంబును, స్నిగ్ధంబును, శీతలంబును

నగును. స్రోతస్సుల స్రవింపజేయును. గురుత్వము కల్గియుండును. పిచ్ఛిలం బగును. దృష్టిని చెరచును. వాతపిత్తములను హరించును. శుక్రమును వృద్ధినొందించును. కఫమును క్రిము లను కల్గించును. ములక ము న్నగు వానితోడిమలు వాంతిని దప్పను హరించును. విశేషముగ రక్తపిత్తమును హరించును.

అరటిపల్లారియాకుశాకములగుణము

మూ. కదలీ పిత్తజననీ పిచ్ఛిలా వహ్నిమాంద్యకృత్,
మణ్డూకపర్ణీ కటుకా శ్లేష్మఘ్నీ కణ్ఠశోధనీ. ౧౪౪

వ్యా. అరటి పిత్తమును కల్గించును. పిచ్ఛిలంబును జఠరాగ్నిని మందగించునదియు నగును. సరస్వతియాకు కటురసంబును కఫహారంబు నగును. కంఠమునందలిదోషమును హరించి శుభ్రపరచును.

ఆకాకర, కాకర, వీనిగుణము

మూ. కర్కోటం వా తలం నాతికషాయం స్వాదు తిక్తకమ్,
కారవేల్లం సకటుకం దీపనం కఫపిత్తజిత్. ౧౪౫
కుష్ఠమేహజ్వరశ్వాసకాసారుచిహరం పరమ్,

వ్యా. ఆకాకర వాతమును వృద్ధినొందించును. మధురతిక్తకషాయరసములు కొంచెముకొంచెముగ కలిసియుండును. కాకర కొంచెము కటురసముకల్గి తిక్తరసము ప్రధానముగ నుండును. అగ్నిని దీపింపజేయును. కఫపిత్తములను జయించును. కుష్ఠమును ప్రమేహములను జ్వరమును శ్వాసకాసములను అరుచిని ముఖ్యముగ హరించును.

వంగగుణము

మూ. వార్తాకం కటుతిక్తోష్ణం మధురం కఫవాతజిత్.
సక్షారమగ్నిజననం హృద్యం రుచ్యమపిత్తలమ్. ౧౪౬

వ్యా. వంకాయ ప్రధానముగ కటురసంబును, కొంచెముగ తిక్తరసంబును, కల్గి, ఉష్ణవీర్యంబును మధురవిపాకంబును కల్గియుండును. కఫవాతముల హరించును. కొంచెము ఉప్పుగ నుండును. జఠరాగ్నిని వృద్ధినొందించును. హృదయమునకు వాతకరము. రుచిని బుట్టించును. పిత్తమును కొంచెముగ జేయును.

కటుకాఫలకరీరగుణములు

మూ. పిత్తలం గురువిష్టమ్భి సతిక్తం కటుకాఫలమ్,
కరీరమాధ్మానకరం కషాయస్వాదుతిక్తకమ్. ౧౪౭
రూక్షం ముఖరుజాపాణ్డుగళశోషావహం చ తత్,

వ్యా. కటుకాఫలము పిత్తమును వృద్ధినొందించును. గురుత్వము కల్గియుండును. మలమును బంధించును. కొంచెముగ తిక్తరసము కల్గియుండును. వెదురుమోవు కడు పుబ్బరమును జేయును. కషాయమధురతిక్తరసములును రూక్షగుణంబును కల్గియుండును. ముఖరోగమును పాండురోగమును కల్గించును. గొంతెండునట్లు చేయును.

## అడ్డసరము అగసి వీనిపువ్వులగుణములు

మూ. వృషాఽగస్త్యోస్తు పుష్పాణి తిక్తాని కటుకాని చ. ౧౪౮
క్షయకాసహారాణ్యగ్నిదీపనాని లఘూని చ,

వ్యా. అడ్డసరపుపువ్వులును అగసిపువ్వులును తిక్తకటురసములు కల్గియుండును. క్షయమును కాసమును హరించును. అగ్నిని దీపింపజేయును. లఘుగుణము కల్గియుండును.

## బీరగుణము

మూ. కఫపిత్తహరాహృద్యా లఘ్వీకోశాతకీ మతా. ౧౪౯
కుష్ఠమేహక్షయశ్వాసకాసారుచి వినాశినీ,
స్వాదుకోశాతకీ తద్వత్ మధురారసపాకయోః. ౧౫౦
మహాకోశాతకీ పిత్తకోపనీతాదృశాగుణైః,

వ్యా. బీరచెట్టు చిన్నబీర, తీయబీర, పెద్దబీర యని మూడుతెరంగులు. అందు చిన్నది కఫపిత్తముల హరించును. హృదయమునకు వాతకరము. కుష్ఠమును, ప్రమేహమును, క్షయమును, శ్వాసకాసములను, అరుచిని హరించును. తీపుగల్గినది. పైజెప్పినగుణములుకల్గి రసమునందును విపాకమునందును మధురముగ నుండును. పెద్దబీర రసవిపాకములయందు మధురమై పిత్తమును వృద్ధినొందించును.

## బూరుగపువ్వుగుణము

మూ. శాల్మలీ కుసుమం స్వాదుకషాయం రూక్షశీతలమ్. ౧౫౧
రక్తపిత్తహరం గ్రాహి శుక్రలం దీపనం లఘు,
బద్ధమూత్రా సరాభఙ్గీకషాయ మధురాగురుః. ౧౫౨

వ్యా. బూరుగపువ్వు మధురకషాయరసములును, రూక్షగుణంబును, శీతవీర్యంబును కల్గియుండును. రక్తపిత్తమును హరించును. మలాదుల బంధించును. శుక్రమును వృద్ధినొందించును. అగ్నిని జ్వలింపజేయును. తేలికగ జీర్ణింపజేయును. భంజీ (ప్రత్తి) మూత్రమును బంధించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. కషాయమధురరసములుకల్గి గురుత్వము కల్గియుండును.

మఱ్ఱి మొదలగువానిచిగుళ్లగుణములు

మూ. న్యగ్రోధోదుమ్బరాశ్వత్థ ప్లక్షపద్మాదిపల్లవాః,
కషాయాస్తమ్భనాశ్శీతాః వాతాః పిత్తాతిసారిణామ్. ౧౫౩

వ్యా. మఱ్ఱి, అత్తి, రావి, జువ్వి, తామర మున్నగువానిచిగురులు కషాయరసము కల్గియుండును. వాతాదుల స్తంభింపజేయును. శీతవీర్యములు. పిత్తాతిసారరోగములు కల వారికి వాతకరములు.

చిరిబిల్వముంజాతకగుణములు

మూ. దీపనాః కఫవాతఘ్నాః చిరిబిల్వాఙ్కురాస్సరాః,
వాతపిత్తహరస్స్వాదుః వృష్యో ముఞ్జాతకస్మృతః. ౧౫౪

వ్యా. కానుగచిగుళ్లు అగ్నిని దీపింపజేయును. కఫవాతముల హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ముంజాతము వాతపిత్తముల హరించును. మధురముగ నుండును. శుక్రమును వృద్ధినొందించును.

బచ్చలికూరగుణము

మూ. పాలక్యా పిచ్ఛిలా గుర్వీ శ్లేష్మలా భేదినీ హిమా,
స్వాదుపాకరసా స్నిగ్ధా మదఘ్నీ చాప్యుపోదకాదకీ. ౧౫౫
కషాయా రసతశ్చుచ్చుః చక్షుష్యా గ్రాహిశీతలః,

వ్యా. మట్టుబచ్చలి పిచ్ఛిలంబును, గురుత్వగుణంబును, కఫములు వృద్ధినొందించునదియు, మలముల భేదించునదియు, శీతవీర్యంబును, రసవిపాకములచే మధురంబును, స్నిగ్ధంబు నగును. దుంపబచ్చలి మదమును హరించును. మట్టుబచ్చలికిచెప్పిన పిచ్ఛిలాది గుణములన్నియు కల్గియుండును. చుంచు (పొలముబచ్చలి) కషాయరసముగల్గి మచ్చు బచ్చలిగుణములును కల్గియుండును. నేత్రములకు హితకరము. మలమును బంధించును. శీతవీర్యము కల్గియుండును.

నేలగుమ్ముడు, పాలకూరగుణములు

మూ. విదారీ వాతపిత్తఘ్నీ మూత్రలా స్వాదుశీతలా. ౧౫౬
జీవనా బృంహణీ కణ్ఠ్యా గుర్వీ వృష్యా రసాయనీ,
చక్షుష్యా సర్వదోషఘ్నీ జీవ స్త్రీ మధురా హిమా. ౧౫౭
శాకానాం ప్రవరా;న్యానా ద్వితీయా కిఞ్చిదేవ తత్,
పయస్యా మధురా వృష్యా గుర్వీ పిత్తప్రణాశినీ. ౧౫౮

వ్యా. నేలగుమ్మడి వాతపిత్తముల హరించును. మూత్రమును సరళముగ నధికముగ వెడలించును. మధురరసంబును శీతవీర్యంబును కల్గియుండును. శరీరబలమును పుష్టిని కల్గించును. కంఠస్వరమునకు హితముగ నుండును. గురుత్వముకలిగి శుక్రమును వృద్ధినొందించును. రసాయనము నగును. (ఆయువును వృద్ధినొందించి జరావ్యాధులహరించుననుట).

పాలకూర నేత్రములకు హితకరము. త్రిదోషములహరించును. మధురరసంబును శీతవీర్యంబును కలిగియుండును. రెండవది పాలకూరశాకవర్గమున మిక్కిలి శ్లేష్మముగ నుండును. పైజెప్పిన పాలకూరకన్న కొంచెము తక్కువగ గుణమును కలిగియుండును ఈరెండవపాలకూర మధురంబును, శుక్రవృద్ధికరంబును, గురుత్వము కలిగినదియు, పిత్తహారంబునై యుండును. (పాలకూరలో రెండువిధములు. ఆరెంటిగుణములును వేర్వేరుగ పైనిచెప్పబడినదని యెరుంగునది)

## గుమ్మడిమున్నగుశాకములసామాన్యగుణములు

మూ. కూష్మాణ్డతుమ్బి కాలింగకర్కారూర్వారునిమ్బుకమ్ (తిణ్డిశమ్)
తథా త్రపుసచీనాకచిర్భిటంకఫవాతకృత్. ౧౫౯
భేదివిష్టమ్భ్యభిష్యన్ది స్వాదు పాకరసం గురు,

వ్యా. కూశ్మాండము (పెద్ద (బూడిదె) గుమ్మడికాయ), సొరకాయ, పుచ్చకాయ, చిన్నగుమ్మడికాయ, ఉర్వారు (దోస), నింబుకము, త్రపుసము (ములుదోస), చీనాకము దోసలోభేదము (పగిడికాయ). చిర్భిటము (నక్కదోసకాయ) ఈకాయదినుసులన్నియు కఫమును వాతమును కల్గించును. వాతాదుల భేదించును. మలమును గట్టిపరిచి బంధించును. స్రోతస్సుల స్రవింపజేయును. మధురమైనవిపాకంబును కల్గియుండును. గురుత్వము కల్గియుండును.

## కూశ్మాణ్డవిశేషగుణములు

మూ. పిత్తఘ్నం తేషు కూశ్మాణ్డం బాలం మేద్యం కఫావహమ్. ౧౬౦
పక్వం లఘూష్ణం సక్షారం దీపనం వస్తిశోధనమ్,
స్వాస్వ(స్తన్య)దోషహారం వృష్యం పథ్యం చేతోవికారిణామ్.

వ్యా. పైజెప్పినవానిలో లేతపెద్దగుమ్మడికాయ పిత్తమును హరించును. మేదస్సును వృద్ధినొందించును. కఫమును వృద్ధినొందించును. అయ్యది పండినచో లఘుగుణంబును ఉష్ణవీర్యంబును కొంచెముగ క్షారము కలిగినదియు నగును. అగ్నిని దీపింపజేయును. వస్తిని శుభ్రముచేయును. స్తన్యమునందలి దోషమును హరించును. శుక్రమును వృద్ధినొందించును. మనస్సుకు సంబంధించిన ఉన్మాదాదిరోగములు కలవారికి మిక్కిలి పథ్యకరము. మరియు

వల్లీఫలానాం ప్రవరం కూశ్మాణ్డం" అని వాగ్భటాచార్యులు నుడివిరిగాన తీగెకాయ దినుసులలో గుమ్మడికాయ మిక్కిలి ప్రశస్తము.

### గుమ్మడియాకుకూరమున్నగువానిగుణము

మూ. కూశ్మాణ్డశాకం వాతఘ్నం ఆమఘ్నం దీపనం పరమ్,
సన్నిపాతజ్వరే శోషే విదాహే చ ప్రశస్యతే. ౧౬౨
తద్వత్తుమ్బీదళం స్వాదు మూత్రలం స్వాదు పిత్తజిత్,
క్రిమిశూలవిషఘ్నం చ తల్లతాఽశ్మరిభేదనీ. ౧౬౩
వర్చోవిభేది ఫలం తస్య గరీయో రూక్షశీతలమ్,

వ్యా. గుమ్మడియాకుకూర వాతమును హరించును. ఆమదోషమును పోగొట్టును. అగ్నిని మిక్కిలి దీపింపజేయును. సన్నిపాతజ్వరమునందును, ధాతుశోషమునందును, తాపమునందును, మిక్కిలి ప్రశస్తము.

సొరాకును అట్టిగుణములుగలిగి మధురముగ నుండును. మూత్రమును వృద్ధి నొందించును. మధురవిపాకమై పిత్తమును హరించును. క్రిములను శూలను విషమును హరించును. సొరతీగె అశ్మరీరోగమును భేదించును. సొరకాయ (ముదిరినది) మలమును భేదించును. గురుత్వము కలిగియుండును. రూక్షగుణంబును శీతవీర్యంబును కలిగి యుండును.

### పుచ్చకాయగుణము

మూ. కాళిఙ్గం ప్లవగం తిక్తం స్థాపనం శోణితస్యచ. ౧౬౪

వ్యా. పుచ్చకాయయు, ప్లవగమను ఫలవిశేషంబును, తిక్తరసము కలిగియుండును. రక్తమును స్థిరపరచును.

### తామరతూండ్లు మొదలగువాని గుణములు

మూ. మృణాళబిసశాలూకకుముదోత్పలకన్దకమ్.
కళమ్బునాళిశేలూపకలిఙ్గకురుమ్బకమ్,
చిల్లీలట్వాకలోణీకాకురూటకగవేధుకాః. ౧౬౫
జీవన్తకస్త్వేళగజం యవశాకసువర్చలాః,
ఆలుకాని చ సర్వాణి తథాసూపాహ్వాని లక్ష్మణమ్. ౧౬౬
స్వాదు రూక్షం సలవణం వాతశ్లేష్మకరం గురు,
శీతలం సృష్టవిణ్మూత్రం ప్రాయో విష్టభ్య జీర్యతి. ౧౬౭

వ్యా. తామరకాడలు, తామరదుంపలు, తామరదంటు, తెల్లకలువదుంప, నల్ల కలువదుంప, "కలంబుశాకము, నాళశాకము, శేలూషమనుశాకవిశేషము, కలింజర, కురుంబిక, చిల్లి, లట్వాక, లోణిక, కురూటక, గవేధుక, జీవంతక, ఎడగజ, యవశాక, సువర్చల,"అను నీశాకవిశేషములు, ఆలుకము లన్నియు,సూప్యశాకములు(మినుము, పెసర మున్నగుశాకములు), లక్ష్మణశాకము, ఈశాకము లన్నియు మధురరసంబును, రూక్షగుణం బును కలిగి లవణరసము అనురసముగ నుండును. వాతకఫములను కలిగించును. గురుత్వము కలిగియుండును. వీర్యమున శీతలముగ నుండును. మలమూత్రముల వెడలించును. ఇవి యన్నియు ప్రాయికముగ కడుపులో నుండగట్టి పిమ్మట జీర్ణమగును.

మరియు "స్విన్నం నిష్పీడితరసం స్నేహాఢ్యం నాతిదోషలమ్" అని వాగ్భటా చార్యులు చెప్పిరిగాన పైజెప్పినవానిని చక్కగ నుడికించి యందలిరసమును పిడిచి నెయ్యి మొదలగుస్నేహముల నధికముగ చేర్చి తిరుగమూత్రబెట్టినచో నధికముగ దోషకరము గాకుండునని యెరుంగునది.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—"ఆలుకానిచ సర్వాణి" అనుచోట ఆలు కములన:—అవి ఐదువిధములు పిండాలుకము, కాష్ఠాలుకము, శ్వేతాలుకము, రక్తా లుకము, ఆలుకము, నని యైదు ఆలుకములు, పెండలము పిండాలుకము, కఱ్ఱ పెండలము (వాడగనుసు (ఆళువల్లి) కాష్ఠాలుకము, తెల్లగెనుసు (చిరుగడదుంప) శ్వేతాలుకము, ఎఱ్ఱగెనుసు రక్తాలుకము, బంగాళాదుంపలు (ఉర్లగడ్డలు) ఆలుకము. ఈయైదువిధములగు ఆలుకములును గ్రహింపబడును.

## వైకుంత (గగ్గెర) గుణము

మూ. వైకుణ్ఠం కటు తిక్తోష్ణం క్రిమిగుల్మకఫాపహమ్,
అర్శోవిషానిలహరం తద్వద్రుచ్యం రుకుతుమ్బకమ్. ౧౬౮

వ్యా. గగ్గెరకటుతిక్తరసంబును, ఉష్ణగుణంబును కలిగియుండును. క్రిములను గుల్మమును కఫమును హరించును. కుతుంబకము (ఏనుగతుమ్మకూర) గగ్గెరతో సమాన గుణములుకలిగి అర్శస్సును విషమును వాతమును హరించును. రుచికరంబుగ నుండును.

## బాష్ప (మునుగుదామర) గుణము

మూ. బాష్పః త్రిదోషక్రిమికృత్ గురుః స్వాదురసస్సరః,
రక్తబాష్పమహాబాష్పౌ మధురౌ శ్లేష్మపిత్తలౌ. ౧౬౯
సరౌ చ హారితస్తద్వదమ్లబాష్పస్త్రిదోషలః,
రక్తార్శోఘ్నః తోయబాష్పో గుణీశ్లేష్మవాతజిత్. ౧౭౦

వ్యా. బాష్పము (మణుగుదామర, (లేక అత్తపత్తియాకు), ఇది త్రిదోష ములను చేయును. గురుత్వము కలిగియుండును. మధురరసముగ నుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును.

రక్తబాష్పము (ఎఱ్ఱనిది), మహాబాష్పము (పెద్దది), ఈరెండును మధురరసము కలిగి కఫపిత్తముల వృద్ధినొందించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. హరిత (పచ్చని) వర్ణముకలిగినదికూడ పైజెప్పినగుణములు కలిగియుండును. ఆమ్ల (పుల్లని) బాష్పము త్రిదోషముల వృద్ధిజేయును. తోయబాష్పము (నీటితోనుండునది) రక్తార్శస్సును హరించును. గురుత్వముజేయును. కఫవాతముల హరించును.

## చక్రమర్ద సువర్చలా గుణములు

మూ. చక్రమర్దో గురుశ్శీతః కషాయః క్రిమికుష్ఠజిత్,
సువర్చలా కఫోద్రేకమూత్రకృచ్ఛ్రాశ్మరీహితా. ౧౨౧

వ్యా. చక్రమర్దము (తగిరిస) గురుత్వంబును, శీతవీర్యంబును, కషాయరసంబును కలిగియుండును. క్రిములను కుష్ఠమును హరించును. సువర్చల (ప్రొద్దుతిరుగుడుచెట్టు) కఫమును ప్రకోపించియున్నపుడును, మూత్రకృచ్ఛ్రమునందును, అశ్మరీరోగమునందును వాతకరము.

## పెండలము మున్నగువాని సామాన్యగుణములు

మూ. కన్దాః పిణ్డాలుమధ్వాలుహస్త్యాలునాం చహిమాస్సరాః,
గురవో మధురాః వాతస్తన్యమేదఃకఫావహాః. ౧౨౨
రక్తపిత్తహరావృష్యాఃదుర్జరాశ్చాగ్నిదూషణాః,

వ్యా. పెండలముగడ్డ, తీయకందగడ్డ, వాడగనుసుగడ్డ, ఇవి శీతగుణముకలిగి శరీరమున శీఘ్రముగ వ్యాపించును. గురుత్వము కలిగియుండును. మధురరసము కలిగి యుండును. వాతమును స్తన్యము (చనుబాలు)ను మేదస్సును కఫమును వృద్ధినొందించును. రక్తపిత్తమును హరించును. శుక్రమును వృద్ధినొందించును. చాలకాలమునకు కష్టముచే జీర్ణమగును. జఠరాగ్నిని చెరిచి యాకలిని మందగింపజేయును.

## పెండలమున విశేషగుణము

మూ. కటూష్ణో వాతకఫహో పిణ్డాలుః పిత్తవర్ధనః. ౧౨౩

వ్యా. పెండలము కటురసంబును ఉష్ణగుణంబును కలిగి వాతకఫముల హరించును. పిత్తమును వృద్ధినొందించును.

## మూలక శాకగుణము

మూ. మూలకం మధురం శీతం గురు చ స్థూలకన్దకమ్,

వ్యా. ముల్లంగిఆకు మధురరసంబును శీతవీర్యంబును స్థూలమైనముల్లంగి గురుత్వము కలిగినదియు నగును.

ముల్లంగికాయలగుణము

మూ. నాతిశీతంఫలంతస్యకషాయంకటుకంగురుః. ౧౭౪

వ్యా. ముల్లంగికాయలు కొంచెముగ శీతలమును కలిగించును. కషాయకటురసములు కలిగియుండును.

వల్లీకందగుణము

మూ. వల్లీకన్దః కషాయోఽతిదుర్జరః క్రిమివాతకృత్,
ముకున్దకన్దః శిశిరః కటుపాకో బలప్రదః. ౧౭౫
రుచ్యః ప్రమేహస్థౌల్యామకఫవాతకరో గురుః,

వ్యా. తీగపెండలము కషాయరసముకలిగి మిక్కిలి కష్టముచే జీర్ణమగును. క్రిములను వాతమును కలిగించును. ముకుందకందము (  ) శీతవీర్యంబును, కటువిపాకంబును, బలకరంబును నగును. రుచిని బుట్టించును. ప్రమేహమును స్థౌల్యమును, ఆమకఫవాతములను కలిగించును. గురుత్వము కలిగియుండును.

చిన్నముల్లంగిగుణము

మూ. అతిసారక్రిమిశ్లేష్మవాతజిన్మూత్రబన్ధనమ్. ౧౭౬
శాకోటం మధురం సోష్ణం వాతపిత్తాపహం సరమ్,
కుష్ఠమేహక్రిమిహరం తత్స్కంధ (కంద) స్త్వర్శసాంహితః. ౧౭౭

వ్యా. శాకోటము (చిన్నముల్లంగి) మధురంబును ఉష్ణవీర్యంబును నగును. అతిసారమును, క్రిములను, కఫమును, వాతమును హరించును. అధికముగ వెడలుమూత్రమును బంధించును. ముఖ్యముల వాతపిత్తములను కుష్ఠములను ప్రమేహములను క్రిములను హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ముల్లంగిగడ్డ అర్శోరోగముకలవారికి మిక్కిలి హితకరము.

కందగడ్డగుణములు

మూ. దీపనస్సూరణో రుచ్యః కఫఘ్నో విశదో లఘుః,
విశేషాదర్శసాం పథ్యః తద్వత్తు వనసూరణః. ౧౭౮

వ్యా. కందగడ్డ అగ్నిని దీపింపజేయును. రుచికరముగ నుండును. కఫమును హరించును. విశదలఘుగుణములు కలిగియుండును. అడవికందయు పైజెప్పినగుణములు కలిగియుండును. అయ్యది అర్శోరోగముకలవారికి మిక్కిలి పథ్యము.

మూ. రాటశాకం క్రిమిశ్లేష్మహారం స్వాదుకషాయకమ్,

వ్యా. రాటశాకము క్రిములను కఫమును హరించును. మధురకషాయరసములు కలిగియుండును.

తక్కాలి, ఉలిమిరి, గలిజేరు, కరివేపాకు, వీనిగుణములు

మూ. తర్కారిపత్రం స్వాదు సతిక్తం కఫవాతజిత్. ౧౭౯
వర్షాభ్వాకాలశాకం చ సక్షారం కటుతిక్తకమ్,
దీపనం భేదనం హన్తి గరశోఫకఫానిలాన్. ౧౮౦

వ్యా. తక్కాలి, ఉలిమిరి ఈరెండును మధురతిక్తరసములు కల్గియుండును. కఫవాతములను హరించును. తెల్లగలిజేరు ఎఱ్ఱగలిజేరు అని రెండువిధములైన గలిజేరులును కరివేపాకును కొంచెము ఉప్పగ నుండును. కటుతిక్తరసములు గల్గియుండును. అగ్నిని దీపింపజేయును. మలాదులభేదించును. విషమును శోఫను కఫమును వాతమును హరించును.

మునగకాయ, పువ్వు, వీనిగుణము

మూ. ఫలంముశిగ్ర్వాఃపుష్పంచచక్షుష్యంకఫపిత్తజిత్,

వ్యా. మునగచెట్టుకాయలును పువ్వులును కన్నులకు హితములు. కఫపిత్తములను హరించును.

మోదుగపువ్వు, చిగుళ్లు, వీనిగుణములు

మూ. కటూష్ణం పిత్తలం గుల్మశూలఘ్నం దీపనం లఘు. ౧౮౧
కాసాఽశ్మరీప్రమేహఘ్నం కింశుకం పుష్పపల్లవమ్,

వ్యా. మోదుగపువ్వులును మోదుగచిగుళ్లును కటురసము ఉష్ణవీర్యంబును కల్గియుండును. పిత్తమును వృద్ధినొందించును. గుల్మమును శూలనొప్పిని హరించును. అగ్నిని దీపింపజేయును. తేలికగ జీర్ణమగును. దగ్గును అశ్మరిని ప్రమేహమును హరించును.

ఆముదపుకాయ, నువ్వు, ప్రబ్బలి, వీనిగుణములు

మూ. ఏరణ్డస్య ఫలం పుష్పం ఉష్ణం కృచ్ఛ్రక్రిమిప్రణుత్. ౧౮౨
వాతలౌకయితిక్తామ్లౌ భేదనే తిలవేతసౌ,
తద్వత్పఞ్చాఙ్గులః............ ౧౮౩

వ్యా. చిట్టాముదపుకాయలును పువ్వులును ఉష్ణముగ నుండును. మూత్రకృచ్ఛ్రమును క్రిములను హరించును. నువ్వు, ప్రబ్బలి ఈరెండును వాతమును వృద్ధినొందించును. కటుతిక్తఅమ్లరసమును కల్గియుండును. మలాదుల భేదించును. పెద్దాముదముకూడ పైజెప్పినగుణములు కల్గియుండును.

### వెదురుమోవులగుణము

మూ. ............వంశకరీరాస్తువిదాహినః,
వాతపిత్తకరా రూక్షాః కటుపాకాః కఫాపహాః. ౧౮౪

వ్యా. వెదురుమోవులు తాపమును బుట్టించును. వాతపిత్తములను పుట్టించును. రూక్షగుణము కల్గియుండును. కటువిపాకము కల్గియుండును. కఫమును హరించును.

### తెల్లజిల్లేడుగుణములు

మూ. అళర్కకుసుమం పత్రం ఫలం చ కటుతిక్తకమ్,
కాసశ్వాసహరం కణ్ఠ్యం వ్రణఘ్నం దీపనం లఘు. ౧౮౫

వ్యా. తెల్లజిల్లేడుపువ్వులును, ఆకులును, కాయలును, కటుతిక్తరసములు కల్గియుండును. కాసశ్వాసములను హరించును. కంఠమునకు హితకరము. వ్రణముల మాన్చును. అగ్నిని దీపింపజేయును. లఘుగుణము కల్గియుండును.

### ములుగోరింటగుణము

మూ. కంఠమేహాజ్వరశ్వాసకాసారుచినిబర్హణామ్,
పిత్తళం శ్లేష్మవిషజిత్ రుచ్యమార్తగళం స్మృతమ్. ౧౮౬

వ్యా. ములుగోరింట కంఠరోగములను, ప్రమేహములను, జ్వరమును, శ్వాసకాసములను, అరుచిని పోగొట్టును. పిత్తమును వృద్ధినొందించును. కఫమును విషమును హరించును. రుచిని బుట్టించును.

### ఉత్తమకన్యగుణము

మూ. కటూష్ణం తిక్తవిశదం విషఘ్నం పిత్తకోపనమ్,
ఫలముత్తమకన్యాయాః సక్షారం దీపనం లఘు. ౧౮౭

వ్యా. ఉత్తమకన్య (............) యనుదానిఫలము కటువిపాకంబును కలిగియుండును. విషమును హరించును. పిత్తమును ప్రకోపింపజేయును. కొంచెము ఉప్పగనుండును. అగ్నిని దీపింపజేయును. తేలికగ జీర్ణమగును.

### క్షుద్రదంతి (పిన్నదింటెన) గుణము

మూ. క్షుద్రదన్తిఫలం స్వాదు కషాయం రూక్షశీతలమ్,
విష్టమ్భిగురుశోఫఘ్నం కఫమారుతకారిచ. ౧౮౮

వ్యా. క్షుద్రదంతి (పిన్నదింటెన) ఫలము మధురకషాయరసములును, రూక్షగుణంబును, శీతవీర్యంబును కలిగియుండును. మలాదుల బంధించును. గురుత్వముజేయును. శోఫను హరించును. కఫవాతముల బ్రకోపింపజేయును.

### మెట్టతామరగుణములు

మూ. లక్ష్మీః పిత్తహరా గుర్వీ వాతశ్లేష్మవివర్ధినీ,
సౌభాగ్యగర్భజననీ మహాలక్ష్మీశ్చ తత్సమా. ౧౮౭
గన్ధలక్ష్మీః కఫకరీ కటూష్ణాస్త్రవశోధినీ,

వ్యా॰ లక్ష్మి (మెట్టఁదామర) పిత్తమును హరించును. గురుత్వము కలిగియుండును. వాతకఫముల హరించును. సౌందర్యమును కలిగించును. గర్భమును కల్గించును. మహాలక్ష్మి (పెద్దమెట్టఁదామరయు) పైచెప్పినగుణములు కలిగియుండును. గంధలక్ష్మి (వాసనగలమెట్టఁదామర) కటురసంబును ఉష్ణవీర్యంబును కలిగియుండును. కఫమును వృద్ధినొందించును. ఋతురక్తమును శుభ్రపరచును.

మూ. తద్వచ్చతోయలక్ష్మీస్స్యాత్ వాతశోణితనాశినీ. ౧౮౮

వ్యా॰ తోయలక్ష్మి (నీటిదామర)కూడ పైచెప్పినగుణములు కలిగియుండును. వాతరక్తమును హరించును.

### కాకజంఘగుణములు

మూ. కాకజఙ్ఘామరుత్పిత్తవిషఘ్నీ మధురా చ సా. ౧౮౯
రక్తకాణ్డా తు సా ప్రణ్యా లక్ష్మీవద్వర్ణనం గుణైః,

వ్యా॰ కాకజంఘ (వెలమసంధి) వాతపిత్తములను విషమును హరించును. మధురముగ నుండును. అయ్యది యెఱ్ఱనికాడలు కలిగియున్నచో వ్రణములకు హితముగ నుండును. పైజెప్పిన మెట్టఁదామరగుణములుకలిగి సౌభాగ్యమును గర్భోత్పత్తిని చేయును.

### బోడతరము, వానిభేదములు ప్రత్యేకగుణములు

మూ. శ్రమణీ (శ్రావణీ) కటుతిక్తోష్ణా రూక్షా వాతానులోమనీ. ౧౯౦
అంత్రవృద్ధ్యశ్మరీశూలగుల్మార్శశ్శ్వాసనాశినీ,
శ్రావణీ కఫదోషఘ్నీ లఘుః స్వాదురసా హిమా. ౧౯౧
తమస్వినీ వాతహరా కఫక్రిమివినాశినీ,
ముణ్డీ త్వేచ్ఛావ్యాసుగన్ధోష్ణా క్రిమిగుల్మకఫాపహా. ౧౯౨
కుష్ఠఘ్నీ మధురాస్నిగ్ధా పిచ్ఛిలా శ్లేష్మలాగురుః,
వృత్తపత్రా విశేషేణ ప్రమేహఘ్నీ ప్రకీర్తితా.

వ్యా॰ శ్రమణి బోడతరము కటుతిక్తరసములు కలిగి యుష్ణవీర్యముగ నుండును. రూక్షగుణము కలిగినది వాతమును అనులోమముగ సంచరింపజేయును. అంత్రవృద్ధి (అండవృద్ధి)ని, అశ్మరీరోగమును, శూలరోగమును, గుల్మమును, అర్శస్సును, శ్వాసమును

హరించును. శ్రావణి (చిన్నబోడతరము) కఫమును హరించును. మధురరసంబును శీతవీర్యం బును కలిగియుండును. తపస్విని (విత్తుబోడతరము) వాతమును, కఫమును, క్రిములను హరించును. ముండి (తెల్లబోడతరము) చర్మమునకు చాల మేలుచేయును. మంచిపరిమళము కలిగి యుష్ణవీర్యం బగును. క్రిములను, గుల్మమును, కఫమును కుష్ఠమును హరించును. మధురంబును స్నిగ్ధంబును పిచ్ఛిలంబును కఫమును హరించునదియు గురుత్వము కలిగినదియు నగును. పైచెప్పినవానికంటె గుండ్రమైన ఆకులుకలది విశేషముగ ప్రమేహముల హరించును. (గుండ్రని ఆకుబుకలిగినదియు తెల్లనిబోడతరంబును అన్నిటికంటె మిక్కిలి శ్రేష్ఠము.

## నేలతాటిగుణము

మూ. వారాహీ కన్దమధురా లఘ్వీ పిత్తానిలప్రణుత్. ౧౯౩

వ్యా. నేలతాటిగడ్డ మధురముగ నుండును. లఘుగుణముకలిగి పిత్తమును వాతమును హరించును.

## సహదేవగుణము

మూ. సహదేవీ జ్వరహరా రక్తపిత్తప్రసారిణీ,
వృష్యా చేతోవికారఘ్నీ మఙ్గళ్యాక్రాన్తసంయుతా. ౧౯౪

వ్యా. సహదేవి జ్వరమును హరించును. రక్తపిత్తమును వెడలించును. శుక్రమును వృద్ధినొందించును. మనోదోషమును (మనస్సంబంధములగు నున్మాదాదిరోగములను) హరించును. మంగళకరమైనది.

## గౌళి (పావిలాకు) కూరగుణము

మూ. గౌళీ సరామ్లమధురా పిచ్ఛిలా శ్లేష్మకృద్గురుః,
అత్యగ్నిపిత్తశమనీ సదా గౌళీ మహాత్యపి. ౧౯౫

వ్యా. గౌళి (పాలాకు) కూర శరీరమున శీఘ్రముగ వ్యాపించును. పులుపును తీపును కల్గి పిచ్ఛిలమై యుండును. కఫమును వృద్ధినొందించును. గురుత్వము కలిగి యుండును. అత్యగ్నిని (మిక్కిలితీక్ష్ణమైనజాఠరాగ్నిని), అధికమైనపిత్తమును శమింపజేయును. పెద్దపావిలికూరకూడ పైజెప్పినగుణములు కలిగియుండును.

## కార్పాసగుణము

మూ. వాతఘ్నమమ్లం కార్పాసం స్రంసనం దీపనం లఘు,

వ్యా. కార్పాసము (ప్రత్తియాకు) అమ్లరసముకలిగి వాతమును హరించును. మలాదుల స్రవింపజేయును. అగ్నిని దీపింపజేయును. తేలికగ జీర్ణమగును.

ఎలుకచెవియాకుగుణము

మూ. ఆఖుకర్ణీ బలాసఘ్నీ వాతలా కటుపాకినీ. ౧౯౬
క్రిమిజిత్ బద్ధవిణ్మూత్రా కషాయమధురా హిమా,

వ్యా. ఎలుకచెవియాకు కఫమును హరించును. వాతమును వృద్ధినొందించును కటువిపాకము కలిగినది. క్రిములను హరించును. మలమూత్రములను బాధించును. కషాయ మధురరసంబులును శీతవీర్యంబును కలిగియుండును.

సైకతశాకగుణము

మూ. సరం వికాసి మధురం కృచ్ఛ్రార్శోశ్మరినాశనమ్. ౧౯౭
ఆనులోమ్యకరం శాకం సైకతం శీతలం లఘు,

వ్యా. సైకతశాకము (ఇసుకప్రదేశమున బుట్టినశాకవిశేషము) శరీరమున శీఘ్రముగ వ్యాపించును. వికాసిగుణము కలిగియుండును. మధురముగ నుండును. మూత్రకృచ్ఛ్రమును అర్శోరోగమును హరించును. వాతాదులను అనులోమముగ సంచరింప జేయును. శీతవీర్యంబును లఘుగుణంబును కలిగియుండును.

బర్బరగుణము

మూ. బర్బరం కటు తిక్తోష్ణం వాతశ్లేష్మహరం లఘు. ౧౯౮
రోచనం ష్ఠీవనం రూక్షమీషన్న్యూనం తతస్సితమ్,

వ్యా. బర్బరశాకము (ఆనపకూర) కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును కల్గి వాతకఫముల హరించును. తేలికగ జీర్ణమగును. రుచిని పుట్టించును. నోట నీరు వెడలించును. రూక్షగుణము కల్గియుండును. తెల్ల ఆనపకూర పైచెప్పినదానికన్న కొంచెము తక్కువ గుణములు కలిగియుండును.

పిన్నదూలగొండిగుణము

మూ. దుస్పర్శః కఫపిత్తఘ్నః జ్వరాతీసారశోషకృత్ (హృత్.) ౧౯౯
దీపనః పాచనః స్నిగ్ధః కషాయః స్తమ్భనో లఘుః,

వ్యా. దుస్పర్శము (పిన్నదూల్గొండి) కఫపిత్తముల హరించును. జ్వరమును అతిసారమును శోషమును హరించును. అగ్నిని దీపింపజేయును. భుజింపబడిన యాహారమును జీర్ణింపజేయును. స్నిగ్ధముగను వగరుగను నుండును. వీర్యమును స్తంభింపజేయును; చులకనగ జీర్ణమగును.

పల్లేరాకు, గొంతెమగోరుకూరలగుణము

మూ. గోక్షుర స్తిక్తమధురః పిత్తతో మూత్రకృచ్ఛ్రజిత్. ౨౦౦

కషాయస్స్వాదుపాకోష్ణా వాతఘ్నీ చ ప్రసారిణీ,

వ్యా. గోక్షురము (పల్లేరాకుకూర) చేదును తీపియు కలిగియుండును. పిత్తమును వృద్ధినొందించును. మూత్రకృచ్ఛ్రమును హరించును. ప్రసారిణి (గొంతెమగోరు) కషాయరసంబును మధురవిపాకంబును ఉష్ణవీర్యంబును కలిగియుండును. వాతమును హరించును.

యవతిక్తావజ్రవల్లీగుణములు

మూ. తిక్తోష్ణా కటుకా పాకే క్రిమిశూలకఫాపహా. ౨౦౧
యవతిక్తావజ్రవల్లీతురూక్షోష్ణాక్రిమిజిత్ పరా,
తిక్తామేదోఽనిల శ్లేష్మగ్రహణీకుష్ఠగుల్మజిత్. ౨౦౨
స్రావణీసర్వమేహఘ్నా పక్షీణఫలపల్లవా,

వ్యా. యవతిక్తా యనునది తిక్తరసంబును కటువిపాకంబును ఉష్ణవీర్యంబును కలిగి క్రిములను శూలలను కఫమును హరించును. వజ్రవల్లి (నల్లేరు) రూక్షఉష్ణగుణములు కలిగియుండును. క్రిములను హరించును తిక్తరసము కలిగి మేదస్సును వాతమును కఫమును గ్రహణిని కుష్ఠములను గుల్మమును జయించును. స్రోతస్సుల స్రవింపజేయును. మేహముల నన్నిటిని హరించును.

చింతచిగురు, పూలు వీనిగుణములు

మూ. పల్లవం తిన్త్రిణీ కస్యకషాయం కఫనాశనమ్. ౨౦౩
క్రిమికణ్డూవిషఘ్నం చ వ్రణశోధనరోపణమ్,
శీతం స్వాదుకషాయామ్లం తత్పుష్పం వాతపిత్తజిత్. ౨౦౪

వ్యా. చింతచెట్టుచిగురు కషాయ(వగరు) రసము కలిగియుండును. కఫమును హరించును. క్రిములను, దురదను, విషమును హరించును. వ్రణముల శుభ్రపరచిమాన్పును. చింతపువ్వులు శీతవీర్యంబును, కషాయ (వగరు) అమ్ల (పులుపు) రసంబులును కలిగియుండును. వాతపిత్తముల హరించును.

పిణ్యాకశాక (తెలికపిండియాకుకూర) గుణము

మూ. పిణ్యాకశాకం కటుకం కషాయం శ్లేష్మవాతజిత్,
గాఙ్గేరుకీ హరేత్పిత్తం కషాయమధురం గురు. ౨౦౫
విషఘ్నం ఖాదిరం శాకం చక్షుష్యం కఫమేహజిత్,

వ్యా. పిణ్యాకశాకము (తెలికపిండిచెట్టు ఆకుకూర) కటుకషాయరసములుకలిగి వాతకఫముల జయించును. జిబిలిక పిత్తమును హరించును. కషాయమధురరసములు కలిగి

యుండును. గురుత్వము జేయును. పుల్లవెలగాకుకూర నేత్రములకు హితకరము. కఫమును మేహమును హరించును.

## మర్శరీశాకాదిగుణములు

మూ. మర్శరీశాకమర్శోఘ్నం క్రిమిశ్వాసమధుగుల్మజిత్. ౨౦౬
రక్తపిత్తాపహావస్తిరోగఘ్నీ క్రిమిమఞ్జరీ,

వ్యా. మర్శరీశాకము ( ) అర్శస్సులహరించును. క్రిములను, వాపును, గుల్మమును, జయించును. క్రిమిమంజరి యనుశాకము రక్తపిత్తమును, వస్తిరోగములను హరించును.

## హరితమంజరీశాకగుణము

మూ. గుల్మశూలార్శసాం పథ్యా తీక్ష్ణా హరితమఞ్జరీ. ౨౦౭

వ్యా. హరితమంజరి (ఉత్తరేణి) గుల్మరోగమునందును శూలరోగమునందును అర్శోరోగమునందును పథ్యకరమైనది. తీక్ష్ణమైనది.

## ఇందుపకాయగుణము

మూ. కతకస్య ఫలం తిక్తం పిత్తమేహకఫప్రణుత్,

వ్యా. కతకఫలము (ఇండుపకాయ = చిల్లగింజలచెట్టుకాయ) కూర చేదుగ నుండును. పిత్తమును ప్రమేహములను కఫమును హరించును.

## ముష్కకశాకగుణము

మూ. ముష్కకం దీపనం భేది మేహార్శః పాణ్డుగుల్మజిత్. ౨౦౮

వ్యా. ముష్కకము (మొక్కపుచెట్టు = కణపచెట్టు) దీనికాయలు ముష్కగునవి అగ్నిని దీపింపజేయును. మలమును భేదించును. ప్రమేహము, అర్శస్సు, పాండురోగము గుల్మము వీనినన్నిటిని హరించును.

## టుండుకఫల (పెద్దమానుకాయ) గుణము

మూ. టుణ్డుకస్య ఫలం రుచ్యం దీపనం కఫవాతజిత్,

వ్యా. టుండుక (అరలు = పెద్దమాను) దీనికాయరుచిని బుట్టించును. అగ్నిని దీపింప జేయును. కఫమును వాతమును హరించును.

## ఒద్దికాయగుణము

మూ. మేషశృంగీఫలం మేహగుల్మకుష్ఠక్రిమిప్రణుత్. ౨౦౯

వ్యా. మేషశృంగి (ఒద్దిచెట్టు). దీనికాయ ప్రమేహములను, గుల్మమును, కుష్ఠమును, క్రిములను హరించును.

### కొడిసెపాల, పొన్న, వీనిగుణములు

మూ. కౌటజన్తుగురూష్ణం చ వాతఘ్నం భేది తత్ఫలమ్,
రుచ్యం రూక్షం కషాయామ్లం గుర్వపథ్యకరం ఫలమ్. ౨౧౦
వృష్యం గ్రాహి చ పౌన్నాగం మేహపిత్తానిలాపహమ్,

వ్యా. కుటజము (కొడిసెపాలచెట్టు=పెద్దఅంకుడుచెట్టు). దీని ఆకుకూర గురుత్వంబును ఉష్ణంబును కలిగియుండును. వాతమును హరించును. దీనికాయలకూర మలమును భేదించును. పున్నాగము (పొన్నచెట్టు), దీనికాయలకూర రుచికరముగ నుండును. రూక్షముగ నుండును. వగరును పులుపును కలిగి గురుత్వముచేయును. పథ్యమునకు కూడదు. శుక్రమును వృద్ధినొందించును. మలాదుల గ్రహించును. మేహములను పిత్తమును వాతమును హరించును.

### అంబష్ఠా ఫలగుణము

మూ. అమ్బష్ఠాయాః ఫలం వృష్యం దీపనం వాతపిత్తజిత్. ౨౧౧

వ్యా. అంబష్ఠము (విరిగిచెట్టు లేక అంబాళము). దీనికాయలకూర శుక్రమును వృద్ధినొందించును. అగ్నిని దీపింపజేయును. వాతపిత్తముల హరించును.

### భృంగరాజగుణము

మూ. వర్ణ్యస్సరో(రో౽)లఘుర్భృఙ్గః శ్లేష్మఘ్నః కటుతిక్తకః,

వ్యా. భృంగరాజము (గుంటకలగరాకు) కూర శరీరమునకు వర్ణమును కలిగించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. తేలికగ జీర్ణమగును. కఫమును హరించును. కారమును చేదును కలిగియుండును.

### మధూక (ఇప్ప) గుణము

మూ. పుష్పం శీతం మధూకస్య పిత్తతృష్ణాజ్వరాపహమ్. ౨౧౨
ఫలం తస్య తతో న్యూనం గురు విష్టభ్య జీర్యతి,
క్రిమికుష్ఠఘ్నకర్మాస్య పుష్పమాఖువిషాపహమ్. ౨౧౩

వ్యా. మధూకము (ఇప్పచెట్టు, దీనిపువ్వులు) శీతవీర్యము కలిగియుండును. పిత్తమును, దప్పిని, జ్వరమును హరించును. క్రిములను, కుష్ఠమును, ఎలుకవిషమునుకూడ హరించును. దానికాయలు పువ్వులకన్న కొంచెముతక్కువగుణములు కలిగియుండును. కడుపులో గడబిడచేసి మలమును బంధించి జీర్ణమగును.

### కోకిలఫలగుణము

మూ. కోకిలస్య ఫలం రుచ్యం విష్టమ్భిగురువాతళమ్,

సతిక్తమధురం పథ్యం శీతలంచ కఫాస్రయోః. ౨౧౪

వ్యా. కోకిలము అనుదానికాయలు రుచికరముగ నుండును. మలమును బంధించును. గురుత్వముగలిగి వాతమును వృద్ధినొందించును. చేదును తీపియుకలిగి శీతవీర్యముగ నుండును. కఫమునకును రక్తమునకును హితకరముగ నుండును.

భుజంగసింహా, శమీఫలగుణములు

మూ. కన్దో భుజఙ్గసింహాయాః దోషత్రయనిబర్హణమ్,
శమీఫలం గురుస్వాదు రూక్షోష్ణం కేశనాశనమ్. ౨౧౫

వ్యా. భుజంగసింహ అనుదానిదుంప త్రిదోషముల హరించును. జమ్మికాయలు గురుత్వంబును, మధురరసంబును, రూక్షోష్ణగుణంబులును కలిగియుండును. తలవెండ్రుకల నూడించును.

అరటిపువ్వు, మోవులగుణము

మూ. కదలీకుసుమం తిక్తంకషాయం గ్రాహిదీపనమ్,
ఉష్ణవీర్యంబలాసఘ్నం తాదృశస్తస్యపల్లవః. ౨౧౬

వ్యా. అరటిపువ్వు తిక్తకషాయరసములు కలిగియుండును. మలమును బంధించును. అగ్నిని దీపింపజేయును. ఉష్ణమైనవీర్యము కలిగియుండును. కఫమును హరించును. అరటి మోవుకూడ పూతకు చెప్పినగుణములు కలిగియుండును.

అరటిభేదములు, వానితారతమ్యము-గుణము

మూ. సుగన్ధి శుక్లకృష్ణాశ్మ శైలరమ్భా యథోత్తరమ్,
నన్దితాః మూలమానాంతు కషాయ మధురం గురు. ౨౧౭

వ్యా. సుగంధి(పరిమళముకలఅరటి), శుక్ల (తెల్లఅరటి), కృష్ణ (నల్లఅరటి,) అశ్మ (రాతిఅరటి), శైల (కొండఅరటి) అనుభేదములుకల అరటిచెట్లలో నుత్తరోత్తరము ఒకదానికన్ననొకటి హీనముగ నుండును. వీనిదుంపలు వగరును తీపియు గురుత్వంబును కలిగియుండును.

అరటియూచగుణము

మూ. రమ్భాస్తమ్భో హి మస్తృష్ణా సోమరోగప్రమేహజిత్,

వ్యా. అరటిబ్రానిలోనుండు నడిమియూచ చలువజేయును. దప్పిని సోమరోగమును ప్రమేహమును జయించును.

పనసకాయగుణము

మూ. పనసస్య ఫలం స్వాదు శ్లేష్మలం వాతపిత్తజిత్. ౨౧౮

తద్విశేషాః వివర్జ్యాస్స్యుః గుల్మిభిః దుర్బలాత్మభిః,

వ్యా॥ పనసకాయకూర మధురముగ నుండును. కఫమును వృద్ధిజేయును. వాత పిత్తముల జయించును. పనసకాయలను గుల్మరోగముకలవారును, బలహీనులును విడువవలెను.

పెనుపేపగుణము

మూ॥ టుణ్డుకస్య ఫలం రూక్షం వాతశ్లేష్మహరం లఘు,

వ్యా॥ పెనువేపచెట్టుకాయ రూక్షంబును, వాతకఫహరంబును లఘుగుణంబునై యుండును.

అత్తికాయలగుణము

మూ॥ స్తమ్భనానికషాయాణి శ్లేష్మఘ్నాని హితానిచ. ౨౧౯
ఉదుమ్బరశలాటూని రక్తపిత్తాతిసారషు,

వ్యా॥ అత్తికాయలు మలములను వీర్యమును స్తంభింపజేయును. వగరు కలిగి యుండును. కఫమును హరించును. ఇయ్యవి రక్తపిత్తరోగముకలవారికిని, అతిసారరోగపీడితులకును మిక్కిలి హితకరము.

కలబందగుణము

మూ॥ కుమారీ శ్లేష్మలా తిక్తా చక్షుష్యా పిత్తజిత్సదా(రా). ౨౨౦
కషాయ తిక్తమధురం తస్యాః పుష్పం ప్రమేహజిత్,

వ్యా॥ కలబంద కఫమును వృద్ధినొందించును. చేదుకలిగియుండును. కన్నులకు మిక్కిలి హితకరము. పిత్తమును హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. కలబందపువ్వు వగరును చేదును తీపియు కలిగియుండును. ఇయ్యది ప్రమేహములను విశేషముగ హరించును.

నాళశాకగుణము

మూ॥ అనుష్ణం బద్ధవిణ్మూత్ర నాళ(డ)శాకంతు పిచ్ఛిలమ్. ౨౨౧

వ్యా॥ నాళశాకము (కిక్కిసగడ్డకూర) కొంచెము ఉష్ణముగ నుండును. మలమూత్రములబంధించును. పిచ్ఛిలముగ నుండును.

ప్రవాళశాకగుణము

మూ॥ ప్రవాళం కటుతిక్తోష్ణం సరం శ్లేష్మానిలాపహమ్,

వ్యా॥ ప్రవాళ (పొగడ) శాకము కటురసముకలిగి చేదుగనుఉష్ణముగను ఉండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. కఫమును వాతమును హరించును.

## అత్తిపండుగుణము

మూ. ఉదుమ్బరమధూషాణ్ణు శోఫఘ్నీ లఘురూక్షణీ. ౨౨౨

వ్యా. అత్తిపండు మధురరసము కలిగియుండును. పాండువ్రణములను శోఫలను హరించును. లఘుగుణము కలిగినది. శరీరమును రూక్షముగ జేయును.

## లోణికాశాకగుణములు

మూ. లోణికారూక్షలవణీ చక్షుష్యా సర్వదోషజిత్,
తథా లవణికాలోణౌ వచక్షుష్యౌ వరే చతౌ. ౨౨౩

వ్యా. లోణిక (పాయిలాకు) రూక్షగుణంబును లవణరసంబును కలిగియుండును. కన్నులకు హితముగ నుండును. లవణిక (ఉప్పికూర), లోణ (పుల్లపాయిలకూర), ఈ రెండును కన్నులకు హితములు కావు.

## ముల్లంగిగడ్డగుణము

మూ. యద్బాలమవ్యక్తరసం కిఞ్చిత్ క్షారం స తిక్తకమ్,
తన్మూలకం దోషహరం లఘుసోష్ణం నియచ్ఛతి. ౨౨౪
గుల్మ కాస క్షయ శ్వాస వ్రణ నేత్రగళామయాన్,
స్వరాగ్ని సాదోదావర్తపీనసాంశ్చ; మహాత్మనః. ౨౨౫
రసే పాకేచ కటుకం ఉష్ణవీర్యం త్రిదోషకృత్,
గురు (ర్వ)భిష్యన్దిచ స్నిగ్ధం స్విన్నం తదపి వాతజిత్. ౨౨౬
వాతశ్లేష్మహరం శుష్కం సర్వమామంత్రిదోషలమ్,

వ్యా. రసము స్ఫుటముగ తెలియక కొంచెము ఉప్పగను కొంచెము చేదుగను నుండు లేతముల్లంగి దుంపవాతాదిదోషములను హరించును. అయ్యది తేలికజీర్ణ మగును. కొంచెముగ ఉష్ణము కలిగియుండును. గుల్మమును, కాసమును, క్షయమును, శ్వాసమును, వ్రణములను, నేత్రరోగములను, కంఠమున కల్గురోగములను, స్వరహీనమును, అగ్నిమాంద్యమును, ఉదావర్తమును, పీనసమును ఈలాటి యితరరోగముల నన్నింటిని హరించును. అయ్యది ముదిరియున్నచో కటువిపాకంబును, కటురసంబును, ఉష్ణవీర్యంబును, కలిగి త్రిదోషముల ప్రకోపింపజేయును. గురుత్వంబును కలిగి స్రోతస్సుల స్రవింపజేయును. దానిని ఉడికించి నెయ్యి మున్నగుస్నేహద్రవ్యములతో పక్వముచేసినచో నయ్యది వాతమును హరించును. అయ్యది యెండినచో వాతకఫముల హరించును. లేతదియైనను ముదిరినదియైనను పక్వముచేయక పచ్చిగ నున్నచో త్రిదోషముల హరించును.

### గగ్గెర మున్నగువానిగుణములు

మూ. కుదేరశిగ్రుసురస సుముఖాసురిభూస్తృణమ్. ౨౨౭
ఫణిజ్ఝా(జ్జా)ర్జకజమ్బీరప్రభృతిగ్రాహిశాలకమ్.
విదాహికటురూక్షోష్ణం హృద్యం దీపనరోచనమ్. ౨౨౮
దృక్ఛుక్రక్రిమిహృత్తీక్ష్ణం దోషోత్క్లేశహరం(కరం)లఘు.

వ్యా. నల్లగగ్గెర, మునగ, నల్లతులసి, సుముఖ (అడవిగగ్గెర), నల్లావాలు;, కామంచి పూరి, ఫణిజ్జక (తెల్లగగ్గెర, ఆర్జక (మరువము), జంబీరము (కరపత్రకము), ఇవి మున్నగు వానిచే జేయబడినపచ్చడి మున్నగువ్యంజనములు విదాహికరములు. కటురసంబును, రూక్ష గుణంబును, ఉష్ణవీర్యంబును కలిగియుండును. హృదయమునకు హితకరము. అగ్నిని దీపింపజేయును. రుచి పుట్టించును. కన్నులకును శుక్రమును క్రిములను హరించును. మిక్కిలి తీక్ష్ణముగ నుండును. వాతాదిదోషములను వానిస్థానములనుండి వెడలించును. (దోషములచే గలిగినరోకిరింతల హరించును) తేలికగ జీర్ణమగును.

### నల్లతులసి, అడవిగగ్గెర వీనిగుణములు

మూ. వాధ్మకాసశ్రమశ్వాస పార్శ్వరుక్పూతిగన్ధహా. ౨౨౯
సురసః సుముఖో నాతివిదాహీగర(?)శోఫహా,

వ్యా. సురస (నల్లతులసి) ఎక్కిళ్లను, కాసమును, శ్రమమును, శ్వాసమును. ప్రక్క నొప్పిని, శరీరమునందలి దుర్గంధమును హరించును. సుముఖము (అడవిగగ్గెర) కొంచెముగ తాపమును గలిగించును. విషమును శోఫమును హరించును.

### పచ్చికొతిమిరిగుణము

మూ. ఆర్ద్రి(ర్ద్రి)కాతిక్త మధురా మూత్రలా న చ పిత్తకృత్. ౨౩౦
వ్యా. అర్ద్రిక (పచ్చికొతిమిరి) చేదుగ తీపిగ నుండును. మూత్రమును వృద్ధిచేసి వెడలించును. కొంచెముగ పిత్తమును చేయును.

### వెల్లుల్లిగడ్డలగుణము

మూ. లశునోభృశతీక్ష్ణోష్ణః కటుపాకరసస్సరః,
హృద్యః కేశ్యో గురుర్వృష్యః స్నిగ్ధో రోచనదీపనః. ౨౩౧
కిలాసకుష్ఠగుల్మార్శో మేహక్రిమి కఫానిలాన్,
సహిధ్మా పీనసశ్వాసకాసాన్ హన్త్యస్ర పిత్తకృత్. ౨౩౨

వ్యా. లశునము (వెల్లుల్లి) మిక్కిలి తీక్ష్ణముగ నుండును. ఉష్ణవీర్యంబును కటు విపాకంబును కటురసంబును కలిగియుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. హృద

యమునకు మిక్కిలి వాతకరము. వెండ్రుకల వృద్ధినొందించును. గురుత్వము కలిగి యుండును. శుక్రమును వృద్ధినొందించును. స్నిగ్ధముగ నుండును. రుచిని పుట్టించును. అగ్నిని దీపింపజేయును. కిలాసము (తెల్లకుష్ఠము)ను, కుష్ఠములను, గుల్మమును, అర్శోరోగమును, ప్రమేహమును, క్రిములను, కఫమును, వాతమును ఎక్కిళ్లను, పీనసమును, శ్వాసకాసములను, ఈరోగముల నన్నిటిని పోగొట్టును. రక్తపిత్తమును కలిగించును.

మరియు అష్టాఙ్గసంగ్రహమున వెల్లుల్లి విశేషగుణము లిట్లు చెప్పబడినవి:—
"పత్రే సక్షారమధురః మధ్యే మధురపిచ్ఛిలః, తీక్ష్ణోష్ణో లశునఃకన్దే" వెల్లుల్లి యాకు కొంచెము ఉప్పగను తీపుగ నుండును. మధ్యభాగమున కొంచెము మధురంబును పిచ్ఛిలంబునై యుండును. దానిగడ్డలు మిక్కిలి తీక్ష్ణంబులును ఉష్ణవీర్యంబులు నగును. అని భావము.

ఈవాక్యము ననుసరించి ప్రకృతగ్రంథమున జెప్పినతీక్ష్ణోష్ణాదిగుణములు వెల్లుల్లి గడ్డల నుద్దేశించి చెప్పబడెనని యెరుంగునది.

## నీరుల్లిగుణము

మూ. పలాణ్డుస్తద్గుణన్యూనః శ్లేష్మలో నాతిపిత్తలః,
కఫవాతార్శసాం పథ్యః స్వేదేఽభ్యవహృతౌ తథా. 233

వ్యా. నీరుల్లి వెల్లుల్లికంటె కొంచెము తక్కువగుణములు కలిగియుండును. కఫమును వృద్ధినొందించును. స్వల్పముగ పిత్తమును చేయును. కఫముచేతను వాతముచేతను కలిగిన అర్శోరోగములయందు స్వేదవిధిచేయుటకును ఆహారముగ భుజించుటకును మిక్కిలి పథ్యముగ నుండును.

ఇచ్చట నీరుల్లి కఫమును వృద్ధినొందించునదియైనను కఫార్శోరోగమున ప్రభావముచే పథ్యకర మని యెరుంగునది. మరియు తంత్రాంతరమున తెల్లనినీరుల్లిగుణము లిట్లు చెప్పబడినది. "స్నిగ్ధో రుచిష్యః స్థిరధాతుకారీ బల్యోఽథ మేధా కఫపుష్టిదశ్చ, స్వాదుర్గురుశ్శోణితపిత్తశస్తః సపిచ్ఛిలః క్షీరపలాణ్డురుక్తః" క్షీరపలాండు (తెల్లనినీరుల్లి) స్నిగ్ధముగను రుచికరముగ నుండును. ధాతువులకు స్థిరత్వమును కలిగించును. బలమును, బుద్ధిని, కఫమును, శరీరపుష్టిని కల్గించును. మధురముగ నుండును. గురుత్వము కలిగియుండును, రక్తపిత్తమునందు మిక్కిలి ప్రశస్తము. జిగటగ నుండును అని యర్థము.

## గృంజనగుణము

మూ. తీక్ష్ణో గృఞ్జనకో గ్రాహీ దీపనో (పిత్తనాం) హితకృన్నచ,

వ్యా. గృంజనము (ఉల్లిలో నొకవిధమైనది) మిక్కిలి తీక్ష్ణముగ నుండును. మలాదులను బంధించును. అగ్నిని దీపింపజేయును. పిత్తరోగులకు హితకారి కానేరదు.

### హింగుపత్త్రి, భూకందగుణములు

మూ. హిఙ్గుపత్త్రీ కటుః పథ్యాః భూకన్దస్త్వతిదోషలః. ౨౩౪

వ్యా. హింగుపత్త్రి (గారచెట్టు), దీనికూర కటురసము కలిగియుండును. పథ్యకర మైనది. పుట్టకొక్కుడోషముల వృద్ధినొందించును.

### ఖర్జూరాదిమస్తకగుణములు

మూ. శీతలాః శ్లేష్మలాః వృష్యాః మధురాః రసపాకయోః,

పిత్తాని లఘ్నాః ఖర్జూరనారికేళాదిమస్తకాః. ౨౩౫

వ్యా. ఖర్జూరపుచెట్టు టెంకాయచెట్టు మున్నగువానిమస్తకములు (కొసలలో గర్భమునసుండు మోవులు) శీతలములుగ నుండును. కఫమును వృద్ధినొందించును. శుక్రపుష్టి నిచ్చును. విపాకమునందును రసమునందును మధురముగ నుండును, (ఇచ్చట ఆదిశబ్దముచేత తాటిచెట్టు, ఈతచెట్టు మున్నగువాని మోవులుగూడ గ్రహింపబడును.

### శాకవర్గమున శ్రేష్ఠములైనవి

మూ. సతీనోవాస్తుకశ్చుంచుఃచిల్లీ మూలకపోతకాః,

మణ్డూకపర్ణి జీవన్తీశాకవర్గే ప్రశస్యతే. ౨౩౬

వ్యా. సతీన (పెద్దపెసరశాకము), వాస్తుకము (చెంచలికూర), చుంచుశాకము, చిల్లి (చిలుకకూర), లేతముల్లంగి, మండూకపర్ణి (సరస్వతియాకు), జీవంతి (పాలకూర), ఈశాకములు శాకవర్గములో మిక్కిలి ప్రశస్తములు.

### పత్త్రాదిశాకములలో గురుత్వతారతమ్యము

మూ. పత్రే పుష్పే ఫలే నాళే కన్దేచ గురుతాక్రమాత్,

వ్యా. పత్త్రశాకములు (ఆకుకూరలు), పుష్పశాకము (పూతకూరలు), ఫలశాకములు (కాయగూరలు), నాళశాకములు (కాడలకూరలు), కందశాకములు (గడ్డకూరలు), అను నీశాకములు వరుసగ నొకదానికన్న నొకటి మిగుల గురుత్వము కలిగి యుండును. (పత్త్రశాకమునకంటె పుష్పశాకంబును, దానికన్న ఫలశాకంబును, అంతకన్న నాళశాకంబును, అంతకన్న కందశాకంబును గురుత్వము కలిగియుండుననుట).

"మూలకేతు విపర్యయః" అని చరకాచార్యులు చెప్పిరి కావున ముల్లంగియందు మాత్రము పైజెప్పినవరుసకు తలక్రిందుగ (కంద - నాళ - ఫల - పుష్ప - పత్త్రములు) గురుత్వము గలిగియుండునని తెలియునది.

### అగ్రాహ్యశాకము

మూ. అసఞ్జాతరసం శుష్కరూక్షస్నిగ్ధామకోమలమ్. ౨౩౭

శాకం నాద్యాత్ తథా రాత్రౌ త్రికం తత్రయుతం తథా,

వ్యా. మధురాదిరసములు కలుగకుండుశాకంబును, ఎండినశాకంబును, మిక్కిలి రూక్షముగనుండుశాకంబును, మిక్కిలి స్నిగ్ధముగనుండుశాకంబును, పక్వముగాని శాకంబును, కోమలముగ నుండుశాకంబును, ఇట్టిశాకముల భుజింపజనదు. మరియు రాత్రి పూట తినగూడదు. మూడుకూరలు కలిపివండినది తినగూడదు. మజ్జిగతో శాకమును దినరాదు.

ఇది శాకవర్గము.

అవతారిక:—ఇత్తెరంగున భోజనమునకు ముఖ్యమైన శాకవర్గమునుజెప్పి పిదప "భుక్త్వావసానే ఫలం భుజ్యతే" అను ఖరనాదవచనప్రకారము భోజనాంతమున తినదగిన ఫలముల జెప్పుటకై యీక్రింద ఫలవర్గము చెప్పబడును:—

అథ ఫలవర్గః :—

ద్రాక్షపండుగుణము

మూ. ద్రాక్షా ఫలోత్తమా వృష్యా చక్షుష్యా సృష్టమూత్రవిట్,
స్వాదుపాకరసాస్నిగ్ధా సకషాయా హిమాగురుః. ౨౩౭
నిహంత్యనిలపిత్తాస్ర తిక్తాస్యత్వ మదాత్యయాన్,
తృష్ణా కాసజ్వర(శ్రమ)శ్వాస స్వరభేదక్షతక్షయాన్. ౨౩౮
కురుతే మధురా మ్లానా కఫపిత్తప్రదూషణౌ,

వ్యా. పలుతెరంగులైన పండ్లజాతులలో ద్రాక్షపండు కడుంగడు శ్రేష్ఠము. శుక్రమును వృద్ధినొందించును. కన్నులకు మిక్కిలి హితకరము. మలమూత్రములను సరళముగ వెడలించును, మధురమైన రసముకలిగి మధురముగనే విపాకముచెందును. స్నిగ్ధముగ నుండును. కొంచెముగ వగరురసము కలిగియుండును. శీతవీర్యముకలది. గురుత్వము కలిగి యుండును. వాతము, పిత్తము, నోటిచేదు, మదాత్యయము, దప్పి, శ్వాసకాసములు, జ్వరము, (శ్రమము), స్వరభేదము, ఉరఃక్షతము, క్షయము వీనినన్నిటిని హరించును. (ఇవి తీపుద్రాక్షపండ్లగుణములు) పుల్లద్రాక్షపండు కఫపిత్తములను చెరచును.

దానిమ్మపండుగుణము

మూ. ఉద్రిక్తపిత్తాన్ జయతి త్రిదోషాన్ స్వాదుదాడిమమ్. ౨౪౦
పిత్తాఽవిరోధినాత్యుష్ణం అమ్లం వాతకఫాపహమ్,
సర్వం హృద్యం లఘుస్నిగ్ధం గ్రాహిరోచనదీపనమ్. ౨౪౧

వ్యా॰ తియ్యనిదానిమ్మపండు పిత్తం బధికముగ నుండుత్రిదోషముల శమింప జేయును. పుల్లనిదానిమ్మపండు కొంచెము ఉష్ణముు చేయునుగాని పిత్తమునకుమాత్రము విరోధముకాదు. వాతకఫములమాత్రము హరించును. (పిత్తమును ప్రకోపమునైనను శమమునైనను నొందించక వాతకఫములమాత్రము హరించుననుట) పైజెప్పిన పుల్ల, తియ్య, దానిమ్మపండ్లు హృదయమున కనుకూలములును, చులకనగ జీర్ణమగునవియు, స్నిగ్ధంబులును, మలమును బంధించునవియు, రుచిని బుట్టించునవియు, జఠరాగ్నిని దీపింపజేయునవియు నగును.

అరటిపండు మున్నగుఫలములసామాన్యగుణము

మూ. మోచ ఖర్జూర పనస నారికేళ పరూషకమ్,
ఆమ్రాత తాళ కాశ్మర్య రాజాదనమధూకజమ్, ౨౪౨
సౌవీరబదరాఙ్కోల ఫల్గుశ్లేష్మాతకోజ్వలం(ద్భవమ్),
హితామాఽభిషుకాక్షోడముకూలకనికోచకమ్. ౨౪౩
ఉరుమాణం ప్రియాళుంచ బృంహణం గురుశీతలమ్,
దాహక్షతక్షయహరం రక్తపిత్తప్రసాదనమ్. ౨౪౪
స్వాదుపాకరసం స్నిగ్ధం విష్టమ్భి గురుశుక్రలమ్ (కృత్),

వ్యా॰ అరటి, ఖర్జూరము, పనస, నారికేళము (టెంకాయ), ఈదు, ఆమ్రాతకము, నల్లమామిడి (కొండమామిడి), తాటి, గుమ్మడి, పాల, ఇప్ప, సౌవీరము (కమ్మరేగు), బదరము (రేగు), అంకోలము (ఊడుగ) బిల్వము, ఫల్గు (కుక్కమేడి, బ్రహ్మమేడి), విరిగి వాతామము (చాగము) అభిషుకము, ఆక్షోటము (అక్రోటు) ముకూలకము, నకోచకము, ఉరుమాణము, ప్రియాళు (మొరళి), అను నీవృక్షములఫలములు అన్నియును సామాన్యముగ శరీరపుష్టినిచ్చును, గురుత్వము కలిగియుండును. శీతవీర్యము కలిగియుండును. తాపమును, ఉరఃక్షతమును, క్షయమును హరించును, రక్తపిత్తమును శమింపజేయును. రసమునందును విపాకమునందును మధురముగ నుండును. స్నిగ్ధముగ నుండును. మలమును బంధించును. గురుత్వము కలిగియుండును. శుక్రమును వృద్ధినొందించును.

టెంకాయవిశేషగుణములు

మూ. ఫలంతు నారికేళస్య పిత్తఘ్నం కఫవాతకృత్. ౨౪౫
తత్కపాలం (త్తుబాలం) మృదుతరం తస్యాగ్రపిశితంచయత్,
ఆటోపోదరశూలాస్త్ర పరికర్తవిధాయితత్. ౨౪౬
తదేవ పక్వం నిర్ముక్తకపాలమనిలాపహమ్,

దన్తరోగే విశేషేణ హితం తద్వాతశోణితే. ౨౪౭
మలసఙ్గ్రాహ్యకృద్వృష్యం శ్లేష్మలం వాతనాశనమ్,
నారికేళఫలం స్వాదువిదాహ్యం దోషలం గురు. ౨౪౮

వ్యా. టెంకాయ పిత్తమును హరించును. కఫవాతములను ప్రకోపింపజేయును. అయ్యది లేతదిగ నుండునేని దాని లోపలిగుజ్జు మృదువుగ నుండును. అయ్యది కడుపులో నాటోపము (గడబిడ)ను, కడుపునొప్పిని, ప్రేవులయందు పరికర్తనము (కోత)ను కల్గించును. టెంకాయ చక్కగ ముదిరి పండి పైచిప్పలతో సంబంధములేక వదలియున్నచో నయ్యది వాతమును హరించును. దంతరోగములయందును విశేషముగ వాతరక్తమునందును హితకరము. మలమును వృద్ధిచేయును. శుక్రమును వృద్ధినొందించును. కఫమును ప్రకోపింపజేయును వాతమును హరించును. టెంకాయ మొలకయెత్తియున్నచో మిక్కిలి మధురముగ నుండును. దోషములనన్నిటిని ప్రకోపింపజేయును. గురుత్వము కలిగియుండును.

## ఈతపండు విశేషగుణము

మూ. అత్యమ్లమీషన్మధురం కషాయానురసం లఘు,
వాతఘ్నం పిత్తజననం ఆమం విద్యాత్పరూషకమ్. ౨౪౯
తదేవ పక్వం మధురం వాతపిత్తనిబర్హణమ్,

వ్యా. ఈతకాయ చక్కగ మాగక కాయగా నుండునది అధికముగ పులుపును, కొంచెముగ తీపియు, వగరు అనురసముగను కలిగియుండును. తేలికగ జీర్ణమగును. వాతమును హరించును. పిత్తమును వృద్ధినొందించును. అయ్యది చక్కగ మాగి పండినచో మధురమై వాతమును హరించును.

## ఖర్జూరపుపండుగుణము

మూ. వాతహృద్వైపిమృదీకాఖర్జూరంవాతకోష్ఠకృత్. ౨౫౦
పక్వం వా తత్ఫలం స్వాదు పిత్తశ్లేష్మాస్రవర్ధనమ్,
దుర్జరం మూత్రలం భేదితన్ద్రాభిష్యన్దశుక్రలమ్. ౨౫౧

వ్యా. ద్రాక్షపండును ఖర్జూరపుపండును ఈరెండును వాతహరములుగ నున్నను కోష్ఠమున వాతమును అధికముగ జేయును. (కోష్ఠమును వాతభూయిష్ఠమైన క్రూరకోష్ఠముగ జేయుననుట) ఖర్జూరఫలము పక్వమై పండినదైనచో మధురముగనుండును. పిత్తమును కఫమును రక్తమును వృద్ధినొందించును. చాలకాలమునకు కష్టముచే జీర్ణమగును. మూత్రమును వృద్ధిజేసి వెడలించును. మలమును భేదించును. కునికిపాటును కలిగించును. స్రోతస్సుల ద్రవము పుట్టించును. శుక్రమును వృద్ధిచేయును.

### ఖర్జూరపుకాయగుణము

మూ. తరుణం స్వాదు శుక్రఘ్నం అగ్నిదం వాతపిత్తలమ్,
తస్య మజ్జాపి తరుణం కిఞ్చిన్మదకరం లఘు. ౨౫౨

వ్యా. ఖర్జూరపుకాయ మధురముగనుండును. శుక్రమును హరించును. జఠరాగ్నిని వృద్ధినొందించును. వాతపిత్తముల వృద్ధినొందించును. దాని మజ్జ(మోవు)యు కొంచెము మదమును కలిగించును. చుల్కనగ జీర్ణమగును.

### గుమ్మడుపండుగుణము

మూ. శ్లేషలం వాతపిత్తఘ్నం సస్నేహమధురం సరమ్,
మూత్రలంస్వాదుపాకఞ్చ ఫలం కాశ్మర్యజం హిమమ్. ౨౫౩

వ్యా. గుమ్మడుపండు కఫమును వృద్ధినొందించును. వాతపిత్తముల హరించును. స్నిగ్ధముగను మధురముగను నుండి శరీరమున శీఘ్రముగ వ్యాపించును. మూత్రమును వృద్ధినొందించి వెడలించును. మధురవిపాకము కలిగియుండును. శీతవీర్యముగ నుండును.

### రాజాదనఫలగుణము

మూ. శకృన్మూత్రవిబన్ధఘ్నం కేశ్యం మేధ్యం రసాయనమ్,
స్నిగ్ధం స్వాదుకషాయంచ రాజాదనఫలం గురు. ౨౫౪

వ్యా. రాజాదనఫలము (చారపప్పు) మలమూత్రముల బంధమును హరించును. వెండ్రుకల వృద్ధినొందించును. మేదస్సును బలపరచును. రసాయనమై జరావ్యాధుల నివర్తింపజేయును. స్నిగ్ధంబును, మధురకషాయ రసంబులును కలిగియుండును. (దీనిని బిక్కిపండ్లు అని యందురు.)

### బాదముపండుగుణము

మూ. వాతామముష్ణవీర్యంతు కఫపిత్తకరం పరమ్,

వ్యా. బాదముపండు మిక్కిలి యుష్ణమైన వీర్యము కలిగి కఫముల వృద్ధి నొందించును.

### మొరళిపండు, దానిపప్పు (చారపప్పు) గుణము

మూ. పరం వాతహరం స్నిగ్ధం అనుష్ణంతు ప్రియాళుజమ్. ౨౫౫
ప్రియాళు మజ్జామధురః వృష్యః పిత్తానిలాపహః,

వ్యా. ప్రియాళు (మొరళిపండు) మిక్కిలి వాతహరము. స్నిగ్ధము, కొంచెము ఉష్ణమునుచేయును. మొరళివిత్తులలోనిపప్పు (చారపప్పు) మిక్కిలి మధురంబును శుక్ర వృద్ధికరంబును పిత్తవాతముల హరించునదియు నగును.

రేగువిత్తుల పప్పుగుణము

మూ. కోలమజ్జాగురు స్తద్వత్ తృట్ఛర్ది శ్వాసజిచ్చసః. ౨౫౮

వ్యా. రేగుపండులోని పప్పు పైజెప్పిన గుణములుకలిగి గురుత్వముగ నుండును. దప్పిని, వాంతులను, శ్వాసమును హరించును.

ఈడపండుగుణము

మూ. మధురం శ్లేష్మలం శీతం రుచ్యం పారేవతం గురు,
తదేవామ్లం గురూష్ణం స్యాత్ రోచనశ్లేష్మపిత్తలమ్. ౨౫౭

వ్యా. పారేవతము (ఈడపండు) తీపి పులుపు అను రసములు కలిగియుండుటచే మధురంబును, అమ్లంబును నని రెండువిధములు.) అందు మధురముగనుండు యీడపండు శీతవీర్యంబును రుచికరంబును, గురుత్వవిశిష్టంబు నగును. అమ్లముగనుండు ఈడపండు గురుత్వంబును ఉష్ణవీర్యంబును కలిగియుండును. రుచినిపుట్టించును. కఫమును పిత్తమును వృద్ధినొందించును.

ఈడపండు భేదములను "స్వాద్వమ్లం శీతముష్ణంచ ద్విధాపారేవతం గురు" అని రెండువిధములుగ వాగ్భటాచార్యులు చెప్పిరి.

గజనిమ్మపండుగుణము

మూ. ఆరుకం గురునాత్యుష్ణం వాతఘ్నం నాతిపిత్తలమ్,
బృంహణం మధురప్రాయం అమ్లంతుకఫపిత్తలమ్. ౨౫౮
కఫఘ్నం మధురం గ్రాహి పిత్తశ్లేష్మప్రదూషణమ్,
కషాయానురసం శీతం వృష్యం విష్టమ్భివాతలమ్. ౨౫౯

వ్యా. ఆరుకము (గజనిమ్మ) దీనిపండు మధురము అధికముగనుండునది యొకటి. పులుపు అధికముగనుండునది రెండవది. సామాన్యముగ మధురముగ నుండునది మూడవది. వగరు అనురసముగ గలిగినది నాల్గవది. ఇట్టి రసభేదములచే గజనిమ్మ నాల్గు తెరంగుల నుండును. ఈవిషయము నిఘంటువున నిట్లు చెప్పబడినది:—"ఆరుకం వీరసేనంచ వీరా వీరారుకం తథా, విద్యాజ్జాతి విశేషేణ తచ్చ తు ర్విధమారుకమ్" ఆరుకము, వీరసేనము, వీరము, వీరారుకము నని గజనిమ్మ జాతిభేదముచే నాల్గువిధములు అని భావము. ఈనాల్గిటి గుణములను ప్రకృత గ్రంథకారుడు పైశ్లోకములచే వేరువేరుగ జెప్పెను.)

గజనిమ్మపండు మిక్కుటముగ మధురమైనది గురుత్వము కలిగియుండును. కొంచెముగ నుష్ణమును చేయును. వాతమును హరించును. కొంచెముగ పిత్తమును చేయును. శరీరపుష్టిని కలిగించును. పుల్లగనుండు గజనిమ్మపండు కఫపిత్తముల వృద్ధినొందించును.

సామాన్యముగ మధురమైనది మలమును బంధించును. కషాయరసము (వగరు) కొంచెము కలిగి మధురముగనుండునది పిత్తకఫముల చెరచును. శీతవీర్యము కలిగియుండును. శుక్రమును వృద్ధినొందించును. మలమును బంధించును. వాతమును వృద్ధిచేయును.

తుమ్మికిపండుగుణము

మూ. దాహాతృష్ణాప్రవాహాఘ్నం రూక్షం కర్కన్ధుజంఫలమ్,
తైన్దుకం గ్రాహి మధురం కషాయం రూక్షశీతలమ్. ౨౬౦

వ్యా. తుమ్మికిపండు తాపమును, దప్పిని, హరించును. తీవ్రముగనుండు విరేచనముల నిలుపును. రూక్షగుణము కలిగియుండును. తుమికిపండు మలమును కట్టును. మధురముగను వగరుగను ఉండును. రూక్షగుణంబును శీతవీర్యంబు నగును.

దంతీఫలగుణము

మూ. దన్త్యాః కషాయ మధురం వాతలం గురుశీతలమ్,
టఙ్కం కషాయ మధురం వాతలం గురుశీతలమ్. ౨౬౧

వ్యా. దంతీఫలము (దంతినపండు), టంకమను ఫలవిశేషంబును కషాయ మధుర రసములు కలిగి వాతమును వృద్ధినొందించును. శీతవీర్యము.

వెలగపండుగుణము

మూ. కపిత్థమామం కణ్ఠా (కణ్ఠ) ఘ్నం దోషలం దోషఘాతితు,
పక్వం హిద్మావమథుజిత్ సర్వం గ్రాహివిషాపహమ్. ౨౨౬

వ్యా. వెలగకాయ (పండక కాయగా నుండునది) దురదను పోగొట్టును (కంఠమును చెరచును). వాతాదిదోషముల ప్రకోపింపజేయును. చక్కగ పండిన వెలగపండు వాతాదిదోషముల హరించును. ఎక్కిళ్లను వమనములను హరించును. వెలగకాయ యైనను పండైనను మలమును బంధించును. విషముల హరించును.

నారింజపండుగుణము

మూ. నారఙ్గ మమ్లం సుస్వాదు కషాయ గురుశీతలమ్,
వాతశ్లేష్మహరం హృద్యం విశదం భక్తరోచనమ్. ౨౬౩

వ్యా. (నారంగము (నారింజ) దీనిపండు తియ్యగను పుల్లగను ఉండుటచే మధురామ్ల భేదములచే రెండువిధములు) ఈరెండువిధములైన నారింజపండ్లును కషాయరసము అనురసముగ నుండును. గురుత్వంబును శీతవీర్యంబును కలిగియుండును. వాతకఫముల హరించును. హృదయమునకు అనుకూలమైనది. విశదగుణము కలిగియుండును. అన్నముపై రుచిపుట్టించును.

నేరేడుపండ్లగుణము

మూ. జామ్బవంగురువిష్టమ్భి శీతలం భృశవాతలమ్,
కషాయ మధురం గ్రాహి కఫపిత్తనిబర్హణమ్. ౨౬౪
(సజ్ఞాగ్రిహి మూత్రశకృతోః అకణ్ఠ్యాం కఫపిత్తనుత్,)

వ్యా. నేరేడుపండు గురుత్వము కలిగియుండును. స్తంభనకరము. శీతగుణంబును వీర్యంబును కలిగినది. వాతమును మిక్కిలి ప్రకోపింపజేయును. కషాయ(వగరు) మధుర (తీపియు)ములు కలిగియుండును. విరేచనముల కట్టును. కఫపిత్తముల హరించును. (మల మూత్రములను నిరోధించును. కంఠమునకు హితముకాదు. కఫపిత్తముల హరించును).

క్షీరవృక్షఫలములగుణము

మూ. క్షీరవృక్షఫలం స్వాదు కషాయం గురుశీతలమ్,
వాతలం కఫపిత్తాసృఙ్మేహాఽతీసారనాశనమ్. ౨౬౫

వ్యా. రావి, అత్తి, జువ్వి, మఱ్ఱి ఇవి క్షీరవృక్షములు; వీనిపండ్లు తీపియు వగరును గురుత్వంబును శీతవీర్యంబును కలిగియుండును. వాతమును వృద్ధినొందించును. కఫమును, పిత్తరక్తమును, ప్రమేహములను, అతిసారమును హరించును.

మామిడికాయ పండు వీనిగుణము

మూ. వాతపిత్తాస్రకృద్బాలం బద్ధాస్థికఫపిత్తకృత్,
గుర్వామ్రం వాతజిత్పక్వం స్వాద్వమ్లం కఫశుక్రకృత్. ౨౬౬
సహకారరసోహృద్యః సుగన్ధిః (సురభిః) భక్తరోచనః,
ఆమ్రస్య మజ్జా కృమికృత్ గ్రాహీ స్వాదుకషాయకః. ౨౬౭

వ్యా. లేతమామిడికాయ (విత్తుబట్టకుండునది) వాతమును పిత్తరక్తమును వృద్ధి నొందించును. ముట్టెపట్టినది కఫపిత్తముల వృద్ధిచేయును. చక్కగపండినమామిడిపండు గురుత్వము కలిగియుండును వాతమును హరించును. మధురముగను పుల్లగను ఉండు మామిడిపండు కఫమును శుక్రమును హరించును. తియ్యమామిడిపండు హృదయమునకు హితకరము. మంచిపరిమళముకలిగి యన్నమునందు రుచిని బుట్టించును. మామిడిపండు టెంకలోనిపప్పు క్రిములను కలిగించును. విరేచనముల బంధించును. తీపియు వగరును కలిగియుండును.

వేతసామ్లగుణము

మూ. వేతసామ్లం కషాయోష్ణం రూక్షం వాతకఫాపహమ్,
బాలం తద్వాతపిత్తఘ్నం పిత్తఘ్నం వత్సరోషితమ్. ౨౬౮

వ్యా. వేతసామ్లము (పుల్లప్రబ్బలి) కషాయరసంబును ఉష్ణవీర్యంబును రూక్ష గుణంబును కలిగియుండును. వాతకఫముల హరించును. అయ్యది లేతదిగనుండు సేని వాత పిత్తముల హరించును. సంవత్సరకాలముగడచినది పిత్తమునుమాత్రము హరించును.

చింతపండుగుణము

మూ. లఘూష్ణం గ్రాహితిన్త్రిణ్యాః ఫలం బీజన్తు జన్తుకృత్,
త్రిన్త్రిణీ కఫలాత్కిఞ్చిత్కిఞ్చిదూనం కోలామ్లజంగుణైః. ౨౮౯

వ్యా. చింతపండు లఘుగుణంబును ఉష్ణవీర్యంబును కలిగియుండును. విరేచనముల బంధించును. చింతవిత్తనములు జంతువుల కలిగించును. పుల్లనిరేగుపండు చింతపండుకంటె కొంచెము తక్కువయైనగుణములు కలిగియుండును.

అష్టాఙ్గసంగ్రహమున చింతపండుగుణము లిట్లు చెప్పబడినవి:—"వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం లఘురోచనదీపనమ్. వాతశ్లేష్మహరం కిఞ్చిదూనం కోశామ్రజం తతః" చింతపండు పైజెప్పినరూక్షాదిగుణములేగాక రుచికరంబును అగ్నిదీపనంబును నగును. కఫ వాతముల హరించును. కొండమామిడి చింతపండుకన్న కొంచెము తక్కువయైనగుణములు కలిగియుండును. అని భావము.

మారేడుపండు, కాయలగుణములు

మూ. గుర్వగ్నిదోషకృద్బిల్వం దోషలంపూతిమారుతమ్,
పక్వం; బాలం పునస్తీక్ష్ణం పిత్తలం లఘుదీపనమ్. ౨౯౦
వాతశ్లేష్మఘ్నముష్ణంచ;స్నిగ్ధం గ్రాహ్యుభయం పరమ్,

వ్యా. మారేడుపండు (పండినది) గురుత్వముకలిగి కష్టముచే జీర్ణమగును. జఠరాగ్నిని చెరిచి యాకలిని మందగింపజేయును. వాతాదిదోషములను వృద్ధినొందించును. దుర్గంధముగ నపానవాతమును వెడలించును. మారేడుకాయ (పండనిది) తీక్ష్ణముగ నుండును. పిత్తమును వృద్ధినొందించును. తేలికగ జీర్ణమగును. జఠరాగ్నిని దీపింపజేయును. వాతకఫముల హరించును. ఉష్ణవీర్యంబును కలిగియుండును. పండును కాయయు (ఈరెండును) విరేచనముల కట్టును.

పేముపండు, వేపపండు, పీనిగుణము

మూ. క్షారోష్ణామ్లగురుస్నిగ్ధం వాతలం దృగ్ఘ్నమగ్నికృత్. ౨౯౧
ఫలం వేత్రస్య నిమ్బస్య పిత్తశ్లేష్మహరం పరమ్,

వ్యా. పేముపండు క్షారముగను, ఉష్ణముగను, పులుపుగను, గురువుగను, స్నిగ్ధముగను ఉండును, వాతమును వృద్ధినొందించును. దృష్టిని చెరచును. జఠరాగ్నిని వృద్ధినొందించి యాకలిబుట్టించును. వేపపండు పిత్తకఫముల హరించును.

జమ్మిపండు మున్నగువానిగుణములు

మూ. శమ్యాః గురూష్ణం కేశఘ్నం రూక్షం పీలుతుపిత్తలమ్. ౨౭౨
కఫవాతహరంభేది ప్లీహార్శః క్రిమిగుల్మజిత్,
సతిక్తం స్వాదుయత్పీలునాత్యుష్ణం తత్త్రిదోషజిత్. ౨౭౩
అస్మాదల్పాన్తరగుణమ్మైఙ్గుదం సవికఙ్కతమ్,
పనసస్యఫలం తృష్ణావాతశ్లేష్మనిబర్హణమ్. ౨౭౪

వ్యా. జమ్మిపండు గురుత్వంబును ఉష్ణగుణంబును కలిగియుండును. తలవెండ్రుకల నూడించును. రూక్షగుణము కలిగియుండును. పీలు ఫలము (వరగోగుపండు) పిత్తమును వృద్ధినొందించును. కఫవాతముల హరించును. మలమును భేదించును. ప్లీహము, అర్శస్సు, కృమిరోగములు, గుల్మము, ఈరోగముల హరించును. కొంచెము చేదుగను మధురముగను ఉండువరగోగుపండ్లు కొంచెముగ నుష్ణమును జేయును. త్రిదోషముల హరించును. గార పండును, పుల్లవెలగపండ్లును కొంచెమించుమించుగ నీగుణముల గలిగియుండును. పనస పండు దప్పిని వాతకఫములను హరించును.

మాదీఫలములగుణము

మూ. త్వక్తిక్తకటుకా స్నిగ్ధా మాతులుఙ్గస్య వాతజిత్,
బృంహణం మధురంమాంసం వాతపిత్తహరం గురు. ౨౭౫
లఘుతిక్తహరం (తత్కేసరం) కాసశ్వాసహిధ్మామదాత్యయాన్
ఆస్యశోషానిలశ్లేష్మవిబన్ధచ్ఛర్ద్యరోచకాన్. ౨౭౬
గుల్మోదరార్శశ్శూలాని మన్దాగ్నిత్వం చ నాశయేత్.

వ్యా. మాతులుంగము (మాదీఫలము)యొక్కచర్మము చేదును కారమునుకలిగి స్నిగ్ధముగ నుండును. వాతమును హరించును. మాదీఫలములమాంసము (గిజరు) మధురమై శరీరమునకు పుష్టిని కలిగించును. వాతపిత్తములను హరించును. గురుత్వము కలిగియుండును. మాదీఫలములకేసరములు లఘుత్వముకలిగి కాసశ్వాసములను, ఎక్కిళ్లను, మదాత్యయ మును హరించును. ఆస్యశోష (నోరెండుట)ను, వాతకఫములను, మలమూత్రాది బంధ మును, వాంతిని, అరోచకమును, గుల్మమును, ఉదరమును, అర్శోరోగమును, శూలరోగ మును, అగ్నిమాంద్యమును వీనినన్నిటిగూడ హరించును.

జీడిపండుగుణము

మూ. భల్లాతకస్య త్వఙ్మాంసం బృంహణం స్వాదుశీతలమ్. ౨౭౭
తదస్థ్యగ్నిసమం మేధ్యం కఫవాతహరం పరమ్,

వ్యా॥ జీడిపండుయొక్క చర్మంబును గిజరును శరీరమునకు పుష్టిని కలిగించును. మధురరసంబును శీతవీర్యంబును కలిగియుండును. జీడివిత్తులు నిప్పువలె మిక్కిలి తీక్ష్ణమై యొడలిమైన బొబ్బలుగలిగించి పుండుచేయును. బుద్ధికిచాలహితకరము; కఫవాతముల ముఖ్యముగ హరించును. (ఇచ్చట 'అగ్నిసమం' అనుచోట చిత్రమూలమునకు సమాన మైనగుణము కలది యనియు నర్థముచేయుట సమంజసముగ నున్నది).

పూతిసీఫలగుణము

మూ॥ పిచ్ఛిలం స్వాదు తిక్తోష్ణం విసర్పఘ్నం కఫాపహమ్. ౨౭౮
పూతినీఫలమస్యాస్థి క్రిమికృద్రోచనం హితమ్,

వ్యా॥ పూతినీఫలము (పూతినపండు) పిచ్ఛిలముగను, మధురతిక్తరసములు కలిగి నదిగను, ఉష్ణవీర్యముగను ఉండును. విసర్పమును, కఫమును హరించును. దానివిత్తులు క్రిములను కలిగించును. రుచిని పుట్టించును. మిక్కిలి హితకరమైనది.

మూ॥ నిదాఫలం పిత్తకరం తద్వద్ధాఙ్గేరుకీఫలమ్, ౨౭౯
కషాయమధురం తీక్ష్ణం వాతలం కఫపిత్తజిత్,

వ్యా॥ నిదా (?) ఫలము పిత్తమునుజేయును జీబిలికపండు అటులనే కషాయరస ముతోగూడిన మధురరసము కలిగియుండును. తీక్ష్ణగుణముకలది. వాతమును జేయును కఫపిత్తముల జయించును.

ఓకపండుగుణము

మూ॥ అమ్లం తిక్తాపహం హృద్యం పిత్తకృత్కరమర్దకమ్. ౨౮౦
మధురం కరమర్దం స్యాత్ తృష్ణాతిక్తాస్యనుత్ లఘు,

వ్యా॥ కరమర్దకము (ఓకపండు=కలివిపండు) పుల్లనిది నోటిచేదును పోగొట్టును. హృదయమున కనుకూలమైనది. పిత్తమును కల్గించును. తియ్యని (తీపికల) ఓకపండు దప్పిని నోటిచేదును పోగొట్టును. తేలికగ జీర్ణమగును.

నిమ్మపండుగుణములు

మూ॥ రోచనో దీపనస్తీక్ష్ణః సుగన్ధిర్ముఖశోధనః. ౨౮౧
మదహార్ష (కరో)హారో హృద్యః వమిఘ్నో భుక్తవాసదః,
తృష్ణాశూలవిబన్ధఘ్నః ఛర్దిశ్వాసహరో గురుః. ౨౮౨
జమ్బీరః కఫవాతఘ్నః క్రిమిహా భుక్తరోచనః,
వాతాహతం దంతశఠం గురూష్ణం కఫపిత్తనుత్. ౨౮౩

వ్యా. నిమ్మకాయ రుచిని బుట్టించును. జఠరాగ్నిని దీపింపజేయును. తీక్ష్ణముగ నుండును. మంచిపరిమళమును కల్గించును. నోటిని శుభ్రపరచును. మద్యాదులచే గల్గిన మదము (తిక్క)ను హర్షమును హరించును. హృదయమున కనుకూలమైనది. వాంతుల పోగొట్టును. భుజింపబడిన యాహారమును యుక్తమైనస్థితి నుంచును. దప్పిని, శూలలను, మలబంధమును హరించును. వాంతులగల్గించు శ్వాసమును హరించును. గురుత్వము కలిగి యుండును. జంబీరము (తీయనిమ్మపండు) కఫవాతములను, క్రిములను హరించును. అన్నముపై రుచిబుట్టించును. వేరొకవిధమైన నిమ్మపండు గురుఉష్ణగుణముల గలిగియుండును. కఫపిత్తముల హరించును.

మూ. సూర్యాఫలస్తు మధురామ్లమనుష్ణవీర్యం
తృష్ణావిదాహశమనం క్రిమికృత్సరం స్యాత్,
పుచ్ఛాఫలం సమధురం క్రిమికృత్కషాయం
పిత్తఘ్నమభ్రకజరం రసబన్ధకారి. ౨౩౪

వ్యా. తుమ్మకిపండు కొంచెము పులుపుతోగూడిన తీపురసముగలది. శీతవీర్యముగలది. దప్పి, మంట వీనిని పోగొట్టును. క్రిములను బుట్టించును. సరగుణము కలది. కారుమినుము పండు తీపు వగరు రుచులుకలిగి క్రిములను కలిగించును. పిత్తమును హరించును. అభ్రకమును బూరణముచేయును. మఱియు రసమును బంధించుట కుపయోగించును.

ఫలవర్గములో నుత్తమములు అధమములు

మూ. దాడిమామలకం ద్రాక్షా ఖర్జూరం సపరూషకమ్,
రాజాదనం మాతులుఙ్గం ఫలవర్గే ప్రశస్యతే. ౨౩౫
ఫలానామవరం తత్ర లకుచం సర్వదోషకృత్,

వ్యా. దానిమ్మపండ్లు, ఉసిరికపండ్లు, ద్రాక్షపండ్లు, ఖర్జూరపుపండ్లు, చిట్టీతపండ్లు, మొరళిపండ్లు, మాదీఫలములు, ఇవియన్నియు పైజెప్పినఫలములలో నుత్తమములు. కమ్మరేగుపండు పండ్లజాతిలో నధమము. ఇయ్యది దోషముల నన్నిటిని ప్రకోపింపజేయును.

వర్జనీయఫలములు

మూ. శిశిరాగ్న్యర్కాశనివ్యాళక్రిమికృష్టమదేశజమ్. ౨౩౬
అకాలసమ్భవం క్లిన్నం పురాణం చ త్యజేత్ఫలమ్,
ద్రాక్షావివర్జితం శుష్కం తథామం బిల్వవర్జితమ్. ౨౩౭

వ్యా. మంచుచేతను, సూర్యునివేడిచేతను, సర్పము మున్నగు క్రూరజంతువులచేతను, పురుగులచేతను, వీనిసంబంధముచే చెడినపండ్లును, యుక్తముకానిదేశమున పుట్టినపండ్లును

అకాలమున ఫలించినపండ్లును (ఏదినుసుపండ్లకేదికాలమో దానినివిడచి యితరకాలమున ఫలించినపండ్లనుట), కుళ్లినపండ్లును, ప్రాతబడినపండ్లును గ్రాహ్యములు కావు. (కావున అట్టి దుష్టఫలముల భుజింపందగదు) మరియు ద్రాక్షపండ్లుతప్ప తక్కినఫలములు ఎండినచో నవి గ్రాహ్యములుగావు. మారేడుదక్క తక్కినఫలము లెవ్వియైన పండకున్నచో నవియును గ్రాహ్యములుకావు. (ద్రాక్షపండ్లు ఎండినదియు, బిల్వఫలము పండకుండునదియు గ్రాహ్యములు. ఈరెండుదక్క తక్కినఫలములు ఎండినను, పండకుండినను గ్రాహ్యములు కావు అని భావము.)

ఇది ఫలవర్గము సమాప్తము.

## జలవర్గః :—

అవతారిక:—"అనుపానం కరోత్యూర్జాం తృప్తిం వ్యాప్తిం దృఢాఙ్గతామ్, అన్నసఙ్ఘాతశైథిల్యవిక్లిత్తిజరణాని చ" అను వాగ్భటవచనప్రకారము భుజించునపుడు జలమును అనుపానముగ జేసినచో మనస్సంతోషంబును తృప్తియు మున్నగుగుణములకలిగి భుజింపబడినయాహారము శిథిలమై తేలికగ జీర్ణమగునని తెలియుచున్నదిగాన భోజనమునకు ముఖ్యములైన ధాన్యశాకఫలవర్గముల జెప్పి, పిదప అట్టియాహారమునకు గుణోత్తేజనమును గలిగించుజలవర్గము ఈక్రింద చెప్పబడును.

### ఐంద్రోదకము, దానిగుణము

మూ. జలమేకవిధం సర్వం పతత్యైన్ద్రం నభస్తలాత్
తత్పత త్పతితంచైవ దేశకాలావపేక్షతే. ౨౮౮
ఖాత్పతత్సోమవాయ్వర్కైః స్పృష్టం కాలానువర్తిభిః,
శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైః యథాసన్నం మహాగుణైః. ౨౮౯

వ్యా. నానావిధములగు నవాంతరభేదములుగల జలమంతయు జాతిచే నొకటే యగును. అయ్యది యింద్రునిచే ప్రేరేపింపబడి యాకసమునుండి పుడమికి దిగునుగాన ఐంద్రమనబడును. మరియు నాజలము దివమునుండి పుడమింబడుచుండునదియు పడినదియు జాంగలాదిదేశములను, గ్రీష్మాదికాలములను అపేక్షించును. ఆకసమునుండి పడుచుండుజలము ఆయాకాలము ననువర్తించు చంద్రునిచేతను గాలిచేతను సూర్యునిచేతను స్పృశింపబడి, శీతము ఉష్ణము స్నిగ్ధము రూక్షము మున్నగుగుణముల కలిగియుండును. భూమిపైబడినజలము ఆభూమి కెట్టిగుణములు (శీతోష్ణస్నిగ్ధరూక్షాదిగుణములు) కలిగియుండునో, ఆభూమిపైబడిన జలమునకు నట్టిగుణములే కలిగియుండును.

(ఆకసమునుండి క్రిందికిదిగుచుండుజలము అవ్యక్తరసంబును నిర్గుణంబునై యున్నను శీతాదికాలముల ననుసరించియుండు చంద్రసూర్యవాతసంబంధమునంజేసి ఆట్టిగుణముల గలిగియుండును. భూమిపయింబడినవి భూమికి శీతాదిగుణములు కల్గువిధముగ దానిపయిం బడిన జలముగూడ ఆట్టిభూమి సంబంధమునంజేసి శీతోష్ణాదిగుణవిశేషములు కలిగియుండు నని భావము.)

ఉదకభేదములు

మూ. తద్భౌమం ధారతౌషారే కారకం హైమమిత్యపి,
భౌమం తద్భూగతం తత్ర ధారం గఙ్గాసముద్రజమ్. ౨౯౦

వ్యా. పైజెప్పిన సామాన్యజలము భౌమము, ధారము తౌషారము, కారకము, హైమము నని భేదములుగలిగియు, అందు భూమియందుండునది భౌమజలము. గంగానది వలనను సముద్రమువలనను ధారగా మబ్బునుండి వెడలినది ధారజలము (అత్తిచెట్టు మున్నగు వానినుండి బిందువులుగ స్రవించునది తేషారము. ఉదయకాలమునందలి మంచుసెల్లను తేషారము వడగండ్లజలము కారకము. మంచుగడ్డనీళ్లు హైమము.) ("యాభిరాదిత్యస్తపతి, తాభిః పర్జన్యో వర్షతి" అనుశ్రుతిప్రమాణముచే వేసవికాలమున రవి పుడమి యందలిజలము నాకర్షించి యాజలమునే మేఘములమూలముగ వర్షించునని తెలిసెడి. అయ్యది ధారవలన కల్గునదికావున ధార మనబడును. అందు గంగోదకమును పీల్చి దానినే ధారారూపముగ వర్షించిన గాంగ మనబడును. సముద్రోదకమును పీల్చి ధారగ వర్షించి నచో సాముద్ర మనబడునని భావము.)

గంగోదకము, దానిగుణము

మూ. గఙ్గామ్బుజీవనం హృద్యం హ్లాదిబుద్ధిప్రబోధనమ్,
తన్వవ్యక్తరసం మృష్టం శీతం లఘ్వమృతోపమమ్. ౨౯౧
సూర్యోద్ధృతప్రయుక్తత్వాత్ లఘువాతకఫాపహమ్,
శైత్యజీవనసౌమ్యత్వైః పిత్తరక్తవిషార్తిజిత్. ౨౯౨
యేనాభివృష్టమతులం శాల్యన్నం రాజతస్థితమ్,
అక్లిన్నమవివర్ణం చ తత్తోయం గాఙ్గం........,

వ్యా. అట్టి గంగోదకము శరీరబలమును కలిగించును. హృదయమునకు చాల హిత కరము. ఆహ్లాదమును కలిగించును. బుద్ధికి వికాసమును కలిగించును. తేలికగా నుండును. స్ఫుటముగాని రసము కలిగియుండును. పరిశుద్ధమైనది. స్పర్శముచేతను వీర్యముచేతను శీతమైనది. చులకనగ జీర్ణమగును. అమృతమునుబోలె త్రిదోషముల సమస్థితినుంచి విష

బాధను హరించును. మరియు నయ్యది సూర్యునిచే నాకర్షింపబడి వర్షింపబడినది యగుటం జేసి మిక్కిలి తేలికయై విశేషముగ వాతకఫముల హరించును. శీతగుణముగలిగి బలకరమై సౌమ్యగుణం బగుటంజేసి పిత్తరక్తమును విషముచే గలిగినబాధను నివర్తింపజేయును.

వరియన్నమును వెండిపాత్రములో నునిచి యేవర్షధారోదకమును అందుబోసిన చో నాయన్నము నిర్మలమై వర్ణముచెడక అన్నము చెడకుండునో అట్టిజలము గాంగోదకమని యెరుంగునది.

సాముద్రోదకము, దానిగుణము

మూ. ..............................అన్యథా. ౨౯౩

సాముద్రం: తన్న పాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా,

వ్యా. పైజెప్పినలక్షణములకన్న విరుద్ధలక్షణములు కలిగినది సాముద్రోదకము. (ఏయుదకమును బోసినచో వెండిపాత్రమున నుండు వరియన్నము వివర్ణమై చెడిపోవునో అయ్యది సాముద్రజలమనుట). అట్టి సాముద్రజలమును ఆశ్వయుజమాసమునందుతప్ప యితరమాసములయందు పానముచేయంజనదు. (ఆశ్వయుజమాసమునందుమాత్రము పైజెప్పినసాముద్రోదకము పథ్యకర మనుట.)

మూ. యేన కేనాపి(యేనహి) వాతేన వారి ముఞ్చతి వాసవః. ౨౯౪

తేన తేన హి దోషస్పృక్స్పృశ్యతే తద్గుణేన చ,

వ్యా. సామాన్యముగ గాలిసంబంధముచే మేఘము వర్షించును. అట్టియెడ మేఘము ఎట్టిగాలిసంబంధముచే వర్షించునో అట్టిదోషమును గుణంబును ఆవాననీళ్లకు కలిగియుండును. (గాలి దుష్టములైన విషాదులసంబంధము కలిగియుండినచో గాలి యోగవాహి (ఎట్టివస్తువుతో సంబంధముకల్గునో ఆవస్తువుయొక్క గుణాదులు కలిగియుండును) కావున అట్టివిషాదులయందలి చెడ్డగుణములు కలిగియుండును: అట్టిగాలియొక్క స్పర్శములకలిగిన వాననీళ్లు ఆగాలియొక్క దోషంబులును దుష్టగుణంబులును కలిగియుండును. ఇత్తెరంగుననే మంచిగుణంబులును గాలియొక్కగుణభేదములబట్టి వాన నీళ్లయందును సంక్రమించును).

జలమునకు ఋతువిశేషములగల్గు రసవిశేషములు

మూ మధురంతిక్తమధురం కషాయమధురం తను. ౨౯౫

త్రిదోషఘ్నం త్రిదోషఘ్నం హేమన్తాదిషుతత్క్రమాత్,

వ్యా. హేమంతఋతువునందలి జలము మధురముగ నుండును. శిశిరఋతువునందు చేదుగను మధురముగను ఉండును. వసంతఋతువునందు వగరును తీపియు కలిగియుం

డును. గ్రీష్మఋతువున తేలికగ నుండును. వర్షఋతువునందలి జలము త్రిదోషముల ప్రకోపింపజేయును. శరదృతువునందలి జలము త్రిదోషముల హరించును. ఇత్తెరంగున ఋతుభేదముచే వర్షోదకగుణము మారుచుండును.

వర్షజలమునకు ఋతుభేదముచే గల్గుగుణవిశేషములను చరకాచార్యు లిట్లుపదేశించిరి:—"ఋతావృతా విహ ఖ్యాతాః సర్వఏవామ్బసోగుణాః, ఈషత్కషాయమధురం సుసూక్ష్మం విశదం లఘు, అరూక్షమనభిష్యన్దిసర్వం పానీయముత్తమమ్, గుర్వభిష్యన్ది పానీయం వార్షికం మధురం నవమ్, తనులఘ్వనభిష్యన్ది ప్రాయశ్శరది వర్షతి, తత్తు యే సుకుమారాస్స్యుః స్నిగ్ధభూయిష్ఠభోజనాః, తేషాం భోజ్యే చ భక్ష్యే చ లేహ్యే పేయే చ శస్యతే, హేమన్తే సలిలం స్నిగ్ధం వృష్యం బలహితం గురు, కిఞ్చిత్తతో లఘుతరం శిశిరే కఫవాతజిత్, కషాయమధురం రూక్షం విద్యాద్వాసన్తికం జలమ్, గ్రైష్మకం త్వనభిష్యన్ది రూపమిత్యేవ నిశ్చయః" వర్షోదకము ప్రతిఋతువునందును గుణములు మారుచుండును. వర్షజలము సామాన్యముగ కొంచెముగ వగరుతోఁగూడిన తీపికలిగి సూక్ష్మవిశదలఘుగుణములు కలిగి, రూక్షముగాక స్రోతస్సులద్రవమును కలిగించకయుండినచో నయ్యది సర్వోత్తమము. వర్షర్తువునందు భారముకలిగి స్రోతస్సుల ద్రవింపజేయునదియు, మధురంబును, క్రొత్తదియు నైనజలమును వర్షించును. శరదృతువునందు మిక్కిలి తేలికయై సూక్ష్మమైనజలమును ప్రాయికముగ వర్షించును. ఈజలము స్రోతస్సులద్రవమును కలిగించదు. ఈజలము మిక్కిలి సుకుమారులకును, స్నిగ్ధపదార్థముల విశేషముగ భుజించువారికిని, భక్ష్యభోజ్యపేయ లేహ్యపానీయాదులయందు విశేషముగ నుపయోగింపందగియుండును. హేమంతఋతువునందు స్నిగ్ధంబును, శుక్రవృద్ధికరంబును, బలకరంబును, భారముగలిగినదియు నగుజలమును వర్షించును. అంతకన్న కొంచెము తేలికయైనజలమును శిశిరఋతువున వర్షించును. అయ్యది కఫవాతముల జయించును. కషాయమధురరసములును, రూక్షగుణంబును కలిగినజలమును వసంతఋతువున వర్షించును. గ్రీష్మఋతువున జలము స్రోతస్సుల ద్రవింపజేయకుండును. ఇత్తెరంగున ఋతుభేదముచే గుణములు వర్షోదకమునకు మారుచుండు నని భావము.

## గాంగోదకోత్పత్తికాలము

మూ. గాఙ్గమాశ్వయుజే మాసి ప్రాయో వర్షతి దేవరాట్. ౨౯౮
స్వాత్యాం పయోదనిర్ముక్తం లఘుపథ్యతరం మతమ్,

వ్యా. ఇంద్రుడు ప్రాయికముగ నాశ్వయుజమాసమునందు గాంగోదకమును వర్షించును. సూర్యుడు స్వాతీగతుడై యుండునపుడు మేఘములనుండి విడువబడినజలము మిక్కిలి తేలికయై పథ్యతరముగ నుండును.

## పానార్హమైనజలము

మూ. హిమధాతుశిలాపృష్ఠవస్త్రాదిభ్యశ్చ్యుతం జలమ్. ౨౯౭
హేమమృణ్మయపాత్రస్థం రక్తైర్భిన్నమణిప్రభమ్,
ససుగన్ధగుణోపేతం స్పృష్టమర్కేన్దుమారుతైః. ౨౯౮
విధినా వక్ష్యమాణేన వాసితం తత్సదా భజేత్,
తదభావే తు భూమిష్ఠమాన్తరిక్షానుకారియత్. ౨౯౯

వ్యా. మంచునుండియు, పర్వతములయందలి ధాతువులనుండియు, రాళ్లపైనుండియు, వస్త్రములనుండియు జారినయుదకమును బంగరుపాత్రమునందైనను, మట్టికుండయందైన నుంచి పగిలినమణినిబోలె స్వచ్ఛముగ నుండుజలమును పచ్చకప్పురము పట్టివేరు మున్నగుసుగంధద్రవ్యములచే పరిమళింపజేసి, సూర్యునిచేతను చంద్రునిచేతను గాలిచేతను స్పర్శము కల్గునట్లుంచి, క్రింద "శుచిపృథ్వసితే—సర్వరోగజిత్" (303-306) అను గ్రంథముచే జెప్పంబడువిధిప్రకారము పదిలముగ నుంచబడినజలమును ఎల్లప్పుడు నుపయోగింపదగును. పైజెప్పినగాఙ్గోదకము దొరకనినాడు అంతరిక్షోదకముతో సమానమైనజలము నుపయోగింపనగును.

## జలమునకు భూమిభేదమున గల్గురసభేదము

మూ. శ్వేతే కషాయం తత్ స్వాదుకృష్ణే తిక్తఞ్చ పాణ్డురే,
నీలేకషాయమధురం దేశే లవణమూషరే. ౩౦౦
సక్షారం కపిలే మిశ్రం మిశ్రే చామ్బుగుణాధికే,
మధురం లవణామ్లం తు భవేద్భూమిగుణాధికే. ౩౦౧
తేజోఽధికే తు కటుకం కషాయం పవనాధితే,
దివ్యానుకారీత్వవ్యక్తరసత్వాత్ ఖగుణాధికే. ౩౦౨

వ్యా. తెల్లనిభూమియందుండుజలము వగరుగలిగియుండును. నల్లనిప్రదేశమునందలి జలము తీపికలిగియుండును. పాండువర్ణముకలప్రదేశమునందలిజలము చేదుగనుండును. నీలవర్ణముగనుండుస్థలమునందలి యుదకము వగరును తీపియు కలిగియుండును. చౌటిమట్టి ప్రదేశముననుండుజలము ఉప్పగనుండును. కపిలవర్ణమైనస్థలమునందలియుదకము కొంచెము క్షారము (కారము) కలిగియుండును. పైజెప్పినవర్ణములతో రెండేసిమూడేసిరంగులు మిశ్రముగ నుండుస్థలమునందలిజలము ఆయావర్ణములకు ప్రత్యేకముగ జెప్పిన రెండేసిమూడేసి రసములు మిశ్రముగ గలిగియుండును.

మరియు (పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అను నీపంచభూతములగుణములన్నియు భూమికి కలవు, కాని వానిలో నొక్కొకచోట నొక్కొకభూతము

యొక్కగుణ మధికముగ నుండును. అందు) జలగుణ మధికముగగలభూమియందలి జలము మధురముగ నుండును. భూమిగుణాధికమైన భూమియందలియుదకము ఉప్పును పులుపును కలిగియుండును. తేజోగుణ మధికముగ నుండుభూమియందలిజలము కటురసము కలిగి యుండును. వాయుగుణ మధికముగనుండుజలము కషాయరసము కలిగియుండును. ఆకాశము అవ్యక్తగుణము కావున అట్టి యాకాశాంశ మధికముగ నుండుజలము దివ్యోదకమునుబోలె నవ్యక్తరసమై యుండును.

## జలమునుంచవలసినపద్ధతి

మూ. శుచిపృథ్వసితే శ్వేతదేశేఽర్కపవనాహతమ్,
ఆకాశశ్యాఽమ్బునో వాపి గుణభూయిష్ఠయా మృదా. 303
నిర్మితై రంగుళఘనైః ద్విచత్వారింశదున్నతైః
మధ్యేసమం సమాలక్ష్య త్రిచత్వారింశదఙ్గులైః. 304
వకుళస్య ఫలాకారైః స్నిగ్ధనీరన్ధ్రనిర్మితైః,
బిలే సైకతగర్భే వా మూలే కుమ్భైర్నివేశితైః. 305
ఆన్తరిక్షసమం పీతం వాతపిత్తకఫాపహమ్,
స్నిగ్ధం శీతం లఘు స్వచ్ఛం చక్షుష్యం ముఖరోగజిత్. 306

వ్యా. ఆకాశగుణమైనను ఉదకగుణమైనను అధికముగగల భూమియందలి మట్టిని దెచ్చి యామట్టిచే నొక అంగుళపరిమితమైనఘనంబును, నలువదిరెండంగుళములపరిమితికల యెత్తును, మధ్యభాగమున వంకరటింకరగాక సమమై నలువదిమూడంగుళముల విస్తీర్ణంబును కలిగి, పొగడకాయనుబోలి గుండ్రనైన యాకారముకలిగి, నున్ననై మెరపుగలిగి, అణుమాత్రమైనను సందులేక నిర్మలముగ నుండునట్లు కుండలను చేయవలెను. పరిశుద్ధమై విశాలముగ నలుపుతెలుపురంగులుకలిగిన ప్రదేశమున సూర్యరశ్మియు గాలియు అడ్డము లేక సోకుచుండుశుభ్రమైనజలమును పైజెప్పినరీతిగ సిద్ధముచేయబడిన కుండలచే గ్రహించునది. పిదప గుంతలత్రవ్వి యందు మంచి యిసుకనుబోసి పైజెప్పిననీళ్లకుండలను పదిలముగ నుంచునది. ఇత్తెరంగున నుంచబడినజలము అంతరిక్ష (భూమిపైబడకమునుపు వర్ష ధారలనుండి గ్రహింపబడిన) జలమునకు సమానగుణములు కలిగియుండును. ఆజలమును పానము జేసినచో వాతపిత్తకఫముల హరించును. అయ్యది స్నిగ్ధంబును శీతంబును తేలికయైనదియు స్వచ్ఛంబునై యుండును. నేత్రములకు మిక్కిలి హితకరము. నోటియందు కల్గురోగముల నన్నిటిని జయించును.

## హంసోదకము

మూ. తప్తం తప్తాం(ముష్ణాం)శుకిరణైః శీతం శీతాంశురశ్మిభిః,

సమన్తాదప్యహోరాత్రం అగస్త్యోదయనిర్విషమ్. ౩౦౭

శుచిహంసోదకం నామ నిర్మలం మలజిజ్జలమ్,

నాభిష్యన్ది నవారూక్షం పానాదిష్వమృతోపమమ్. ౩౦౮

వ్యా. పగటియందు సూర్యకిరణముల స్పర్శముచే కాగి వెచ్చనై రాత్రులయందు చంద్రకిరణములచే చల్లబడి అగస్త్యోదయముచే కీటలూతాదివిశేషముచే విడువంబడి రేయింబవలును పరిశుద్ధమై నిర్మలముగ నుండుజలము హంసోదక మనబడును. ఈహంసోదకము త్రిదోషముల హరించును. పడిసెము మున్నగుబాధల గలిగించక రూక్షముగ నుండును. స్నానపానాదుల కన్నిటికిని అమృతమునుబోలె మిక్కిలి ప్రశస్తముగనుండును.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—ఆకసమునుండి వర్షరూపమునవచ్చుజలము రెండుతెరంగులు. అందొకటి గాంగము. ఆకాశగంగలో నుండుజలమును మేఘములు గ్రహించి యాజలమును వర్షించిన నయ్యది గాంగము. దీనిలక్షణము "యేనాభివృష్టమమలం...తత్తోయం గాఙ్గం" అనుశ్లోకమున జెప్పబడినది. దీనికి వ్యతిరిక్తలక్షణములు కలిగినది సాముద్రము. దీనిలక్షణము "అన్యథా సాముద్రం తన్నపాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా" అని చెప్పబడినది.

వర్షముకురియు మేఘములతోగూడ దుష్టములగుపురుగులు విషజంతువులు మున్నగు జంతువులు మెలగుచుండును గాన వానివలన గలిగినవర్షోదకమునందు విషాదిసంబంధము తప్పక కల్గును. అగస్త్యు లుదయించినవెనుక అట్టివిషము హరించి జలము నిర్మలమగును. కావున ఆశ్వయుజమాసమునందు వర్షోదకమును గ్రహించి పైజెప్పినరీతిగ పదిలముగ నునిచి పానాదుల కుపయోగింపదగును. ఈయభిప్రాయముచేతనే "నపాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా" అని చెప్పబడినది.

మరియు "ప్రవృత్తాయాం శరద్యస్మాత్ పశ్చాద్వ్యాతే ప్రవాత్యపి, హేమన్తేవాపి గృహ్ణీయాత్ తజ్జలం మృణ్మయైర్ఘటైః" అని తంత్రాంతరమున నున్నది. శరదృతువు గడచినను పడమటిగాలి వీచుచుండు హేమంతఋతువునందును పైజెప్పినజలమును మట్టికుండలచే గ్రహింపదగునని యర్థము. ఈవాక్యమునుబట్టి యాశ్వయుజమాసమునకు మున్ను వర్షోదకము గ్రహింపదగదుగాని కార్తీకమార్గశిరమాసములయందు నిషేధములేదని తెలిసెడి. ఈవిషయము జతూకర్ణతంత్రమున నిట్లు కంఠోక్తిగ జెప్పబడినది:—"వర్షాసు చరన్తి ఘనైస్సహోరగాః విషకీటలూతాశ్చ, యద్విషజుష్టమపేయం ఖజలమగస్త్యోదయాత్పూర్వమ్" వర్షఋతువునందు మేఘములతోగూడ సర్పంబులును కీటలూతాది విషజంతువులును ఆకసమున సంచరించును. కావున నాకాలమున వర్షజలము విషముచే

దుష్టముగ నుండును. కావున నగస్త్యోదయమునకు (ఆశ్వయుజమాసమునకు) పూర్వము ఆజల మును గ్రహింపంజన దని భావము. కొండరాచార్యులు "ఆశ్వినఏవ పరమాన్తరిక్షం గ్రాహ్యమ్" అని నుడివిరి. ఆశ్వయుజమాసమునదక్క తక్కినమాసములయందు అంతరిక్ష జలమును గ్రహింపదగదని వీరిసిద్ధాన్తము.

## భౌమజలగ్రహణకాలము

మూ. సర్వేషామేవ భౌమానాం ప్రత్యూషే గ్రహణం (హిమమ్.)
తదా హి శీతమధికం సచాపాం ప్రవరోగుణః. 30౯

వ్యా. భౌమజలము తటాకాదిభేదములచే ననేకవిధముల నుండును. అట్టిభేద ములు కలభౌమజలమును ప్రాతఃకాలమున గ్రహింపనగును. ఆకాలమున జలము మిక్కిలి చల్లదనము కలిగియుండును. ఉదకమునకు చెప్పబడినగుణములలో చల్లదనము ప్రధానము కావున ప్రభాతకాలమున మిక్కిలి శీతలముగ నుండుటంజేసి యక్కాలమున భూమిగత జలమును గ్రహించుట మిగుల ప్రశస్తము.

## భౌమజలభేదములు

మూ. తాటాకకౌపసారసచౌణ్డప్రాస్రవణవాప్యకైదారమ్. 3౧౦
ఔద్భిదపల్వలజాతం నాదేయం మృదుశిలోద్భవం భౌమమ్,

వ్యా. తాటాకము, కౌపము, సారసము, చౌండము, ప్రాస్రవణము, వాప్యము, కైదారము, ఔద్భిదము, పాల్వలము, నాదేయము, మృదుశిలోద్భవము (ఔపలము)నని భౌమజలము (భూమియందుండుజలము) పదునొకండుభేదములు కలిగియుండును.

## తాటాకజలలక్షణము

మూ. కుల్యోపనీతం పరితః పరీతం తాటాకముక్తం తటబన్ధనేన.

వ్యా. వర్షము కురిసినప్పుడు భూమిపైబడి వ్యాపించియుండుజలము కాలువల మూలముగ నొకచోట (గొప్పపల్లమున)జేసి దానికి గట్టు బటువుగ నుండుటంజేసి యచ్చోట నిలిచినజలము తాటాకము (తటాకమున నుండునది) అని చెప్పబడును.

తాటాకజలలక్షణములు సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"ప్రశస్తభూమి భాగస్థం నైకసంవత్సరోషితమ్, కషాయ మధురాస్వాదం తాటాకం సలిలం స్మృతమ్" ప్రశస్తమైన భూమిభాగమునజేరి యచ్చటనే యనేకసంవత్సరములు నిల్కడగనుండి వగరును తీపియు కలిగినజలము తాటాక మని భావము.

## కౌప, సారసజలలక్షణములు

మూ. కౌపం గభీరేచస్రుతం గిరేర్వాస్రుతం స్థిరం సారసమేకతోమ్బు.

వ్యా. మిక్కిలి లోతుగలబావియందు నిల్కడగనుండుజలము కౌపము. జలము పర్వతమునుండి స్రవించి సరస్సులయందు స్థిరముగ నుండుజలము సారసము.

ఈలక్షణములు సుశ్రుతమున నిట్లు చెప్పబడినవి:—"భూమ్యుత్ఖాతసముద్భూతం ఇన్ద్రనీలసమప్రభమ్, విమలం మధురాస్వాదం కౌపం జలముదాహృతమ్, నద్యాశ్శైల వరాద్వాపి స్రుతమేకాన్తసంస్థితమ్ కుముదామ్భోజసంఛన్నం వారి సారసముచ్యతే" భూమిలో త్రవ్వబడిన బావియందుపుట్టి ఇంద్రనీలమణిబోలె నీలవర్ణమై నిర్మలమై మధురముగ నుండుజలము కౌపమని చెప్పబడును. నదినుండియైనను, ఉన్నతమగుపర్వతమునుండి యైనను ప్రవహించి యొక్కచోట (గుంటలో) నిలిచి అల్లి తామర మొదలగువానిచే గప్పబడి స్థిరముగ నిలిచియుండుజలము సారసము (సరస్సున నుండునది) అని యర్థము.

చౌండ, ప్రాస్రవణజలలక్షములు

మూ. శ్వభ్రేఽశ్మనాం చౌణ్డమయత్నజాతాం
సానూద్భవం ప్రాస్రవణం గిరీణామ్,

వ్యా. రాళ్లబొరియలయందు ప్రయత్నములేక తనంతనే పుట్టినజలము చౌండము; పర్వతముయొక్క చరియయందు పుట్టినజలము ప్రాస్రవణము.

వీనిలక్షణములు సుశ్రుతమున నిట్లున్నది:—"స్వయం శీర్ణం శిలాశ్వభ్రే) నీలోత్పలనిభం జలమ్, లతావితానసంఛన్నం బుద్ధైశ్చౌణ్డేయ ముచ్యతే, శైలసానుసముద్భూతం సంశ్లిష్టం వాతహిమాతపైః, లఘుశీతామలం స్వాదుస్స్రుతం ప్రాస్రవణం జలమ్" రాళ్లయొక్కపల్లముల (పడియల)యందు తనంతనే జారిపడి నిలిచి నల్లకలువలతో సమానమైన వర్ణముకలిగి తీగెలగుమిచే గప్పబడియుండుజలము చౌండము, కొండలయొక్క చరులయందు పుట్టి గాలిచేతను మంచుచేతను ఎండచేతను స్పృశింపబడి తేలికయై చల్లనై నిర్మలముగను మధురముగను ఉండుజలము ప్రాస్రవణము.

వాప్య, కైదారజలలక్షములు

మూ. దీర్ఘేఽశ్మనా ఫేనయుతేన వాప్యం
క్షేత్రామ్బుకైదారమితి ప్రదిష్టమ్. ౩౧౨

వ్యా. రాళ్లచేతను సున్నముచేతను పడికట్లుకట్టి బావివలె నిర్మింపబడినచోట నిల్కడగ నిలిచియుండుజలము వాప్యము. (నడబావియందలిజలము). పైరుపెట్టి మడిలో నుండుజలము కైదారము.

వాప్యజలలక్షణము సుశ్రుతమున నిట్లున్నది:—"పాషాణై రిష్టకాభిర్వా బద్ధాస్యా ధ్యాటకూపవత్, వాపీసా ఖలువిజ్ఞేయా కృతసోపానపఙ్క్తికా" పలుగురాళ్లచేనైనను

ఇటికరాళ్లచేనైనను బావివలె కట్టి మెట్లు లోనికి దిగుటకు వసతిమార్గముగ కట్టినది వాపి యనబడును. దానియందు నిలుకడగ నిలిచియుండుజలము వాప్య మని భావము. (కైదార జలలక్షణము సుశ్రుతమున గానరాదు).

## ఔద్భిద, పాల్వలజలలక్షణములు

మూ. యద్వాలుకాస్వమ్బుక రోద్ధృతాసు తదౌద్భిదం
పాల్వలమల్ప గర్తే,

వ్యా. భూమియందలియిసుకను త్రవ్వి యెత్తి తోడినపుడు భూమిని పగులదీసికొని స్వయముగ భూమినుండిపుట్టిన యూటజలము ఔద్భిదము. (ఇదియే కీనీరు అనబడును). భూమిపైనుండు చిన్నచిన్నపడియలలో నుండుజలము పాల్వలము. (పల్లములలో నుండు జలము).

ఔద్భిదజలలక్షణము సుశ్రుతమున నిట్లున్నది:—"విదార్యభూమిముద్భూతం మహాత్యాధారయాస్రవత్, యజ్జలం వేదితవ్యం తత్ ఔద్భిదం స్వాదు శీతలమ్." తనంతనే భూమిని బ్రద్దలుచేసికొని గొప్పధారగా పైకివెడలునది ఔద్భిదము. (భూమిని భేదించి పుట్టిన జలము). ఇయ్యది మిక్కిలి మధురమై కడుంగడు చల్లగ నుండును. (పాల్వలజలలక్షణము సుశ్రుతమున గానరాదు).

## నాదేయ, ఔపలజలలక్షణములు

మూ. నాదేయమద్రిప్రభవప్రవాహే వర్షోపలాదౌ ఫలమైన్దుకాన్తమ్.

వ్యా. పర్వతములనుండి ప్రవహించునదుల ప్రవాహజలము నాదేయము (నదీసంబంధజలము) అనబడును. వర్షధారలలోనుండి పడురాళ్లు వడగండ్లు, దానివలన బుట్టినజలము ఔపలము. చంద్రకాన్తము మున్నగుమణులనుండి పుట్టినజలముకూడ ఔపల మనబడును.

నాదేయజలము సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"నద్యాం శైలప్రసూతాయాం గోమేదకమణిప్రభమ్, ప్రశస్తభూమిభాగస్థం జలం నాదేయముచ్యతే." పర్వతములయందు పుట్టిననదులజలము ప్రశస్తమైనభూమిభాగమున నున్నది నాదేయజలము. ఇయ్యది గోమేదకమణిబోలినకాంతి కలిగియుండును. (సుశ్రుతమున ఔపలజలమును చెప్పియుండలేదు).

ఇత్తెఱంగున నుపక్రమానుసారముగ పదునొకండు భౌమజలభేదముల లక్షణములు వేరువేరుగ జెప్పబడినవి. సుశ్రుతమున కైదార, పాల్వల, ఔపలములు అనుభేదములు మూటిని విడిచి తక్కిన కౌపాదిభేదము లెనిమిదిటికిని ప్రత్యేకలక్షణములు చెప్పబడినవి.

అష్టాంగసంగ్రహమున వాగ్భటాచార్యులును:—"కౌపం సారసతాటాకచౌండ్యప్రాస్రవణౌద్భిదమ్, వాపీనదీతోయమితి తత్పునస్స్మృతమష్టధా" అనువాక్యముచే నెనిమిది భేదములను జెప్పి వానిగుణాదులను ప్రత్యేకముగ నుడివెను. ఇవి సుశ్రుతసమ్మతము.

### తాటాకజలగుణములు

మూ. తాటాకం వాతలం స్వాదు కషాయం కటుపాకి చ,

వ్యా. తాటాక (తటాకమునందలి) జలము వాతమును వృద్ధినొందించును. వగరును తీపియు కలిగి పాకమున కటువుగ నుండును.

### కౌపజలగుణము

మూ. సక్షారం పిత్తలం కౌపం దీపనం నాతివాతలమ్. 314

వ్యా. కౌపజలము (బావినీళ్లు) కొంచెము క్షారముగను పిత్తకరముగను ఉండును. అగ్నిని దీపింపజేయును. కొంచెముగ వాతమును కలిగించును.

దీనిగుణము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది. "కౌపం స్వాదుత్రిదోషఘ్నం లఘు పథ్యంచ సర్వదా." ఈవాక్యముచేత కౌపజలము మధురముగ నుండు ననియు త్రిదోషహార మనియు ఎప్పటికిని పథ్యకర మనియు తెలిసెడిని.

### సారసజలగుణము

మూ. తృష్ణాఘ్నం సారసం బల్యం కషాయమధురం లఘు,

వ్యా. సారస (సరోవరమునందలి) జలము దప్పి నణచును. శరీరబలమును కలిగించును. వగరును తీపియు కలిగి తేలికగ నుండును.

### చౌండజలగుణము

మూ. చౌణ్డమగ్నికరం రూక్షం మధురం కఫపిత్తకృత్. 315

వ్యా. చౌండ (రాళ్లపడియలనుండు) జలము జఠరాగ్నిని వృద్ధినందించును. రూక్షముగ నుండును. తీపి కలిగియుండును. కఫపిత్తముల వృద్ధినందించును.

### ప్రాస్రవణోదకగుణము

మూ. కఫఘ్నం దీపనం హృద్యం లఘు ప్రస్రవణోద్భవమ్,

వ్యా. ప్రాస్రవణోదకము కఫమును హరించును. అగ్నిని దీపింపజేయును. హృదయమున కనుకూలము. తేలికగా నుండును.

### వాప్యజలగుణము

మూ. వాతశ్లేష్మహరం వాప్యం సకటు స్వాదు పిత్తళమ్. 316

వ్యా. వాప్య (నడబావియందలి) జలము వాతకఫముల హరించును. కొంచెము కారంబును తీపియుకలిగి పిత్తమును వృద్ధినొందించును.

వాప్యజలగుణము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడెను. "సక్షారం కటువాప్యంబు పిత్తఘ్నకఫవాతజిత్, లఘ్వల్పదోషం సుస్వాదు నవవాపీష్వవార్షికమ్." కొంచెము

ఉప్పగను కారముగనుండు నడబావినీళ్లు త్రిదోషముల హరించును. క్రొత్తగ త్రవ్వబడిన నడబావియందు వర్షసంబంధములేక పుట్టిననీళ్లు మిక్కిలి మధురముగ నుండును. తేలికగ నుండి స్వల్పముగ త్రిదోషముల కల్గించును. (ఈవాక్యముచేత రసభేదముచేతను, పురాణ నవీనభేదముచేతను, వాప్యజలమునకు గుణవిశేషములు చెప్పబడినవి.)

కైదారోదకగుణము

మూ. కైదారం మధురం ప్రోక్తం విపాకే మధుదోషకృత్,

వ్యా. కైదార (మడికయ్యలలోని) జలము రసవిపాకములయందు మధురముగ నుండును. త్రిదోషముల కలిగించును.

ఔద్భిదజలగుణము

మూ. మధురంపిత్తశమన మవిదాహ్యౌద్భిదం స్మృతమ్. ३౧౭

వ్యా. ఔద్భిద (భూమిని భేదించి కలిగిననీరూట) జలము మధురముగ నుండును. పిత్తమును శమింపజేయును. విదాహకరము కాదు. దీనిగుణ మష్టాంగసంగ్రహమున నిట్లు న్నది. "ఔద్భిదం స్వాదు పిత్తఘ్నం దీపనం గురుకిఞ్చన." ఈవాక్యముచేత ఔద్భిదము దీపనకరం బనియు కొంచెముగ గురుత్వము కలిగియుండు ననియు విశేషగుణము చెప్పబడియె.

పాల్వలోదకగుణము

మూ. తద్వత్పాల్వలముద్దిష్టం విశేషాద్దోషలం తు తత్,

వ్యా. పాల్వల (మడియలలోని) జలము ఔద్భిదమునుబోలె మధురంబును అవిదాహియునై యుండునుగాని విశేషముగ దోషముల వృద్ధినొందించును.

నాదేయ, ఔపలజలగుణములు

మూ. నాదేయం వాతలం రూక్షం దీపనం కటుతైజసమ్. ३౧౮

వ్యా. నాదేయ (నదీసంబంధమైన) జలము వాతమును వృద్ధినొందించును. రూక్ష గుణము కలిగియుండును. ఔపల (వడగండ్ల)జలము అగ్నిని దీపింపజేయును. కటురస మును కలిగియుండును.

నదీజలగుణము సంగ్రహముగ నిట్లు చెప్పబడినది:—"అనభిష్యన్దినాదేయం కటుకం కఫపిత్తజిత్, విశదం వాతలం రూక్షం అనవస్థితలాఘవమ్." నదీజలము కటురసము కలిగి యుండును. కఫపిత్తములను హరించును. విశదగుణము రూక్షగుణము కల్గి కొంచెము వాత మును కలిగించును. ఒకకాలమున లఘుత్వంబును ఒకకాలమున గురుత్వంబును (నియతము లేక) కలిగియుండును. స్రోతస్సుల స్రవింపనేరదు. ఇత్తెఱంగున తాటాకాదిలక్షణానుసార ముగ వానిగుణములు వేరువేర జెప్పబడినవి.

### కొన్ని నదీవిశేషముల జలగుణములు

మూ. పశ్చిమోదధిగాశ్శీఘ్రవహా యాశ్చామలోదకాః,
పథ్యాస్సమాసాత్తానద్యః విపరీతాస్త్వతోఽన్యథా. 318

వ్యా. పడమటిసముద్రమున జేరునవియు, మిక్కిలి శీఘ్రముగ ప్రవహించునవియు, నిర్మలమైనజలము కలిగినవియు నగునదులయందలి నీళ్లు మిక్కిలి పథ్యకరములు. ఇది సామాన్యముగ జెప్పబడినది. పైజెప్పినలక్షణములకన్న విపరీతములగు లక్షణములు కల నదులు సామాన్యముగ నపథ్యకరములు.

### హిమవంతమునను మలయమునను పుట్టిన నదులజలగుణము

మూ. ఉపలాస్ఫాలవిక్షేపవిచ్ఛేదైః ఖేదితోదకాః,
హిమవన్మలయోద్భూతాః పథ్యాస్తాఏవ చ స్థిరాః. 319
క్రిమిశ్లీపదహృత్కణ్ఠశిరోరోగాన్ ప్రకుర్వతే,

వ్యా. హిమవత్పర్వతమునందును, మలయపర్వమునందును పుట్టిన నదులు రాళ్లపై బడి యభిఘాతమునొంది నీటిదోషమంతయు పోయి తేటగ నుండును కావున ఆనదుల జలము పథ్యకరము. మరియు నాపర్వతములయందు పుట్టి ప్రవహింపక స్థిరముగనుండు జలము కలనదులు క్రిమిరోగమును, శ్లీపదము (బోదకాలు = ఏనుగకాలు)ను, రొమ్ము నొప్పిని, కంఠరోగములను, శిరోరోగములను కలిగించును.

### కొన్ని దేశములయందలి నదీజలగుణవిశేషములు

మూ. ప్రాచ్యావన్త్యపరాన్తోత్థాః దుర్నామాని మహేన్ద్రజాః. 320
ఉదరశ్లీపదాతఙ్కాన్ సహ్యవిన్ధ్యభవాః పునః,
కుష్ఠపాణ్డుశిరోరోగాన్ దోషఘ్నః పారియాత్రజాః. 321
బలపౌరుషకారిణ్యః సాగరామ్భస్త్రిదోషకృత్.

వ్యా. ప్రాచ్య (గౌడ) దేశములయందును, అవన్త్య (మాళవ) దేశమునందును, అపరాన్త (కొంకణ) దేశమునందును పుట్టిన నదులును, మహేంద్రపర్వతమున పుట్టిన నదులును దుర్నామరోగమును ఉదరరోగములను శ్లీపదములను కలిగించును. సహ్యపర్వతమునందును వింధ్యపర్వతమునందును పుట్టిన నదులు, కుష్ఠరోగమును, పాండురోగమును, శిరోరోగములను కలిగించును; (కావున పైజెప్పబడిన నదులజలము పానాదులకు దగదనుట.) మరియు పారియాత్రపర్వతమున బుట్టిన నదులు త్రిదోషములహరించును. బలమును శుక్రమును మిక్కిలి వృద్ధినొందించును; (కావున అట్టి నదులజలము పానాదుల కర్హమనుట.) సముద్రోదకము త్రిదోషముల వృద్ధినొందించును. (కావున గ్రాహ్యముకాదు).

### ఋతుభేదముచే తటాకాది జలోపయోగనిర్ణయము

మూ. వాపీతటాకసఞ్జాతం హితం హేమన్తశీతయోః. 3 ౨౩
కౌపం వసన్తే చౌణ్డామ్బుసరః ప్రస్రవణోద్భవమ్,
గ్రీష్మవర్షాసు కౌపం చ సర్వం శరది శస్యతే. 3 ౨౪

వ్యా. వాపీజలమును తాటాకజలమును హేమంత శిశిరఋతువులయం దుపయోగింపనగును. కూపోదకమును వసంతఋతువునం దుపయోగింపంజను. గ్రీష్మవర్షఋతువులయందు చౌండసారస ప్రాస్రవణోదకములను కూపోదకము నుపయోగింపవలెను. శరదృతువునందు తాటాకాదిజలముల నన్నిటి నుపయోగింపదగును.

### నారికేళోదకగుణము

మూ. నారికేళో (నాళికేరో) దకం స్నిగ్ధం స్వాదువృష్యం హిమం జలమ్,
తృష్ణాపిత్తానిలహరం పరం వస్తివిశోధనమ్. 3 ౨౫

వ్యా. టెంకాయనీళ్లు స్నిగ్ధముగను మధురముగను ఉండును. శుక్రమును వృద్ధిజేయును. చల్లగ (శీతవీర్యముగ) నుండును. తేలికగజీర్ణమగును. దప్పినిపిత్తవాతములను హరించును. అగ్నినిదీపింపజేయును. వస్తిని శుభ్రముచేయును.

### అత్తినీళ్లగుణము

మూ. ఉదుంబరజలం గ్రాహికషాయం మధురం హిమమ్,
దాహప్రమేహాతీసారతృష్ణాసృగ్దరిణాం హితమ్. 3 ౨౬

వ్యా. అత్తిచెట్టునుండిస్రవించునీళ్లు (అత్తికల్లు) నిరాతంకముగవెడల మలాదుల నిలుపును. వగరుతీపియుకలిగి శీతవీర్యముగనుండును. తాపము, ప్రమేహము, అతిసారము, దప్పి, రక్తప్రదరము, అనునీరోగములుకలవారికిమిక్కిలి హితకరము.

### తాటికాయనీళ్లమున్నగువానిగుణములు

మూ. తాలజం తరుణం తోయం పిత్తానిలహరం గురు,
మూలామ్బుశాల్మల్యాదీనాం స్వస్వకారణవద్గుణైః. 3 ౨౭

వ్యా. తాటికాయలోని లేతనీళ్లు పిత్తమును వాతమును హరించును. గురుత్వము కలిగియుండును. బూరుగచెట్టుమున్నగువృక్షములవేళ్లవలనబుట్టిజలము దానిదానికి కారణములైన వృక్షములగుణములు కలిగియుండును.

### చంద్రకాన్తజలము, దానిగుణము

మూ. చన్ద్రికాన్తోద్భవం రక్షోవిషపిత్తజ్వరాపహమ్,
చరాచరాణామహితం తౌషారంత్వగ్నినాశనమ్. 3 ౨౮

వ్యా. చంద్రకాంతపుమణులనుండి స్రవించుజలము పిశాచాదులను విషమును పిత్తమును జ్వరమును హరించును. ప్రాతఃకాలమునపడిన నీరుతౌషారము. ఈజలము అగ్నినిచెరచునుగాన నీజలము చరాచరములకు పథ్యకరము కానోపదు. చంద్రకాంతజలము ఔపలభేదమునచేరినది. సింహావలోకనన్యాయముగ నిచ్చటచెప్పబడినది.

కారక, హైమజలములగుణములు

మూ. అతిశీతం గురుశ్లేష్మవాతళం కరకోద్భవమ్,
హైమోదం శ్రమమూర్ఛాఘ్నం రూక్షం పుష్పానుగం హిమమ్.

వ్యా. (వడగండ్లవలనగలిగినజలము కరకోద్భవము, కారకము ననిచెప్పబడును.) వడగండ్లనీళ్లు మిక్కిలిచల్లగను భారముగను ఉండును. కఫవాతములవృద్ధినొందించును. (మంచువలనపుట్టినజలము హైమము.) అయ్యది శ్రమమును మూర్ఛను హరించును. రూక్షగుణము కలిగియుండును. శీతవీర్యమై ఋతురక్తమున కనుకూలముగ నుండును.

(ఇచ్చట నీవిషయము తెలియంగునది:—తోయవర్గమున తొలుత భౌమ, ధార, తౌషార, కారక, హైమభేదములచే నైదువిధములుగ జలభేదము చెప్పబడెను. గాంగ సాముద్రాదిభేదములచే ధారజలమును, తాటాకకౌపాదిభేదములచే భౌమజలంబును, వానివానిలక్షణగుణాదులును వివరింపబడినవి. పిదప ఉదుంబరశాల్మలాదితౌషారజలంబులును చెప్పబడినవి. పిదప కారకహైమజలములగుణాదులును చెప్పబడినవి. ఇత్తెఱంగున భౌమాది పంచవిధజలంబులు, వానిలక్షణగుణాదులును పూర్తిగ పైగ్రంథమున వివరింపబడినవి.)

పానార్హజలలక్షణము

మూ. అగన్ధమవ్యక్తరసం శీతం తృష్ణాహరం లఘు,
అచ్ఛం చ తోయం గుణవత్ విపన్నం స్యాద్విపర్యయే. ౩౩౦

వ్యా. వాసనయు తీపు మున్నగురసంబులును స్ఫుటముగ గానరాక లీనమై చల్లదనముగలిగి, తేలికయై, స్వచ్ఛముగ నిగనిగలాడుచు, దప్పి నణచుశక్తి కలిగినజలము మిక్కిలి గుణవంతముగ నుండును. (గాన అట్టిజలము పానమున కర్హముగ నుండును.) పైజెప్పినగుణములకు విరుద్ధములగు గుణములగలిగినజలము చెడ్డది. (కావున పానార్హము కాదు.) వాసనయు రసంబులును స్ఫుటముగ తెలియుచు చల్లదనము లేక బరువై కలకబారి యుండుజలము దప్పి నణచదు. అదియే దుష్టజలమనుట.

దుష్టజలము

మూ. న పిచేత్పఙ్కశైవాలతృణపర్ణావిలాస్తృతమ్,
సూర్యేన్దుపవనాదృష్టమభివృష్టం ఘనం గురు, ౩౩౧

ఫేనిలం జన్తుమత్తప్తం దన్తగ్రాహ్యతిశైత్యతః,
అనార్తవం చ యద్దివ్యమార్తవం ప్రథమం చ యత్. ౩౩౨

వ్యా. బురద, పాచితీగలు, గడ్డిపోచలు, ఆకులు మున్నగువానిచే గప్పబడి కలక బారినజలంబును, సూర్యునిచేతను చంద్రునిచేతను గాలిచేతను స్పృశింపబడనిజలంబును, అప్పుడే వర్షించినజలంబును, చిక్కగను బారముగను ఉండుజలంబును, నురుగుతోగూడిన జలంబును, పురుగులు మున్నగుజంతువులతోగూడినజలంబును, వేడిగనుండుజలంబును, మిక్కిలి చల్లదనముచేత పండ్లుకిట్టికొనునట్లు చేయుజలంబును స్నానమునకు అర్హముకాదు. మరియు అనార్తవమైన దివ్యోదకము పానముజేయఁజనదు. (వర్షఋతువునతప్ప తక్కిన కాలమున వర్షించుదివ్యోదకము అనార్తవము. అట్టి యనార్తవదివ్యోదకము త్రాగదగదని భావము.) మరియు వర్షఋతువున వర్షించిన ఆర్తవదివ్యోదకమును తొలుదొలుత వాన కురియునప్పుడు పానముజేయఁజనదు. (అట్టి ప్రారంభదశయందు సాలెపురుగులు మున్నగు విషజంతువులమలమూత్రవిషాదిసంబంధమునంజేసి వర్షోదకము చెడియుండును కావున వర్షప్రారంభమున దివ్యోదకము ఆర్తవమైనను పానార్హము కాదనుట. ఈవిషయమును వాగ్భటాచార్యులు 'ప్రథమంచ యత్, లూతాదిజన్తు విణ్మూత్ర విషసంశ్లేషదూషితమ్' అని కంఠోక్తిగ జెప్పెను.)

ఇచ్చట ఆర్తవశబ్దమున ఋతు వనగ వర్షశరదృతువులు నాల్గుమాసములును గ్రహింప బడును. శరదృతు జలము అగస్త్యోదయముచే కీటలూతాదివిషనిర్ముక్తమగును కావున ప్రశస్తమైన దని పైనిచెప్పబడినది. కావున ఋతుశబ్దముచేత నాల్గుమాసములును గ్రాహ్యములు. ఆనాల్గుమాసములయందలి వర్షోదకము ఆర్తవము. ఇతరకాలమునందలివర్ష జలము అనార్తవము నని యెఱుంగునది.

## దుష్టజలమును చక్కజేయువిధము

మూ. త్రిరాత్రముషితం తచ్చ ప్రసన్నమమృతోపమమ్,
అభివృష్టం; విహీనస్య దోషాః స్పర్శాదిసంశ్రయాః. ౩౩౩
దోషః స్పర్శేఽపి శైత్యోష్ణే పైచ్ఛిల్యానీలవర్ణితాః,
రూపే రసే రసవ్యక్తిః గన్ధే దుర్గన్ధసంభవః. ౩౩౪

వ్యా. పైజెప్పినరీతిగ అనార్తవమైనదివ్యోదకంబును, ఆర్తవమైనను క్రొత్తగ ఋతుప్రారంభమున వర్షింపబడిన దివ్యోదకంబు పానార్హముకాదు; వర్షోదకము భూమి పైబడి పంకశైవాలాదులచే చెడినపుడు అట్టిదుష్టమైన యుదకమును మూడురాత్రుల కాలము ఒకపాత్రమునందు నిశ్చలముగ నునిచినచో నయ్యది తేటగతేరి మడ్డియంతయు

పాత్రలో క్రిందిభాగమున నిలిచి నిర్దుష్టమగును కావున నయ్యది యమృతమునుబోలె పానార్హమగును.

గుణహీనమైనజలమున దోషములు స్పర్శ, రూప, రస, గంధముల నాశ్రయించి సంభవించును. అందు మిక్కిలి చల్లదనంబైనను మిక్కిలి వేడియైనను కలిగినజలము స్పర్శమున దుష్టమైనది. పిచ్ఛిలమై కొంచెము నీలవర్ణమైనజలము రూపముచే దుష్టము. మధురాదిరసములు స్ఫుటముగ గానవచ్చినజలము రసముచే దుష్టము. దుర్గంధము కల్గినజలము గంధముచే దుష్టము.

మరియు దుష్టజలమును బాగుచేయువిధము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది:—"ఘనవస్త్రపరిస్రావైః క్షుద్రజన్తూభిరక్షణమ్, వ్యాపన్నస్యాస్య తపనమగ్న్యర్కాయసపిణ్డకైః పర్ణీమూలబిసగ్రన్థి ముక్తాకతకశైవలైః, వస్త్రగోమేదకాభ్యాం వా కారయేత్తత్ప్రసాదనమ్. పాటలాకరవీరాదికుసుమైర్గన్ధనాశనమ్." దుష్టములగు సూక్ష్మములైన పురుగులు మున్నగుజంతువులచే చెడినజలమును దట్టమై నిర్మలమైనగుడ్డచేత వడగట్టునది. ఖురద ప్రాచిగడ్డి ఆకులు మున్నగువాని సంబంధముచే జలముచెడి దుర్గంధముతో గూడియుండునెడ పైజెప్పినరీతిగ తొలుత వడగట్టి పిమ్మట ఎండలోనైనను నిప్పులోనైనను, నిప్పునకాలిన యినుపగుండుచేనైనను ఆనీళ్లను కాచి, మోదుగవేరు, తామరదుంపలు, ముత్యములు, చిల్లగింజలు, నాచుతీగెలు, వస్త్రము, గోమేదకమణి, వీనిచే తేరునట్లుచేసి పిదప పాటలపువ్వుము, కరవీరపువ్వుము మున్నగువాసనగల పువ్వుల నందునిచిన నో దుర్గంధముపోయి జలము శుభ్రమగును. అయ్యది పానార్హమగును.

### జలముయొక్క వీర్యవిపాకములచే గల్గుదోషములు

మూ. శీతం పీతం విషం కుర్యాత్ కుక్షిరోగం స పీనసమ్,
వీర్యే దోషాత్ విపాకే తు చరాద్విష్టభ్య జీర్యతి. 33౫

వ్యా. మిక్కిలి చల్లగానుండువీర్యము కలజలమును పానముచేసినచో వీర్యదోషముచేత కుక్షిరోగమును పీనసము (పడిసెము)ను కలిగించును. జలము విపాకమున చెడ్డదిగానున్నపుడు అట్టిజలము చిరకాలమునకు మలమును బంధించి జీర్ణమగును. (ఇచ్చట విషశబ్దమునకు జల మని యర్థము.)

### జలపానమున కొన్నినియమములు

మూ. పానీయం న తు పానీయం పానీయేఽన్యప్రదేశజే,
అజీర్ణే క్వథితం చామే పక్వే జీర్ణేఽపి నేతరత్. 33౬
శీతే విధిరయం తప్తే త్వజీర్ణే శిశిరం త్యజేత్,

వ్యా॥ ఒకదేశమునందలిజలమును త్రాగినయెడ అయ్యది జీర్ణముకాక మునుపు వేరొండుదేశమునందలి జలమును త్రాగంజనదు. (బావియందలినీళ్లు త్రాగి అది జీర్ణము కాకుండునపుడే మరల తటాకాదిజలమును పానముచేయకూడదు. ఇట్లేయింగుపనె సార సాదులకుగూడ నెఱుంగునది). మరియు చల్లనినీళ్లు త్రాగి అది జీర్ణము కాకుండునప్పుడు వేడినీళ్లను త్రాగకూడదు. వేడినీళ్లు త్రాగి అది జీర్ణమైనపుడును చల్లనినీళ్లు త్రాగంజనదు. ఇది కాగి చల్లారినజలమునకు జెప్పిన నియమము. కాగి వేడిగ నుండుజలమును త్రాగినప్పుడు ఆజలము జీర్ణము కానప్పుడు చల్లనినీళ్లను త్రాగంజనదు.

ఉదకప్రాశస్త్యము, జలపానావశ్యకత్వము

మూ॥ పానీయం ప్రాణినాం ప్రాణాః విశ్వమేవ హి తన్మయమ్. 332
అతోఽత్యన్తనిషేధేన న క్వచిద్వారి వార్యతే,

వ్యా॥ సకలప్రాణులకు ప్రాణాధారమైనది జలము. చరాచరప్రపంచమంతయు జలము నాధారముగ జేసి యున్నది. కావున జలపానము ఒకప్పుడును సర్వాత్మ నా నిషిద్ధము కాదు. (జలము సకలప్రాణులకును ప్రాణమునకు ముఖ్యాధారము కావున ఒకవేళ వేడినీళ్లను, కొన్నిసమయములయందు చల్లనినీళ్లను, కొన్నివేళల కాగిచల్లారిననీళ్లను, కొన్నిసమయములయందు ఔషధములతో గూర్చియు, ఆయాకాలదోషరోగాదుల ననుస రించి తత్తదనుగుణముగ నీళ్లు త్రాగవలెనుకాని బొత్తుగ నీళ్లను త్రాగ కుండదగదనిభావము.) ఈవిషయమునే అష్టాంగసఙ్గ్రహమున నిట్లు చెప్పియున్నది:—"క్వచిదుష్ణం క్వచిచ్ఛీతం క్వచిత్క్వథితశీతలమ్, క్వచిద్భేషజసంయుక్తం నక్వచిద్వారవార్యతే." ఈవాక్యముచేత నుదకపానము ఆవశ్యక మని స్ఫుటమగుచున్నది.

మరియు జలము జగత్తునకు ప్రాణము ప్రాణులు మున్నగువానికి ముఖ్యమైన యాధారముగ నుండునని "ఆపోవా ఇదం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః... రాప ఓమ్" అనుశ్రుతివాక్యము శాసించినది. ఈయభిప్రాయమునే వాగ్భటాచార్యుడు అష్టాంగసంగ్రహమున "అన్నపానేషు సలిలమేవశ్రేష్ఠం సర్వరసయోనిత్వాత్, సర్వభూత సాత్మ్యాత్, జీవనాదిగుణయోగాచ్చ" అనువాక్యముచే జెప్పెను.

జలపానము లేనందున గల్గునుపద్రవములు

మూ॥ ఆస్యశోషాఙ్గసాదౌ వా మృత్యుర్వా తదలాభతః. 333

వ్యా॥ దప్పికలిగినపుడు జలమును త్రాగనిచో గొంతెండును. శరీరము కృశించి బడలును. ఒకవేళ మరణముకూడ సంభవించును. కావున దప్పి యెత్తినపుడెల్ల జలమును త్రాగవలెను.

జలపానవిధము, సుయోగాऽతియోగములగుణదోషములు

మూ. కేవలం సౌషధం పక్వం ఆమముష్ణం హిమంచ యత్,
సంవీక్ష్యమాత్రయాయుక్తంఅమృతం; విషమన్యథా. ౩౭౯
అతియోగేన సలిలతృష్యతోऽపి ప్రయోజితమ్,
తస్మాదయోగవాహేన లాఘువాన్నచ యోజయేత్. ౩౮౦

వ్యా. అట్టిజలమును కేవలము జలమాత్రమునైన, ఔషధములగూర్చియైన కాచి యుష్ణముగనైన చల్లగనైన నుపయోగించవలెను. లేక చల్లనినీళ్లనైనను, పైజెప్పినవిధముగ కాచి చల్లారిననీళ్లనైనను సమయమును గమనించి త్రాగవలెను. పైజెప్పబడినవిధముగ నీళ్లు త్రాగునపుడు ఆమాదోషాదులను పరిస్థితులను గమనించి తదనుకూలముగ తగినపరిమాణము గల్పించి త్రాగినచో నమృతమునుబోలె జీవనాధార మగును. అటుగాక మితిమీరి త్రాగినచో విషమునుబోలె ప్రాణాంతక మగును; కావున దప్పి యధికముగ నున్నను, తగిన మాత్రము గల్పించి యుపయోగింప నగునుగాని మితిమీరి త్రాగజనదు. యుక్తియుక్తము గాక పలుమారు జలమును నియమములేక త్రాగజనదు.

కోష్ణ(కొంచెము వెచ్చనైన) జలమును పానముజేయదగినవారు, దానిగుణము

మూ. ఆమవిష్టమ్భయోః కోష్ణం నిష్పిపాసోऽపి తత్పిబేత్ (జలంపిబేత్),
యావన్తి క్లేదయన్త్యాస్యం అతిక్లేదోऽగ్నినాశనః. ౩౮౧
పిబద్ధకఫవాతాభ్యాం ముక్తామాశయబన్ధనః,
పచ్యతే క్షిప్రమాహారః కోష్ణతో యద్రవీకృతః. ౩౮౨

వ్యా. భుజింపబడినయాహారము జీర్ణముకాకుండునప్పుడును, కఫవాతములు ఆమాశయమున బంధింపబడియున్నపుడును దప్పి లేకున్నను కాగి కొంచెము వేడిగనుండునీళ్లు త్రాగవలెను. ఎంతనీళ్లచేత నోట ద్రవముపుట్టునో అంతనీళ్లు త్రాగనగును. అంతకన్న నధికముగ నీళ్లు త్రాగినచో జాఠరాగ్ని నశించును. కావున మితముగ నోట ద్రవము పుట్టునంత జలము త్రాగవలెను. ఇత్తెఱంగున మితముగ త్రాగినచో కఫవాతములు బంధమువదలి ఆమాశయమున బంధమును వదలి అందు కఫవాతములచే నిరోధింపబడిన యాహారము పట్టువదలి కొంచెముగ వేడియైనజలముచే ద్రవముకలిగి అతిశీఘ్రముగ పచింపబడి జీర్ణమగును. కావున అట్టిసమయమున దప్పిలేకున్నను కొంచెముగ వేడిగ నుండుజలమును మితముగ త్రాగవలెను.

శీతజలపానానర్హులు

మూ. అనవస్థితదోషాగ్నేః వ్యాధిక్షీణబలస్యచ,

నాల్పమప్యాపముదకం హితం తద్ధిత్రిదోషకృత్. 383

వ్యా. వాతాదిదోషంబులును జాఠరాగ్నియు నొకచోట నుండక అప్పుడప్పుడుచు పలుదెఱంగుల మారుచుండునేని అట్టివారికిని, వ్యాధులచే శరీరము కృశించినవారికిని, బలము నశించినవారికిని, చల్లనినీళ్లు కొంచెమైన పానముచేయందగదు. అట్టివారికి చల్లనినీళ్లు త్రిదోషముల బ్రకోపింపజేయును (కావున పథ్యకరము కాదనుట).

సర్వజలపాననిషిద్ధులు

మూ. తేజసః ప్రతిపక్షత్వాన్నన్దాగ్నిర్వర్జయేజ్జలం,
సర్వమేవ తథాస్యన్దప్లీహావిద్రధిగుల్మినః. 384
పాణ్డ్వాదరాతిసారార్శోగ్రహణీదోషశోషిణః,
కుష్ఠమేహప్రతిశ్యాయజ్వరారుచ్యక్షిరోగిణః. 385

వ్యా. అగ్నికి జలము ప్రత్యక్షవిరుద్ధమైనది కావున జఠరాగ్ని మందగించి యుండునపుడు చల్లనినీళ్లైనను వేడినీళ్లైనను, మరియేవిధమైనసీళ్లను త్రాగకూడదు. మరియు నేత్రాభిష్యందిరోగము, ప్లీహావృద్ధిరోగము, విద్రధివ్రణము, గుల్మము, పాండురోగము, మహోదరము, అతిసారము, అర్శోరోగము, గ్రహణీరోగము, శోషరోగము, కుష్ఠము, ప్రమేహము, పీనసము (పడిసెము), జ్వరము, అరోచకము, అక్షిరోగము అను నీవ్యాధులయందును ఏవిధమైనజలమును పానముజేయంజనదు. (దప్పి యెత్తినపుడు ఏవిధమునసైన మితముగ జలపానముజేయవలెనని "నక్వచిద్వారివార్యతే" అనువాక్యముచే జెప్పబడినది. కావున అయావ్యాధ్యనుసారముగ యథోచితముగ నీళ్లు త్రాగవలె నని యెఱుంగునది. ఈవిషయము క్రిందచెప్పబడును.

పైచెప్పినవ్యాధులయందు జలపానమున కుపాయము

మూ. కామమల్పమశక్తే తు పేయమౌషధసంస్కృతమ్,
ఋతే శరన్నిదాఘాభ్యాం పిబేత్స్వస్థోఽపి చాల్పశః. 386

వ్యా. పైజెప్పినవ్యాధులయందు మిక్కిలి దప్పిచే అశక్తముగ నున్నపుడు ఔషధములచే సంస్కరింపబడినజలమును స్వల్పముగ త్రాగవలెను. శరదృతువునందును, ఎండకాలమునందును స్వస్థముగ నుండువారునుకూడ మిక్కిలి స్వల్పముగ నీళ్లు త్రాగవలెను.

భోజనకాలమున జలపాననియమము

మూ. భుక్తస్యాదౌ జలం పీతం అగ్నిసాదం కృశాఙ్గతామ్,
అన్తే కరోతి *శూలత్వం ఊర్ధ్వమామాశయాత్కఫమ్. 387

* స్థూలత్వమ్.

మధ్యేమధ్యాఙ్గతాం సామ్యం ధాతూనాం జరణం సుఖమ్,

వ్యా. భోజనకాలమున తొలుతనే జలమును పానముచేసినచో జఠరాగ్నిని నశింపజేయును. శరీరమును కృశింపజేయును. భోజనాంతమున నీళ్లు త్రాగినచో శరీరము స్థూలమగును. ఆమాశయమునకు పైభాగమున కఫమును వ్యాపింపజేయును. భోజనమధ్యకాలమున నీళ్లుత్రాగినచో అతిస్థూలమును కృశమునుగాక శరీరము సమస్థితి నుండును. రసరక్తాదిధాతువులు సమస్థితి నుండును. సుఖముగ జీర్ణ మగును.

శీతోదకగుణము

మూ. శీతం మదాత్యయగ్లాని మూర్ఛాచ్ఛర్దిమదభ్రమాన్,
తృష్ణోష్ణదాహపిత్తాస్రుక్ విషాణ్యమ్బునియచ్ఛతి. ౩౪౮
గళగ్రహోరః క్షతయోః ప్రాగ్భుక్తంచ నవం స్థిరమ్,

వ్యా. శీతోదకము మదాత్యయమును, బడలికను, మూర్ఛను, వమనమును, మదమును, భ్రమమును, దప్పిని, ఉష్ణమును, తాపమును, పిత్తరక్తమును, విషమును హరించును. మరియు గళగ్రహమునందును ఉరఃక్షతమునందును భోజనమునకు ముందు బావి మొదలగు చోట్ల స్థిరముగనుండుజలమును పానముజేయనగును.

వేడినీళ్లగుణము

మూ. దీపనం పాచనం కణ్ఠ్యం లఘూష్ణం వస్తిశోధనమ్. ౩౪౯
హిధ్మాధ్మానానిలశ్లేష్మసద్యశ్శుద్ధే (శుద్ధిః) నవజ్వరే,
కాసామపీనసశ్వాసపార్శ్వరుజాసు చ శస్యతే. ౩౫౦

వ్యా. వేడినీళ్లు అగ్నిని దీపింపజేసి భుజింపబడిన యాహారమును జీర్ణింపజేయును. కంఠమునకు మిక్కిలి హితకరము. మిక్కిలి తేలికయై చులకనగ జీర్ణమగును. వస్తిని (మూత్రపుతిత్తిని) శుభ్రముచేయును. ఎక్కిళ్లు, ఆధ్మానము (కడుపుబ్బరము) వాతశ్లేష్మరోగములు, ఈరోగములయందును వమనవిరేచనాదిశోధనచికిత్స చేసినపుడును, నూతనజ్వరమునందును, కాసరోగమునందును, ఆహారము జీర్ణముకాకుండునప్పుడును, పీనస (పడిసె)మునందును, శ్వాసరోగమునందును, ప్రక్కనొప్పియందును, వేడినీళ్లు త్రాగుట మున్నగుకార్యముల కుపయోగించుట చాల ప్రశస్తము.

వేడినీళ్లను కాచునపుడు క్వాథభేదముచే గుణభేదములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"క్షీణపాదత్రిభాగార్ధం దేశర్తుగురులాఘవాత్, క్వథితం ఫేనరహితం ఆవేగమమలం హితమ్" నీళ్లను కాచునపుడు జాంగలాదిదేశముయొక్కయు, హేమంతాది ఋతువులయొక్కయు గురులాఘవముల ననుసరించి నాల్గవభాగమును, లేక మూడవవం

ముచు, లేక అర్ధభాగంబును మిగులునట్లు కాచి, నురుగును, వేగంబును, మలినంబును లేని వేడినీళ్లను ఆయాదేశకాలానుగుణముగ పానాదుల కుపయోగించినచో మిక్కిలి హిత కరమగును.

పైజెప్పినభాగభేదముల ననుసరించి కాచబడినవేడినీళ్లగుణము సుశ్రుతమున నిట్లున్నది:—"యత్క్వాథ్యమానం నిర్వేగం నిష్ఫేనం నిర్మలం లఘు, చతుర్భాగావశిష్టంతు తత్తోయం కఫరోగనుత్, తత్పాదహీనం పిత్తఘ్నం హీనమర్ధేన వాతనుత్" పైజెప్పిన రీతిగ నాల్గవపాలు మిగులునట్లు కాగి వేగములేక (పొంగు అణగి) నురుగు నిలిచి నిర్మలముగ నుండుజలము కఫరోగముల హరించును. నాల్గవభాగము ఇగురునట్లు కాచబడినవేడినీళ్లు పిత్తమును హరించును. సగపాలు మిగులునట్లు కాచబడినవేడినీళ్లు వాతమును హరించును. అని భావము.

కాగిచల్లారిననీళ్లగుణము

మూ. అనభిష్యన్ది లఘు చ తోయంక్వథితశీతలమ్,
పిత్తయుక్తే హితం దోషే వ్యుషితం తత్త్రిదోషకృత్. 3౫౧

వ్యా. కాగి చల్లగ చల్లారినజలము స్రోతస్సులయందు ద్రవమును పుట్టించదు (జలుబు కలిగించదనుట). తేలికగ జీర్ణమగును. పిత్తముతో కూడినదోషమునందును (వాతపిత్తము, పిత్తకఫము, సన్నిపాతము అనుపిత్తసంసర్గమునందును) మిక్కిలి హితకరము. (కాగిననీళ్లు మరుసటిదినమువరకున్నచో నయ్యది అధ్యుషితము) అట్టిప్రాచినీళ్లు త్రిదోషముల ప్రకోపింపజేయునుగాన హితముగాదు.

ఇది జలవర్గము.

అథ క్షీరవర్గః—

అవతారిక:—"ఆపోవా ఇదగ్ం సర్వం" ఇది మున్నగు ప్రమాణములచే ప్రాణమునకు ముఖ్యాధారమైన జలవర్గమును పైనిచెప్పి, పిదప "క్షీరం జీవనీయానాం, క్షీరఘృతాభ్యాసో రసాయనానాం" అనుసంగ్రహావచనముచే జీవనీయరసాయనములలో ముఖ్యమైన దని నిర్ణయింపబడినక్షీరవర్గము క్రింద చెప్పబడును.

క్షీరసామాన్యగుణము

మూ. స్వాదుపాకరసం స్నిగ్ధమోజస్యం ధాతువర్ధనమ్,
వాతపిత్తహరం వృష్యం శ్లేష్మలం గురుశీతలమ్. 3౫౨
ప్రాయః పయం....................

వ్యా. క్షీరము మధురవిపాకంబును మధురరసంబును స్నిగ్ధగుణంబును కలిగియుండును. ఓజస్సునకు మిక్కిలి హితకరము. రసరక్తాదిధాతువుల వృద్ధినొందించును. వాతపిత్త

ముల హరించును. శుక్రమును వృద్ధినందించును. కఫమును వృద్ధినొందించును. గురుత్వము కలిగియుండును. శీతవీర్యముగ నుండును. పైజెప్పినగుణములు ప్రాయికముగ క్షీరసామాన్యములై యుండును.

"గవ్యం మాహిషమాజం చ కారభం స్త్రైణమావికమ్, ఐభమైకశఫం చేతి క్షీరమష్టవిధం స్మృతమ్" అనుతంత్రాన్తరముచే గవ్యము (ఆవుపాలు), మాహిషము (ఎనుముపాలు), ఆజము (మేకపాలు), కారభము (ఒంటెపాలు), స్త్రైణము (స్త్రీలచనుబాలు), ఆవికము (గొఱ్ఱెపాలు), ఐభము (ఏనుగుపాలు), ఏకశఫము (ఒకటే గిట్టకలగుఱ్ఱము మున్నగుజంతువులపాలు) నని క్షీరము ఎనిమిదివిధములుగ నుండు నని తెలియుచున్నది; కావున అట్టిభేదములు లేక పాలసామాన్యముగ పైజెప్పినగుణములు కలిగియుండునని "ప్రాయశఃపయః" అనువాక్యముచే తెలిసెడి (విశేషగుణములు క్రిందవివరింపబడును).

ఆవుపాలసామాన్యగుణములు

మూ. .........అత్రగవ్యంతుజీవనీయంరసాయనమ్. 3౹౩
క్షతక్షీణహితం మేధ్యం బల్యం స్తన్యకరం పరమ్,
శ్రమభ్రమమదాలక్ష్మీశ్వాసకాసాతితృట్ క్షుధః. 3౹౪
జీర్ణజ్వరం మూత్రకృచ్ఛ్రం రక్తపిత్తం చ నాశయేత్,

వ్యా. పాలు జాతుభేదములనుపట్టి పలువెఱంగుల నుండును. అందు ఆవుపాలు మిక్కిలి బలకరము. రసాయనము (జరావ్యాధులహరించి ధాతువుల వృద్ధినొందించునది). ఉరఃక్షతరోగులకును ధాతువులు క్షీణించినవారికిని మిక్కిలి హితకరము, మేధాశక్తిని కలిగించును. బలకరము, చనుబాలను (ఆడువారికి) కలిగించును. శ్రమమును, భ్రమమును, మదమును, అలక్ష్మిని, శ్వాసకాసములను, మిక్కుటమైనదప్పిని, ఆకలిని, జీర్ణమైనజ్వరమును, మూత్రకృచ్ఛ్రమును, రక్తపిత్తమును హరించును.

ఆవులవర్ణాదిభేదములచే గల్గుగుణవిశేషములు

మూ. బాలానాం బాలవత్సానాం శుక్లానాం వాతహృత్పయః. 3౹౫
మధ్యానాం మధ్యవత్సానాం కృష్ణానాం పిత్తనాశనమ్,
వృద్ధానాం వృద్ధవత్సానాం శోణానాం శ్లేష్మజిద్గవామ్. 3౹౬

వ్యా. బాల్యవయసుననుండు ఆవులయొక్కయు, లేతదూడగల ఆవుయొక్కయు తెల్లావులయొక్కయుపాలు వాతమును హరించును. నడివయసుననుండు ఆవులయొక్కయు, నడివయసుననుండు దూడకలఆవులయొక్కయు, నల్లనిఆవులయొక్కయు పాలు పిత్తమును హరింపజేయును. ముదురుఆవుయొక్కయు, ముదిరినదూడకలఆవుయొక్కయు, ఎఱ్ఱనిరంగుకలఆవుయొక్కయు పాలు కఫమును హరించును.

### ఎనుముపాలగుణము

మూ. హితమత్యగ్న్యనిద్రేభ్యః గరీయోమాహిషంహిమమ్,

వ్యా. ఎనుముపాలు ఆవుపాలకన్న గురుత్వముకలిగి శీతవీర్యముగ నుండును. మిక్కిలి తీవ్రమైనజాఠరాగ్నికలవారికిని నిదురబట్టకుండువారికిని మిక్కిలి హితకరమైనది.

తంత్రాంతరమున:—"గురుశీతతరం గవ్యాత్ మాహిషం స్వప్నలం పయః" అని యుండుటంజేసి ఎనుముపాలు ఆవుపాలకన్న గురుతరంబును శీతంబునై యుండు నని స్ఫుటముగ దెలిసెడి.

### మేకపాలగుణము

మూ. అల్పామ్బుపానవ్యాయామకటుతిక్తాశనైర్లఘు. 3॥౭
ఆజం శోషజ్వరశ్వాసరక్తపిత్తాతిసారజిత్,

వ్యా. మేకలు కొద్దిగ నీళ్లుత్రాగి అధికముగ సంచరించి కారముగు చేదునుకల ఆకు లలములను తినుచుండును; కావున అట్టియాహారవిహారాదులుకల మేకలపాలు మిక్కిలి లఘుతరముగ నుండును. శోషను, జ్వరమును, శ్వాసమును, రక్తపిత్తమును, అతిసారమును హరించును.

### గొఱ్ఱెపాలగుణము

మూ. కాసఘ్నం నాతిశీతోష్ణం అహృద్యం తూష్ణమావికమ్. 3॥౮
వాతవ్యాధిహరం హిధ్మాశ్వాసపిత్తకఫప్రదమ్,

వ్యా. గొఱియలపాలు ఉష్ణశీతములు అధికముగ లేక రెండుగుణములును సమములుగ నుండును. కాసముల హరించును. హృదయమునకు హితకరము కాదు. ఉష్ణవీర్యము కలిగియుండును. వాతరోగములను హరించును. ఎక్కిళ్లను శ్వాసమును పిత్తకఫములను వృద్ధినొందించును.

### మేక, ఆవు, గొఱ్ఱె, ఎనుము, వీనిపాల నుపయోగింపదగినవారు

మూ. క్షీరమాజం హితం బాలే వృద్ధి గోక్షీరమావితమ్. 3॥౯
క్షతక్షణే క్షతేష్విష్టం మాహిషం.........

వ్యా. మేకపాలు బాలురకు హితకరము. ఆవుపాలును గొఱ్ఱెపాలును వృద్ధులకు చాల హితకరములు. గాయములచే కృశించినవారికిని ఉరఃక్షతరోగముకలవారికిని ఎనుముపాలు చాల హితకరము.

### స్త్రీలచనుబాలగుణము

మూ. ...................మానుషంపునః,

నస్యేనరక్తపిత్తఘ్నం తర్పణేనాక్షిశూలజిత్. 3౬౦

వ్యా. చనుబాలు నస్యముచేసినచో రక్తపిత్తమును హరించును. కన్నులలో నుంచిన నేత్రరోగములు నివర్తించును. కండ్లనొప్పులును నివర్తించును.

## పచ్చిపాలగుణము

మూ. పయోఽభిష్యన్ది గుర్వామం క్షీరాదన్యత్ర మానుషాత్,

వ్యా. కాచక పచ్చిగనుండుపాలు స్త్రీలచనుబాలుతప్ప తక్కినవన్నియు కఫమును ప్రకోపింపజేసి స్రోతస్సులను స్రవింపజేయును. చనుబాలుమాత్రము పచ్చిదిగూడ అభిష్యందకరముకాదు. ఈవిషయమునే "వనితాస్తన్యమామమేవ హితం పయః" అని యితర తంత్రకారులు చెప్పిరికావున చనుబాలు పచ్చివే మిక్కిలి హితకర మని తెలియునది. (వీనిని కాచగూడదు).

## కాచబడినపాలగుణతారతమ్యము

మూ. అర్ధోదకం క్షీరశిష్టం ఆమాల్లఘుతరం స్మృతమ్. 3౬౧
నిర్జలం చ శృతం ద్వి త్రి చతురష్టాంశ శే(శో)షితమ్,
యథాశ్రుతతరం సారం గురుబల్యతమం పయః. 3౬౨

వ్యా. పాలకు సగపాలు నీళ్లకలిపి పాలుమాత్రము మిగులునంతదనుక కాచబడిన పాలు పచ్చిపాలకంటె మిక్కిలి లఘువుగ నుండును. పాలలో నీళ్లు కొంచెమైన జేర్చక సగమైనను, మూడవవంతైనను, నాల్గవవంతైనను, ఎనిమిదవవంతైనను మిగులునట్లు కాచ బడినపాలు ఒకదానికన్న నొకటి సారవంతంబును, గురుతరంబును, మిక్కిలి బలకరంబును నైయుండును.

## *సంతానికాగుణము

మూ. స్వాదు పాకరసా స్నిగ్ధా రక్తపిత్తప్రసాదినీ,
వాతఘ్నీ తర్పణీ బల్యా రుచ్యా సన్తానికా గురుః. 3౬3

వ్యా. (పాలంతయు చుండి ముద్దయగునట్లు కాచిన నయ్యది సంతానిక యన బడును. (ఇదియే పాలోకోవ). అట్టి సంతానిక మిక్కిలి మధురరసంబును మధురవిపాకం బునుకలిగి మిక్కిలి స్నిగ్ధతరమై యుండును, రక్తపిత్తమును శమింపజేయును. వాతమును హరించును. తృప్తి కలిగించును. మిక్కిలి బలకరము. రుచిని పుట్టించును. మిక్కిలి గురుత్వము కలిగియుండును.

---

* సంతానిక యనగా మీగడ యని తెలియుచున్నది.

### ధారోష్ణాదిక్షీరగుణములు

మూ. ధారోష్ణమమృతం గవ్యం ధారాశీతం త్రిదోషలమ్,
శృతశీతం తు పిత్తఘ్నం శృతోష్ణం కఫవాతజిత్. 3౬౪

వ్యా. పాలుపితుకునప్పుడు ధారగ వెడలును. అట్టిధార పితుకుసమయమున వేడిగ నుండును. అట్టిపాలు ధారోష్ణము. ఆవుపాలు ధారోష్ణముగ నున్నప్పుడు అమృతమును బోలె బలాదుల గలిగింప సమర్థమై యుండును, పిండినవెనుక చల్లబడినపచ్చిపాలు త్రిదోషముల కలిగించును. కాగి చల్లారినపాలు పిత్తమును హరించును. కాగి వేడిగనుండుపాలు కఫవాతముల హరించును.

### అగ్రాహ్యక్షీరములు

మూ. అనిష్టగన్ధమమ్లం చ వివర్ణం విరసంచయత్,
వర్జ్యం సలవణం క్షీరం యచ్చాపి గ్రథితం భవేత్. 3౬౫

వ్యా. మనసు కింపుగాని వాసనగలిగినదియు, పులుపెక్కినదియు, పాలకు స్వాభావికమైనరంగునకు మారునీలపీతాదివర్ణములు కలిగినదియు, రుచిచెడినదియు నగుపాలు విడువందగును. మరియు ఉప్పుకలిసినపాలును, గడ్డగ (పెరుగువలె) నుండుపాలును, గ్రాహ్యము కాదు.

### పాలుచెడుటకు కాలనియమము

మూ. ముహూర్తాత్పఞ్చకాతీతం క్షీరం భజతి విక్రియామ్,
శృతం తద్ద్విగుణాత్కాలాత్ అతీతం తద్విషోపమమ్. 3౬౬

వ్యా. పచ్చిపాలు ఐదుముహూర్తములకాలము (10 గడియలు) గడచినచో చెడి విషముతో సమానమగును.

### కొన్నికారణములచే పాలకు గురులాఘవసంప్రాప్తి

మూ. పిణ్యాకామ్లాశినీనాం తు గుర్వ్యాభిష్యన్ది తద్భృశమ్,
అచేష్టయా చ ప్రాదోషాద్గరీయస్స్యాత్తమహాపసమ్. 3౬౭
వ్యాఖ్యాతోఽనేన లఘిమా చేష్టావత్ప్రకృతిష్వపి,
హ్రస్వేషు చాతిదీర్ఘేషు మాంసలేష్వేవమాదిశేత్. 3౬౮

వ్యా. గానుగపిండిని మిక్కిలి పులిసినకుడితినీళ్లు మున్నగువానిని తినుచుండుగోవు మున్నగువానిపాలు మిక్కిలి గురుత్వము కలిగియుండును. కఫమును వృద్ధినొందించును. మరియు రాత్రులయందు పశ్వాదులు సంచారము మున్నగుచేష్టలు లేకయుండును కావున ప్రాదోష (సాయంకాలము తీయబడిన) క్షీరమునకన్న ఔషస (ఉదయకాలమున

తీయబడిన) క్షీరము మిక్కిలి గురుత్వము కలిగియుండును. ఇట్లు చెప్పుటచేత చేష్టలు (సంచారాదిరూపముగ) చేయుచుండు స్వభావము కలిగినజంతువులపాలు లఘుత్వము కలిగియుండు నని స్ఫుటముగ దెలియుచున్నది. ఇత్తెఱంగుననే హ్రస్వజంతువుల పాలకును, దీర్ఘములుగ నుండుజంతువులపాలకును, బలిసియుండుజంతువులపాలకును గురులాఘవముల నిర్ణయించునది. (పొట్టిగనుండుజంతువులపాలు లఘు వనియు, దీర్ఘజంతువులపాలు గురు వనియు, సామాన్యముగనుండుజంతువులపాలు లఘు వనియు, మిక్కిలి బలిసియుండు జంతువులపాలు గురుత్వము కలిగియుండు ననియు భావము).

## టెంకాయపాలగుణము

మూ. వృష్యముష్ణం గురు స్వాదు విదాహి కఫపిత్తకృత్,
నారికేళోద్భవం క్షీరం కాసశ్లేష్మానిలాపహమ్. 3౧౯

వ్యా. పచ్చికొబ్బెరనుండి తీయబడినపాలు (కొబ్బెర నగయగొట్టి యందుండిపిండిన పచ్చిరసము టెంకాయపాలు అనబడును.) శుక్రమును వృద్ధిచేసి సంభోగేచ్ఛను వృద్ధిచేయును. ఉష్ణవీర్యము కలిగియుండును. గురుగుణంబును, మధురరసంబును, తాపమును బుట్టించునదియు నగును. కఫమును, పిత్తమును వృద్ధినొందించును. దగ్గును, శ్లేష్మమునువాతమును హరించును.

## పెరుగుసామాన్యగుణము

మూ. అమ్లపాకరసం గ్రాహి గురూష్ణం, దధివాతజిత్,
మేదశ్శుక్రబలశ్లేష్మరక్తపిత్తాగ్నిశోఫకృత్. 3౨౦
రోచిష్ణుశస్తమరుచౌ శీతకే విషమజ్వరే,
పీనసే మూత్రకృచ్ఛ్రే చ స్వాదుశ్లేష్మవివర్ధనమ్. 3౨౧
నైవాద్యాన్నిశి నైవోష్ణం వసన్తోష్ణశరత్సు న,
నాముద్గసూపం నాక్షౌద్రం సాఘృతం నసితోపలమ్. 3౨౨
నచానామలకం నాతినిత్యం నామన్దమన్యథా,
జ్వరాసృక్పిత్తవీసర్పపిత్తపాణ్డు(క్ష్వామయ)భ్రమప్రదమ్. 3౨3

వ్యా. పెరుగు అమ్లపాకంబును, అమ్లరసంబునుకలిగియుండును. మలాదులనుబంధించును. గురుగుణంబును, ఉష్ణవీర్యంబునై వాతమును హరించును. మేదస్సును, శుక్రమును, బలమును, శ్లేష్మమును, రక్తమును, పిత్తమును, అగ్నిని, శోఫము (నంజు)ను, కలిగించును. రుచిని పుట్టించును కావున అరోచకమున మిగులప్రశస్తమైనది. మరియు పడిసెమునందును, మూత్రకృచ్ఛ్రమునందును, హితకరముగనుండును. మిక్కిలితీపికలిగిన పెరుగు కఫమును వృద్ధి

నొందించును. మరియును పెరుగును రాత్రులయందు భుజింపరాదు. నిప్పు మొదలగు వానిచే వేడిపుట్టించి యుపయోగింపరాదు. వసంతఋతువునందును గ్రీష్మకాలమునను శరదృతువునందును ఉపయోగింపరాదు. మరియు పెసలపప్పు, తేనె, నెయ్యి, చక్కెర, ఉసిరికకాయలపిండి అను నీవస్తువులతో నొకదానితోఁగూర్చి యుపయోగించవలెను. కాని అటుగాక పెరుగుమాత్ర ముపయోగింపరాదు. మరియు ప్రతిదినమును విడువక యుపయోగించినచో రోగములఁ గలిగించును కావున ఒకానొకసమయమున నుపయోగించవలెనుగాని విడువక ప్రతిదినంబును ఉపయోగింపరాదు. మరియు (పాలయందు తోడును) బెట్టినపిదప పేరకయుండు నడిమియవస్థ యందు పెరుగును భుజింపరాదు. (పేరి పేరక యుండు పెరుగు నుపయోగించునెడ నందలి స్నేహము స్రోతస్సులయందు సంక్రమించి త్రిదోషముల బ్రకోపింపజేయును). పైజెప్పినయమము ననుసరింపక యిచ్చవచ్చినట్లు పెరుగు నుపయోగించినచో జ్వరము, రక్తపిత్తము, విసర్పము, కుష్ఠము, పాండురోగము, భ్రమము, మున్నగు ననేకరోగముల బుట్టించును.

మూ. దధ్నస్సారస్తు విష్టమ్భి రూక్షణం గ్రాహి వా తలమ్,
దీపనీయం లఘుతరం సకషాయం రుచిప్రదమ్. 324

వ్యా. పెరుగుయొక్కసారము పిండితీసినపిప్పి మలమును బంధించును. రూక్షగుణమును (శరీరమునందలి స్నేహము లేకుండుటను) కలిగించును. మలాదులను ద్రవము లేకుండునట్లుచేయును. వాతమును వృద్ధినందించును. చులకనై జఠరాగ్నిని దీపింపజేయును. కషాయరసము గలిగి రుచిని బుట్టించును.

దధిమస్తుగుణము

మూ. వాతఘ్నం కఫకృద్రూక్షం బృంహణం బలవర్ధనమ్,
కుర్యాద్భుక్తాభిలాషం చ దధిమస్తుపరిస్రుతమ్. 325

వ్యా. పెరుగునుండి తీయబడిన తేటనీరు వాతమును హరించును. కఫమును వృద్ధి నొందించును. శరీరమును బలియజేసి బలమును వృద్ధినొందించును. అన్నమును భుజించుటయం దభిలాష పుట్టించును.

దధిసారగుణము

మూ. దధ్నస్సారో గురుర్వృష్యః వాతఘ్నః కఫపిత్తలమ్,
రసస్తు వాతకఫహా కణ్ఠస్రోతో విశోధనః. 326

వ్యా. పెరుగుయొక్కసారము (చిక్కని పెరుగు) గురుత్వముకలిగి వృష్యమై వాతమును హరించును. కఫపిత్తముల వృద్ధినందించును. పెరుగుయొక్కరసము (పెరుగు నీరు లేకనే చిలికినది) వాతకఫముల హరించును. కంఠనాళమును శుభ్రపరచును.

### గేదె, మేక, గొఱియ వీనిపెరుగు గుణము

మూ. మాహిషం దధివిష్టమ్భి గురూష్ణం వాతకృత్పరమ్,
దధ్యాజం కఫవాతఘ్నం లఘుగుల్మక్షయాపహమ్. 322
దుర్నామశ్వాసకాసేషు హితమగ్నేశ్చ దీపనమ్,
కోపనం కఫవాతానాం దుర్నామ్నాం ఆవికం దధి. 32౩
రసే పాకే చ మధురం అత్యభిష్యన్ది దోషలమ్,

వ్యా. గేదెలపెరుగు మలమును బాధించును. గురుత్వంబును ఉష్ణవీర్యంబును కలిగి వాతమును వృద్ధినొందించును. మేకపెరుగు కఫవాతముల హరించును. చుల్కనై శీఘ్రముగ జీర్ణమగును. గుల్మమును క్షయమును పోగొట్టును. దుర్నామ మను రోగమును శ్వాస కాసములను హరించును. గాన అట్టిరోగములయందు మిక్కిలి పథ్యమై యుండును. జఠరాగ్నిని దీపింపజేసి యాకలి బుట్టించును. గొఱియలపెరుగు కఫవాతములను దుర్నామ రోగమును ప్రకోపింపజేయును. రసమునందును విపాకమునందును మధురమై యుండును. స్రోతస్సులను విశేషముగ స్రవింపజేయును. రోగముల బుట్టించును.

### మజ్జిగ సామాన్యగుణము

మూ. తక్రం లఘు కషాయామ్లం దీపనం కఫవాతజిత్. 32౯
శోథోదరార్శో గ్రహణీదోషమూత్రగ్రహారుచిః.
ప్లీహగుల్మఘృతవ్యాపత్ గరపాణ్డ్వామయాఞ్జయేత్. 3౩౦

వ్యా. మజ్జిగ (సగపాలు నీళ్లు కలిపినది) తేలిక కలిగి శీఘ్రముగ జీర్ణమగును. కొంచెము వగరును పులుపును కలిగియుండును. జాఠరాగ్నిని దీపింపజేయును. కఫవాతముల హరించును. శోఫము, ఉదరము, అర్శోరోగము, గ్రహణిదోషము, మూత్రబంధము, అరోచకము, ప్లీహవృద్ధి, గుల్మము, అధికముగ నెయ్యిద్రాగుటచే గలిగినవ్యాపత్తు, విషము, పాండురోగము అను నీవ్యాధులను శమింపజేయును.

### మజ్జిగభేదములు

మూ. నిర్జలం మథితం గోళం, పాదాంశజలమిశ్రితమ్
ఉదశ్విత్, అర్ధసలిలం తక్రం, త్ర్యంశజలాన్వితమ్, 3౩౧
క్రమేణ లాఘవం తత్స్యాత్ రూక్షం తక్రం త్రిదోషజిత్,

వ్యా. పెరుగున నీళ్లు కొంచెమైన కలపక పెరుగునుమాత్రము కవ్వముతో చిలికి చేయబడినమజ్జిగ గోళ మనబడును. పెరుగుకు నాల్గవపాలు నీళ్లుకలిపి కవ్వముతో చిలక బడినమజ్జిగ ఉదశ్విత మనబడును. సగపాలు నీళ్లుకలిపి పెరుగును చిలికి చేయబడిమజ్జిగ

తక్ర మనబడును. పెరుగున మూడుపాళ్లు నీళ్లుకలిపి చిలికి చేయబడినమజ్జిగ (కాలశేయ మనబడును). పైజెప్పబడినవానిలో నొకదానికన్న నొకటి లాఘవము కలిగియుండును. అందును కడపట జెప్పబడిన తక్రము లఘుతరమై త్రిదోషముల హరించును.

**తక్రవిశేషగుణములు**

మూ. రూక్షతీక్ష్ణోష్ణకట్వమ్లకషాయగ్రాహిదీపనమ్. ३౹౨
ఛర్దిప్రమేహార్శ్వయథుభగన్దరగరోదరమ్,
కామిలాం కఫవాతౌ చ జాతం తక్రం వ్యపోహతి. ३౹३
మన్దజాతం భవేత్తక్రం రూక్షభిష్యన్ది దుర్జరమ్,
అతిజాతం భృశామ్లోష్ణం తృష్ణాపిత్తవివర్ధనమ్. ३౹४
తక్రం గ్రాహికషాయామ్లమమ్లమేవ తు భేదనమ్,
తక్రమామం కఫం కోష్ఠం హన్తి కణ్ఠే కరోతి చ. ३౹५

వ్యా. పైజెప్పినప్రకారము సాధారణముగ (జిడ్డులేక) చేయబడినమజ్జిగ రూక్ష-తీక్ష్ణ-ఉష్ణగుణములును, కటు-ఆమ్ల-కషాయరసంబులును కలిగియుండును. అయ్యది మలమును బంధించి అగ్నిని దీపింపజేయును. వమనము, ప్రమేహము, వాపు, భగందరము, విషము, ఉదరరోగము, కామిల. కఫవాతములు వీనినన్నింటిని హరించును. వెన్న పూర్తిగ వెడలకుండునట్లు చిలకబడినమజ్జిగ మందజాత మనబడును. ఇయ్యది రూక్షగుణముకలిగి స్రోతస్సుల స్రవింపజేయును. కష్టముచే చాలకాలమునకు జీర్ణమగును. జిడ్డు కొంచెమైన లేక చిలకబడినమజ్జిగ అతిజాత మనబడును. ఇయ్యది మిక్కిలి పులుపుకలిగి యుష్ణమై యుండును. దప్పిని పిత్తమును వృద్ధినొందించును. మరియు వగరును పులుపును కలమజ్జిగ మలమును బంధించును. కేవలము పులుపుమాత్రము కలిగినమజ్జిగ మలమును భేదించి ప్రవర్తింపజేయును. మరియు పచ్చిమజ్జిగ కోష్ఠమునం గలకఫమును హరించును. కంఠమున కఫమును కలిగించును.

**మజ్జిగ నుపయోగింపం దగనిసమయములు**

మూ. నైవ తక్రం క్షతే దద్యాత్ నోష్ణకాలే న దుర్బలే,
న మూర్ఛాభ్రమదాహేషు న రోగే రక్తపైత్తకే(పిత్తజే). ३౹६

వ్యా. గాయములు కలిగినప్పుడును, ఉష్ణకాలమునందును, శరీరములో బలముతగ్గియున్నప్పుడును, మూర్ఛారోగమునందును, భ్రమమునందును, తాపమునందును రక్తపిత్త రోగమునందును తక్రమనుమజ్జిగ నుపయోగింపజనదు.

మరియు మజ్జిగను ముఖ్యముగ నుపయోగింపందగినకాలమును సుశ్రుతాచార్యు డిట్లుపదేశించెను:—"శీతకాలేఽగ్నిమాన్ద్యేచ కఫోత్థేష్వామయేషుచ, మార్గే విరోధే దుష్టేచ

వాయౌ తక్రం ప్రశస్యతే" (మంచుకాలమునందును, కాయాగ్నిమందగించియుండు నపుడును, కఫముచే జనించినరోగములయందును, కంఠనాళము మున్నగు స్రోతోమార్గములు వ్యత్యస్తములుగ నుండునపుడును, వాతముప్రకోపించినపుడును మజ్జిగ నుపయోగించుట మిక్కిలి ప్రశస్తము.)

వాత - పిత్త - కఫముల ప్రకోపమున మజ్జిగ నుపయోగించువిధము

మూ. వాతేఽమ్లం సైన్ధవోపేతం పిత్తే స్వాదు సశర్కరమ్,
కఫే తక్రం పిబేచ్చాపి వ్యోషక్షారసమన్వితమ్. 382

వ్యా. మరియు వాతము ప్రకుపితమైనయపుడు పులిసినమజ్జిగను సైంధవలవణమును గూర్చి యుపయోగింపనగును. పిత్తము ప్రకోపమునందినపుడు తీపిగలమజ్జిగను పంచదార గలిపి యుపయోగింపదగును. కఫము ప్రకోపించినపుడు త్రికటుకములచూర్ణమును ఉప్పును మజ్జిగతో కలిపి అట్టిమజ్జిగ నుపయోగించవలెను.

మజ్జిగకు సంబంధించిన మరికొన్నిగుణములు

మూ. ఈషదమ్లం తు తద్వృష్యం వ్యక్తామ్లం దీపనం పరమ్,
పీనసశ్వాసకాసాదౌ సిద్ధమేష ప్రశస్యతే. 383
సర్వథా దోషజిత్తక్రం గ్రహణ్యాం; దోషకృద్వ్రణే,
గ్రహణీదోషిణాం తక్రం దీపనం గ్రాహిలాఘవాత్. 384
పథ్యం మధురపాకిత్వాత్ న చ పిత్తప్రకోపనమ్,
కషాయోష్ణ్యాత్ వికాసిత్వాత్ రౌక్ష్యాచ్చైవ కఫే హితమ్.
వాతే స్వాద్వమ్లసాన్ద్రత్వాత్ పథ్యం ధాతువిదాహి తత్,
దధ్నాభిమన్థనాద్ధధ్నః గురుణశ్చాతిశోధనాత్. 385
అనుద్ధృతస్నేహముఖాత్ దధ్నాద్యోషావహం లఘు,
శస్యతే మాహిషం తక్రం కామిలాపాణ్డురోగయోః. 386
తక్రం త్వజావిప్రభవం దుష్టగన్ధం త్రిదోషలమ్,

వ్యా. కొంచెము పుల్లగనుండుమజ్జిగ వృష్యము (శుక్రవృద్ధికరము)గ నుండును. మిక్కిలి పులుపుకలిగినమజ్జిగ జఠరాగ్నిని మిక్కిలి దీపింపజేయును. పీనసరోగము, శ్వాసము, కాసము మున్నగువ్యాధులయందు కాచబడినదాని నుపయోగించుట ప్రశస్తము. గ్రహణిరోగమునందు మజ్జిగ నుపయోగించినచో ననేకవిధముల దోషహారముగ నుండును. వ్రణములయందు మజ్జిగ నుపయోగించినచో ననేకదోషముల గల్గించును. మరియు మజ్జిగ ద్రవమును శోషింపజేయును కావున గ్రహణిరోగముకలవారికి మలమును బంధించి

విరేచనముల నిలుపును. జఠరాగ్నిని దీపింపజేసి ఆకలి బుట్టించును. అయ్యది మధురముగ విపాకము జెందును. కావున పిత్తహరమై పథ్యముగ నుండును. మఱియు మజ్జిగయందు కషాయ (వగరు) రసంబును, ఉష్ణవీర్యంబును వికాసిగుణంబును, రూక్షగుణంబును కలిగి యుండుటంజేసి అయ్యది కఫహరమగును; కావున దానిని కఫరోగములయందు విశేషముగ నుపయోగింపవగును. మధుర, అమ్లరసంబులును, సాంద్రగుణంబు గలిగియుండుటంబట్టి వాత రోగమున మిక్కిలి హితకరము, రసాదిధాతువులను కృశింపజేయును. మఱియు పెరుగును కవ్వముచే చిలికినయెడ దానియందలి గురుత్వగుణము హరించును. చిలికి పెరుగునందలి వెన్నదీయకుండుమజ్జిగకన్న వెన్నదీసినది మిక్కిలి చుల్కనై యుండును. నేతిమజ్జిగ కామిలారోగమునందును పాండురోగమునందును మిక్కిలి ప్రశస్తమైయుండును. మేకల మజ్జిగయు, గొఱ్ఱెయలమజ్జిగయు, పెద్దవాసనగలమజ్జిగయు వాతాదిదోషముల మూఁడిటిని వృద్ధినొందించును కావున ఉపయోగింపఁజనదు.

—— వెన్న (నూతనముగ దీయఁబడినది) గుణము ——

మూ. నవనీతం నవం వృష్యం శీతం వర్ణబలాగ్నికృత్. 3౼3
సఙ్గ్రాహి వాతపిత్తాసృక్ క్షయార్శోఽర్దితకాసజిత్,
చక్షుష్యం బాలవృద్ధానాం ప్రశస్తం సౌకుమార్యకృత్. 3౼౪
శోఫే చోరః క్షతే శ్రేష్ఠం కఫమేదో విలాయనమ్,

వ్యా. పెరుగునుండి చిలికి తత్కాలమున దీయఁబడినవెన్న సంభోగశక్తిని వృద్ధి నొందించును. శీతవీర్యమై శరీరబలమును కాంతిని జాఠరాగ్నిని వృద్ధినొందించును. మల ముల వెడలనీయక నిరోధించును. వాతపిత్తములను రక్తక్షయమును అర్శోరోగము అర్దిత వాతము అను నీరోగములను హరించును. కన్నులకు మిక్కిలి హితకరము. బాలురకును వృద్ధులకును మిక్కిలి ప్రశస్తము. శరీరసౌకుమార్యమును గలిగించును. శోఫమునందును ఉరఃక్షతమునందును హితకరము. కఫమును మేదస్సును కరగించును.

—— ప్రాతవెన్న పాలలోనివెన్నలగుణములు ——

మూ. గుర్వభిష్యన్ది చక్షుష్యం నవనీతం చరోద్ధృతమ్. 3౼౫
సక్షారకటుకామ్లత్వాత్ ఛర్ద్యర్శః కుష్ఠకారి చ,
క్షీరోద్భవంతు సంగ్రాహి రక్తపిత్తాక్షిరోగజిత్. 3౼౬

వ్యా. చిరకాలమునుండి చేర్చియుంచినవెన్నగురుత్వముకలిగించును. స్రోతస్సుల నుండి ద్రవము స్రవింపజేయును. కన్నులకు హితకరము. కొంచెము క్షారంబును కటురసం బును పులుపును కలిగియుండుటంజేసి వాంతిని అర్శోరోగమును కుష్ఠమును కలిగించును.

పాలనుండి తీయబడిన వెన్న మలమును బంధించును. రక్తపిత్తమును నేత్రరోగమును హరించును.

### నేతిగుణము

మూ. శస్తం ధీస్మృతిమేధాగ్నిబలాయుశ్శుక్రచక్షుషామ్,
బాలవృద్ధప్రజాకాంతిసౌకుమార్యస్వరార్థినామ్. ౩౯౭
క్షతక్షీణపరీసర్పశస్త్రాగ్నిగ్లపితాత్మనామ్,
వాతపిత్తవిషోన్మాదశోషాలక్ష్మీజ్వరాపహమ్. ౩౯౮
స్నేహానాముత్తమం శీతం వయసః స్థాపనం ఘృతమ్,
సహస్రవీర్యం విధిభిః ఘృతం కర్మసహస్రకృత్. ౩౯౯

వ్యా. నెయ్యి బుద్ధి, జ్ఞాపకశక్తి, మేధ(ధారణాశక్తి), జాఠరాగ్ని, శరీరబలము, ఆయువు, శుక్రము, నేత్రములు, వీనికి మిక్కిలి హితమును జేయును. మరియు బాలురకును, ముసలివారికిని సంతతిని కాంతిని సౌకుమార్యమును కంఠస్వరమును కోరువారికిని, ఉరఃక్షతము ధాతుక్షయము విసర్పము శస్త్రములు అగ్ని అనువానిచే బాధింపబడినవారికిని మిక్కిలి హితకరము. మరియు వాతము, పిత్తము, విషము, ఉన్మాదము, శోషము, అలక్ష్మి, జ్వరము అను నీవ్యాధుల హరించును. స్నేహద్రవ్యములలో మిక్కిలి శ్రేష్ఠమైనవి. శీతవీర్యము కలిగి వయస్సును చెడనీయక స్థిరముగ నుండజేయును. మరియు నెయ్యి వస్త్వంతర సంబంధము సంస్కారవిశేషము మున్నగువానిచే రూపాంతరమునొంది అనేకగుణములు కలిగి అనేకకార్యములజేయు శక్తి స్వాభావికముగ గలిగియుండును.

### *ఘృతమండగుణము

మూ. తద్వచ్ఛ ఘృతమణ్డోఽపి రూక్షసూక్ష్మస్తనుస్సరః,

వ్యా. ఘృతమండము నేతియొక్కగుణములు కలిగియుండును. మరియు రూక్షసూక్ష్మగుణములుకలిగి తేలికయై శరీరధాతువులయందు శీఘ్రముగ వ్యాపించును.

### ప్రాతనేతిగుణములు

మూ. మదాపస్మారమూర్ఛాయశిరఃకర్ణాక్షియోనిజాన్. ౪౦౦
పురాణం జయతి వ్యాధీన్ వ్రణశోధనరోపణమ్,

వ్యా. మిగుల ప్రాతబడిన నెయ్యి మదము, అపస్మారము, మూర్ఛ, శిరోరోగము, కర్ణరోగము, నేత్రరోగము, యోనిలోబుట్టిన నానావిధరోగములు వీనిని పోగొట్టును. వ్రణములయందలి పూయాదులను శుభ్రముచేసి మాన్పును.

---

* నేతిమీగడకు తేలునట్టి నూనెవంటి తేట.

## పురాణఘృతభేదములు; వానిగుణములు

మూ. షష్ఠవర్షాత్ప్రభృతిషు జీర్ణమిత్యభిధీయతే. ౪౦౧
దశవర్షస్థితం సర్పిః లాక్షారససమం హిమమ్,
మేధ్యం విరేచనేష్వగ్ర్యం కాంభం వర్షశతం భవేత్. ౪౦౨
కేవలం సమృశంధాతాత్ గ్రహఘ్నం సర్వదోషజిత్,

వ్యా. ఆరుసంవత్సరములకు మించినకాలమువరకు నుంచబడిననెయ్యి జీర్ణమని చెప్పబడును. పదిసంవత్సరములకాలము ఉంచబడిననెయ్యి లక్కవంటిరంగుకలిగి శీతవీర్యమై యుండును. ఇయ్యది మేధాశక్తిని కలిగించును. విరేచనఔషధములలో మిగుల ప్రశస్తమైనవి. నూరుసంవత్సరములకాలము కుండలోబోసి భూమిలో పాతిపెట్టబడిననెయ్యి కాంభ మనబడును. ఇయ్యది శతధౌతఘృతమునకు సమానముగ పనిచేయును. నానావిధ గ్రహములను హరించును. నానావిధరోగములను జయించును.

## కిలాటరుచకాదిగుణములు

మూ. బల్యాః కిలాటాః రుచకాః తక్రఖాణ్డవమోరటాః. ౪౦౩
సక్షీరశాకపీయూషా రోచనా వహ్నిసాదనాః,
శుక్రనిద్రాకఫకరాః విష్టమ్భిగురుదోషలాః. ౪౦౪

వ్యా. *కిలాటములు, రుచకములు, తక్రఖాండము, మోరటము, క్షీరశాకము, పీయూషము ఇవియన్నియు రుచిని బుట్టించును. జాఠరాగ్నిని మందగింపజేయును. శుక్రమును, నిద్రను కఫమును కల్గించును. మలమును బంధించును. గురుత్వము గల్గించును. త్రిదోషములను వృద్ధినొందించును. మిక్కిలి బలమును కల్గించును.

## పెరుగు నెయ్యి మున్నగువాని సామాన్యగుణభేదములు

మూ. విద్యాద్దధిఘృతాదీనాం గుణదోషాన్ యథా పయః,
గవ్యే క్షీరఘృతే శ్రేష్ఠే సన్నితే చాజిసమ్భవే. ౪౦౫

వ్యా. ఆవు, గేదె, మేక మున్నగునాయాజంతువులపాలకు ప్రత్యేకముగ జెప్పబడినగుణదోషములు ఆయాజంతువులపాలచే సిద్ధమైన పెరుగు నెయ్యి మున్నగువానికిని

---

* పైనివివరించినవన్నియు పాలతోను పెరుగుతోను మజ్జిగతోను చేయబడిన భక్ష్యవిశేషములును వ్యంజనవిశేషములును నైయున్నవి. కిలాటములు = జున్నుబూరెలు. రుచకములు = పాలపూరీలు. తక్రఖాండవము = మోరు (చల్ల)పులుసు. మోరటము = రాయితా. (పెరుగుకూర) క్షీరశాకము = కూట్టుకూర. పీయూషము = దూదుపేడా అని యూహింపబడుచున్నవి.

కల్గియుండును. మరియు ఆవుయొక్కపాలును నెయ్యియు మిక్కిలి శ్రేష్ఠము. గొఱియల పాలును, నెయ్యియు మిక్కిలి నింద్యములు.

ఇది క్షీరవర్గము.

అథ ఇక్షువర్గః—

అవతారిక:—చెరకురసము క్షీరమునకు సమానములగుగుణాదుల గల్గియుండును కావున క్షీరవర్గమును జెప్పినపిదప ఇక్షువర్గము చెప్పఁబడును:—

మూ. ఇక్షోరసో గురుస్స్నిగ్ధః బృంహణః కఫమూత్రకృత్,
వృష్యశ్శీతః పవనజిత్ భుక్తేవాతప్రకోపనః. ౪౦౬
రక్తపిత్తప్రశమనః స్వాదుపాకరసస్సరః,
సోఽగ్రే సలవణో దన్తపీడితశ్శర్కరాసమః. ౪౦౭
మూలాగ్రజం తుజగ్ధా పీడనాన్మలసఙ్కరాత్,
కిఞ్చిత్కాలం విధృత్యా చ విక్రుతా యాతి యాన్త్రికః. ౪౦౮
విదాహిగురువిష్టంభి తేనాసౌ.............

వ్యా. చెరకురసము గురువుగను, స్నిగ్ధముగ నుండును. శరీరమును బలియజేయును. కఫమును మూత్రమును శుక్రమును వృద్ధినొందించును. శీతవీర్యము కల్గియుండును. వాతమును హరించును. చెరకును పండ్లతో నమలి రసమును భుజించిన వాతమును ప్రకోపింపజేయును. రక్తపిత్తమును హరించును. మధురమైనవిపాకంబును రసంబును గల్గియుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. చెరకుయొక్క కొనయందలిరసము కొంచెము ఉప్పగ నుండును. పండ్లచే నమలితీయబడిన చెరకురసము చక్కెరతో సమానమైనగుణము కల్గియుండును. యంత్రముచే దీయబడినరసములో వేరుకొనపురుగుపట్టిన చెరకుసంబంధము గల్గియుండుటచేతను, మురికిచేరియుండుటచేతను కొంచెముకాలము విలంబనమున జనించుటచేతను ఆరసము వికారమును చెందును. కావున యంత్ర(గానుగ) సాధనమునుండి తీయబడినచెరకురసము విదాహగుణము కల్గియుండును. (జాఠరాగ్నిసంబంధముచే విపాకమునొంది పిత్తమును వృద్ధినొందించి చిరకాలమునకును జీర్ణముగాకుండునని భావము.) అట్టి కారణములచే నియ్యది మలమును బంధించును.

మరియు చెరకుకు స్థానభేదముచే మాధుర్యాదిభేదము సుశ్రుతమున నీరీతిచెప్పబడినది:—"అతీవ మధురో మూలే మధ్యే మధుర ఏవ చ, అగ్రే త్వక్షిషు విజ్ఞేయః ఇక్షూణాం లవణోరసః" (చెరకు సామాన్యముగా క్రిందిభాగమునందు మిగుల మధురరసంబును, మధ్యభాగమున సామాన్యముగ మధురరసంబును, కొనయందును గణుపులయందును ఉప్పని రసంబును కల్గియుండును.)

### ఫాణితము, దానిగుణము

మూ. ..................సతుపాకతః. ౭౦౯

త్యక్త్వా ద్రవత్వమప్రాప్తం ఘనతాం చాపిఫాణితమ్,
సతూంగుర్వభిష్యన్దియక్నన్మూత్రశోధనమ్. ౭౧౦

వ్యా. అట్టిచెరకురసము పాకభేదముచే కేవలము ద్రవము గాక మిక్కిలి ఘన భావము చెందకయుండిన నయ్యది ఫాణితము. అయ్యది కొంచెము క్షారముకల్గి గురుత్వముతో గూడియుండును. స్రోతస్సుల ద్రవింపజేయును. త్రిదోషములను వానివాని స్థానములయందు వృద్ధినొందించును. మూత్రమును శుద్ధముచేయును.

### బెల్లము సామాన్యగుణములు

మూ. నాతిశ్లేష్మకరో ధౌతః సృష్టమూత్రశకృద్గుడః.
ప్రభూతక్రిమిమజ్జాసృక్ మేదోమాంసకఫోపరః. ౭౧౧

వా. సంస్కారవిశేషముచే నిర్మలమైనబెల్లము కొంచెముగ కఫమును కల్గించును. మలమూత్రములను వెలుపలికి వెడలించును. సంస్కారములేమింజేసి మురికితో గూడియుండు బెల్లము క్రిములను, మజ్జను, రక్తమును, మేదస్సును, మాంసమును, కఫమును, వీని నన్నింటి నధికముగ జేయును.

### ప్రాతబెల్లము, క్రొత్తబెల్లము, వానిగుణములు

మూ. పథ్యః పురాణో హృద్యశ్చ నవశ్లేష్మాగ్నిసాదకృత్,

వ్యా. ప్రాతబెల్లము మిక్కిలి పథ్యకరంబును హృదయమునకు వాతకరంబు నగును. క్రొత్తబెల్లము కఫమును వృద్ధినొందించును. జాఠరాగ్నిని మందగింపజేయును.

### మత్స్యండికాదిగుణములు

మూ. వృష్యాః క్షతక్షీణహితాః రక్తపిత్తానిలాపహాః. ౭౧౨
మత్స్యణ్డికాఖణ్డసితాః క్రమేణ గుణవత్తమాః,

వ్యా. మత్స్యండిక (ముద్ద యగునట్లు కాచబడినచెరకుపాగు) ఖండశర్కర (కల్కండ), పంచదార, ఇవిమూడును శుక్రమును వృద్ధినొందించును. ఉరఃక్షతము నందును ధాతుక్షయమునందును మిక్కిలి వాతకరములు. రక్తపిత్తమును వాతమును హరించును. మరియు పైజెప్పిన మూడింటిలో నొకదానికన్న నొకటి వరుసగ గుణాధికముగ నుండును. (మత్స్యండికమునకన్న ఖండశర్కరయు, దానికన్న పంచదారయు గుణాధికముగ నుండు నని భావము)

### యావసశర్కరాగుణము

మూ. తద్గుణా తిక్తమధురా కషాయా యావశర్కరా. ౪౧౩

వ్యా. దురదగొండినుండి తీయబడినచక్కెర యావశర్కర యనబడును. ఇయ్యది తీపికలిగి కొంచెము వగరుతో గూడియుండును. చక్కెరకు సామాన్యముగ జెప్పబడిన గుణముల గలిగియుండును.

### అన్నిశర్కరలకును సామాన్యములగు గుణములు

మూ. దాహతృట్ ఛర్ది మూర్ఛాసృక్ పిత్తఘ్న్యస్సర్వశర్కరాః,

వ్యా. పలుతెఱంగులైన చక్కెరలన్నియు సామాన్యముగ తాపమును, దప్పిని, వాంతిని, మూర్ఛను, రక్తపిత్తమును హరించును.

మరియు చక్కెరయొక్క పరిస్థితినిబట్టి గుణములు మారుచుండునని గ్రంథాంతరమున నిట్లు చెప్పబడినది:—"యథా యథాఽఽసాం నైర్మల్యం మధురత్వం యథా యథా, స్నేహలాఘవశైత్యాది సారత్వం చ తథా తథా." (చక్కెర మొదలగువాని నిర్మలత్వంబును మాధుర్యంబును ఏరీతి గలుగునో ఆవిధముగ దాని దాని కనుగుణమై లఘుత్వంబును, శైత్యాదివిశేషంబులును, సారవత్త్వంబును చక్కెరల కన్నిటికిని కలిగియుండు నని భావము.)

### ఇప్పపువ్వుల చక్కెరగుణము

మూ. రూక్షంమధుకపుష్పోత్థంఫాణితంవాతపిత్తకృత్. ౪౧౪
కఫఘ్నం మధురం పాకే కషాయం వస్తిదూషణమ్,

వ్యా. ఇప్పపువ్వులచే గలిగిన ఫాణితమును శర్కరాభేదము వాతపిత్తములను కలిగించును. కఫమును హరించును. విపాకమున మధురమైయుండును. కషాయ (వగరు) రసము కలిగియుండును. వస్తిని చెరచును.

అథ మధువర్గః—

### తేనె సామాన్యగుణములు

మూ. చక్షుష్యంఛేదితృట్ శ్లేష్మవిషహిధ్మాస్రపిత్తనుత్. ౪౧౫
కుష్ఠమేహక్రిమిచ్ఛర్దిశ్వాసకాసాతిసారజిత్,
వ్రణశోధనసన్ధాన రూపణం వాతలం మధు. ౪౧౬
రూక్షంకషాయమధురంయోగవాహిహిమంగురు,
వృష్యంచ......................

వ్యా. తేనె నేత్రములకు మిక్కిలి హితకరమైనది. దానిని భక్షించినయెడల కోష్ఠమున నుండుమలము ఉండలుకట్టియున్నచో వానిని విడదీసి విభజించును. దప్పిని, కఫమును, విషమును, ఎక్కిళ్లను, రక్తపిత్తమును హరించును. కుష్ఠము, మేహము, క్రిమి

రోగము, వాంతి, శ్వాసకాసములు, అతిసారము, అను నీవ్యాధుల హరించును. వ్రణములను పరిశుద్ధముచేయును. వ్రణములయందలి చెడ్డనీరును వెడలించి శుభ్రపరచును. పలువిధములచీలి చీలియున్న వ్రణాదుల నొకటిగజేర్చి మాన్పును. వ్రణరోగములయందు వ్రణములపై లేపనాదులకు తేనె నుపయోగింపం జనుగాని త్రాగకూడదు. అటు త్రాగినచో వాతమును వృద్ధిజేయును. మరియు రూక్షగుణము కలిగియుండును. కషాయరసముతో గూడినమధురరసము కలిగియుండును. యోగవాహి (ఏవస్తువుతో తేనె చేర్పబడునో ఆవస్తువుయొక్కగుణముల గలిగియుండుననుట). శీతవీర్యంబును గురుత్వంబును కలిగియుండును. శుక్రమును వృద్ధినొందించును.

తేనె యెనిమిదివిధములు; అందు పౌష్పికభ్రామరగుణములు

మూ. ......అష్టవిధంతచ్చవిశేషాత్సవిషాన్వయాత్. ౪౧౭

రూక్షోష్ణంవాతపిత్తాసృఙ్మదకారివిదాహిచ,

పౌష్పికంఘృతవర్ణంచ; శ్వేతం తు భ్రామరం గురు. ౪౧౮

పైచ్ఛిల్యాద్వాతభూయస్త్వాత్ తత్త్వసర్వహితంద్వయమ్,

వ్యా. పైజెప్పబడినతేనె యెనిమిదివిధముల నుండును. పుష్పములనుండి పుట్టినతేనె పౌష్పికము. ఇయ్యది విషవస్తువులచే గలుగుటంజేసి రూక్ష-ఉష్ణగుణములుకలిగి వాత-పిత్త రక్తములను, మదము (మత్తు)ను కలిగించును. తాపమును బుట్టించును. ఈతేనె నేతి వర్ణము కలిగియుండును. తుమ్మెదలు చేర్చిపెట్టినతేనె భ్రామరము; ఇయ్యది తెల్లనిరంగు కలిగియుండును. గురుత్వమును జేయును. పైజెప్పిన పౌష్పిక-భ్రామరములను రెండువిధములైనతేనె పిచ్ఛిలంబును వాతభూయిష్ఠంబును నగుటంజేసి యందరకును వాతకరము కానోపదు.

ఛాత్రమను తేనెగుణము

వనేహైమవతేచ్ఛాత్రం ఛత్రాకారం హిమం గురు. ౪౧౯

శ్విత్రమేహక్రిమిశ్లేష్మపిత్తఘ్నంస్వాదుపాకిచ,

వ్యా. హిమవంతముననుండు అడవులలో ఛాత్రమనుతేనె పుట్టును. ఇది గొడుగువలె నుండుతెట్టెలో బుట్టుటంజేసి ఛాత్ర మనబడును. ఇయ్యది శీతవీర్యంబును గురుత్వంబును గలిగియుండును. శ్విత్రము, ప్రమేహము, క్రిమిరోగము, శ్లేష్మము, పిత్తము, అనువానిని హరించును. మధురముగ విపాకము చెందును.

అర్ఘ్యమను తేనెగుణము

మూ. మధూకపుష్పనిర్యాసోజరత్కారాశ్రమోద్భవమ్. ౪౨౦

అక్ష్యంరుధ్యతిచక్షుష్యం పిత్తశ్లేష్మనిబర్హణమ్,
కషాయంకటుకంపాకేబలంతిక్తమవాతలమ్. ౪౨౧

వ్యా. జరత్కారములను నీగెలమాశ్రమమునందలి యిప్పచెట్లపువ్వులనుండి స్రవించినది అర్ఘ్య మనుతేనె. ఇయ్యది తక్కిన తేనెలకన్న నావనాదిక్రియలచే నేత్రములకు మిక్కిలి హితకరమగును. పానముచే పిత్తకఫముల హరించును. కషాయరసంబును, కటువిపాకంబును, కొంచెము తిక్తరసంబునుకల్గి బలకరమై యుండును. వాతమును కొద్దిగ కల్గించును.

## ఔద్దాలకాదిమధుగుణములు

మూ. ఔద్దాలకన్తు వాల్మీకం జ్వరకుష్ఠవిషాపహమ్,
రుచ్యముష్ణం కషాయామ్లం పిత్తకృత్కటుకాపి చ. ౪౨౨
పత్రోపరిస్థితం దాళం మధురామ్లం కషాయకమ్,
క్షౌద్రం కపిలవర్ణం స్యాత్ లేఖనం లఘుశీతలమ్. ౪౨౩
తస్మాల్లఘుతరం రూక్షం శ్వాసాదిషు పరంహితమ్,
మాక్షికం తైలవర్ణంచ మధువన్మధుశర్కరా. ౪౨౪

వ్యా. పుట్టలో పుట్టిన తేనె ఔద్దాలక మనబడును. ఇయ్యది జ్వరమును, కుష్ఠమును, విషమును హరించును. రుచిని బుట్టించును. ఉష్ణవీర్యంబును, కషాయ-అమ్లరసంబులును కల్గి పిత్తమును వృద్ధినొందించును. ఆకులపై నుండు తేనె దాళ మనం దగును. ఇయ్యది మధుర-అమ్ల-కషాయరసములు కల్గియుండును. క్షౌద్ర మను తేనె కషాయరసము కపిలవర్ణముగ నుండును. ఇయ్యది మలాదులలేఖనము చేయును. మిక్కిలి చుల్కనై శీతవీర్యముగ నుండును. నూనెవంటి రంగుకల్గినది మాక్షిక మను తేనె, ఇయ్యది క్షౌద్రమునకన్న మిక్కిలి చుల్కనై రూక్షంబును, శ్వాసకాసాదిరోగములయందు మిక్కిలి హితకరంబునై యుండును. పైజెప్పిన తేనెలలో దేనివలన నే చక్కెరపుట్టునో ఆచక్కెరకు దానిపుట్టుకకు కారణమగు తేనెకు జెప్పినగుణములు కల్గియుండును.

## నూతన-పురాణమధుగుణములు

మూ. బృంహణీయం మధునవం నాతిశ్లేష్మకరం సరమ్,
మేదస్థౌల్యాపహం గ్రాహి పురాణ మతిలేఖనమ్. ౪౨౫

వ్యా. క్రొత్తనైనతేనె శరీరమును పుష్టి నొందించును. కొంచెముగ కఫమును వృద్ధి చేయును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. మేదస్సును, శరీరముయొక్క స్థూలత్వ

మును పోగొట్టునది ప్రాతతేనె, మలాదుల వెడలనీయక బాధించును. అట్టిమలాదులను మిక్కిలి లేఖనము జేయును.

### పక్వ-ఆమమధుగుణములు

మూ. దోషత్రయహరం పక్వం ఆమం త్వమ్లం త్రిదోషకృత్.
సభక్తం బృంహణం ప్రోక్తం అభక్తం త్వపకర్షణమ్. ౪౨౬
ఉష్ణముష్ణార్తముష్ణేన యుక్తం చోష్ణైర్హన్తి తత్,

వ్యా. పక్వమైన తేనె మూడుదోషముల హరించును. పచ్చితేనె పులుపుకల్గి త్రిదోషములను హరించును. అట్టితేనెను భుజించినపిమ్మట నుపయోగించినచో శరీరపుష్టి జేయును. భుజించకమునుపు ఉపయోగించినయెడ శరీరస్థూలతను తగ్గించును. మరియు తేనెను వేడిగ కాచి యుపయోగించినను, లేక ఉష్ణప్రధానములగువ్యాధ్యాదులచే పీడింపబడినవాని కుపయోగించినను, లేక ఉష్ణముగనుండు దేశకాలాదులయం దుపయోగించినను, లేక ఉష్ణముగనుండు ఆహారాదిపదార్థములతోఁగూర్చి యుపయోగించినను అట్టివారిని తప్పక చంపును. (కావున పైజెప్పినరీతిగ నుపయోగింపఁజనదనుట).

మూ. ప్రచ్ఛర్దనే నిరూహే చ మధూష్ణం న నివార్యతే. ౪౨౭
అలబ్ధపాకమేవాశు తయోర్యస్మాన్నివర్తతే,
మధ్వాః పురాణాన్మధురః తీక్ష్ణో రూక్షో లఘుస్తనుః. ౪౨౮
నివృత్తిశ్చ నిరూహేషు విషమేదః కఫాపహా,
శర్కరేక్షువికారాణాం ఫాణితం చ వరావరే. ౪౨౯

వ్యా. ఉష్ణముగనుండు తేనె వమనమునకును, నిరూహవస్తికిని ఉపయోగించినచో అట్టితేనె పాకముజెందకయే బైట వెడలును కావున పైజెప్పినరెంటియందును నిషిద్ధము కాదు. (వేడితేనెనుపయోగించినచో నయ్యది జీర్ణమగునంతకాలము శరీరమున నుండినచో నయ్యది పైజెప్పినరీతిగ చెరుపుచేయును. వమననిరూహవస్తువులయందు తేనె జీర్ణముకాక ముందే బైటవెడలును. కావున వేడితేనె నుపయోగించినచో చెరుపులేదని భావము). మరియు తేనెమీఁదిమండము ప్రాతతేనెకంటె తీక్ష్ణంబును, రూక్షంబును, లఘువు నైయుండును. ఇయ్యది నిరూహవస్తి కుపయోగింపఁ జనదు. విషదోషమును, మేదస్సును, కఫమును హరించును. మరియు చెరకురసముచే నేర్పడుబెల్లము మొదలగువానిలోఁ చక్కెర మిగుల శ్రేష్ఠమైనది. ఫాణితము నికృష్టమైనది.

ఇది తేనెవర్గము.

అథ తైలవర్గః—

మూ. తైలం స్వయోనివత్తత్రముఖ్యం తీక్ష్ణం వ్యవాయిచ,

త్వగ్దోషకృదచక్షుష్యం సూక్ష్మోష్ణం శఫకృన్నచ. ౪౩౦

వ్యా. పలువిధములైననూనెలును ఆయానూనెకు కారణమైనవస్తువుయొక్కగుణములు ప్రధానముగ కల్గియుండును. (ఏవస్తువునుండి యేనూనె పుట్టునో ఆనూనెకు ఆవస్తువుయొక్కగుణములు గల్గియుండును) అట్టినూనెలలో నువ్వులనూనె ముఖ్యమైనది. ఇయ్యది తీక్ష్ణముగ నుండును. శరీరమునం దంతట వ్యాపించుస్వభావము కలిగినది. వ్యవాయి (అనగా శరీరమున తొలుత వ్యాపించి పిమ్మట జీర్ణమగుస్వభావము కలిగిన దనుట.) దీనిని విడువక పానముజేసినచో చర్మమును చెరచును. కన్నులకు హితకరముకాదు. శరీరమునందలి సూక్ష్మములగుస్రోతస్సులలో వ్యాపించుస్వభావము కలిగినది. ఉష్ణమైన వీర్యము కలిగినది. కఫమును కలిగించదు.

తైలవిశేషగుణము

మూ. కృశానాం బృంహణాయాలం స్థూలానాం కర్శనాయ చ.
బద్ధవిట్కం కృమిఘ్నం చ సంస్కారాత్సర్వదోషజిత్. ౪౩౧

వ్యా. పైజెప్పినతైలమును ఆయాకార్యములంగూర్చి సంస్కారమునుజేసినచో నయ్యది కృశించిన శరీరముకలవారికి పుష్టిని కలిగించును. మేదోవృద్ధిచే స్థూలమైనశరీరము కలవారిని కృశత నొందించును. ఈరెండుకృత్యములయందును సమర్థముగ నుండును. మలము అధికముగ వెడలుచున్నయెడ దానిని బంధించును. కృములను హరించును.

ఇచ్చట నీవిమర్శనము తెలియునది:—ఒకవస్తువు పరస్పరవిరుద్ధములగు రెండుపనుల జేయనోపదు. ఇది యనుభవసిద్ధము. ఇట్లుండ తైలము కృశించినవారిని బలియజేయు ననియు, బలిసినవారిని కృశించునట్లుచేయుననియు ననుట యెట్లు సంగతము? బలుపు, కృశత, అను నీరెండును తేజస్తిమిరంబులంబోలె నొకటికొకటి విరుద్ధములు. అట్టి విరుద్ధగుణములను తైలము ఎట్లు కలిగింపనోపును? అను నాశంక కల్గును. దాని కీసమాధానము తెలియునది:—కృశించినశరీరముకలవారికి శరీరమునందలి స్రోతోమార్గములు మిగుల సంకోచమునొందియుండును. దానంజేసి బృంహణద్రవ్యములు నిరాఘాటముగ లోపల ప్రవేశింప సమర్థములు కాకయుండును. అట్టియెడ తైలము తనయందలి తీక్ష్ణాదిగుణములచే స్రోతస్సులయందు వేగముగ ప్రవేశించి తనశక్తినిజూపుచు శుద్ధిచేయును. అట్టి తైలమును బృంహణములగుద్రవ్యములగూర్చి సంస్కరించి యుపయోగించినచో నట్టి యౌషధములగుణమును శరీరమున శీఘ్రముగ వ్యాపింపజేయును. దానివలన శరీరము పుష్టినొందును. సంతోషము బలము కాంతి మొదలగుగుణాదులును క్రమముగ కల్గును. ఈవిషయమునే "స్రోతస్సు తత్రశుద్ధేషు రసోధాతూనుపైతియః, తేనతుష్టిః బలంవర్ణః పరంపుష్టిశ్చ జాయతే" అనువాక్యముచే తంత్రాన్తరమునజెప్పిరి. ఇట్లేతెలియునది స్థూలశరీ

రమఃకలవారికి సూక్ష్మములగుస్రోతోమార్గము లన్నిటియందును తైలము శీఘ్రముగ ప్రవేశించి తనయందలి తీక్ష్ణోష్ణాదిగుణము మేదస్సును క్షీణింపజేసి స్థూలమగుశరీరమును కృశింపజేయును. కావున నైజెప్పినమూలము సమంజసము. ఇట్టి పరస్పరవిరుద్ధగుణముల గలిగించుశక్తి తైలమునకు ప్రభావమునంజేసి కల్గునని యెఱుంగునది. మరియుం నీతైలమును ఆయాదోషమును.

ఆముదపుగుణము

మూ. సతిక్తోషణమేరణ్డం తైలం స్వాదుసరం గురు,
వర్త్మగుల్మానిలకఫా౯ ఉదరం విషమజ్వరమ్. ४३१
రుక్శోఫౌచకటీగుహ్యకోష్ఠపృష్ఠాశ్రయా౯ జయేత్,
తీక్ష్ణోష్ణం పిచ్ఛిలం విస్రం రక్తైరణ్డోద్భవం త్వతి. ४३३

వ్యా. ఆముదము కొంచెముగ చేదును కారమును తీపిని కలిగియుండును. శరీరము నం దతిశీఘ్రముగ వ్యాపించును. నూనెకంటె భారము కలిగి చిరకాలమునకు జీర్ణ మగును. వర్త్మరోగమును, గుల్మరోగమును, వాతకఫములను, మహోదరమును, విషమజ్వరములను హరించును. మరియు నడుమునందును, గుహ్యస్థలమునను, కోష్ఠమునందును, వీపునందును కలిగిననొప్పిని వాపును హరించును. ఎఱ్ఱనియాముదములనుండి తీయబడినయాముదము మిక్కిలి తీక్ష్ణంబును ఉష్ణంబును పిచ్ఛిలంబును నై దుర్గంధము కలిగియుండును.

అగసినూనె - కుసుమనూనె వీనిగుణములు

మూ. ఉమాకుసుమ్భజం చోష్ణం త్వగ్దోషకఫపిత్తకృత్,

వ్యా. అగసివిత్తులనూనెయు, కుసుమలనూనెయు మిక్కిలి యుష్ణవీర్యములు. చర్మమును చెరచును, కఫపిత్తముల వృద్ధినొందించును.

నేపాళపుగింజలు మున్నగువాని నూనెగుణములు

మూ. దన్తమూలకరక్షోఘ్నకరఞ్జారిష్టశిగ్రుజమ్. ४३४
సువర్చలేఙ్గుదీపీలు శఙ్ఖినీనీపసమ్భవమ్,
సరళాగురుదేవాహ్వాశింశుపాసారజన్మ చ. ४३५
తువరారుష్కరోత్థం చ తీక్ష్ణం కట్వుష్ణపిత్తకృత్,
అర్శః కుష్ఠకృమిశ్లేష్మశుక్రమేదోఽనిలాపహమ్. ४३६
భృశోష్ణతీక్ష్ణకటుకేతువరారుష్కరోద్భవే,
విశేషాత్కృమికుష్ఠఘ్నే తథోర్ధ్వాఽధోవిరేచనే. ४३७

కిరణ్జునిమ్బజే తిక్తే నాత్యుష్ణే చ వినిర్దిశేత్,
కషాయతిక్తకటుకం (సారళం) వ్రణశోధనమ్. ౪౩౮
కటూష్ణం సార్షపం తీక్ష్ణం కఫశుక్రానిలాపహమ్,
అతో౽తిముక్తజాతిశోటనారికేళమధూకజమ్. ౪౩౯
త్రపుసైర్వారుకూశ్మాణ్డశ్లేష్మాతకపియాళజమ్,
వాతపిత్తహరం కేశ్యం(వృష్యం) శ్లేష్మలం గురుశీతలమ్. ౪౪౦
అక్షం స్వాదు హిమం కేశ్యాం గురుపిత్తానిలాపహమ్,
పిత్తశ్లేష్మప్రశమనం శ్రీపర్ణి కింశుకోద్భవమ్. ౪౪౧
తిలతైలం వరం తేషు కౌసుమ్భమవరం పరమ్,

వ్యా. దంతివిత్తులు, ముల్లంగివిత్తులు, ఆవాలు, కానుగవిత్తులు, మునగవిత్తులు, వేపగింజలు సువర్చల (ప్రొద్దుతిరుగుచెట్టు) గింజలు, గారకాయవిత్తులు, గోగువిత్తులు, గంటెనవిత్తులు, కడిమిగింజలు, సరళీదేవదారుగింజలు, అగరు, చేవ, దేవదారు, ఇరుగుడు, సంబరేణు, నీరుడు గింజలు, నల్లజీడిగింజలు పైజెప్పినవానినుండి తీయబడిననూనె తీక్ష్ణంబును, కటు-ఆమ్లరసంబును కలిగి పిత్తమును వృద్ధినొందించును. అర్శోరోగము, కుష్ఠములు, క్రిమిరోగము, కఫము, శుక్రరోగము, మేదోరోగము, వాతము వీనినన్నిటిని పోగొట్టును. అందు నీరుడుగింజల తైలంబును, నల్లజీడిగింజలతైలంబును, తక్కినవానికంటె మిక్కిలి తీక్ష్ణంబులును, కారము కలిగినవియు, ఉష్ణవీర్యంబులు నగును. విశేషముగ కృములను కుష్ఠములను హరించు నవియు. ఊర్ధ్వాధోమార్గములయందు వమనవిరేచనముల జేయునవియు నగును.

మరియు కానుగగింజలనూనెయు వేపనూనెయు చేదుకలిగి కొంచెము ఉష్ణము కల్గును. సరళదేవదారునూనె కషాయతిక్తకటురసంబులుకలిగి వ్రణములను శుభ్రము జేయును. ఆవనూనె కటురసంబును ఉష్ణవీర్యంబును తీక్ష్ణగుణంబునుకలిగి కఫమును శుక్ర దోషమును వాతమును హరించును.

మరియు తాండ్రగింజలనూనెయు, పాదిరిగింజలనూనెయు, ఊడుగుగింజలనూనెయు, కొబ్బరినూనెయు, ఇప్పనూనెయు, ములుదోసగింజలనూనెయు, నక్కదోసగింజలనూనెయు, పెద్దగుమ్మడిగింజలనూనెయు, విరిగిగింజలనూనెయు, మొరళిగింజలనూనెయు, ఇవియన్నియు వాతపిత్తముల హరించును. వెండ్రుకలకు మిక్కిలి హితకరములు. కఫమును వృద్ధి నొందించును. గురుత్వమును కలిగించును. శీతవీర్యము కలిగియుండును. అందు తాని విత్తులనూనె మధురరసంబును, శీతవీర్యంబును, వెండ్రుకలకు హితకరంబును, గురుత్వము కలిగినదియు, పిత్తవాతముల హరించునదియు నగును. మరియు గుమ్మడిగింజలనూనెయు,

మోదుగగింజలనూనెయు పిత్తకఫముల హరించును. పైజెప్పబడిన తైలభేదములలో నువ్వుల నూనె మిక్కిలి ప్రశస్తము. కుసుమగింజలనూనె మిక్కిలి యధమము.

వసామజ్జలగుణములు

మూ. వసా మజ్జా తు వాతఘ్నౌ బలపిత్తకఫప్రదౌ. ౪౪౨
మాంసానుగస్వరూపా చ విద్యాన్మేదోఽపితావివ,

వ్యా. స్నేహద్రవ్యములలో చేరినవసయు మజ్జయు వాతమును హరించును. శరీర బలమును, పిత్తమును, కఫమును వృద్ధినొందించును. మరియు పైజెప్పినవసామజ్జలు రెండును యేజంతువుమాంసమువలన పుట్టునో అట్టి మాంసమునకు జెప్పినగుణములు కలిగియుండును. మరియు మేదస్సుకూడ పైజెప్పినవిధముగ గుణాదులను గలిగియుండును.

వసాభేదములలో తారతమ్యము

మూ. శాలూకీ సౌకరీ బాకీ హాంసజా కుక్కుటోద్భవా. ౪౪౩
వసా శ్రేష్ఠా స్వవర్గేషు కుంభీరమహిషోద్భవా,
కాకమద్గువసా తద్వత్ కారణ్డోత్థా చ నిన్దితా. ౪౪౪
శాఖాదమేదసాం భాగం హాస్తినం చ వరావరమ్,

వ్యా. కప్ప, పంది, కొంగ, హంస, కోడి, అను నీజంతువులమాంసమున పుట్టిన వస, తక్కినజంతువులవసకంటె మిక్కిలి శ్రేష్ఠము. మరియు కారుమొసలి, ఎనుబోతు, కాకి, నీరుకోడి, కారండవము (నీరుకాకి), అను నీజంతువులవస మిక్కిలి నిందితము.

మరియు ఆకులమేసెడిజంతువులమేదస్సులలో మేకపోతుమేదస్సు మిక్కిలి శ్రేష్ఠము; ఏనుగులమేదస్సు మిక్కిలి నిందితము.

ఇది తైలవర్గము.

మద్యవర్గః—

మూ. దీపనం రోచనం మద్యం తీక్ష్ణోష్ణం తుష్టిపుష్టిదమ్. ౪౪౫
సస్వాదుతిక్తకటుకం అమ్లపాకరసం సరమ్,
సకషాయం స్వరారోగ్యప్రతిభావర్ణకృల్లఘు. ౪౪౬
నష్టనిద్రాఽతినిద్రేభ్యో హితం పిత్తాస్రదూషణమ్,
కృశస్థూలహితం రూక్షం సూక్ష్మం స్రోతోవిశోధనమ్.
వాతశ్లేష్మహరం యుక్త్యా పీతం విషవదన్యథా. ౪౪౭

వ్యా. పలువిధంగులైనమద్యములును జాఠరాగ్నిని దీపింపజేయును. రుచిని బుట్టించును. తీక్ష్ణంబును ఉష్ణంబును నగుగుణములను గలిగియుండును. సంతసమును పుష్టిని గలి

గించును. తీపియు చేదును కారమును గలిగి, ప్రధానముగ పులుపును అమ్లవిపాకమును కలిగియుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలిగియుండును. కొంచెముగ వగరుకలిగినవి కంఠస్వరమును, శరీరారోగ్యమును, బుద్ధివికాసమును, శరీరకాంతిని కలిగించును. తేలికగ జీర్ణమగును. నిదురబట్టనివారికిని, అధికముగ నిదురవచ్చువారికిని మిక్కిలి హితకరము. రక్తమును పిత్తమును చెరచును. కృశించినవారికిని, స్థూలశరీరులకును హితకరము. రూక్షముగ నుండును. సూక్ష్మగుణంబుచే స్రోతోమార్గములయం దతిశీఘ్రముగ వ్యాపించును. అట్టిస్రోతస్సులను శుభ్రపరచును. వాతకఫములను హరించును. అట్టి మద్యమునకు శాస్త్రమునందు జెప్పినపద్ధతిప్రకారము తగినపరిమాణముతో సేవించిన పైజెప్పిన మంచిగుణములగలిగించును. అటుగాక తన కిచ్చవచ్చినట్లు విధినియమములులేక యుపయోగించినచో విషమునుబోలె ప్రాణములను తప్పక హింసించును.

క్రొత్త-ప్రాతమద్యములగుణములు

మూ. గురుతద్దోషజననం నవం జీర్ణమతోఽన్యథా,

వ్యా. అట్టిమద్యము క్రొత్తదిగనున్నచో గురువుగ (చిరకాలమునకు జీర్ణమగునదిగ) నుండును. వాతపిత్తశ్లేష్మముల మూడిటిని వృద్ధినొందించును. ప్రాతమద్యము నవీనమునకంటె చుల్కనగ జీర్ణమగును. త్రిదోషములహరించును.

ఇచ్చట ఒకసంవత్సరకాలమునకు లోననుండుమద్యము నవీనమనియు, అంతకన్న మునుపు చేర్చబడినది నవీన మనియు కొందరాచార్యులు వ్యవస్థచేసిరి.

మద్యపానమునందు నిషిద్ధోపచారములు

మూ. పేయం నోష్ణోపచారేణ న విరక్తక్షుధాతురైః. ౪౪౨
నాత్యర్థతీక్ష్ణమృద్వల్పసంభారం కలుషం న చ,
(నాతితీక్ష్ణమృదుస్పర్శఘనం వ్యాపన్న మేవ వా)

వ్యా. పైజెప్పబడినమద్యమును ఉష్ణములగు నాహారవిహారాద్యుపచారముల జేసికొనుచు నుపయోగింపంజనదు. విరేచనములైనప్పుడును, మిక్కిలి యాకలిగొన్నసమయమునను, మద్యము నుపయోగింపందగదు. (అట్టిసమయములయందు వాతాదిదోషములు సమస్థితి నుండక విషమగతి నుండును కావున మద్యము నుపయోగింపందగదనుట.) మరియు మిక్కిలి తీక్ష్ణములుగ నుండుమద్యములను, మిక్కిలి మృదువులుగ నుండుమద్యములను ఆయామద్యముల కుండవలసినపరిమితికంటె తక్కువయైనపరిమాణముగల మద్యములను ఉపయోగింపంజనదు.

సురామద్యగుణము

మూ. గుల్మోదరార్శో గ్రహణీశోషహృత్స్నేహనీ గురుః, ౪౪౩

సురాఽనిలఘ్నీ మేదోఽసృక్స్తన్యమూత్రకఫావహా,

వ్యా॥ సుర యనుమద్యము గుల్మము, ఉదరరోగము, అర్శోరోగము, గ్రహణి రోగము, శోఫ వీనినన్నిటిని హరించును. శరీరమును జిడ్డుగల్గునట్లుచేయును. గురుత్వము గల్గియుండును. వాతమును హరించును. మేదస్సును చనుబాలను మూత్రమును కఫమును వృద్ధినొందించును.

## వారుణీమద్యగుణము, జగలాదిగుణములు

మూ॥ తద్గుణా వారుణీ హృద్యా లఘుతీక్ష్ణా నిహన్తి చ. ౨౫౦
శూలకాసవమిశ్వాసవిబన్ధాధ్మానపీనసాన్,
(శూలప్రవాహికాశోఫతృష్ణాకుష్ఠార్శసాం హితా,)
జగలః పాచనో గ్రాహీ రూక్షస్తద్వచ్చ మేదకః. ౨౫౧
పక్వసోహృతసారత్వాత్ విష్టమ్భీ దోషకోపనః,

వ్యా॥ వారుణి యనుమద్యము పైజెప్పినసురామద్యముతో సమానమైనగుణము కలిగినది. హృదయమునకు హితకరమైనది. లఘుతీక్ష్ణగుణంబులు కలిగియుండును. శూల, కాసము, వమనము, శ్వాసము, మలబంధము, కడుపుబ్బరము, పీనసము (పడిసెము), వీనిని నివర్తింపజేయును. (శూల, ప్రవాహికము, శోఫము, దప్పి, కుష్ఠము, అర్శస్సు, అను నీరోగములయందు పథ్యకరము.)

జగలము (వారుణీమద్యములో నధోభాగమున ఘనముగ నుండుమెడ్డు) ఆహారమును జీర్ణింపజేయును. వెడలుచుండుమలమును గట్టిగజేయును. మేదకమును (జగలము యొక్క క్రిందిభాగమున నుండుమెడ్డు) జగలమునకు సమానమైనగుణము కలిగి యుండును. రూక్షముగ నుండును. పక్వసము (మద్యకల్కములో జలమును జేర్చి చేయ బడినది) సారము లేకుండుటంజేసి మలమును బంధించును. త్రిదోషములం గోపింప జేయును.

## తానికాయలమద్యము

మూ॥ నాతితీవ్రమదా లఘ్వీ పథ్యా వైభీతకీ సురా. ౨౫౨
వ్రణే పాణ్డ్వామయే కుష్ఠే చాత్యర్థం విరుధ్యతే,

వ్యా॥ తానికాయలచే చేయబడినమద్యము అతితీవ్రమైన మదమును గలిగింపదు. పథ్యకరము, లఘుగుణము కలిగినది. వ్రణము, పాండురోగము, కుష్ఠము, ఈవ్యాధుల యందును ఇతరమద్యములవలె మిగుల నిషిద్ధమైనదికాదు.

## యవసురాదిమద్యగుణములు

మూ॥ విష్టమ్భినీ యవసురా గుర్వీ రూక్షా త్రిదోషలా. ౨౫౩

కోహాలీ బృంహణీ గుర్వీ శ్లేష్మలస్తు మధూదకః,

వ్యా॰ యవసుర యనుమద్యము మలమును బంధించును. గురుత్వము కలిగియుండును. రూక్షగుణముకలిగి త్రిదోషముల వృద్ధినొందించును. కోహాళి యనుమద్యము పుష్టిని కలిగించును. గురుత్వమును జేయును. మధువనుమద్యము కఫమునువృద్ధినొందించును.

అరిష్టమద్యగుణము

మూ॰ యథా ద్రవ్యగుణోఽరిష్టః సర్వమద్యగుణైరధికః. ౧౫౪
గ్రహణీపాణ్డుకుష్ఠార్శశ్శోఫశోషోదరజ్వరాన్,
హన్తి గుల్మక్రిమిప్లీహ్నః కషాయః కటువాతలః. ౧౫౫

వ్యా॰ అరిష్టమనుమద్యము ఆయామద్యమున కుత్పత్తికి ప్రధానకారణమైన ద్రవ్యమునొక్కగుణము కలిగియుండును. ఈయరిష్టమద్యము తక్కినమద్యములకంటె నధికములగు గుణములు కలిగియుండును. మరియు గ్రహణిరోగము, పాండురోగము, కుష్ఠరోగము, అర్శోరోగము, శోఫ, శోష, ఉదరరోగము, జ్వరము, గుల్మము, క్రిమిరోగము, ప్లీహావృద్ధి అను నీరోగముల హరించును. కషాయకటురసముల గలిగి వాతమును హరించును.

మార్ద్వీకమద్యగుణము

మూ॰ మార్ద్వీకం లేఖనంహృద్యం నాత్యుష్ణం మధురం సరమ్. ౧౫౬
అల్పపిత్తానిలం పాణ్డుమేహార్శః క్రిమినాశనః,

వ్యా॰ ద్రాక్షనుండి తీయబడినమద్యము మార్ద్వీకము. ఇయ్యది తనయందలి మిక్కిలి తీక్ష్ణమైనగుణముచేత ధాతువులను శోధించును. హృదయమునకు హితకరమైనది. మిక్కుటముగ నుష్ణమునుచేయదు. (స్వల్పముగ చేయు ననుట). మధురముగ నుండును. శరీరమునందలి ధాతువులలో శీఘ్రముగ వ్యాపించును. ఇతరమద్యములకంటె స్వల్పముగ పిత్తవాతములను చేయును. పాండువు, క్రిమి అను నీరోగముల హరించును.

ఖార్జూరాదిమద్యగుణములు

మూ॰ అస్మాదల్పాన్తరగుణం ఖార్జూరం వాతలం గురు. ౧౫౭
శార్కరస్సురభిస్స్వాదుః హృద్యో నాతిమదో లఘుః,
సృష్టమూత్రశకృద్వాతో గౌడస్తర్పణదీపనః. ౧౫౮
వాతపిత్తకరశ్శీధుః స్నేహశ్లేష్మవికారహా,

వ్యా॰ ఖర్జూరమద్యము ద్రాక్షమద్యమునకంటె స్వల్పములగు గుణములు కలిగియుండును. వాతమునుమాత్రము వృద్ధినొందించును. చక్కెరతో సంబంధించినమద్యము

మంచి పరిమళము కలిగియుండును. మధురముగ నుండును. హృదయమునకు మేలుచేయును. కొంచెముగ మదమును కలిగించును. తేలికగ జీర్ణమగును.

బిల్లముతో సిద్ధముచేయబడినమద్యము మూత్రమును మలమును వాతమును వీనిని బైట వెడలించును. ఇంద్రియాదులకు తృప్తిని కలిగించును. అగ్నిని దీపింపజేయును. శీధు వనుమద్యము వాతపిత్తముల వృద్ధినొందించును. స్నేహపానవ్యత్యాసమున గలిగినయుప ద్రవములను, కఫరోగములను హరించును.

పక్వరసాదిమద్యగుణము

మూ. మేదశ్శోఫోదరార్శోఘ్నః తత్ర పక్వరసో వరః, ౪౫౯
ఛేద మధ్వాసవః తీక్ష్ణః మేహపీనసకాసజిత్,
సురాసవస్తీ ప్రమదః స్వాదుతీక్ష్ణోఽనిలాపహః. ౪౬౦
మైరేయో మధురో వృష్యః స్వాదుస్సన్తర్పణో గురుః,

వ్యా. (శీధురసము అనుమద్యము పక్వరసము, అపక్వరసము నని రెండుతెఱంగులు. అందు కాచబడినచెరకురసముచే గలిగినది పక్వరసము, చెఱకురసమును కాచక పచ్చిగనే సిద్ధముచేయబడినది అపక్వరసము, అందు) అపక్వరస మను శీధుమద్యము మేదస్సును, శోఫను, ఉదరమును, అర్శస్సును హరించును. ఇయ్యది మిగుల శ్రేష్ఠము.

(తేనెచే సిద్ధముచేయబడినమద్యము మాధవ మనబడును) ఇయ్యది శరీరమున గట్టి పడి మలాదుల విడదీయును. మిక్కిలి తీక్ష్ణగుణము కలిగియుండును. ప్రమేహమును, పీన సమును, కాసమును హరించును.

(సురయనుమద్యములో తేనెజేర్చి సిద్ధముజేయబడినది సురాసవము) ఆయ్యది తీవ్రమైనమదమును గలిగించును. తీపి కలిగి తీక్ష్ణముగ నుండును. వాతమును హరించును.

మైరేయమనుమద్యము మధురంబును, వృష్యంబును, ఇంద్రియాదుల దృప్తినొం దించునదియు, గురుత్వము కలిగించునదియు నగును.

మూ. ధాతక్యభిషుతో జీర్ణః రూక్షో రోచనదీపనః. ౪౬౧
ద్రాక్షాసవో మధుసమః పరమం స తు దీపనః,
మాధ్వీకసదృశః ప్రోక్తః మృద్వీకేక్షురసాసవః. ౪౬౨
సమాసాద్బాసవో హృద్యః వాతళః స్యాపథానుగః,
ద్రాక్షేక్షుమాక్షికం శాలీరుత్తమా ప్రీహిపఙ్క్తిమాః. ౪౬౩
*మద్యకారా యవేలోన్నయావన్మదతి రూపకమ్,
గుణైర్యథోల్బణంవిద్యాన్మద్యమాకారసఙ్కరాత్. ౪౬౪

* ఈగుర్తుగలశ్లోకము సరిగా నర్థము నిచ్చుటలేదు. కాబట్టి వ్యాఖ్యానకారులు వివరింపలేదు.

వ్యా. ఆరెపువ్వుతో సిద్ధముచేయబడినమద్యము (ఆసవము) ప్రాతదియైనచో రూక్షణంబును, రుచిని బుట్టించునదియు, అగ్నిని దీపింపజేయునదియు నగును. ద్రాక్షా మద్యము (ద్రాక్షపండ్లతో సిద్ధముచేయబడినయాసవము) మధుమద్యముతో సమానమై యుండును. ఇయ్యది మిక్కిలి దీపనముగ నుండును. మరియు ద్రాక్షపండ్లచే సిద్ధమైనయాసవంబును, చెఱకురసముచే సిద్ధమైనయాసవంబును మాధ్వీకమద్యముతో సమానగుణములుగ నుండును. మఱియు ఆసవములు ఏయేద్రవ్యములనుండి సిద్ధముచేయబడునో ఆయాద్రవ్యములకు జెప్పినగుణములు ప్రధానములుగగలిగి, హృదయమునకు హితకరంబులును, వాతమును వృద్ధినొందించునవియు నగును. ఇది సామాన్యముగ నాసవముల కన్నిటికి నియతము.

మరియు ద్రాక్షపండ్లు, చెఱకురసము, పేనె, శాలిధాన్యము, వ్రీహిధాన్యము, అను నీయైదిటిచే సిద్ధములగుమద్యములు మిక్కిలి యుత్తమములు.

## శుక్త (పులిసినకల్లు) గుణము

మూ. రక్తపిత్తకఫోత్క్లేదీ శుక్తం వాతానులోమనమ్,
భృశోష్ణతీక్ష్ణరూక్షామ్లం* హృద్యం రుచికరం సరమ్. ౨౬౫
దీపనంశిశిరస్పర్శంపాణ్డుదృక్క్రిమినాశనమ్,

వ్యా. శుక్తము (పులిసినకల్లు) రక్తపిత్తమును కఫమును బోగొట్టును. ప్రతిలోమముగ సంచరించువాతమును అనులోమగతిగ జేయును. మిక్కిలి ఉష్ణంబును, తీక్ష్ణంబును, రూక్షంబును, ఆమ్ల (పులుపు) రసంబును నగును. హృదయమునకు హితకరమగును. రుచిని పుట్టించును. రసాదిధాతువులయందు శీఘ్రముగ వ్యాపించును. జాఠరాగ్నిని దీపింపజేయును. చల్లనైనస్పర్శము కలిగియుండును. పాండురోగము, నేత్రరోగములు, క్రిములు, వీనిని హరింపజేయును.

## గుడాదిశుక్తతారతమ్యము

మూ. గుడేక్షుమధ్యమార్ద్వీకశుక్తం లఘు యథోత్తరమ్. ౨౬౬

వ్యా. గుడ (బెల్లముచే సిద్ధమైన) శుక్తము, ఇక్షు (చెరకురసముచే సిద్ధమైన) శుక్తము, మద్య (మద్యముచేనైన) శుక్తము, ద్రాక్ష (ద్రాక్షపండ్లచే సిద్ధమైన) శుక్తము అను నీనాల్గుశుక్తభేదములలో నొకదానికంటె నొకటి లఘువుగ నుండును.

* విధాహిభృశతీక్ష్ణోష్ణమ్.

## ఆసుతలక్షణము

మూ. కన్దమూలఫలాద్యం చ తద్వద్విద్యాత్తదాసుతమ్,

వ్యా. గడ్డలు, వేళ్లు, పండ్లు మొదలగువానినిజేర్చి సిద్ధముచేయబడినగుడశుక్తము మున్నగు పైజెప్పినశుక్తములును ఆసుతము లనబడును. ఇవి పైజెప్పినవిధముగనే వరుసగ నొకదానికంటెనొకటి లఘుతరముగ నుండును. (అధికశక్తికలగుడాదిశుక్తములు కందమూలాదులగుణముల నాకర్షించి యాకందమూలాదులకు తనస్వరూపమునే కలుగజేయు నని భావము.)

## శాండాకిగుణము

మూ. శాణ్డాకి చాసుతం చాన్యత్ శౌ(కా)లామ్లం రోచనం లఘు.

వ్యా. (ముల్లంగి, ఆవకూర, ఈరెంటిసిచేర్చి పక్వముచేసి నల్లజీలకఱ్ఱ, నల్లావాలు, వీనిచే భావనచేసినది శాండాకి యనబడును.) అట్టిశాండాకియు, కాలవిశేషమునంజేసి పులిసినశుక్తంబును రుచిని కల్గించును. తేలికగ జీర్ణమగును.

## ధాన్యామ్లగుణము

మూ. ధాన్యామ్లం భేది తీక్ష్ణోష్ణం పిత్తకృత్ స్పర్శశీతలమ్,
శ్రమక్లమహరం రుచ్యం దీపనం వస్తిశూలనుత్. ౨౬౮
శస్తమాస్థాపనే హృద్యంలఘువాతకఫాపహమ్,

ధాన్యామ్లము (కలి) కఠినముగ నుండుమలమును భేదించును. తీక్ష్ణంబును, ఉష్ణవీర్యంబు నగును. పిత్తమును వృద్ధిజేయును. స్వాభావికముగ శీతస్పర్శము కలిగియుండును. వ్యాయామాదులచే నైనఆయాసమును, వ్యాయామాదికారణములేకయే కలిగినబడలికను పోగొట్టును; రుచిని బుట్టించును. అగ్నిని దీపింపజేయును. వస్తిలో కలిగినశూలను హరించును. ఆస్థాపనవస్తియందు మిగుల ప్రశస్తమైనది. హృదయమునకు మేలుచేయును. తేలికగ జీర్ణమగును. వాతకఫముల హరించును.

## సౌవీరక-తుషోదకగుణములు

మూ. ఏభిరేవ గుణైర్యుక్తే సౌవీరకతుషోదకే. ౨౬౯
క్రిమిహృద్రోగగుల్మార్శః పాణ్డుశోఫనిబర్హణే,
తే క్రమాత్ విద్విషైర్విద్యాత్ సతుషైశ్చ యవైః కృతః. ౨౭౦

వ్యా. పొట్టులేనియవలచే సిద్ధముచేయబడినకాంజికము సౌవీరకము, పొట్టుతో గూడినయవలచేత సిద్ధముచేయబడిన కాంజికము తుషోదకము ఈరెండును పైజెప్పినధాన్యామ్లగుణములు కలిగియుండును. మరియు క్రిమిరోగమును, హృద్రోగమును, గుల్మ

మును, అరోచకరోగమును, పాండురోగమును, శోఫమును పైజెప్పినసౌవీరకతుషోదకములు హరించును.

ఇది మద్యవర్గము.

మూత్రవర్గము, దానిసామాన్యగుణము

మూ. మూత్రం గో౽జావిమహిషీగజాశ్వోష్ట్రఖరోద్భవమ్,
పిత్తలం రూక్షతీక్ష్ణోష్ణం లవణానురసం కటు. ౪౭౧
క్రిమిశోఫోదరానాహ శూలపాణ్డుకఫానిలాన్,
గుల్మారుచివిషశ్విత్రకుష్ఠార్శాంసి జయేల్లఘు. ౪౭౨

వ్యా. ఆవు, మేక, గొఱ్ఱె, గేదె, ఏనుగు, గుఱ్ఱము, ఒంటె, గాడిదె, అను నీజంతువులమూత్రము పిత్తమును వృద్ధినొందించును. రూక్ష-తీక్ష్ణ-ఉష్ణగుణంబులును, లవణరసము అనురసముగగల కటురసంబును కలిగియుండును. క్రిమిరోగము, శోఫము, ఉదరము, కడుపుబ్బరము, శూల, పాండురోగము, కఫము, వాతము, గుల్మము, అరోచకము, విషము, శ్విత్రము, కుష్ఠము, అర్శోరోగము అను నీరోగముల నన్నిటిని హరించును. చుల్కనగా జీర్ణమగును.

గోమూత్రగుణము

మూ. దీపనం పాచనం భేది తేషు గోమూత్రముత్తమమ్,
విరేకాస్థాపనాలేపస్వేదాదిషు చ పూజితమ్. ౪౭౩

వ్యా. పైజెప్పినమూత్రవర్గములో గోమూత్రము మిక్కిలి యుత్తమము. ఇయ్యది అగ్నిని దీపింపజేయును. భుజింపబడిన యాహారపదార్థముల జీర్ణింపజేయును. గట్టిపడి యుండుమలాదుల భేదించును. విరేచనమునకును, ఆస్థాపనవస్తికిని, పట్టువేయుటకును, చెమటబుట్టించు స్వేదనకర్మమునకును ఇవిమున్నగు నితరచికిత్సలకును మిగుల ప్రశస్తముగ నుండును.

మేకపంచితము

మూ. కాసశ్వాసహరం ఛాగం కామలాపాణ్డుశోఫజిత్,
పూరణాత్కర్ణశూలఘ్నం కటుతిక్తమశీతలమ్. ౪౭౪

వ్యా. మేకపంచితము కాసశ్వాసముల హరించును. కామల, పాండురోగము, శోఫ, అనురోగముల హరించును. చెవిలో నిండించినయెడ చెవిపోటును పోగొట్టును. కటుతిక్తరసములు కలిగి శీతలము కాకయుండును.

గోఊతియలమూత్రగుణము

మూ. కాసప్లీహోదరశ్వాసశోషవర్చోగ్రహే హితమ్,
సతూరతిక్తకటుకముష్ణం వాతఘ్నమావికమ్. ౪౭౫

వ్యా. గోఊతియలమూత్రము కారము చేదు ఉప్పును కలిగి యుష్ణముగ నుండును. కాసము, ప్లీహము, ఉదరము, శ్వాసము, శోషము, మలబంధము అను నీరోగములయందు హితకరముగ నుండును. వాతమును హరించును.

గేదెలమూత్రగుణము

మూ. దుర్నామోదరశూలేషు కుష్ఠమేహావిశుద్ధిషు,
ఆనాహశోథగుల్మేషు హితం పాణ్డౌ చ మాహిషమ్. ౪౭౬

వ్యా. ఎనుములమూత్రము దుర్నామ మనువ్యాధియందును, ఉదరరోగమునందును, శూలరోగమునందును, కుష్ఠములయందును, ప్రమేహమునందును, శోధనచికిత్సయందును, కడుపుబ్బరమునందును, శోథమునందును, గుల్మవ్యాధియందును, పాండురోగమునందును మిక్కిలి హితకరముగ నుండును.

ఏనుగు మున్నగువాని మూత్రములగుణము

మూ. దద్యాత్ క్షయే కిలాసే చ గజవాజిసముద్భవమ్,
హన్త్యున్మాదమపస్మారః క్రిమీన్ కుష్ఠం చ రాసభమ్. ౪౭౭
గ్రహమేదోవికారఘ్నం తీక్ష్ణం గ్రహణిరోగనుత్,
దీపనం గార్దభం మూత్రం క్రిమివాతకఫాపహమ్. ౪౭౮
కషాయతిక్తమేతేషాం హిధ్మశ్వాసహరం శకృత్,

వ్యా. ఏనుగులమూత్రంబును గుఱ్ఱములమూత్రంబును, క్షయరోగమునందును, కిలాస (సిబ్బె) మునందును ఉపయోగింపంబడును. గాడిదలమూత్రము ఉన్మాదమును, అపస్మారమును, క్రిములను, కుష్ఠమును వీనినన్నిటిని హరించును. మరియు మలమూత్రాదిబంధమును, మేదోరోగమును హరించును. తీక్ష్ణముగ నుండును. గ్రహణిరోగమును హరించును. అగ్నిని దీపింపజేయును. వాతకఫములను హరించును. పైజెప్పినజంతువుల పురీషము కషాయతిక్తరసములు కలిగియుండును. ఎక్కిళ్లను శ్వాసమును హరించును.

పిత్తగుణము

మూ. పిత్తం తిక్తం విషహరం రోచనం కఫపిత్తజిత్. ౪౭౯

వ్యా. ఆవు మొదలగువానిపిత్తము (గోరోచనము మొదలగునవి) కొంచెము చేదుగ నుండును. విషమును హరించును. రుచిని బుట్టించును. కఫపిత్తముల హరించును.

### మనుష్యులమూత్రగుణము

మూ. తిక్తం పామాహరం మూత్రం మానుషం తు విషాపహమ్,

వ్యా. మనుజులమూత్రము కొంచెము చేదుగ నుండును. తీటను మాన్పును. విషమును హరించును.

### బంగరుగుణము

మూ. సువర్ణం బృంహణం స్నిగ్ధం మధురం రసపాకయోః
మేధ్యంవిషాపహం శీతం సకషాయం రసాయనమ్. ౪౮౦

వ్యా. బంగరు శరీరపుష్టిని కలిగించును. స్నిగ్ధముగ నుండును. రసమునందును విపాకమునందును మధురముగ నుండును. బుద్ధిని వృద్ధినొందించును. విషమును పోగొట్టును. శీతవీర్యంబును, రసాయనంబును నగును. [జర(ముదితనము)ను వ్యాధిని రానీయక ఆయువును వృద్ధిచేయునది రసాయనము.]

### వెండిగుణము

మూ. రూప్యం స్నిగ్ధం కషాయామ్లం విపాకే మధురం సరమ్,
వయసస్థాపనం శీతం లేఖనం వాతపిత్తజిత్. ౪౮౧

వ్యా. వెండి స్నిగ్ధంబును, కషాయ-అమ్లరసములు కలిగినదియును, మధురవిపాకంబునునై శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలిగియుండును. వయస్సును స్థిరముగ జేయును. శీతవీర్యముకలిగినది మలాదుల లేఖనముజేయును. వాతపిత్తముల జయించును.

### తామ్రగుణము

మూ. తామ్రం సతిక్తమధురకషాయం లేఖనం లఘు,
కటుపాకరసం శీతం రోపణం కఫపిత్తజిత్. ౪౮౨

వ్యా. తామ్రము (రాగి) చేదు తీపి వగరును కలిగియుండును. మలాదుల లేఖనముజేయును. లఘుగుణము కలిగియుండును. కటురసంబును కటువిపాకంబునుకలిగి శీతవీర్యమగును. వ్రణముల మాన్పును. కఫపిత్తముల హరించును.

### కాంస్యగుణము

మూ. కాంస్యం కషాయానురసం విశదం లేఖనం పరమ్,
దృష్టిప్రసాదనంరూక్షం తిక్తంపిత్తకఫాపహమ్. ౪౮౩

వ్యా. కంచు తిక్తరసము ప్రధానంబుగను, కషాయరసము అనురసంబుగను కలిగియుండును. మరియు విశదంబును లేఖనంబునునై దృష్టిని నిర్మలముగ జేయును. రూక్షంబుగ నుండును. పిత్తకఫముల హరించును.

### ఇత్తడిగుణము

మూ. రీతికా కటుతిక్తోష్ణా గుల్మప్లీహకఫాస్రజిత్,

వ్యా. ఇత్తడి కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగి గుల్మమును ప్లీహావృద్ధిని కఫమును రక్తమును జయించును.

### సీసగుణము

మూ. సతిక్తలవణం భేదిపాణ్డుత్వక్క్రిమివాతనుత్. ౪౮౪
సీసం లేఖనమత్యర్థం కషాయం గ్రాహి మేహజిత్,

వ్యా. సీసము తిక్తరసంబును లవణరసంబును కలిగియుండును. పాండురోగమును చర్మరోగమును క్రిమిరోగమును వాతమును హరించును. మలాదుల లేఖనము జేయును కషాయరసము మిక్కుటముగ కలిగియుండును. మలాదులను వెడలనీయక నిలుపును. విశేషముగ ప్రమేహముల హరించును.

### వంగగుణము

మూ. తద్వద్వఙ్గాహ్వయం తిక్తం సీసతుల్యగుణం సరమ్. ౪౮౫

వ్యా. వంగము సీసమునకు సమానగుణములు కలిగియుండును. చేదు కలిగి శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలిగియుండును.

### తీక్ష్ణలోహగుణము

మూ. చక్షుష్యం కృష్ణ(తీక్ష్ణ)లోహం తు కషాయం స్వాదు తిక్తకమ్,
లేఖనం వాతనుత్ శీతం క్రిమిపిత్తకఫప్రణుత్. ౪౮౬

వ్యా. కృష్ణలోహము (ఇనుము ఉక్కు) నేత్రములకు హితకరము. వగరు, తీపి, చేదు అను మూడురసములును కలిగియుండును. ధాతువులను లేఖనముచేయును. వాతమును హరించును. శీతవీర్యము కలిగినది. క్రిములను వాతపిత్తకఫములను హరించును.

### వర్త-కాంతలోహములగుణములు

మూ. వర్తలోహం త్రిదోషఘ్నం కట్వమ్లం నాతిశీతలమ్,
తీక్ష్ణాద్వరమయస్కాన్తం మేహపాణ్డ్వామయాపహమ్. ౪౮౭
వయస్స్థాపనం హృద్యం వృష్యం స్యాత్కుష్ఠకాసనుత్,

వ్యా. వర్తలోహము త్రిదోషముల హరించును. కటు అమ్లరసంబులు కలిగియుండును. కొంచెముగ శీతలమును కలిగించును. అయస్కాంతము తీక్ష్ణ (ఉక్కు) లోహమునకంటె మిక్కిలి శ్రేష్ఠముగనుండును. మేహరోగములను, పాండురోగములను, హరించును.

వయస్సు (యౌవనము)ను చెడనీయక నిలుపును. శుక్రమును వృద్ధినొందించును. హృదయ మునకు మిక్కిలి హితకరము. క్షయమును కాసమును హరించును.

లోహకిట్టగుణము

మూ. కిట్టం కటూష్ణం క్రిమినుత్ పురాణం పాణ్డుశోఫనుత్. ౪౮౭
క్షయాదిసర్వదోషఘ్నం సంస్కారాత్సర్వదోషనుత్,

వ్యా. కిట్టము (ఇనుపచిట్టెము) కటురసంబును ఉష్ణగుణంబును కలిగియుండును. క్రిములను హరించును. అయ్యది మిక్కిలి ప్రాతదియైనచో పాండువులను, శోఫమును, క్షయ మున్నగురోగములను హరించును. మరియు సంస్కారవిశేషముచేత నానావిధరోగ ములను హరించును.

ఇది లోహవర్గము.

మాణిక్యగుణములు

మూ. మాణిక్యం శిశిరం స్నిగ్ధం మృదుకాన్తికరం లఘు. ౪౮౮
దీపనం వృష్యమాయుష్యంమనోజ్ఞం గ్రహదోషనుత్,

వ్యా. మాణిక్యము శీతవీర్యంబును, స్నిగ్ధంబును, మృదుగుణంబునునై శరీరకాంతిని కలిగించును. తేలికగ జీర్ణమగును. అగ్నిని దీపింపజేయును. శుక్రమును వృద్ధినొందించును. ఆయువును వృద్ధినొందించును. మిక్కిలి మనోరంజకమై నానావిధగ్రహములదోషములను హరించును.

ముత్యములగుణము

మూ. ముక్తాఫలం హిమస్పర్శం తీక్ష్ణం చోష్ణం క్షయాపహమ్. ౪౮౦
దీపనం కఫశూలఘ్నం మనోజ్ఞం సర్వదోషనుత్,

వ్యా. ముత్యములు స్పర్శమున చల్లగ నుండును. తీక్ష్ణగుణంబును, ఉష్ణవీర్యం బునునై క్షయమును హరించును. అగ్నిని దీపింపజేయును. కఫమును శూలలను హరించును. మనస్సునకు మిక్కిలి రమ్యంబును త్రిదోషహరంబును నగును.

పవడపుష్పరాగములగుణము

మూ. ప్రవాళం కఫపిత్తఘ్నం రక్తపిత్తాతిసారజిత్. ౪౮౧
పుష్పరాగం పుష్టికరం శ్లేష్మలం గురుశీతలమ్,

వ్యా. పగడము కఫపిత్తములను, రక్తపిత్తమును అతిసారమును హరించును. పుష్ప రాగము శరీరేంద్రియములకు పుష్టిని కలిగించును. కఫమును వృద్ధినొందించును. గురుత్వ మును కలిగించును. శీతలమును కలిగించును.

తార్క్ష్యాదిమణిగుణములు

మూ. తార్క్ష్యం తుపిత్తలంకాంతం లఘుగ్రాహి త్రిదోషనుత్. ౭౨
నీలం శీతం గురు స్నిగ్ధం మధురం పిత్తనాశనమ్,
గోమేదకం కఫహరం లేఖనం వహ్నిదీపనమ్. ౭౩
వజ్రవైడూర్యకేస్నిగ్ధే సర్వాన్ రోగాన్ వ్యపోహతః,

వ్యా. తార్క్ష్యము(పచ్చ)పిత్తమును వృద్ధినొందించును. మనోహరమైనది. తేలికగ జీర్ణమగును. విరేచనముల నడ్డుపరచును. త్రిదోషముల హరించును. నీలమణి శీతవీర్యము. గురుత్వమును గల్గించును. స్నిగ్ధముగనుండును. మధురరసము కలిగినది. పిత్తమును శమింపజేయును. గోమేదకమణి కఫమును హరించును. ధాతువుల లేఖనముజేయును. అగ్నిని దీపింపజేయును. వజ్రము, వైడూర్యము, అను నీమణులు రెండును స్నిగ్ధములుగ నుండును. రోగముల నన్నిటిని పోనడచును.

రత్నసామాన్యగుణములు

మూ. సర్వాణి రత్నాని మనోహరాణి నిఘ్నన్తి సంయోగవశేన రోగాన్, నిహన్య్యేతాని సదాధృతాని గ్రహైశ్చజాతాస్సకలాశ్చ పీడాః. ౭౪

వ్యా. పైజెప్పినరత్నములన్నియు మిక్కిలి మనోహరములు, వీనిభస్మాదులను ఆయారోగముల కనుకూలములైన యౌషధములతోగూర్చి యుపయోగించినయెడ రోగముల నన్నిటిని హరించును. మరియు నీమణులను ఎల్లపుడును ధరించినయెడ క్రూరములగు మాతృకాదిగ్రహములచే గలిగిన నానావిధబాధలను నివర్తింపజేయును.

స్ఫటికగుణములు

మూ. స్ఫటికం శీతలం హృద్యం చక్షుష్యం వ్రణకుష్ఠనుత్,
సక్షారముష్ణవీర్యం చ కాచం దృష్టిత్వదఞ్జనాత్. ౭౫

వ్యా. స్ఫటికము శీతలముగ నుండును. హృదయమునకు హితకరము. నేత్రములకు హితమైనది. వ్రణములను కుష్ఠములను మాన్పును. క్షారరసముకలిగి యుష్ణవీర్యమై యుండును. దీనిని నేత్రముల కంజనముచేసినచో కాచరోగమును హరించి దృష్టికి బలము నిచ్చును.

శంఖ-సముద్రములగుణములు

మూ. శఙ్ఖోదధిమలౌ శీతౌ కషాయావతిలేఖనౌ,
తుత్థం సక్షారకటుకం కషాయం విశదం లఘు. ౭౬

లేఖనం ఛేదిచక్షుష్యం క్రిమికణ్డూవిషాపహమ్,

వ్యా. శంఖంబును, ఉదధిమలంబు (సముద్రపునురుగు)ను, శీతవీర్యములు. కషాయరసము కలిగియుండును. ఇవిరెండును మిక్కిలి లేఖనములు. తుత్థము (మైలతుత్తము) క్షారకటురసములు కలిగియుండును. కషాయరసము అనురసముగ నుండును. శీతలఘుగుణంబులను కలిగియుండును. ఇయ్యది ధాతువులను లేఖనముజేయును. మలాదుల ఛేదించును. నేత్రములకు హితకరము. క్రిములను దురదను విషమును హరించును.

**రసకగుణములు**

మూ. రసకో రఞ్జకో రూక్షః శ్లేష్మఘ్నో వాతకృద్ధిమః. ౯౭
విశదో గైరికస్నిగ్ధః కషాయమధురో హిమః,
చక్షుష్యో రక్తపిత్తఘ్నశ్ఛర్దిహిక్కావిషాపహః. ౯౮

వ్యా. రసక మనునది రక్తవర్ణమును కలిగించును. రూక్షంబై యుండును. కఫమును హరించును. వాతమును వృద్ధినొందించును. శీతవీర్యముకలిగినది. గైరికము (కావిరాయి) విశదంబును స్నిగ్ధంబును, కషాయమధురరసములుకలిగినదియు, శీతవీర్యంబును నగును. నేత్రములకు హితమైనది. రక్తపిత్తమును హరించును. వాంతిని ఎక్కిళ్లను విషమును పోగొట్టును. అథ గన్ధకాదయః—

**గంధకగుణములు**

మూ. గన్ధకః కటుతిక్తోష్ణః క్రిమికుష్ఠవిషప్రణుత్,
స్నిగ్ధం కషాయం కటుకం హరితాళం విషప్రణుత్. ౯౯

వ్యా. గంధకము కటుతిక్తరసంబులును, ఉష్ణమైనగుణవీర్యంబులును కలిగియుండును. క్రిములను కుష్ఠమును, విషమును హరించును. తాళకము స్నిగ్ధంబును కషాయరసంబును కటురసంబును కలిగియుండును. విషమును హరించును.

**మణిశిలగుణము**

మూ. కఫఘ్నీ తిక్తకటుకా మనోహ్వా లేఖినీ సరా,

వ్యా. మణిశిల కఫమును హరించును. తిక్తకటురసములు కలిగియుండును. ధాతువుల లేఖనముచేయును. శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలిగినది.

**గంగసిందూరగుణము**

మూ. సిన్దూరం కటుకం పుణ్యం విషవీసర్పకుష్ఠజిత్. ౧౦౦

వ్యా. గంగసిందూరము కటురసంబును, విషమును విసర్పమును కుష్ఠమును హరించును. పావనమైనది.

కాంక్షీగుణము

మూ. కాంక్షీకషాయకటుకా కేశ్యా కణ్ఠ్యా విషవ్రణుత్,
కణ్డూవిసర్పశ్విత్రాణాం నాశినీ వ్రణరోపణీ. ౫౦౧

వ్యా. కాంక్షీ యనునది (?) ) కషాయకటురసములు కలిగియుండును. వెండ్రుకలకు హితకరము. కంఠమునకు మిక్కిలి మేలుచేయును. విసర్పము, దురద, విషము, శ్విత్రకుష్ఠము అనువానిని పోగొట్టును. వ్రణములను మాన్పును.

కాసీసగుణము

మూ. కాసీసం పుష్పకాసీసం లవణామ్లకషాయకమ్,
ఉష్ణం కఫానిలశ్విత్రవిషకుష్ఠామయాపహమ్. ౫౦౨

వ్యా. కాసీసము (అన్నభేది) వాలుకాకాసీసము, పుష్పకాసీసము నని రెండువిధములు. ఈరెండును లవణ-ఆమ్ల-కషాయరసంబులును, ఉష్ణగుణవీర్యంబులును కలిగియుండును. కఫమును, వాతమును, శ్విత్రకుష్ఠమును, విషమును, కుష్ఠరోగమును హరించును.

కంకుష్ఠగుణము

మూ. కఙ్కుష్ఠం కటుతిక్తోష్ణం వ్రణ్యం శూలనిబర్హణమ్,

వ్యా. కంకుష్ఠము కటుతిక్తరసములుకలిగి, ఉష్ణవీర్యముగ నుండును. వ్రణములకు హితకరము. శూలరోగమును హరించును.

మాక్షికగుణము

మూ. స్వాదుతిక్తకషాయోష్ణం మాక్షికం రాజయక్ష్మజిత్. ౫౦౩
మేహకుష్ఠాక్షిరుక్పాణ్డుచ్ఛర్దివాద్మవిషాపహమ్.

వ్యా. మాక్షికము మధురతిక్తకషాయరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగినది. రాజయక్ష్మమును, ప్రమేహమును, కుష్ఠములను, నేత్రరోగములను, పాండురోగమును, వమనమును, ఎక్కిళ్లను, విషమును, వీని నన్నింటిని హరించును.

విమల-సస్యగుణములు

మూ. కటుకౌ లేఖనౌ స్వాదుపాకౌ విమలసస్యకౌ. ౫౦౪

వ్యా. విమలంబును, సస్యకంబును ధాతువుల లేఖనము జేయును. మధురపాకము కలిగినవి.

చపల-వజ్ర-వైక్రాన్తగుణములు

మూ. తిక్తోష్ణమధురస్స్నిగ్ధః లేఖనశ్చపలోపలః,
కుష్ఠఘ్నేవజ్రవైక్రాన్తే రాజయక్ష్మవిషాపహౌ. ౫౦౫

వ్యా. చపలము తిక్తరసంబును, ఉష్ణవీర్యంబును, మధురవిపాకంబును కలిగినది. స్నిగ్ధముగ నుండును. లేఖనము, వజ్రంబును, వైక్రాంతంబును కుష్ఠమును హరించును. రాజయక్ష్మమును విషమును హరించును.

## అభ్రకగుణము

మూ. అభ్రకం బల్యమాయుష్యం రూక్షం పిత్తానిలాపహమ్,

వ్యా. అభ్రకము బలమును కలిగించును. ఆయువును వృద్ధినందించును. రూక్షగుణము కలిగినది. పిత్తమును వాతమును హరించును.

## అఞ్జనములు, వానిగుణములు

మూ. కన్దళా కటుతిక్తోష్ణా మేహకుష్ఠవిషాపహా. ౫౦౬
కషాయమధురం శీతం లేఖనం నీలమఞ్జనమ్,
రక్తపిత్తవిషచ్ఛర్దిహిధ్మాఘ్నం దృక్ప్రసాదనమ్. ౫౦౭
స్రోతోఽఞ్జనం వరం తత్ర; తతస్సౌవీరకాఞ్జనమ్,
కఫఘ్నం తిక్తకటుకం భేదిసోష్ణం రసాఞ్జనమ్. ౫౦౮
పుష్పాఞ్జనం నేత్రరుజో విషహిధ్మాపహం హిమమ్,
నీలాఞ్జనం ప్రమేహార్శో మేదోఘ్నం నేత్రరోగజిత్. ౫౦౯

వ్యా. స్రోతోంజనము (సుర్మారాయి) కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగి, మేహరోగములను, కుష్ఠములను, విషమును పోగొట్టును. నీలాంజనము కషాయ మధురరసంబులును, శీతవీర్యంబును, కలిగి దోషముల లేఖముచేయును. రక్తపిత్తమును, విషమును, వాంతిని, ఎక్కిళ్లను హరించును. నేత్రములను నిర్మలముగ జేయును. పైజెప్పిన అంజనముల రెంటిలో స్రోతోంజనము మిగుల శ్రేష్ఠమైనది.

సౌవీరాఞ్జనము కఫమును హరించును. తిక్తకటురసములు కలిగియుండును. రసాంజనము మలాదుల భేదించును. ఉష్ణవీర్యముకలిగినది. పుష్పాఞ్జనము నేత్రరోగముల కన్నింటికిని అనుకూలముగ నుండును; విషమును ఎక్కిళ్లను హరించును. శీతవీర్యము కలిగినది. పైజెప్పిన నీలాంజనము ప్రమేహములను, అర్శోరోగమును, మేదోరోగమును, నేత్రరోగములను హరించును.

## శిలాజతువు, దానిసామాన్యగుణములు

మూ. హిమాద్రిస్థో ధాతురసశ్శిలాజిదభిధీయతే,
శిలాభ్యో యస్య యజ్జాతం ధాతోస్తత్తద్గుణం వదేత్. ౫౧౦
సర్వం చ తిక్తకం రూక్షం నాత్యుష్ణం కటుపాకతః,

వ్యా॥ హిమాలయమున స్వర్ణాదిధాతువులవలన పుట్టినరసము (సారము) శిలాజిత్తని చెప్పబడును. హిమాలయమునందలి రాళ్లయందు ఏధాతువువలన నేరసము పుట్టునో అట్టి ధాతురసమునకు ఆధాతువుయొక్క గుణములే ప్రాయికముగ కలిగియుండును. మరియు శిలాజతు సామాన్యముగ తిక్తరసంబును, రూక్షగుణంబును, కొంచెముగ సుష్ణగుణంబును, కటువిపాకంబును కలిగియుండును.

గోమూత్రశిలాజతు, కర్పూరశిలాజతుగుణములు

మూ॥ భేదనం సకషాయామ్లం తాసాం తత్ర ప్రశస్యతే. ॥౧౧

గోమూత్రగన్ధికృష్ణం గుగ్గుల్వాభం విశర్కరమమృత్స్నమ్,
స్నిగ్ధమనమ్లకషాయం మృదుగురుచశిలాజతుశ్రేష్ఠమ్. ॥౧౨
యోగవాహీరసో వస్త్రః చక్షుష్యం క్రిమికుష్ఠజిత్.

వ్యా॥ అట్టి శిలాజతువులలో గోమూత్రమునుబోలిన వాసనకలిగి నల్లగ నుండునది గోమూత్రశిలాజతువు. ఇయ్యది మలమూత్రాదుల పట్టును వదలించి భేదించును. జిగురుగ నుండును. స్నిగ్ధమును కషాయామ్లరసములు లేనిదియు మృదువును బరువైనదియునగు శిలాజతువు శ్రేష్ఠమైనది. ఈశిలాజతువు యోగవాహి ; (ఏవస్తువుతోగూడిన నావస్తువు గుణములుగల్గినది). కొంచెము దుర్గంధముకల్గియుండును. నేత్రములకు హితకరము ; క్రిములను కుష్ఠములను హరించును. ఈరెండింటిలో గోమూత్రశిలాజతువు మిగుల గుణోత్తరమైనది.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—ఎండకాలమున హిమాలయపర్వతమునందలి ధాతువులు కఠినమగుసూర్యతాపమునంజేసి కరగి రాళ్లపై వ్యాపించి గడ్డకట్టియుండును. అదియే శిలాజతువు. ఇయ్యది గోమూత్రశిలాజతువు అనియు, కర్పూరశిలాజతువు అనియు రెండు తెఱంగులు. అందు నల్లనై గోమూత్రమునుబోలిన వాసనకల్గినది గోమూత్రశిలాజతువు. గుగ్గిలమువలె గడ్డకట్టి తెల్లనిరంగుకల్గినది కర్పూరశిలాజతువు. ఈరెండింటిలో గోమూత్రశిలాజతువు మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈరెంటిగుణాదులు వేరువేర పైని బేర్కొనంబడియె.

వెదురుప్పుగుణము

మూ॥ కషాయమధురా రూక్షా కాసఘ్నీ వంశలోచనా. ॥౧౩
తుగాక్షీరీక్షయశ్వాసకాసఘ్నీమధురా హిమా,

వ్యా॥ వెదురుప్పుకషాయము మధురరసముకల్గియుండును. రూక్షగుణము కల్గినది. ఇయ్యది శ్వాసకాసములను క్షయమును హరించును. శీతవీర్యము కల్గినది.

### లవణసామాన్యగుణము

మూ. నిష్పన్నాదిలవణం సర్వం సూక్ష్మం స్రావిమలం లఘు. ౫౧౪
వాతఘ్నం నాతితీక్ష్ణోష్ణం రోచనం కఫపిత్తనుత్,

వ్యా. పలుదెరంగులగులవణములన్నియు స్రోతస్సులనుండు స్రవింపజేయును. సూక్ష్మగుణము (శరీరమున వ్యాపించుస్వభావము) కలది. మలాదులను వెడలించును. తేలికగ జీర్ణమగును. వాతమును హరించును. కొంచెముగ తీక్ష్ణగుణంబును ఉష్ణంబును కలిగినది. రుచిని పుట్టించును. కఫమును పిత్తమును హరించును.

### సైంధవలవణగుణము

మూ. సైన్ధవం తత్ర సుస్వాదు వృష్యం హృద్యం త్రిదోషనుత్. ౫౧౫
అపథ్యనుష్ణం దృశోః పథ్యం అవిదాహ్యగ్నిదీపనమ్,

వ్యా. సైంధవలవణము (ఇందుప్పు) రుచికరముగ నుండును. శుక్రమును వృద్ధి నొందించును. హృదయమునకు హితకరము. త్రిదోషములహరించును. కొంచెముగ నుష్ణమును కలిగించును. కంటిరోగములయందు మిక్కిలి పథ్యకరము. మంటబుట్టింపదు. జఠరాగ్నిని దీపింపజేయదు.

### సౌవర్చలలవణలక్షణము

మూ. లఘుసౌవర్చలం హృద్యం సుగన్ధ్యుద్గారశోధనమ్. ౫౧౬
కటుపాకం విబన్ధఘ్నం దీపనీయం రుచిప్రదమ్,

వ్యా. సౌవర్చలలవణము తేలికగ జీర్ణమగును. హృదయమునకు మిక్కిలి హితకరము. మంచిపరిమళముకలిగినది. వమనరూపమైన శోధనముచేయును. కటువిపాకము కలిగినది. మలబంధమును నివర్తింపజేయును. అగ్నిని దీపింపజేయును. రుచిని పుట్టించును.

### బిడాలవణగుణము

మూ. ఊర్ధ్వాధఃకఫవాతానులోమనం దీపనం బిడమ్. ౫౧౭

వ్యా. బిడాలవణము కఫమును హరించును. ఊర్ధ్వముగను శరీరమున క్రిందిభాగమునను సంచరించువాతమును అనులోమముగ సంచరింపజేయును. జఠరాగ్నిని దీపింపజేయును.

### సాముద్రలవణగుణము

మూ. విబన్ధానాహవిష్టమ్భశూలగౌరవనాశనమ్,
విపాకే స్వాదుసాముద్రం గురుశ్లేష్మవివర్ధనమ్. ౫౧౮

వ్యా. సాముద్ర (సముద్రమునపుట్టిన) లవణము మలబంధమును, కడుపుబ్బరమును విష్టంభము (కడుపులో గుడగుడ యనుశబ్దము)ను, శూలనొప్పిని, గురుత్వమును నశింప

జేయును. మధురముగ విపాకము నొందును. గురుగుణము కలిగియుండును. కఫమును వృద్ధినొందించును.

### ఔద్భిదలవణగుణము

మూ. సతిక్తకటుకక్షారం తీక్ష్ణముత్క్లేదిచౌద్భిదమ్,

వ్యా. ఔద్భిదలవణము (భూమిని పగులదీసి పుట్టిన చౌటియుప్పు) కొంచెము చేదును కారముగను తీక్ష్ణగుణంబులు కలిగియుండును. దోషములను పైకి ప్రకోపింప జేయును.

### కృష్ణలవణగుణము

మూ. కృష్ణే సౌవర్చలగుణా లవణే గన్ధవర్జితాః ౫౧౯

వ్యా. కృష్ణలవణము (నల్లనియుప్పు) సౌవర్చలలవణమునకుజెప్పిన లఘ్వాదిగుణములు కలిగియుండును. కాని సుగంధముమాత్రము లేదు.

### రోమక, కాచలవణములగుణములు

మూ. రోమకంలఘు; పాంసూత్థం సక్షారసం శ్లేష్మలం గురు,

వ్యా. రోమకలవణము మిక్కిలి చుల్కనగ జీర్ణమగును. పాంసూత్థము (కాచలవణము) కొంచెము ఉప్పగ నుండును. కఫమును వృద్ధినొందించును. గురుత్వము కలిగియుండును.

### లవణోపయోగనియమము

మూ. లవణానాం ప్రయోగే తు సైన్ధవాదీన్, ప్రయోజయేత్ ౫౨౦

వ్యా. చికిత్సావిషయమై లవణముల నుపయోగింపవలసినప్పుడు పైజెప్పిన సైంధవాదిలణముల నుపయోగింపనగును. (పైజెప్పిన సైంధవాదిలవణములను వరుసగ రెండు, మూడు, నాల్గు, మున్నగుసంఖ్యల ననుసరించి యుపయోగించవలె ననుట.)

మరియు లవణముల గుణాదితారతమ్యము ఖరనాదునిచే నిట్లు చెప్పబడినది:—
"సైంధవం సారకం పాక్యం సౌవర్చలమథోద్భిదమ్. పూర్వపూర్వం గుణోత్కృష్టం ఔష్ణ్యం చైషాం యథోత్తరమ్" సైంధవము, సారకము, పాక్యము, సౌవర్చలము, ఔద్భిదము, అను నీయైదువిధములైనలవణములు ముందుముందుకు ఒకదానికంటెనొకటి శ్రేష్ఠమైనగుణము కలిగియుండును. (ఔద్భిదమునకంటె సౌవర్చలంబును, దానికంటె పాక్యంబును, దానికంటె సారకంబును, వీనికన్నిటికంటె సైంధవలవణంబును (శ్రేష్ఠమనుట). మరియు పైజెప్పిన సైంధవాదిలవణము లుత్తరోత్తరము ఒకదానికంటె మరియొకటి యుష్ణ గుణాధికముగ నుండు నని భావము.

### యవక్షారగుణము

మూ. గుల్మహృద్గ్రహణీపాణ్డు ప్లీహానాహగళామయాన్,
శ్వాసార్శః కఫవాతాం (కాసాం)శ్చశమయేద్యవశూకజః. ॥౨౧

వ్యా. యవశూకములనుండి పుట్టినయవక్షారము గుల్మమును, హృద్రోగమును, గ్రహణిని, పాండురోగమును, ప్లీహవృద్ధిని. కడుపుబ్బరమును, కంఠరోగములను, శ్వాసరోగములను, అర్శోరోగమును, కఫవాతములను, (కాసమును), వీనినన్నింటిని శమింపజేయును.

### క్షారసముదాయసామాన్యగుణములు

మూ. క్షారస్సర్వశ్చ పరమం తీక్ష్ణోష్ణః కఫజిల్లఘుః,
పిత్తాసృగ్దూషణః పాకీ ఛేద్యహృద్యోవిదారణః. ॥౨౨
అపథ్యః కటులావణ్యాత్ శుక్రౌజఃకేశచక్షుషామ్,

వ్యా. క్షారములన్నియు మిక్కిలి తీక్ష్ణంబులును, ఉష్ణంబులును నగును. కఫమును (క్రిములను) హరించును. చులకనగ జీర్ణములగును. పిత్తమును రక్తమును చెరచును. పాకము నొందించును. దోషాదుల ఛేదించును. హృదయమునకు ప్రతికూలమైనది. పక్వములైన గండాదివ్రణములను పగులదీయును. కారముగను ఉప్పగను ఉండుటచేత శుక్రమునకును, ఓజస్సుకును, వెండ్రుకలకును, నేత్రములకును అపథ్యములు కావు.

### త్రిక్షారము

మూ. క్షారత్రయం యవక్షారస్వర్జికాక్షారటఙ్కణాః. ॥౨౩

వ్యా. యవక్షారము, సర్జక్షారము, టంకణక్షారము అను నీమూడును క్షారత్రయమని చెప్పబడును. (ఈశాస్త్రమున క్షారత్రయమని చెప్పినచోట పైజెప్పిన మూడుక్షారములను గ్రహింపనగుననిభావము).

### ఇంగువగుణము

మూ. వాఙ్గువాతకఫానాహశూలఘ్నం పిత్తకోపనమ్,
కటుపాకరసం రుచ్యం దీపనం పాచనం లఘు. ॥౨౪

వ్యా. ఇంగువ వాతమును, కఫమును, కడుపుబ్బరమును, శూలను, హరించును. పిత్తమును ప్రకోపింపజేయును. కటువైన పాకంబును రసంబును కల్గినది. రుచిని బుట్టించును. అగ్నిని జ్వలింపజేసి (ఆకలిపుట్టించి) ఆహారమును జీర్ణింపజేయును. తేలికగుణము కలిగియుండును.

హారీతక్యాదయః—

కరకకాయలు, వానిభేదములు

మూ. హారీతకీ సప్తవిధా విజయా పూతనా మృతా
జీవన్తీ త్రివృతా రోహిణ్యభయా శ్చేతి తాః క్రమాత్. ॥౨౫॥
కమ్బుగ్రీవా విశుద్ధాఙ్గీ మాంసళా, హేమపిఙ్గళా,
పంచకోణా చతుష్కోణా కృష్ణవర్ణాతతః పునః. ॥౨౬
శ్రేష్ఠా సరిత్తటారణ్య పర్వతోత్థా యథోత్తరమ్,

వ్యా. కరకకాయలు విజయ, పూతన, అమృత, జీవన్తి, త్రివృత, రోహిణి, అభయ, అనుపేర్లచే నేడు తెఱఁగుల నుండును. అందు శంఖమును బోలియుండునది విజయ, తెల్లనిరంగు కల్గినది పూతన, స్థూలమైయుండునది అమృత, బంగారురంగును పింగళవర్ణంబును కలిగినది జీవన్తి, ఐదుముఖములుకలిగినది త్రివృత, నాల్గుకోణములుకలిగినది రోహిణి, నల్లనిరంగుకలిగినది అభయ. (పైజెప్పినలక్షణములును నామభేదములును కలిగియుండుటంజేసి హారీతకి యేడు తెఱంగులగునని భావము) ఈయేడు విధములైన కరకకాయలు నదులగట్టున పుట్టినవి శ్రేష్ఠములు, అడవులలోఁబుట్టినవి అంతకంటె శ్రేష్ఠములు, కొండలలోఁ బుట్టినవి అన్నిటికంటె మిగుల శ్రేష్ఠములు.

శ్రేష్ఠములగు కరకకాయల లక్షణము

మూ. నవస్నిగ్ధా ఘనా వృత్తా జలే మగ్నాఽతిగౌరవాత్. ॥౨౭

వ్యా. మరియు క్రొత్తవియు, నునుపుకలిగినవియు, ఉదకములో వైచినయెడ భారముచే మునుంగునవియునైన కరకకాయలు మిక్కిలి శ్రేష్ఠతమములు.

కరకకాయగుణము

మూ. కషాయా మధురా పాకే రూక్షా విలవణా లఘుః,
దీపనీ పాచనీ మేధ్యావయసస్థాపనీ పరా. ॥౨౮
ఉష్ణవీర్యా సరాయుష్యా బుద్ధీన్ద్రియబలప్రదా,
కుష్ఠవైవర్ణ్యవైస్వర్యపురాణవిషమజ్వరాన్. ॥౨౯
శిరోఽక్షిపాణ్డుహృద్రోగకామలాగ్రహణీగదాన్,
సశోషశోథాతీసారదాహమోహవమిక్రిమీన్. ॥౩౦
శ్వాసకాసప్రసేకార్శః ప్లీహానాహగరోదరమ్. ॥౩౧
విబన్ధం స్రోతసాం గుల్మం ఊరుస్తమ్భమరోచకమ్,
హారీతకీ జయేద్వ్యాధీన్ తాంస్తాంశ్చ కఫవాతలాన్. ॥౩౨

వ్యా. కరకకాయ వగరురసమును ప్రధానముగ కలిగియుండును. విపాకమున మధురము రూక్షణము కలిగినది. లవణరస మొక్కటిదక్క తక్కినమధుర అమ్ల తిక్త కషాయ కటురసములైదిటితో గూడియుండును. జఠరాగ్నిని దీపింపజేయును. భుజింపబడినయాహారము మున్నగువానిని పచింపజేయును. బుద్ధిని వికసింపజేయును. ముదిమిని రానీయక వయస్సును స్థాపించును. ఉష్ణమైన వీర్యము కలిగినది. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ఆయువును వృద్ధినొందించుచు. బుద్ధికిని చక్షురాదీన్ద్రియములకును మిక్కిలి బలమును కలిగించును. కుష్ఠము, వివర్ణత్వము, కంఠస్వరదోషము, ప్రాతబడి చాలకాలముగ వ్యాపించి వదలకుండు జ్వరము, విషమజ్వరము, శిరోరోగము, నేత్ర రోగములు, పాండువు, హృద్రోగము, కామల, గ్రహణీరోగము, శోషము, శోఫము, అతిసారము, తాపము, మోహము (చిత్తభ్రమము), వమనము, క్రిమిరోగము, శ్వాసకాసములు, ప్రసేకము (నోట జొల్లుకారుట), అర్శోరోగము, ప్లీహరోగము, కడుపుబ్బరము, విషము, మహోదరము, స్రోతస్సులబంధము, గుల్మము, ఊరుస్తంభవాతము, అరోచకము ఈ రోగములనన్నింటిని హరించును. మరియు కఫముచేతను వాతముచేతను సంభవించిన పలుతెఱంగులైన రోగములనుగూడ హరించును.

ఇచ్చట 'విలవణా' అనుపదముచేత లవణరస మొక్కటిదక్క తక్కుంగల మధురాదిరసము లైదును కరకకాయకు కలిగియుండు నని అర్థము లభించుచున్నను 'కషాయా' అని వేరుగ చెప్పుటచేత కషాయరసము ప్రబలముగ ప్రధానమైయుండు ననియు, తక్కిన మధురాదిరసములు అనురసములుగ కలిగియుండుననియు భావము. ఈవిషయమునే చరకాచార్యులు "హరీతకీం పఞ్చరసాం ఉష్ణాం విలవణాంశివామ్" అనువాక్యముచే స్ఫుటముగ నుపదేశించిరి.

మరియు అట్టిపంచరసాత్మకమగుటంజేసియే కరకకాయ త్రిదోషహరమని ఖరనాదులిట్లు చెప్పిరి.—"స్వాద్వమ్లభావాత్పవనం, కటుతిక్తతయాకఫమ్; కషాయ మధురత్వాచ్చ హన్తిపిత్తం హరీతకీ" కరకకాయ మధురామ్ల రసములచే వాతము, కటుతిక్తరసములచే కఫమును, కషాయమధురరసములచే పిత్తమును హరించు నని భావము.

ఉసిరికకాయగుణము

మూ. తద్వదామలకం శీతం అమ్లపిత్తకఫాపహమ్,

వ్యా. ఉసిరికకాయ కరకకాయకు చెప్పినగుణములును రసవీర్యాదులును కలిగియుండును. శీతవీర్యముకలిగి అమ్లపిత్తమును కఫమును హరించును.

మరియు సుశ్రుతాచార్యుడు ఉసిరికకాయలగుణాదుల తెలుపుచు త్రిదోషహరత్వము నిట్లు నిరూపించెను:—"చక్షుష్యం సర్వదోషఘ్నం వృష్యమామలకీఫలమ్, హన్తి

వాతం తదమ్లత్వాత్ పిత్తం మాధుర్యశైత్యతః, కఫం రూక్షకషాయత్వాత్ ఫలేభ్యో ఒభ్యధికంతుతత్." ఉసిరికకాయ నేత్రములకు మిక్కిలి హితకరము. త్రిదోషములను హరించును. శుక్రమును వృద్ధినందించును. మరియు నయ్యది అమ్లరసము కలిగియుండుటచే వాతమును హరించును. మధురరసంబును శీతవీర్యంబును కలిగియుండుటవలన పిత్తమును హరించును. రూక్షగుణంబును కషాయరసంబును కలిగియుండుటంజేసి కఫమును హరించును. ఇత్తెరంగున త్రిదోషహరంబు కావున నియ్యది ఫలవర్గములో మిక్కిలి శ్రేష్ఠమైనది యని భావము. మరియు "అమ్లభావాజ్జయేద్వాత పిత్తం మాధుర్యశైత్యతః, కఫం రూక్షకషాయత్వాత్ ఏవమేవ త్రిదోషజిత్" అనువాక్యముచేత కృష్ణాత్రేయుడును త్రిదోషహరత్వమును నిరూపించిరి.

### తానికాయగుణము

మూ. కటుపాకం హిమం కేశ్యం అక్షమీషచ్చ తద్గుణమ్. ౫౩౩

వ్యా. తానికాయ కటుపాకంబును, శీతవీర్యంబును కలిగియుండును. వెండ్రుకలను వృద్ధినొందించును. ఇయ్యది కరక ఉసిరికకాయలకంటె కొంచెము తక్కువయైనగుణములు కలిగియుండును.

### కరకకాయనుపయోగింపదగనివారు

మూ. అధ్వశ్రాన్తేషు వృద్ధేషు గర్భిణ్యృతుమతీషు చ,
బాలేషు క్షీరవీర్యేషు పథ్యాం జాతు న యోజయేత్. ౫౩౪

వ్యా. త్రోవనడచుటచే శ్రమనొందినవారికిని, ముసలివారికిని, గర్భవతులగు స్త్రీలకును, ఋతుమతులగువారికిని, బాలురకును, పాలనే ఆహారముచేసి యుండువారికిని కరకకాయల నుపయోగింపంజనదు.

### త్రిఫలాప్రమాణము, దానిగుణము

మూ. ఫలమేకం హరీతక్యాః విభీతక్యాః ఫలద్వయమ్,
ధాత్రీఫలాని చత్వారి త్రిఫలాఖ్యామయాపహా. ౫౩౫
రోచనీ త్వగ్గదక్లేదమేదోమేహకఫాస్రజిత్,

వ్యా. కరకకాయ యొకటియు, తానికాయలు రెండును, ఉసిరికకాయలు నాల్గును ఒకటిగకూర్చిన త్రిఫలములని చెప్పబడును. ఈ త్రిఫలములు నేత్రరోగములనుహరించును. రుచినిబుట్టించును. చర్మగతములైన రోగములను వ్రణములయందలి ద్రవమును, మేదోరోగమును, ప్రమేహములను, కఫరక్తరోగములను హరించును.

ఇచ్చట నీనిర్ణయము తెలియంగునది:—పైజెప్పిన త్రిఫలాపరిమాణమునుబట్టి కరకకాయలో నర్ధభాగము భారము కలిగినది తానికాయయనియు, నాల్గవవంతు భారముకలిగి

నది యుసిరికకాయయనియు, తెలియుచున్నది. మరియు తానికాయకు కర్షఫలమని పేరు కలదు. అనగా కర్షప్రమాణము కలిగినదనుట. అట్టి కర్షఫలములు రెండైనచో నొకకరక కాయకు సమముగ నుండును కావున కరకకాయ రెండుకర్షముల ప్రమాణము కలిగినది. అట్టి కరకకాయకు నాల్గు ఉసిరికకాయలు సమానములు కావున ఉసిరికకాయ అర్ధకర్షపరిమాణము కలిగినది. (కరకకాయ రెండుకర్షముల పరిమాణము కలిగినదనియు, తానికాయ కర్షప్రమాణము కలిగినదనియు, ఉసిరికకాయ అర్ధకర్షప్రమాణము కలిగినదియు ఫలితార్థము).

### చతుర్జాత-త్రిజాతకములు; వానిగుణము

మూ. సకేసరం చతుర్జాతం త్వక్పత్రై ్లం త్రిజాతకమ్. ౫౩౬
పిత్తప్రకోపి తీక్ష్ణోష్ణం రూక్షం దీపనరోచనమ్,

వ్యా. దాల్చినిచెక్క, ఆకుపత్రి, ఏలకులు, ఈమూడునుచేరిన సముదాయము త్రిజాతకమని చెప్పబడును. (దీనికే త్రిసుగంధమనియు నామాంతరము కలదు). ఈత్రిజాతకముతోగూడు నాగకేసరములుచేరినకూటమి చతుర్జాత మని చెప్పబడును. ఈత్రిజాత చతుర్జాతములు పిత్తమును ప్రకోపింపజేయును. తీక్ష్ణ, రూక్ష, ఉష్ణగుణములు కలిగియుండును. అగ్నిని దీపింపజేయును. రుచిని బుట్టించును.

### మిరియములగుణము

మూ. రసే పాకే చ కటుకం కఫఘ్నం మరిచం లఘు. ౫౩౭

వ్యా. మిరియాలు రసమునందును విపాకమునందును కటువుగ నుండును. కఫమును హరించును. తేలికగ జీర్ణమగును.

### పిప్పలిగుణము

మూ. శ్లేష్మలా స్వాదుశీతార్ద్రా గుర్వీ స్నిగ్ధా చ పిప్పలీ,
సా శుష్కా విపరీతా తు స్నిగ్ధా వృష్యా రసే కటుః. ౫౩౮
స్వాదుపాకాఽనిలశ్లేష్మశ్వాసకాసాపహా సరా,
నతామత్యుపయుఞ్జీత రసాయనవిధిం వినా. ౫౩౯

వ్యా. పిప్పలి పచ్చిదిగ నున్నయెడ కఫమును వృద్ధినొందించును. మధురరసంబును, శీతవీర్యంబును, గురు-స్నిగ్ధగుణంబులును కలిగియుండును. అట్టి పిప్పలి యెండినచో పచ్చిపిప్పలికి పైజెప్పినగుణములకంటె విరుద్ధములగుగుణాదులు కలిగియుండును. (ఉష్ణవీర్యంబును, లఘుగుణంబును కలిగియుండుననుట). స్నిగ్ధగుణముకలిగి శుక్రమును వృద్ధినొందించును. కటురసము కల్గియుండును. మధురవిపాకముకలిగినది. వాతమును, కఫమును, శ్వాస

కాసములను హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ఇట్టిగుణములు కలిగియున్న పిప్పలిని వర్ధమానపిప్పలి మున్నగురసాయనవిధులయందు దక్క తక్కినయౌషధములయోగములయందు విశేషముగ నుపయోగింపంజనదు.

### శుంఠిఅల్లముగుణములు

మూ. నాగరం దీపనం వృష్యం గ్రాహిహృద్యం విబన్ధనుత్,
రుచ్యం లఘు స్వాదుపాకం స్నిగ్ధోష్ణం కఫవాతజిత్. ౫౮౦
తద్వదార్ద్రికమ్.........................

వ్యా. శుంఠి అగ్నిని దీపింపజేయును. శుక్రమును వృద్ధినొందించును. విరేచనములగుచున్నవానిని నిలుపును. హృదయమునకు హితకరము. మలాదులుబంధింపబడియున్నచో వానిని సరళముగ వెడలించును. (స్రోతస్సులను శుద్ధిపఱచు ననుట). రుచిని పుట్టించును. తేలికగ జీర్ణమగును. మధురముగ విపాకమునొందును. స్నిగ్ధ-ఉష్ణములను గుణముల గలిగియుండును. కఫవాతముల హరించును. అల్లముకూడ పైజెప్పబడినగుణములు కలిగియుండును.

### త్రికటుకములగుణము

మూ............ఏతచ్చ త్రయం త్రికటుకం, జయేత్,
స్థౌల్యాఽగ్నిసదనశ్వాసకాసశ్లీపదపీనసాన్. ౫౮౧

వ్యా. పైజెప్పబడినమిరియాలు, పిప్పలి, శుంఠి ఈమూడును జేరినసముదాయము త్రికటుకములని చెప్పబడును. ఈత్రికటుకములు స్థూలత్వమును, అగ్నిమాంద్యమును, శ్వాసకాసములను, శ్లీపదము (బోదకాలు)ను, పీనసము (పడిసెము)ను హరించును.

### చవ్యముయొక్కయు, మోడియొక్కయు చిత్రమూలముయొక్కయు గుణములు

మూ. చవికా పిప్పలీమూలం, మరిచాల్పాన్తరం గుణైః,
చిత్రకోఽగ్నిసమః పాకే శోఫార్శఃక్రిమికుష్ఠహా. ౫౮౨

వ్యా. చవ్యము, పిప్పలీమూలము (మోడి), ఈరెండును మిరియములకంటె కొంచెము తక్కువైనగుణము కలిగియుండును. (కటువైనరసపాకంబులును, లఘుగుణంబును, ఉష్ణవీర్యంబును కలిగి కఫమును హరించు నని భావము). చిత్రమూలము విపాకమునం దగ్ని సమానముగ నుండును. శోఫమును, అర్శోరోగమును, కుష్ఠమును హరించును.

### పంచకోలము, దానిగుణము

మూ. పిప్పలీ పిప్పలీమూలం చవ్యం చిత్రకనాగరమ్,

పఞ్చకోలం; ప్లీహగుల్మశూలానాహాఽగ్నిమాన్ద్యనుత్. ౫౪౩

వ్యా. పిప్పలి, పిప్పలీమూలము (మోడి), చవ్యము, చిత్రమూలము, శుంఠి, ఈయైదును జేరినసముదాయము పంచకోల మనబడును. ఇయ్యది ప్లీహరోగమును, గుల్మమును, కడుపుబ్బరమును, శూలమును, అగ్నిమాంద్యమును పోనడచును.

మహాపంచమూలము; దానిగుణములు

మూ. బిల్వకాశ్మర్యతర్కారీపాటలాటుణ్టుకైర్మహత్,
జయేత్కషాయం తిక్తోష్ణం (తీక్ష్ణోష్ణం) పఞ్చమూలం కఫానిలౌ.

వ్యా. మారేడు, గుమ్మడు, తక్కెడ, కలిగొట్టు, దుందిలము, అను నీయైదును జేరినసముదాయము మహాపంచమూల మనబడును. ఈమహాపంచమూలము వగరును, చేదును, ఉష్ణగుణంబును కలిగియుండును. కఫమును వాతమును హరించును.

హ్రస్వపంచమూలము; దానిగుణము

మూ. హ్రస్వం బృహత్యంశుమతీద్వయగోక్షురకైస్స్మృతమ్,
స్వాదుపాకరసం, నాతిశీతోష్ణం, సర్వదోషజిత్. ౫౪౫

వ్యా. వాకుడు, పెద్దములక, ముయ్యాకుపొన్న, కోలపొన్న, పల్లేరు అను నీయైదును జేరినసముదాయము హ్రస్వ (లఘు) పంచమూల మని చెప్పబడును. ఇయ్యది మధురసంబును, మధురవిపాకంబు, సమశీతోష్ణంబులును కలిగియుండును. త్రిదోషములను హరించును.

మధ్యమపంచమూలము దానిగుణము

మూ. బలాపునర్నవైరణ్డశూర్పపర్ణీద్వయేన తు
మధ్యమం; కఫవాతఘ్నం, నాతిపిత్తకరం సరమ్. ౫౪౬

వ్యా. చిట్టాముట్టి, గలిజేరు, ఆముదము, పిల్లపెసర, అడవిపెసర ఈయైదును జేరిన సముదాయము మధ్యమపంచమూల మనబడును. ఇయ్యది కఫవాతముల హరించును, కొంచెముగ పిత్తమును చేయును. శరీరమున శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలిగినది.

జీవనపంచమూలము ; దానిగుణము

మూ. అభీరువీరా జీవన్తీ జీవకర్షభకైస్స్మృతమ్,
జీవనాఖ్యం చ; చక్షుష్యం వృష్యం పిత్తానిలాపహమ్. ౫౪౭

వ్యా. పిల్లిపీచర, పెగ్గుమ్మడు, పాలకూర, జీవకము, ఋషభకము అనునీయైదును జేరినసముదాయము జీవనపంచమూలమని చెప్పబడును. ఇయ్యది నేత్రములకు హితకరము. శుక్రమును వృద్ధిచేయును. పిత్తవాతములను హరించును.

—— తృణపంచమూలము ; దానిగుణము ——

మూ. తృణాఖ్యం పిత్తజిద్దర్భకాశేక్షుశరశాలిభిః,

వ్యా. దర్భ, కాశము (రెల్లు), ఇక్షు (లిప్పరెల్లు), శర (తుండుఱెల్లు), శాలి (కిక్కిసగడ్డి), అను నీయైదును జేరినసముదాయము తృణపంచమూల మనబడును. ఇయ్యది పిత్తమును హరించును.

—— వల్లీపంచమూలము, కంటకపంచమూలము, వానిగుణము ——

మూ. అజశృఙ్గీ హరిద్రా చ విదారీ సారివా స్మృతా. ॥౧౪౮॥
వల్ల్యాఖ్యం; కణ్టకాఖ్యం తు శ్వాదంష్ట్రాఽఽభీరుసైర్యకైః,
న హాంస్రాకరమర్దశ్చ సర్వదోషహరే తు తే. ॥౧౪౯॥

వ్యా. ఒడ్డి, పసపు, నేలగుమ్ముడు, సుగంధపాల, తిప్పతీగె, ఈయైదును జేరినసముదాయము వల్లీపంచమూల మనబడును. పల్లేరు, పిల్లిపీచర, ములుగోరింట, అహాంస్ర (ఆదొండ), కరమర్దము (కలివి = వాక), ఈయైదును జేరినసముదాయము కంటకపంచమూలని చెప్పబడును. ఈచెప్పబడిన (వల్లీకంటక) పంచమూలములు రెండును త్రిదోషముల హరించును.

—— బలాత్రయగుణము ——

మూ. బలాత్రయం స్వాదువృష్యం స్నిగ్ధం శీతం బలప్రదమ్,
తత్ర నాగబలా వృష్యా క్షతక్షీణహితా గురుః. ॥౧౫౦॥

వ్యా. బలాత్రయము [బల (చిటాముట్టి), అతిబల (పేరాముట్టి), నాగబల (జిబిలిక) అను నీమూడును] మధురరసము కలిగినవి. శుక్రమును వృద్ధినొందించును. స్నిగ్ధంబును శీతవీర్యంబును నగును. బలమును కలిగించును. ఆమూడిటిలో నాగబల (జిబిలిక) ప్రధానముగ శుక్రమును వృద్ధినొందించును. ఉరఃక్షతరోగముకలవారికి ధాతువులు క్షీణించినవారికిని మిక్కిలి హితకరము. గురుత్వము కలిగియుండును.

—— పసుపు-మ్రానిపసుపు, వీనిగుణములు ——

మూ. కటుతిక్తే నిశే కుష్ఠమేహపిత్తకఫాపహే,
ప్రలేపాజ్జయతః కణ్డూం శోఫం దుష్టవ్రణం విషమ్ ॥౧౫౧॥

వ్యా. పసుపు, మ్రానిపసుపు, (ఈరెండును) కటుతిక్తరసములు కలిగినవి. కుష్ఠమును ప్రమేహమును పిత్తకఫములను హరించును. దీనిని చాది పైనిపూసినయెడ దురదను, వాపును, దుష్టమైనవ్రణమును, విషమును పోగొట్టును.

## తిప్పతీగెగుణము

మూ. తిక్తాఽమృతా త్రిదోషఘ్నీ గ్రాహిణ్యుష్ణా రసాయనీ,
దీపనీ జ్వరహృద్దాహ కామలా వాతరక్తనుత్. ॥౧॥

వ్యా. తిప్పతీగె తిక్తరసము కలిగియుండును. త్రిదోషముల హరించును. మల మూత్రాదుల బంధించును. ఉష్ణవీర్యము కలిగినది. రసాయనము (జరామరణముల పోగొట్టునది) జఠరాగ్నిని దీపింపజేయును. జ్వరమును, దప్పిని, తాపమును, కామలారోగమును, వాతరక్తమును హరించును.

## ములుగోరింటగుణము

మూ. సైర్యక స్తిక్తమధురః స్నిగ్ధోష్ణః కఫవాతనుత్.

వ్యా. సైర్యకము(ములుగోరింట) తిక్తమధురరసములు కలిగినది. స్నిగ్ధంబును, ఉష్ణవీర్యంబును, కఫవాతహరంబును నగును.

## హింస్ర (?) గుణము

మూ. హింస్రా తిక్తా సకటుకా తిక్తోష్ణాశోఫజిల్లఘుః. ॥౩

వ్యా. హింస్ర తిక్తకటురసములు కలిగియుండును. ఉష్ణవీర్యము కలిగినది. శోఫమును హరించును. లఘుగుణము కలిగినది.

## నల్లజీలకఱ్ఱ మున్నగువానిగుణము

మూ. కారవ్యః కుఞ్చికాఽజాజీ కబరీ ధాన్యతుమ్బురు,
అన్నగన్ధహరం రుచ్యం దీపనం కఫవాతజిత్. ॥౪

వ్యా. నల్లజీలకఱ్ఱ, పెద్దజీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, కబరి (కారింగువ), దనియాలు, కొతిమిరి ఇవి అన్నగంధమును హరించును. రుచిని బుట్టించును. అగ్నిని దీపింపజేయును. కఫవాతములను హరించును.

## ఓమమయొక్కగుణము

మూ. అజమోదాత్రయం రూక్షం సతిక్తం కటుకం లఘు,
ఉష్ణం కఫానిలహరం క్రిమిజిత్స్యాగ్నిదీపనమ్. ॥౫

వ్యా. పెద్దఓమము, కురాసానిఓమము, నల్లనిఓమము ఈమూడును రూక్షంబును, తిక్తకటురసంబులును, లఘుగుణంబును, ఉష్ణవీర్యంబును కలిగియుండును. కఫమును, వాతమును, క్రిములను హరించును. అగ్నిని దీపింపజేయును.

## జీరకద్వయగుణము

మూ. రసే పాకే చ కటుకం తీక్ష్ణోష్ణం కఫవాతజిత్,

మేధాగ్నివర్ధనం రుచ్యం గన్ధాఢ్యం జీరకద్వయమ్. ౫౫౬

వ్యా॥ రెండువిధములైనజీలకఱ్ఱ (జీలకఱ్ఱ, అడవిజీలకఱ్ఱ,) రసమునందును విపాకమునందును మధురముగ నుండును. తీక్ష్ణ, ఉష్ణగుణములు కలిగియుండును. కఫవాతములను హరించును. బుద్ధిని జఠరాగ్నిని వృద్ధినొందించును. రుచిని పుట్టించును. మంచిపరిమళము కలిగినది.

హింగుపత్రి మున్నగువానిగుణము

మూ॥ బాష్పికా కటుతిక్తోష్ణా క్రిమిశ్లేష్మహరా పరమ్,
రాజికా సర్షపా తద్వత్ రుచ్యారుచ్యే ఉభే క్రమాత్.

వ్యా॥ హింగుపత్రి కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగియుండును. క్రిములను కఫమును హరించును. సన్నావాలును, పెద్దావాలును పైజెప్పినహింగుపత్రగుణములు కలిగియుండును. అందు సన్నావాలు రుచికరంబులు. పెద్దావాలు రుచికరములు గావు.

సదాప మున్నగువానిగుణములు

మూ॥ శతాహ్వాకుష్ఠతగరసురదారుహరేణవః,
ఏలాలవఙ్గసరళత్వక్ వ్యాఘ్రనఖచోరకాః. ౫౫౭
లఘూష్ణాఃకటుకాఃపాకేకఫవాతనిబర్హణాః,

వ్యా॥ సదాప, చెంగల్వకోష్ఠు, గ్రంథితరము, దేవదారు, రేణుకలు, ఏలకులు, లవంగములు, సరళదేవదారు, లవంగపుచెక్క, వ్యాఘ్రనఖము, కచోరములు ఇవి లఘువులై ఉష్ణవీర్యంబులును కటువిపాకంబులునై కఫవాతముల హరించును.

విషాద్వయముస్తాగుణములు

మూ॥ పాచనం కఫపిత్తఘ్నం తిక్తం శీతం విషాద్వయమ్. ౫౫౯
కఫఘ్నం తిక్తకటుకం ముస్తం సఙ్గ్రాహిపాచనమ్(జీవనమ్)

వ్యా॥ విషాద్వయము (తెల్లఅతివస, నల్లఅతివస) పాచనముజేయును. కఫపిత్తముల హరించును. చేదును శీతవీర్యంబును కలిగియుండును. తుంగగెడ్డలు కఫమును పోగొట్టును. చేదును కారమును కలిగియుండును. మలమును గట్టిపరచును. భుజింపబడిన యాహారముల జీర్ణింపజేయును. (బలమును కలిగించును).

భూనింబపర్పటాదిగుణములు

మూ॥ తిక్తశీతౌజ్వరహరౌ లఘూభూనిమ్బపర్పటౌ. ౫౬౦
నిమ్బస్తిక్తోహిమః కుష్ఠక్రిమిపిత్తకఫాపహః,
మహానిమ్బః పరంగ్రాహీ కషాయోరూక్షశీతలః. ౫౬౧

వ్యా. నేలవేమును, పర్పాటకంబును చేదుకల్గి శీతవీర్యములై జ్వరహారములుగ నుండును. శీఘ్రముగ జీర్ణములగును. వేము చేదుగనుండును. శీతవీర్యము కలిగినది. కుష్ఠములను క్రిములను కఫరోగములను హరించును. పెద్దవేము మిక్కుటముగ మలాదులబంధించును. వగరును రూక్షగుణంబును శీతవీర్యంబును కలిగియుండును.

మూ. *యశ్శ్లోత్తుంస్సదా వా స్నిగ్ధ ద్రవపిచ్ఛిలో విగతస్సుక్షః,
[illegible] ౫౬౨
యః పక్వ రాగారాగో యః కనకేసమాంత్రః, యోవా,
యస్త్వింద్రనీలమమాలం ఛగోన్మిద్యతేకా స్త్రికల్పేన. ౫౬౩
మూ. గుగ్గులుః పిచ్ఛిలః స్పర్శే విశదోఽభ్యనహాంరతః,
సస్వాదుకటుక స్తిక్త సకషాయో రసాయనమ్. ౫౬౪
వృష్య(వ్రణ్యా)స్స్వర్యః కటుః పాకే రూక్షసూక్ష్మోఽగ్నిదీపనః,
క్లేద మేదోఽనిల శ్లేష్మగణ్డ మేహాపచిక్రిమీన్. ౫౬౫
పిటకాగ్రన్థిశోఫాంశ్చహన్త్యర్శస్సఱంసనో లఘుః,

వ్యా. గుగ్గిలము స్పర్శముచే పిచ్ఛిలమై విశదముగ నుండును. తినినచో తీపియు కటురసంబును తిక్తకషాయరసంబులును కలిగియుండును. ఇయ్యది రసాయనము (ముసలితనమును పోగొట్టి యాయువును వృద్ధినొందించునది). ఇంద్రియపుష్టిని జేయును. వ్రణములమాన్పును. కంఠస్వరమునకు మేలుచేయును. విపాకమున కటువుగ నుండును. రూక్షసూక్ష్మగుణములుకలిగి అగ్నిని దీపింపజేయును. వ్రణాదులయందలి ద్రవమును మేదోవృద్ధిని వాతకఫములను గల్లిగండములను ప్రమేహములను అపచివ్రణమును క్రిములను పిటకలను గ్రంధులను శోఫమును వీనిసన్నింటిని హరించును. ఉష్ణవీర్యమైనది. మలాదుల సడలింపజేయును. చుల్కనగ జీర్ణమగును.

## కుక్కుటశింబపత్రగుణము

మూ. విషశోఫవిసర్పఘ్నం పత్రం కుక్కుటశింబిజమ్. ౫౬౬

కుక్కుటశింబి (?) పత్రము విషదోషమును విసర్పమును శోఫను బోగొట్టును.

---

* ఈశ్లోక మిచ్చట నన్వితముకాదు. ఇది రత్నలక్షణములలో నుండి యిచ్చట పడియుండును. లేక మహిషాక్షిగుగ్గిలముయొక్క భేదములను నిరూపించునదియై యుండును.

### శంఖపుష్పీవచాగుణములు

మూ. శఙ్ఖపుష్పీ సరా తిక్తా మేధ్యా క్రిమివిషాపహా,
వచా వాతకఫాఽఽస్యఘ్నీ లేఖనీ బుద్ధివృద్ధికృత్. ౫౬౭

వ్యా. శంఖపుష్పి అనునది శరీరమున శీఘ్రముగ వ్యాపించును. తిక్తరసము కలిగియుండును. బుద్ధిని వృద్ధినొందించును. క్రిములను విషమును హరించును. వసవాతమును హరించును. కఫమును అర్శోరోగమును హరించును. దోషముల లేఖనము జేయును. బుద్ధిని విశేషముగ వృద్ధినొందించును.

### అవల్గుజైడగజబీజలగుణములు

మూ. అవల్గుజైడగజయోః బీజం వాతకఫప్రణుత్,
మధురం రక్తపిత్తఘ్నం వ్రణశోధనరోపణమ్. ౫౬౮
గురుస్వాదు హిమం వృష్యం చక్షుష్యం స్వరవర్ణకృత్,

వ్యా. బావంచివిత్తులును, తగిరిసవిత్తులును వాతకఫములను హరించును. మధురరసము కలిగియుండును. రక్తపిత్తములను హరించును. వ్రణముల శుద్ధిపరచి మాన్చును. గురుత్వముగలిగి మధురవిపాకముగ నుండును. శీతవీర్యముకలిగినది శుక్రవద్ధిచేయును. కన్నులకు వాతకరము కంఠస్వరమును శరీరకాంతిని కలిగించును.

### కర్పూరపుబెండగుణము

మూ. ప్రపౌణ్డరీకం చక్షుష్యం శిశిరం వ్రణరోపణమ్. ౫౬౯
కషాయమధురం వృష్యం రక్తపిత్తప్రసాదనమ్,

వ్యా. ప్రపౌండరీకము (కర్పూరపుబెండ) కన్నులకు హితకరము. శీతవీర్యము వ్రణములను మాన్పును. వగరును తీపియు కలిగియుండును. శుక్రమును వృద్ధిజేయును. రక్తపిత్తమును నిర్మలముగ జేయును.

### తెల్లమిరియాలగుణము

మూ. చక్షుష్యం శ్వేతమరిచం శూలవైస్వర్యశుక్రహృత్. ౫౭౦

వ్యా. తెల్లమిరియములు కన్నులకు మిక్కిలి హితకరములు. శూలను, కంఠస్వరభేదమును, శుక్రదోషమును హరించును.

### అష్టవర్గగుణములు

మూ. బుద్ధివృద్ధీ ద్వికాకోలీ ద్వే మేదే జీవకర్షభౌ,
అష్టవర్గోఽతిహిమస్స్వాదుః వృష్యో పిత్తానిలాపహః. ౫౭౧

వ్యా॰ బుద్ధివృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, జీవకము, ఋషభకము, ఈయెనిమిదియుఁజేరి అష్టవర్గ మనబడును. ఈవర్గము, శీతవీర్యంబును, మధురరసంబును కలిగినది. శుక్రమును వృద్ధినొందించును. పిత్తవాతములహరించును.

వృద్ధదారుగుణము

మూ॰ వాతజిత్కటు తిక్తోష్ణః శ్లేష్మహా వృద్ధదారుకః,

వ్యా॰ వృద్ధదారుకము వాతము హరించును. కటుతిక్తరసంబులును ఉష్ణవీర్యంబును కలిగినది. కఫమును హరించును.

దన్తీగుణములు

మూ॰ దన్తీ తీక్ష్ణోష్ణకటుకాజియేద్వాతకఫోదరమ్. ౫౭౨
అర్శో వ్రణాశ్మరీశూలం హన్తి శోధనదీపనీ,

వ్యా॰ దంతిబీజములు (నేపాళపుగింజలు) తీక్ష్ణ-ఉష్ణగుణంబులును, కటురసంబును కలిగియుండును. వాతకఫములను ఉదరముమ హరించును. అర్శోరోగమును, వ్రణములను, అశ్మరీరోగమును, శూలరోగమును హరించును. మలాదుల శోధించును (వమన విరేచనములజేయును.) అగ్నిని దీపింపజేయును.

ఎఱ్ఱతెగడగుణము

మూ॰ కటుకోష్ణా త్రివృత్తృష్ణా క్రిమిశ్లేష్మోదర వ్రణజిత్. ౫౭౩
శోథపాణ్డూదరప్లీహా హన్త్రీశ్రేష్ఠా విరేచనీ,

వ్యా॰ ఎఱ్ఱతెగడ కటురసంబును ఉష్ణవీర్యంబును కలిగినది. దప్పిని, క్రిములను, కఫమును, ఉదరమును హరించును. శోఫమును, పాండురోగమును, ప్లీహావృద్ధిని పోగొట్టును. విరేచనౌషధములలో నిది మిగుల శ్రేష్ఠమైనది.

తెల్లతెగడలగుణము

మూ॰ కషాయా మధురా రూక్షా విపాకే మధురా త్రివృత్. ౫౭౪
కఫపిత్తప్రశమనీ శ్వేతా త్వనిలకోపనీ,

వ్యా॰ తెల్లతెగడకషాయము మధురరసంబులును, రూక్షగుణంబును, మధురవిపాకంబును కలిగియుండును. కఫపిత్తముల శమింపజేయును. వాతమును మాత్రము ప్రకోపింపజేయును.

జిల్లేడుపాలు, జెముడుపాలు వీనిగుణములు

మూ॰ క్షీరమర్కస్య తీక్ష్ణోష్ణం రూక్షం సలవణం లఘు. ౫౭౫
వాతఘ్నమాఖువిషజిత్; స్నుహాక్షీరం పునస్సరమ్,

కటుతిక్తం లఘు స్నిగ్ధం తత్సుష్ఠోదరగుల్మినామ్. ౫౨౬
శ్రేష్ఠమేతద్విరేకార్థా యే చ సుఖః దీర్ఘరోగిణః,

వ్యా. జిల్లేడుపాలు తీక్ష్ణ-ఉష్ణ రూక్షగుణంబులును, లవణరసంబును కలిగినది. తేలికగా జీర్ణమగును. వాతమును, ఎలుకలవిషమును హరించును. జెముడుపాలు శరీరమున శీఘ్రముగ వ్యాపించును. కటుతిక్తరసంబులును, లఘుస్నిగ్ధగుణంబులును కలిగినది. అయ్యది కుష్ఠరోగము, మహోదరము, గుల్మరోగమును కలవారికి మిక్కిలి శ్రేష్ఠమైనది. మరియు దీర్ఘకాలముగ ననుసరించినరోగములు కలిగినవారికిని, పైజెప్పినకుష్ఠాదిరోగులకు విరేచనమునకై జెముడుపాలు మిక్కిలి శ్రేష్ఠమైనది.

కృతమాలగుణము

మూ. కృతమాలస్సరస్తిక్తః గురూష్ణః క్రిమిశూలనుత్. ౫౨౭
తత్ఫలం మధురం బల్యం వాతపిత్తాపహం సరమ్,

వ్యా. కానుగ శరీరమున శీఘ్రముగ వ్యాపించును. చేదును, గురు-ఉష్ణగుణంబులును కలిగినది. క్రిములను శూలలను హరించును. దానికాయ మధురముగ నుండును. బలకరము, వాతపిత్తములను హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును.

అడ్డసరపుగుణము

మూ. వాశా తిక్తకషాయా స్యాత్ వాతశ్లేష్మాస్రనాశినీ. ౫౨౮
దుష్టవ్రణాపహా దన్త్యా శ్లేష్మఘ్నీ చ మరీచికా,

వ్యా. అడ్డసరము తిక్తకషాయరసములు కలిగియుండును. వాతకఫములను రక్తపిత్తమును హరించును. మిరియాలు దుష్టవ్రణముల హరించును. దంతములకు హితకరము. కఫమును హరించును.

రేగుపండు, బావంచివిత్తులు వీనిగుణములు

మూ. ఫేనిలస్య ఫలం తిక్తం విషశూలహరం లఘు. ౫౨౯
వాకుచ్యబీజం హృద్రోగదోషాపహం లఘు,

వ్యా. రేగుపండు కొంచెము చేదుకలిగియుండును. విషమును శూలమును హరించును. తేలికగ జీర్ణమగును. బావంచివిత్తులు హృదయరోగమును, త్రిదోషములను హరించును.

శల్యకమధూకఫలగుణము

మూ. శల్యకస్య ఫలం శోఫ కాచవ్రణవిషాపహమ్. ౫౩౦
మధూకశ్శీతలో రూక్షః ప్లీహా మేహవ్రణాపహః,

వ్యా. శల్యకముయొక్క ఫలము శోఫమును, కాచమను నేత్రరోగమును విషమును హరించును. మధూకము (ఇప్ప) శీతవీర్యంబును; రూక్షగుణంబును, ప్లీహావృద్ధిని ప్రమేహములను హరించునదియు నగును.

నీటిపాచిగుణము

మూ. శైవాలపత్రశైవాలే మధురస్నిగ్ధపిచ్ఛిలే. ౫౮౧
కేశ్యే శోణితపిత్తఘ్నే గురుణీ శ్లేష్మవాతలే,

వ్యా. నీటిలోనుండుపాచియు, నీటిపై నాకులు కలిగి వ్యాపించియుండుపాచియు మధురముగను, స్నిగ్ధపిచ్ఛిలగుణములుకలిగియు నుండును. వెంట్రుకలకు హితకరము. రక్తపిత్తమును హరించును. గురుత్వముచేయును. కఫవాతములను వృద్ధినొందించును.

అశ్మంతకము భుజపత్రి వీనిగుణములు

మూ. అశ్మన్తః కఫపిత్తాస్రకాసచాతుర్థికాపహః. ౫౮౨
బ్రాహీ శీతకషాయశ్చ భూర్జో వ్రణ్యః కఫాస్రజిత్,

వ్యా. అశ్మంతము కఫమును, రక్తపిత్తమును, కాసములను, చాతుర్థికజ్వరమును హరించును. భుజపత్రి మలమును బంధించును. శీతవీర్యంబును కషాయరసంబును కలిగినది. వ్రణములకు హితకరము. కఫమును రక్తదోషమును హరించును.

పెనువేము, కాంచనారము - వీనిగుణములు

మూ. అరలుః కోవిదారశ్చ వ్రణ్యౌ పిత్తకఫాపహౌ. ౫౮౩

వ్యా. అరలు (పెనువేము), కోవిదారము (కాంచనారము = దేవకాంచనము) ఈరెండును వ్రణములకు హితకరములు. పిత్తకఫములను హరించును.

పద్మగుణము

మూ. కషాయం మధురం పద్మం రక్తపిత్తకఫాస్రజిత్,

వ్యా. పద్మము (తామరపువ్వు) వగరును తీపును కలిగియుండును. రక్తపిత్తమును, కఫమును, రక్తదోషమును హరించును.

సర్పాక్షి, సూర్యభక్త, సువహ వీనిగుణములు

మూ. సర్పాక్షీ సూర్యభక్తా చ కటుతిక్తే వ్రణాపహే. ౫౮౪
సువహః (హా) కటుకస్తిక్తః వాతశ్లేష్మవిషాపహః,

వ్యా. సర్పాక్షి, సూర్యభక్త (ప్రొద్దుతిరుగుడుచెట్టు) ఈరెండును కటుతిక్తరసములు కలిగియుండును. వ్రణములను హరించును. నల్లవావిలి కటుతిక్తరసములు కలిగి వాతకఫములను విషములను హరించును.

### ---- మ్రంగపండు గుణము ----

మూ. మదనం కటుకం కోల కుక్కురాఖువిషాపహమ్. ౫౮౫

వ్యా. మదనఫలము (మ్రంగపండు) కటురసము కలిగియుండును. పంది, తోడేలు, పందికొక్కు అను నీజంతువులవిషమును హరించును.

### ---- చేదుసొర మున్నగువానిగుణములు ----

మూ. ఇక్ష్వాకుః క్ష్వేళజీమూతః రూక్షోష్ణఃకటుతిక్తకః. ౫౮౬
గాఢప్రచ్ఛర్దనః కుష్ఠపాణ్డుశోఫవిషాపహాః,

వ్యా. చేదుసొర, దేవదాళి ఈరెండును రూక్షోష్ణగుణంబులును, కటుతిక్తరసంబులు కలిగియుండును. గాఢముగ వమనముచేయించును. కుష్ఠమును, పాండువును, శోఫమును, విషమును హరించును.

### ---- మదనగుణము ----

మూ. మదనశ్ఛర్దనస్తిక్తః కటురూక్షో వ్రణే హితః. ౫౮౭
వస్తిశోఫప్రతిశ్యాయగుల్మశ్వాసే చ విద్రధౌ,

వ్యా. మ్రంగకాయ వాంతిచేయును. తిక్తరసము కలిగినది. కటువిపాకంబును రూక్షగుణంబును కలిగియుండును. వ్రణరోగమున హితకరము. వస్తిరోగములయందును, నంజులయందును, పీనసమునందును, గుల్మరోగమునందును, శ్వాసరోగమునందును, విద్రధి వ్రణమునందును హితకరము.

### ---- జనుపగుణము ----

మూ. శణపుష్పీ రసే తిక్తా ఛర్దినీ శ్వయదా కఫే. ౫౮౮
రాజయక్ష్మణి పిత్తాస్రే పాణ్డురోగే చ శస్యతే,

వ్యా. జనుము తిక్తరసము కలిగియుండును. వాంతిని కలిగించును. వాపునందును, కఫమునందును, రాజయక్ష్మమునందును, పిత్తరక్తమునందును, పాండురోగమునందును మిక్కిలి హితకరము.

### ---- శంఖిని (దింటెన) మున్నగువానిగుణములు ----

మూ. శంఖినీ కటుతిక్తోష్ణా లఘ్వీ స్నిగ్ధావిరేచనీ. ౫౮౯
కంగుణీ కటుతిక్తోష్ణా వ్రణ్యా మేధ్యా విరేచనీ,
వర్ణకృన్మదయన్తీ చ వ్రణ్యా వర్ణ్యా కఫాపహా. ౫౯౦

వ్యా. దింటెన కటుతిక్తరసములును, ఉష్ణవీర్యంబును, లఘుస్నిగ్ధగుణంబులును కలిగి యుండును. విరేచనముల జేయును. కుంకుడు కటుతిక్తరసముకలిగి ఉష్ణవీర్యముగ

నుండును. వ్రణములయందును బుద్ధికిని హితకరము. విరేచనముల జేయును. మఱియు శరీర వర్ణమును కలిగించును. వ్రణముల హరించును. కఫమును పోగొట్టును.

### పూలాసధుత్తూరగుణము

మూ. కషాయశీతం పూలాసం శోణితస్థాపనం గురు,
ధుత్తూరః కటుతిక్తోష్ణః కుష్ఠకణ్డూవ్రణాపహః. ౯౯౧

వ్యా. పూలాసము కషాయరసంబును శీతవీర్యంబును కలిగినది. రక్తమును స్థిరముగ జేయును. గురుత్వము చేయును. ఉమ్మెత్త కటుతిక్తరసములును ఉష్ణవీర్యంబును కలిగియుండును. కుష్ఠమును దురదను వ్రణములను హరించును.

### బావంచిమున్నగువానిగుణములు

మూ. వాకుచీ తు క్రిమిహరా రసే తిక్తా రసాయనీ,
గుఞ్జా రూక్షా హిమా వ్రణ్యా విషమేహక్రిమిప్రణుత్. ౯౯౨
శిరీషో విషహా వ్రణ్యస్తీక్ష్ణోష్ణః శ్వాసకాసజిత్,
అదర్శనీ క్రిమిశ్లేష్మవిషగుల్మోదరాపహా. ౯౯౩
శోఫఘ్నీ స్తమ్భనీ కణ్డూవిషఘ్నీ గిరికర్ణికా,
ఖదరః ఖదిరశ్చాపి తిక్తశీతః కఫాపహః. ౯౯౪
దన్తీ ప్రమేహవీసర్పకాసకణ్డూక్రిమిప్రణుత్,
కదుష్ణా రేచనీ వ్రణ్యా కాసఘ్నీ చేన్ద్రవారుణీ. ౯౯౫
మూర్వా తిక్తారసా మేహవిషమజ్వరకాసజిత్,

వ్యా. బావంచివిత్తులు క్రిములను హరించును. తిక్తరసము కలిగియుండును. రసాయనము (జరనువ్యాధులను హరించునది). గురిగింజలు రూక్షగుణంబును, శీతవీర్యంబును కలిగినది. వ్రణములకు హితకరము. విషమును, ప్రమేహమును, క్రిములను హరించును. దిరిసనపువిత్తులు విషమును హరించును. వ్రణములకు హితము. తీక్ష్ణోష్ణగుణములు కలిగినది. శ్వాసకాసములను హరించును. అదర్శని (మాల్కంగిని) క్రిములను కఫమును హరించును. విషమును, గుల్మములను, ఉదరములను హరించును. కొండగోగు శోఫమును హరించును. మలాదులను స్తంభింపజేయును. దురదను విషమును హరించును. చండ్ర, వెలిచండ్ర ఈరెండును తిక్తరసంబును, శీతవీర్యంబును కలిగియుండును. కఫమును హరించును. దంతి ప్రమేహమును, విసర్పమును, కాసమును, దురదను క్రిములను హరించును. చంద్రవారుణి (చంద్రపోడ) కొంచెముగ నుష్ణమై యుండును. విరేచనముచేయును. వ్రణములకు హితకరము. కాసమును హరించును. చాగతిక్తరసముకలిగినది. మేహములను, విషమజ్వరములను, కాసములను హరించును.

## అశ్వగంధాదిగుణములు

మూ. తిక్తాఽశ్వగన్ధా బలకృత్ విషవాతకఫాపహా. ౫౯౬
నిర్గుణ్డీ కటుతిక్తోష్ణా క్రిమివాతకఫాపహా,
కాసజిద్వాతశమనీ వృశ్చికాలీవిషాపహా. ౫౯౭
తిక్తకింశుకయోర్బీజం సరముష్ణం గరాపహమ్,
వాతఘ్నం చ తయోః క్షీరం వ్రణశుక్రక్రిమివ్రణుత్. ౫౯౮
గ్రన్థిపర్ణం హిమం స్వాదు తిక్తం వాతకఫాపహమ్,
కాలీస్వాదుకషాయోష్ణా స్తమ్భినీ వ్రణరోపణీ. ౫౯౯
బోళాం తిక్తం హిమం వీర్యే పిత్తఘ్నం కఫదోషజిత్,
కషాయా సల్లకీ తిక్తా పిత్తశ్లేష్మనిబర్హణీ. ౬౦౦
శైలేయం శిశిరం తిక్తం కణ్డూకుష్ఠవిషాస్రజిత్,
లాక్షా పిత్తాస్రజిత్తిక్తా బ్రాంహీ ప్రజ్ఞావివర్ధనీ. ౬౦౧
సితం విసర్పశుద్ధ్యర్థ్రిణాంసిద్ధం సన్ధానకారి చ,

వ్యా. అశ్వగంధ (పెన్నేరుగడ్డ) చేదుగ నుండును. బలమును కలిగించును. విషమును వాతకఫములను హరించును. నల్లవావిలి కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగియుండును. క్రిములను వాతకఫములను హరించును. తేలుమణిచెట్టు దగ్గును శమింపజేయును. వాతమును, తేలు మున్నగువానివిషమును హరించును. కొండిశెవిత్తులును మోదుగవిత్తులును శరీరమున శీఘ్రముగ వ్యాపించును. ఉష్ణవీర్యము, విషమును హరించును. మరియు కొండిశెపాల మోదుగ ఈరెండిటిపాలు వ్రణముల మాన్పును. శుక్రదోషమును క్రిములను హరించును. మాచిపత్రి శీతవీర్యంబును మధురతిక్తరసంబులును కల్గినది. వాతకఫములను హరించును. తాళిసపత్రి మధురకషాయరసంబులును ఉష్ణవీర్యంబును కల్గియుండును. మలమును స్తంభింపజేయును. వ్రణముల మాన్పును. బాలింతబోళము చేదుగ నుండును. శీతవీర్యము కలిగినది. పిత్తమును, కఫమును హరించును. అందుగుచెట్టుబంక చేదుగ నుండును. పిత్తకఫములను హరించును. శిలాజతువు శీతవీర్యంబును, తిక్తరసంబును కలిగినది. దురదను కుష్ఠమును విషమును హరించును. రక్తదోషమును పోగొట్టును. లక్క తిక్తరసము కలిగినది. పిత్తరక్తమును హరించును. బ్రాహ్మి (సరస్వతియాకు) జ్ఞానమును వృద్ధినొందించును. తెల్లావాలు విసర్పమును పోగొట్టును. వ్రణములకు హితకరము. విరిగిన యెముకలు మున్నగువానిని అతుకజేయును.

## లవంగములగుణము

మూ. వరాళం తిక్తకటుకం కషాయం స్వాదుదీపనమ్. ౬౦౨
ఛర్దితృష్ణాశ్వయథుజిత్ వృష్యం బుద్ధేశ్చ వర్ధనమ్,

వ్యా. లవంగము తిక్తకటుకషాయరసములును, మధురవిపాకంబును కలిగియుండును. అగ్నిని దీపింపజేయును. వాంతిని దప్పిని వాపును హరించును. శుక్రమును బుద్ధిని వృద్ధి చేయును.

## జాజికాయగుణము

మూ. జాతీఫలం సుగన్ధాఢ్యం స్వాదుతిక్తకషాయకమ్. ౬౦౩
మేధ్యం తృష్ణాహరం వృష్యం గరఘ్నం బలకృత్ స్ఫుటమ్.

వ్యా. జాజికాయ మంచిపరిమళము కలిగియుండును. మధురతిక్తకషాయరసములు కలిగినది. బుద్ధిని వృద్ధినొందించును. దప్పిని పోగొట్టును. శుక్రమును వృద్ధినొందించి సంభోగశక్తిని కలిగించును. విషమును హరించును. బలమును కలిగించును.

## తక్కోలములగుణము

మూ. క్షయహరమరుచిఘ్నం సౌష్ఠవం సోతిధత్తే. ౬౦౪
విషహరముదరార్శో మూత్రకృచ్ఛ్రాశ్మరీంశ్చ,
జ్వరనయనముఖోత్థాన్ హన్తి తక్కోలబీజమ్. ౬౦౫

వ్యా. తక్కోలములు కటుకషాయరసంబులును, శీతవీర్యంబును కలిగియుండును. త్రిదోషములను, క్షయమును, అరోచకమును పోగొట్టును. శరీరసౌకుమార్యమును కలిగించును. విషమును హరించును. మహోదరము, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, అశ్మరీరోగము, జ్వరము, నేత్రరోగములు, ముఖరోగములు అను నీవ్యాధులను హరించును.

మూ. కటుకం మధురం పాకే బల్యం హృద్యం విషాపహమ్,
వ్రణశుద్ధికరం శ్లేష్మహారం మర్కటకీఫలమ్. ౬౦౬

వ్యా. మర్కటకీఫలము (పెద్దదూలగొండివిత్తులు) కటురసంబును, మధురవిపాకంబును కలిగియుండును. బలకరంబును, హృదయమునకు హితకరంబును, విషహారంబును నగును. వ్రణమును శుద్ధిచేయును. కఫమును హరించును.

## అగరుగుణము

మూ. కటుతిక్తోష్ణమగరు స్నిగ్ధం వాతకఫాపహమ్,
పిత్తాసృగ్విష తృడ్దాహ క్లమఘ్నం గురురూక్షణమ్. ౬౦౭

వ్యా. అగరు కటుతిక్తరసంబులును, ఉష్ణవీర్యంబును, స్నిగ్ధగుణంబును కలిగియుండును. వాతకఫముల హరించును. రక్తపిత్తమును, విషమును, దప్పిని తాపమును, బడలికను వీనినన్నిటిని పోగొట్టును. గురుత్వంబును, రూక్షగుణంబును కలిగియుండును.

చందనము, వట్టివేరు, కురువేరు వీనిగుణములు

మూ. సర్వం సతిక్తమధురం చన్దనం శిశిరం సరమ్,
లఘుతిక్తం తథోశీరం వాలకం పాచనంచ తత్. ౬౦౯
జ్వరాతిసారవమథురక్తపిత్తక్షతాపహమ్,

వ్యా. పలువిధములైనచందనములును తిక్తమధురరసంబులును, శీతవీర్యంబును కలిగియుండును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును; వట్టివేళ్లు తేలికయై తిక్తరసము కలిగియుండును. కురువేరు జఠరాగ్నిని జ్వలింపజేసి యాహారమును పచింపజేయును. జ్వరాతిసారములను, వమనములను, రక్తపిత్తమును, ఉరఃక్షతమును హరించును.

కర్పూరము మున్నగువానిగుణములు

మూ. సస్వాదుతిక్తస్తృష్ణాఘ్నః కర్పూరశ్ఛేదనోహిమః. ౬౧౦
వాతాకస్తూరికా తద్వన్ముఖశోషహరా పరమ్,
దన్తదార్ఢ్యకరం రుచ్యం తైలం కర్పూరసమ్భవమ్. ౬౧౧

వ్యా. పచ్చకర్పూరము మధురతిక్తరసములు కలిగియుండును. దప్పి నణచును. కఠినముగ నుండుమలమును విడదీయును, శీతవీర్యముకలది. కస్తూరికిని పైజెప్పినగుణములు కలిగియుండును. నోరెండుటను హరించును. కర్పూరమునుండి తీయబడినతైలము దంతములకు పటుత్వమును కలిగించును. రుచిని బుట్టించును. కట్టెలను కాల్చి చేయబడినకర్పూరము కర్పూరతైలమునకు జెప్పినగుణములు కలిగియుండును. మరియు తీక్ష్ణఉష్ణగుణములు కలిగియుండును.

కస్తూరిగుణము

మూ. కటుతిక్తకషాయోష్ణా కస్తూరీకఫవాతజిత్,
క్షయజన్తువిషాస్రఘ్నీ కణ్డూవైవర్ణ్యజిచ్ఛ్వసా. ౬౧౨

వ్యా. కస్తూరి కటు-తిక్త-కషాయరసంబులును, ఉష్ణవీర్యంబును కలిగినది. కఫవాతములను హరించును. ధాతుక్షయమును సర్పము మున్నగువాని జంతువులవిషమును, రక్తదోషమును, దురదను, వివర్ణత్వమును వీనినన్నిటిని మాన్పును.

మృగస్వేదగుణము

మూ. ఉష్ణవీర్యో మృగస్వేదః కఫమారుతకుష్ఠజిత్,
పూత్యణ్డజోద్భవస్తద్వదకాలపలితప్రదమ్. ౬౧౩

వ్యా॰ మృగస్వేదము (మృగములపిత్తము) ఉష్ణవీర్యముగ నుండును. కఫమును, వాతమును, కుష్ఠమును హరించును. బూతుపిల్లిగడ్డ (అండము)లోని క్రొవ్వువంటివస్తువు కఫ వాతములను హరించును. అకాలమున నే వెండ్రుకలు నరయునట్లు చేయును.

దవనము, మురవీనిగుణములు

మూ॰ దమనో విషజిత్పిత్త కుష్ఠకచ్ఛ్వస్రణాపహా,
మురాతిక్తాకషాయా స్రుక్పిత్తాశ్లేష్మవిషాపహా. ౬౧౪

వ్యా॰ దవనము విషమును హరించును. పిత్తము, కుష్ఠము, దురద, వ్రణములు వీని నన్నిటిని మాన్పును. ముర యనుగ్రంధ్యము తిక్తకషాయరసములు కలిగియుండును. రక్త పిత్తమును, కఫమును, విషమును హరించును.

తామరసాదిపుష్పగుణములు

మూ॰ కషాయమధురం శీతం పద్మం పిత్తకఫాస్రజిత్,
తద్వద్వకుళపున్నాగకుముదోత్పలపాటలమ్. ౬౧౫
సచంపకం తతోన్యూనం మణికోరణ్డకింశుకమ్,

వ్యా॰ తామరపువ్వుకషాయము మధురరసములును, శీతవీర్యంబును కలిగియుండును. పిత్తకఫములను రక్తదోషమును హరించును. మరియు పొగడపువ్వులును, పొన్నపువ్వులును, కలువపువ్వులును, నల్లకలువలును, పాదిరిపువ్వులును, తామరపువ్వులకు జెప్పినగుణములే కలిగియుండును. మరియు సంపంగిపువ్వులు కణి(నందివృక్షముపూలు), గోరంటపువ్వులు, మోదుగపువ్వులు ఇవియన్నియు తామరపువ్వులకు జెప్పినగుణముల కొన్ని కొంచెము తక్కువయైనగుణములు కలిగియుండును.

జాజి మున్నగువానిపువ్వులగుణములు

మూ॰ మాలతీమల్లికాపుష్పం తిక్తం జయతిమారుతమ్. ౬౧౬
విషపిత్తకఫోన్మాదం సిన్దువారంచ తద్గుణమ్,

వ్యా॰ జాజిపువ్వులును, మల్లెపువ్వులును, తిక్తరసము కలిగియుండును. వాతమును, విషమును, పిత్తమును, కఫమును, ఉన్మాదమును జయించును. మరియు తెల్లవావిలిపువ్వు లును అట్టిగుణములు కలిగియుండును.

మొగలిపువ్వు మున్నగువానిగుణములు

మూ॰ కఫఘ్నం కైతకం పుష్పం శిరీషం విషహారిచ. ౬౧౭

వ్యా॰ మొగలిపువ్వులు కఫమును హరించును. దిరిసెనపువ్వు విషమును హరించును.

మంకెనపువ్వుమున్నగువానిగుణము

మూ. బన్ధూకం శ్లేష్మలం గ్రాహి తద్వదేవచ యూధికా. ౬౯.౮
నేపాళం కోష్ణకటుకం ముఖనేత్రవికారజిత్,

వ్యా. మంకెనపువ్వు కఫమును వృద్ధినొందించును. మలాదుల నిరోధించును. అడవిమొల్లపువ్వుకూడ పైజెప్పినగుణముల గలిగియుండును. నేపాళపుష్పము కొంచెముగ నుష్ణగుణంబును కటురసంబును కలిగియుండును. ముఖరోగములను, నేత్రరోగములను జయించును.

చేమంతి, మొల్లపువ్వులగుణము

మూ. *తరుణీ గ్రాహిణీ శీతా సర్వదోషహరాలఘుః. ౬౧౯
కషాయానురసస్స్వాదుః కుబ్జకాశీతివాతహా,
కున్దః కటురసశ్శీతో విషఘ్నశ్చాపి శీతలః. ౬౨౦

వ్యా. చేమంతిపువ్వు మలమును బంధించును. శీతవీర్యము కలది. త్రిదోషమును హరించును. తేలికగ జీర్ణమగును. వగరుతోగూడిన తీపికలిగియుండును. కుబ్జకవాతమును, ఎనుబదివిధములైన వాతములను హరించును. మొల్లపువ్వులు కటురసంబును శీతవీర్యంబును కలిగినది. విషముల హరించును. చలువజేయును.

దంతధావనగుణము

మూ. శ్లేష్మావలేపదౌర్గన్ధ్యం వదనస్యాపకర్షతి,
సౌమనస్యం రుచిం చాస్యే విధత్తే దన్తధావనమ్. ౬౨౧

వ్యా. దంతధావనము (పలుదోముట) వలన నోటిలో కఫము చుట్టుకొనియుండుటను, దుర్గంధమును పోగొట్టును. మనస్సునకు నిర్మలతను నోటికి రుచిని కలిగించును.

జిహ్వాలేఖనగుణము

మూ. జిహ్వా విలేఖనం తద్వత్ ముఖప్రక్షాళనం జయేత్. ౬౨౨
శోషం ముఖస్య పిత్తాసృక్పిటకావ్యఙ్గనీలికాః,

వ్యా. నాలుకను గీచుటచేతకూడ పైజెప్పినగుణములు కలిగియుండును. ముఖమును కడుగుటవలన నోరెండుటను, రక్తపిత్తమును, పొక్కులను, మంగును, పుట్టుమచ్చలను మాన్చును.

తాంబూలగుణము

మూ. తామ్బూలం సకటుక్షారం రుచ్యముష్ణం కఫప్రణుత్. ౬౨౩

---

* తరుణి యనగా గులాబి యని కొందఱందురు.

నాగవల్లీదళం వృష్యం వాతశ్లేష్మనిషూదనమ్. ౬౨౩
కఫపిత్తహరం రూక్షం వక్త్రక్లేదమలాపహామ్,
కషాయ మీాషన్మధురం లఘుపూగఫలం సరమ్. ౬౨౪
సరకః కటుక స్తీక్ష్ణః క్షారో రూక్షో లఘుస్సరః,
ఆస్యం దహాత్యుపచితం కణ్ఠకోష్ఠస్య సేవితమ్. ౬౨౫

వ్యా. తాంబూలము కటుక్షారరసములుకలిగి, ఉష్ణవీర్యంబును, రుచికరంబును, కఫహారంబును నైయుండును. తమలపాకు సంభోగశక్తిని వృద్ధినొందించును. వాతకఫములను హరించును. వక్కలు కఫపిత్తములను హరించును. రూక్షగుణముకలిగినది. ముఖమునందలి చెమ్మను మాలిన్యమును హరించును. వగరును మధురంబును కలిగియుండును. తేలికగ జీర్ణమగును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును. సున్నము కారము కలిగి తీక్ష్ణముగ నుండును. రూక్షలఘుగుణంబులు కలిగి శరీరమున తీవ్రముగ వ్యాపించును. దానిని అధికముగ నుపయోగించినచో నోట మంట పుట్టించును. కంఠమునందును కోష్ఠమునందును మంట పుట్టించును.

## క్షారాధిక్యమునగల్గుదోషములు

మూ. రూక్షోష్ణతీక్ష్ణక్లేదిత్వాత్ ప్రసాదం హన్తిచక్షుషః,
పాణ్డుంచ కురుతే తస్మాత్ క్షారోఽత్యర్థనిషేవితాః. ౬౨౬

వ్యా. సున్నము రూక్ష-ఉష్ణ-తీక్ష్ణగుణములుకలిగి చెమ్మను పుట్టించునది యగుటం జేసి కన్నులప్రసన్నతను పోగొట్టును. పాండురోగమును బుట్టించును. కావున సున్నమును మితిమీరి యుపయోగింపంజనదు.

## క్షౌరముచే నగుగుణము

మూ. పాపోపశమనం కేశ నఖరోమాపమార్జనమ్,
హర్ష లావణ్యసౌభాగ్యకరముత్సాహవర్ధనమ్. ౬౨౭

వ్యా. వెండ్రుకలను గోళ్లను రోమములను శరీరమున నెదుగనీయక ఖండించుచున్నచో పాపము హరించును. సంతోషము, సౌందర్యము, శరీరకాంతి ఇవి వృద్ధినొందును. ఉత్సాహము అంతకంత యినుమడించును.

## అభ్యంగనగుణము

మూ. అభ్యఙ్గో మార్దవకరః సజరాశ్రమవాతహా,
దృష్టిప్రసాదపుష్ట్యాయు స్స్వప్నసుత్వక్త్వదార్ఢ్యకృత్.
సుకేశ్యశ్శీలితోమూర్ధ్ని కపాలేన్ద్రియతర్పణః. ౬౨౮

వ్యా॰ అభ్యంగమువలన శరీరమున మార్దవముకల్గును. ముడిమిని, శ్రమమును, వాతమును హరించును. కన్నులచూపులను నిర్మలముగజేయును. శరీరమునకు పుష్టికల్గును. ఆయువును వృద్ధినొందించును. నిదుర చక్కగబట్టును. చర్మము చక్కబడును. దృఢశక్తి కల్గును. వెండ్రుకలు వృద్ధినొందును. శిరస్సునందలి యభ్యంగనముచే కపాలమునకును, చక్షురాదీంద్రియములకును చలువను కలిగించి తృప్తిని బుట్టించును.

కర్ణపూరణపాదాభ్యంగగుణములు

మూ॰ హనుమన్యాశిరః కర్ణశూలఘ్నం కర్ణపూరణమ్. ౬౨౯
పాదాభ్యఙ్గస్తు తత్ స్థైర్యనిద్రాదృష్టి ప్రసాదకృత్,
పాదసుప్తి శ్రమ స్తమ్భసంకోచ స్ఫుటనప్రణుత్. ౬౩౦

వ్యా॰ అభ్యంగసమయమున నూనెను చెవులలో నిండించుటచేత దవుడలసంధియందును, మెడనరములయందును, శిరస్సునందును, కంఠమునందును కలిగినశూల మున్నగు బాధలను నివర్తింపజేయును. పాదముల కభ్యంగనముచేయుటవలన పాదములను స్థిరపరచును. నిదురపట్టును. కంటిచూపును తేటపరచును. పాదములయందు స్పర్శజ్ఞానము లేకున్నచో దానిని పోగొట్టును. శ్రమమును స్తంభించుటను, మడతలుపడుటను, పగులుటను మాన్పును.

స్నేహపూరణగుణము

మూ॰ స్నేహః క్లేశ శ్రమహరః భగ్నసన్ధిప్రసాదనః,
క్షతాగ్ని దగ్ధాభిఘాతః స్పృష్టమాత్రాప్రపూరితా. ౬౩౧

వ్యా॰ పైజెప్పినరీతిగ నూనె మొదలగుస్నేహద్రవ్యములను తగినప్రమాణముతో చెవులయందు నింపినచో కష్టమును శ్రమమును హరించును. విరిగినకీళ్లను చక్కబరచును. చెవిలో గాయములను కాలినపుండ్లను అభిఘాతము మాన్పును.

వ్యాయామగుణము

మూ॰ లాఘవం కర్మసామర్థ్యం దీప్తోగ్నిః మేదసః క్షయః,
విభక్తఘనగాత్రత్వం వ్యాయామాదుపజాయతే. ౬౩౨

వ్యా॰ శరీరమున కాయాసమును గలిగించుపని వ్యాయామము. అట్టి వ్యాయామమువలన శరీరమున చుఱుకుదనము, పనులజేయుటకు సామర్థ్యంబును, జఠరాగ్నిని దీపనంబును, శరీరమున మిక్కుటముగ వృద్ధినొందిన మేదోనాశంబును, శరీరమున దృఢశక్తియు, అవయవములవిభాగంబును కల్గును. ("శరీరాయాసజననం కర్మ వ్యాయామముచ్యతే" అను అష్టాంగసంగ్రహవాక్యముచే దెలిసెడి.)

### ఉద్వర్తనగుణము

మూ. ఉద్వర్తనం కఫహరం మేదసః ప్రవిలాపనమ్,
స్థిరీకరణమఙ్గానాం త్వక్ప్రసాదకరం పరమ్. ౬౩౩

వ్యా. సున్నిపిండి మొదలగువానిచే శరీరముపై నలుగుపెట్టికొనుట ఉద్వర్తనము. అట్టి యుద్వర్తనముచే నమేదోవృద్ధియు, కఫంబును హరించును. అవయవముల దృఢపరచును. చర్మమును నిర్మలముగ జేయును.

### స్నానగుణము

మూ. దీపనం వృష్యమాయుష్యం స్నానమూర్జాబలప్రదమ్,
కణ్డూమలశ్రమస్వేదతన్ద్రాతృట్ దాహపాప్మ(తాప)జిత్. ౬౩౪

వ్యా. స్నానమువలన అగ్నిదీపనంబును, శుక్రవృద్ధియు, ఆయుర్వృద్ధియు, ఉత్సాహంబును, బలంబును కల్గును. దురదయు, శరీరముపై నుండుమురికియు, శ్రమంబును, చెమటయు, కునికిపాటును, దప్పియు, తాపంబును హరించును.

(స్నానము జాఠరాగ్నిలోనుండి రోమరంధ్రములమూలమున వెడలు అగ్నిజ్వాలలను అడ్డగించి మరల లోనికిం బ్రవేశింపజేయును. మరియు త్వక్కు నాశ్రయించిన భ్రాజకపిత్తమునుగూడ లోనికి ప్రవేశింపజేయును. దానంజేసి జాఠరాగ్ని వృద్ధినొంది యాకలి బుట్టించు నని తంత్రాంతరముల జెప్పబడినది.)

### స్నాననిషిద్ధులు

మూ. స్నానమర్దితనేత్రాస్య కర్ణరోగాతిసారిషు,
ఆధ్మాన పీనసా జీర్ణభుక్తవత్సుచ గర్హితమ్. ౬౩౫

వ్యా. అర్దితవాతము, నేత్రరోగము, ముఖరోగము, కర్ణరోగము, అతిసారము, ఆధ్మానము, పీనసము అజీర్ణము అను నీరోగములచే బాధపడువారికిని భుజించినవారికిని స్నానము చేయంజనదు.

### పాదప్రక్షాళనగుణము

మూ. పాదప్రక్షాళనం పాదమపాదమలరోగశ్రమాపహమ్,
చక్షుః ప్రసాదనం వృష్యం ధనధాన్యవివర్ధనమ్. ౬౩౬

వ్యా. పాదముల గడిగికొనుటవలన పాదములయందలి మలినంబును, పాదమునగల్గు రోగంబులును, శ్రమంబును హరించును. కన్నులు నిర్మలములుగ నుండును. శుక్రము వృద్ధినొందును. ధనధాన్యంబులును వృద్ధినొందును.

### దేవాదిపూజనవిధి

మూ. దేవతాపితృవిప్రాణాం పూజనం గోత్రవర్ధనమ్,

యశస్యం స్వర్గ్యమాయుష్యం దీనానాథానుకంపనమ్. ౬౩౭

వ్యా. దేవతలను, పితృదేవతలను, బ్రాహ్మణులను పూజించుటచే వంశము వృద్ధినొందును. మరియు దీనులయందును, దిక్కులేనివారియందును దయగలిగియుండుటచే కీర్తి కలుగును. పరలోకమున స్వర్గాదిసుఖము కల్గును. ఆయువు వృద్ధినొందును.

## ఆహారగుణము

మూ. ఆహారోబృంహణోవృష్యః (సద్యః) బలకృద్దేహధారకః,
ఆయుస్తేజస్సముత్సాహస్మృత్యోజోఽగ్నివివర్ధనః. ౬౩౮

వ్యా. ఆహారముచేయుటవలన శరీరమునకు పుష్టికల్గును. శుక్రము వృద్ధినొందును. శరీరమున కప్పుడే బలముకలిగించి ధరింపజేయును. ఆయువును తేజమును ఉత్సాహమును కల్గించి తేజమును జాఠరాగ్నిని వృద్ధినొందించును.

## అత్యుష్ణాద్యాహారములచే గల్గుగుణదోషములు

మూ. అత్యుష్ణమన్నంమదదాహతృష్ణాః బలప్రణాశంభ్రమమస్రపిత్తమ్,
శీతంతుసాదాఽరుచివహ్నినాశ హృల్లాసవిష్టమ్భనరోమహర్షాన్.
కరోతి; రూక్షం బలవర్ణనాశం తృప్రూక్షతాం వాతశకృన్నిరోధం,
స్నిగ్ధం తృతిశ్లేష్మచయప్రసేకహృద్గౌరవాలస్యరుచిప్రణాశాన్.
అతిస్థిరం మూత్రశకృద్విబన్ధం అతృప్తిమవ్యాప్తిమశీఘ్రపక్తిమ్,
అతిద్రవం పీననమేహకాసస్యన్దాన్ కరోత్యగ్నిబలంచ హన్తి.

వ్యా. మిక్కిలి వేడిగనుండుఅన్నమును భుజించినచో తిక్కను, తాపమును, దప్పిని, బలహీనతను, భ్రమమును, రక్తపిత్తమును కల్గించును. మిక్కిలి చల్లగనుండుఅన్నమును భుజించినయెడ శరీరకార్శ్యంబును, అరుచియు, అగ్నినాశంబును, హృల్లాసంబు (రొమ్మదరుట)ను, మలబద్ధంబును, రోమాంచంబును కల్గును. మిక్కిలి రూక్షమై (జిడ్డులేక) యుండు అన్నమునుభుజించినచో శరీరబలంబును, కాంతియు నశించును. చర్మము జిడ్డులేక రూక్షముగ నుండును. అపానవాతంబును మలంబును నిరోధింపబడును. మిక్కిలి స్నిగ్ధమైన (జిడ్డుకలపదార్థములతోగూడిన)యన్నమును భుజించినయెడ కఫమును వృద్ధినొందించును. నోట నీరు వెడలును. రొమ్ము బరువు నుండును. పనులయం దుత్సాహము తగ్గును. నోటికి రుచిచెడును. మిక్కిలి కఠినముగ నుండుఆహారమును భుజించినయెడ మలమూత్రములు బంధింపబడును. తృప్తికలుగదు. శరీరమున నాహారగుణము శీఘ్రముగ వ్యాపింపదు. శీఘ్రముగ జీర్ణము కానోపదు. మిక్కిలి ద్రవరూపముగ నుండునాహారమును భుజించి

నచో పీనసంబును, ప్రమేహంబును, కాసంబును, శ్రోత్రస్సులయందు స్రావంబును కల్గును. జఠరాగ్నిబలము నశించును.

అతిమధురాద్యాహారగుణము

మూ. అతిమధురమనలశమనం భుక్తమసాత్మ్యం నపుష్టయే వపుషః,
అతిలవణమచక్షుష్యం తీక్ష్ణామ్లఘ్నం జరత్వాశుత్. ౬౪౨

వ్యా. మిక్కిలి మధురముగనుండు నాహారము జేసినయెడ జఠరాగ్నిని చల్లార్చును. అసాత్మ్యమైన (అలవాటునలేని) యాహారమును భుజించినయెడ శరీరమునకు పుష్టికల్గదు. మిక్కిలి ఉప్పుగలయాహారమును భుజించిననాడు కన్నులకు చెరుపుకల్గును. మిక్కిలితీక్ష్ణంబును మిక్కిలి పులుపును కలయాహారము త్వరలో జీర్ణమగును.

కాలనిద్రాగుణము

మూ. పుష్టివర్ణబలోత్సాహం అగ్నిదీప్తిమతన్ద్రితామ్,
కరోతిధాతుసామ్యం చ నిద్రాకాలే నిషేవితా. ౬౪౩

వ్యా. సకాలమున నిదురజెందినయెడ శరీరమున పుష్టియు, కాంతియు, బలంబును, ఉత్సాహంబును, అగ్నిదీప్తియు, కునికిపాటులేకుండుటయు, ధాతువులసమస్థితియు కల్గును.

అంగమర్దనగుణము

మూ. ప్రీతినిద్రాకరం వృష్యం కఫవాతశ్రమాపహమ్,
సంవాహనం మాంసరక్తత్వక్ప్రసాదకరం పరమ్. ౬౪౪

వ్యా. సంవాహనము (అంగమర్దనము) ఇంద్రియమునకు పుష్టినికల్గించును. ప్రియముగ నిద్రను కల్గించును. కఫమును వాతమును శ్రమమును హరించును. మాంసమునకును రక్తమునకు చర్మమునకు సౌకుమార్యమును కల్గించును.

సుఖశయనాసనగుణములు

మూ. శ్రమానిలహరం వృష్యం పుష్టినిద్రాధృతిప్రదమ్,
సుఖశయ్యాసనం; దుఃఖం విపరీతగుణం మతమ్. ౬౪౫

వ్యా. సుఖమై (మృదువుగ) యుండుపడకయు, ఆసనంబును శరీరశ్రమమును వాతమును హరించును. ఇంద్రియపుష్టిచేయును. శరీరపుష్టిని, సుఖనిద్రను, మనోదార్ఢ్యమును కల్గించును. అట్టి శయనాసనములు కఠినములుగ నున్నపుడు పైజెప్పినగుణములకు విరుద్ధముగ నుండును.

—— కూర్చొనియుండుట, తిరుగుటచే గల్గుగుణములు ——

మూ. ఆస్యాకర్ణబిలశ్లేష్మ సౌకుమార్యకృదన్యథా,
ఆధోగ్ధ్వాగ్ని బలాయూంషి కుర్యాన్నృజ్య్రమణం సుఖమ్. ౬౪౬

వ్యా. నిర్వ్యాపారముగ గూర్చొని యుండుటచేత శరీరకాంతియు, బలంబును, కఫంబును, శరీరసౌకుమార్యంబును కల్గును. అటుగాక సంచరించుటచేత జఠరాగ్ని వృద్ధి నొందును. శరీరమునకు బలముకల్గును. ఆయువు వృద్ధినొందును. శరీరమునకు సుఖము కల్గును.

—— పాదరక్షలను ఛత్రమును ధరించుటచే నగుగుణములు ——

మూ. మారుతస్యానులోమ్యం చ ఖుడ స్తమ్భశ్రమాపహమ్,
అన్వర్థసంజ్ఞం పాదత్రం బలదృచ్ఛుక్రరక్షణమ్. ౬౪౭
వర్ణ్యం నేత్రహితం ఛత్రం వాతవర్షాతపాపహమ్,
పాదత్రాణం మృజావర్ణతేజోబలవివర్ధనమ్. ౬౪౮

వ్యా. పాదరక్షల ధరించుటవలన వాతము అనులోమముగ సంచరించును. ఖుడవాతము, స్తంభవాతము, శ్రమంబును హరించును. శరీరబలమును కన్నులను శుక్రమును కాపాడును. గొడుగును పట్టుకొనుటవలన శరీరమునకు వర్ణము (కాంతి) కల్గును. కన్నులకు మిక్కిలి హితకరము. గాలికిని వర్షమునకును ఎండకును అడ్డముగ నుండును.

(పాదరక్షలనుధరించుటచేత పాదములందు మలాదులు చేరకుండును. శరీరవర్ణంబును, తేజంబును, బలంబును వృద్ధినొందును).

—— ఉష్ణీషదండధారణగుణము ——

మూ. పవిత్రం కేశ్యముష్ణీషం వాతాతపరజోఽపహమ్,
సత్వోత్సాహబలస్థైర్యధైర్యవీర్యవివర్ధనమ్. ౬౪౯

అవష్టమ్భకరంచాపి రక్షోఘ్నం దణ్డధారణమ్,

వ్యా. తలగుడ్డను శిరంబున ధరించుటచేత పరిశుద్ధత కల్గును. వెండ్రుకలకు చాల హితకరము. గాలి యెండ ధూళి మున్నగువానిచే శిరంబున కభిఘాతము కలుగనీయక కాపాడును. చేతకఱ్ఱను బూని సంచరించుటచేత మనోబలంబును, ఉత్సాహంబును, శరీరబలంబును, స్థిరతయు, ధైర్యంబును బాహువీర్యంబును వృద్ధినొందును. శరీరమున కాధారముగ నుండును. రాక్షసపిశాచాదులచెంత జేరనీయక దూరముగపుచ్చును.

—— చామరములు, వీవనలు, వీనినుండివెడలుగాలిగుణము ——

మూ. వాలవ్యజనమోజస్యం మక్షికాదినివారణమ్. ౬౫౦

శోషదాహశ్రమస్వేద మూర్ఛాఘ్నో వ్యజనానిలః,

వ్యా॥ చామరములవీచుటచే గల్గుగాలి ఓజస్సును వృద్ధినొందించును. చీమలు దోమలు మున్నగువానిం జేరనీయక పాఱదోలును. వీవనలనుండి వెడలుగాలి శోషమును తాపమును శ్రమమును చెమటను మూర్ఛను శాంతపఱచును.

తూర్పు మున్నగునష్టదిక్కులగాలికరరగుణాదులనిర్ణయము

మూ॥ లవణః కటుకస్స్వాదుః కషాయోఽమ్లకషాయకః. ౬౫౧
తిక్తస్సర్వరసస్స్వాదుః ఇతి ప్రాగాదిమారుతాః,
ప్రాగ్వాయురుష్ణోఽభిష్యన్ద త్వగ్దోషార్శోవిషక్రిమీన్. ౬౫౨
సన్నిపాతజ్వరం శ్వాసం కాసం వాతంచ కోపయేత్,
పశ్చిమశ్శిశిరో హన్తి మూర్ఛాం దాహం వృషం విషమ్. ౬౫౩

వ్యా॥ తూర్పు మొదలగు నష్టదిక్కులనుండి వీచుగాలి వరుసగ లవణాదిరసములు కల్గియుండును. (తూర్పుగాలి ఉప్పగను, అగ్నిమూలగాలి కారంబును, దక్షిణపుగాలి తీపియు, నిర్భృతిదిక్కునందలిగాలి వగరును, పడమటిదెసగాలి పులుపును వగరును, వాయుదెసగాలి చేదును, ఉత్తరఈశాన్యదిక్కులగాలి లవణాదిరసములన్నియు కల్గియుండును అని భావము).

అందు తూర్పుగాలి ఉష్ణవీర్యముగ నుండును. నేత్రరోగములను, చర్మదోషమును, అర్శోరోగమును, విషమును, క్రిములను, సన్నిపాతజ్వరము, శ్వాసకాసములను, వాతమును వీనినన్నింటిని ప్రకోపింపజేయును. పడమటిగాలి మిక్కిలిచల్లగనుండును. మూర్ఛను, తాపమును, ఇంద్రియపుష్టిని విషమును హరించును.

తీవ్రమైనగాలిమున్నగువానిగుణములు

మూ॥ ప్రవాతః కార్శ్య వైవర్ణ్య స్తమ్భకృద్గాఢతృడ్భ్రమాన్,
శ్రమాగ్ని మూర్ఛాజనయేత్; అప్రవాతస్తతోఽన్యథా,
అగ్నివాతకఫస్తమ్భ శీతవేపథునాశనః,
ఆమాభిష్యన్దజరణః రక్తపిత్తప్రదూషణః. ౬౫౪

వ్యా॥ మిక్కిలి తీవ్రమైనగాలి శరీరమున కృశతను, వివర్ణతను, స్తంభమును కల్గించును. దప్పిని, భ్రమమును, బడలికను, జఠరాగ్నిని, మూర్ఛను హరించును. స్వల్పమైన గాలి పైజెప్పినగుణములకు విరుద్ధములైనగుణములు కల్గియుండును. అగ్నిని, వాతమును,

కఫమును, స్తంభమును, చలువను, కంపమును, వీనినన్నిటిని శమింపజేయును. అనుశోష మును, అభిష్యందరోగమును హరించును. రక్తపిత్తమును శమింపజేయును.

ఎండనీడలగుణములు

మూ. ఆతపో భ్రమతృట్ స్వేదమూర్ఛాదాహం వివర్ణతామ్,
కుర్యాత్పిత్తాస్రమగ్నించ ఛాయా త్వేతా నపోహతి. ౬౫

వ్యా. ఎండ భ్రమమును, దప్పిని, చెమటను, మూర్ఛను, తాపమును, వైవర్ణ్యమును, పిత్తరక్తమును, అగ్నిని వృద్ధినొందించును. నీడ పైజెప్పినభ్రమ దప్పి మున్నగువానిని పోగొట్టును.

అధ్యాయవిషయోపసంహారము

మూ. శాకధాన్యాదికైర్వర్గైః ఏకైకద్రవ్యనిశ్చయః,
ఇత్యుక్తః కల్పవత్సర్వః స్వస్థాతురవిభాగతః. ౬౬

ఇతివివిధౌషధివర్గః.

ఇతి పరహితసంహితాయాం ద్వితీయోఽధ్యాయః.

వ్యా. ఇత్తెఱంగున శాకధాన్యాదివర్గభేదములచేత ఒక్కొకద్రవ్యమును నిర్ణ యించి స్వస్థాతురవిభాగముల ననుసరించి దానిదాని కల్పానుసారముగ ద్రవ్యగుణాదులు సెప్పంబడెను.

ఇయ్యది పరహితసంహితయందు రెండవయధ్యాయము పూర్తియయ్యెను.



# పరహితసంహిత

## స్వస్థవృత్తాధికారః, తృతీయాఽధికారః

### స్వస్థలక్షణము

మూ. సమదోషస్సమాగ్నిశ్చ సమధాతుమలక్రియః,
ప్రసన్నాత్మేన్ద్రియమనాః స్వస్థ ఇత్యభిధీయతే. ౧

వ్యా. దోషములు (వాతపిత్తశ్లేష్మములు) మూడు తమతమనియతపరిమాణమున నుండి జాఠరాగ్ని న్యూనాధికతలజెందక సమస్థితినుండి రసాదిసప్తధాతువులును, మలములును తాము చేయునట్టి క్రియలును వైగుణ్యము నొందక సమస్థితినుండి మనస్సును, చక్షురాదింద్రియములును నిర్మలములై యున్నపురుషుడు స్వస్థుడు (రోగములు లేక స్వస్థత నున్నవాడు) అని చెప్పబడును.

### త్రిదోషములచే శరీరమునకుగల్గునుపకారము

మూ. దోషధాతుమలామూలం సదా దేహస్య; తంచలః,
ఉత్సాహోచ్ఛ్వాసనిశ్వాసచేష్టావేగప్రవర్తనైః. ౨
సమ్యగ్గత్యా చ ధాతూనాం అక్షాణాం పాటవేనచ,
అనుగృహ్ణాత్యవికృతః; పిత్తం పక్త్యూష్మదర్శనైః. ౩
క్షుత్తృడ్రుచిప్రభామేధాధీశౌర్యతనుమార్దవైః,
శ్లేష్మాస్థిరత్వస్నిగ్ధత్వసన్ధిబన్ధక్షమాదిభిః. ౪

వ్యా. వాతపిత్తకఫరూపములైన మూడుదోషములును, మూత్రము మున్నగుమలములును, రసరక్తాదిసప్తధాతువులును శరీరమున కెల్లప్పుడును మూలకారణములై యుండును—(కొమ్మలు మున్నగునవాంతరఅవయవములతోగూడిన గొప్పవృక్షమునకు వేళ్లు ప్రధానకారణములై యావృక్షమును పోషించుభంగి, కరచరణాద్యంగప్రత్యంగములతో గూడిన శరీరమునకు దోషధాతుమలములు ప్రధానముగ నాధారములై శరీరమును పోషించి ధరింపజేయు నని భావము.)

అందు వికృతిజెందకుండువాతము అన్నిపనులయందు నుత్సాహము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, చేష్టలు (శరీరమునకును వాక్కునకును మనస్సునకును సంబంధించినవ్యాపారములు), వేగప్రవర్తనము (మలమూత్రాదుల సకాలమున బైటవెడలించుట), రసాది

ధాతువులను శరీరమున చక్కగ వ్యాపింపజేయుట, చక్షురాదీంద్రియములకు వానివాని పనులయందు పాటవము, అను నీవ్యాపారములచేత శరీరమునకు మిక్కిలి తోడ్పడి యనుగ్రహించును.

వికారముచెందక సమస్థితి నుండుపిత్తము భుజింపబడిన యాహారమును పచింపజేయుట, శరీరమున వేడిపుట్టించుట, కన్నులకు పదార్థములజూచుశక్తిని గల్గించుట, ఆకలిని దప్పిని రుచిని కాంతిని బుట్టించుట, బుద్ధిని మేధను శౌర్యమును శరీరమార్దవమును బుట్టించుట, అను నీపనులచేత శరీరమున కుపకారము జేయును.

వికారము చెందక సమస్థితి నుండుశ్లేష్మము శరీరదార్ఢ్యమును, స్నిగ్ధత్వమును, సంధిబంధమును, ఓర్పును కల్గించువ్యాపారముచేత శరీరమున కుపకరించును.

## రసాదిధాతువులకృత్యములు

మూ. ప్రీణనం జీవనం లేపః స్నేహధారణపూరణే,
గర్భోత్పాదశ్చ ధాతూనాం శ్రేష్ఠం కర్మ క్రమాత్ స్మృతమ్.౫

వ్యా. రస-రక్త-మాంస-మేదః-అస్థి-మజ్జ-శుక్రము లను నట్టిధాతువు లేడును వరుసగ మనః ప్రీణనము, ఓజోవృద్ధి, లేపము, స్నేహము, ధారణము, పూరణము, గర్భోత్పత్తి అను నీయేడుపనులను జేయును. రసాదిధాతువుల కివి వరుసగ ప్రధానకృత్యములు.

ఇచ్చట నీవివరణము తెలియంగునది—భుజింపబడిన యాహారములు పిత్తముచే పాకమునొంది రస(ద్రవ)రూపముగ పరిణమించును. అయ్యది స్రోతస్సులయందు బ్రవేశించి యింద్రియములకు ప్రసన్నతను గల్గించి దానిమూలమున మనస్సునకు ప్రీతిగల్గించును. ఇదియే ప్రీణనము. ఈకృత్యము రసధాతువునకు ప్రధానమైనది. జీవనాధారమైన యోజస్సును వృద్ధినందించుట రక్తధాతువునకు ప్రధానకృత్యము. లేపమన పూసి(గ్రమ్మి)కొనియుండుట. శరీరమునం దస్థులు మాంససంబంధము లేకయుండుచో నసమర్థము లగును. కావున అట్టి యస్థులపై పూసినవిధముగ గ్రమ్మి యావరించియుండుట మాంసమునకు ప్రధానకృత్యము. శరీరమునందలి యంగప్రత్యంగములయందు స్నిగ్ధత్వము(జిడ్డు)ను కలిగించుట మేదోధాతువునకు ప్రధానకృత్యము. అవయవవిభాగములతో గూడినశరీరమును ధరించియుండుట యస్థులకు ప్రధానకృత్యము. అస్థులయందలి బోలుగనుండు రంధ్రమును స్నేహముచే నిండించియుండుట మజ్జధాతువునకు ప్రధానకృత్యము. గర్భోత్పత్తిని జేయుట శుక్రధాతువునకు ప్రధానకృత్యము.

మరియు పైజెప్పినకృత్యములు రసాదిధాతువులకు ప్రధానకృత్యము లనుటచే నితరవ్యాపారములును అనుషంగికములుగా రసాదిధాతువులకుం గలవని యెఱుంగునది. అవి

యెవ్వియనః—దృష్టి, రక్తపోషణము మున్నగునవి రసధాతువునకు;శరీరకాంతి, ప్రసన్నత, మాంసపోషణము మున్నగునవి రక్తధాతువునకును; బలమును మేదోవృద్ధిని గలిగించుట మున్నగునవి మాంసమునకును; చెమట పుట్టించుట, శరీరదార్ఢ్యము గలిగించుట, అసులను, పుష్టినొందించుట మొదలగునవి మేదోధాతువునకును; మజ్జనుపోషించుట మున్నగునవి యస్థులకును; బలము, అస్థిపూరణము, శుక్రపుష్టి మొదలగునవి మజ్జధాతువునకును; మనస్సంతోషము, మనశ్శరీరబలము మున్నగువానిని కలిగించుట శుక్రధాతువునకు ఆనుషంగికవ్యాపారములని యెఱుంగునది. రసాదిధాతువులు పైజెప్పినవ్యాపారరూపములైన తమతమకృత్యములచే శరీరమును పోషించు నని ముఖ్యభావము.

మల-మూత్ర-స్వేదములకృత్యములు

మూ. అవష్టమ్భః పురీషస్య మూత్రస్యక్లేదవాహనమ్,
స్వేదస్య క్లేదవిధృతిః...............

వ్యా. దేహమును పక్కబలమై ధరించియుండుట పురీషమునకు కృత్యము. ద్రవమును వహించుట (వ్యాపింపజేయుట) మూత్రకృత్యము. అట్టిద్రవమును ధరించుట స్వేదకృత్యము. ఇవి మలమూత్రస్వేదముల కృత్యములు.

ప్రాతఃకాలకృత్యములు

మూ. .........స్వస్థస్తు ప్రాతరుత్థితః. ౬
శరీరచిన్తాం నిర్వర్త్య కృతశౌచో విశోధయేత్,
అర్కన్యగ్రోధఖదిరకరఞ్జకకుభాదిభిః. ౭
కరవీరాదిభిర్దన్తాన్ దన్తమాంసాన్యబాధయన్,
హేమాదిపత్త్రైర్నిర్లేఖ్యజిహ్వాం పూర్ణముఖోజలైః. ౮
ముఖం ప్రక్షాళయేదక్ష్ణోః యోజయేద్గరుడాఞ్జనమ్,
తతో నావనగణ్డూషధూమతామ్బూలభాగ్భవేత్. ౯

వ్యా. తొలుత "సమదోషస్సమాగ్నిశ్చ" అనువాక్యమున జెప్పినస్వస్థలక్షణములతో గూడినపురుషుడు ప్రాతఃకాలమున నిదురమేల్కాంచి శయనమును విడిచి లేచి తత్కాలమున శరీరపరిస్థితులకు సంబంధించినవిషయములను చక్కగ నాలోచించి మూత్రపురీషముల విసర్జించి మలాదులు నివర్తించుటకై యథోక్తముగ ప్రక్షాళనమును జేసికొని పిమ్మట మృదువైనసలును, వగరు చేదు కారమునుకల జిల్లేడు, మఱ్ఱి, చండ్ర, కానుగు, మద్ది, జాజి, వాడగన్నేరు మొదలగువానిపుల్లలచేత దంతమాంసములకు చిగుళ్లకు బాధకలుగ యక పళ్లు తోమవలెను. పిదప బంగారు వెండి మొదలగువానిరేకులచేత నాలుకను

మలినముపోవునట్లు గీచి నోటియందు నిండుగ నీళ్లచేత నిండించి పుక్కిలించి యుమిసి నీళ్లచే ముఖమును నిర్మలముగ కడుగవలెను. పిమ్మట గరుడాఞ్జనము సౌవీరాంజనము మున్నగు నంజనములను కంటికిబెట్టి నస్యమును గండూషమును ధూమపానములనుజేసికొని తాంబూలము నుపయోగింపనగు.

## నస్యగండూషవిధి

మూ. తైలమేవచ నస్యార్థే నిత్యాభ్యాసేన శస్యతే,
కేసరం మాతులుఙ్గస్య పలం మధుపలద్వయమ్. ౧౦
కర్షాంశం శర్కరావ్యోషసైన్ధవం ధారయేన్ముఖే,
గుడార్ద్రకం వా మధునా రసం వా స్వేష్టసమ్మితమ్. ౧౧
తతః కోష్ణామ్బుగణ్డూషం కుర్యాత్కణ్ఠాస్యశుద్ధయే,

వ్యా. నస్యమునకు తైలముచే ప్రతిదినంబును అభ్యాసముచేయుచు నుపయోగించవలెను. మరియు నాగకేసరములు మాదీఫలము ఈరెండునుచేరి యొకపలంబును, రెండుపలములు తేనెయు, చక్కెర, త్రికటుకములు, సైంధవలవణము, ఈమూడునుచేరి కర్షపరిమితంబును వీనినన్నిటి నొకటిగజేర్చి నోట నుంచుకొనవలెను. లేక బెల్లమును అల్లమును ఒకటిగగూర్చియైనను, లేక తేనెను అల్లపురసమును కలిపియైనను నోట నుంచుకొనవలెను. కొంతకాల ముంచుకొని దాని నుమిసి గోరువెచ్చనినీటిచేత నోరు పుక్కిలించి యుమిసినచో కంఠంబును నోరును పరిశుద్ధమగును.

## ధూమపాన, తాంబూలనియమము

మూ. తతో ధూమం పిబేన్నిత్యం నిశాకర్పూరనాగరైః,
సకర్పూరంచ తామ్బూలం భక్షయేత్క్షారమాత్రయా. ౧౨

వ్యా. పిమ్మట పసుపు, పచ్చకప్పురము, శుంఠి, ఈమూటినిగూర్చి వత్తిచేసి దానిని ముట్టించి నోట పొగ పీల్చవలెను. పిదప పచ్చకప్పురముతోగూడిన తాంబూలమును నమలవలెను. అట్టి తాంబూలమున కారముగలలవంగాదులను మితముగగూర్చి యుపయోగించునది.

## అభ్యంగననియమము

మూ. అథ జాతాన్నపానేచ్ఛః మారుతఘ్నైస్సుగన్ధిభిః,
యథర్తు సుఖసంస్పర్శైః తైలైరభ్యఞ్జమాచరేత్. ౧౩
త్వగ్రక్తమాంసమేదోఽస్థివ్యాప్తిర్మాత్రశతైః పృథక్,
స్నేహస్య తేన వాతోఽస్థినివిష్టస్త్వచ మాప్నుయాత్. ౧౪

ప్రత్యహం సేవనేకాలః, ప్రతివారనిషేవణే,
ముహూర్తపఞ్చకం తిష్ఠే దన్యాథాతు వికారకృత్. ౯౫

వ్యా॰ పైజెప్పినరీతిగ దంతధావననస్యగండూషాదులజేసికొన్నపిదప వాతహరంబులును, మంచిసువాసనకల్గినవియు, గ్రీష్మాదిఋతువుల శీతోష్ణస్థితి కనుకూలమైన సుఖస్పర్శము కల్గినవియు, నగుతైలములచేత నభ్యంగనము చేసికొనవలెను. అట్టి యభ్యంగనము చేసికొనువారికి జీర్ణమై యాకలి కల్గి యన్నపానములయం దిచ్ఛకల్గియుండవలెను. అట్టి యభ్యంగనము నూరక్షరముల నుచ్చరించునంతకాలము ధరించ (ఊరనియ్య)వలెను. అట్లుండుటచేత నిరువదియక్షరములకాలముతో త్వక్కునందు తైలాదులు వ్యాపించును. ఇట్లేఅంగున రక్తమాంసమేదోఽస్థిధాతువులయందు వరుసగ నొక్కొకధాతువునం దిరువదేసియక్షరముల కాలమువంతున తైలము వ్యాపించును. దానంజేసి యస్థియందు వ్యాపించియుండు వాతము చర్మముపై వ్యాపించును. ప్రతిదినంబును అభ్యంగనమును అలవాటుచేయుచుండువారి కిది కాలనియమము. అటుగాక వారమున కొకతూరి యభ్యంగనముచేయువారు ఐదు ముహూర్తములకాలము తైలాభ్యంగనముజేసికొనవలెను. ఈకాలనియమమును విడిచి చేసికొనినచో పలుతెఱంగులగువ్యాధులు సంభవించును.

## వ్యాయామగుణము

మూ॰ వ్యాయామశ్శ్లేష్మనాశాయ వాయునాశాయ మర్దనమ్,
స్నానం పిత్తవినాయ త్రీణి నిత్యం సమాచరేత్. ౧౬
సేవ్యోఽర్ధశక్త్యా వ్యాయామః ప్రబలైస్స్నిగ్ధభోజిభిః,
శీతకాలే వసన్తే చ మన్దమేవ తతోఽన్యథా. ౧౭

వ్యా॰ (శరీరమున కాయాసమును బుట్టించుకుస్తీ మున్నగుపనులు వ్యాయామ మనబడును.) అయ్యది కఫమును హరించును. శరీరమును మర్దనాదులచే పిసికించుకొనుట మర్దనము. అయ్యది వాతమును హరించును. స్నానము పిత్తమును హరించును. కావున మనుజులు అనుదినమున వృద్ధినొందు త్రిదోషములను హరించి సమస్థితి నుంచుటకై వ్యాయామమర్దనస్నానముల ప్రతిదినంబును విడువక యాచరించవలెను. అందు వ్యాయామమును బలవంతులును స్నిగ్ధంబులగునాహారములభుజించువారును అర్ధశక్తిగ నాచరించవలెను. (శరీరమున శ్రమకల్గుటకు ముందే విడువవలె ననుట). మరియు నట్టివ్యాయామమును శీతకాలమైన హేమంతశిశిరఋతువులయందును, వసంతఋతువునందును అర్ధశక్తిగ నాచరించవలెను. తక్కినఋతువులయందు మిక్కిలి స్వల్పముగ జేయవలెను.

## అర్ధశక్తి

మూ॰ స్తనయోరన్తరే ఘ్రాణే సర్వసన్ధిషు కక్షయోః,

స్వేదోద్గమే లలాటే చ శక్త్యర్ధ మితి కథ్యతే. ౧౮

వ్యా. స్తనములమధ్యప్రదేశమునను (రొమ్మునమీదను), ముక్కుమీదను, కీళ్లయందంతటను, చంకలయందును, నుదుటియందును, ఈస్థలములయందు చెమట పుట్టినచో నర్ధశక్తి యని యెఱుంగనగును. (అట్లు చెమటబోడమునంతకాలము వ్యాయామము చేయవలెనని భావము).

## వ్యాయామానంతరకృత్యము

మూ. తం కృత్వాను సుఖం దేహం మర్దయేచ్చ సమన్తతః,
తదన్తే ముద్గమాషాదికల్కోద్వర్తనమాచరేత్. ౧౯
కషాయాపకృతస్నేహః స్నాత్వా సర్వాఙ్గలేపనమ్,
గన్ధామలకకల్కేన కిఞ్చిత్తైలయుతేన తు. ౨౦
కృత్వా స్నాత్వా కృతాలేపో నిశా కర్పూరటఙ్కణైః,
జమ్బీరామ్లేనలులితైః తతః స్నానం సమాచరేత్. ౨౧

వ్యా. పైజెప్పినరీతిగ వ్యాయామమును జేసి శరీరమునకు సుఖముగ మర్దనము చేయించుకొనవలెను. పిమ్మట పెసలపప్పు ఉద్దిపప్పు మున్నగువానిచే సిద్ధముచేయబడిన నలుగుపిండిచేత నలుగుపెట్టుకొని, వగరుకలవస్తువులచేత (ఇప్పపిండి మున్నగువానికల్కముచేత) నొడలిపై జిడ్డును పోగొట్టి స్నానముచేసి, గంధద్రవ్యములతోగూడిన ఉసిరికపిండియందు నూనె కొంచెము కలిపి శరీరమునంతను లేపనముచేసి మరల స్నానముచేసి, పసుపు కర్పూరము పటిక ఈమూటిని జేర్చి అందు నిమ్మకాయరసమును కలిపి దానిని ఒంటికి పూసికొని స్నానముచేయవలెను.

## ఉష్ణోదకస్నానగుణము

మూ. ఉష్ణామ్బునాధఃకాయస్య పరిషేకో బలావహః,
తేనైవచోత్తమాఙ్గస్య బలహృత్కేశ చక్షుషామ్. ౨౨

వ్యా. వేడినీళ్లచేత కంఠస్నానముజేసినచో మిక్కిలి బలము కల్గును. తలకు స్నానముచేసినచో వెండ్రుకలకును కన్నులకును చెఱుపుచేయును. (కావున తలకుమాత్రము వేడినీళ్లుగాక చల్లగనుండునీళ్లచే స్నానముచేయుట మంచిది).

## వస్త్రాదిధారణవిధి

మూ. శుద్ధామ్బరధరస్స్రగ్వీ రత్నాభరణభూషితః,
విదధ్యాదఙ్గరాగఞ్చకస్తూరీచన్దనాదిభిః. ౨౩

వ్యా॰ పైజెప్పినవిధముగ స్నానముచేసి శుభ్రములగుబట్టలగట్టికొని, పుష్పమాలికలను రత్నాభరణాదులను యథాసంభవముగ నలంకరించుకొని కస్తూరిచందనము మున్నగువానిచేత శరీరముపై బూసికొనవలెను.

## సురార్చనాదివిధి

మూ॰ స్నాతః ప్రణమ్య సురవిప్రగురూన్యథాస్వం
వృత్తిం విధాయ చ సముస్తపరిగ్రహస్య,
ఆపానభూమి మథగన్ధజలాభిషిక్తం
ఆహారమణ్టపసమీపగతాం శ్రయేత. ౨౪

వ్యా॰ పైజెప్పినవిధిప్రకారము స్నానాదివిధులదీర్చికొని ఇష్టదేవతలను బ్రాహ్మణులను గురువులను వారివారికి దగినట్టులు వందనములజేసి, తనకాశ్రితులగు పరివారజనమునకు దగినవృత్తిని నియమించి, వాసనద్రవ్యములతోగూడిన జలముచే శుభ్రముచేయబడిన పానస్థానమును జేరవలెను. అయ్యది భోజనగృహమునకు సమీపమున నుండవలెను.

## యుక్తమద్యసేవచే గల్గుగుణములు

మూ॰ సమ్భవన్తి న తే రోగాః మేదోఽనిలకఫోద్భవాః,
విధియుక్తాద్వినామద్యాత్ వేగస్సిధ్యతిదారుణః. ౨౫
అనూపం జాఙ్గలం మాంసం విధినాథ్యుపకల్పితమ్,
పథ్యం సహాయమప్రాప్య సమ్యక్పరిణమేత్కథమ్. ౨౬
అనలోత్తేజనం రుచ్యం శోకశ్రమవినాశనమ్,
న చాతః పరమన్యత్స్యాత్ ఆరోగ్యబలపుష్టికృత్. ౨౭
రక్షతా జీవితం తస్మాత్ పేయమాత్మవతా సదా,
యుక్తమద్యస్య మద్యోత్థోనవ్యాధిరుపజాయతే. ౨౮

వ్యా॰ విధ్యుక్తప్రకారము మద్యపానముచేసినచో మేదస్సుచేతను, వాతముచేతను, కఫముచేతను కల్గురోగములు సంభవింపనేరవు. విధి ననుసరింపక మద్యమును పానముచేసినచో మిక్కిలి తీవ్రమైనవేగము సంభవించును. విధ్యుక్తప్రకారము సంస్కరించి కల్పింపబడిన అనూపజాంగలమాంసము పథ్యముగనున్నను అనుపానసహాయము లేనినాడు ఎట్లు చక్కగ జీర్ణమగును? (మద్యపానసహాయములేనినాడు యుక్తియుక్తముగ సేవింపబడినమాంసముకూడ జీర్ణము కానోవదనుట) అగ్నిని జ్వలింపజేయునదియు, రుచికరంబును, దుఃఖమును శ్రమమును నివర్తింపజేయునదియు నగు పదార్థము మద్యమునకన్న వేరొండు లేదు. (అట్టి యగ్నిదీప్తి మున్నగుగుణములు కలిగినది మద్య మొక్కటియే యనుట).

మరియు మద్యము నారోగ్యమును శరీరబలమును పుష్టిని కల్గించును. కావున మనోనిగ్రహముకలమనుజుఁడు తనజీవితమును కాపాడుకొనఁదలచినచో నెల్లప్పుడును తగిననియమముల ననుసరించి యుక్తియుక్తముగ మద్యమును సేవింపనగును. యుక్తియుక్తముగ మద్యమును పానముచేసిననో మద్యపానముచే జనించుమదాత్యయాదివ్యాధులు నొకప్పుడును సంభవింపవు.

## మద్యసంధానము

మూ. పురాణం ఘృతకుమ్భం వా కుమ్భం వాపి దృఢం నవమ్,
శీతైశ్శతావ్హానిచుళజమ్బూపుష్పశృతైర్జలైః. ౨౯
ప్రక్షాళితం జతుస్రుతం వల్కలై ర్వంశవేత్రజైః,
వేష్టయే న్మురజాకారం గవాక్షాకారమేవ వా. ౩౦
జమ్బ్వాదుమ్బరపత్రేణ కుష్ఠేన చ కుశేన చ,
ప్రమృజ్యతులసీబిల్వ మాతులుఙ్గకపిత్థజైః. ౩౧
ప్రవాళై ర్నిర్మలైర న్తః సంఘృష్టం చ ముహుర్ముహుః,
లిప్తం చిత్రకమూలస్య కల్కేనా న్తర్విశేషతః. ౩౨
తథా సపిప్పలీకేన మధునాధూపితం పునః,
గుగ్గుల్వగురుసంజ్ఞాద్యై రథ కర్పూరమిశ్రితైః. ౩౩
చాతుర్జాతకకస్తూరీ జాతి తక్కోల కుఙ్కుమైః,
వాసయే న్మల్లికాజాతి కున్దచమ్పకపాటలైః. ౩౪

వ్యా. నేతితోమాగిన ప్రాతకుండనైనను, లేక దృఢముగనుండు క్రొత్తకుండనైనను మద్యము నుంచుట కుపయోగింపనగును; అట్టిభాండమును తొలుత సదాప, ప్రబ్బలి, నేరేడుపువ్వులు ఈమూటిని చేర్చి నీళ్లుకాచి చల్లార్చి అట్టి చల్లనినీళ్లచే కడిగి, లక్కను కఱఁగించి పూసి, వెదురు ఈనెలచేనైనను పేముదబ్బలచేనైనను కుండకు వెలుపల మద్దెలకు వారుతోకట్టువిధముగ నల్లవలెను. లేక గవాక్షులవలె సందులుండునట్లు చిక్కమువలె నల్లవలెను. పిమ్మట నేరేడాకులు, అత్తియాకులు, చెంగల్వకోష్టు, దర్భలు వీనిచేత లోభాగమున శుభ్రముగ తుడిచి; తులసి, మారేడుచిగుళ్లు, మాదీఫలవృక్షము యొక్కచిగుళ్లు, వెలగచిగుళ్లు, వీనిని నిర్మలములుగఁజేసి కుండలోభాగమున వైచి పలుమారు రుద్దునది. పిదప చిత్రమూలమువేరును పిప్పళ్లను తేనెగూర్చి మెత్తగ నూరి కల్కముజేసి కుండలోభాగమున దట్టముగ పూయనగును. పిమ్మట అగరు, గుగ్గిలము, చందనము, పచ్చకప్పురము, చాతుర్జాతము (ఏలకులు, లవంగాలు, ఆకుపత్రి, (దాల్చిని

చెక్క) నాగకేసరములు, కస్తూరి, జాజిమొగ్గలు, తక్కోలములు, కుంకుమపువ్వు వీనిని మెత్తగ చూర్ణముచేసి యాచూర్ణముచే ధూపమువేసి లోభాగమున పొగబట్టవలెను, పిమ్మట మల్లెపువ్వులు, జాజిపువ్వులు, మొల్లపువ్వులు, సంపంగిపువ్వులు, పాదిరిపువ్వులు అనునీసుగంధపుష్పములచే కుండలోభాగమున వాసనకలిగింపజేయవలెను. (ఇట్టి సంస్కారముచేయఁబడిన కుండలో నునిచి భద్రము చేయవలె ననుట.)

త్యాజ్యమద్యదోషము - దోషప్రశమనోపాయములు

మూ. పిచ్ఛిలం ఫేనిలం సాన్ద్రం సజన్తుం చాసవం త్యజేత్,
పిచ్ఛిలంతు పరిస్రావ్యసోష్ణం శాన్తే నిధాయచ. 3౫
చూర్ణం మరిచపిప్పల్యోః దత్వాధాన్యేనిధాపయేత్,
ఫేనేవేనిలమాలోడ్య బహుశో ధూమమర్పయేత్. 3౬
ఉష్ణం గుడోదకం దత్వాసాన్ద్రేధాన్యే నిధాపయేత్,
త్రిమాక్షికం కలావేల్లం దత్వా శాన్తే నిధాపయేత్. 3౭
పిప్పలీ పిప్పలీమూలం చవ్యం కుష్ఠం హరేణుకమ్,
మరిచం చూర్ణమేతేషాం అమ్లీభూతే ప్రదాపయేత్. 3౮
ముస్తా తేజోవతీచవ్యం మఞ్జిష్ఠాసహభద్రయా,
అవర్ణేచప్రయోక్తవ్యం ఉష్ణేశాన్తేనిధాపయేత్. 3౯
అగన్ధే కుష్ఠఫలినీ మాంస్యేలాచన్దనం క్షిపేత్,
ధాన్యరాశౌ న్యసేదేవం శీధ్వరిష్టాసవక్రమః. ౪౦

వ్యా. మద్యము పిచ్ఛిలముగనున్నను, నురుగుతో గూడియున్నను, చిక్కగనున్నను, ఈగలు చీమలు మున్నగుజంతువులతో గూడియున్నను అట్టి మద్యమును గ్రహింపందగదు. అందు పిచ్ఛిలముగ నుండుమద్యమును తేరనిచ్చి పైతేటనే వంచుకుని వేడిగ నున్నచో చల్లారినపిదప మిరియాలను పిప్పళ్లను చూర్ణముచేసి అందువైచి పైజెప్పినవిధముగ సంస్కరింపబడినభాండమున నునిచి వానెనగట్టి పదిలముగ మూతమూసి ధాన్యరాశియందుంచునది. నురుగుతో గూడినమద్యమును పలుమారు కలియబెట్టి మిరియములు పిప్పలి ఈరెంటిచూర్ణముచే పొగవేసి ధాన్యరాశి నుంచునది. చిక్కగనున్నచో వేడిగనుండు బెల్లపుపానకమును మద్యములోగలిపి మూసి ధాన్యరాశిలోనుంచునది. త్రిమాక్షికము, ( ) కల ( )వేల్లము ( ) అనువానినికూడ నందు జేర్చునది. మరియుఁ మద్యము పులిసియున్నచో పిప్పళ్లు, మోడి, చవ్యము, చెంగల్వకోష్టు, రేణుకలు, మిరియాలు, వీనినన్నిటిని చూర్ణముచేసి అందు కలుపునది. మద్యమున మంచిరంగు లేనిచో

తుంగగడ్డలు, మాల్కాంగిని, చవ్యము, మంజిష్ఠి, భద్రముస్తలు, ఎనినన్నిటిని చూర్ణముచేసి ఉష్ణము శాంతమైనపిదప మద్యములో నునిచి ధాన్యరాశిలో నుంచునది. మంచివాసన లేనిచో చెంగల్వకోష్టు, ఫలిని ( ), జటామాంసి, ఏలకులు చందనము వీనినన్నిటిని చూర్ణముచేసి మద్యమున జేర్చి ధాన్యరాశిలో నుంచునది. శీధు మద్యమును అరిష్టమద్యమును పైజెప్పినక్రమముగ సంస్కరించవలెను.

మధ్వాసవము, దానిగుణము

మూ. త్రిగుణాम्బుసిమ్మృద్వీకాం క్షౌద్రం చ ప్రథగాఢకమ్,
పక్త్వా పాదస్థితం పూతం కుడవం పిప్పలీరజః. ౪౧
శర్కరా వింశతి పలాద్ధ్యూషితే ఘృతభాజనే,
సప్తాహం స్థాపయే దేష హృద్యో మధ్వాసవస్స్మృతః. ౪౨
వృష్యస్తృష్ణా విషాదఘ్నః శ్రమఘ్నో బృంహణశ్చసః,

వ్యా. మూడింతల (ఆరుఆఢకముల) నీళ్లలో ఒకఆఢకము ద్రాక్షపండ్లరసంబును * ఒకఆఢకము తేనెయు కలిపి నాల్గవపాలు మిగులునట్లు కాచి దించి వడగట్టి యందు కుడవపరిమితము పిప్పలిచూర్ణంబును, ఇరువదిపలములు చక్కెరయు కలిపి పైజెప్పినరీతిగ సంస్కరింపబడిన నేతికుండలో బోసి యేడుదినములకాలము ధాన్యరాశిలో నుంచునది ఇయ్యది మధ్వాస మనబడును. మిక్కిలి రమ్యమైనది. ఇయ్యది దప్పిని, మనఃఖేదమును, శ్రమమును హరించును. ఇంద్రియమునకు పుష్టిని కలిగించును. శరీరమును బలియ జేయును.

మత్స్యండికాసవము, దానిగుణము

మూ. పచేచ్చతుర్గుణేతోయే దశమత్స్యండికాతులాః. ౪౩
పఞ్చపఞ్చపలే యష్టిమఞ్జిష్ఠే ప్రస్థపిప్పలీమ్,
శారిబాయాః పలద్వన్ద్వం తులామేకాం గుడస్యచ. ౪౪
త్రిభాగశేషముషితం ఘృతభాణ్డే త్రివేదయమ్,
మత్స్యణ్డికాసవోవృష్యః పిత్తోద్రేకజరాహరః. ౪౫

వ్యా. పదితులములు (పదివందలపలములు) మత్స్యండికను దానికి నాలిగింతల నీళ్లలో బోసి, అందు అతిమధురము ఐదుపలములును, ఐదుపలములు మంజిష్ఠియు, ఒక ప్రస్థము పిప్పళ్లును, రెండుపలములు సుగంధపాలవేరును, ఒకతులము (నూరుపలములు)

* పాకముచేయుటకు పూర్వము తేనెను మూలములో చెప్పినను పాకానంతరమే తేనెను చేర్చవలెను.

జొన్నంబుసు కలిపి, మూడవపాలు మిగులునట్లు కాచి నేతిలో మాగినకుండను పైజెప్పిన విధముగ సంస్కరించి పైజెప్పినకషాయమును వడగట్టి పాత్రలో బోసి ధాన్యరాశిలో నుంచిన నయ్యది మత్స్యండికాసవ మనబడును. ఇయ్యది వృష్యము (ఇంద్రియపుష్టికరము), పిత్తోద్రేకమును ముదిమిని హరించును.

పైష్టికాసవము, దానిగుణము

మూ. నవానివృద్ధి (వ్రీహి) బీజాని పచేత్తోయ చతుర్గుణే,
త్రిభాగస్థం త్రిభాగోత్థం జలం తద్వస్త్రగాలితమ్. ౪౬
కుమ్భే నిధారయేత్తత్ర శాలికోద్రవపిష్టజాన్,
కబళానర్కకిరణైః శోషితాన్నిద్రవాన్ లఘూన్. ౪౭
క్షిప్రమాత్రాస్తతోదర్వ్యా పాణినావావిఘట్టయేత్,
లబ్ధపాకం తదుత్తీర్ణం పాత్రే లబ్ధసుగన్ధిభిః. ౪౮
సితావిధూపితే పుష్పైః వాసితేచ నిధాపయేత్,
వేత్రైః పాత్రం చ సంవేష్ట్యధృతోఽయం పైష్టికాసవః. ౪౯
సర్వప్రాణిహితః పాణ్డుతృష్ణాట్టోచ్చకజరాహరః,

వ్యా. క్రొత్తవియగువడ్లబియ్యమును నాల్గింతనీళ్లుపోసి మూడవభాగము నీరుండునట్లు కాచి దించి వస్త్రమున వడగట్టి కుండలో బోసియుంచునది. పిదప రాజనంపు బియ్యమును అరుకబియ్యమును పిండిచేసి అందు నీళ్లు కలిపి యుండలుగజేసి యెండలో చెమ్మలేకుండునట్లు ఎండించి వానిని పైజెప్పినసీటి లో వైచి పొయ్యిమీదబెట్టి చేతితో నైనను గరిటితోనైనను కలియబెట్టుచు పక్వమగునందాక వండునది. పాకమువచ్చినపిదప దించి పైజెప్పినరీతిగ ధూపమువేసి పరిమళయుక్తములగుపువ్వులచే వాసనగలిగింపబడిన కుండలోబోసి యాకుండకు పైభాగమున పేముదబ్బలచే చిక్కమువలె బిగియించి ధాన్యరాశి నుంచునది. ఇది పైష్టికాసవ మనబడును. ఇయ్యది సకలప్రాణులకును హితకరము. పాండువులను ఆకలి దప్పులను దుఃఖమును ముసలితనమును పోగొట్టును.

నారికేళాసవము, దానిగుణము

మూ. చాతుర్జాతకతకోల త్రిఫలావ్యోషచిత్రకైః. ౫౦
కతకీఫలసిద్ధార్థ హరిద్రాభిశ్చ లేపితే,
చణ్డాంశుశోషితే భాణ్డే నారికేళోదకం ధృతమ్. ౫౧
పక్షం నిధాపయే ద్ధాన్యే నారికేళాసవోహ్వయమ్,

అర్శోభగన్దరశ్వాసశోషవైస్వర్యగుల్మినామ్. ౫౨
పాణ్డూదరప్రతిశ్యాయకుష్ఠారోచకినాంహితః,

వ్యా. చాతుర్జాతకము (ఏలకులు, లవంగాలు, దాల్చినిచెక్క, నాగకేసరములు), తక్కోలములు, త్రిఫలములు (కరక-తాని-ఉసిరికకాయలు), త్రికటుకములు (శుంఠి, పిప్పలి, మిరియాలు), చిత్రమూలము, చిల్లగింజలు, తెల్లనియావాలు, పసుపు అను నీవస్తువులను నూరి కుండ లోభాగమున దట్టముగ పూసి సూర్యునియెదుట నెండ నెండించి యాపాత్రలో టెంకాయనీళ్లుపోసి పదిలముగ మూసి పదునైదుదినములకాలము ధాన్యరాశిలో నునిచినచో నయ్యది నారికేళాసవ మనబడును. ఇయ్యది అర్శోరోగము, భగందరము, శ్వాసము, శోషము, వైస్వర్యము (కంఠస్వరము మారియుండుట), గుల్మరోగము, పాండువ్యాధి, ఉదరము, పీనసము, కుష్ఠము, అరోచకము అను నీవ్యాధులచే పీడితులకు మిక్కిలి హితకరము.

మూ. గుడేక్షురససమ్భూతా కాలేన విక్రుతిం గతా. ౫౩
ధాతకీపుష్పసమ్మిశ్రా సురామ్లీకం తదుచ్యతే,

వ్యా. బెల్లముచేతను చెఱకురసముచేతను జనించి కొంతకాలమునకు వికృతిజెంది పుల్లనై ఆరెపువ్వుతోగూడినది సుర యనబడును. అదియే అమ్లీక మనియు చెప్పనగును.

## మాధ్వీకము

మూ. అర్జకీధాతకీతిక్తా క్వాథసమ్మిశ్రకంమధు. ౫౪
ఔష్మణాం సుచిరం కాలముషితం విక్రుతిం గతమ్,
విలీనాజ్యసమచ్ఛాయం కటుతిక్తరసోత్కటమ్. ౫౫
కాచభాజనమధ్యస్థం మాధ్వీకం పరికీర్త్యతే,

వ్యా. తులసి, ఆరెపువ్వు, తిక్త (పిప్పళ్లు) ఈమూడిటినికూర్చి క్వాథముజేసి అందు తేనెను కలిపి చాలకాలము ధాన్యపుటముయొక్క ఆవిరిలో నుంచినచో నయ్యది వికృతిజెంది కరగిన నేతితో సమానమైనరంగుకలిగి కటుతిక్తరసము లధికముగనుండు మధురరసము కలిగియుండును. దీనిని గాజుపాత్రమున నుంచునది. ఇయ్యది మాధ్వీక మనబడును.

## సురాసన్ధానము

మూ. ప్రియఙ్గుమఙ్కురీకృత్య శోషయిత్వా విచూర్ణయేత్. ౫౬
యవాగ్రం యవనాళస్య తేన చూర్ణేన మిశ్రయేత్,
అన్యం తథా విధం పిష్టం పృథక్సంస్థాపయేద్ఘటే. ౫౭
యావనాళాణ సమాశోష్య తేన పిష్టేన మిశ్రయేత్,

యావాగ్రం పూర్వనిర్దిష్టం తస్మిన్ పిష్టోదకే క్షిపేత్. ౫౮
ఘటేషు స్థాపయేత్తత్తు నివాతే ధారయేదిదమ్,
అహోరాత్రోషితం పిష్టం ఫేనిలం మద్యగన్ధిచ. ౫౯
జగలం నామతత్ఖ్యాతం సురాబీజం మదావహమ్,
నిక్షిప్య తత్ర పానీయం గాలయేచ్ఛతపాసకే. ౬౦
యద్వాఘనస్త్రేణ సంవేష్ట్యగాలయేన్నిర్మలం రసమ్,
ఏవంచ శాలిగోధూమం యవశ్యామాకకోద్రవైః. ౬౧
కృతా పైష్టీసురావ్రహ్యా పాణ్డురేతిచ కీర్త్యతే,

వ్యా. కొఱ్ఱలను మొలకకట్టి మొలకలెత్తినపిదప నెండించి మెత్తగ పిండి విసరి యుంచునది. యవలను మొలకకట్టి బియ్యముచేసి పైజెప్పినపిండితో జేర్చునది. ఈరెంటి నొకటిగ కలిపి యొకకుండలో నుంచవలెను. మరియు యవలను పిండిచేసి వేరొకకుండలో నునిచి యావనాళములను ఎండించి యవల పిండిలో జేర్చునది. పైజెప్పినయవాగ్రము పైజెప్పినపిండినీళ్లలో జేర్చునది. ఇత్తెరంగున గూర్చబడినవానిని వేరువేరుగ కుండలలో నునిచి నీళ్లు కలిపి వాసెనగట్టి గాలిలేనిచోట నొకయహోరాత్ర ముంచునది. అయ్యది నురుగుతోగూడి మద్యమువంటివాసన గలిగియుండును. అట్టి పులిసినపిష్టము జగల మనియు, సురాబీజ మనియు చెప్పబడును. ఇదియే మత్తును గలిగించును. అట్టి సురాబీజమున పానార్హమైనతాటికల్లు మున్నగువానిని కలిపి సన్ననికండ్లుగల జల్లెడతో నిర్మలముగ వడగట్టునది. లేక కుండకు గుడ్డవాసెనగట్టి శుభ్రముగ వడగట్టియుంచునది. ఇత్తెఱంగుననే రాజనములు, గోధుమలు, యవలు, చామలు, ఆరుకలు మున్నగుధాన్యములచేగూడ సిద్ధముచేయునది. ఇది పైష్టి(పిష్టవికారమైన) సుర యని చెప్పబడును. పాండుసుర యనియు బేర్కొనబడును. ఇయ్యది యింద్రియమును వృద్ధినొందించును.

### కృష్ణసుర

మూ. అర్జునాధవఘోణ్టాకరోహితానాం త్వచశ్శుభాః. ౬౨
సంక్షుద్య క్వాథయేత్పశ్చాత్ ఆతపే పరిశోషయేత్,
చూర్ణం కుల్మాషకం కృత్వా తచ్చూర్ణేన విమిశ్రయేత్. ౬౩
యవనాళకపిష్టాన్నం పృథక్కృత్వా విమిశ్రయేత్,
ధారయేచ్చోష్మణి చిరం యథా తత్పక్వతాం వ్రజేత్. ౬౪
సురాబీజసమం చామ్బు తథా లోడ్యనిధాపయేత్,
ఏవం కృష్ణసురాస్నిగ్ధగన్ధ కార్ష్ణ్యరసాన్వితా. ౬౫

వ్యా. మద్దిపట్ట, చంద్రపట్ట, పోకపట్ట, ములుమోదుగపట్ట వీనిని మెత్తగ దంచి కుండలో నునిచి నీళ్లుబోసి యుడకబెట్టి యాపట్టలను ఎండలో చెమ్మనట్లు ఎండించి చూర్ణము జేసి యుంచునది. పిదప మినుములను వేయించి చూర్ణముజేసి పైజెప్పినచూర్ణముతో కలిపి యుంచునది. పిమ్మట పైజెప్పబడినరీతిగ యవనాళపిష్టాన్నమును పక్వముజేసి పైచూర్ణముతో కలిపి అదియంతయు కలిసి పక్వమగునట్టులు ధాన్యపుటమునందలి యావిరిలో చిరకాలముంచునది. మరియు నందు సురాబీజమునకు సమముగ నీళ్ల కలిపి కలియబెట్టి పక్వమగునందాక ధాన్యరాశి నుంచవలెను. ఇయ్యది స్నిగ్ధంబును పరిమళంబును నల్లనిరంగును మంచిరుచియు కలిగియుండును, కావున కృష్ణసుర యని చెప్పబడును.

## ద్రాక్షాసవము

మూ. మృద్వీకారసమాసుత్య వికృత ప్రాపితం దినే,
ద్రాక్షాసవం వద న్త్యేవం తరుణీజనవల్లభమ్. ౬౮

వ్యా. ద్రాక్షపండ్లరసమును ఆసుతముగజేసి వికృతిజెంది పులియునట్లుచేసినచో నయ్యది ద్రాక్షాసవ మనబడును. ఇయ్యది యౌవనవతులగుస్త్రీలకు మిక్కిలి హితమైనది.

ఆసుతలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది—"గుడాంబ్వసాస్తైలేన కన్దమూలఫలై స్తథా, సన్ధితం చామ్లతాం యాతం గుడసూక్తం తదుచ్యతే ఏవమేవేక్షుసూక్తం స్యాత్ మృద్వీకాసమ్భవం తథా" ఈశ్లోకములచే ద్రాక్షపండ్లరసమున కందమూలాదులజేర్చి యొకపాత్రలో నుంచి మూతబెట్టి చీలమన్నుజేసి యొకమాసముదినము లుంచుటచే నయ్యది పులిసిన నయ్యది ద్రాక్షాసుత మని తెలిసిడి. ఈయాసుతమునకు సూక్తమనియు పేరుకలదు.

## నారికేళాసవము

మూ. నారికేళోదకం భూరి స్థాపయిత్వా ఘటోదరే,
మిశ్రితం ధాతకీపుష్పైః నారికేళాసవం విదుః. ౬౯

వ్యా. కొబ్బరికాయనీళ్లను పైజెప్పినవిధిగ సంస్కరింపబడిన కుండలోబోసి యందు ఆరెపువ్వులు కలిపి కొన్నిదినములు వడ్లయావిరినందుంచినచో నయ్యది నారికేళాసవమని చెప్పవగును.

## మధూకాసవాదులు

మూ. క్వాథం మధూకపుష్పాణాం ధాతకీక్వాథమిశ్రితమ్,
మధూకమాసవం ప్రాహుః వేశిమాసుమయోజతే. ౭౦
పానసీపిక్కృతిం మిశ్రం ధాతక్యాపానసాసవః,
ఈషదుష్ణీకృతః పూతో రసాలాస్యాద్రసో ఘటే. ౭౧

త్రిరాత్రసుషితో మద్యః శీధుర్నామ ప్రదాహకః,
ఖర్జూరాదిరసానుస్తం మద్యం తన్నామ లాంఛితమ్. ౨౦

వ్యా. ఇప్పపువ్వులక్వాథమునందు ఆరెపువ్వులక్వాథము కలిపి కొంతకాలము ధాన్యరాశిలో నుంచిన నయ్యది మధ్వాసవమని చెప్పనగును. పనసపండ్లరసమును ద్రాక్షపండ్లరసమువలె నాసుకముగ జేసి పులిసినపిదప ఆరెపువ్వులక్వాథమును జేర్చి ముందుచెప్పిన రీతిగ సంస్కరింపబడినకుండలోబోసి గాలి తగలనీయక వాసెనగట్టి మూసి చీలమన్ను చేసి కొన్నిదినము లుంచినచో నయ్యది పానసాసవ మనబడును. పండ్లరసము కొంచెముగ వెచ్చజేసి వడగట్టి కుండలో నుంచినచో నయ్యది రసాల యనబడును. పైజెప్పినవిధిగా సిద్ధముజేయబడినమద్యము మూడుదినములు గడచినచో శీధు వనంబరగు. ఇయ్యది మిక్కిలి మదమును పుట్టించును. మరియు ఖర్జూరము మున్నగుపండ్లరసము ననుసరించి మద్యమునకు నామభేదము కల్గును. (ఖర్జూరపుపండ్లరసముచే సిద్ధమైనది ఖర్జూరమద్యము, ద్రాక్షపండ్లచే సిద్ధమైనది ద్రాక్షామద్యము. ఇత్తెరంగుననే తక్కినసనామభేదముల నెరుంగునది)

ప్రభువులకు మద్యపానవిధి

మూ. స్వాస్తృతే తు శయనే కమనీయే పుత్రమిత్రరమణీభిరుపేతః,
స్వం యశః కలితచారణసఙ్ఘే వందిమాగధిగణే పఠతి ద్రాక్. ౨౧
విలాసినారీ సవిలాసశోభిగీతం సనృత్యం కలతూర్యఘోషైః,
కాఞ్చీకలాపైశ్చలకిఙ్కిణీకైః క్రీడావిహఙ్గైశ్చ కృతానునాదమ్.
మణికనకసముత్థైరంమదాభిర్విచిత్రై ర్జలధివివిధ భక్తిక్షౌమవస్త్రావృతాఙ్గైః, అపి మునిజనవృత్తిక్షోభసం పాదినీభిః చకితహరిణలోల ప్రేక్షణాభిః ప్రియాభిః. ౨౩
స్తననితమ్బకృతాదతిగౌరవాదలసమాకులమీశ్వరసంశ్రయాత్
ఇతగతిస్ఖలితాభిరుపస్కృతం తరుణచిత్తవిలోభనకార్ముకమ్. ౨౪
యావనాసవమత్తాభిర్విలాసాధిష్ఠితాత్మభిః,
సఙ్ఘార్చ్యమాణం విధివత్తన్వఙ్గీభిరితస్తతః. ౨౫
తాళవృన్తనళినీదళానిలైః శీతలీకృతమతీవ శీతలైః,
దర్శనేఽపి విదధద్వశానుగం సాధకం కిముత దేహజన్మనామ్. ౨౬
చూతకర్పూరస్తైః కృతవాసం మల్లికయోజ్జ్వలయా చ సనాథమ్,
స్ఫాటికశుక్తిగతం సతరఙ్గం కాన్తమనఙ్గమివోద్వహదఙ్గమ్. ౨౭

మూ. తాళీసాద్యం చూర్ణమేలాదికం వా హ్వాహ్యం ప్రాశ్యపాగ్ర్యాయ
స్థాపనం వాతత్వాన్నిభోక్త భూమిభాగే సుమృష్టే తోయోన్మి
శ్రం దాపయిత్వా తతశ్చ. ౭౮
ధృతిమాన్ స్మృతిమాన్నిత్యం అన్యూనాధికమాచరన్,
ఉచితేనోపచారేణ సర్వమేవోపపాదయన్. ౭౯
పీత్వైవం చషకత్రయం పరిజనం సన్త్యాజ్య సర్వం తతో
గత్వాహారభువం పునస్సుభిషజో భుఞ్జీత భూయోఽత్ర చ
మాంసాపూపఘృతాదికైస్సహరితైస్త్యక్త్వా చ సౌవర్చలం
ద్విస్త్రిర్వానిశి చాల్పమేవ వనితా సంపర్జనార్థం పిబేత్. ౮౦

వ్యా. రాజుసుందరమై మంచియాస్తరములతో గూడియుండినశయనమునందు కరుండి, పుత్రులు మిత్రులు భార్య మొదలైనస్వబాధువులతో గూడి, తనయొక్క కీర్తిని చారణసంఘము వందిమాగధులు పాడుచుండగాను, విలాసవతులగు స్త్రీలయొక్క సవిలాసమగుగానము నృత్యములు మధురమగుతూర్యనాదములు వినుచు, స్త్రీలకాంచీధ్వనులు క్రీడకొఱకు పెంచబడిన చిలుకలు మొదలగు పక్షుల ధ్వనులు వీనితో ననునాదము చేయబడుచుండగాను, మణులు బంగారు వీనివల్ల బయలుదేరిన మేఘజ్యోతిస్సువంటి తేజస్సుతో గూడి విచిత్రమైనట్టియు సముద్రతరంగములవలనిరేఖలవలె వెలిగెడిపట్టుచీరెలుగట్టినయంగసౌష్టవముచేత మునిజనులయొక్క చిత్తవృత్తినిగూడ క్షోభింపజేసెడి బెదరుచుండు లేడిచూపులవంటి చూపులుగల ప్రియాంగనలు, స్తనములయొక్కయు పిరుదులయొక్కయు బరువుచేత మందముగాను ప్రభుసన్నిధానమువలన వ్యాకులముగాను నడచుచు తొట్రుపడుచుండెడివారై, తరుణులచిత్తమును వశపరచుకొనుపనియందు ఎక్కువనేర్పుగలవారై, యింకను యౌవనమదముచేతను ఆసవపానమదముచేతను మదవిలాసములతోగూడిన శరీరములుకలవారై యిటునటు తెచ్చి యందింపుచుండునట్టియు, తాటిపీవనలచేత తామరపాకు పీవనలచేత విసరబడి మిక్కిలి చల్లగాజేయబడినట్టియు, చూచినంతనే తనకు వశపరచుకొనునట్టియు, మన్మథవికారమును గలిగించునట్టియు, మామిడిపండురసము, పచ్చకప్పురము వీనితోజేర్చబడినట్టియు, మల్లిపువ్వులచే సువాసితమగునట్టియు స్ఫటికపాత్రలలో బోయబడి తరంగముపెట్టుచున్నట్టియు మనోహరమైన మన్మథునిశరీరమువలె శోభించుచుండును.

వ్యా. పైజెప్పబడినరీతిగ సిద్ధముచేయబడినమద్యమును దగ్గరనుంచుకొని తొలుత తాళిసాదిచూర్ణముసైనను, ఏలాదిచూర్ణముసైనను, వయస్సును స్థాపింపజేయునట్టి యౌషధముసైనను యథోచితముగ సేవించి, అట్టిమద్యము నభిలషించుమిత్రులకు మద్యమున

నీళ్లకలిపియిచ్చి, పిదప పరిశుద్ధమైనగోటాలో మద్యమును బోసి త్రాగవలెను. మద్యమును త్రాగునప్పుడు మనుజుడు స్థైర్యముతో గూడి, జ్ఞాపకశక్తికలిగి న్యూనాధిక్యములు లేక తగినయుపచారముల జేసికొనుచు పానమునకై యుంచుకొనినగిన్నెతో మూడుగిన్నెలమద్యము త్రావి తనవెంటనుండు పరిజనులనందరిని సన్మానముజేయుచు భోజనశాలకుంబోయి వైద్యునియనుమతి బొందుచుకొని భోజనముచేయనగును. మరియు భుజించునపుడు మాంసము, అపూపములు, నెయ్యి, హరితశాకము మున్నగువానిలోగూర్చి భుజింపవలెను. సౌవర్చలలవణమునుమాత్రము కూర్పరాదు. ఇట్లెరుగన రెండుమూడుపార్లు జీర్ణశక్తి ననుసరించి భుజింపవలెను. మరియు స్త్రీసంభోగమునకై రాత్రివేళ కొంచెముగ మద్యపానము జేయవలెను.

మూ. రహసి దయితామఙ్కే కృత్వా భుజాన్తగపీడనాత్,
పులకితతనుం జాతస్వేదాం సకమ్పపయోధరామ్.
యది సరభసం శీధోర్వా రాన్నసంయత తే కృతీ
కమనుభవతి క్లేశప్రాయం తదా గ్రహాసగ్రహామ్. ౨౧

వ్యా. భుజసమ్మర్దమునంజేసి పులకితమైన శరీరముకలిగినదియు స్వేదముతోగూడినదియు కంపించుచున్న స్తనములుకలిగినదియు నగుప్రియురాలిని తనయంకపీఠినుంచుకొని క్రమక్రమముగ మద్యమును పానముజేసి యాలింగనాదిసుఖముల ననుభవించినచో కృతార్థుడగును. అట్టిమద్యమును సేవింపక సంభోగసుఖము ననుభవింపవలెనన్న మిక్కిలి శ్రమము కల్గును. అట్టి క్లేశబహుళమగుసుఖమును ఏమానవు డభిలషించును. ఎవ్వడును గోరడనుట.

## మద్యపానావశ్యకత

మూ. ఇత్థం యుక్త్యా పిబేన్మద్యం న త్రివర్గాన్ విహాయ యః,
అపారసంసారసుఖం పరమం సోఽధిగచ్ఛతి. ౨౨
ఐశ్వర్యస్యోపభోగాయ స్పృహణీయం సురైరపి,
అన్యథా హి వివిత్సుస్స్యాత్ పశ్చాత్తాపేన్ధనం ధనమ్. ౨౩
ఉపభోగేన రహితో భోగవానితి చిన్త్యతే,
నిర్మితోఽతికదర్యోఽయం విధినా నిధిపాలకః. ౨౪
తస్మాద్వ్యవస్థయా పానం పానస్య సతతం మతమ్,

వ్యా. పైజెప్పినవిధి ననుసరించి యుక్తియుక్తముగ మద్యమును పానముజేయందగును. త్రివర్గము (ధర్మార్థకామము)లను విడువకయే మనుజుడు విధియుక్తముగ మద్య

మును పానము జేయునో వాడు అనంతమైన సంసారసుఖమును అత్యధికముగ ననుభవింపగలడు. ఐశ్వర్యసుఖము ననుభవించుటకై మద్యము దేవతలచేగూడ కోరబడినది. కావున ప్రతిమానవుడును సుఖము ననుభవించుటకై మద్యసేవ జేయందగు. అట్టిసుఖము ననుభవింపక కేవలము ధనముపై నాసగొన్నవానిధనము పశ్చాత్తాపము (వెనుకచింతించుట)అను నగ్నిని వృద్ధినొందింప కట్టెలబోలియుండును. ఉపభోగములేని మనుజుడు కేవలము ధనమునకు కావలియుండుటకై బ్రహ్మచే నిర్మింపబడి లుబ్ధుడని చెప్పనగును. కావున ధనలోభము లేక పానమునకు జెప్పిననియమము ననుసరించి మద్యమును సేవించుట యుక్తియుక్తము.

మద్యపానావధి

మూ. జ్ఞాత్వా విషయలుబ్ధానామిన్ద్రియాణాం స్వతన్త్రతామ్. ౮౫
యావద్దృష్టేర్న సమ్భ్రాన్తిః యావన్న క్షోభ్యతే మనః,
తావదేవ విరన్తవ్యం మద్యాదాత్మవతా సదా. ౮౬

వ్యా. చక్షురాదీన్ద్రియములు ఆయావిషయములం దాసగలిగియుండును కావున అట్టియింద్రియముల స్వతంత్రశక్తినిగుర్తెరింగి వాటి స్వాతంత్ర్యము మారకమునుపును, కన్నులు తిరుగకుండునంతలోను, మనస్సు భయాదులచే కలతనొందకమునుపును స్వాధీనచిత్తుడై మద్యపానమునుండి విరమించవలెను. (ఇంద్రియంబులును మనస్సును వికృతిజెందకమునుపే మద్యపానమును విరమించవలెనని భావము.)

మద్యపానార్హోపచారములు

మూ. అభ్యఙ్గోద్వర్తనస్నానవాసోధూపానులేపనైః,
స్నిగ్ధోష్ణైర్భాసితశ్చాన్నైః పిబేన్మద్యం న సీదతి. ౮౭

ఉపచారైశ్చ శిశిరైః యవగోధూమభుక్తిభుక్,
శ్లేష్మణో ధన్వకైర్మాంసైః మద్యం మరిచసంస్కృతైః. ౮౮

వ్యా. వాతప్రకోపమునందు అభ్యంగనము, ఉద్వర్తనము (నలుగుపెట్టికొనుట), స్నానము, వస్త్రధారణము, ధూపము, అనులేపనము (చందనాదులబూసికొనుట) అను నీయుపచారములను స్నిగ్ధంబులును ఉష్ణంబులును నగునితరోపచారంబులను జేసికొని మద్యమును సేవింపదగును. పిత్తమున శీతోపచారములజేసికొని యవాన్నమును గోధుమాన్నమును భుజించి మద్యమును పానము సేయందగును. మెట్టప్రదేశమునబుట్టి యుష్ణవీర్యముగ నుండుమాంసములను మిరియాలచే సంస్కరించి భుజించి మద్యమును సేవింపనగును. ఇట్టి నియమముతో మద్యపానము జేసినచో వికృతియు హానియు గల్గదు.

## త్రిదోషానుగుణమద్యములు, దోషానుసారపానకాలము

మూ. తత్ర వాతేహితం మద్యం ప్రాయః పైష్టికగౌడికమ్,
పిత్తే సామ్భో మధు, కఫే మాధ్వీకారిష్టమాధవమ్. ౮౯
ప్రాక్పిబేత్ శ్లేష్మలో మద్యం భుక్తస్యోపరి పైత్తికః,
వాతికస్తు పిబేన్మధ్యే సమదోషో యదేచ్ఛతి. ౯౦

వ్యా. మరియు వాతము ప్రకుపితమైనపుడు పైష్టిక(పిండిచేసిద్ధమైన) మద్యంబును, గౌడిక(బెల్లముచే సిద్ధమైన) మద్యంబును ప్రాయికముగ హితమైయుండును. పిత్తప్రకోపమున ఉదకముతోగూడిన మధుమద్యము హితకరము. కఫప్రకోపమున మాధ్వీకారిష్టంబును, మాధవమద్యంబును హితకరములు. మరియు కఫప్రకోపముకలవాడు భోజనమునకు ముందు (పరగడుపున)ను, పిత్తప్రకోపముకలవాడు భుజించినపిమ్మటను, వాతప్రకోపము కలవాడు భోజనమధ్యకాలమునను మద్యముత్రాగవలెను.

## శరీరధారణోపాయము

మూ. ఆహారశయనబ్రహ్మచర్యైర్యుక్త్యా ప్రయోజితైః,
శరీరం ధార్యతే నిత్యం అగారఇవ ధారణైః. ౯౧

వా. మరియు నాహారము, శయనము (పడక, నిద్రాదులు), బ్రహ్మచర్యము (స్త్రీసంభోగాదివిషయములలో నింద్రియముల నియమించి స్వాయత్తముగ నుంచుకొనుట.) అను నీమూడిటి దేశకాలసాత్మ్యాదులను శాస్త్రపద్ధతిని అనుసరించి యుక్తియుక్తముగ నుపయోగించినచో నవి స్తంభములు మున్నగునవి యిండ్లను ధరించియుండువిధముగ శరీరమును దృఢముగ ధరించి కాపాడును.

## చతుర్విధాన్నభేదములు

మూ. అథాన్నం భక్ష్యభోజ్యావలేహ్య పేయత్వకల్పితమ్,
శస్తం స్వాదుకరస్పర్శవర్ణగన్ధరసాన్వితమ్. ౯౨

వ్యా. అన్నము (ఆహారముచేయుటకు దగినపదార్థము) భక్ష్యము, భోజ్యము, అవలేహ్యము, పేయము అను భేదములచే గల్పింపబడినది రుచియు, చేత తాకినచో సుఖస్పర్శంబును, మంచివర్ణంబును, సువాసనయు, మధురాదిరసంబులును కలిగియున్నచో మిక్కిలి ప్రశస్తముగ నుండును.

(నమలి తినదగినది భక్ష్యమనియు, నమలకయే చప్పరించి తినదగినది భోజ్యమనియు నాలుకతో చప్పరించితినదగినట్లు కొంచెము ద్రవముగ నుండునది అవలేహ్యమనియు,

మిక్కిలి ద్రవరూపమై త్రాగదగినది పేయమనియు భేదముల నెరుంగునది.) ఇదియే చతుర్విధాన్నము.

గోధుమపూరీలు, రొట్టెలు

మూ. ప్రక్షాళితానాం క్షుణ్ణానాం శోషితానాం ఘరట్టకే,
చూర్ణితానామపక్షషం గోధూమానాం రజో మృదు. ౯౩
ససర్పిర్లవణక్షీరనీరం మర్దనపిణ్డితమ్,
కోష్ణప్రాన్తకరాస్ఫాలమర్దితం చిక్కణీకృతమ్. ౯౪
స్నిగ్ధే కరతలే గోళాన్ కల్పయేత్తాంశ్చ రూపితాన్,
శాలితణ్డులచూర్ణేన కరసఞ్చారవర్తితైః. ౯౫
విస్తృతాన్ సితవస్త్రాభాన్ తప్తకర్పరమస్తకే,
క్షిపేత్పక్త్వా చాపనయేత్ యావత్కార్ష్ణ్యం న జాయతే. ౯౬
మండకా ఇతి విఖ్యాతాః ప్రాగ్వద్గోళాన్ ప్రసారితాన్,
అఙ్గారేషు క్షిపేత్కిఞ్చిత్ కృష్ణాస్తేఽఙ్గారపోళికాః. ౯౭

వ్యా. గోధుమలను నీళ్లలోబోసి శుభ్రముగ కడిగి వక్కముక్క దంచి యెండించి తిరుగటలో నునిచి మెత్తగ పిండివిసరి ఆపిండిలో నెయ్యి, ఉప్పు, పాలు, నీళ్లు, ఈనాల్గిటిని మితముగ జేర్చి మర్దించి ముద్దజేసియుంచుకొని యాముద్దను పిడికిటిచే గుద్ది మర్దించి మిక్కిలి మెత్తగతీగెలవలెసాగునట్లు చేయునది. పిమ్మట చేతికి నేయిబూసి యాపిండి ముద్దలో కొంచెముకొంచెముగ తీసియుంచుకొని యుండలుచేయనగును. పిదప నొక్కొక యుండను తీసికొని బియ్యపుపిండిని పైనజల్లి పల్లెమున నుంచి చేతితో గుండ్రముగ తెల్లని గుడ్డవలె పలుచగ విశాలముగ నగునట్లు తట్టునది. వానిని వేడిగ కాలినపెనముపై నొక టొకటిగ నునిచి చాల్చి నల్లబడకమునుపే వెలికిం దీసియుంచునది. ఇవి మందకములను భక్ష్యవిశేషములు (పూరీలు). మరియు పైజెప్పినరీతిగ గోధుమపిండి యుండలుజేసి గనగన మనియుండు నిప్పులపైనుంచి కొంచెము నల్లబడునట్లు కాల్చిన నయ్యవి అంగారపోళిక లన బడును (నిప్పునకాల్చినపూరీలు). లేక పైజెప్పినరీతిగ పెనముపైకాల్చి పిమ్మట నిప్పుపైన కొంచెము నల్లబడునట్లుంచినను అంగారపోళిక లనబడును.

మనోహరములు

మూ. పక్త్వాద్వైభిదుళాః పిష్టాః సైలా మరిచశర్కరాః,
సజీరార్ద్రికసిన్ధూత్థహింగవో గోళమధ్యగాః. ౯౮

కిఞ్చిత్ప్రసారితాస్తైలే పక్త్వాకారా మనోహరాః,
సంభారగర్భాస్తే గోళాః లడ్డుకాస్తైలపాచితాః. ౯౯

వ్యా. సెనగలును పెసలును రెండేసిఖండములు కలిగియుండును కావున భిదుళము లనబడును. వానిలో నొకదానిని (అనగా పెసలబేడలనైనను, సెనగబేడలనైనను) మెత్తగ నుడికించి మెత్తగ నూరి అందు ఏలకులు, మిరియాలు, చక్కెర, జీలకఱ్ఱ, శుంఠి, సైంధవలవణము, ఇంగువ, వీనినన్నింటిని పొడిచేసి కలిపి యుండలుజేసి పైజెప్పినరీతిగ పక్వము చేయబడినపిండిలో నునిచి పొదిగి కొంచెము విస్తరించునట్లు తట్టి నూనెలో పక్వముజేసిన నవి మనోహరములని చెప్పనగును. పైజెప్పినసంభారమును లోపలనుంచి యుండలుజేసి నూనెలో కాల్చినచో లడ్డుకము లనబడును. ఇవియేకుడుములు, ఉండ్రాళ్లు నని జెప్పనగును.

మఱికొన్నిభక్ష్యవిశేషముల సాధనప్రకారము

మూ. సేవ్యాస్తన్తుసమా గోళాః ప్రతానాః క్షీరపాచితాః,
మాషస్య విదళాన్ క్లిన్నాన్ నిస్త్వచః పరిషేచితాన్. ౧౦౦
సాసమ్భారాన్వితా మృద్వీ స్థాపయేత్తగహస్తతః,
అమ్లాన్ గోళాన్తరాళస్థాన్ పటికాయాం నివేశితాన్. ౧౦౧
ఆస్యం తు వస్త్రగర్భిణ్యాం పిధాయ పరిపాచితాన్,
అవతార్యానుమరిచచూర్ణదత్త్వావచూర్ణనాన్. ౧౦౨
ఘృతాక్తాననుధూపాయేత్ ఘృతరామఠజీరకైః,
ఏతాన్ కుణ్డలికాన్ మాషగోళవిస్తారితాన్ ఘనాన్. ౧౦౩
నైకచ్ఛిద్రాస్సృతాస్తైతేలోహితాః పూరకాస్స్మృతాః,
పక్వాస్తఏవ నిచ్ఛిద్రాః తైలేమరిచశర్కరాః. ౧౦౪
మన్థకామథితే క్షిప్తాః కాజికా కాంజికావ్హాయాః,
పచ్యమానే సమధితే కాంజికే జీరకార్ద్రకమ్. ౧౦౫
సైన్ధవం మరిచాన్ ఖణ్డాన్ క్షిప్త్వా పక్త్వా ఘనత్వతః,
ఉత్తార్య వటకాన్ క్షిప్త్వాన్ వితిరేన్మారిచం రజః. ౧౦౬
హిఙ్గునా ధూపితాశ్చైతే వటకాస్తే ఘనావ్హాయాః,
త్రిజాతకైలామరిచ శర్కరాకదళీఫలైః. ౧౦౭
పూర్ణం సజీరకైరన్తర్గోళితేన గుడేన వా,
మాషైర్వావిదళైశ్శాలిపిష్టగోళీకృతాజలే. ౧౦౮

అపూపా మోదకాశ్చైవం తైలేతూత్కారికాస్స్మృతాః,
సుస్విన్నాస్సలిలే శుష్కాః రాత్రిక్షుణ్ణా ఉలూఖలే. ౧౧౯
నిస్తుషా మాతసే భృష్టాకర్షాకేచూర్ణితా యవాః,
పాదాంశతైలాస్తత్తుల్యగుడాశ్చార్ధోదకాగుడాత్,
సశుణ్ఠిహిఙ్గుమరిచచూర్ణజీరక సైన్ధవాః. ౧౧౧
సితహిఙ్గ్వమ్లలవణశూలప్రోతవిపాచితాః,
ఘృతాక్తాః సిన్ధుమరిచ చూర్ణక్లిన్నా భటీకృతమ్. ౧౧౨
ఖణ్డా జర్జరితాః ప్రాగ్వత్ అమ్లేపక్వాసహిఙ్గుని,
యుక్తా జీరకమేథాకచూర్ణైర్ధాన్యార్ద్రకద్రవాన్. ౧౧౩
శుష్కాజ్యభృష్టామరిచనిర్ణభణ్డభవేత్రకమ్,
ఘృతేన చక్కలీం భ్రష్టాః కిటిలాసశర్కరాః. ౧౧౪
సమాతులుఙ్గార్ద్రకకేసరేణ దధిస్థితాః సైన్ధవజీరకాభ్యామ్,
తథైవయుక్తామరిచేన హిఙ్గు ప్రధూపితాః శర్కరికాః ప్రశస్తాః.

వ్యా. గోధుమపిండి మొదలగువానితో దారములవలె దయారుచేయబడి గుంద్రముగా ముక్కలుచేసి పాలతో పాక మొనర్చిన విప్రతానము లనబడును. (సేమ్యా పాయసమువంటిది ) మినుములు విసిరి నానబెట్టి పొట్టుపోవునట్లు కడిగి రుబ్బిన మృదువైన పిండి నొకనాడు లవణాదిసంభారములను చేర్చి నిలువయుంచవలెను. మరునాటి కది పులిసినతరువాత దానిని అకుబుట్టలలోబెట్టి యొక్కపాత్రకు లోపల నీరుపోసి పైన గుడ్డతో మూసి వాసెనగట్టి దానిమీద నాబుట్టలనుంచి మీద మూతవైచి వండవలెను. అట్లుడికించి దింపినవెంటనే వానిమీద మిరియపుపొడిని చల్లవలెను. నేతితో తడుపవలెను. ఇంగువ జీలకఱ్ఱ నేతితో వేచి యాపోగను వీనికి పట్టించవలెను. ఇట్లుచేసిన వానిని కుండలికములందురు. (అనగా కుడుములు). పిండిని (అనగా బియ్యము మినుపపప్పు మొదలైన వానితోఁ జేయబడినది) ముద్దగా కలిపి లవణాదులనుచేర్చి అనేకరంధ్రములుగల గుడ్డలో నుండిగాని యినుపసాధనము (జంతికలగొట్టము) లోగాని ఉంచి నూనె మరిగించి యందులో పిడువబడి ఎఱ్ఱగా వేగినవి పూరకము లనబడును. (జంతికలు). అట్టి పిండితోనే రంధ్రములలోనుంచికాక చేతితో నూనెలో పుణికినవి మరిచశర్కర లనబడును. (పుణుకులు) అట్టిపుణుకులనే నీరువేయక తరిచిన పెరుగులో వైచినచో మంథకము లనబడును. (పెరుగుపుణుకులు). తరవాణి (పులిగంజిలో) వైచినచో కాంజీకము లనబడును, మథితమనుమజ్జిగ, కాంజికము (పులిగంజి) వీనిని మరిగించుచుండగా నందు జీలకఱ్ఱ

అల్లము సైంధవలవణము, మిరియాలుపొడి శాకఖండములు (కూరముక్కలు) వీనిని వైచి చక్కగా మరిగించి దిగువకు దించి యందు వడియములను వేచి పడవేసి మిరియపుచూర్ణమును చల్లవలెను. ఇంగువను వేచి యూపొగను పట్టించి (ఇంగువ నూనె పోసి) సిద్ధపరచినయావడియములు ఘనము లనబడును. దాల్చినచెక్క, ఆకుపత్రి, ఏలకులు, మిరియములు, పంచదార, అరటిపండ్లు వీనిని అనురూపముగా చేర్చి ముద్దచేసి దానిలో కొంచెము జీరకము చేర్చి యుండలుగాజేసి తోపు (పొరపు)లో పొదిగి నేతిలోవేచినను లేక బెల్లము పెసరపప్పు ఉడికించినముద్దచేర్చి చేసినముద్దలను (పూర్ణమును) వరి మినుము కలిపినపిండి నీటిలోకలిపి ఆముద్దతో పొదిపి నేతిలో వేచిన వానిని అపూపములు లేక మోదకము లేక ఉత్కారికలు అని పేరు. నీటిలో నుడికించి యెండించబడినయవలను తొలినాడురాత్రి రోటిలో దంపి పొట్టుచెరిగి క్రొత్తమూకుటిలో వేచి తిరుగలిలో పిండిగా విసరిపిండిలో నాల్గవభాగము నూనె పిండితో సమానము బెల్లము చేర్చి బెల్లములో సగము నీరుపోసి శుంఠి ఇంగువ మిరియాలపొడి జీలకఱ్ఱ సైంధవము చేర్చి మేదించి రొట్టెలుగాజేసి ఇంగువ ఉప్పు కొంచెము పుల్లనిరసమును పైనిపూసి శూలమునకు గ్రుచ్చి నిప్పుమీద కాల్చినతరువాత నెయ్యి కొంచెము సైంధవము మిరియములుపొడి చేర్చి పైనిపూసిన నవి భటీకృతము లనబడును.

పైవిధముగా సిద్ధపరచబడినయవలపిండితో నీరుకలిపి యుండలుగాజేసి యెండించి
1 వడియములవలె, నేతిలో వేచి పులుసులో ఇంగువ జీలకఱ్ఱ మెంతిపొడి ధనియాలు అల్లము చేర్చి అందువైచి యుడికించవలెను. ఇది యొకవిధమైన వ్యంజనమగును. యవల పిండితో చక్కిలములుచుట్టి నేతితో వేచి పంచదారపాగుపట్టి యందు ముంచినచో కికిటీలము లనబడును.

వెనుకచెప్పబడిన మరిచశర్కర లనబడుపుణుకులు, మాదీఫలపుకూసములు అల్లపుముద్ద సైంధవము జీలకఱ్ఱ మిరియములపొడి వీనిని పెరుగులో వైచి దానితో వాసనకలిగించిన నవి (శర్కరికలు) చాలా ప్రశస్తమైన వ్యంజనములగును.

## మాంసపాకవిధి

మూ. అజస్య కన్ధరం ఛిత్త్వా గాళితాత్ స్వల్పసైంధవాత్. ౧౧౬
అఙ్గుళీ మర్దితాద్రక్తాత్ సిరాజాలమపాహరేత్,
పూగీఫలమితాః ఖణ్డాః ఆజమాంసస్య నిసిరాన్. ౧౧౭
పూర్వవత్సంస్కృతానమ్లే ససమ్భారే విపాచితాః,
స్తోకావశేషపాకాంస్తాః సక్షురక్తసమన్వితాన్. ౧౧౮

వ్యాఘ్రారితాభ్యాం హిఙ్గుజీరాభ్యాం చూర్ణితైరవచూర్ణితాభ్యాం,
ఏలామరిచకర్పూరైః కృష్ణపాకం ప్రచక్షతే. ౧౧౯

వ్యా॰ రోగాదులులేక శుభ్రముగనుండు మేకపోతును కంఠము తెగకోసి దాని రక్తమును వస్త్రమున వడగట్టి యందుండుసన్నని నరములు మున్నగువాని దూరం బుచ్చి అందు కొంచెముగ సైంధవలవణమును కలిపి చెంప్రెళ్లచే నారక్తమును చక్కగ గిలకొట్టి యుంచునది. పిమ్మట నామేకపోతు మాంసమును పోకలంతేసి ముక్కలుగ ఖండించి అందు నిరలు మున్నగునవి లేకుండునట్లు శుభ్రపరిచి ఉప్పునీళ్లలో శుభ్రముగ కడిగి యాముక్కలను చింతపండు మున్నగునమ్లరసమున సంభారము (మసాల) తోకూడ కలిపి వండునది. అయ్యది కొంచెము పాకము కావలసియుండగనే పైజెప్పినరక్తమును సత్తు పిండిని కలిపి వాసనకై యింగువను జీలకఱ్ఱను కలిపి అందు ఏలకులు మిరియములు పచ్చ కర్పూరము ఈమూటిని పొడిచేసి కలిపి చక్కగ పక్వముచేయునది. ఇది సామాన్యముగ మాంసపాకక్రమము.

మాంసవటకములు

మూ॰ అఙ్గారభర్జితం మాంసం తిలశః కల్పితం యుతమ్,
కేసరైర్మాతులుఙ్గస్య గృఞ్జనస్యార్ద్రకస్య చ. ౧౨౦
ధూపయేత్సర్పిషా హిఙ్గుసైన్ధవోషణజీరకైః,
ఆమం మాంసం సలవణం హిఙ్గుతోయేన మేళయేత్. ౧౨౧
పూరితం మాంసచూర్ణేన తద్గోళాన్యాతపే క్షిపేత్,
యథారుచి పచేత్తైలే తే మాంసవటకాస్మృతాః. ౧౨౨

వ్యా॰ నిగనిగలాడుచుండునిప్పులపైన మాంసఖండములను చక్కగ వేయించి సన్ననిచూర్ణముగచేసి అందు మాదీఫలముల కేసరముల(మాదీఫలముల లోపలనుండుగిజరు)ను, ఉల్లిపాయలను, అల్లమును కలిపి ఇంగువ సైంధవలవణమును పిప్పళ్లను జీలకఱ్ఱను ఒకటిగ జేర్చి నేతితో తిరుగబోతబెట్టి యుంచునది. పిదప పచ్చిమాంసములో ఉప్పు మితముగ జేర్చి ఇంగువనీరు కలిపి మెత్తగ పిసికి యామాంసములో పైజెప్పినమాంసచూర్ణమును పొదుగుచు నుండలుజేసి యాయుండలను ఎండలో బాగుగా నెండించి యుంచునది. తన కిష్టమైనప్పుడు నూనెలో కాల్చి యుపయోగించునది. ఇవి మాంసవటకము లనబడును.

మాంసపాకవిశేషములు, అందుమర్మరములు

మూ॰ శూలవేష్టితమఙ్గారతప్తం కఠినతాం గతమ్,
వికిరేత్తైన్ధవేనాత్ర తచ్ఛూల్యమర్మరో మతః.

వ్యా॰ మాంసమును శూలమున గ్రుచ్చి పొగలేనినిప్పులలో ద్రవమంతయుం చుండి గట్టి పడునట్లు గాచి, దానిపైని సైంధవలవణమును శుంఠినిపొడిచేసి చల్లియుంచునది॰ ఇట్లు పక్వముచేయబడినమాంసము 'మర్మరము' అని చెప్పఁబడును॰

### వర్ణశుణ్ఠికాచక్కళీసాధనప్రకారము

మూ॰ అజాయాః కాలఖణ్డస్య ఖణ్డాద్వ్యఙ్గుళసమ్మితాః,
అఙ్గారతప్తాస్సంభారకీర్ణాస్స్యుర్వర్ణశుణ్ఠికాః. ౧౨౩
పూగీఫలమితాన్ ఖణ్డాన్ కాలఖణ్డస్య భర్జితాన్,
అఙ్గారే తైలసమ్మిశ్రాన్ సజీరోషణసైన్ధవాన్. ౧౨౪
ధూపయేద్ధిఙ్గునా తైర్వా చక్కళీః పరికల్పయేత్,

వ్యా॰ ఆడమేకయొక్క యకృత్తు (నల్లదబ్బను)ను రెండేసియంగుళములుగా ఖండించి పొగలేనినిప్పులమీద కాల్చి యందు సంభారము (సంబారుగుండ) ను చల్లియుంచిన నవి వర్ణశుణ్ఠిక లనబడును॰ పోకలంతేసి యకృత్ఖండములనుచేసి నిప్పులమీద నూనెవేసి మూకుటిలోవేచి యందుజీలకఱ్ఱ మిరియములు సైంధవమును చూర్ణించి చల్లి యింగువ వేచి యాపొగను పట్టించి యుంచవలెను॰ వానిని పిండి మెదిపి చక్కలుగాగూడ చేయ వచ్చును॰ వీనిని చక్కళీయందురు॰

### వృక్కపాకవిధి

మూ॰ పట్వామ్లభావితౌవృక్కౌ పచేత్తైలే ద్విధా కృతౌ. ౧౨౫
అన్యేషాం శ్వాపదానాం చ పాకస్స్యాదజమాంసవత్,

వ్యా॰ వృక్కములను ఒక్కొక్కటి రెండేసితునియలుగ జేసి ఉప్పును పులుపును జేర్చి భావనచేసి తైలమున పచనముచేయనగును॰ శ్వాపదములు (ఏదుపందులు) మున్నగు తక్కిననాలుగుకాళ్లుగల జంతువులమాంసములనుకూడ మేకమాంసమువలెనే పక్వము చేయనగును॰

### ఉపఖండపాకవిధి

మూ॰ మాంసఖణ్డాస్సవర్ణాహిహింగుతోయేన సేవితాః.
త్ర్యహం ఛాయావిశుష్కాస్స్యుః ఉపఖణ్డాస్తతః పరమ్,
అఙ్గారపుఞ్జభృష్టాస్తే బహ్వాస్వాదరుచిప్రదాః,

వ్యా॰ మాంసపుముక్కలను ఇంగువనీళ్లతో దడిపి మూడుదినములు నీడ నెండించి పిదప పొగలేనినిప్పులలో చక్కగ వేగనిచ్చి యుంచునది॰ యకృత్తువృక్యములు మున్నగు వానినికూడ నిట్లు చేయునది॰ ఇయ్యవి మిక్కిలి రుచికరముగ నుండును॰

— మస్తిష్కపాకము —

మూ. మస్తిష్కం కాఞ్జికే పక్వం తదనన్తరమాణకే (తపే)
తైలం వాద త్రిసమ్భారం ధూపయేద్ధిఙ్గునా తతః.

వ్యా. మస్తిష్కమును (మెదడును) కాంజికమున పక్వముజేసి పిమ్మట యెండ నెండించి మసాలచేర్చి తైలముతో పక్వముచేసి ఇంగువ తిరుగబోతపెట్టవలెను.

— పక్షిమాంసపాకము —

మూ. ఆపాదచఞ్చుపుచ్ఛాన్త్రం పచేదేవం ఖగామిషమ్,
అశల్యవిస్రపిచ్ఛిల్యం తైలసాముద్రఘర్షణాత్. ౧౨౮

వ్యా. పక్షులయొక్క కాళ్లు, ముక్కులు, తోక, ప్రేవులు మున్నగువానిని దూరంబుచ్చి తక్కినమంచిమాంసమున తైలమును ఉప్పును జేర్చి చక్కగ రుద్ది దానియందు ఎముకలముక్కలును దుర్గంధంబును బంధన(జిగురు)యు వదలునట్లు శుభ్రపరిచి పైజెప్పిన రీతిగ పక్వముచేయునది.

— మత్స్యములపాకవిధము —

మూ. మత్స్యానశీర్షపుచ్ఛాన్త్రాన్ హరిద్రోదకధావితాన్,
వస్త్రపీడనముక్తోష్మాధూపయేద్ధాణకస్థితాన్. ౧౨౯
మత్స్యఖణ్డాన్ సలవణకుమ్భేషు చతురఙ్గులాన్,
విదార్య భోజనారమ్భే భర్జ్యన్తే భారఖణ్డకాః. ౧౩౦

వా. మత్స్యములను తలలను తోకను ప్రేవులను దూరంబుచ్చి పసుపునీళ్లలో చక్కగ కడిగి గుడ్డలోబెట్టి గట్టిగ పిడిచి బాణలిలో నునిచి కొద్దిగ యావిరిరానిచ్చి నాలుగేసియంగుళముల ముక్కలుగజేసి ఉప్పుతోకూడ కుండలో నునిచి భోజనకాలమునకు మునుపు వేయించునది. ఇయ్యవి భారఖండములని చెప్పబడును.

— మఱియొకమత్స్యపాకవిధానము —

మూ. చిఞ్చామ్లపత్రగోధూమచూర్ణకీర్ణవిపాచితమ్,
తైలేఽగ్నితప్తే పిఙ్గాభం సితామరిచసైన్ధవమ్. ౧౩౧
యథారుచ్యాణకే తైలే పాచ్యం జ్వలతి పావకే,
మత్స్యాణ్డకోశయోః ఖణ్డాఃనిర్ధూమాఙ్గారభృష్టయోః.
తైలపక్వాస్ససమ్భారాః వ్యాఘారితా హిఙ్గునా హితాః,

వ్యా. పైజెప్పినరీతిగ మత్స్యములను ముక్కలుజేసి చీల్చి లోపలనుండుప్రేవులు మున్నగువానిని విడదీసి చింతాకును గోధుమపిండినిగూర్చి నిప్పుచే బాగుగ కాగినతైలమున

కొంచెము చక్కెరను మిరపపొడిని సైంధవలవణమునుకూడ కలిపి యుడకబెట్టి, పిమ్మట బాణలిలో నూనెబోసి అందు మత్స్యఖండములను నునిచి పక్వముచేయనగును.

మరియు మత్స్యములకు కోడి మాంస గువ్వాని గుడ్లను పొగలేని నిప్పులలో వేపుడు పెట్టి పిదప సంభారములతోగూర్చి తైలమున పక్వముజేసి యింగువ తిరుగుబోతపెట్టినచో మిక్కిలి హితముగ నుండును.

### శాకముల పక్వముజేయువిధము

మూ॥ అథ శాకైర్దధ్యమ్లలవణోషణజీరకైః. ౧౩౩
సమం స్విన్నాని శాకాని మాషచూర్ణరసోనయోః
పక్వాని ప్రతివాపేన ఘృతం దత్వావతారయేత్.

వ్యా. శాకద్రవ్యములను కలిగాయలపులుపునందును పులిసినపెరుగునందును జేర్చి అందు ఉప్పును పిప్పళ్లను జీలకర్రను జేర్చి యుడకబెట్టి అందు మినపపిండిని ఉల్లిపాయలను జేర్చి నెయ్యిగూర్చి తిరుగబోతపెట్టి దించునది.

### గగ్గెర మున్నగుశాకములపాకము

మూ॥ వైకుణ్ఠపల్లవం స్విన్నం శాకైర్దరోషణజీరకైః. ౧౩౪
యుక్తం సధాన్యదధ్యమ్లైర్ధూపయేన్మదఘృష్టితమ్,
హరిమఞ్జరివర్షాభూతులసీకన్దళాగ్రికాః. ౧౩౫
కుష్మాణ్డీకదలీనాళికేరాణాం లవణాన్వితైః,
తూరైస్స్విన్నం పచేచ్ఛాకం జీవన్త్యా ఖదిరం జలే. ౧౩౬
పరిస్రావ్యార్ధపాకే తు చూర్ణితైస్థాలికాన్తరే,
సాముద్రమరిచాజాజీమాషైర్లశునసర్పిషా. ౧౩౭
పచేచ్ఛాకం తదా లక్ష్యాహారితత్వేఽవతారయేత్,

వ్యా. గగ్గెరచిగుళ్లలో కలిపికాయలపులుపును పిప్పళ్లను జీలకఱ్ఱను జేర్చి యుడికించి అందు ధాన్యమును పులిసినపెరుగును జేర్చి మెల్లగ కలియబెట్టి తిరుగబోతబెట్టునది. మరియు మారొకుండాకును, గలిజేరాకును, తులసియాకును, అల్లమునుగూడ పైజెప్పిన రీతిగ పక్వముచేయునది. మరియు కుండలి (       ) అరటికాయలు, టెంకాయ, వీనిని ఉప్పును కారమునుజేర్చి యుడకబెట్టి బాణలిలో తిరుగబోతపెట్టి పక్వముజేయనగును.

మరియు పాలకూరను ఖదిరశాకమును నీళ్లుబోసి యుడకబెట్టి అర్ధపక్వసమయమున నీళ్లు వంచి యొకస్థాలియం దునిచి, ఉప్పు, మిరపకాయలు, జీలకఱ్ఱ, మినుములు, వీనిని

పొడిచేసి గిందువైచి, ఉల్లిపాయలను నేతిని కలిపి తిరుగబోతపెట్టి అయ్యది పక్వమగునందు నపుడు దింపునది.

మూలకశాకపాకము

మూ. మూలకం స్విన్నమస్త్రేన తక్రం క్షీరాజ్యకైః కెః. ౧౩౮
అథ చూర్ణాన్వితాద్యం స్యాత్ స్విన్నం చిఞ్చాదలైస్సహ,

వ్యా. మూలక(ముల్లంగి)శాకమును పులుపుచేర్చి వండి అందు క్షీరమును అజ్యమును జీలకఱ్ఱపొడిని జేర్చి చింతాకునుకూడ జేర్చి పక్వముగ వేపుడుపెట్టి పక్వము చేయనగును.

హరితశాకాదిపాకము

మూ. హరితం సూరణాత్కన్దం పిష్టైర్గోధూమశాలిజైః. ౧౩౯
ఆలిప్తం క్షీరసమ్మిశ్రం భర్జితం పీతతాం గతమ్,
అజాజీదుగ్ధమాషాజ్యమరిచైరవచూర్ణవత్. ౧౪౦

వ్యా. హరితశాకమునందును కందగెడ్డలయందును గోధుమపిండిని బియ్యపుపిండిని కలిపి పాలుబోసి పచ్చనగునందాక వేయించి, అందు జీలకఱ్ఱను పాలను అజ్యమును మిరప పొడిని గూర్చి తిరుగబోతపెట్టి పక్వముచేయవలెను.

వేత్రాగ్రశాకపాకము

మూ. బద్ధ్వా (ఛిత్వా) బహిస్త్వగ్వేత్రాగ్రం సరసోనఘృతోషణే,
సహిఙ్గుజీరసిద్ధార్థతిలమాషపలాణ్డుకే. ౧౪౧
తోయే విపక్వం ధూపాయేత్ ఘృతజీరకహిఙ్గుభిః,

వ్యా. వెదురుమోవులను పైబెరడుచివ్వి ఉల్లిపాయలు, నెయ్యి, పిప్పళ్లు, ఇంగువ, జీలకఱ్ఱ, ఆవాలు, నువ్వులు, ఉద్దిపప్పు, నీరుల్లిగెడ్డలు వీనినన్నిటిని చేర్చి నీళ్లుపోసి పక్వము జేసి, ఇంగువ, జీలకఱ్ఱ, నెయ్యి ఈమూటిని జేర్చి తిరుగబోతపెట్టవలెను.

బోడతరముమున్నగుశాకములపక్వముచేయువిధము

మూ. ముణ్డీం చూర్ణోదకే పక్త్వా యథోక్తిం తణ్డులోదకైః.
స్రావయేన్నారికేళస్య పత్రపూరోపకేఽమృతామ్,
కుమార్యా తాలతరుణపత్రాస్తరపిధానయా. ౧౪౩
పచేదామలకామ్లానివ్యమ్లాని వ్యఞ్జనాని వా,
శ్లేష్మాతకస్య పత్రేణ రమ్భాయా వార్కశోమలమ్.
బృన్తామత్స్యాక్షీమూలాభ్యాం మథితం మస్కరాఙ్కురమ్,

శుష్కాణ్యపొన్నసం శాకం భూమావస్లో విపచేద్ధ్యనుమ్. ౧౪౫
శుష్కాణ్యజలం నూష్టజలే స్థితం నాడీ(లి)శాకమే,
ధాతం పక్వమతిక్తం స్యాత్తథైవాలర్కపల్లవమ్. ౧౪౬
కుణ్డలీదళసంపక్వం లవణాన్లో న్తు విశ్రయేత్,
ఆమ్రామ్రాతకజమ్బ్వాసాం తుల్యాన్యస్వైః పల్లవాని చ. ౧౪౭
మేషశృఙ్గ్యభయాబిల్వకుటజావ్యాదిజోత్పలమ్,
కరీరాత్కరమర్దాచ్చ లవణామ్బుపి నిక్షిపేత్. ౧౪౮
ఆమ్రామాత్రకజమ్బ్వాగచిఞ్చాబకులకటుమ్బ్రుకాత్,
కరమర్దోత్పలం మూలం మార్గణాన్యమస్కరాఙ్కురమ్. ౧౪౯
ఆర్ద్రికం చాపి లవణాన్తైలరాజిషు నిక్షిపేత్,
తాళితం దారితం సక్తువద్ద్వ్యజోషణజీరకైః. ౧౫౦
ఆలిప్తం ఘృతహిఙ్గుభ్యాం వ్యాఘారితం రుచ్యమార్ద్రికం,
జమ్బీరామ్లం జపాపుష్పచూర్ణం సంయోజ్య పల్లవైః.
బద్ధం సుగన్ధిస్రుతానాం స్వదతే రక్తమార్ద్రికమ్,

వ్యా. బోడతరమును పిండి నీళ్లయందును, యత్సాకి( ) యను శాకమును కడుగునీళ్లయందును, తిప్పతీగెను టెంకాయచెట్టాకును తారముజేసి యాతారోదకము నందును, వండి నీళ్లువడబోసినచో శుభ్రముగ నుండును. కుమారి(కలుమంద)శాకమును లేత తాటియాకులపై నునిచి పైనలేతతాటాకులచే మూసి వండవలెను. పులుపులేనివ్యంజనపదార్థములు ఏవియైనను ఉసిరికకాయలపులుపును చేర్చి పక్వముచేయనగును. మస్కరాంకురమనుశాకమును విరిగిచెట్టాకుచేనైనను, అరటియాకుచేనైనను, పొన్నగంటియాకుచేనైనను, ముల్లంగియాకుచేనైననుగప్పి వండి యొనిచి పక్వముచేయవలెను. గలిజేరుకూరను శుంఠిచేర్చి పక్వముచేయవలెను. పైజెప్పిన మస్కరపునర్నవశాకములరెంటిని పులుసు కధికముగజేర్చి పక్వముచేయవలెను. నాడీ (గువ్వగుత్తి శాకమును శుంఠినీళ్లయందును గిలగొట్టి శుభ్రముగ కడిగి వండినచో చేదులేకయుండును. తెల్లజిల్లేడుచిగుళ్లనుకూడ పైజెప్పినరీతిగ శుభ్రము చేసి కుండలీ( )శాకముతోగూడజేర్చి పక్వముజేసి ఉప్పును పులుసుమార్చినచో చేదులేక పక్వముగ నుండును. మరియుం మామిడిచిగుళ్లు, అంబాళపు (నల్లమామిడి)చిగుళ్లు, నేరేడుచిగుళ్లు, ఒద్దిచిగుళ్లు, కరకచిగుళ్లు, మారెడుచిగుళ్లు, కొడిసెపాలచిగుళ్లు, తామర చిగుళ్లు కలువచిగుళ్లు, కెదురుకోవులు, (వెణుతురుచిగుళ్లు,) ఓకచెట్టుచిగుళ్లు, వీని సన్నిటిని ఉప్పునీళ్లలో నుంచవలెను. మరియుం మామిడికాయలు, అంబాళపుకాయలు,

నిమ్మకాయలు, చింతకాయలు, ఉసిరికకాయలు, దుండిలపుకాయలు, కలివికాయలు, కలువ దుంపలు, మక్కారాంకురము, అల్లము వీని నన్నిటిని ఉప్పు నూనె ఆవాలు ఈమూటితో కలిపి యూరబెట్టనగును. మరియు నల్లమును చక్కగ కడిగి ముక్కలుగ చీల్చి సత్తుపిండిని ఉప్పును పిప్పళ్లను జీలకరను పొడిచేసి అల్లపుముక్కలకు పూసి నేతిలో నింగువచేర్చి తిరగబోతపెట్టి, నిమ్మపండ్లపులుసును జపాకుసుమచూర్ణమును అందు కలిపి సుగంధ(మంచి వాసనకల) పుష్పములఆకులచే నానెనకట్టి యొకరాత్రి యుంచినయెడల మిక్కిలి రుచిగ నుండును.

ఖాళనము, హారితము, ఆసుతము, అనుసంస్కారభేదములు

మూ. యత్కిఞ్చిద్దామకం పట్వమ్లదధిసర్పిర్విమిశ్రితమ్. ౧౫౨

యామమాత్రోషితం విద్యాత్ ఖాళనం హారితం చ తత్,

మూలం ఫలం వాథ్యుషితం బదరామ్లారనాళయోః. ౧౫౩

జానీయాదాసుతం శాకం తైలసర్షపయుక్తయోః,

వ్యా. దేనినైన నొకపదార్థమును పచ్చిగనే, ఉప్పు నిమ్మపండ్లరసము పెరుగు నెయ్యి వీనియందు కలిపి ఒకజాముకాలము ఊరబెట్టినచో నయ్యది (అట్టిసంస్కారము) ఖాళన మనియు, హారిత మనియు చెప్పబడును. మరియు రేగుకాయలపులుసునందును గంజి యందును నూనె ఆవాలు ఈరెంటిని కలిపి అందు దుంపలనైనను కాయలనైనను ఊర బెట్టిన నయ్యది ఆసుత మనబడును.

మాంసరసవిధానము

మూ. ఏణలావమయూరాదిమాంసం జర్జరితం కృతమ్. ౧౫౪

దగ్ధమాషా స్తథా ముద్గాత్ స్థాప్య నాగరసౌరభమ్,

ఆవాప్యం భర్జితం సామ్యం పచేత్తోయే చతుర్గుణే. ౧౫౫

చతుర్భాగావశిష్టం తత్ ఇష్టేనామ్లే విమిశ్రితమ్,

జీరకార్ద్రికసిన్ధూత్థరసోనమరిచాన్వితమ్. ౧౫౬

పాదావశేషం ధూపాయేత్సర్పిర్మరిచజీరకైః,

ఏష మాంసరసః.........

వ్యా. జింక, లావుకపిట్ట, నెమలి మున్నగుజంతువులమాంసమును చిన్నచిన్నముక్క లుగ జేసి, వేయించిన మినుపబేడల పిండిని, పెసలబేడలపిండిని కలిపి, శుంఠిచే వాసనగల్గునట్లు తిరుగబోతచేసి, వేయించి నాలిగింతల నీళ్లు పోసి స్వల్పమైన యగ్నిజ్వాలచే వండి, నాల్గవ పాలురసము మిగులునప్పుడు తనకిచ్చవచ్చినపులుసురసమును కలిపి, అందు జీలకర అల్లము

ఉప్పు ఉల్లిపాయలు మిరియాలు వీనిని పొడిచేసి కలిపి, మిరియాలను జీలకర్రను నేతితో తిరుగుబోతబెట్టి యుంచునది. ఇది మాంసరస మనబడును. (చాలబలకరమైన యాహారము.)

మత్స్యరసవిధానము

మూ. .........మత్స్యాన్మహతశ్శుభఖణ్డితాన్. ౧౪౭
సకుస్తుమ్బురుపత్రైలాజీరకౌర్ద్రికసైన్ధవైః,
ఫలామ్లార్ద్రికగోధూమైః పక్త్వా తోయే పరిస్రుతమ్. ౧౪౮
వత్సదాడిమవృక్షామ్లమస్తుసైన్ధవసౌరభమ్,
పక్వం మన్థేన మథితం నామ్నా మత్స్యరసస్స్మృతః. ౧౪౯

వ్యా. పెద్దమత్స్యములను ముక్కలుగజేసి, అందు దనియాలు, లవంగపత్రి, ఏలకులు, జీలకర, శుంఠి, సైంధవలవణము, వీనిపొడిని, చింతపండును అల్లమును, గోధుమపిండిని కలిపి, నీళ్లుపోసి వండి వడబోసి అందు వత్సక (     )ము, దానిమ్మపండ్ల రసము, రేగుకాయపులుపు, పెరుగుమీదితేట, సైంధవలవణము, వీనినన్నిటిని కలిపి పక్వముచేసి కవ్వముచే చిలికి యుంచునది. ఇది మత్స్యరస మనబడును.

ఖడ, కాంబిలికములు

మూ. శర్కరాలవణవ్యోషచోచమోచాఫలైస్సమ్మృతమ్,
తక్రం సతిన్త్రిడీకామ్లైః ఖడః కామ్బలికః పునః. ౧౫౦
సాధ్యస్సతిలకల్కైస్తైఃధూపయేత్తౌచహిఙ్గునా,

వ్యా. చక్కెర, ఉప్పు, వ్యోషము (శుంఠి, పిప్పలి, మిరియాలు), ఆకుపత్రి, అరటిపండు వీనినన్నిటిని మజ్జిగతోజేర్చి, అందు చింతపండుపులుసుచేర్చి పక్వముజేసినచో నయ్యది ఖడ మని చెప్పబడును. మరియు పైజెప్పినవానితోగూడ నువ్వులపిండినికూడ చేర్చి పక్వముజేసినచో నదియే కాంబలిక మనబడును. పైజెప్పినరెంటియందును ఇంగువ తిరుగబోతపెట్టవలెను.

బాలము అనునది మొదలగు తక్రభేదము

సైన్ధవోషణపత్రైలాజీరకైస్సహపాచితమ్. ౧౫౧
వ్యాఘ్రాతంఘృతహిఙ్గుభ్యాం తక్రం బాలం విధీయతే,
అమ్లోదంతీక్ష్ణచిఞ్చామ్లశర్కరాభిశ్శ్రుతం జలమ్. ౧౫౨
ఇష్టసౌరభసంభారవాసితాదధిషడ్డుకమ్,

వ్యా. ఉప్పు, పిప్పలి, ఆకుపత్రి, ఏలకికాయలు, జీలకఱ్ఱ అనునీద్రవ్యములజేర్చి కాచబడినమజ్జిగలో నెయ్యి ఇంగువ జేర్చి తిరుగుబోతబెట్టిన నయ్యది బాలతక్ర మన

బడును. మరియు పులిసినమజ్జిగపై తేటనీటిలో ఉప్పును, పులిచింతాకుపులుపును, చక్కెరనుగూర్చి కాచిన మజ్జిగ అమ్లోదక మనబడును. పెరుగునందు తనకిష్టమైనపచ్చకప్పురము మున్నగువాసనద్రవ్యములంగూర్చి పరిమళించునట్లు చేసినచో నయ్యది మద్దుక మనబడును.

సిక్థక, రసాల, శిఖరిణీభేదములు

మూ. గుడదాడిమశుక్తామ్లధనికాసైన్ధవాన్వితా. ౧౬౩
పేశికామాతులుజ్గస్య సిక్థకానామనామతః,
శర్కరార్ద్రకసూక్ష్మైలా పేశీ మరిచ మిశ్రితమ్. ౧౬౪
దధిమస్తురసాలాస్యాత్ ప్రోక్తా శిఖరిణీచసా,

వ్యా. బెల్లము, దానిమ్మపండ్లపులుసు, దనియాలు, ఉప్పు, గంధమాంసి, మాదీఫలములరసము వీనినన్నిటినిగూర్చి పక్వముచేయబడిన మజ్జిగ సిక్థక మనబడును. మరియు చక్కెర, శుంఠి, చిన్నయేలకులు, గంధమాంసి, మిరియాలు వీనినన్నిటిని పెరుగుమీది తేటలోగూర్చి సిద్ధముచేసిన నయ్యది రసాల యనియు, శిఖరిణి యనియు చెప్పబడును.

ప్రకారాంతరముగ రసాలయోగము

మూ. దధ్నః పలాని ద్వాత్రింశత్ త్వగేలార్ధపలం తథా. ౧౬౫
మధ్వాజ్యస్య పలార్ధాంశం కర్షాంశం మరిచస్యచ,
పలాన్యష్టౌచ ఖణ్డస్య శుక్లే వాససిగాలయేత్. ౧౬౬
కర్పూరధూపితేభాణ్డే ఛాయాయాం స్థాపయేదిదమ్,
రసోత్తమారసాలేయం సజీరార్ద్రకసైన్ధవమ్. ౧౬౭
హింగునాధూపితం మస్తు యదుక్తం గన్ధమస్తు తత్,

వ్యా. పెరుగు ముప్పదిరెండుపలములు, లవంగపట్ట ఏలకులు అరపలము, తేనె నెయ్యి అరపలము, మిరియాలు ఒకకర్షము (కాలుపలము), ఖండశర్కర యెనిమిదిపలములు, వీనినన్నిటి నొకటిగగూర్చి శుభ్రముగ తెల్లనైనవస్త్రమున వడగట్టి పచ్చకప్పురముచే పరిమళించుధూపమువేసి యొకభాండమున బోసి నీడలో నుంచవలెను. ఇయ్యది మిక్కిలి యుత్తమమైన రసము కల్గినది. ఇది యొకవిధమైనరసాల యనబడును. పైజెప్పిన మద్దుకమునందు జీలకర, అల్లము, ఉప్పు, ఈమూడిటిని కలిపి ఇంగువ తిరుగబోతబెట్టినచో నయ్యది గంధమస్తు వనబడును.

భుక్తంజరత్క్రము

మూ. వ్యోషజీరకసాముద్రదీవ్యసైన్ధవసర్జిషైః. ౧౬౮

త్రిజాతధాన్యలశునైః దధిమస్తు యుతం స్థితమ్,
ధూపితే వాసితే భాండే నామ్నా భుక్తంజరం స్మృతమ్. ౧౯౯

వ్యా. త్రికటుకములు (శుంఠి, పిప్పలి, మిరియాలు), జీలకర, ఉప్పు, ఓమము, సైంధవలవణము, ఆవాలు, త్రిజాతకము (ఏలకులు, లవంగాలు, దాల్చినిచెక్క), దనియాలు, ఉల్లిపాయలు, వీనినన్నిటిని పెరుగుతేటలో కలిపి, భాండసంస్కారమున జెప్పిన విధముగ పొగవేసి వాసనబట్టియుండుకుండలో బోసియుంచినచో నయ్యది భుక్తంజరమనబడును. (భుజింపబడినయాహారమును జీర్ణింపజేయునది యని భావము.)

కాంజికతక్రము

మూ. ధాన్యకైశ్చూర్ణితైరీషత్ బీజపూరస్య పల్లవైః,
ఏలయా సైంధవేనాపి యుక్తాం పూతం క్షణం స్థితమ్. ౧౭౦
శృఙ్గిబేరరసోపేతం జీరకక్షోదమిశ్రితమ్.
వ్యాఘారితం హిఙ్గునా చైవం నిదాఘే కాఞ్జికా హితమ్. ౧౭౧

వ్యా. దనియాలను పొడిచేసి, మాదీఫలవృక్షములచిగుళ్లు, ఏలకులు, సైంధవలవణము, వీనినన్నిటిని మజ్జిగలో చేర్చి కొంతకాల ముంచి వడగట్టి అందు అల్లపురసమును, జీలకరపొడిని కలిపి పక్వముచేసి యింగువ తిరుగబోతబెట్టిన నయ్యది కాంజిక మనబడును. ఇయ్యది యెండకాలమున మిగుల హితకరము.

మరియొకతక్రభేదము

మూ. పఞ్చకోలగుడజీరకోషణైః దాడిమామలకలుఙ్గవారిభిః,
సైన్ధవార్ద్రసహితైర్విపాచితం తక్రమన్నమపి జారయేద్గురు.

వ్యా. పంచకోలములు, బెల్లము, జీలకర, పిప్పళ్లు వీని చూర్ణమును, దానిమ్మపండ్ల రసమును, నెల్లికాయలరసమును, మాదీఫలములరసమును, సైంధవలవణమును, శుంఠిని వీని నన్నిటిని మజ్జిగలో కలిపి పక్వముచేసినచో నయ్యది మిక్కిలి గురుత్వముజేయుపదార్థముల భుజించినను అట్టి యాహారమునుగూడ జీర్ణింపజేయును.

మూ. ఈషత్తక్రంచ చిఞ్చామ్లం శర్కరైలార్ద్రకం తథా.
తణ్డులామ్బు తథాహిఙ్గుధూపితా వ్యఞ్జనం స్మృతమ్. ౧౭౩
సితామధ్వాదిమధురారాగాస్తత్రాచ్ఛకాస్త్రయః.
తేసామ్లాషాడబాలేహ్యాః పేయాశ్చాంశుకగాలితాః. ౧౭౪
మన్దమధురాకషాయాః అమ్లరసాః స్వల్పకటుతిక్తాః,

యుక్తలవణాశ్చ కార్యాః ఫలయోగాష్షాడబాశ్చిత్రాః. ౧౭౫
గుళికాచిక్కణం చూర్ణం లేహ్యం పేయశ్చ షాడబః,
తిన్త్రిణ్యామాతులుఙ్గస్య మృద్వీకాసహకారయోః. ౧౭౬
దాడిమస్యాప్యతిశయాత్ పఞ్చధా పేయషాడబః,
తఏవ షాడబాః పేయాః రాగాఖ్యా రాగయోజనాత్. ౧౭౭
శస్యతే పానకం సర్వం వితానేన పరిస్రుతమ్,
స్వచ్ఛం దృష్టిప్రియం హృద్యం సుగన్ధ మధురం హిమమ్. ౧౭౮

వ్యా. కొంచెము మజ్జిగ, పులిచింతాకుపులుసు, చక్కెర, ఏలకులు, అల్లము, వీని నన్నిటిని బియ్యము కడిగిననీటిలోఁ జేర్చి పక్వముచేసి ఇంగువ తిరుగబోతపెట్టినచోఁ నయ్యది వ్యంజన మనబడును. పంచదార తేనె మున్నగువానిచే మధురంబై యొకింత పులుపుకల్గి స్వచ్ఛముగ తేటగనుండునది రాగ మనబడును. పైజెప్పినద్రవ్యములతోఁగూడి ఆమ్లరసముగల్గి మిక్కిలి చిన్నదైనది లేహ్యరూపమైన షాడబ మనబడును. గుడ్డలోఁ వడియగట్టబడినది పేయ(త్రాగదగిన) షాడబ మనబడును. మరియు కొంచెముగ మధుర కషాయరసంబులును, అధికమైనయమ్లరసంబును, మిక్కిలి స్వల్పమైనకటుతిక్తరసంబులును యథోచితముగలవణరసంబును, తగినఫలరసంబులును గల్గియుండునట్లు చిత్రరూపములుగ షాడబములను గల్పింపవలెను. మరియు గుళిక, చిక్కణము, చూర్ణము, లేహ్యము, పేయము, నని షాడబము ఐదువిధములు. మరియు పేయ మనుషాడబము చింతపండు పులుపు, మాదీఫలరసము, ద్రాక్షపండ్లరసము, తీయమామిడిరసము, దానిమ్మపండ్లరసము, అను నీద్రవములు ఐదును అధికముగ నుండుటచే నైదువిధములుగ నుండును. మరియు నట్టిషాడబములు పైజెప్పినరాగము అనుదానితోఁ గూర్చినరాగషాడబ మనబడును. మరియు పానకము ఏదియైనను శుభ్రముగ వడగట్టి స్వచ్ఛమై చూచుటకు రమ్యమై మనసుకు ఆహ్లాదజనకమై మంచి పరిమళముగల్గి మధురమై చల్లగా నుండవలెను.

### గుళికా-చూర్ణ షాడబములు

మూ. ఈషత్కషాయలవణం వర్జితం లవణేనవా,
పేషితై ర్మాతులుఙ్గార్జ చమ్పకోత్పలసారభైః. ౧౭౯
ఆర్ద్రైర్దాడిమసిన్ధూత్థ కపిత్థామ్లైర్విచూర్ణితైః,
ఆదధాతే ముఖామోదం గుళికాశ్చూర్ణషాడబాః. ౧౮౦

వ్యా. కొంచెము వగరుకలద్రవ్యములను ఉప్పుచేర్చియైనను చేర్పకయైనను, మాదీఫలరసమును తులసిరసమును సంపంగిరసమును కలిపి మెత్తగ నూరి తేటమజ్జిగలోఁ కలిపి

పరిమళద్రవ్యములచే వాసనగలిగించినచో నయ్యది గుళికాపాడబమని చెప్పనగును. శుంఠి, దానిమ్మపండ్లరసము, సైంధవలవణము, వెలగపులుసు వీనినన్నిటిని భావనచే యెండించి మెత్తగ పొడిచేసి తేటమజ్జిగలో కలిపి పక్వముజేసిన నయ్యది చూర్ణపాడబ మని చెప్ప నగును. ఈరెండువిధములైన పాడబములును ముఖమునకు మంచిపరిమళమును కలిగించును.

చిక్కణపాడబము

మూ. అష్టౌమత్స్యణ్డికాయాస్స్యుః అంశారుచకధాన్యయోః,
ఏకో ద్వౌదీప్యకాజాజ్యోః త్రయశ్శుణ్ఠీవరాళయోః. ౧౮౧
చత్వారోదాడిమామ్లస్య వృక్షామ్లస్య నవైవచ,
సర్వతుల్యం కపిత్థామ్లం క్షుణ్ణం యోజ్యముదశ్వితి. ౧౮౨
గ్రహణ్యరుచ్యతీసారాన్ హరేచ్చిక్కణపాడబః,
కురుతే ముఖవైశద్యం పాచిధత్తేచ సౌష్ఠవమ్. ౧౮౩

వ్యా. చక్కెరపాకము ఎనిమిదిభాగములు, రుచకము, దనియాలును ఒకభాగము, ఓమము జీలకర రెండుభాగములు, శుంఠి లవంగములును మూడుభాగములు, దానిమ్మ పులుసు నాల్గుభాగములు, చింతపండుపులుసు తొమ్మిదిభాగములు వీనికన్నిటికిని సమ భాగము వెలగపులుసు, ఈభాగములప్రకార మన్నింటి నొకటిగగూర్చి చక్కగ నూరి తేటనీరు మజ్జిగలో కలుపునది. ఇది చిక్కణపాడబ మనబడును. ఇయ్యది గ్రహణిరోగ మును, అరోచిరోగమును, అతిసారమును హరించును. నోట జిగురులేక స్ఫుటముగ నుండును. ఆహారమును జీర్ణింపజేయును. శరీరమునకు సౌష్ఠవమును కలిగించును.

లేహ్యరూపమైనపాడబము

మూ. పరిపక్వామలకరసే క్షిప్త్వామత్స్యణ్డికాభాగమ్,
శుక్తోషణమధుతిలజం పృథక్చ మత్స్యణ్డికార్ధాంశమ్. ౧౮౪
మృద్వగ్నినాపరిపచేత్ మధుసౌరభజీరకాన్వితం లీఢమ్,
జయతి వలీపలితానిచ జనయతి చన్ద్రోపమాం కాన్తిమ్. ౧౮౫

వ్యా. చక్కగా పండి పరిపక్వములైన నెల్లికాయలరసమునకు సమభాగముగ చక్కెరపాకమును కలిపి అందు పులిమజ్జిగను చక్కెరపాకమున కర్ధభాగంబును, పిప్పళ్లను, తేనెను, నువ్వులనూనెను కలిపి మృద్వగ్నిజ్వాలయందు పక్వముచేసి అందు తేనెను, పరిమళద్రవ్యములైన పచ్చకప్పురము మున్నగువానిని, జీలకర్రను కలిపి చప్పరించి సేవిం చినచో వలీపలితములు లేక ముదిమిని పోనడచి చంద్రునితో సమానకాంతిని కలిగించును.

లేహ్యరూపమైనషాడబము

మూ. ఏకచతురష్టకుడవైః తైలపురాణామ్లబీజపూరరసైః,
చిఞ్చామ్లసదృశఖణ్డే సువిపక్వే మన్దవహ్నినాసమ్యక్. ౧౮౯
వ్యోషత్రిజాతసైన్ధవజీరకముష్టిం సమావపేత్తస్మిన్,
విన్యస్య ధాన్యరాశౌ పక్షం లిహ్యన్నహాసలో భవతి. ౧౯౦

వ్యా. నువ్వులనూనె ఒకకుడవము, పుల్లనిమజ్జిగ నాల్గుకుడవములు, మాదీఫలముల రసము ఎనిమిదికుడవములు, పులిచింతాకురసమును చక్కెరయు సమభాగములు, వీనినన్నిటి నొకటిగజేర్చి మందాగ్నియందు చక్కగ పక్వముజేసి, అందు త్రికటుకములు (శుంఠి పిప్పలి మిరియాలు), త్రిజాతకము (ఏలకులు లవంగపత్రి దాల్చినిచెక్క), సైంధవ లవణము, జీలకర్ర, వీనినన్నిటిని ముష్టిప్రమాణము అందు చేర్చి మూతవానెనకట్టి చీల చేసి పదునైదుదినములు ధాన్యపుటమున నునిచి, సేవించిన జీర్ణశక్తి వృద్ధియై చక్కగ నాకలిపుట్టును.

ద్రవరూపమైనషాడబము

మూ. తిన్త్రిణీకరమర్ద్దామ్లమాతులుంగేక్షుదాడిమాః,
రసాః గుడకపిత్థార్ధశర్కరాసౌరభాన్వితమ్. ౧౯౧
వాతపిత్తకఫాన్ హన్తి హృద్యోఽయం ద్రవషాడబః. ౧౯౨

వ్యా. చింతపండుపులుసు, కలివి (వాక)కాయలపులుసు, మాదీఫలములరసము, చెరకురసము, దానిమ్మపండ్లరసము, బెల్లము, వెలగకాయలరసము ఇవియన్నియు సమభాగ ములు, అందుకు సగపాలు చక్కెర, వీనినన్నిటిని కలిపి, అందు పరిమళద్రవ్యములగూర్చి పక్వముజేసిన నయ్యది ద్రవషాడబ మనబడును. దీనిని సేవించినచో వాతపిత్తకఫములను హరించును. హృదయమునకు మిక్కిలి హితకరము.

రాగమనుద్రవవిశేషము

మూ. కోలదాడిమవృక్షామ్ల ద్రాక్షాధాన్యామ్లసైన్ధవైః,
సమధువ్యోషకర్పూరైః కృతో రాగో రుచిప్రదః. ౧౯౩

వ్యా. రేగుపండ్లు, దానిమ్మపండ్లరసము, చింతపండు, ద్రాక్షపండ్లరసము, ధాన్యామ్లము, సైంధవలవణము, తేనె, త్రికటుముకలు (శుంఠిపిప్పలిమిరియాలు), పచ్చ కప్పురము వీనినన్నిటినిగూర్చి పక్వము చేయబడినరాగము మిక్కిలి రుచిని కల్గించును.

పండ్లరసమును ద్రవింపజేయువిధము

మూ. జమ్బ్వామ్రఫలానాం స్వరసోగుడసైన్ధవసంగమాత్,

ఆమ్రస్య సారంకతకతిలశేలుకపిత్థజైః. ౧౯౧
చూర్ణైర్వాపటునావాపి గుడనాగరకేనవా,
ఫలం కదళ్యాః కుసుమైః చిఞ్చాయాః మరిచేనచ. ౧౯౨
జమ్బ్వాదుమ్బరకల్కాద్యా శిగ్రుమూలేన పానసమ్,
కపిత్థం చవ్యకల్కాద్యా తాళా తాళాంఘ్రిరేణుభిః. ౧౯౩
కేసరం మాతులుఙ్గస్య తాళపత్రోత్థభస్మనా,
ససైన్ధవేన మృదితం ద్రవేద్విధృతమాతపే. ౧౯౪

వ్యా. నేరేడుపండ్లస్వరసమున బెల్లమును సైంధవలవణమునుజేర్చి యెండలో నుంచిన ద్రవరూపము నొందును. మామిడిపండురసమున చిల్లగింజలను, నువ్వులను, విరిగిచెట్టుపట్టను, వెలగపట్టను వీనిని చూర్ణముచేసి కలిపియైనను, ఉప్పుచు కలిపియైనను, బెల్లమును శొంఠిపొడిని కలిపియైన మర్దించి యెండలోబెట్టిన పలుచగ ద్రవించును. అరటిపండునందు చింతపువ్వులను మిరియాలను చూర్ణముచేసి కలిపి మర్దించి యెండలో నుంచిన ద్రవించును. పనసపండు తొనలరసమున నేరేడుపట్టను అత్తిపట్టను కల్కముచేసి కలిపియైనను, మునగచెట్టువేరును కల్కముచేసి కలిపియైనను మర్దించి యెండలో నుంచిన ద్రవించును. వెలగపండును చవ్యమును కల్కముచేసి కలిపి మర్దించి యెండలో నుంచినను ద్రవించును. తాటిపండును తాటిచెట్టువ్రేళ్లను చూర్ణముచేసి కలిపి మర్దించి యెండలో నుంచిన ద్రవించును. మాదీఫలముల కేసరములతో తాటియాకులబూడెను సైంధవలవణమును కలిపి మర్దించి యెండలో నుంచినచో ద్రవించును.

## నారికేళరసము

మూ. నారికేళామ్బుమత్స్యణ్డీయోగాత్కర్కన్ధుజం ఫలమ్,
చిఞ్చాపుష్పం వికసితం దృషజ్జర్ఝరితాం రసైః. ౧౯౫
బహుశో నారికేళస్య మర్దయిత్వా పరిస్రవేత్.

వ్యా. మరియు రేగుపండు టెంకాయనీళ్లసంయోగముననైనను చక్కెరసంయోగముచేతనైనను రసమును స్రవించును. చక్కగా వికసించిన చింతపువ్వులను రాతిమీద నునిచి ద్రవమునుపోసి నూరి అందు టెంకాయనుచేర్చి నూరినయెడ టెంకాయనుండి రసము స్రవించును.

## పానకము

మూ. మర్దితం శర్కరాతోయైః మాతులుఙ్గస్య కేసరమ్,

శర్కరాక్షీరభిన్నా వా క్షీరా వామ్లేన ఖేదితమ్,
రసేన యేన కేనాపి, తృజ్ఞాగైలావరాళకైః. ౧౯౭
వర్ణార్థమీషద్ఘృష్టేన పక్వం చిఞ్చాఫలేనచ,
కుఙ్కుమేనాథవాఘృష్టం బహుశోవస్త్రగాళితమ్. ౧౯౮
అచ్ఛం కస్తూరి కర్పూరవాసితం పానకం హితమ్,

వ్యా. చక్కెరను నీళ్లలో కలిపి అందు మాదీఫలముల కేసరములను జేర్చి చక్కగ మర్దించునది. లేక చక్కెరను పాలలోనైనను పులుపుగలనిమ్మపండ్లరసము మున్నగువానిచే విరిచి రూపాన్తరమునొందించి తేటయైన నీటితోనైనను కలిపి ద్రవముగజేసి అందు మాదీఫలముల కేసరములను కలిపి చక్కగ పిసికి మర్దించునది. అందు లవంగపుపట్ట, నాగకేసరములు, ఏలకులు, లవంగములు వీనిని పొడిచేసి కలుపునది. పిదప వర్ణముకల్గుటకుగాను చింతపండురసమును, కుంకుమపువ్వును కొంచెము నూరి కలిపి, అనేకపర్యాయములు వస్త్రమున వడగట్టి, పిమ్మట కస్తూరిని పచ్చకప్పురమును అందు కలిపి వాసనగలిగించిన నయ్యది పానక మనబడును. ఇయ్యది మిక్కిలి హితకరమైనది.

తాపహారపానకము

మూ. మర్దితం గుడతోయేన పక్వచిఞ్చాఫలం స్మృతమ్. ౧౯౯
స చతుర్జాతకర్పూరం ధూపితం శ్రాన్తితాపజిత్,

వ్యా. బెల్లమును పానకము కలిపి చక్కగ పండినచింతపండును మర్దించి కలిపి, అందు చతుర్జాతమును (లవంగపట్ట, ఏలకులు, లవంగాలు, నాగకేసరములు), పచ్చకప్పురమును జేర్చి ధూపమువేసియుంచునది. దీనిని త్రాగినచో బడలికయు తాపంబును శమించును.

అరుచిహరలేహ్యము

మూ. స్విన్నం నిరస్తబదరం గాళితం సగుడోషణమ్. ౨౦౦
ధూపితం వాసితం చాపి లిహ్యాదరుచనుత్తయే,

వ్యా. రేగుపండ్లను ఉదకముపోసి యుడకబెట్టి రసముపిండి తొక్కుతీసి యారసమున బెల్లమును పిప్పళ్లనుజేర్చి వడగట్టి సుగంధద్రవ్యములచే ధూపమువేసి వాసనకలిగించి లేహపక్వముజేసి సేవించినచో నరోచకము పోవును.

సన్తర్పణము

మూ. ద్రాక్షాదాడిమఖర్జూరమృదితామ్బుసశర్కరమ్. ౨౦౧
సలాజచూర్ణమథ్వాజ్యం సన్తర్పణముదాహృతమ్,

వ్యా. ద్రాక్షపండు, దానిమ్మవిత్తులు, ఖర్జూరపుపండు, వీనినన్నిటిని నీళ్లలో కలిపి మర్దించి ఆరసమున చక్కెరను, పేలాలపిండిని, తేనెను, నేతిని కలిపి సేవించినచో నయ్యది సంతర్పణమగు. (ఇంద్రియాదుల నాప్యాయత నొందించి శ్రమమును పోగొట్టునని భావము.)

పంచసారపానకము

మూ. ద్రాక్షామధూకఖర్జూరకాశ్మర్యైస్సపరూషకైః. ౨౦౨
తుల్యాంశైః కల్పితం పూతం శీతం కర్పూరవాసితమ్,
పానకం పఞ్చసారాఖ్యం దాహతృష్ణానివర్తకమ్. ౨౦౩

వ్యా. ద్రాక్షపండు, ఇప్పపువ్వులు, ఖర్జూరపుపండు, గుమ్మడు, ఈతపండ్లు వీనిని సమభాగములుగగూర్చి యుదకములో వైచి, యొకింతసేపు నానబెట్టి చక్కగ మర్దనము చేసి వడగట్టి, అందు పచ్చకప్పురమును వాసనకై చేర్చి వాసెనగట్టి చల్లబడున ట్లుంచిన నయ్యది పంచసారపానక మనబడును. ఇయ్యది తాపమును దప్పిని నివర్తింపజేయును.

మరియు ఘృతము, పిప్పలి, పచ్చకర్పూరము, తేనె, చక్కెర, ఈయైదిటిని జేర్చి సిద్ధముచేయబడినపాలు పంచసారపానక మని కొందరు చెప్పెదరు. పైజెప్పినపానకములను క్రొత్తదియగు మట్టిముత్తలోబోసి కలిగొట్టుపువ్వులను పచ్చకర్పూరమును జేర్చి వాసెనగట్టి యుంచిన చల్లగ నుండును.

ఉదమన్థము

మూ. సక్తవస్సర్పిషాయుక్తాః శీతవారిప్లుతాః...,
నాత్యచ్ఛాఃఉదమన్థాస్స్యుః మన్థాః ఫలరసైః స్మృతాః. ౨౦౪

వ్యా. సత్తుపిండియందు నెయ్యి కలిపి చల్లనినీళ్లలో కలియబెట్టి మిక్కిలి తేటగాక కొంచెము చిక్కగ నుండునది ఉదమంథ మనబడును. అట్టి సత్తుపిండిలో పండ్లరసమును కలిపినచో నయ్యది కేవలము మంథ మనబడును.

శాండాకి

మూ. మూలసర్షపశాకాద్యైః శాణ్డాకీవటకక్రియా.

వ్యా. ముల్లంగిగడ్డలు ఆవకూర మున్నగువానినిగూర్చి చేయబడినవడియములు శాండాకి యనబడును.

క్షీరపాకోదమంథము

మూ. నారికేళపరిక్షోదాత్ క్షీరముష్ణామ్బుమర్దితాత్. ౨౦౫
క్షీరం కపిత్థపేశీచ పక్వం స్పృష్యం సశర్కరమ్,

క్షీరపాకోదమన్థోఽయం క్షిప్త్వాక్షీరావశేషితమ్. ౨౦౬

వ్యా. టెంకాయలో వేడినీళ్లుపోసి మెత్తగ నూరి పిడిచినచో టెంకాయపాలు వచ్చును. వెలగపండులో నీళ్లుపోసి మర్దించి యారసమును పైజెప్పిన టెంకాయపాలతో కలిపి శర్కరనుకూర్చి అందు పాలుపోసి పాలుమాత్రము మిగులునట్లు క్షీరపాకవిధిగ కాచిన నయ్యది క్షీరపాకోదమన్థమని చెప్పబడును.

క్షీరపాకభేదములు

మూ. కాన్తపాత్రే స్థితం క్షీరం తద్రసాయనముత్తమమ్,
తచ్చార్ధశేషం పేయం స్యాత్ లేహ్యాం త్ర్యంశావశేషితమ్.
పాదావశిష్టం పిణ్డం స్యాత్ శర్కరాష్టాంశశేషితమ్,

వ్యా. పైజెప్పినప్రకారము పక్వముచేయబడినక్షీరమును కాంతలోహముచే చేయబడినపాత్రములో నుంచిన నయ్యది మిక్కిలి రసాయముగ నుండును (జరావ్యాధిహరమని భావము). అట్టిపాలు సగము ఇగురునట్లు కాచిన నయ్యది పేయ మనబడును. మూడవపాలు మిగులునట్లు కాచిన నయ్యది లేహ్యము (నాలుకతో నాకదగినది) అనబడును. నాల్గవపాలు మిగులునట్లుకాచినచో నయ్యది పిండము (ముద్ద) అనబడును. ఎనిమిదవభాగము మిగులునట్లుకాచిన నయ్యది చక్కెర యగును.

పెరుగును పేరబెట్టువిధము

మూ. అర్ధస్థమీషత్తక్రం తత్ మాతులుఙ్గఫలే(రసే)నవా. ౨౦౭
శీతయావాధృతం కుమ్భే నూతనే రాగయుక్తయే,
చిత్రకాజ్ఝీత్వచాయుక్తే ప్రణీథాయాధమజ్జభిః. ౨౦౮
కపిత్థస్య సుపక్వస్య షడ్భిర్యామైర్భవేద్యది,
పథ్యం చోర్ధ్వం తతః కాలాత్ అత్యమ్లం స్యాదధస్తతః. ౨౧౦
దధ్యవస్థామసంప్రాప్య దుగ్ధావస్థామతత్యయత్,
అన్తరావర్తివిజ్ఞేయం మన్దకం తద్విషోపమమ్. ౨౧౧

వ్యా. పాలను సగభాగము మిగులునట్లు కాచి చల్లనైనపిదప మజ్జిగనైనను లేక మాదీఫలరసమునైన కొంచెముగ నాపాలలో తోడుబెట్టి, క్రొత్తకుండలోభాగమున చిత్రమూలము వేరుపట్టును మెత్తగనూరి పూసి యెండబెట్టి యాకుండలో పైజెప్పినపాలను బోసి, అందు చక్కగ పండిన వెలగపండును కలిపి పదిలముగ మూసి యారుజాములకాలముంచిన నయ్యది చక్కగ పేరి పెరుగుగ నగును. ఆరుజాములకన్న నధికకాలముంచినచో మిక్కిలి పులియును. కావున ఆరుజాములకాలమువర కుంచబడిన పెరుగు మిక్కిలి

పత్థ్యకరముగ నుండును. ఆరుజాములకు ముందు పెరుగురూపమునొందక పాలరూపమును మారి మధ్యమావస్థ నుండునది మన్దక మనబడును. అయ్యది విషతుల్యమై యపత్థ్యముగ నుండును.

### తక్రభేదములు, వానిగుణము

మూ. మన్థేన మథితాద్దధ్నో నవనీతం తతో హరేత్,
మజ్జికామథితం చేలాశీతం కర్పూరధూపితమ్. ౨౧౨
విశ్వైకైడర్యసిన్ధూత్థైః ఆసుతం తక్రమగ్నికృత్,
ధూపితం హిఙ్గుజీరాభ్యాం ఆర్ద్రికర్షోదమిశ్రితమ్. ౨౧౩
ఏలాసైన్ధవచూర్ణాఢ్యం రోచనం దీపనంచ తత్,

వ్యా. పైజెప్పినవిధముగ పేరబెట్టినపెరుగును కవ్వముతో (నీళ్లు కలపక) చిలికి వెన్నతెత్తునది. ఇయ్యది 'మజ్జిక, మథితము'నని చెప్పబడును. దీనిని వస్త్రగళితముచేసి చల్లగ నుండునటులుంచి పచ్చకప్పురముచే వాసనగల్గించి అందు శుంఠిని, కాయఫలమును, సైంధవలవణమును పొడిచేసి కలిపి పులియబెట్టిన నయ్యది జాఠరాగ్నిని వృద్ధినొందించును. మరియు పైజెప్పినవిధముగ చిలుకబడినమజ్జిగలో అల్లమును నూరి కలిపి, ఇంగువ, జీలకర ఈరెంటిని తిరుగబోతబెట్టి ఏలకులను సైంధవలవణమును పొడిచేసి కలిపిన నట్టిమజ్జిగ రుచిని బుట్టించును. అగ్నిని దీపింపజేయును.

### వెన్నకాచి నేయిచేయువిధము

మూ. నవనీతం నవంధౌతం సుపక్వం మృదునాగ్నినా. ౨౧౪
పల్లవైః కాసమర్దస్య తాంబూలీ శతపుష్పయోః,
గోధూమబీజైరథవా ప్రత్యగ్రం జాయతే ఘృతమ్. ౨౧౫
ఘనవస్త్రపరిస్రావైః క్షుద్రజన్త్వాభిరక్షణమ్,

వ్యా. పైజెప్పినవిధముగ పెరుగును చిలికి వెలిదీయబడినవెన్నను శుభ్రమైన నీళ్లతో నిర్మలముగ కడిగి సూక్ష్మమైన యగ్నిజ్వాలచే కాచి అందు కవెందాకుచిగుళ్లను, లేతతమలపాకులను, సదాపచిగుళ్లను వేసి చక్కగ కాచవలెను. లేక గోధుమగింజలనైన వేసి కాచవలెను. అటు కాచినచో నెయ్యి యగును. అట్టి నేతిని దట్టముగ నుండు గుడ్డపై వడగట్టి చిన్నసన్నపురుగులు అందు చేరనీయక పదిలముగ నుంచి కాపాడవలెను.

### నీటిని శుభ్రపరచువిధము

మూ. వ్యాపన్నస్యామ్భసః కుర్యాత్ అగ్న్యర్కాయసపిణ్డకైః. ౨౧౬
ఖదిరాఙ్గారదగ్ధేన తపనం కర్పరేణవా,

పర్ణిమూలబిసగ్రన్థిముక్తాకతకశైవలైః. ౨౧౭
వస్త్రగోమేళనాఢ్యం వా కారయేత్తత్ప్రసాదనమ్,
ప్రవాతే స్థాపయేదమ్బునిక్షేపేత్తత్రవాలుకాః. ౨౧౮
యష్టిభిర్భ్రామయేచ్ఛీఘ్రం వ్యజనైర్వీజయేన్మృదు,
వస్త్రేణాభ్యుద్ధరేదప్సునిక్షిపేదపలమ్బయేత్. ౨౧౯
శిక్యాయాంచేతిసలిలం జాయతే లఘుశీతలమ్,

వ్యా. త్రాగవలసిననీళ్లు చెడుగాలి మున్నగుకారణములచే చెడియుండెనేని అట్టి నీళ్లను నిప్పుతో కాచి యెండలో బెట్టి పిదప ఇనుపముద్దను నిప్పున కాల్చి నీళ్లలో ముంచవలెను. లేక మట్టిమూకుడును చంద్రకాయ్యనిప్పులో నెఱ్ఱగ కాల్చి యానీటిలో నుంచవలెను. పిదప పర్ణిమూలము (గ్రంథికవిశేషము), తామరదుంపలు, ముత్యములు, చిల్లగింజ, పాచితీగెలు అనునీద్రవ్యములనుంచి, గుడ్డచేత వడగట్టి యానీటిని శుభ్రముగ జేయనగును. పిమ్మట నాతేటనీటిని మట్టికుండలో బోసి నిరాటంకముగ గాలివీచుప్రదేశమున యిసుకపోసి దానిపై నీటికుండ నునిచి కఱ్ఱలతో నీళ్లను బిరబిరత్రిప్పుచు వీవనలచే మెల మెల్లగ వీవనగును. ఆనీళ్లను గుడ్డచే పలుమారు పైకెత్తి విడువవలెను. పిదప కొంతసేపు నీటికుండను నీళ్లలో నుంచవలెను. పిమ్మట ఉట్టియందుంచి వ్రేలాడగట్టవలెను. ఇట్టి సంస్కారమును జేసినచో జలము నిర్దుష్టమై శుభ్రమగును. మిక్కిలి తేలికమై చల్లగ నుండును.

## ఉదకమును పరిమళింపజేయుసంస్కారము

మూ. చన్దనవాలకకుష్ఠైః క్రముకవృద్ధైః పారిభావ్యత్రుటిసైవైః. ౨౨౦
త్రిభిరుత్తరైశ్చవిహితైః సలిలానితుసురభయన్త్యభయే,
కుష్ఠకేసరపత్రైలా చూర్ణకేతకవాసితమ్. ౨౨౧
దివ్యగన్ధం భవేద్వారిమోహితాళికదమ్బకమ్,
పుష్పాణి జాతిపున్నాగవాసన్తి వకుళాదయః. ౨౨౨
మఞ్జర్యశ్చామ్రఖర్జూరపుష్పాణి జలవాసనే.

వ్యా. శ్రీగన్ధము, కురువేరు, చంగల్వకోష్టు, పారిభావ్యము (          ) ఏలకికాయలు, పట్టివేళ్లు ఇందులో మూడేసి యొక్కొకసుగంధగణము వీనిని యొకదానికన్న నొకదానిని రెట్టింత లుండునట్లుగూర్చి నీళ్లలో నుంచినచో నీరెండుగణములును నీటిని పరిమళింపజేయును. మరియు చంగల్వకోష్టు, నాగకేసరములు, ఆకపత్రి, ఏలకి

కాయలు వీనిచూర్ణముచేతను, మొగలిపువ్వులచేతను పరిమళింపజేయబడిన జలము తుమ్మెదలనుకూడ భ్రమింపజేయదగిన దివ్యపరిమళము కల్గియుండును. మరియు జాజిపువ్వులు, పొన్నపువ్వులు, పాదిరిపువ్వులు, పొగడపువ్వులు మున్నగుసుగంధకుసుమంబులును, మామిడిపూగొత్తులును, ఖర్జూరపుపూగొత్తులును, వానిపువ్వులును జలమునకు పరిమళమును కల్గించును. కావున అట్టిసుగంధద్రవ్యములచేతను, సుగంధకుసుమములచేతను జలమునకు వాసనగల్గించి త్రాగుట కుపయోగింపదగు నని భావము.

## జలపానము సేయువిధము

మూ॥ శ్లక్ష్ణైః ప్రవాళరుచిరైః వరమృత్ప్రణీతైః
లోష్టాశ్మఘృష్టజలధౌతఖరాంశుతప్తైః
సక్షౌద్రతైలగుడకేసరపుష్కరైలా
లాతూతమాలతగరాగరుదత్తధూపైః. ౨౨౩
విన్యస్తగన్ధకుసుమైః కరకైర్మనోజ్ఞైః
నాళైః కషాయవిశదైరపిచర్మపాత్రైః
వస్త్రావకుణ్ఠనయుతైః భృశమమ్బుశీతం
సేవేత హేమచషకేనబిసేనశుక్త్యా. ౨౨౪
ఏవం కల్పితమాహారం భోక్తుకామః పిబేజ్జలమ్,
ససైన్ధవం శృతం దివ్యాపరాళవ్యోషచిత్రకైః. ౨౨౫

వ్యా॥ నున్ననై పవడములవలె రమ్యములైయుండునట్లు మంచిమట్టితో జేయబడిన గిరిగెముంతల (ఒకప్రక్కనీళ్లుబైటవెడలించుటకు దగునట్లు రంధ్రముగల మట్టిపాత్రల)ను మట్టిపెళ్లలను సన్ననిరాళ్లను నీళ్లనుబోసి చక్కగ తోమి నీళ్లతో శుభ్రముగ కడిగి యెండ సెండించి, తేనె నూనె బెల్లము నాగకేసరములు పుష్కరమూలము ఏలకులు లక్కకానుగ ఆకుగ్రంథితగరము అగరు అను నీద్రవ్యములగూర్చి పొగబట్టి, అందు పరిమళించుపుష్పములను వైచి సంస్కారముచేయబడిన యాగిరిగెముంతలయందైనను, తామరకాడలు మున్నగుపగరువస్తువులచే సంస్కరింపబడిన చర్మపాత్రములయందైనను, పైజెప్పినరీతిగ సంస్కరింపబడిన జలము నునిచి, దానిపైని వస్త్రముచే మూసి, మిక్కిలి చల్లనైన యాజలమును బంగరుపాత్రముచే త్రాగవలెను. లేక గిరిగెకుండురంధ్రమున తామరకాడనైనను గొట్టమునైనను బెట్టి నోటిచే నీళ్లను పీల్చి త్రాగనగును. లేక ముత్తెపుచిప్పలచే నానీటిని గ్రహించి త్రాగవలెను. ఇత్తెఱంగున సంస్కారవిశేషములచే గల్పింపబడినశుద్ధజలమును భోజనసమయమునందు లవంగపుమొగ్గలును త్రికటుకములును చిత్రమూలమును కొంచెము సైంధవమును గూర్చి కాచబడినజలమును త్రాగవలెను.

భోజనయోగ్యకాలము

మూ. విసృష్టే విణ్మూత్రే హృదిసువిమలే దోషే స్వపథగే
విశుద్ధే చోద్గారే క్షుదుపగమనే వాతేఽనుసరతి,
అథాగ్నావుద్రిక్తే విశదకరణే దేహేచ సులఘౌ
ప్రయుఞ్జీతాహారం విధినియమితం కాలస్సహిమతః. ౨౨౬

వ్యా. మలమూత్రముల విసర్జించి, హృదయము నిర్మలమైవాతాదిదోషములు తమతమనెలవుల దప్పకుండగ, ఆమరససంబంధము లేక త్రేపులు శుద్ధముగ వెడలుచుండ, ఆకలి కల్గియుండగ, వాతమనులోమముగ సంచరించుచుండగ, జఠరాగ్ని ప్రజ్వలించి యాహారమును జీర్ణింపజేయ సమర్థముగ నుండగ చక్షురాదీన్ద్రియములు వానివాని వ్యాపారములయందు సమర్థములై నిర్మలములుగ నుండగ. శరీరము మిక్కిలి చుల్కనగా నుండగ, నాహారము నుపయోగింపవలెను. అట్టి యాహారము శాస్త్రోక్తపద్ధతి ననుసరించి యుండవలెను. పైజెప్పినలక్షణములు గల్గియుండుసమయము ఆహారమును భుజించుటకు దగినది.

భోజననియమము

మూ. కాలే సాత్మ్యంశుచిహితం స్నిగ్ధోష్ణం లఘు తన్మనాః,
షడ్రసం మధురప్రాయం నాతిద్రుతవిలమ్బితమ్. ౨౨౭
స్నాతః క్షుద్వాన్ వివిక్తస్థో ధౌతపాదకరాననః,
తర్పయిత్వా పితౄన్ దేవాన్ అతిథీన్ బాలకాన్ గురూన్.
ప్రత్యవేక్ష్య తిరశ్చోఽపి ప్రతిపన్నపరిగ్రహాన్,
సమీక్ష్య సమ్యగాత్మానం అనిన్దన్నబ్రువన్ ద్రవమ్. ౨౨౮
ఇష్టమిష్టైస్సహాశ్నీయాత్ శుచిభక్తజనాహృతమ్,

వ్యా. మనుజుడు విధ్యుక్తప్రకారము స్నానముచేసి, మిక్కిలి యాకలికల్గి భోజనమునం దిష్టముపొడమియుండగ, కాళ్లుచేతులుకడిగికొని యేకాంతస్థలమున గూర్చుండి, ఆహారపదార్థముల నిందసేయక, మాటలాడక, పితృదేవతలను దేవతలను అతిథులను శిశువులను ఆచార్యులను అన్నాదులచే దృప్తినందించి, తాను పెంచుచుండుపక్షులు గుఱ్ఱములు పశువులు మొదలగుతిర్యగ్జంతువులకును తగునాహారం బిడి, వానిసౌఖ్యం బారసి తనమనసు కింపైనదియు, ద్రవప్రాయంబును, పరిశుద్ధులై తనయందు ప్రీతిగలవారిచే దేబడినదియు, తనకు హితకరంబును, పరిశుద్ధంబును, తృణకేశాదులచే దుష్టము కానిదియు, సుఖోష్ణంబును, లఘువును, మధురాదిషడ్రసములతోగూడినదియు, అందును

ముఖ్యముగ మధురరసప్రధానంబును నగు నాహారమును, తనశరీరమున కానుకూల్యము నాలోచించి, తనకిష్టులగువారింగూడి పైజెప్పినవిధియుక్తాహారకాలమున భుజింపవలెను. మరియు నతివిళంబముగనైనను అతిశీఘ్రముగనైనను భుజింపక, యథాసావకాశముగ నట్టియాహారపదార్థములయందు మనసు నిలిపి భుజించవలెను.

భుజింపదగనియాహారము

మూ. భోజనం తృణకేశాదిజుష్టముష్ణీకృతం పునః. ౨౩౦
శాకావరాన్నభూయిష్ఠం అత్యుష్ణలవణం త్యజేత్,

వ్యా. గడ్డిపోచలు వెండ్రుకలు ఈగెలు మున్నగుజంతువులు మున్నగువానితో గూడినదియు, పక్వముచేసి చల్లారినపిదప మరల నగ్నిసంబంధముచే వేడిగజేయబడినదియు, మిక్కిలి తక్కువగ జేర్చబడినకూరలు వ్యంజనములు కల్గినదియు, లేక శాకాదుల మిక్కిలి యధికముగ గూర్చినదియు, మిక్కిలి యుష్ణంబును మితిమీరినలవణము కల్గినదియునగు భోజనము హితముకాదు. కావున పైజెప్పినయాహారమును భుజింపందగదు.

కిలాటాదిశీలననిషేధము

మూ. కిలాటదధికూర్చికాక్షారశుక్తామమూలకమ్. ౨౩౧
కృశశుష్కవరాహావిగోమత్స్యమహిషామిషమ్,
మాషనిష్పావశాలూకబిసపిష్టవిరూఢకమ్. ౨౩౨
శుష్కశాకాని యవకాన్ ఫాణితంచ నశీలయేత్,

వ్యా. కిలాటము, పెరుగు, కూర్చిక (జున్ను), క్షారము, శుక్తము, పచ్చిముల్లంగి, కృశించినజంతువులమాంసము, ఎండినమాంసము, పంది గొఱ్ఱె ఆవు చేపలు దున్నపోతుఅను నీజంతువులమాంసంబులు, మినుములు, అనుములు, తామరదుంపలు, తామరకాడలు, పిండితోజేయబడినపదార్థములు, ఎండినశాకములు, యవశాకము, ఫాణితము (చక్కెర పాకము) అను నీపదార్థములను విశేషముగ ప్రతిదినంబును అలవాటుగ భుజింపందగదు.

ఇచ్చట "శీలయేత్" అనుపదమునకు ప్రతిదినము అలవాటుచేయుట యని యర్థము కావున పైజెప్పినపదార్థములను ప్రతిదినంబును నిరంతరముగ నుపయోగింపం జనదు గాని అప్పుడప్పుడును ఒకానొకసమయమున నుపయోగించుట నిషిద్ధముకాదని భావము.

స్వస్థతయందు సేవింపదగినపదార్థములు

మూ. శీలయేచ్ఛాలిగోధూమయవషష్టికజాఙ్గలమ్. ౨౩౩
పథ్యామలకమృద్వీకాపటోలీ ముద్గశర్కరాః,

ఘృతం దివ్యోదకం క్షీరం క్షౌద్రం దాడిమసైంధవమ్
స్వాస్థ్యానువృత్తికృద్యచ్చ రోగోచ్ఛేదకరం చ యత్,

వ్యా. రాజనంపుధాన్యము, గోధుమలు. యవలు, ఆరువదినాళ్లసంబావులు, జాంగలమాంసము, కరకకాయలు, ఉసిరికకాయలు, ద్రాక్షపండు, పొట్లకాయలు, పెసలు, పంచదార, నెయ్యి, పాలు. క్షౌద్రము (చిట్టీగెలచే గూర్చబడినకపిలవర్ణముగల తేనె), దివ్యోదకము (వర్షధారలనుండి క్రిందపడక మునుపు నడమనే గ్రహింపబడిన జలము) దానిమ్మపండ్లు, సైంధవలవణము వీనిని ప్రతిదినంబును విడువక యుపయోగింప నగును. మరియు శరీరస్వస్థతను కాపాడునట్టి (ఆయాఋతువుల కనుగుణముగ నియమింప బడిన) పదార్థములను, అన్నపానాదులను రోగహరములగు నేలవేము మున్నగుద్రవ్య ములను విశేషముగ నుపయోగించవలెను.

మరియు "త్రిఫలాం మధుసర్పిర్భ్యాం నిశినేత్రబలాయచ" అను వాగ్భట వచనప్రకారము నేత్రములకు బలముకల్గుటకై త్రిఫలచూర్ణమును నేతిలోను తేనెలోను కలిపి ప్రతిదినము రాత్రులయం దుపయోగించవలెనని తెలిసెడి.

### క్షీరాదిపానయోగ్యపాత్రలు

మూ. అథ శుష్కప్రదిగ్ధాని పయశ్చోష్ణం హిరణ్మయే. ౨౩౫
వేయం మాంసరసం యూషాః వ్యఞ్జనానిచ రాజతే,
ఖడకాంబ్బలికాః కాంస్యపాత్రే పర్పటకానిచ. ౨౩౬
వజ్రవైడూర్యపాత్రేషు రాగషాడబటుండుకాః,
ఘృతం కాలాయసే దత్వా తామ్రపాత్రే హిమం పయః. ౨౩౭
పానీయం పానకం మద్యం మృణ్మయే కాఞ్చనేఽపివా,
కారస్ఫటికపాత్రేషు భక్ష్యాః పర్ణపుటేషు తు. ౨౩౮
దీపనం విమలస్థాల్యాం సువిస్తీర్ణే మనోరమే,
భక్ష్యాం స్తు దక్షిణే పార్శ్వే ముఖోద్ఘర్షేణ పిణ్డికాః
లేహ్యాపేయాదికం చాన్యత్ తన్మధ్యే వినివేశ్యచ,

వ్యా. శుష్కపదార్థములను, చిక్కగనుండుద్రవపదార్థములను, వేడిపాలను బంగరుపాత్రలలో నుంచి సేవింపనగును. మాంసరసమును, యూషములను, వ్యంజన ములను వెండిపాత్రలతో త్రాగవలెను. ఖడయూషములను, కాంబలికములను, పర్ప టకము (అప్పడము)లను కంచుపాత్రలలో సేవింపనగును. రాగములు, షాడబములు,

టుండుకములు, అనుపానకములను వజ్రవైడూర్యపాత్రలతో సేవింపనగును. నేతిని ఇనుప పాత్రలలోను, చల్లనినీటిని తామ్రపాత్రలలోను ఉంచి యుపయోగింపనగును. పానకమును మద్యమును మట్టిపాత్రయందైనను బంగరుపాత్రయందైన నునిచి త్రాగవలెను. భక్ష్యములను నిత్తడిపాత్రలయందైనను, స్ఫటికపాత్రలయందైన నునిచి ఆకుదొప్పల యందైన నునిచి యుపయోగింపనగును. అగ్నిని దీపింపజేయుపదార్థములను విమలమను లోహముయొక్క విశాలరమ్యపాత్రలయం దుంచవలెను. మరియు భక్ష్యములను దక్షిణ పార్శ్వమున నోటనుంచుకొని నమలి తినవలెను. ముద్దగనుండుపదార్థములను నోటితో జుర్రి తినవలెను. లేహ్యములను పేయములను నోటిమధ్యమున నుంచుకొని భుజింపనగును.

బిసాదిపదార్థములభుజించుక్రమము

మూ. బిసేక్షుమోచచోచామ్రమోదకోత్కారికాదికమ్. ౨౮౦
అద్యాద్ద్రవ్యం గురుస్నిగ్ధం స్వాదుమన్దం స్థిరం పురః,
విపరీతమతశ్చాన్తే మధ్యేఽమ్లలవణోత్కటమ్. ౨౮౧

వ్యా. గురుత్వంబును స్నిగ్ధత్వంబును మాధుర్యంబును స్థిరత్వంబును మాన్ద్యమును కల్గిన తామరకాడలు, చెరకు, అరటి, మామిడి, కుడుములు, ఉండ్రాళ్లు మున్నగుపదార్థములను భోజనసమయమున తొలుదొలుత భుజింపవలెను. పైజెప్పినగుణములకు విరుద్ధములైనలఘుత్వము, రూక్షగుణము, తీక్ష్ణగుణము, కటురసము సరగుణమును కల్గినపదార్థములను భోజనాంతమున భుజింపనగును.

మరియు పులుపును ఉప్పును ప్రధానముగ కలపదార్థములను భోజనమధ్యమున భుజింపవలెను. "కటుం లవణమమ్లం వా పూర్వమాహారమాహరేత్, ఆహారో మధురో హ్యగ్రే గురువిష్టభ్యజీర్యతి" అని ఖరనాదవచన మున్నది. కారముగగాని ఉప్పుగగాని లేక పుల్లగగాని యుండుపదార్థములను తొలుత భుజించవలెను. అటుగాక మధురాహారమును గురుపదార్థములను తొలుత భుజించినచో నవి స్రోతస్సులను బంధించి విదాహావస్థనొంది పిదప జీర్ణించును అని యర్థము. ఈవాక్యమునకును పైజెప్పినమూలవాక్యమున జెప్పినపద్ధతికిని పరస్పరము విరుద్ధముగ నున్నది. ఇట్టిభేదములు దేశభేదము, దేహతత్త్వభేదము మున్నగువాని ననుసరించి యేర్పడినట్లు తోచెడి. ముఖ్యముగ ఖరనాదనియమమే యుక్తమును లోకమునం దలవాటును నైయున్న దని తోచెడి.

కొన్నిభోజననియమములు

మూ. నపర్యుషితమన్యత్ర మాంసాద్భక్ష్యోపదంశతః,
నాశేషం సర్పిషః క్షీరదధిమధ్వమ్బుశక్తతః. ౨౮౨

భోజనాదిషు మధ్యేషు నిత్యమామలకం హితమ్,

వ్యా॥ పర్యుషితమైన (ఒక అహోరాత్రకాలమునకు అధికముగ నుంచబడిన) యాహారపదార్థమును భుజింపరాదు. (పక్వముచేయబడినయన్నమును వ్యంజనాదులను ఒక దినమునకంటె నధికకాల ముంచిన నయ్యది పర్యుషిత మనబడును. అట్టిపర్యుషితమును భుజింప దగ దని యర్థము). మాంసము, భక్ష్యములు, ఉపదంశములు (ఊరగాయలు మున్నగునవి) ఇవిమాత్రము పర్యుషితములైనను భోజనమున కర్హములు. మరియు నెయ్యి, పాలు, పెరుగు, తేనె, నీళ్లు, శుక్తము, ఇవిదక్క తక్కినభోజనపదార్థములను నిశ్శేషముగ భుజింపదగదు. (నెయ్యి మున్నగువానినిమాత్రము భోజనపాత్రములో నుంచుకొన్నదానిని మిగులనీయక నిశ్శేషముగ భుజించవలె నని భావము. మరియు భోజనప్రారంభమునను భోజనమధ్యమునను ఉశిరికకాయలతో జేయబడినపచ్చడి మున్నగువానిని ఉపయోగింప నగును. ఉసిరికకాయలనుమాత్రము ప్రతిదినంబు నుపయోగింపదగును.

ఆహారపరిమాణము

మూ॥ గురూణా మర్ధసౌహిత్యం లఘూనాం నాతితృప్తతా,
అన్నేన కుక్షేర్ద్వావంశౌ పానే నైకం ప్రపూరయేత్. ౨౪౩
ఆశ్రయంపవనాదీనాం చతుర్థమవశేషయేత్,

వ్యా॥ గురుపదార్థములకు అర్ధతృప్తికలుగునంత భుజించుట తగినపరిమాణము. లఘువుగ నుండుపదార్థములకు కొంచెము తక్కువగ తృప్తికల్గునట్లు భుజించుట తగిన పరిమాణము. మరియు భుజించునపుడు ఉదరముయొక్క రెండుభాగములను ఆహారపదార్థములగు నన్నాదులచేతను, ఒకభాగము నుదకముచేతను నిండింపవలెను. కుక్షిలో నాలవభాగమును వాతాదులు సంచరించునిమిత్తము కాలిగా నుంచవలెను. ఇదియే ఆహారపరిమాణము.

మరియు భుజించునపుడు ఒక్కొక్కవ్యంజనమును భుజించునప్పుడును నీళ్ల నొక గ్రుక్కెడుత్రాగి కంఠశుద్ధిజేసికొనుచుండవలెను. అటుచేసినయెడ ఆయావ్యంజనము యొక్కరుచి స్ఫుటముగ గానవచ్చి రుచికరమగును. ఈవిషయమును సుశ్రుతాచార్యులిట్టు లుపదేశించిరి. "ప్రక్షాళయేదద్భిరాస్యం భుఞ్జానశ్చ ముహుర్ముహుః, విశుద్ధే రసనే తస్మై రోచతేఽన్నమపూర్వవత్."

హీనాతిమాత్రాదినిషేధము

మూ॥ హీనాతిమాత్రమశనం అత్యమ్బువిషమాశనమ్, ౨౪౪
విరుద్ధావత్సమశనం త్యజేదధ్యశనం తథా,

వ్యా॥ హీనమాత్రగా (తాను భుజించవలసినపరిమాణమునకు తక్కువగా) భుజించినను, అతిమాత్రముగ (తాను భుజించుపరిమితికన్న నధికముగ) భుజించినను, అధికముగ

త్లిపోయినడే భుజించినను, పర్యుషాశనంబును, విరుద్ధాశనంబును, సమశనంబును, అధ్యశనంబును, ఇవియన్నియు ననేకరోగముల గల్గించును కావున వీనినన్నిటిని విడువవలెను.

మరియు హీనమాత్రాతిమాత్రభోజనమున గల్లువైపరీత్యము వాగ్భటాచార్యులచే నిట్లుపదేశింపబడియె. "భోజనం హీనమాత్రం తు నబలోపచయౌజసే, సర్వేషాం వాతరోగాణాం హేతుతాంచ ప్రపద్యతే, అతిమాత్రం పునస్సర్వా నాశుదోషాన్ ప్రకోపయేత్." తక్కువపరిమాణముగ భుజించినచో శరీరమునకు పుష్టిని ఓజస్సును కల్గింపదు. పలుదెరంగులైనవాతరోగములను కల్గించును. మితిమీరి భుజించినచో త్రిదోషములను అతిశీఘ్రముగ ప్రకోపించును అని యర్థము. ఇట్టిదోషములు సంభవించును కావున న్యూనాధికపరిమాణములేక "గురూణా మర్ధసౌహిత్యం" ఇత్యాదివాక్యములచే పైజెప్పిన నియతప్రమాణముగ భుజింపనగునని భావము. మరియు ఎంతపరిమాణముతో భుజించి మనుజునకు సుఖముగ జీర్ణమై రోగముల గల్గింపకుండునో అట్టిది యాహారమునకు ముఖ్యప్రమాణము. ఈవిషయమును వాగ్భటాచార్యుడు "మాత్రాప్రమాణం నిర్దిష్టం సుఖం యావద్ధిజీర్యతి" అని యుపదేశించెను.

మరియు సమశన-అధ్యశన-విషమాశనముల లక్షణంబును, వానిచేగల్లువైపరీత్యంబును వాగ్భటాచార్యులచే నిట్లు చెప్పబడియె:—"మిశ్రం పథ్యమపథ్యం చ భుక్తం సమశనం స్మృతమ్, విద్యాదధ్యశనం భూయోభుక్తస్యోపరిభోజనమ్, అకాలే బహుచాల్పం వా భుక్తం తు విషమాశనమ్, త్రీణ్యప్యేతానిమృత్యుంవా ఘోరాన్ వ్యాధీన్ సృజన్తివా" పథ్యకరములైన శాలిధాన్యము మున్నగువానిని, అపథ్యములగుయవకము మున్నగువానిని ఒకటిగగూర్చి భుజించుట సమశనము. పూర్తిగ భుజించినయాహారము జీర్ణముగాకమునుపే తోడనే మరల భుజించుట యధ్యశనము. అకాలమునందు భుజించినను అధికముగ భుజించినను మిక్కిలి స్వల్పముగ భుజించినను విషమాశనము. ఈమూడువిధములైన యాహారంబులును మరణమునైనను మిక్కిలి క్రూరములగుగుల్మాదిరోగములనైనను తప్పక కలిగించును అని యర్థము.

మరియు భోజననియమమును "సాయం ప్రాతర్మనుష్యాణాం భోజనం విధినిర్మితమ్" అని వ్యాసులు చెప్పియున్నారు. మనుజులు ఉదయమునను సాయంకాలమునను (పగలు రాత్రి) రెండుమార్లు భుజించుట విధివిహితమని పైవాక్యముచే దెలియుచున్నది కావున నీరెండుపర్యాయములుకాక మరల భుజించుట దుష్టమని భావము. అదియే అధ్యశనము.

విరుద్ధాశనలక్షణము

మూ. యత్కిఞ్చిద్దోషముత్క్లేశ్య నహరేత్తత్సమాసతః॥ ౨౮౪

విరుద్ధం తద్ధిధాతూనాం ప్రత్యనీకతయాస్థితమ్,

వ్యా. ఏదైన నొకద్రవ్యము దోషమును రేపెట్టి దానిని హరింపకయే యుండిన నయ్యది సంగ్రహముగ విరుద్ధమని చెప్పబడును. అయ్యది ధాతువులకు విరుద్ధముగ నుండును కావున విరుద్ధాహారమని భావము.

పైజెప్పబడినది విరుద్ధాహారసామాన్యలక్షణము. ఇదిగాక క్షీరమత్స్యాదులు పరస్పర సంయోగముచే విరుద్ధములగును. కావున నవిగూడ విరుద్ధాహారములగును. వివరము క్రింద జూడనగును.

మరియు విరుద్ధాహారమున గలుగురోగములు తంత్రాంతరమున నిట్లు చెప్ప బడినవి:—"విస్ఫోటగుల్మమదవిద్రధిమేహయక్ష్మతేజోబలస్మృతి మతీన్ద్రియచిత్తనాశమ్. కుర్యాద్విరుద్ధమశనంజ్వరమస్రపిత్తం అష్టౌ గదాంశ్చ మహతో విషవచ్చ మృత్యుమ్." విరుద్ధమైనయాహారమును భుజించినచో స్ఫోటకలు గుల్మము, మత్తాత, విద్రధి, ప్రమేహము, రాజయక్ష్మము, అను నీరోగములను గలిగించును. తేజస్సును, బల మును. స్మృతిని, బుద్ధిని, ఇంద్రియములను, చిత్తమును నశింపజేయును. జ్వర మును రక్తపిత్తమును గలిగించును. విషమునుబోలె క్రూరమై వాతరోగము, అశ్మరి, కుష్ఠము, ప్రమేహము, ఉదరము, భగందరము, అర్శస్సు, గ్రహణి, అనునీయెనిమిదిమహా రోగములను కలిగించును. మహావ్యాధులు "వాతవ్యాధ్యశ్మరీకుష్ఠమేహోదరభగన్దరాః అర్శాంసి గ్రహణీత్యష్టౌ మహారోగాః ప్రకీర్తితాః" అనువాక్యముచే తంత్రాంతరమున పరిగణనముచేయబడెను.

విరుద్ధాశనమునగలుగురోగములు

మూ. విస్ఫోటశోథమదవిద్రధిగుల్మయక్ష్మ
తేజోబలస్మృతిమతీన్ద్రియచిత్తనాశాః,
కుర్యాద్విరుద్ధమశనంజ్వరమస్రపిత్తం
అష్టోదరాణి మహతోవిషవత్సమృత్యుమ్. ౨౭౩

వ్యా. స్ఫోటకము, శోఫమదము, విద్రధి, గుల్మము, రాజయక్ష్మము, అనునీరోగ ములను; తేజస్సు బలము స్మృతి (జ్ఞాపకశక్తి), బుద్ధి, ఇంద్రియములు, చిత్తము, వీని నాశమును; జ్వరము, రక్తపిత్తము: ఎనిమిదివిధములైన యుదరములు, ఎనిమిదివిధములైన మహారోగములు, అనునీరోగములను విరుద్ధాహారము విషతుల్యమై కలిగించును. ఒకసమయ మున మరణమునుకూడ కలిగించును. (పైకనబరచిన తంత్రాంతరశ్లోకమునకును ఈమూల మునకును కొంచెము భేదము కనబడుచున్నది.)

### ద్రవ్యావిరోధమునకు కారణములు

మూ. బలినాం మిథో గుణానాం విషమతయాసమతయాప్యుభయథాపి,
సంస్కారాదివశేనత భవతి నిసర్గాదపి విరోధః. ౨౮౭

వ్యా. ద్రవ్యములు కొన్ని తమయందలి ప్రబలమైనగుణసంసర్గముచే పరస్పర విరుద్ధములగు కొన్ని విషమభాగములుగ నొండొంటిగూర్చిన విరుద్ధములగును. కొన్ని సమ భాగములుగజేర్చిన విరుద్ధములగును. మరికొన్ని సమభాగముగనైనను విషమభాగముగ నైనను ఒండొంటగలసిన విరుద్ధములగును. కొన్ని ద్రవ్యములు సంస్కారవిశేషాదులంజేసి విరుద్ధములగును. కొన్ని ద్రవ్యములు పైజెప్పినకారణముల నపేక్షింపక స్వభావముచేతనే విరుద్ధములగును.

### క్షీరవిరుద్ధములు

మూ. క్షీరం కుళుత్థైః పనసే చ మత్స్యైః
తప్తం దధి క్షౌద్రఘృతేచమాషమ్,
వార్యూషితారాత్రిషు సక్తవశ్చ
తోయాన్తరాన్తీ యవకాన్తథాచ. ౨౮౮
మత్స్యమాంసగుడధన్వమూలకైః ప్రష్టమాహారితసేవితంపయః,
శాకజామ్బవసురాసవైశ్చ తత్ మారయత్య బుధమాశు సర్పవత్.
కులుత్థపిణ్యాకదధీనిమాంసమజాజ్గలం తైలను శేషకుష్ఠమ్,
కాపోతకం సర్షపతైలభ్రష్టం వల్లూరమాంసం త్రపవకంచ మద్యం
ప్రరోహవల్లీ ఫలశుష్కశాకం ఫలం విశేషేణచ రాజజమ్బ్వాః,
రాజించజగ్ధ్వానపిబేత్పయాంసి నాద్యాత్ప యోభిః నపయశ్చపీత్వా.

వ్యా. పాలను ఉలవలతోనైనను, పనసకాయతోనైనను, మత్స్యములతోనైనను గూర్చి త్రాగదగదు. పెరుగును వేడిగ కాచి యుపయోగింపంజనదు. తేనెను నేతిని కలిపి యుపయోగింప సర్వ్హముకాదు. మాషములను సత్తుపిండిని ఉదకమునందు రాత్రు లుంచి యుపయోగింపగూడదు. యవకములను నడుమనడుమ నీళ్లుత్రాగుచు నుపయో గింపందగదు. మరియు మత్స్యములు, మాంసములు, బెల్లము, ఎండుముల్లంగి, వీనితో గలిసినయాహారముజేసినపిదప పాలను సేవింపందగదు. మరియు శాకములు, నేరేడుపండ్లు, సురామద్యము, అనువానిలో దేనితోనైనను కలిపి పాలను సేవింపందగదు. జ్ఞానములేని మనుజుడు పైజెప్పినవానితోగూడ పాలనుజేర్చి సేవించినచో నయ్యది సంసర్గవిరుద్ధ మగుటంజేసి సర్పవిషముబోలె చంపును. మరియు ఉలవలు, తెలికపిండి, పెరుగు, అనూప

మాంసము, తైలము (నువ్వులనూనె), పలుదెరంగులైన పుల్లనిద్రవ్యములు, ఆవనూనెతో సంస్కరింపబడిన కపోతమాంసము, వల్లూరమాంసము, క్షవకము, మద్యము, మొలకకూర, గుమ్మడికాయ, ఎండుకూరలు, పెద్దనేరేడుపండ్లు, ఆవాలు, ఈపదార్థములను సేవించిన పిదప పాలను త్రాగగూడదు. మరియు పైజెప్పినవానితోగూడ పాలనుజేర్చి యుపయోగించినను, పాలను ద్రాగి పైజెప్పినవాని నుపయోగించినను విరుద్ధమై విషతుల్యమగును.

## కొన్నివిరుద్ధాహారములు

మూ. ఉష్ణేన శీతంచ నవం పురాణైః జీర్ణంచ బాలైర్యుగపద్వివర్జ్యమ్,
తచ్ఛోపయుక్తంయదితద్వివర్జ్యంప్రకోపయేత్తత్కఫవాతపిత్తమ్.

వ్యా. ఉష్ణమైనపదార్థముతో చల్లనిపదార్థమును కలిపియు, క్రొత్తవియగు ధాన్యాదులతో ప్రాతవియగు ధాన్యాదులగలిపియు, ముదిరినకాయలు మున్నగువానితో లేతవి యగువానినిగూర్చియు సమకాలమున నుపయోగింపంజనదు. మరియు నుమునుప యోగించిన శీతపదార్థమును, ప్రాతవానినుపయోగించినపిదప క్రొత్తవియగుధాన్యాదు దులను, ముదిరినకాయలు మున్నగువాని నుపయోగించినపిదప లేతవానిని యుపయోగించినచో విరుద్ధమై వాతపిత్తకఫముల మూటిని ప్రకోపింపజేయును కాన నట్లుపయోగింపంజనదని భావము.

## క్షీరమిత్రవర్గములు-అజీర్ణపదార్థజరణవస్తువులు

మూ. ఖణ్డామలకసిన్ధూత్థపటోలార్ద్రికనాగరమ్,
హారీతకీంచ క్షీరేణ యద్యత్స్వాదుహి మంత్రమాత్. ౨౪౨
మరిచమభయాశార్ఙ్గష్ఠామ్భోవిభీతకనాగరం,
శిశిరసలిలేతక్రం స్వాత్పాయసేసతిదుర్జరే
మథితవిజయాకోష్ణా బిసనాళకేస్వరసేఘృతం
శిశిరసలిలం త్వాజ్యేషు స్యాత్తథా పృథుకేపటుః. ౨౪౩

వ్యా. కల్కండ, ఉసిరిక, సైంధవలవణము, పొట్ల, అల్లము, శుంఠి, కరకకాయలు ఇవియన్నియు క్షీరమునకు మిత్రములు. మరియు ఏయేవస్తువు మధురరసంబున శీతవీర్యంబు నగునో అవియన్నియు క్షీరమునకు హితములైయుండును.

మరియు చల్లనినీళ్లు జీర్ణముకాకుండినచో మిరియములు, కరకకాయ, గినియకషాయము, తానికాయ, శుంఠి ఇవి యుపయోగించినచో జీర్ణమగును. పాయసము జీర్ణము కాకున్నయెడ మజ్జిగ నుపయోగించునది. తామరకాడలస్వరసమునకు విజయాపత్రమును

మథితముచేసి సుఖోష్ణముగ నుపయోగించునది. లేక నెయ్యి నుపయోగించునది. నెయ్యికి చల్లనినీళ్లను, అటుకులు జీర్ణముకానప్పుడు ఉప్పు నుపయోగింపవలెను.

కొన్ని ద్రవ్యములకు విరుపు

మూ. శీతం తోయం ధాన్యకం పాయసేస్యాత్
గోధూమే వాత్యమ్లతక్రంతు ముద్గే,
భార్గీ మాషేవైదళేచ ప్రస్తా
నిష్పావేస్యా ద్రామఠం సైన్ధవంచ. ౨౫౪
పిష్టోశోష్ణామ్బుశీతామ్బుధాన్యామ్లేషుధితేభయా,
శస్యతే మోదకే ముస్తా తక్రే మస్త్వభయాపునః. ౨౫౫
ఐణేయ మాంసే శుక్లారిమేదకోత్థోఽథవావమిః,
ఆమమాషకమాంసం వా తీక్ష్ణం వా ప్రతిభేషజమ్. ౨౫౬
సపద్మకేసరశ్శఙ్ఖోజమ్బ్వాముద్గశ్చ భృఙ్గజే,
జలకుక్కుటజేమాంసే శరపుఙ్ఖస్సనాగరః. ౨౫౭
మాంసే కురద్యాభుజగారివల్కం
మూలంతు శిగ్రోః వృకలావమాంసే,
మత్స్యేతు తక్రం వరణస్య పత్రం
శీతోదకం ద్వాంక్షలతాదళంచ. ౨౫౮

వ్యా. పాయసము జీర్ణముకానిచో చల్లనినీళ్లను దనియాలును ఉపయోగించినచో శమించును. గోధుమలు జీర్ణముకానినాడు మిక్కిలి పులిసినమజ్జిగయు నుపయోగింపనగును. మరియు పెసలకు పులిసినమజ్జిగయు, మినుములకును సెనగలకును భారంగియు, అనుములకు ఇంగువయు సైంధవలవణంబును, పిండితోజేయబడిన భక్ష్యాదులకు కొంచెము వేడిగనుండుజలంబును, ధాన్యామ్లమునకు చల్లనినీళ్లను, మథితమునకు కరకకాయలును, కుడుములకు తుంగగడ్డలును, తక్రమునకు మీగడ లేక కరకకాయలును, ఇఱ్ఱిమాంసమునకు కలిచంద్రరసంబును, లేక వమనముజేయించుటయు, లేక యెలుకపచ్చిమాంసంబును, లేక ఆవాలను ప్రతిభేషజము (విరుపు) అగును. (పైజెప్పిన ద్రవ్యముల నధికముగ నుపయోగించుటచే నవి జీర్ణముగాక వైపరీత్యముగలిగినచో నాయాద్రవ్యమునకాయావిరుపువస్తువుల నుపయోగించుకెడ దానగలుగుచెడుగు నివర్తించు నని భావము).

మరియు తుమ్మెదలవిషమునకు పద్మకేసరంబులును, శంఖంబును, నేరేడును, పెసలును విరుపు. నీరుకోడిమాంసమునకు వేంపలియు శొంఠియు విరుగుడు. మరియు కురరియనుపిట్టయొక్కమాంసమునకు మునగిసతోలును, తోడేలియొక్కయు లీతుకపిట్ట

యొక్కయు మాంసములకు మునగచెట్టువేరును, మత్స్యములకు మజ్జిగ ఉలిమిరియాకు చల్లనినీళ్లు కాకిదొండాకు అనునవియు, విరుపు అగు నని భావము.

## విషప్రతివిషములు

మూ. గుఞ్జాశిగ్రుశిఫాకపిత్థజఫలం గోధాత్వచో బర్హిజమ్
జమ్బ్వారగృధకాలశేయకటుకీరోహిణ్యో వరాహోద్భవే,
ఆజే కాలకపిత్థమస్తుకురరంశస్తం తథా తత్పలే
ఖారే తక్రతిలోద్భవం ప్రతివిషం సర్పారివల్కం తథా. ౨౫౯
కుక్కుటపిశితే శిగ్రుశిఫా స్యాత్
త్వక్చ తథావిహితా భుజగారేః
మూషకపలలే శిగ్రుజటా వా
మూషకమేహ హితం శశజే తు. ౨౬౦
మథిత మథవా జమ్బీరామ్లం చ మూషకజే పలే
మదనకశిఫా నిర్గుణ్డ్యోష్ణామ్బు సామహిషామిషే,
మదనఫలేఽప్యశ్మైదత్వగ్జ్మసూపదళోషణమ్
సకలపిశితే మద్యం ప్రత్యౌషధం మరీచాని చ. ౨౬౧

వ్యా. గురిగింజచెట్టువేరుకును మునగవేరుకును వెలగపండు ప్రతివిషము. ఉడుము చర్మమునకు నెమలియాకలు ప్రతివిషము. పందిమాంసమునకు నేరేడు, రేల, కాలశేయము (                ) కటుకరోహిణి అనునవి ప్రతివిషములు. మేకమాంసమునకు కరివేపాకు, వెలగపండు, మీగడ, కురర (పెన్నెడపులుగు) మాంసము ఇవి ప్రతివిషములు. గాడిదె మాంసమునకు మజ్జిగయు, నూనెయు, నెమలియు ప్రతివిషములు.

మరియు కోడిమాంసమునకు మునగవేరును, ఎలుకమాంసమునకు ముంగిసచర్మంబును మునగవేరును, కుందేటిమాంసంబునకు ఎలుకమాంసంబును ప్రతివిషములు. మరియు ఎలుకమాంసమునకు చిలికినమజ్జిగయైనను నిమ్మపండ్లరసమైనను ప్రతివిషములు. దున్నపోతు మాంసమునకు మ్రంగచెట్టువేరైనను నల్లవావిలియైనను వేడినీళ్లతో గూర్చినది ప్రతివిషమగును. మ్రంగపండునకు అకిమేదపుపట్ట మొసరపప్పు మిరియాలు ప్రతివిషము.

మరియు నానావిధములైనమాంసముల కన్నింటికిని మద్యంబును మిరియాలును ప్రతివిషమగును.

## మరికొన్ని విషప్రతివిషములు

మూ. బిమ్బ్యాః భిల్లాత్యాశ్చ కోష్ణం జలమథతిలజం హస్తికర్ణ్యామగస్త్యే
పాఠశ్చూర్ణాద్రికాణి ప్రతివిషముదితం కచ్ఛురానాళికాయామ్,

వందాచిఞ్చాప్లుతైలామలకమదనకేఽంకోలమేహారివల్కాం
శస్తం స్యాద్వర్జితవ్యామదనమథభృశంసల్లవేతణ్డులామ్బుః. ౨౬౨
కర్షాభూర్ద్వయకాలశేయమరిచం స్యాన్నారికేళం ఫలం
బిమ్బాలాబుఫలే పునర్నవశిఫాకూశ్మాణ్డశార్జిష్ఠయోః,
నిమ్బాలేతిలతైలకోష్ణసలిలం చిఞ్చాఫలం సూరణే
కోష్ణామ్బుః ఫలమూలకన్దకసలస్నేహేషుసర్వేష్వపి. ౨౬౩

వ్యా. దొండాకుకూరకును చిల్లీశాకమునకును కొంచెము వేడిగ నుండుజలము ప్రతిభేషజమగును. హస్తికర్ణి (బలురక్కసి)కి నువ్వులనూనె ప్రతివిషము. అవిసెకూరకు నీళ్లును, శుంఠియు, అల్లంబును, ప్రతివిషములగును. చేదునాళికశాకమునకు దూలగొండియు, చింతపండుపులుసుకు నూనె, వ్రంగపండుకు ఉసిరికపండు, ఊదుగుకు తంగేడు పట్ట అనునవి శ్రేష్ఠమగు విరుగుడు. వ్రంగపండుతో అందుగుబియ్యపుకడుగును విరోధించును. దొండపండును, సొరకాయకును, తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, కాలశేయము, మిరియాలు, టెంకాయ ఇవియన్నియు ప్రతివిషములు. పెద్దగుమ్మడికాయకును గినియకును గలిజేరువేరు ప్రతివిషము. ఆనుములకు నువ్వులనూనెయు గోరువెచ్చనినీళ్లను ప్రతివిషములు. కందగడ్డకు చింతపండు ప్రతివిషము. మరియు పలుదెరంగులగు పండ్లు వేళ్లు దుంప ఆకులు మున్నగువానికిని, నూనె మొదలగుస్నేహముల కన్నిటికిని వేడినీళ్లు సామాన్యముగ విరుపుగనుండును.

### మరికొన్ని విరుగుడులు

మూ. రమ్భాయాం ద్రాక్షవల్లీమరిచమపి ఫలే పానసేశృఙ్గిబేరం
తైలే తక్రేచ తక్రం సమరిచలవణం నారికేళంచ చూతే,
విశ్వాం చూతస్య పక్వాం ఫలమపిసుసితం తణ్డులం నారికేళే
మన్దం దణ్డాహతం వాతలఫలశివయోస్సైన్ధవాఢ్యం హరన్తి.
కోలాజ్యోలఫలే పథ్యామాతులుఙ్గఫలేసితా,
జామ్బవే ముద్గయూషం స్యాత్ ఫలే సర్వత్ర నాగరమ్. ౨౬౪
శాల్మలి మరిచే మరిచం తామ్బూల్యాం కేతకీచలవణే స్యాత్,
హిఙ్గునిగోమయసలిలం చిఞ్చామ్లం మృత్కపాలం వా. ౨౬౫

వ్యా. అరటికి ద్రాక్షయును, పనసపండుకు మిరియములును, నూనెకును మజ్జిగకును అల్లంబును, మామిడిపండుకు మిరియాలును, ఉప్పునుగూర్చిన మజ్జిగయు, టెంకాయయు, శుంఠియు, పండినమామిడిపండుకు, పంచదారయు, బియ్యంబును, కొబ్బరికి

తాటిపండును, గుమ్మడి రేగుపండు అనువానికి సైంధవముతోఁగూడిన మంథముగాని దండాహతము (ఇవిరెండును మజ్జిగభేదములు) గాని విరుగుడు లగును.

రేగుపండుకును ఊడుగపండుకును కరకకాయలు ప్రతివిషము. మాదీఫలములకు చక్కెరయు, నేరేడుపండ్లకు పెసరకట్టును విరుపగును. మరియు ఫలజాతి కన్నిటికిని శుంఠి విరుపగును.

మరియు మిరియములకు బూరుగయు, తమలపాకులకు మిరియాలును, లవణమునకు మొగలిపువ్వును, హింగువకు ఆవుపేడరసంబును, చింతపండుపులుపును, మట్టిపెంకును విరుపుగ నుండును.

అన్యచ్చ

మూ. అత్యమ్బుపానేససితప్రతీక్ష్ణః స్యాన్ముద్గయూషేగుడతీక్ష్ణవారి,
కోష్ణేఖరేచామ్బునిసౌఖ్యదాచస్యాచ్ఛర్కరైలోష్ణజలోపతాపే.
శుణ్ఠీమధూకేతిలజోషణాని చిం చాకుపథ్యాఘృతకాకతిక్తాః,
దుగ్ధోద్భవేజీవలతావికారేవదన్తివైద్యాఃపృథగేవతజ్జ్ఞాః. ౨౬౮

వ్యా. నీళ్ల నధికముగ త్రాగినందుచే గలిగినవికారమునకు చక్కెరగూర్చిన మిరియాలు విరుపు. పెసలకట్టుచే గలిగినవికారమున బెల్లంబును వేడినీళ్లును విరుపు. కొంచెము వేడియైననీళ్లవలనను మిక్కిలి తీక్ష్ణమైననీళ్లవలనను కలిగినవ్యాపత్తునందు చక్కెర విరుపుగ నుండును. వేడినీళ్లచేగలిగిన తాపమునందు ఏలకులు విరుపుగ నుండును. పాలచే గలిగినవికారమునందు శుంఠి, ఇప్ప, నూనె, పిప్పలి, చింతపండు, తానికాయలు, కరక కాయలు, నెయ్యి, కాకతిక్త (కాకిదొండ) పాలతీగె, వీనితో నెద్దానినైన నుపయోగింపవలె నని వైద్యులు చెప్పెదరు.

పెరుగునకువిరుపులు

మూ. దధ్నిముద్గరసోధాత్రిసర్పిఃఖణ్డంసితోపలమ్,
పథ్యానాగరయోఃక్వాథఃకల్కోవాప్రతిభేషజః. ౨౬౯

వ్యా. పెరుగునకు పెసలకట్టును, ఉసిరికకాయలును, నెయ్యియు, ఖండశర్కరయు, కరకకాయలను శుంఠినిచేర్చి పక్వముచేయబడిన కషాయంబును, ఆరెండిటికల్కంబును ప్రతిభేషములు.

మజ్జిగవిరుపు

మూ. తక్రవ్యాపత్సుశార్ఙ్గేష్టాకృష్ణామరిచనాగరమ్,
నీరుణ్డీశీతముదకంపథ్యామత్స్యం చయోజయేత్. ౨౭౦

వ్యా. మజ్జిగచే గలిగినవ్యాపత్తులయందు గినియ, పిప్పలి, మిరియాలు, శుంఠి, నల్లవావిలి, చల్లనినీళ్లు, కరకకాయలు, తానికాయలు, వీనిలో నెద్దానినైన నుపయోగింప నగును.

నేతికి వెన్నకువిరుపు

మూ. కటుకీఫలతక్రవిశ్వౌజమ్బ్వాంబుమరిచోష్ణాంబుకపిత్తతక్రపేయాః,
ఘృతజేవిహితావికారజాతేనవనీతప్రభవేకటుత్రయంస్యాత్.

వ్యా. నేతిచేగలిగినవ్యాపత్తునందు కరకకాయలు, మజ్జిగ, శుంఠి, నేరేడుపండ్లు, మిరియాలు, వేడినీళ్లు, వెలగపండును, మజ్జిగనుగూర్చి పక్వముచేయబడినగంజి ఇవి యన్నియు నుపయోగింపందగు. వెన్నచేగలిగినవ్యాపత్తులయందు త్రికటుకము లుపయోగింపనగును.

స్నేహాదులు జీర్ణముకానిచో విరుపు

మూ. స్నేహేష్వజీర్ణేషుసుఖాంబుశస్తం స్యాత్ క్షీరమద్యే విశ్వతే
మహిష్యాః, నిర్గుణ్డిపత్రైశ్శృతతైవమూలేపక్వోష్ణకంచాపిసుఖోష్ణ
మమ్బు.

వ్యా. నెయ్యి నూనె మున్నగుస్నేహద్రవ్యములు జీర్ణముకానియెడ చల్లనినీళ్లను, పాలును మద్యంబును నుపయోగింపందగును. ఎనుము (గేదె)పాలు జీర్ణము కానియెడ నల్ల వావిలియాకులను ప్రేళ్లను జేర్చి వేడిగ నీళ్లుకాచి యుపయోగింపందగును.

ఇక్ష్వాదివికారప్రతిక్రియలు

మూ. ఇక్షుస్వాదవికారే కూశ్మాణ్డం పీలుకంచమధుజన్యే,
శిశిరామ్బుతక్ర జనితేనీలిన్యాయాసవల్లిగుడపుష్పాణ్య,
విష్ణుక్రాన్తే తీక్ష్ణం కులుత్థా మధుకంచ తైలజేవికృతా.
తైలేతైలే శింశుపాఘుర్మతక్రే తోయం ఖాలీపత్రపిణ్యాకపానం,
మద్యేగోధావల్కలంవాసతూలాత్ కింజల్కం వాశర్కరావా
ఘృతేన. ౨౭౨

వ్యా. చెఱకురసము త్రాగినందువలన గలిగినవికారమునందు పుల్లగుమ్మడిరసమును, తేనె త్రాగినందువలన గలిగినవికారమునందు వరగోగుపండును, మజ్జిగవలనవికారమునందు చల్లనినీరును, నీలిరసమువలనివికారమున దూలగొండివేరు ఇప్పపువ్వును, విష్ణుక్రాంతవికారమున మిరియమును, నూనెవలనివికారమున నులవపిండి యష్టిమధుకమును, తిలతైలవికారమున నిరుగుడును, వేడిగనున్న మజ్జిగవలనివికారమునందు మంచినీరును, లేక నీరుతూటి

ఖూలి తెలి [illegible]
ములుగాని, నేతిలో గలిపినచక్కెరగాని ఏపిగుడు లగును.

తాంబూలవికారప్రతిక్రియలు

మూ. తామ్బూలోత్థేవికారే మధు మధుఫలంశీతతోయేననస్యం
తత్పానం ... కస్తూరిమరిచగళసితాక్షౌద్రం ... శీతవాతః,
చిఞ్చామ్లంక్షీరయష్టీమధుకమధుఘృతంనారికేళస్యతోయం
కేశాఘ్రాణంశిశూనామపిభవతిసమాధానకృచ్ఛర్దనం చ. 223

వ్యా. తాంబూలముచే గలిగినసొక్కునకు మిక్కిలి మధురమైనఫలంబును, చల్లని నీళ్లచే నస్యముచేయుటయు, చన్నీళ్లత్రాగుటయు, రాజనపుబియ్యముచే జేయబడినసత్తు పిండియు, మిరియాలును, పంచదారయు, చల్లనిగాలియు, చింతపండుపులుపును, పాలును, అతిమధురంబును, తేనెయు, నెయ్యియు, టెంకాయనీళ్ళును, బిడ్డలవెండ్రుకలమూర్కొనుటయు, వాంతిజేయుటయు, ఇవియన్నియు నుపయోగింపదగును.

అనుపానావశ్యకత

మూ. స్థిరతాంగతమక్లిన్నమన్నమద్రవపాయినః,
భవత్యాబాధజననమనుపానమతఃపిబేత్. 224

వ్యా. నీళ్ళు మున్నగుద్రవపదార్థములను త్రాగకయే కేవలము అన్నాద్యాహార పదార్థములమాత్రము తినినచో నట్టియాహారపదార్థములు కఠినములై ద్రవములేక యుండును. (వండదలచినబియ్యము మున్నగువానియందు నీళ్ళుచేర్చక నిప్పుపై నుంచినచో ద్రవసంబంధములేమిం జేసి గట్టిగ చిట్టెముగట్టి చెడిపోవునుకదా? ఆరీతిగనే ద్రవసంబంధములేక భుజింపబడిన యాహారము జాఠరాగ్నిసంబంధమునం జేసి కఠినమగునని భావము) దానంజేసి లేనిపోనిబాధలు కడుపులో సంభవించును; కావున అనుపానమును ఆహారమును భుజించునపుడు అవశ్యముగ జేయవలెను.

అనుపానములలో నుదకముశ్రేష్ఠము

మూ. ఉదకంత్వనుపానానాంసర్వేషాంశ్రేష్ఠముచ్యతే,
రసానామప్రతిగ్రాసాత్తస్మాద్దోషేష్వనిన్దితమ్. 225

వ్యా. పాలు పానకము మున్నగుద్రవరూపములైన యనుపానద్రవ్యములలో కేవలము శుద్ధజలము మిగుల శ్రేష్ఠమైనది. ఉదకమునందు ఏవిధమైనరసంబును లేదు కావున ఆహారపదార్థములయందలి మధురాదిరసములను జెరుపదు. కావున వాతాది దోషములుమూటియందును జలపానము నిషిద్ధముకాదు.

వ్యా. మజ్జిగచే గలిగినవ్యాపత్తులయందు గినియ, పిప్పలి, మిరియాలు, శుంఠి, నల్లవావిలి, చల్లనినీళ్లు, కరకకాయలు, తానికాయలు, వీనిలో నెద్దానినైన నుపయోగింప నగును.

నేతికి వెన్నకువిరుపు

మూ. కటుకీఫలతక్రవిశ్వాజమ్బ్వామరిచోష్ణామ్బుకపిత్థతక్రపేయాః,
ఘృతజేవిహితావికారజాతేనవనీతప్రభవేకటుత్రయంస్యాత్.

వ్యా. నేతిచేగలిగినవ్యాపత్తునందు కరకకాయలు, మజ్జిగ, శుంఠి, నేరేడుపండ్లు, మిరియాలు, వేడినీళ్లు, వెలగపండును, మజ్జిగనుగూర్చి పక్వముచేయబడినగంజి ఇవి యన్నియు నుపయోగింపందగు. వెన్నచేగలిగినవ్యాపత్తులయందు త్రికటుకము లుపయోగింపనగును.

స్నేహాదులు జీర్ణముకానిచో విరుపు

మూ. స్నేహాష్వజీర్ణేషుసుఖామ్బుశస్తం స్యాత్ క్షీరమద్యే విస్రుతే మహిష్యాః, నిర్గుణ్డిపత్రైశ్శృతదైవమూలేపకోష్ణకంచాపిసుఖోష్ణ మమ్బు.

వ్యా. నెయ్యి నూనె మున్నగుస్నేహద్రవ్యములు జీర్ణముకానియెడ చల్లనినీళ్లను, పాలును మద్యంబును నుపయోగింపందగును. ఎనుము (గేదె)పాలు జీర్ణము కానియెడ నల్లవావిలియాకులను వ్రేళ్లను జేర్చి వేడిగ నీళ్లుకాచి యుపయోగింపందగును.

ఇక్ష్వాదివికారప్రతిక్రియలు

మూ. ఇక్షుస్వాదవికారే కూశ్మాణ్డం పీలుకంచమధుజన్యే,
శిశిరామ్బుతక్ర జనితేనీలిన్యాయాసవల్లిగుడపుష్ప్యా,
విష్ణుక్రాన్తే తీక్ష్ణం కులుత్థా మధుకంచ తైలజేవికృతా.
తైలేతైలే శింశుపాఘుర్మతక్రే తోయం ఖాలీపత్రపిణ్యాకపానం,
మద్యేగోధావల్కలంవాసతూలాత్ కింజల్కం వాశర్కరావా ఘృతేన. ౨౭౨

వ్యా. చెఱకురసము త్రాగినందువలన గలిగినవికారమునందు పుల్లగుమ్మడిరసమును, తేనె త్రాగినందువలన గలిగినవికారమునందు వరగోగుపండును, మజ్జిగవలనవికారమునందు చల్లనినీరును, నీలిరసమువలనివికారమున దూలగొండివేరు ఇప్పపువ్వును, విష్ణుక్రాంతవికారమున మిరియమును, నూనెవలనివికారమున నులవపిండి యష్టిమధుకమును, తిలతైలవికారమున నిరుగుడును, వేడిగనున్న మజ్జిగవలనివికారమునందు మంచినీరును, లేక నీరుతూటి

ములు గాని, నేతిలో గలిపిన చక్కెర గాని విరుగుడు లగును.

తాంబూలవికారప్రతిక్రియలు

మూ. తాంబూలోత్థేవికారే మధు మధుఫలం శీతతోయేన నస్యం
తత్పానం శీతలత్వం మరిచగళసితా స్నిగ్ధశీతవాతః,
చిఞ్చాప్రమ్లంతేఽ స్తంబకమధుఘృతంనారికేళస్యతోయం
కేశాఘ్రాణంశిరోనాసుపిభవతిసమాథానసకృచ్ఛ్రగ్రహం చ. ౨౭౩

వ్యా. తాంబూలముచే గలిగినసొక్కునకు మిక్కిలి మధురమైనఫలంబును, చల్లని నీళ్లచే నస్యముచేయుటయు, చన్నీళ్లత్రాగుటయు, రాజనపుబియ్యముచే జేయబడినసత్తు పిండియు, మిరియాలును, పంచదారయు, చల్లనిగాలియు, చింతపండుపులుపును, పాలును, అతిమధురంబును, తేనెయు, నెయ్యియు, టెంకాయనీళ్ళును, బిడ్డలవెండ్రుకలమూర్కొనుటయు, వాంతిజేయుటయు, ఇవియన్నియు నుపయోగింపదగును.

అనుపానావశ్యకత

మూ. స్థిరతాంగతమక్లిన్నమన్నమద్రవపాయినః,
భవత్యాబాధజననమనుపానమతఃపిబేత్. ౨౭౪

వ్యా. నీళ్ళు మున్నగుద్రవపదార్థములను త్రాగకయే కేవలము అన్నాద్యాహార పదార్థములమాత్రము తినినచో నట్టియాహారపదార్థములు కఠినములై ద్రవములేక యుండును. (వండదల-చినబియ్యము మున్నగువానియందు నీళ్ళుచేర్చక నిప్పుపై నుంచినచో ద్రవసంబంధములేమింజేసి గట్టి చిట్టెముగట్టి చెడిపోవునుకదా? ఆరీతిగనే ద్రవసంబంధములేక భుజింపబడిన యాహారము జాఠరాగ్నిసంబంధమునంజేసి కఠినమగునని భావము) దానంజేసి లేనిపోనిబాధలు కడుపులోసంభవించును; కావున అనుపానమును ఆహారమును భుజించునపుడు అవశ్యముగ జేయవలెను.

అనుపానములలో నుదకముశ్రేష్ఠము

మూ. ఉదకంత్వనుపానానాంసర్వేషాంశ్రేష్ఠముచ్యతే,
రసానామప్రతిగ్రాసాత్తస్మాద్దోషేష్వనిన్దితమ్. ౨౭౫

వ్యా. పాలు పానకము మున్నగుద్రవరూపములైన యనుపానద్రవ్యములలో కేవలము శుద్ధజలము మిగుల శ్రేష్ఠమైనది. ఉదకమునందు ఏవిధమైనరసంబును లేదు కావున ఆహారపదార్థములయందలి మధురాదిరసములను జెరుపదు. కావున వాతాది దోషములుమూటియందును జలపానము నిషిద్ధముకాదు.

—॥ యవాదిభక్షణమునం దనుపానము ॥—

మూ. అనుపానంహిమంవారి యవగోధూమయోర్హితమ్,
దధ్నిమద్యేవిషేక్షౌద్రే; కోష్ణంపిష్టమయేషుతు. ౨౭౬
శాకముద్గాదివికృతౌమస్తుతక్రామ్లకాఞ్జికమ్,
సురాకృశానాంపుష్ట్యర్థంస్థూలానాంతుమధూదకమ్. ౨౭౭
శోషేమాంసరసోమద్యంమాంసేస్వల్పేచపావకే,
వ్యాధ్యౌషధాధ్వభారస్త్రీలఙ్ఘనాతపకర్మభిః. ౨౭౮
క్షీణే బాలేచవృద్ధేచపయఃపథ్యంయథామృతమ్,

వ్యా. యవలు, గోధుమలు, పెరుగు, మద్యము, విషవస్తువులు, తేనె వీనిని భుజించినతోడనే చల్లగనుండునీళ్లను అనుపానముగ త్రాగుట మిక్కిలి హితకరము. పిండితో జేయబడినభక్ష్యాదుల భుజించినపుడు కొంచెము వెచ్చనైనజలమును త్రాగుట మంచిది. శాకములను. పెసలు మున్నగువానిచే చేయబడినపదార్థములను భుజించినపుడు పెరుగుమీదిమీగడను, పులిసినమజ్జిగను, కాంజికమును అనుపానముగ త్రాగుట హితము. శరీరము కృశించినవారు శరీరపుష్టికై సుర యనుమద్యమును త్రాగవలెను. శరీరము మిక్కిలి బలిసియున్నవారు కృశించుటకై తేనెను నీళ్లను కలిపి త్రాగవలెను. క్షయరోగమున మాంసరసము అనుపానమునకు హితము. మాంసమును తినినయప్పుడు మద్యమునను పానముగ జేయనగును. జఠరాగ్ని మందగించియున్నపుడును మద్యానుపానము హితము. మరియు వ్యాధులచేతను, క్రూరములగుసౌషధములసేవించుటచేతను, త్రోవనడచుటచేతను, బరువును మోయుటచేతను, స్త్రీసంభోగముచేతను, లంకణములచేతను, ఎండతాకుడు చేతను, అధికముగ పనులజేయుటచేతను ఇట్టి కారణములచే శరీరము కృశించినవారును, వృద్ధులును, బాలురును పాలు త్రాగవలెను. (పాలు అమృతమునుబోలె బలము శరీర వర్ణము ఓజస్సుకాంతి ఆయువు ఆరోగ్యము మున్నగువాని వృద్ధినొందించును కావున పైజెప్పినకారణములచే శరీరము కృశించినవారును వృద్ధులును బాలురును క్షీరమును విశేషముగ పానముజేయవలెనని భావము.)

—॥ మాంసమున కనుపానము ॥—

మూ. మద్యం మద్యోచితానాం తు సర్వమాంసేషు పూజితమ్, ౨౭౯
అమద్యపానాముదకం ఫలామ్లంశ్చాపి శస్యతే,

వ్యా. మద్యపానమున కర్హులగువారు సకలమాంసముల భుజించునపుడును అనుపానముగ మద్యము నుపయోగించుట యుచితము. మద్యపానమున కర్హతలేనివారు ఉదకమునైనను పులుపుగలపండ్లరసమునైనను మాంసమున కనుపానముగ నుపయోగింపనగును.

## అనుక్తానుపానసంగ్రహము

మూ. విపరీతం యదన్నస్య గుణైస్స్యాదవిరోధి చ. ౨౪౦
అనుపానం సమాసేన సర్వథా తత్ప్రశస్యతే,

వ్యా. అన్నము వడియములు మున్నగు నాహారపదార్థములకు విపరీతగుణములు గల్గినదియు సంసర్గాదివిరోధములేనిదియు నగుననుపానము మిక్కిలి ప్రశస్తము. ఇది యనుపానసంగ్రహము.

(విపరీతగుణముగలదియన:—స్నిగ్ధముగ నుండుదానికి రూక్షమైన యనుపానంబును, రూక్షముగ నుండుదానికి స్నిగ్ధమైన యనుపానంబును, ఉష్ణముగ నుండుదానికి శీతంబైన యనుపానంబును, శీతంబుగ నుండుదానికి నుష్ణంబైనయనుపానంబును, మధురమైనదానికి అమ్లంబైనయనుపానంబును, అమ్లమైనదానికి మధురంబును విపరీతములు. ఇత్తెరంగుననే తక్కినగుణములకును విపరీతముల గల్పించునది.)

మరియు ననుపానగుణములను వాగ్భటాచార్యు లిట్లు లుపదేశించిరి:—"అనుపానం కరోత్యూర్జాం తృప్తిం వ్యాప్తిం దృఢాఙ్గతామ్, అన్నసఙ్ఘాతశైథిల్య విక్లిత్తిజరణానిచ" అనుపానము శరీరమున బలము గల్గించును. తృప్తిని బుట్టించును. ఆహారపదార్థమును శరీరమున వ్యాపింపజేయును. అవయవములను దృఢపరచును. ఆహారపదార్థములు ముద్దగ నున్నచో శిథిలముగను మృదువుగను జేసి జీర్ణింపజేయును. అని భావము.

## భోజనానంతరనియమము

మూ. తతోపనీయ పాణిస్థ మన్నమన్నేన భూపతిః. ౨౪౧
తథా దన్తాన్తరగతం శోధనేన శనైశ్శనైః,
గన్ధస్నేహాపనోదాన్తమాధౌతస్సిక్తలోచనః. ౨౪౨
అఙ్గుళ్యగ్రాఙ్ఘులై ర్హృత్వా భూమే ర్భుక్తేరితం కఫమ్,
విధాయ ముఖవైశద్యం తామ్బూలైర్గన్ధవస్తుభిః. ౨౪౩
బుజిర్భుత్వాతథాసీత యావదన్నం ప్రతిష్ఠితమ్,

వ్యా. పైజెప్పినవిధముగ నియమముతోగూడి భుజించినపిదప చేతనంటికొనియుండు మెతుకులను విదలించి, పండ్లసందుల నిరికికొనియుండులేపములను దంతశోధనార్థమైన సన్ననిపుల్ల మున్నగువానిచే మెలమెల్లగ వెలికిందీసి శోధించి, నోట వాసనయు జిడ్డును వదలునందాక నీళ్లతో శుభ్రముగ కడిగికొని, కన్నులను కడిగి వ్రేళ్లకొనలచే భోజనకాలమున వెడలి కుత్తుక నిరికికొనియున్న కఫమును బయిట వెడలించి యుమిసి భూమిపైబడిన కఫమును మట్టిచే గప్పి, తాంబూలము పచ్చకప్పురము మున్నగుగంధద్రవ్యములచేత

మనుష్యుడు శతపదములు నడచిన ఘటికల వఱకు యాహారము కోశమున సుస్థిరముగ నిముడునంతవఱకు వంకరలేక చక్కగ కూర్చొనియుండవలెను.

శయనక్రమము

మూ. తత శ్శతపదం గత్వా వామపార్శ్వేన సంవిశేత్. ౨౮౪
తేన ద్వాత్రింశతిం మాత్రాం దక్షిణే పఞ్చవింశతిమ్,
శయీత ద్వాదశోత్తా న స్త్వర్థం వోత్తరభోజనః. ౨౮౫

వ్యా. ఆహారము కోశమున సుస్థముగ నిమిడినపిదప నూరడుగులు మెల్లమెల్లగ నడచి పిదప నెడమప్రక్క పరుండవలెను. మరియు ముప్పదియక్షరముల నుచ్చరించునంత కాలము ఎడమప్రక్కను, ఇరువదియైదు అక్షరముల నుచ్చరించునంతకాలము కుడి ప్రక్కను, పండ్రెండు లేక పదునారుఅక్షరముల నుచ్చరించునంతకాలము వెలికలను క్రమముగ పరుండవలెను. (పైజెప్పినరీతి పరుండిన నో నాహారము కోశమున చక్కగ నిమిడియుండు నని భావము.)

రాత్రిభోజననియమము

మూ. శర్కరామాక్షికఘృతక్షీరైస్సార్యన్నిశి భోజనమ్,
విదాహాన్యన్నపానాని దివా భుజ్త్కే హి మానవః. ౨౮౬
తద్విదాహప్రశాన్త్యర్థం రాత్రౌ క్షీరం ప్రశస్యతే,
తామ్బూలం నైవ సేవేత క్షీరం భుక్త్వైవ మానవః. ౨౮౭

వ్యా. మానవుడు రాత్రులయందు చక్కెర, తేనె, నెయ్యి, పాలు, ఈనాల్గింటితో గూర్చి భుజింపనగును. పగటియందు విదాహకరము (మంటబుట్టించునవి) లగునన్నపానాదులసేవించిన దానగల్గు తపనశాన్తించుటకై రాత్రులయందు పాలు త్రాగుట చాల ప్రశస్తము. మరియు పాలను త్రాగినపిదప తాంబూలమును సేవింపందగదు.

స్త్రీసంభోగనియమములు

మూ. గ్రామ్యధర్మే త్యజేన్నారీం అనుత్తానాం రజస్వలామ్,
అప్రియామప్రియాచారం దుష్టసంకీర్ణమేహనామ్. ౨౮౮
అతిస్థూలాం కృశాం సూతాం గర్భిణీమన్యయోషితమ్,
వర్ణినీమన్యయోనిం చ; గురుదేవనృపాలయాన్. ౨౮౯
చైత్యశ్మశానాయతనచత్వరామ్బు చతుష్పథమ్,
పర్వాన్యనఙ్గం దివసం శిరోహృదయతాడనమ్. ౨౯౦

అత్యాశితోఽధృతిః క్షుద్వాన్ దుస్స్విన్నాఙ్గః పిపాసితః,
బాలోవృద్ధోఽన్యవేగార్తః త్యజేద్రోగీ చ సజ్గమమ్. ౨౮౧

వ్యా. మనుజుడు వెలికిలబరుండుస్త్రీతోను, రజస్వలతోను సంభోగము చేయరాదు. మరియు నిష్టముకానిదియు, ఇష్టముకానిదురాచారములుకల్గినదియు, గుహ్యరోగములు కలవారితో సంభోగము చేయునదియు, అనేకులతో సంభోగము చేయునదియు, మిక్కిలి స్థూలమైనదియు, మిక్కిలి కృశించినశరీరముకల్గినదియు, ప్రసవించినబాలింతరాలును, గర్భవతియు, ఇతరునిభార్యయు, బ్రహ్మచర్యమును బూనినదియు, తనకన్న నితరజాతి యందు బుట్టినదియు నగుస్త్రీ సంభోగమునకు అర్హురాలు కాదు; కావున అట్టిస్త్రీలను సంభోగకృత్యమున విడువందగును. మరియు గురువులయిండ్లను, దేవాలయములయందును రచ్చపట్టులయందును, రుద్రభూములయందును, హోమాగ్ను లుండుప్రదేశములయందును, అంగణములయందును, నీళ్లయందును, నాల్గువీధులు గలయుప్రదేశమునను సంభోగము జేయంజనదు కావున అట్టిప్రదేశములు సంభోగమువిషయమై విడువందగును. మరియు పున్నమ మొదలగుపర్వదినములయందును పగటియందును సంభోగము చేయ రాదు. సంభోగకాలమున శిరస్సునందును హృదయముపైనియు తాడనము చేయంజనదు. మరియు నధికముగ భుజించినవాడును, ధైర్యములేనివాడును, ఆకలిగొన్నవాడును, దప్పి గొన్నవాడును, బాలుండును, వృద్ధుడును, మలమూత్రాదివేగముల నొందియున్నవాడును, రోగపీడితుడును నగు మనుజుడు సంభోగము చేయరాదు. మరియు కరచరణాద్యవయవ ముల వ్యత్యస్తముగ నుంచుకొని సంభోగము సేయరాదు.

### ఋతుభేదముచే సంభోగనియమము

మూ. సేవేత కామతః కామం పుష్టో వాజీకృతాం హిమే,
త్ర్యహాద్వసన్తశరదోః పక్షాద్వృష్టినిదాఘయోః. ౨౮౨

వ్యా. మంచుకాలమైన హేమంతశిశిరఋతువులయందు వాజీకరణౌషధాదులచే తాను పుష్టినొంది వాజీకరణౌషధాదులచే పుష్టినొందినస్త్రీతో కామసుఖమును తనకిచ్చ వచ్చినట్టు లనుభవింపనగును. వసంతశరదృతువులయందు (మధ్యమ బలముగ నుండుటం జేసి) మూడేసిదినముల కొకతూరి సంభోగము చేయదగును. వర్షగ్రీష్మఋతువులయందు (బలము చాల తక్కువగ నుండును కావున) పదునైదుదినముల కొకనాడు సంభోగము జేయనగును.

### నియములేనిసంభోగమున గల్గుహాని

మూ. భ్రమక్లమోరుదౌర్బల్యం పుంస్త్వేన్ద్రియబలక్షయః,

అపర్వ (కాల) మరణం చాప్యాత్ అన్యథా గచ్ఛతస్త్రియమ్.

వ్యా. పైజెప్పిననియమము ననుసరింపక తనకిచ్చవచ్చినట్లు స్త్రీలోలు డగువాడ శ్రమంబును, బడలికయు, ఊరువులబలహీనంబును కలుగును. పుంస్త్వము నశించును చక్షురాదీన్ద్రియబలంబును శరీరబలంబును క్షీణించును. ఇంతియగాక తుద కకాలమరణంబును సంభవించును.

### సంభోగనియమమున గల్గుగుణములు

మూ. స్మృతిమేధాయురారోగ్యపుష్టీన్ద్రియయశోబలైః,
అధికామన్దజరసో భవన్తి స్త్రీషు సంయతాః. ౨౯౪

వ్యా. స్త్రీలవిషయమై పైజెప్పిననియమము ననుసరించి నటించువారు జ్ఞాపకశక్తియు, బుద్ధియు, ఆయువును, ఆరోగ్యంబును, శరీరపుష్టియు, ఇంద్రియబలంబును యశంబును, మిక్కిలి యధికములై శుక్రపాటవము కల్గియుందురు. ముసలితనము అధికముగాక స్వల్పముగ నుండును.

### సంభోగమునపయఃపానము

మూ. పయః పీత్వా స్త్రియం గచ్ఛేత్ స్త్రియం గత్వా పయః పిబేత్,
సద్యో బలకరం క్షీరం సద్యో బలహరాస్త్రియః. ౨౯౫

వ్యా. క్షీరము సేవించునప్పుడే బలమును కల్గించును. స్త్రీలును సంభోగసమయము ననే (కాలవిళంబు లేక) బలమును హరించెదరు. కావున తొలుత పాలుద్రాగి పిమ్మట స్త్రీలతో రమించవలెను. సంభోగానంతరము మరల నప్పుడే పాలుద్రాగవలెను. (పాలు క్షణమాత్రముననే బలమును గల్గించునది కావున స్త్రీసంభోగమునగల్గిన బలహీనత నప్పుడే హరించును కావున ముందును వెనుకను సంభోగసమయమున పాలు ద్రాగవలె ననిభావము)

### నిద్రావ్యత్యయమున గల్గుదోషము

మూ. అకాలేఽతిప్రసఙ్గాచ్చ న చ నిద్రా నిషేవితా,
సుఖాయుషీ పరా కుర్యాత్ కాళరాత్రిరివాపరా. ౨౯౬

వ్యా. అకాలమున నిద్రపోయినను, అధికముగ నిదురించినను, నిదురనుమానినను, అయ్యది కాళరాత్రినిబోలె సుఖమును ఆయువును నశింపజేయును.

### నిద్రాస్వరూపము

మూ. సర్గాదిమూలప్రభవా తమోమూలా తమోమయీ,
బాహుళ్యాత్తమసో రాత్రౌ నిద్రా ప్రాయేణ జాయతే. ౨౯౭

వ్యా॰ నిద్ర యనునది సృష్టికి ముందుపుట్టినది. దీనికి తమస్సే కారణము. తమో గుణస్వరూపమైనది. అట్టితమోగుణరూపమైననిద్ర రాత్రులయందు తమస్సు వ్యాపించి యుండుటవలన తరుచుగ సంభవించును.

నిద్రాకాలము

మూ॰ యథాకాలమతో నిద్రాం రాత్రౌ సేవేత సాత్మ్యతః,
అసాత్మ్యాజ్జాగరాదర్ధం ప్రాతస్స్వప్యాదభుక్తవాన్. ౭౯౮
నిర్ణీతాది నచర్యేత్థమృతుచర్యాథ వక్ష్యతే,

వ్యా॰ కాబట్టి నియతకాలము నతిక్రమించక సాత్మ్యము (అలవాటు) ననుసరించి రాత్రియందు నిద్రించవలెను. రాత్రులయందు జాగరము అసాత్మ్యము (అలవాటులేనిది) కావున నొకవేళ రాత్రులయందు అలవాటును దప్పినిదురమేల్కాంచినచో తాను నిదురమాని యున్నకాలములో నర్థకాలము పగటిపూట ఉదయకాలమున భోజనమునకు ముందు నిదురింపవలెను. ఇత్తెఱంగున దినచర్య సవిశేషముగ నిరూపింపబడియె. పిమ్మట ఋతుచర్యానియమము చెప్పబడును.

ఋతుచర్య, అందుగ్రీష్మఋతుచర్య

మూ॰ గ్రీష్మే జాఙ్గలశాలిముద్గకదలీద్రాక్షారసాలాసవ,
స్వచ్ఛం పాణ్డురబర్హికాని మహిషీక్షీరం సితాసక్తవః,
పాథఃపాటలవాసితం సుశిశిరం కర్పూరవన్మల్లికా,
మాలాచన్దనచన్ద్రికాహిమగృహే నిద్రా చ మధ్యన్దినే. ౭౯౯

వ్యా॰ గ్రీష్మఋతువునందు జాంగలజంతుమాంసంబును, శాలిధాన్యముచే సిద్ధమైన యన్నంబును, పెసలపప్పు, అరటిపండ్లు, ద్రాక్షపండు, రసాల, ఆసవము, స్వచ్ఛమై తెల్లనైనవస్త్రములు, ఎనుముపాలు, పంచదార, సత్తుపిండి, పాదిరిపువ్వులచే పరిమళించుచు చల్లనై పచ్చకర్పూరముతోగూడిన పానీయము, మల్లెపువ్వులమాలికలు, చందనము, వెన్నెల మున్నగువానిచే చల్లనైనగృహమున మధ్యాహ్నకాలమున నిదురించుట, ఇవి యన్నియు మిక్కిలి హితము.

వర్షర్తుచర్య

మూ॰ శుద్ధే రాస్థాపనం స్యాదనుఘనసమయే జాఙ్గలం మధ్వరిష్టం,
జీర్ణం ధాన్యం చ యూషం దధిరసమచితం స్వర్జికాపఞ్చకోలమ్,
పానీయం దివ్యకాపం క్వథితమపి భజేద్దుర్దినే తు ప్రభాతే,
వ్యక్తామ్లస్నేహమన్నం స్ఫుటపటు చ లఘు క్షౌద్రవన్నిర్గ్రవంచ.

వ్యా. వర్షఋతువునందు విరేచనాదులచే శోధనముచేసినపిదప ఆస్థాపనవస్తి కర్మ చేయుట, జాంగలజంతువులమాంసము, తేనె, అరిష్టము, ప్రాతవియగుధాన్యములు, యూషము, సౌవర్చలవణమును పంచకోలములను చూర్ణముచేసి కలపబడిన పెరుగుమీఁది తేట, దివ్యజలము (ఆకాశోదకము), కౌప(బావి)జలము, ఇవియన్నియు హితకరములు. మరియు మిక్కిలి సూర్యరశ్మి లేక గాఢముగ మబ్బుగ్రమ్మియున్నపుడు కాచిన వేడినీళ్లను సేవించుట, ఆమ్లరసంబును స్నేహంబును కలిసినయన్నంబును, స్పష్టముగ నుప్పుకల్గి తేలికయై తేనెతోఁగూడి ద్రవములేనిపదార్థంబులును హితములు.

శరదృతుచర్య

మూ. తిక్తం నామ ఘృతం విరేచనమసృఙ్మోక్షశ్శరత్సఙ్గమే,
సక్షీరం ఘృతశర్కరాఢ్యమశనం ముద్గః పటోలం మధు.
ధాత్రీజాఙ్గలరాగషాడబరసాః హంసోదకం చన్దనమ్,
కర్పూరః కుసుమాని చన్ద్రకిరణాస్సౌధాని గీతాని చ. ౩౦౧

వ్యా. శరదృతువునందు తిక్తకఘృతమును పానముచేయుటయు, విరేచనంబును, రక్తమోక్షముచేసికొనుటయు మంచిది. మరియు నేతిని చక్కెరను పాలను కూర్చినయన్నమును భుజించవలెను. పెసలపప్పు, పొట్లకాయలు, తేనె, ఉసిరికకాయలు, జాంగలమాంసము, రాగములు, షాడబములు, మాంసరసములు, హంసోదకము, ఇవియన్నియు హితములు. మరియు చందనమును పచ్చకర్పూరమును కలిపి పూసికొనుట మంచిది. పుష్పమాలికలధరించుటయు, చంద్రకిరణములసేవించుటయు, ఉన్నతములగుమేడలపైనుండుటయు, గానమును వినుటయు చాల ప్రశస్తము.

హంసోదకలక్షణమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి. "తప్తం తప్తాంశుకిరణైః శీతం శీతాంశురశ్మిభిః, సమన్తాదప్యహోరాత్రం అగస్త్యోదయనిర్విషమ్, శుచిహంసోదకం నామ నిర్మలం మలజిజ్జలమ్, నాభిష్యన్ది నవారూక్షం పానాదిష్వమృతోపమమ్" పగటియందు సూర్యకిరణములచే వెచ్చనై రాత్రులయందు చంద్రకిరణములచే చల్లనై అగస్త్యోదయమునంజేసి విషరహితమై పరిశుద్ధమైనజలము హంసోదక మని చెప్పబడును. ఇయ్యదిసరస్సులయందును తటాకాదులయందును నిర్మలమై పరిశుద్ధముగ నుండును. ఇట్టి హంసోదకము కఫమును వాతమును ప్రకోపింపజేయసమస్థితి నుంచును. కావున పానాదులకు ఇయ్యది యమృతమునుబోలె నారోగ్యదాయకముగ నుండును. ఇట్టి హంసోదకము శరదృతువునందు పానాదులకు ముఖ్యముగ నుపయోగింపందగును. పైజెప్పినయుదకము హంసలబోలి తెల్లగనుండి హంసలకుగూడ పానార్హమైనది కావున హంసోదక మని ప్రాచీనర్షిపుంగవులు వ్యవహరించిరి.

## హేమన్తశిశిరఋతువులచర్య

మూ. హేమన్తే శిశిరే చ వాతశమనైః తైలైశ్శిరోవస్తయః,
సేకాభ్యఞ్జనమర్దనాదివిధినా స్నానం లఘూష్ణామ్బరమ్.
చర్చాకుఙ్కుమదర్పయోః, అగరుణా ధూపః ఫలం మేదురం,
గోధూమేక్షుగుడాన్నపాయునతయః క్షీరం ఘృతాశోష్ణకౌ.

వ్యా. హేమంత శిశిరఋతువులయందు వాతహరములగు బలాదితైలములచేత శిరోవస్తులు చేయవలెను. మరియు నావాతహరతైలములచే శరీరమునకు లేపనముచేసి మర్దనముచేసికొని విధ్యుక్తప్రకారము స్నానముచేసి పలుచనై వేడిగనుండువస్త్రముల గట్టికొనవలయును. కుంకుమపువ్వును కస్తూరిని కలిపి శరీరమున బూసికొని, అగరుచే పొగ వేసికొనవలయును. మిక్కిలి మృదువుగనుండుపండ్లను, గోధుమలు, చెరకు, బెల్లము, వీనిని ఆహారమునకై యుపయోగింపనగును. నూతనముగ యౌవనవతులగుస్త్రీలతో సంభోగించ వలెను. వేడిగనుండుపాలను నేతిని పానమునకై యుపయోగింపనగును.

## వసంతఋతుచర్య

మూ. తీక్ష్ణచ్ఛర్దననావనాదివిజితే తశ్లేష్మప్రకోపస్తతః,
స్నాతశ్చన్దనకుఙ్కుమాగరుకృతాలేపః పురాణం యవమ్,
గోధూమం మధుజాఙ్గలాని చ భజేన్మార్ద్వీకమధ్వాసవాన్,
మధ్యాహ్నం గమయేద్వసన్తసమయే గోష్ఠీభిరుద్యానతః. 303

వ్యా. (శిశిరకాలమున మధురస్నిగ్ధాద్యాహారములచేతను కాలస్వభావముచేతను మిక్కుటముగ సంచితమై ఘనీభవించినకఫము వసంతర్తువునందు తీక్ష్ణములగు సూర్యకిరణ ముల వేడిచే కరగి నీరువలె నగును. అయ్యది స్రవించుటచే జాఠరాగ్నిచెడి యనేకరోగ ములను కల్గించును. కావున అట్టికఫమును త్వరగ హరింపజేయుట వసంతఋతువున మొదటికృత్యము. ఈవిషయమునే వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—"కఫశ్చితోహి శిశిరే వసన్తేఽర్కాంశుతాపితః, హత్వాగ్నిం కురుతేరోగా నతస్తం త్వరయా జయేత్.")

పైజెప్పినరీతిగ ప్రకోపించినకఫమును మిక్కిలి తీక్ష్ణములగునౌషధాదులచే వమ నము నావనము మున్నగువిధులచే శమింపజేసి పిదప విధ్యుక్తప్రకారము స్నానముచేసి, చందనమును కుంకుమమును అగరునుగూర్చి శరీరముపై బూసికొనవలెను. ప్రాతయవలను గోధుమములును తేనెయు జాంగలజంతువులమాంసంబులును మార్ద్వీకాసవంబును మధ్వా సవంబును ఇవియన్నియు పానభోజనముల కుపయోగింపవలెను. మధ్యాహ్నకాలమున నుద్యానవనమునజేరి మనసు కుల్లాసమును బుట్టించు సంగీతాదిగోష్ఠిచే కాలము గడప వలెను.

షడృతువులలో మధురాదిరససేవనక్రమము

మూ. శీతే వర్షాసు చాద్యాం స్త్రీన్ వసన్తేఽన్త్యాన్ రసాన్ భజేత్,
స్వాదుం నిదాఘే శరది స్వాదుతిక్తకషాయికాన్. 304

వ్యా. హేమంతశిశిరవర్షఋతువులయందు మొదటివియగు మధురామ్లలవణరసంబులు మూడును, వసంతఋతువునందు తక్కినతిక్తకటుకషాయరసంబులు మూడును, గ్రీష్మఋతువునందు మధురరసంబును, శరదృతువునందు మధురతిక్తకషాయరసంబులు మూడును సేవింపందగును.

షడృతువులలో నన్నపానసేవననియమము

మూ. స్నిగ్ధోష్ణం శీతవర్షాసు నిదాఘే స్నిగ్ధశీతలమ్,
వసన్తకాలే రూక్షోష్ణం రూక్షం శీతం ఘనాత్యయే. 305

వ్యా. శీతకాలమైన హేమంతశిశిరఋతువులయందును, వర్షఋతువునందును స్నిగ్ధంబును ఉష్ణంబునైనయన్నపానాదుల సేవింపవలెను. గ్రీష్మఋతువున స్నిగ్ధంబును శీతంబునగు నన్నపానాదుల నుపయోగింపనగును. వసంతఋతువున రూక్షంబును ఉష్ణంబునైన యన్నపానాదుల సేవింపనగును. శరదృతువునందు రూక్షంబును శీతంబును నగు నన్నపానాదుల సేవింపవలెను.

సద్యోబలహారములు

మూ. శుష్కమత్స్యాః స్త్రియో వృద్ధా బాలార్కస్తరుణం దధి,
రాత్రౌ శాకం రతిప్రాప్తిః సద్యో బలహరాణి షట్. 306

వ్యా. ఎండినమత్స్యములు, వృద్ధులగుస్త్రీలు, ఉదయమున లేతయెండ ( ) తోడి పేరకయుండుపెరుగు, రాత్రులయందు శాకము, స్త్రీసంభోగము, ఇవి యారును సేవించినవెంటనే బలమును హరించును.

సద్యోబలకరములు

మూ. ఆర్ద్రమత్స్యాః ఘృతం క్షీరం వ్యాయామస్తరుణీస్త్రియః,
జాఙ్గలాని చ మాంసాని సద్యోబలకరాణి షట్. 307

వ్యా. పచ్చిచేపలు, నెయ్యి, పాలు, దేహపరిశ్రమము, యౌవనవతులగు స్త్రీలు, జాంగలమాంసములు ఈయారును సేవించినవెంటనే బలమును గల్గించునవి.

విషమునందుశ్రద్ధయావశ్యకము

మూ. ఆయుర్ఘృతే గుడే రోగో మృత్యుర్వహ్నౌ విషాహిషు,
ఆరోగ్యం కటుతిక్తేషు బలం మాంసే వయస్యపి. 308

వ్యా. నేతియందు ఆయువును, బెల్లమునందు రోగంబులును, విషముతోగూడిన సర్పములయందు మృత్యువును, కటుతిక్తరసములుకలపదార్థములయందు ఆరోగ్యంబును, మాంసమునందును వయస్సునందు బలంబును లీనముగ దాగియుండును. కావున పైజెప్పిన విషయమును గమనించి నడువదగునని భావము.

స్వస్థరక్షణములు

మూ. అశితేనామ్భసా స్నానం పయఃపానం వయస్స్త్రియః,
స్వస్థానాం పథ్యమామ్నాతం స్నిగ్ధముష్ణం చ భోజనమ్. ౩౦౯

వ్యా. కొంచెము వెచ్చనైయున్ననీళ్లచే స్నానంబును, పాలుద్రాగుట, మంచివయసున నుండుస్త్రీలతో గ్రీడించుట, స్నిగ్ధమై కొంచెము వేడిగనున్న నన్నాదులభుజించుట ఇవియన్నియు రోగాదులు లేక స్వస్థతనుండు వారికి పథ్యకరములు.

ఆరోగ్యకారణములు

మూ. కాలోఽనుకూలో విషయామనోజ్ఞాః
ధర్మ్యాః క్రియాః కర్మసుఖానుబన్ధి,
సత్వం విధేయం విశదా చ బుద్ధిః
భవన్తి ధీరస్య సదా సుఖాయుః. ౩౧౦
అర్థేష్వలభ్యేష్వకృతప్రయత్నం
కృతాదరం నిత్యముపాయవత్సు,
జితేన్ద్రియం నానుపతన్తి రోగాః
తత్కాలయుక్తం యది నాస్తి దైవమ్. ౩౧౧

వ్యా. అనుకూలమైనకాలము, మనోహరములగువిషయములు, ధర్మమును దప్పని క్రియలు, సుఖమును గల్గింపదగినవ్యాపారము, సత్వగుణము, నిర్మలమైనబుద్ధి, ఇవి యన్నియు బుద్ధిమంతునకు ఎల్లప్పుడును సుఖమును గల్గించును. మరియు తనకు లభింపని వస్తువులవిషయమై ప్రయత్నముచేయనివాడును, ప్రయోజనకరములై యుపాయముచే సాధింపదగినవిషయములయందు ఎల్లప్పుడు మిక్కిలి యాసక్తికలవాడును, ఇంద్రియములను తనవశమున నుంచుకొనినవాడును నగుపురుషునకు దైవము ప్రతికూలముగాక యనుకూలముగ నుండుచుండ వానిని రోగములు బాధింపనేరవు. (దైవయత్నము ప్రతికూలముగ నున్నచో నెన్నిగుణసంపత్తులున్నను కొనసాగవని భావము)

మూ. శ్రుతచరితసమృద్ధే కర్మదక్షేదయాళౌ
భిషజి నిరనుబన్ధం దేహరక్షాం నివేశ్య
భవతి విపులతేజః స్వాస్థ్యకీర్తి ప్రభావః
స్వకుశలఫలభోగీ భూమిపాలశ్చిరాయుః. ౬౧౨

వ్యా. శాస్త్రజ్ఞానమునందు అనుభవమునందును పరిపూర్ణుడై యారితేరి, ఉచిత చికిత్సాదివిధానక్రియలయందు సమర్థుడై దయాపరుడైనవైద్యునియందు తనశరీరమును కాపాడునట్టిభారమును సందేహపడక నిలిపి నిశ్చింతగానుండురాజును, ఆరోగ్యమును గోరుసామాన్యులునుగూడ అధికమైనతేజస్సును, ఆరోగ్యమును, కీర్తిని, ప్రభావమును, దీర్ఘాయువును, విశేషముగ భోగానుభవమును నిరంతరముగ బొందజాలగలరు.

ఇతి పరహితసంహితాయాం తృతీయోఽధికారః.

# పరహితసంహిత

## అథాతురవృత్తాధికారః, చతుర్థాఽధికారః

### రోగపరీక్షావశ్యకత

మూ. రోగమాదౌ పరీక్షేత తదనన్తరమౌషధమ్,
ఆరమ్భేత్వన్యథా స్యాద్ధి విద్యాహాన్యయశో భవేత్. ౧

వ్యా. చికిత్సచేయ నుద్యమించినశాస్త్రీయవైద్యుడు తొలుత రోగమును సవిమర్శముగ బరీక్షించి యియ్యది నిర్ణయించి పిమ్మటనౌషధమును తదనుగుణముగ నిర్ణయించి చికిత్సచేయ నారంభించవలెను. రోగపరిజ్ఞానములేకయే చికిత్సచేయ నారంభించినచో దనచేయుచికిత్స సఫలముగాకపోవును. దానంజేసి తనకుగల్గబోవులాభమునకును విద్యకును హానియు, అపకీర్తియు తప్పక సంభవించును. (కావున తొలుత రోగమును శాస్త్రపరిజ్ఞానముచేతను యుక్తిచేతను చక్కగ గమనించి తత్తదనుగుణముగ చికిత్సచేయ నారంభించుట సమంజసమని భావము).

### త్రివిధరోగములు

మూ. దృష్టాపచారజః కశ్చిత్ కశ్చిత్పూర్వాపచారజః,
తత్సఙ్కరాద్భవత్యన్యః వ్యాధిరేవం త్రిధా స్మృతాః. ౨

వ్యా. రోగములలో గొన్నిదృష్టాపచారజములు. (లోకమున ప్రత్యక్షములుగ గనబడుమిథ్యాహారవిహారాదులచే సంభవించునవి). మరికొన్నివ్యాధులు పూర్వాపచారజములు. (పూర్వజన్మమున దనచే జేయంబడినపాపకృత్యములచే సంభవించినవి). మరికొన్ని పైజెప్పిన (దృష్టాపచార-పూర్వాపచార) కారణముల రెంటిసంసర్గమున కల్గినవి. ఇట్టికారణభేదములచే దృష్టాపచారజములు, పూర్వాపచారజములు, ఉభయసంకరజములు నని వ్యాధులు సంగ్రహముగ మూడుతెఱంగులు.

### త్రిదోషములకు సర్వరోగముఖ్యకారణత్వము.

మూ. దృష్టాపచారాత్పాపాద్వా ద్వయాద్వా వికృతిం గతాః,
దోషా ఏవ హి సర్వేషాం రోగాణామేకకారణమ్. 3

వ్యా. దృష్టాపచారములగు నపథ్యాహారవిహారాదులచేనైనను, పూర్వజన్మమున జేసిన పాపకృత్యములచేనైనను, ఈరెండుకారణముల సంసర్గముచేనైనను వాతపిత్తకఫము

లను దోషములు మూడును ప్రకుపితములై నానావిధరోగములకును ముఖ్యకారణమగును. (దోషవైపరీత్యములేక రోగములు జనించవు; కావున కారణాంతరములచే ప్రకోపించి వైపరీత్యమునొందిన త్రిదోషములే రోగముల కన్నింటికిని ముఖ్యకారణము లగు నని భావము).

త్రివిధరోగశమనోపాయములు

మూ. అపథ్యానుగుణారమ్భైః పథ్యైర్యోగదపథ్యజః,
అపథ్యేన వినా కర్మ తత్ క్షయాదుభయోద్భవః. ४
అపథ్యేఽల్పేమహారమ్భైః ప్రశామ్యేదుభయేన చ,

వ్యా. మనుజులు ఏవిధములగు నపథ్యములజేయుదురో దాని కనుగుణముగ జ్వరాదిరోగములు కల్గును; కావున నారోగములు (దృష్టాపచారములు) పథ్యసేవనముచే శాంతినొందును. అపథ్యసేవనములేకయే కేవలము పూర్వజన్మకృతపాపకర్మవలనబుట్టిన (పూర్వాపచారజ)రోగములు అట్టి కర్మశేషము నివర్తింప శాంతినొందును. కొంచెముగ నపథ్యములసేవించుటచేతను జన్మాంతరకృతకర్మబాహుళ్యముచేతను ప్రబలముగ పుట్టిన (దృష్టాపచార-పాపకర్మసంసర్గజ) రోగములు పథ్యసేవనముచేతను పాపకర్మనశించుటచే తను (ఈరెంటిచేత) శమించును.

ఈవిషయమునే వాగ్భటాచార్యులు "విపక్షశీలనాత్పూర్వాః, కర్మజాః కర్మసంక్షయాత్, గచ్ఛత్యుభయజన్మాతు దోషకర్మక్షయాత్ క్షయమ్" అనుశ్లోకముచే విస్పష్టముగ జెప్పిరి.

దోషముల చయ-ప్రకోప-ప్రశమలక్షణములు

మూ. వృద్ధిః క్షయో వా వికృతిః సమానపరిశీలనాత్. ५
చయో వృద్ధిస్స్వధామ్న్యేవ ప్రద్వేషో వృద్ధిహేతుషు,
విపరీతగుణేచ్ఛా చ; కోపస్తూన్మార్గగామితా. ६
అజ్ఞానాం దర్శనాస్వేషాం అస్వాస్థ్యం రోగసమ్భవః,
క్షయస్స్వరూపస్త్రిదినమసమానని షేవణాత్. ७
క్షయహేతుషు విద్వేషో రుచిర్వస్తుగుణేషు చ,
స్వస్థానస్థస్య సమతా వకారాసమ్భవశ్శమః. ८

వ్యా. దోషములు స్వప్రమాణమునకంటె నధికముగ వృద్ధినందినను, లేక స్వప్రమాణమునంటె క్షీణించినను అయ్యది దోషములవికృతి యనబడును. ఇట్టివికృతి దోషములను సమస్థితికి దెచ్చునాహారవిహారాదులచే శాంతినొందును. వాతాదిదోషములు తమ

స్థానమునందే వృద్ధినందిన నయ్యది చయ మనబడును. అట్టిదోషములు చయావస్థనొంది నపుడు నాయాదోషముల వృద్ధినొందించుగుణములయందు ద్వేషంబును, వానిక్షయమునకు హేతువులయందు అభిలాషయు జనించును.

(వాతము చయమునొందినపుడు వాతవృద్ధికి హేతువులగురూక్షాదిగుణములు గల వస్తువులయందు ద్వేషంబును, వాతక్షయమునకు కారణములైన స్నిగ్ధాదిగుణములు గలవస్తువులయం దభిలాషయు బొడమును. అట్టిలక్షణములనుబట్టి వాతము చయావస్థ (స్వస్థానమునందేవృద్ధి) నొందినదని యెఱుంగదగును. ఇట్లేయగుననే పిత్తకఫములకును వృద్ధిహేతువులను క్షయకారణములను గమనించి చయావస్థను నిర్ణయించునది.)

మరియు వాతాదిదోషములు వానివానికి నిర్ణయింపబడిన నెలవులవిడిచి మార్గాంతరములనుండి స్థానాంతరమునకుబోయి సంచరించిన నయ్యది ప్రకోప మనబడును. అట్టియెడ వాతాదిదోషముల ప్రకోపమునకు వేరువేరుగ జెప్పబడినలక్షణములు గానబడును. అట్టి ప్రకోపముచే శరీరము స్వస్థతతప్పి రోగములు కల్గును.

మరియు మూడుదినములు వాతాదిదోషములకువిషమములగుగుణములు కలవస్తువుల సేవించిన నాయాదోషములు క్షీణించును. అట్టిక్షయమునందు క్షయమునకు హేతువులైన గుణములు గలవస్తువులయందు ద్వేషముకల్గి రుచింపకుండును. ఈలక్షణమునుబట్టియే దోషము క్షీణావస్థ నున్న దని యెఱుంగునది.

మరియు దోషములు స్వస్థానమున వృద్ధిక్షయములులేక సమస్థితినుండినచో నప్పుడు వికృతిచెందకయుండును. అదియే దోషసామ్యావస్థ, అప్పుడు దోషములు శమనముననున్న వని యెఱుంగునది.

### త్రిదోషములకు కాలకృతచయాద్యవస్థలు

మూ. చయప్రకోపప్రశమాః వాయోః గ్రీష్మాదిషు త్రిషు,
వర్షాదిషు తుపిత్తస్య శ్లేష్మణశ్శిశిరాదిషు.
ఇతి కాలస్వభావోఽయం.........

వ్యా. గ్రీష్మ-వర్ష-శరదృతులయందు వాతము క్రమముగ చయ-ప్రకోప-ప్రశమావస్థలనొందును. (వాతము గ్రీష్మఋతువునచయంబును, వర్షఋతువున ప్రకోపంబును, శరదృతువున శమంబును నొందునని భావము)

మరియు వర్ష-శరత్-హేమంతఋతువులయందు పిత్తము క్రమముగ చయ-ప్రకోప-ప్రశమముల నొందును. (పిత్తము వర్షఋతువున చయంబును, శరదృతువున ప్రకోపంబును, హేమంతమున ప్రశమంబును నొందు నని భావము).

మరియు శిశిర-వసన్త-గ్రీష్మఋతువులయందు కఫము వరుసగ చయ-ప్రకోప-ప్రశమములనొందును. (కఫము శిశిరఋతువున చయంబును, వసంతఋతువున ప్రకోపమును, గ్రీష్మఋతువున ప్రశమమును నొందు నని భావము).

ఇత్తెఱంగున వాతపిత్తకఫములకు చయప్రకోపప్రశమావస్థలు ఆయాఋతుస్వభావమునం గల్గును. కావున నిది కాలకృత మగు నవస్థాభేదములు.

ఆహారాదివశమున చయాదులుగల్గుట

మూ. .........ఆహారాదివశాత్పునః,

చయాదీన్ యాన్తి సద్యోఽపి దోషాః కాలేఽపి వా నతు. ౧౦

వ్యా. మరియు వాతాదిదోషములు అన్నపానాదిరూపములగు నాహారభేదముచేతను విహారాదులభేదముచేతను, తత్క్షణముననే (పైజెప్పినకాలనియతినపేక్షింపకయే) చయప్రకోపప్రశమముల నొందును. మఱియు అన్నము, పానము, రసాయనము, వాజీకరణము, వమనము, విరేచనము మొదలగువాని ప్రయోగముల నుపయోగించినచో వాని సామర్థ్యమునంజేసి వాతాదిదోషములు వాని చయాద్యవస్థలకు నియతములగు కాలమునందును చయప్రకోపప్రశమముల జెందకుండును. (పైనియమముచేత వాతాదిదోషములు చయాద్యవస్థలనొందుటకు పైజెప్పిన కాలనియమమునకంటె నాహారవిహారాదులే ముఖ్యకారణము లని తేలుచున్నది.)

వాతము ప్రకోపించుటకుకారణములు

మూ. తిక్తోషణకషాయాల్పరూక్షప్రమితభోజనైః,
ధారణోదీరణనిశాజాగరాత్యుచ్చభాషణైః. ౧౧
క్రియాతియోగభీశోకచిన్తావ్యాయామమైథునైః,
గ్రీష్మాహోరాత్రిభుక్తాన్తే ప్రకుప్యతి సమీరణః. ౧౨

వ్యా. చేదు, కారము, వగరు అనునీరసములుగల పదార్థముల భుజించినను, మిక్కిలి కొంచెముగ భుజించినను, జిడ్డులేక రూక్షములుగనుండు పదార్థముల భుజించినను, నియతకాలము నతిక్రమించి భుజించినను, మలమూత్రాదులు వెడలనున్నతరి వానిని వెడలనీయక నిరోధించి వేగమునాపియున్నను, వానివేగము లేనియపుడు బలవంతముగ మలమూత్రాదులవెడలించినను, రాత్రులయందు నిదురమేల్కాంచియున్నను, మిక్కిలి బిగ్గరగ మాట్లాడినను, వమనము విరేచనము మున్నగుపంచకర్మములను వానిప్రమాణము నతిక్రమించి యధికముగ జేసికొన్నను, భయపడినను, దుఃఖించినను, మనస్సున మిక్కిలి చింతించినను, దేహపరిశ్రమము అధికముగ జేసినను, తనబలమునకు మిక్కుటముగ సంభోగము జేసి

నను, ఇట్టికారణములచేత వాతము ప్రకోపముచెందును. మరియు గ్రీష్మకాలమునందును, పగటియన్నమున (మూడవభాగమున)ను, రాత్రికడపటిమూడవభాగమునను, భుజించిన యాహారము జీర్ణమగుసమయమందును, కూడ వాతము ప్రకోపించును.

పిత్తప్రకోపకారణములు

మూ. పిత్తం కట్వమ్లతీక్ష్ణోష్ణపటుక్రోధవిదాహిభిః,
శరన్మధ్యాహ్నరాత్ర్యర్ధవిదాహసమయేషు చ. ౧౩

వ్యా. కారము పులుపుగలపదార్థములభుజించినను, తీక్ష్ణగుణముకల ఆహారము మున్నగు వానిని సేవించినను, ఉష్ణవీర్యంబును గుణంబును కలపదార్థములను, ఉప్పుగలపదార్థములను, మంటపుట్టించుపదార్థములను భుజించినను, కోపపడినను పిత్తము ప్రకోపించును. మరియు శరదృతువునందును, మధ్యాహ్నకాలమునను, అర్ధరాత్రికాలమునను, భుజించినయాహారము జీర్ణించుమధ్యకాలమునందునుగూడ పిత్తము ప్రకోపించును.

కఫ-ద్వంద్వప్రకోపకారణములు

మూ. స్వాద్వమ్లలవణస్నిగ్ధగుర్వభిష్యంది శీతలైః,
ఆస్యాస్వప్నసుఖాజీర్ణదివాస్వప్నాతిబృంహణైః. ౧౪
ప్రచ్ఛర్దనాద్యయోగేన భుక్తమాత్రవసన్తయోః,
పూర్వాహ్నే పూర్వరాత్రే చ శ్లేష్మాద్వన్ద్వస్తుసంకరాత్. ౧౫

వ్యా. మధురరసంబులును, ఆమ్లరసంబులును, లవణరసంబులు నగుపదార్థముల భుజించినను, స్నిగ్ధంబులును (మిక్కిలి జిడ్డుగల్గినవియు), అజీర్ణమును కల్గించునవియు, నాసారంధ్రములు మున్నగుస్రోతోమార్గముల ద్రవముబుట్టించునవియు, గుణవీర్యములచే శీతలంబులును నగుపదార్థముల భుజించినను, ఎల్లప్పుడు కూర్చొనియుండినను, నిదురించినను, సుఖము నధికముగ ననుభవించుచున్నను, భుజించినయాహారము జీర్ణముగాకున్నను, పగటి పూట నిదురించినను, శరీరమును బలియజేయుపదార్థముల నధికముగ నుపయోగించినను, అవసరమైనప్పుడు వమనవిరేచనాదులచే శోధనముచేసికొనకున్నను, కఫము ప్రకోపించును. మరియు భోజనముచేసినవెంటను, వసంతఋతువునందును, రాత్రియొక్కయు పగటి యొక్కయు మొదటిమూడవభాగమునందును కఫము ప్రకోపమునొందును. మరియువాత పిత్తకఫములకు మూటికిని వేరువేరుగ జెప్పినకారణములతో రెండేసిదోషములకారణములు సంక్రమించినపుడు రెండేసిదోషములు ప్రకోపించును. ఇదియే ద్వంద్వజవ్యాధికికారణ మగును.

**త్రిదోష(సన్నిపాత)ప్రకోపకారణములు**

మూ. మిశ్రీభావాత్సమస్తానాం సన్నిపాతస్తథా పునః,
సఙ్కీర్ణాజీర్ణవిషమవిరుద్ధాధ్యశనాదిభిః. ౧౬
వ్యాపన్నమద్యపానీయ శుష్కశాకామమూలకైః,
పిణ్యాకమృద్యవసురాపూతిశుష్కకృశామిషైః. ౧౭
దోషత్రయకరై స్తైస్తైః తథాన్నపరివర్తతః,
ఋతో ర్దుష్టాత్ పురోవాతాత్ గ్రహావేశాద్విషాద్గరాత్. ౧౮
దుష్టాన్నాత్పర్వతాశ్లేషాత్ గ్రహైర్జన్మర్క్షపీడనాత్,
మిథ్యాయోగచ్చ వివిధాత్ పానానాం చ నిషేవణాత్. ౧౯
స్త్రీణాం ప్రసవవైషమ్యాత్ తథా మిథ్యోపచారతః,
నిదానమేతద్దోషాణాం...............

వ్యా. పైని త్రిదోషములకు వేరువేరుగ జెప్పబడిన ప్రకోపకారణములు అన్నియుం మిశ్రముగనున్నయెడ దోషములు మూడును సమకాలమున ప్రకోపమునొందును. ఇదియే సన్నిపాతరోగములు గల్గుటకు కారణము. మరియుః—పథ్యములును అపథ్యములునైన యనేకపదార్థముల నొకటిగజేర్చి భుజించుట, ఆహారము జీర్ణముకాని యపుడు మరల భుజించుట, విషమాశనము (అకాలమున భుజించుట, లేక పరిమితి కధికముగనైనను మిక్కిలి తక్కువగనైనను భుజించుట), పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదుల నొకటిగజేర్చి భుజించుట, భుజించినతోడనే మరల భుజించుట, ఇవి మున్నగుభోజనభేదములచేతను త్రిదోషములు సమకాలమున ప్రకోపించును. మరియు పురుగులు మున్నగువానిసంబంధమునంజేసి దుష్టములగుత్రాగుడునీళ్లు మద్యము మున్నగుద్రవపదార్థములద్రావినను, ఎండినకూరగాయలను దుంపలను భుజించినను, తెలికపిండి, మట్టి, యవలు, సారాయి దుర్గంధమైనమాంసము, ఎండినమాంసము, కృశించినజంతువులమాంసము, ఈపదార్థములను భుజించినను త్రిదోషములు ప్రకోపించును. మరియు రసము గంధకము మున్నగుధాతువులసంబంధముచే దుష్టమైనగాలిచేతను, తూర్పుగాలిచేతను, భూతనాదిగ్రహము లావేశించుటచేతను, స్థావరజంగమరూపమైన విషముయొక్కసంబంధముచేతను, శరీరమున నిమిడి జీర్ణముగాకుండువిషముచేతను, అట్టివిషములసంబంధముచే దుష్టమైనయన్నమును భుజించుటచేతను, కొండపై నెక్కుటచేతను, సూర్యాదిగ్రహములలో క్రూరములైనగ్రహములు జన్మనక్షత్రముతో కలియుంటచేతను, పలుదెఱంగులైనవిహారాదులను క్రమము నతిక్రమించిచేయుటచేతను, పలుదెఱంగులైన పానద్రవ్యములను విధినియమము లేక సేవించుట

చేతను, స్త్రీలకు సాధారణముగ గాక అక్రమమైన ప్రసవము కల్గుటచేతను, ప్రసవించిన బాలింతరాండ్రు అపథ్యములగు నాహారవిహారాదుల సల్పుటచేతను, (ఇట్టి కారణములచే గూడ వాతాదిదోషములు మూడును సమకాలమున ప్రకోపించును. ఇట్టి కారణములచే ప్రకుపితములగుమూడుదోషములచే గల్గినరోగములు సాన్నిపాతికములు. ఇత్తెఱంగున వాతపిత్తకఫములు వేరువేరుగను, అన్నియు సమకాలముగ కలిసియు ప్రకోపించుటకు నిదానములు కారణములు చెప్పబడినవి.

## ప్రవృద్ధవాతకృత్యములు

మూ. ................వృద్ధస్తుకురుతేఽనిలః. ౨౦

కార్శ్యకార్ణ్యోష్ణకామిత్వకమ్పానాహశకృద్గ్రహాన్,

బలనిద్రేన్ద్రియభ్రంశప్రలాపభ్రమదీనతాః. ౨౧

వ్యా. వాతము వృద్ధినొందినపుడు శరీరము కృశించును. శరీరము నల్లబడును. వేడిని కోరును. శరీరము వడకును. ఆనాహము (కడుపుబ్బరము) కల్గును. మలము బంధించును. బలమునకును నిద్రకును ఇంద్రియములకును హానికల్గును. అర్థములేక మాటలాడును. చక్రముపైనున్నవానివలె శరీరము తిరుగునట్లుండును. మిక్కిలి దీనముగ మాటలాడును. (వృద్ధినొందినవాతము పైజెప్పినక్రియల జేయుననిభావము)

## ప్రవృద్ధపిత్తకృత్యములు

మూ. పీతవిణ్మూత్రనేత్రత్వాక్ క్షుత్తృట్ దాహాల్పనిద్రతాః

పిత్తం..................

వ్యా. పిత్తము వృద్ధినొందినచో మలము మూత్రము నేత్రములు త్వక్కు ఇవి యన్నియు పచ్చనగును. ఆకలిదప్పులు అధికమగును. నిదుర తగ్గును.

## ప్రవృద్ధశ్లేష్మకృత్యములు

మూ. .............శ్లేష్మాగ్నిసదనప్రసేకాలాస్యగౌరవమ్. ౨౨

శ్వైత్యశైత్యశ్లథాఙ్గత్వం శ్వాసకాసాతినిద్రతాః,

వ్యా. శ్లేష్మము వృద్ధినొందినపుడు జఠరాగ్ని మందగించును. నోట నీరూరును. పనులయందాసక్తిలేక ప్రాలుమాలికగానుండును. శరీరము బరువుగనుండును. శరీరము తెల్లనై చల్లగ నుండును. అవయవములు శిథిలములుగ నడలిన ట్లుండును. శ్వాసకాసంబులును అతినిద్రయు కల్గును. (వృద్ధినొందినకఫము పైజెప్పినలక్షణముల గల్గించు నని భావము).

## ప్రవృద్ధరసరక్తకృత్యములు

మూ. రసోఽపి శ్లేష్మవ ద్రక్తం ప్లీహాపసర్పవిద్రధీన్. ౨౩
కుష్ఠవాతా స్రపిత్తాస్ర గుల్మోపకుశకామలాః,
వ్యఙ్గాగ్నిసాదసమ్మోహార క్తత్వజ్నేత్రమూత్రతాః. ౨౪

వ్యా. రసధాతువు వృద్ధిచెందినచో శ్లేష్మవృద్ధియందు జెప్పబడిన అగ్నిమాంద్యము మున్నగువానిం గలిగించును. రక్తమువృద్ధినొందినయెడ విసర్పము, ప్లీహము, విద్రధి, కుష్ఠము, వాతరక్తము, పిత్తరక్తము, గుల్మము, ఉపకుశమనుదంతరోగము, కామల, వ్యంగము, అగ్నిమాంద్యము, మోహము, చర్మము నేత్రములు మూత్రము అనువీనియందు రక్తవర్ణము, ఇవి మున్నగువికారముల గల్గించును.

## ప్రవృద్ధమాంసమేదోధాతువులకృత్యములు

మూ. మాంసాద్గణ్డార్బుదగ్రన్థిగణ్డోరూదరవృద్ధితాః,
కణ్ఠాదిష్వధిమాంసంచ; తద్వన్మేద స్తథా శ్రమమ్.
అల్పేఽపి చేష్టితే శ్వాసం స్ఫిక్ స్తనోదరలమ్బతాః. ౨౫

వ్యా. మాంసము వృద్ధినొందుటవలన గండము (గండమాలగళగండము) అర్బుదవ్రణము, గ్రంథులు అను నీరోగములు కల్గును. చెక్కిళ్లును, తొడలును, ఉదరంబును బలిసియుండును. కంఠమునందును నోటియందు లోభాగమున దవుడలయందును, నాలుకయందును అధికమాంసము కలుగును.

మరియు మేదస్సు వృద్ధినొందినను పైజెప్పినగండాదిరోగములు కల్గును. మరియు ఎంతమాత్రము పనిచేసినను విశేషముగ శ్రమంబును కలుగును. శ్వాస మధిక మగును. పిరుదులును స్తనంబులును ఉదరంబునులు వృద్ధినొంది వేలునట్లుండును.

## ప్రవృద్ధఅస్థి-మజ్జ-శుక్రములకృత్యములు

మూ. అస్థ్యధ్యస్థ్యధిదన్తాంశ్చ;మజ్జా నేత్రాఙ్గగౌరవమ్,
పర్వసు స్థూలమూలాని కుర్యాత్ కృచ్ఛ్రాణ్యరూంషి చ. ౨౬
అతిస్త్రీకామతాం వృద్ధం శుక్రం శుక్రాశ్మరీమపి,

వ్యా. అస్థివృద్ధినొందినయెడ అస్థులపై నస్థులును, దంతములపై దంతములును కల్గును, మజ్జవృద్ధినొందినచో నేత్రములయందును అవయవములయందును గురుత్వము కలుగును. కృచ్ఛ్రసాధ్యములై స్థూలములైన మూలములు కలపిటకలు వ్రేళ్లగణుపులయందు కల్గును. శుక్రము వృద్ధినొందినయెడ స్త్రీసంబంధమైనకామము మిక్కిలి యధికమగును. శుక్రాశ్మరీరోగము సంభవించును.

### ప్రవృద్ధమలమూత్రములకృత్యములు

మూ. కుక్షౌ వాటోపమాధ్మానం గౌరవం వేదనాం శకృత్. ౨౭
మూత్రం తు వస్తినిస్తోదం కృతేప్యకృతసంజ్ఞతామ్,

వ్యా. మలము వృద్ధిజెందినచో కడుపుబ్బరించును. ప్రేవులు గడబిడగా నరచును. గురుత్వముగా నుండును. శరీరమున వేదనకలుగును. మూత్రము వృద్ధినొందినపుడు పొత్తి కడుపున సూదులపొడిచినట్లు బాధకలుగును. మూత్రము వెడలినను వెడలకున్నట్లు బాధ కలుగును.

### ప్రవృద్ధస్వేదాదికృత్యములు

మూ. స్వేదోఽతిస్వేదదౌర్గన్ధ్యకణ్డూః ఏవం చ లక్షయేత్. ౨౮
దూషికాదీనపి మలాన్ బాహుళ్యగురుతాదిభిః,

వ్యా. స్వేదము వృద్ధిజెందినచో నధికముగ చెమటవెడలును. శరీరముపైని దుర్గంధంబును దురదయుం కల్గును, ఇత్తెరంగుననే కన్నులు చెవులు ముక్కు వీనియందలి మలములవృద్ధిని ఆయాస్థానములయందలి మలాధిక్యమునుబట్టియు, గురుత్వమును దురదను బట్టియు గమనించునది.

### క్షీణవాతకృత్యములు

మూ. లిఙ్గం క్షీణేఽనిలేఽఙ్గస్య సాదోఽల్పం భాషితే హితమ్,
సంజ్ఞానాశస్తథా శ్లేష్మవృద్ధ్యుక్తామయసమ్భవః. ౨౯

వ్యా. వాతము స్వప్రమాణమునకంటె తగ్గి క్షీణించినచో హస్తపాదాద్యవయవములకు వానివానికృత్యములయందు శక్తితగ్గును. స్వల్పముగ సంభాషించును. శరీరముపై ప్రజ్ఞతప్పును. శ్లేష్మవృద్ధిలోజెప్పియున్న అగ్నిమాంద్యాద్యుపద్రవములును కల్గును. (ఈ ప్రకరణమున "క్షీణే" అనుపదమునకు స్వప్రమాణమునకంటె తగ్గినది యని యర్థము. కావున వాతాదులు వానివానిపరిమితికన్న తక్కువగనున్నపుడు ఆయారోగములు కల్గునని యర్థము. అటుగాక వాతాదులు బొత్తుగ నశించినప్పుడు శరీరధారణమున కవకాశమే యుండబోదు).

### క్షీణపిత్తకఫకృత్యములు

మూ. పిత్తే మన్దోఽనలశ్శీతం ప్రభాహానిః; కఫే భ్రమః. ౩౦
శ్లేష్మాశయానాం శూన్యత్వం హృద్ద్రవశ్శ్లథసన్ధితా,

వ్యా. పిత్తము క్షీణించినపుడు అగ్నిమాంద్యంబును, శీతలంబును, శరీరకాంతిహానియు కల్గును. కఫము క్షీణించినయెడల భ్రమము కల్గును. కఫమును స్థానములైన రొమ్ము

శిరస్సు కీళ్లు మొదలగుస్థానములయందు శ్లేష్మము లేకుండును. రొమ్ము నొప్పికల్గును. కీళ్లు సడలును.

క్షీణరసరక్తకృత్యములు

మూ. రసే కార్శ్యం భ్రమశ్శోషః గ్లానిశ్శబ్దాసహిష్ణుతా. 31
రక్తేఽమ్లశిశిరప్రీతిశ్శిరాశైథిల్యరూక్షతాః.

వ్యా. రసధాతువు క్షీణించినపుడు శరీరముపై జిడ్డులేక రూక్షముగ నుండును. లేక శరీరము కృశించును. భ్రమము కల్గును. శోషయు బడలికయు శబ్దమును సహింపలేమియు కల్గును. రక్తము క్షీణించినచో పులుపుకలవస్తువులయందును మిక్కిలి చల్లనైన వస్తువులయందును అభిలాష కల్గును. సిరలు శిథిలములై యుండును. శరీరముపై జిడ్డు లేకుండును.

క్షీణమాంసమేదఃకృత్యములు

మూ. మాంసేఽక్షగ్లానిగణ్డస్ఫిక్ శుష్కతాసన్ధివేదనాః. 32
మేదసిస్వపనం కట్యాః ప్లీహ్నోవృద్ధిః కృశాఙ్గతా

వ్యా. మాంసము క్షీణించినచో ఇంద్రియములకు గ్లానియు, చెక్కిళ్లయందును పిరుదులయందును కృశతయు, సందులయందు సూదులగ్రుచ్చువిధముగ వేదనయు కల్గును, మేదస్సు క్షీణించినపుడు నడుము బలహీనమై చచుబారియుండును. ప్లీహము వృద్ధినొందును, శరీరము కృశించును.

క్షీణాస్థిమజ్జకృత్యములు

మూ. అస్థ్యస్థితోదస్సదనంద న్తకేశనఖాదిషు. 33
అస్థ్నాంమజ్జనిసౌషిర్యంభ్రమస్తిమిరదర్శనమ్.

వ్యా. అస్థులు క్షీణించినచో అస్థులయందు వేదనకల్గును. దంతములు, వెండ్రుకలు, గోళ్లు మున్నగునవి యూడును, మజ్జ క్షీణించినపుడు అస్థులయందు సందు లేర్పడును. చక్రము నున్నవానివలె ఒడలు తిరుగును. చీకటిలో నున్నట్లు కన్నులు గానరాకుండును.

క్షీణశుక్రకృత్యములు

మూ. శుక్రేచిరాత్ప్రసిచ్యేత శుక్రం శోణితమేవ వా. 34
తోదోఽత్యర్థం వృషణయోః మేఢ్రం ధూమాయతీవచ,

వ్యా. శుక్రము క్షీణించినయెడ సంభోగసమయమున చిరకాలమునకు శుక్రము బైలువెడలును, లేక రక్తము బైలువెడలును. మేఢ్రరంధ్రమునుండి పొగవెడలునట్లు బాధకల్గును. అండములయందు అధికముగ నొప్పిపుట్టును,

—— క్షీణమలమూత్రస్వేదకృత్యములు ——

మూ. పురీషే వాయురన్త్రాణి సశబ్దో వేష్టయన్నివ. ౩౫
కుక్షౌ భ్రమతి యాత్యూర్ధ్వం హృత్పార్శ్వే పీడయన్ భృశమ్,
మూత్రే ఽల్పం మూత్రయేత్కృచ్ఛ్రాత్ వివర్ణం సాస్రమేవ వా. ౩౬
స్వేదో రోమచ్యుతిః స్తబ్ధరోమతా స్ఫుటనం త్వచః,

వ్యా. పురీషము క్షీణించినపుడు వాతము శబ్దముతోఁగూడి ప్రేవులను చుట్టునట్లు ఉదరమునందే తిరుగుచు రొమ్మునందును ప్రక్కలయందును అధికముగ బాధకల్గించును. ఒకసమయమున పైకెగసి వ్యాపించును. మూత్రము క్షీణించినసమయమున మూత్రము మిక్కిలి స్వల్పముగనైనను, మిక్కిలి కష్టముగనైనను బైటవెడలును. అట్టిమూత్రము రంగుమారినదియైనను, లేక రక్తముతోఁగూడినదియైనను బైటవెడలును. చెమట క్షీణించినపుడు వెండ్రుకలు రాలును. లేక శరీరముపైనిరోమములు స్తంభించును. చర్మము పగులును.

—— సూక్ష్మమలక్షయలక్షణములు ——

మూ. మలానామతిసూక్ష్మాణాం దుర్లక్షం లక్షయేత్ క్షయమ్,
స్వమలాయనసంశోషతోదశూన్యత్వలాఘవైః. ౩౭

వ్యా. మిక్కిలి సూక్ష్మములగుటంజేసి బహుకష్టముచే గమనింపవలసిన మిక్కిలి సూక్ష్మములైన మలములయొక్క క్షయమును ఆయామలస్థానములయొక్క శోషబాధశూన్యత (మలాభావము) లాఘవము మొదలగులక్షణములచే దెలియనగును.

—— ధాతువులవృద్ధిక్షయములకు కారణములు ——

మూ. స్వస్థానస్థస్య కాయాగ్నేరంశా ధాతుషు సంశ్రితాః. ౩౮
తేషాం సాదాతిదీప్తిభ్యాం ధాతువృద్ధిక్షయోద్భవః.

వ్యా. శరీరమున సంస్థానమునసనుండు కాయాగ్నియొక్క అంశములు ఆయాధాతువులతో సంక్రమించియుండును. ఇదియే ధాత్వగ్ని యని చెప్పబడును. అట్టిధాత్వగ్నులు సమస్థితినున్నప్పుడు ఆయాధాతువు వృద్ధినొందును. అట్టిధాత్వగ్నియొక్క దీప్తి మిక్కిలి యధికమైననాడు ఆయాధాతువులు క్షీణించును. కావున ధాతువులవృద్ధిక్షయములకు ధాత్వగ్నులసమస్థితి అతిదీప్తులు కారణము లని భావము.

—— ధాతువులవృద్ధిక్షయక్రమము ——

మూ. పూర్వో ధాతుః పరాం కుర్యాత్ వృద్ధః క్షీణశ్చ తద్విధమ్,
రసాదిస్తేషు దోషేషు వ్యాధయస్సమ్భవన్తి యే.
తజ్జాతా ఇత్యుపచారేణ తానాహుర్ఘృతదాహవత్. ౪౦

తత్రాస్థిని స్థితో వాయుః పిత్తం తు స్వేదరక్తయోః,
శ్లేష్మా శేషేషు తేనైషా మాశ్రయాశ్రయిణాం మిథః.
యదేకస్య తదన్యస్య వర్ధనక్షపణౌషధమ్.

వ్యా. రసాదిధాతువులలో ముందటిధాతు వొకటి క్షీణించినచో నయ్యది తక్కినధాతువులను వరుసగ క్షీణింపజేయును. అయ్యది వృద్ధినొందినచో తక్కినధాతువులను వరుసగ వృద్ధినొందించును. (రసరక్తాదిధాతువు లేడును ఒకదానివలన నొకటి కల్గును. అట్టియెడ రసధాతువు వృద్ధినొందినచో దాన జనించురక్తధాతువును, రక్తధాతువు వృద్ధినొందినచో దానంగల్గుమాంసధాతువును ఇత్తెఱంగుననే తక్కినధాతువులును వరుసగ వృద్ధినొందును. ఇత్తెఱంగుననే ముందటిధాతువు క్షీణించినచో వరుసగ తక్కినధాతువులును క్షీణించు ననియు భావము) అత్తెఱంగున రసాదిధాతుల నాశ్రయించియుండుదోషములు దుష్టములై వానికి నెలవులైన ధాతువులను చెరిచి రోగముల గల్గించును. అట్టి రోగములు వాతాదిప్రకోపమునగల్గినను వాని కాశ్రయములైనధాతువైషమ్యమున (వృద్ధిక్షయములచేత) గల్గిన వని గౌణముగ వ్యవహరింపబడును.

మరియు వాతము అస్థుల నాశ్రయించియుండును. పిత్తము చెమటను రక్తమును ఆశ్రయించియుండును. కఫము తక్కినమాంసము, మేదస్సు, మజ్జ, శుక్రము అనునాల్గు ధాతువుల నాశ్రయించియుండును. ఇత్తెఱంగున వాతాదిదోషములును రసాదిధాతువులును పరస్పరము ఆశ్రయాశ్రయిభావమునొందియుండును. మరియు పైజెప్పినరీతిగ ధాతువులవృద్ధిక్షయములు వరుసగ నొకటినొకటి యాశ్రయించియుండును కావున ఒక ధాతువును వృద్ధినొందించునౌషధము వేరొకధాతువునకును వృద్ధికరమగును. ఒకధాతువును క్షీణింపజేయునౌషధము వేరొండుధాతువునకు క్షయకరమగును.

## వాతాదిక్షయవృద్ధివికారసామాన్యచికిత్స

మూ. వాయోస్తు వృద్ధిక్షయజాన్ జయేద్బృంహణలఘనైః. ౪౨

వ్యా. వాతముయొక్క వృద్ధిక్షయములచే గల్గురోగములయందు బృంహణౌషధములచేతను లంఘనౌషధములచేతను చికిత్స జేయవగును. (వాతవృద్ధియందు బృంహణౌషధంబుచేతను, వాతక్షయమునందు లంఘనౌషధముచేతను చికిత్సచేయవలెనని భావము).

ఇచ్చట నీవివరణము నెఱుంగునది:—వాతాదిదోషత్రయవృద్ధిక్షయములచే గల్గు రోగములకు చికిత్స జెప్పునప్పుడు వాగ్భటాచార్యులిట్లు చెప్పిరి:—"వృద్ధిక్షయసముద్భవాన్, వికారాన్ సాధయేచ్ఛీఘ్రం క్రమాల్లఘనబృంహణైః, వాయో రన్యత్ర; తజ్జాంస్తు తైరేవోత్క్రమయోజితైః" పైజెప్పినరీతిగ దోషధాతువులు సంతర్పణముచే వృద్ధియు, అపతర్పణముచే క్షయంబును నొందును; కావున అట్టి దోషధాత్వాదివృద్ధిచే

గల్గినరోగములయందు లంఘనచికిత్సయు, క్షయముచే గల్గినరోగములయందు బృంహణ చికిత్సయు చేయవలెను. (ఇది హేతువిపరీతచికిత్స) ఈనియమము వాయువునకుతప్ప తక్కినపిత్తకఫములకు విధింపబడినది. వాతమునకుమాత్రము పైజెప్పిననియమమునకు వ్యతిరేకముగ వాతవృద్ధియందు బృంహణంబును, వాతక్షయమున లంఘనంబును చేయవలెనని యు భావము. ఇదియే దోషధాతుమలములవృద్ధిక్షయములయందు సామాన్యచికిత్స.

రక్తాదిదోషవృద్ధిక్షయజనితరోగచికిత్స

మూ. విశేషాద్రక్తవృద్ధ్యుత్థాన్ రక్తస్రుతివిరేచనైః,
మాంసవృద్ధిభవాన్ రోగాన్ శస్త్రక్షారాగ్నికర్మభిః. ౪౩
స్థౌల్యకార్శ్యోపచారేణ మేదోజానస్థిసంక్షయాత్,
జాతాన్ క్షీరఘృతైస్తిక్తసంయుక్తైర్వస్తిభిస్తథా. ౪౪
విడ్వృద్ధిజానతీసారక్రియయా విట్క్షయోద్భవాన్,
మేషాజమధ్యకుల్మాషయవమాషతిలాదిభిః. ౪౫
మూత్రవృద్ధిక్షయోత్థాంస్తు మేహకృచ్ఛ్రచికిత్సయా,
వ్యాయామాభ్యఞ్జనస్వేదమద్యైస్స్వేదక్షయోద్భవాన్. ౪౬

వ్యా. రక్తవృద్ధిచే గలిగినరోగములయందు రక్తమోక్షణవిరేచనములచే చికిత్స చేయవలెను. మాంసవృద్ధిచే గలిగినరోగములయందు శస్త్రకర్మ, క్షారవిధి, అగ్నికర్మలను చికిత్సచేయవలెను. మేదోవృద్ధివలనం గలిగినరోగములయందు స్థౌల్యోపచారములను, మేదస్సుక్షయించుటచే గలిగినరోగములయందు కార్శ్యమునకు జెప్పినయుపచారములను జేయందగును. అస్థిక్షయమువలనగలిగినరోగములయందు తిక్తద్రవ్యములతోగూడిన క్షీరఘృతములచేతను, వస్తిక్రియలచేతను చికిత్సజేయవలెను. పురీషవృద్ధిచే గలిగినరోగముల యందు అతిసారమునకు జెప్పినచికిత్సలం జేయవలెను. పురీషక్షయమునం గలిగినరోగముల యందు పొట్టేలుయొక్కయు మేకపోతుయొక్కయు మధ్యశరీరమునందలి మాంసముచే చికిత్సజేయవలెను. మరియు మినుములు అలచందలు కారామణులు నువ్వులు మున్నగు మలవృద్ధికరంబులగు ద్రవ్యముల నుపయోగింపంజను. మూత్రవృద్ధియందు ప్రమేహచికిత్స లను, మూత్రక్షయమునందు మూత్రకృచ్ఛ్రమునకు జెప్పినచికిత్సలను జేయనగును. స్వేద క్షయముచే గలిగినరోగములయందు వ్యాయామము, అభ్యంజనము, స్వేదవిధి, మద్యము, అనువానిచే చికిత్సల జేయంజను.

ఇవి రక్తాదిధాతువృద్ధిక్షయములకు విశేషముగ జెప్పబడినచికిత్సలు. మరియు:— మజ్జవృద్ధిచే గలిగినరోగములయందు మధురముగను శీతలముగను ఉండుభోజనములు వాతకరములు. శుక్రవృద్ధిచే గలిగినరోగములయందు సంభోగంబును, వ్యాయామంబును,

శుక్రమును శుద్ధిచేయునట్టి యాహారవిహారాదులు వాతకరములు, ఈవిషయము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది:—"శుక్రమజ్జామయాంసాంతు భోజనం స్వాదు శీతలమ్. శుద్ధివ్యవాయవ్యాయామాయచ్చాన్యచ్ఛుక్రశోధనమ్."

దోషవృద్ధిక్షయశమనోపాయము

మూ. యదన్నం ద్వేష్టి యదపి ప్రార్థయేతాఽవిరోధి యత్,
తత్త్యజన్ తత్ససుశ్నంశ్చ తేతే వృద్ధిక్షయాజయేత్. ౪౭

వ్యా. మనుజుడు ఏవిధమైనయాహారముపై ద్వేషించుచో అట్టియాహారమును వదలి ఏవిధమైనయాహారమును కోరునో యట్టియాహారమును, విరోధమును గలిగించక యుండు ఆహారమును భుజించినయెడ ఆయాదోషములయొక్కయు ధాత్వాదులయొక్కయు వృద్ధిక్షయములు శాంతించును.

దోషధాత్వాదులప్రకోపక్రమము

మూ. చయాత్ క్షయాచ్చ దోషాణాం కోపఃకుర్యాద్భవాంశ్ గదాన్,
దోషాదుష్టారసైర్ధాతూన్ దూషయన్త్యుభయే మలాన్. ౪౮

వ్యా. దోషములు చయావస్థ (స్వస్థానమునసే స్వప్రమాణాధికముగ వృద్ధినొందుట)చేతను, పైజెప్పినరీతిగ (స్వప్రమాణమునకన్న) క్షీణించుటచేతను ప్రకోపము నొందును. మరియు అయోగమిథ్యాగ అతియోగములుగ నుపయోగింపబడిన మధురాదిరసములచేవాతాదిదోషములు దుష్టములై రసాదిధాతువులను దుష్టములుగజేయును. దుష్టములగు దోషంబులును ధాతువులును రెండును పురీషాదిమలములను దుష్టములుగజేయును. అట్టిదోషాదులు నానావిధములగురోగములను గలిగించును.

స్రోతోదుష్టలక్షణము

మూ. అతిప్రవృత్తిస్సఙ్గో వాసరాణాం గ్రన్థయోఽపివా,
విమార్గతోవాగమనం స్రోతసాం దుష్టలక్షణమ్, ౪౯

వ్యా. స్రోతస్సులు దుష్టములైనయప్పుడు ఆయాస్రోతస్సులనుండి స్రవించుమలాదులు అధికముగనైనను వెడలును. లేక బైటవెడలక బద్ధగించును. లేక యవి గ్రంథివలె కఠినములగును. లేక మార్గాంతరములనైన వెడలును. ఇది స్రోతోదుష్టలక్షణము.

దోషధాత్వాదులచే రోగోత్పత్తిక్రమము

మూ. వ్యానేన రసధాతుర్హి విక్షేపోచితకర్మభిః,
యుగపత్సర్వతోఽజస్రం దేహేవిక్షిప్యతే సదా. ౫౦
క్షిప్యమాణః ఖవైగుణ్యాద్రసస్సజ్జతి యత్ర సః,

తస్మిన్ వికారం కురుతే ఖే వర్షమివతోయదః. ౫౧
దోషాణామపి చైవం స్యాత్ ఏకదేశప్రకోపనమ్,
ప్రతిరోగమితి క్రుద్ధా రోగధిష్ఠానగామినః. ౫౨
రసాయనీః ప్రపద్యాశుదోషాదేహేపి కుర్వతే,

వ్యా. (శరీరమునందెల్ల వ్యాపించియుండు) వ్యానవాతముచేత విక్షేపమునకు (పలుతెరంగుల వ్యాపింపజేయుటకు) దగినపనులంజేసి రసధాతువు విక్షిప్తమైన సమకాలమున శరీరమునందెల్ల వ్యాపించుచు నెల్లప్పుడును సర్వశరీరమున నుండును. అట్లు రసధాతువు వ్యానవాతముచే వ్యాపింపజేయునపుడు అట్టి రసధాతువు సంచరించుమార్గము విషమస్థితి నుండుటవలన నయ్యది యెచ్చట నడ్డగింపబడి నిలచునో ఆస్థానమున (ఆకసమున గాలిచే విక్షిప్తమైనమేఘము వర్షించువిధముగ) రోగమును కలిగించును. వాతాదిదోషములును ఇత్తెఱంగుననే శరీరమునం దేకదేశమున ప్రకోపించి రోగమును గలిగించును. మరియు వాతాదిదోషములు మిథ్యాహారాదులచే ప్రకుపితములై ఆయారోగములకు స్థానముల వ్యాపించి రసముప్రవహించు సిరలజేరి శరీరమునం దాయాస్థలములయందు రోగముల గలిగించును. ఇత్తెఱంగుననే ప్రతిరోగమునకును ఉత్పత్తిక్రమము నెఱుంగునది.

—౦ వాతకృత్యములు ౦—

మూ. స్రంసనం సవ్యథస్వాపసాదరుక్తోదభేదనమ్, ౫౩
సఙ్గాఙ్గభఙ్గసఙ్కోచ దన్తహర్షణతర్షణమ్,
కమ్పపారుష్యసౌషిర్య శోషస్పన్దన వేష్టనమ్,
స్తమ్భః కషాయరసతా వర్ణశ్శ్యావోఽరుణోఽపి కా,
కర్మాణివాయోః..................

వ్యా. అంకిలులు మోకాళ్లు మున్నగుకీళ్లు జారుట, నొప్పి, స్పర్శము శరీరమునకు దెలియకుండుట, ఆయాఅవయవములచే జేయవలసినపనులయందు వానివానికి శక్తియుడుగుట, శరీరమున పోటు, సూదులగ్రుచ్చినవిధముగ పోటు, పగులగొట్టబడినవిధముగ బాధ, మలమూత్రాదులు బైటవెడలక యడ్డుపడుట, అవయవములకు భంగముకలుగుట, అవయవములు ముడుచుకొనియుండుట, దంతహర్షము, దప్పికగ్గుట, వణకు, శరీరము పరుషముగనుండుట, అస్థులయందు రంధ్రములుపడుట, శరీరము శుష్కించుట, అవయవము లదరుట, అవయవములు కొంకరులుపోవుట, చేతులు, కాళ్లు మున్నగునవయవములు ముడుచుటకు చాచుటకును వలనుపడక స్తంభించుట, నోరు వగరుగనుండుట, శరీరవర్ణము శ్యామలముగనైనను అరుణవర్ణముగనైన నుండుట ఇవియన్నియు వాతముయొక్క కృత్యములు.

### పిత్తకృత్యములు

మూ. .........పిత్తస్య రాగదాహోష్మ పాకితాః. ౫౫
స్వేదః క్లేదస్స్రుతిః కోథః సదనం మూర్ఛనం మదః,
కటుకామ్లౌ రసౌ వర్ణః పాణ్డు రారుణ వర్జితాః. ౫౬

వ్యా. శరీరము రక్తవర్ణమగుట, శరీరమునందెల్లమంట, ఆవిరివచ్చునట్లుండుట, జీర్ణశక్తికలుగుట, చెమటపట్టుట, చెమ్మకలుగుట, స్రవించుట, కోథము (పైచెప్పినక్లేద మధికమగుట), క్రియలయందు సామర్థ్యములేకుండుట, మూర్ఛకలుగుట, మదము (తిక్కయెత్తినట్లుండుట), కటుకామ్లరసములు, తెలుపు ఎరుపువర్ణములుతప్ప తక్కిన వర్ణములు, ఇవియన్నియు పిత్తముయొక్క కృత్యములు.

### కఫకృత్యములు

మూ. శ్లేష్మణ స్స్నేహ కాఠిన్య కణ్డూ శీతత్వగౌరవమ్,
బన్ధోపలేప స్తైమిత్య శోఫాపక్త్యతి నిద్రతాః. ౫౭
వర్ణ శ్శ్వేతో రసౌ స్వాదులవణౌ చిరకారితా.

వ్యా. స్నేహము (జిడ్డు), కాఠిన్యము, దురద, చల్లదనము, భారము, స్రోతోబంధము, అస్థ్యాదుల కుపలేపము, స్తైమిత్యము (అవయవములపై తడిగుడ్డగప్పినట్లు మొద్దుబారియుండుట), శోఫ (నంజు), అజీర్ణము, అతినిద్ర, తెల్లనిరంగు, మధురలవణరసములు, పనులయం దాలస్యము ఇవియన్నియు కఫముయొక్క కృత్యములు.

### దోషలక్షణప్రయోజనము

మూ. ఇత్య శేషామయవ్యాపి యదుక్తం దోషలక్షణమ్. ౫౮
దర్శనాద్యై ర్భిషక్ తత్ స్తత్సమ్యగుపలక్షయేత్,

వ్యా. ఇత్తెఱంగున పైజెప్పబడినవాతాదిదోషలక్షణములు ఎన్నికలవో అయ్యవి పలుదెఱంగులైన వ్యాధులన్నింటియందు వ్యాపించియుండును. వ్యాధులయొక్క యవస్థాభేదములను విభాగములను జక్కగ దెలిసినవైద్యవరుడు వానిలక్షణములను దర్శన-స్పర్శన-ప్రశ్నాదులచేత సావధానముగ జక్కగ గమనించవలెను.

### రోగద్వైవిధ్యము (నిజాగన్తుభేదము)

మూ. నిజాగన్తు విభాగేన ద్విప్రకారాస్సమాసతః, ౫౯
ఆమయా స్తేషు తు నిజాశ్శారీరా దోషహేతుకాః,
యేభూతవిషవాయ్వగ్ని క్షతభఙ్గాదిసమ్భవాః. ౬౦
రాగద్వేషభయాద్యాశ్చ తే స్యు రాగన్తవోగదాః,

వ్యా॥ రోగములు (అవాంతరభేదములచే నానావిధములుగ నుండినను) నిజములనియు, ఆగంతుకము లని సంగ్రహముగ రెండుతెఱంగులుగ నుండును. అందు వాతపిత్తకఫములను శారీర (శరీరసంబంధములైన) దోషములయొక్క వైగుణ్యమును కారణముగఁజేసి సంభవించుజ్వరాదిరోగములు నిజములు, భూతావేశము, విషము, గాలి, నిప్పు, గాయములు, అస్థిభంగము మున్నగుబాహ్యకారణములచే సంభవించినరోగములును, రాగము ద్వేషము భయము మున్నగుమనోవికారములచే గల్గురోగంబులును ఆగంతువులు.

### సాధ్యాసాధ్యవిభేదములు

మూ॥ సాధ్యోఽసాధ్య ఇతివ్యాధిః ద్విధా తౌ తు పృథగ్ద్విధా,
సుసాధ్యః కృచ్ఛ్రసాధ్యశ్చ యాప్యశ్చాప్యనుపక్రమః.

వ్యా॥ పైజెప్పినరీతిగ నిజాగంతుభేదములచే రెండువిధములైన వ్యాధులును సాధ్యములును, అసాధ్యములు నని రెండువిధములు. మరియు నీరెండువిధములైనవ్యాధులలో సాధ్యములు సుఖసాధ్యములనియు కృచ్ఛ్రసాధ్యములనియు, అసాధ్యములు యాప్యములనియు, అనుపక్రమములనియు రెండేసివిధములు.

### సుఖసాధ్యలక్షణము

మూ॥ సర్వౌషధక్షమే దేహే యూనః పుంసో జితాత్మనః. ౨౨
అకర్మగోఽల్పహేత్వగ్రరూపరూపోఽనుపద్రవః,
అతుల్యదేశదూష్యర్తుప్రకృతిః పాదసంపది. ౨౩
గ్రహేష్వనుగుణేష్వేకదోషమార్గో నవస్సుఖః,
సుఖసాధ్యస్సుఖోపాయః కాలేనాల్పేన జాయతే. ౨౪

వ్యా॥ శరీరము ఔషధముల నోరువజాలియుండి రోగి యౌవనముననుండి ఇంద్రియముల తనవశమున నుంచుకొనియుండువాఁడై, వానికి జనించురోగము పూర్వజన్మకర్మశేషమునం జనించక, స్వల్పకారణములచేత స్వల్పపూర్వరూపములతో గూడి యుపద్రవములు లేక, దేశమునకును దూష్యములగు ఋతువునకును ప్రకృతికిని సమానగుణముకాక పాదచతుష్టయసంపత్తికల్గి తగినయిండ్లలో జనించినరోగము ఒకదోషముచే నొకమార్గముననే నూతనముగ జనించినచో నయ్యది సుఖసాధ్యమగును. అట్టి రోగసుఖోపాయము చేతనే స్వల్పకాలమున సాధింపదగియుండును. కావున నయ్యది సుఖసాధ్యమనబడును.

### కృచ్ఛ్రసాధ్యలక్షణము

మూ॥ కృచ్ఛ్రైరుపాయైః కృచ్ఛ్రస్తు మహద్భిస్సుచిరేణ తు,
అసాధ్య లక్షసఙ్కీర్ణః తథా శస్త్రాదిసాధనః. ౨౫

వ్యా. పైజెప్పినవిషయములకు వ్యతిరేకముగ జనించి శరీరమునకు మిగుల కష్టముల గల్గించి దుర్ఘటములైనయుపాయములచే చిరకాలమునకు మిక్కిలి పూనికతో సాధింపం దగినవ్యాధి కృచ్ఛ్రసాధ్య మనబడును. మరియు సాధ్యాసాధ్యలక్షణములు మిశ్రముగ నుండువ్యాధియు, శస్త్రములు అగ్నిక్షారము విషము మున్నగువానిం బ్రయోగించి సాధింపందగినవ్యాధియు కృచ్ఛ్రసాధ్యమగును.

## యాప్యరోగలక్షణము

మూ. శేషత్వాదాయుషోయాప్యః పథ్యాభ్యాసాద్విపర్యయే
దత్వాల్పం సుఖమల్పేన హేతునా సంప్రజాయతే. ౬౬
యాతి నాఽశేషతాం రోగః కర్మజో నియతాయుషః,
ప్రపతన్నివవిష్టమ్భైః ధార్య స్తంత్రాతురోహితైః. ౬౭

వ్యా. ఆయుశ్శేషముకలవానికి అసాధ్యలక్షణములతో గూడియుండువ్యాధి జనించినచో నయ్యది హితములగు నాహారవిహారాదులచే నాయుశ్శేషకాలము గడపదగినదిగ నుండును. కావున నయ్యది యాప్యము, మరియు యాప్యరోగము చికిత్సాసమయమున కొంచెముగ శమించి మరల స్వల్పకారణముచేనైనను ప్రకోపముజెందును. రోగికి ఆయువు శేషించి యుండుటంజేసి యప్పుడే చంపనోపక, పూర్వకర్మశేషమున జనించుటంజేసి నిశ్శేషముగ శమింపక బాధించుచుండును. కావున నట్టియాప్యరోగములయందు హితములగు నాహారవిహారాదులచే నుపచరించుచుండినయెడ బాధలు తీవ్రతజూపక కొంతమట్టుకు సహ్యముగ నుండును. అటుగాక వ్యతిరేకముగ నాహారాదుల నుపయోగించిన మిక్కిలి తీవ్రములగు బాధలగల్గించును. (ఇది యాప్యమనునసాధ్యము)

## ప్రత్యాఖ్యేయలక్షణము

మూ. పరోఽసాధ్యః క్రియాస్సర్వాః ప్రత్యాఖ్యాయాతివర్తతే,
తస్మాదుపేక్ష్య ఏవాసౌ స్థితోఽత్యన్తవిపర్యయే. ౬౮
ఔత్సుక్యమోహారతి కృద్దృష్టరిష్టోఽక్షనాశనః,
సాధ్యయోరపి సంయోగో బలినోర్యాత్యసాధ్యతామ్. ౬౯

వ్యా. పైజెప్పినసాధ్యలక్షణములకు విరుద్ధముగ అస్థిమజ్జశుక్రధాతువులను మర్మసంధుల నాశ్రయించి జనించి పట్టిచికిత్సలజేసినను వానికి లొంగక శాంతినొందకమిక్కిలి తనతీవ్రతనే జూపుచుండును. అట్టివ్యాధికి చికిత్సజేసియు లాభముకల్గబోదు కావున చికిత్స మానవలెను. ఇదియే ప్రత్యాఖ్యేయ (నిరసింపదగినది) మను నసాధ్యము. మరియు నీయసాధ్యమునందు మిక్కిలి యాశయు, చిత్తనాశంబును, వికార్యమునం దిచ్ఛలేకుండుటయు మరణచిహ్నంబులును చక్షురాదీంద్రియనాశంబును కలుగు.

మఱియు మిక్కిలి బలిష్ఠములైన రెండువ్యాధులు ఏకకాలమున నొకటిగఁగూడి నచో నయ్యవి సాధ్యములుగనున్నను సంసర్గమునంజేసి యసాధ్యమే యగును.

వ్యాధులకు కారణాంతరములచేగల్గు నవస్థాభేదము

మూ. నాసాధ్యస్సాధ్యతాం యాతి సాధ్యో యాతిత్వసాధ్యతామ్,
పాదాపచారాద్దైవాచ్చ యాంత్యవస్థాన్తరం గదాః. ౭౦

వ్యా. అసాధ్యలక్షణములు పూర్ణముగ నుండువ్యాధి యెుకప్పుడును సాధ్యము కానేరదు. సాధ్యలక్షణములు కలవ్యాధియు మిథ్యాహారాదికారణములచే నొకప్పుడు అసాధ్యముగ మారును. కొన్నిసమయములయందు వైద్యుడు ద్రవ్యము పరిచారకులు రోగి యనునట్టిపాదచతుష్టయముయొక్క సంపత్తిభేదముచేతను దైవవశముననుఒక యవస్థయందుండు వేరొకయవస్థాంతరమునొందును. (కృచ్ఛ్రసాధ్యము సుఖసాధ్యముగను, సుఖసాధ్యము కృచ్ఛ్రసాధ్యముగను, సాధ్యము అసాధ్యముగను, ఇత్తెఱంగున నవస్థాభేదముల నొందు నని భావము.)

అరిష్టలక్షణములు

మూ. శిరోరోగారుచిశ్వాస మోహావిడ్భేదతృడ్భ్రమైః,
ఘ్నన్తి సర్వామయాః క్షీణస్వరధాతుబలానలమ్. ౭౧
వాతవ్యాధిరపస్మారీ కుష్ఠరోగ్యుదరీక్షయా,
గుల్మీ మేహీంచ తాన్ క్షీణాన్ వికారాల్పేపి వర్జయేత్. ౭౨

వ్యా. మనుజున కేరోగముకల్గినను అట్టిరోగములయందు శిరోరోగము, అరుచి శ్వాసము, చిత్తభ్రమము, మలము ఉండలుగట్టుట, దప్పి, భ్రమము, అనురోగములు ఉపద్రవములుగ సంభవించినచో మనుజుని చంపును. మరియు నేరోగమునందైనను కంఠస్వరంబును, రసరక్తాదిధాతువులును, శరీరబలంబును, అగ్నియు ఇవియన్నియు క్షీణించినచో రోగిని చంపును. మరియు వాతవ్యాధి, అపస్మారము, కుష్ఠము, ఉదరము. క్షయరోగము, గుల్మము, ప్రమేహము, అను నీరోగములుగలవారికి పైజెప్పినస్వరధాత్వాదులు క్షీణించినచో పైజెప్పినరోగములు స్వల్పముగ నున్నను అట్టిరోగిని విడువందగును. (రోగ మసాధ్యము కావున చికిత్సజేయంజనదని భావము).

మలమూత్రాదులయం దరిష్టలక్షణములు

మూ. మూత్రం పురీషం నిష్ఠ్యూతం రేతశ్చాప్సునిమజ్జతి,
నిష్ఠ్యూతం బహువర్ణం వా యస్య మాసాత్సనశ్యతి. ౭౩

వా. ఏమనుజునిమూత్రమైనను పురీషమైనను ఉమ్మియైనను శుక్రమైనను ఉదకమున నుంచినచో పైకితేలక మునుగునో అట్టిమనుజుడు ఒకమాసమునకు లోపల మృతినొందును. మరియు ఉమ్మి పలువిధరంగులైనవర్ణములు కల్గియున్నను ఒకమాసమునకు లోపల మృతినొందును.

వ్యాధిసామాన్యముగనరిష్టలక్షణములు

మూ. బలమాంసక్షయస్తీవ్రో రోగవృద్ధి రరోచకః,
యస్యాతురస్య లక్ష్యన్తే త్రిపక్షాన్నసజీవతి. ౭౪

వ్యా. శరీరబలంబును మాంసంబును క్షీణించి, రోగము మిక్కిలి తీవ్రముగ వృద్ధినొంది అరోచకముకల్గినచో నట్టిరోగి మూడుపక్షములకు పైని జీవింపనోపడు. (పదునైదుదినములలో మృతినొందుననుట),

చరకమున "త్రీనహాన్నసజీవతి" యనుపాఠ మున్నది. ఈపాఠమున పైలక్షణములు కల్గినరోగి మూడుదినములకుపైని జీవింప డని యర్థము.

వ్యత్యయరూపారిష్టలక్షణములు

మూ. వికారాయస్య వర్ధన్తే ప్రకృతిః పరిహీయతే,
రాత్రౌ దాహో దివా శీతం వ్యత్యాసశ్చన్ద్రసూర్యయోః. ౭౫
యస్యోత్క్లిశ్యేత్ కఫః కణ్ఠం వాతపిత్తాన్వితోఽథవా,
కణ్ఠేచ యస్య స్ఫురణం అఙ్గుళ్యాంచ దినేదినే. ౭౬
సహసాజాయతేయస్యవికారస్సర్వలక్షణః,
నివర్తతే వా సహసా।సహసా సవినశ్యతి. ౭౭

వ్యా. ఏమనుజునకు తనకు స్వాభావికమైనప్రకృతి క్షీణించి వ్యాధులు మిక్కుటముగ వృద్ధినొందునో ఎవనికి రాత్రియందు చంద్రునివలన తాపంబును, పగటియందు సూర్యునివలన చల్లదనంబును స్వభావమునకు వ్యతిరేకముగ దోచునో, ఎవనికి గర్భములో నుండి కఫము కంఠములోని కెగయునో, ఎవనికఫము కఫములతోగూడియుండునో ఎవనికి కంఠమునందైనను అంగుళియందైనను అదరుబాటు ప్రతిదినము కల్గునో అట్టిమనుజుడు శీఘ్రముగ మృతినొందును. మరియు నెవ్వనికి జ్వరాదిరోగములు కారణములేకయే ఆయారోగములకు జెప్పినలక్షణములన్నిటితోగూడి తటాలున సంభవించునో, లేక, చికిత్సాదిప్రతిక్రియలేకయే తటాలున నివర్తించునో అట్టిరోగి యతిశీఘ్రముగ మృతినొందును.

## ఆసన్నమరణలక్షణము

మూ. ఊర్ధ్వశ్వాసం గతోష్మాణం శూలోపహతవంక్షణమ్,
శర్మ చానధిగచ్ఛన్తం బుద్ధిమాన్ పరివర్జయేత్. ౭౮

వ్యా. రోగికి ఊర్ధ్వశ్వాసము జనించి శరీరముపై వేడి యుడిగి చల్లబడి గెజ్జల యందు పోటుపుట్టి యించుకైన సుఖములేక కష్టబడుచున్నరోగి బ్రతుకడు; కావున అట్టిరోగిని బుద్ధిమంతుడగు వైద్యుడు చికిత్సచేయక విడువందగును.

## వైద్యునిపిలువను దూతవచ్చినకాలముచేగల్గు అరిష్టము

మూ. తథార్ధరాత్రే మధ్యాహ్నే సన్ధ్యయోః పర్వవాసరే,
షష్ఠీ చతుర్థీ నవమీ రాహుకేతూదయాదిషు. ౭౯
భరణీ కృత్తికాశ్రేషా పూర్వార్ద్రా పిత్ర్యనైరృతే,
ఆగమిష్యన్తి దూతావా యస్య నాస్త్యస్య జీవితమ్. ౮౦

వ్యా. రోగిచే వైద్యుని బిలుచుటకై పంపబడినభటుడు అర్ధరాత్రియందైనను, మిట్టమధ్యాహ్నమునందైనను, ఉదయసాయంసంధ్యాకాలములయందైనను, అమావాస్య పూర్ణిమ మున్నగు పర్వదినములయందైనను, షష్ఠి నవమి చవితి యనుతిథులయందైనను, రాహుకేతువులకాలమునందైనను, భరణి కృత్తిక ఆశ్రేష పూర్వాషాఢ పూర్వాభాద్ర పూర్వఫల్గుని ఆర్ద్ర మఖ మూల అను నీనక్షత్రములతోగూడిన దినములయందైనను వైద్యునిచెంతకుబోయి పిలిచినచో అట్టిరోగి జీవింపడు.

## ఔషధసంబంధమైనయరిష్టము

మూ. యముద్దిశ్యాతురం వైద్యస్సమ్పాదయితు మౌషధమ్,
యతమానో నశక్నోతి దుర్లభం తస్య జీవితమ్. ౮౧

వ్యా. వైద్యుడు ఏరోగికి వైద్యముచేయుటకై ఔషధమును సంపాదింప బ్రయత్నింప నాయౌషధము దొరకకుండునో అట్టిరోగి జీవించుట దుర్లభము.

## ఔషధసిద్ధిసంబంధమైనయరిష్టము

మూ. విజ్ఞాతం బహుశస్సిద్ధం విధివచ్చోపచారితమ్,
నసిధ్యత్యౌషధం యస్య నాస్తి తస్య చికిత్సితమ్,

వ్యా. ఔషధములజేయువిధానపక్వాదుల జక్కగదెలిసి యనేకపర్యాయములు చేసి యలవాటునయుండిన యౌషధమును ఒకరోగికి చికిత్సకై మరల విధ్యుక్తప్రకారము చేసినను అట్టియౌషధము చక్కగ కుదరక పక్వముచెడినయెడల అట్టిరోగికి చికిత్సజేసియు లాభముండదు. (జీవించుట దుస్తరమని భావము).

### స్వతంత్ర-పరతంత్ర-పూర్వరూప-ఉపద్రవరూపవ్యాధిభేదములు

మూ. ద్విధా స్వపరతన్త్రాభ్యాం వ్యాధయోస్త్యాః పునర్ద్విధా,
పూర్వజాః పూర్వరూపాఖ్యాః జాతాః పశ్చాదుపద్రవాః. ౮౨

వ్యా. వ్యాధులు స్వతంత్రములు, పరతంత్రములు నని రెండు తెఱంగులనుండును. అందు పరతంత్రములనునవి పూర్వరూపములు, ఉపద్రవములు నని రెండు భేదములు కల్గియుండును. అందు తొలుత జనించినరోగము పూర్వరూపము, ఒకవ్యాధి జనించిన పిమ్మట నింకొకవ్యాధికల్గిన నయ్యది యుపద్రవము.

### స్వతంత్రపరతంత్రలక్షణములు

మూ. యథా స్వజన్మోపశమాః స్వతన్త్రాః స్పష్టలక్షణాః,
విపరీతాస్తతోఽన్యేతు, విద్యాదేవం మలానపి. ౮౩

వ్యా. శాస్త్రమున జెప్పియుండుప్రకారము ఉత్పత్తియు, సుఖానుబంధరూపమైన యుపశయంబునుకల్గి, ఆరోగమునకు జెప్పియుండులక్షణములు స్ఫుటముగ గానవచ్చునట్టి రోగము స్వతంత్రమనాబడును. పైజెప్పినలక్షణములకంటె విరుద్ధములగులక్షణములుగలవి పరతంత్ర మనబడును. (స్వతంత్రరోగములవలె స్పష్టమైనలక్షణంబులును శాస్త్రమున జెప్పినరీతిగ నుత్పత్తియు లేక, అస్పష్టమైనలక్షణములు కల్గినది పరతంత్రరోగమని భావము). మరియు వాతపిత్తకఫములను దోషములు మూడునుగూడ ఆయారోగముల యందు స్వతంత్రపరతంత్రభేదములు కల్గియుండును. అట్టిభేదముల వ్యాధులకు జెప్పిన స్వతంత్రపరతంత్రలక్షణములబట్టియే యెఱుంగనగును.

### స్వతంత్ర-పరతంత్రరోగ-చికిత్సాక్రమము

మూ. తేషాం ప్రధానప్రశమే ప్రశమోఽశామ్యతస్తథా,
పశ్చాచ్చికిత్సేత్తూర్ణం వా బలవన్తముపద్రవమ్. ౮౪
వ్యాధిక్లిష్టశరీరస్య పీడాకరతరోహి సః,

వ్యా. స్వతంత్రరోగములు శాంతినొందినచో పరతంత్రరోగములును తమంతట శాంతినొందును. (కావున పరతంత్రరోగములకు ప్రత్యేకముగ చికిత్సజేయ నవసరము లేదనుట). స్వతంత్రరోగములకు జేసినచికిత్సచేతనే పరతంత్రరోగము బలిష్ఠమై యున్నచో స్వతంత్రము శమించినపిదప పరతంత్రమునకు ప్రత్యేకముగ చికిత్సజేయ నగును. మరియు నుపద్రవరూపమైన పరతంత్రరోగము స్వతంత్రమునకన్న బలిష్ఠమై మిక్కిలి బాధాకరముగ నున్ననాడు అట్టిపరతంత్రరోగమునకే చికిత్సను తొలుతజేయుట ముఖ్యము. (కాని అట్టిచికిత్సమాత్రము స్వతంత్రమునకు విరోధి కాకుండవలెను.). అట్టి

స్థితిలో స్వతంత్రవ్యాధిచే మిక్కిలి క్లేశమునొందినరోగికి ప్రబలమైన యుపద్రవము మరింతకష్టములను నిచ్చునట్లు చేయును కావున తొలుతనే స్వతంత్రరోగమునకు విరోధించకుండునట్లు ఉపద్రవమునకు చికిత్సజేయుట ముఖ్యకర్తవ్యము.

## సామనిరామరోగభేదము

మూ. రోగా స్సామనిరామత్వ భేదేన ద్వివిధాః పునః,
ఊష్మణోఽల్పబలత్వేన ధాతు మాద్యమపాచితమ్. ౮౭
దుష్టమామాశయగతం రసమామం ప్రచక్షతే,
అన్యే దోషేభ్యఏవాతి దుష్టేభ్యోఽన్యోన్యమూర్ఛనాత్. ౮౮
కోద్రవేభ్యో విషస్యేవవదన్త్యామస్య సమ్భవమ్,
ఆమేన తేన సంపృక్తాః దోషాదూష్యాశ్చ వర్ధితాః. ౮౯
సామా ఇత్యుపదిశ్యన్తే యేచ రోగా స్తదుద్భవాః,

వ్యా. రోగములు సామములు, నిరామములని రెండు తెఱంగులు. అదియెట్లులన:— భుజింపబడినయాహారమును పచింపజేయుపాచకాగ్ని బలహీనమై యుండుటంజేసి ధాతువులలో ప్రాథమికంబైనరసధాతువు చక్కగ పచనముగాక ఆమాశయమునజేరి వాతాదులచే దుష్టమైనచో నట్టిద్రవరూపమైనరసము ఆమమని చెప్పబడును; మరియు ఆరుకలలోనుండి విషముబుట్టువిధముగ పరస్పరమిశ్రభావమునుజెంది మిక్కిలి దుష్టములైన వాతాదిదోషములనుండి యామము జనించునని కొందరాచార్యులు వచించెదరు; అట్టియామముతో గూడియుండు వాతాదిదోషములును, అట్టివాతాదులచే దూషితములై వృద్ధినొందినరసాదిదూష్యములును, అట్టిదోషదూష్యములవలన సంభవించిన జ్వరాదిరోగములును సామములని చెప్పబడును.

మరియు "ద్రవం గుర్వనేకవర్ణం, హేతుస్సర్వరోగాణాం, స్నిగ్ధపిచ్ఛలమామం, తన్తువదనుబద్ధం, శూలదుర్గన్ధి" అని యామలక్షణమును కొందరాచార్యులు చెప్పిరి. ద్రవరూపమును భారంబును, నానావర్ణంబులునుగల్గి, సర్వరోగములకును హేతుభూతమై, స్నిగ్ధంబును పిచ్ఛిలంబునై తీగెలవలె నుండుద్రవము ఆమము, అయ్యది యనేకోపద్రవములగల్గించును. దుర్గంధముగ నుండు నని భావము.

## సామ-నిరామలక్షణములు

మూ. స్రోతోరోధబలభ్రంశగౌరవానిలమూఢతాః. ౯౦
ఆలస్యాపక్తినిష్ఠీవమలసఙ్గారుచిక్లమాః,
లిఙ్గం మలానాం సామానాం నిరామాణాం విపర్యయః. ౯౧
నిదానమేతత్సామాన్యంవక్ష్యతేఽథచికిత్సితమ్,

వ్యా॰ స్రోతోమార్గములబంధించుట, బలహాని, గురుత్వము, వాతము ధారాళముగ సంచరించకుండుట, కునికిపాటు, ఆహారమును భుజించిన జీర్ణముకాకుండుట, నోటివెంట నీరువెడలుట, మలమూత్రస్వేదాదులు బైటవెడలకుండుట, అరోచకము, బడలిక, అరోచకము ఇవియన్నియు ఆమముతోగూడిన మలములలక్షణములు, పైజెప్పిన స్రోతోబంధాదిలక్షణములు లేకుండుటయే నిరామలక్షణములు. ఇత్తెఱంగున వాతాదులకు సామాన్యమైనవిధానము, చెప్పబడినది. దానికి దగినచికిత్స యీక్రింద వివరింపబడును.

## వాతప్రకోపసామాన్యచికిత్స

మూ. వాతస్యోపక్రమస్స్నేహస్స్వేదస్సంశోధనం మృదు. ౯౨
స్వాద్వమ్లలవణోష్ణాని భోజ్యాన్యభ్యఙ్గమర్దనమ్,
వేష్టనం త్రాసనం సేకః మద్యం పైష్టికగౌడికమ్. ౯౩
స్నిగ్ధోష్ణా వస్తయో వస్తినియమస్సుఖశీలతా,
దీపనైః పాచనైస్సిద్ధాస్స్నేహాశ్చానేకయోనయః. ౯౪
విశేషాన్మేద్యపిశితరసస్తైలానువాసనమ్,

వ్యా॰ స్నేహపానము, స్వేదకర్మ, మృదువైనసంశోధనౌషధసేవనము, మధుర-అమ్ల-లవణరసంబులును ఉష్ణవీర్యంబులునగు భక్ష్యాదుల నుపయోగించుట,అభ్యంగస్నానము, ఒడలు పిసికించుకొనుట, వస్త్రములు మున్నగువానిచే శరీరమును జుట్టుట, భయపఱచుట, దశమూలాదికషాయములచే సేకముచేయుట, పైష్టికము గౌడికమునను మద్యముల పానముజేయుట, స్నిగ్ధముగ నుష్ణముగనుండు కషాయాదులచే వస్తిక్రియజేయుట, వస్తివిధానమున జెప్పినవస్తిక్రియానియమముల దప్పక యాచరించుట, సుఖముగనుండుట యందు అలవాటుజేయుట, అగ్నిని దీపింపజేసి ఆహారమును పచింపజేయు ద్రవ్యముల చేర్చి పక్వముచేయబడిన నువ్వులనూనె మున్నగుస్నేహద్రవ్యములను పానముజేయుట ఇవియన్నియు ప్రకోపించిన వాతమునకు దగిన సామాన్యచికిత్సలు. మరియు పుష్టికరమైన మాంసరసము, తైలము, అనువాసనవస్తి ఇవి వాతమునకు విశేషచికిత్సలు.

అప్రయత్నముగ తటాలున సంభవించినభయము వాతమును ప్రకోపింపజేయును కావున "క్రియాతియోగభీశోక" అనువాక్యమున భయము వాతప్రకోపమునకు కారణముగ జెప్పబడినది. అటుగాక వాతోన్మాదాదిరోగములయందు ప్రయత్నపూర్వకముగ భయపఱచుటవలన వాతప్రకోపము శాంతినొందును. అను నభిప్రాయముచేత నిచ్చోట భయపరచుట వాతశామకముగ జెప్పినది సంగత మని యెఱుంగునది,

### పిత్తప్రకోపసామాన్యచికిత్స

మూ. పిత్తస్య సర్పిషః పానం స్వాదుశీతైర్విరేచనమ్. ౯౧
స్వాదుతిక్తకషాయాణి భోజనాన్యౌషధాని చ,
సుగన్ధశీతహృద్యానాం గన్ధానాముపసేవనమ్. ౯౨
కణ్ఠే గుణానాం హారాణాం మణీనామురసా ధృతిః,
కర్పూరచన్దనోశీరైరనులేపః క్షణేక్షణే. ౯౩
ప్రదోషశ్చన్ద్రమాస్సౌధం హారిగీతం హిమోఽనిలః,
అయన్త్రణసుఖం మిత్రం పుత్రస్సన్దిగ్ధముగ్ధవాక్. ౯౪
ఛన్దానువర్తినో దారాః ప్రియాశ్శీలవిభూషితాః,
శీతామ్బుధారాగర్భాణి గృహాణ్యుద్యానదీర్ఘికాః. ౯౫
సుతీర్థవిపులస్వచ్ఛసలిలాశయసైకతే,
సామ్భోజజలతీరాన్తే కాయమానే ద్రుమాకులే. ౯౬
సౌమ్యా భావాః పయస్సర్పిః విరేకశ్చ విశేషతః,

వ్యా. ఘృతపానము, మధురముగ శీతవీర్యముగనుండు నౌషధములచే విరేచనము చేయించుట, మధుర-తిక్త-కషాయరసములుగల యాహారములభుజించుట, అట్టిరసములుగల యౌషధములసేవించుట, మంచిపరిమళంబును చల్లదనంబును కల్గి మనసునకింపైనవాసనల నాఘ్రాణించుట, ముత్యాలహారముల కంఠమునదాల్చుట, మరకతము చంద్రకాంతము పద్మరాగము మున్నగుమణులను రొమ్మునధరించుట, పచ్చకర్పూరమును చందనమును వట్టివేరును పలుమారు మేన నలదికొనుట, సాయంకాలమును సేవించుట, గారచే తెల్లగ శుభ్రముగనుండు గృహమున వసించుట, వెన్నెలలో విహరించుట, మనోహరమగుసంగీతమును వినుట, చల్లని మెల్లగాలిని సేవించుట, నిర్బంధములేనిమిత్రునితో స్వేచ్ఛగ సల్లాపముచేయుట, వచ్చిరానిమాటల మాటలాడుపుత్రునితో నాటలాడుట, తనయిష్టము ననుసరించి నటించుచు మిక్కిలిప్రేమగల్గి మంచిస్వభావముగల భూషణములధరించినప్రియరాండ్రతో సరససల్లాపాదిక్రీడలసల్పుట, చల్లని నీటిధారలతోఁగూడిన యిండ్లయందును ఉపవనములయందును నడబావులయందును విహరించుట, స్వచ్ఛమై విశాలమైనజలముగల సరోవరముల యిసుకదిబ్బలయందును, కమలములుగల సరోవరతీరములందును పలుదెఱఁగులైన వృక్షములచే సంకులమైనమందిరులయందును వసించుట, ఇవియన్నియుం పిత్తము ప్రకోపించినపుడు చేయదగినసామాన్యచికిత్సలు. సౌమ్యములగు పదార్థముల సేవించుటయు పిత్తమును శమింపజేయును. మరియుం ఘృతపానము విరేచనము ఈరెండును పిత్తప్రకోపమున విశేషచికిత్సలు. (ముఖ్యమైనచికిత్స యని భావము).

## కఫప్రకోపసామాన్యచికిత్స

మూ. శ్లేష్మణో విధినా యుక్తం తీక్ష్ణం వమనరేచనమ్. ౯౭
అన్నం రూక్షాల్పతీక్ష్ణోష్ణం కటుతిక్తకషాయకమ్,
దీర్ఘకాలస్థితం మద్యం రతిప్రీతిః ప్రజాగరః. ౯౮
అనేకరూపో వ్యాయామః తీక్ష్ణం రూక్షం విమర్దనమ్,
విశేషాద్వమనం యూషః క్షౌద్రం మేదోఘ్నమౌషధమ్. ౯౯
ధూమోపవాసగణ్డూషాః నిస్సుఖత్వం సుఖాయ చ,

వ్యా. శాస్త్రవిధి ననుసరించి తీక్ష్ణమైనయౌషధాదులచే వమనవిరేచనములను జేసికొనుట, రూక్షంబును తీక్ష్ణంబును ఉష్ణంబును కటుతిక్తకషాయరసభూయిష్ఠంబును నగు నాహారపదార్థముల భుజించుట, అట్టి యాహారమును కొంచెముగ సేవించుట, మిక్కిలి ప్రాతదియగుమద్యమును సేవించుట, రతిసౌఖ్యమును అనుభవించుట, రాత్రులయందు విశేషముగ నిదుర మేల్కొంచియుండుట, విల్లు నెక్కువెట్టుట, కుస్తీమున్నగుపనులచేయుట మున్నగు శరీరపరిశ్రమమును విశేషముగ జేయుట, చింత, రూక్షత, మర్దనము ఇవియన్నియు కఫము ప్రకోపించినపుడు చేయదగినసామాన్యచికిత్సలు. మరియు వమనము, యూష, మాక్షికమను తేనె, మేదోహరములగునౌషధాదులు ధూమపానము, ఉపవాసము, గండూషము, మిక్కిలి సౌఖ్యములేకుండుట ఇవియన్నియు కఫప్రకోపమున విశేషచికిత్సలు. (ఇవి ప్రధానము లనిభావము).

## సంసర్గ-సన్నిపాతచికిత్స

మూ. ఉపక్రమః పృథగ్దోషాణాం యోఽయముద్దిశ్య కీర్తితః. ౧౦౦
సంసన్నిపాతేషుకుపితం యథాస్వం వికల్పయేత్,

వ్యా. ప్రకోపముచెందిన వాతాదిదోషముల నుద్దేశించి వేరువేరుగ పైజెప్పబడిన సంసర్గసన్నిపాతములయందును ప్రకుపితములగువాతాదిద్విదోషసంసర్గమును నిరూపించి తత్తదనుసారముగ రెండేసిదోషములకు జేరిన చికిత్సలకలిపి చేయవలెను. త్రిదోషముల ప్రకోపరూపమైన సన్నిపాతమునందు త్రిదోషములకు వేరువేరజెప్పిన చికిత్సలంగలిపి చేయనగును.

ఎట్టులనః—వాతపిత్తసంసర్గమున వాతపిత్తములకు వేరువేరజెప్పిన చికిత్సలను మిశ్రముగను, వాతకఫసంసర్గమున నారెంటికిని వేరువేరజెప్పినచికిత్సల మిశ్రముగను, పిత్తకఫములసంసర్గమున పిత్తకఫలకు వేరువేరజెప్పినచికిత్సల మిశ్రముగను, సన్నిపాతమున త్రిదోషములకు వేర్వేరజెప్పినచికిత్సల మిశ్రముగను జేయవలెనని భావము.

వాతపిత్తసంసర్గాదిచికిత్సాక్రమము

మూ. గ్రైష్మః ప్రాయో మరుత్పిత్తే వాసన్తః కఫమారుతే. ౧౦౧
మరుతో యోగవాహిత్వాత్ కఫపిత్తే తు శారదః,

వ్యా. వాతపిత్తసంసర్గమునందు ఋతుచర్యాధ్యాయమున గ్రీష్మఋతుచర్యకు జెప్పిన లవణాదులవర్జించి మధురముగ నుండునన్నాదుల భుజింపవలెను. కఫవాతముల సంసర్గమునందు వసంతఋతుచర్యకుం జెప్పిననియమముల నాచరింపనగును. కఫపిత్తసంసర్గమున శరదృతుచర్యయందు జెప్పిననియమముల ప్రాయికముగ నవలంబింపనగును. మరియుం సన్నిపాతమునందు వర్షర్తువునకు జెప్పినక్రమము నవలంబించుట యుక్తము.

సంసర్గసన్నిపాతమునచికిత్సాకాలము

మూ. చయఏవ జయేద్దోషం కుపితం త్వవిరోధయన్. ౧౦౨
సర్వకోపే బలీయాంసం శేషదోషా విరోధతః,

వ్యా. వాతాదిదోషములలో నొకదోషము ప్రకోపించినపుడు అట్టిదోషమునకు విరోధము కల్గకుండునట్లు తక్కినదోషములకు చయావస్థయందే ప్రకోపమునొందనీయక చికిత్సజేయవలెను. దోషములన్నియు ప్రకోపించినపుడు వానిలో నేదోషము ప్రబలముగనుండునో దానికి తక్కినరెండుదోషములకు విరోధములేకుండునట్లు తోలుక చికిత్స జేయవలెను.

చికిత్సాయోగశ్రేష్ఠత్వము

మూ. ప్రయోగశ్శమయేద్వ్యాధీన్ యోఽన్యమన్యముదీరయేత్.
నాసౌ విశుద్ధశ్శుద్ధస్తు శమయేద్యోన కోపయేత్,

వ్యా. ఒకవ్యాధిని శమింపజేసి యితరములగువ్యాధులను ప్రకోపింపజేసెడి చికిత్సాప్రయోగము ప్రశస్తముకాదు. ఇతరవ్యాధులను ప్రకోపింపజేయకయే ప్రకుపితమైన వ్యాధినిమాత్రము శమింపజేయుచికిత్సాప్రయోగము మిగుల ప్రశస్తము. కావున నితరవ్యాధుల విరోధములేక ప్రకృతవ్యాధికి చికిత్సజేయవలెను.

సామదోషచికిత్సావిశేషవిధానము

మూ. సర్వదేహప్రవిసృతాన్ సామాన్ దోషాన్న నిర్హరేత్. ౧౦౪
లీనాన్ ధాతుష్వనుత్క్లిష్టాన్ ఫలాదామాద్రసానివ,
ఆశ్రయస్య హి నాశాయ తే స్యుర్దుర్నిర్హరత్వతః. ౧౦౫

వ్యా. దేహమునందెల్ల వ్యాపించినవిగను, రసాదిధాతువులయందు లీనములుగను, స్వస్థానమునుండి చలించినవిగను, ఆమముతోగూడినవిగను నుండువాతాదిదోషములను

శుద్ధిచేయుట యశక్యంబు కావున అట్టిస్థితినుండు వాతాదిదోషములను వమనవిరేచనాదులచే శోధనచికిత్స చేయంజనదు. చక్కగ పండినమామిడి మొదలగుఫలములనుండి తీయబడినరసము దాని కాశ్రయమైనఫలమునకు నాశమును గల్గించునట్లు వమనాదులచే శోధనముచేయబడిన వాతాదిదోషములు వానికాశ్రయమైనశరీరమును తప్పక చెరచును. (కావున పైజెప్పినయవస్థనుండుదోషములకు శోధనచికిత్స చేయంజనదని భావము).

సర్వశరీరగతసామరోగచికిత్సాక్రమము

మూ. పాచనైర్దీపనైస్స్నేహైస్తాన్ స్వేదైశ్చ పరిష్కృతాన్,
శోధయేచ్ఛోధనైః కాలే యథాసన్నం యథాబలమ్. ౧౦౬

వ్యా. పాచనంబులును అగ్నిదీపనంబులు నైనస్నేహస్వేదములచే సంస్కరింపబడిన ఆమయుక్తవాతాదిదోషములను ఆయాదోషములకు సమీపముననుండుమార్గములను రోగియొక్క బలాబలస్థితిని అనుసరించి తత్తదనుగుణముగ మృదు-మధ్య-తీక్ష్ణరూపములగు శోధనౌషధములచే శాస్త్రవిధి ననుసరించి యుచితకాలమున శోధనచికిత్స జేయవలెను.

శోధనద్రవ్యోపయోగమార్గములు

మూ. హన్త్యాశు యుక్తం వక్త్రేణ ద్రవ్యమామాశయాన్మలాన్,
ఘ్రాణేన చోర్ధ్వజత్రూత్థాన్ పక్వాధానాద్గుదేన తు. ౧౦౭

వ్యా. నోటిమార్గముగ నుపయోగింపబడిన శోధనౌషధము ఆమాశయముననుండు మలమును శీఘ్రముగ హరించును. నాసారంధ్రములనుండి యుపయోగింపబడినశోధనౌషధము మెడకు పైభాగముననుండుమలమును శీఘ్రముగ హరించును. గుదద్వారమునుండి యుపయోగింపబడినశోధనౌషధము పక్వాశయముననుండుమలముల శీఘ్రముగ హరించును.

ఆమధారణనిషేధము

మూ. ఉత్క్లిష్టానధ ఊర్ధ్వం వానచామాన్ వహితః స్వయమ్,
ధారయేదౌషధైర్దోషాన్ విధృతాస్తే హి రోగదాః. ౧౦౮
ప్రవృత్తాన్ ప్రాగతో దోషానుపేక్షత హితాశినః,
విబద్ధాన్ పాచనైస్తైస్తైః పాచయేన్నిర్హరేతవా. ౧౦౯

వ్యా. స్వస్థానమునుండి చలించి యధోమార్గమునుండియైనను ఊర్ధ్వమార్గమునుండియైన ఔషధములచేగాక తమంతటనే బైటవెడలునట్టి యామదోషములను స్తంభనౌషధములచే వెడలనీయక నిరోధింపజనదు. అటుగాక అట్టిదోషములను నిరోధించినయెడ నయ్యవి జ్వరాదిరోగముల గల్గించును; కాబట్టి బైలువెడలుదోషముల నుపేక్షింపవలెను గాని తొలుత నౌషధాదులచే నిరోధింపదగదని భావము. తనంతటబైటవెడలి కొంచెము

శేషించియుండుదోషములను శాస్త్రమున జెప్పబడిన ఆయాపాచనౌషధములచే జీర్ణంబగు నట్లు చేయవలెను. లేక శోధనౌషధములచే వెడలింపవలెను. గాని ఆమదోషమును లేశ మాత్రమైన నుంచరాదు.

తిర్యగ్గతదోషచికిత్సాక్రమము

మూ. ప్రాయస్తిర్యగ్గతా దోషాః క్లేశయన్త్యాతురాంశ్చిరమ్,
కుర్యాన్న తేషు త్వరయా దేహాగ్నిబలవిత్క్రియామ్. ౧౧౦
శమయేత్తాన్ ప్రయోగేణ సుఖం వా కోష్ఠమానయేత్,
జ్ఞాత్వా కోష్ఠప్రపన్నాంశ్చ యథాసన్నం వినిర్హరేత్. ౧౧౧

వ్యా. తిర్యగ్గతములైనదోషములు చాలకాలమువరకును తరుచుగ రోగిని కష్టపర చును. అట్టిస్థితియందు దేహబలమును అగ్నిబలమును ఎరింగినవైద్యుండు శీఘ్రముగ త్వర బడి చికిత్సజేయందగదు. అట్టి తిర్యగ్గతదోషములను వైద్యకతంత్రములం జెప్పిన ప్రయో గములచే శమనచికిత్స జేయవలెను. లేక దేహమునకు బాధగలుగనీయక క్రమముగ కోష్ఠమును జెందునట్టులునైన జేయవలెను. పిదప నాదోషములు కోష్ఠమున జేరియుండు టను చక్కగ దెలిసికొని ఆయాదోషములకు సమీపముననుండు మార్గములనుండి వానిని బైట వెడలింపవలెను.

శోధనచికిత్సావశ్యకత

మూ. దోషాః కదాచిత్కుప్యన్తి జితా లఙ్ఘనపాచనైః,
యే తు సంశోధనైశ్శుద్ధాః న తేషాం పునరుద్భవః. ౧౧౨
యే తే తు చ యథాకాలం మలానాం శోధనం ప్రతి,
అత్యర్థం సఞ్చితాస్తే హి క్రుద్ధాస్స్యుర్జీవితచ్ఛిదః. ౧౧౩

వ్యా. లంఘనపాచనరూపచికిత్సచే దోషములు సమస్థితినున్నను నయ్యవి స్వల్ప కారణములచేగూడ నొకప్పుడు మరల ప్రకోపమునొందును. సంశోధనచికిత్సచే శుద్ధము లైనదోషములు మరల నొకప్పుడును ప్రకోపమునొందవు. మరియు మలములకు శోధనము జేయ నవసరమైనప్పుడు తగినకాలమున శోధనముజేయనిచో మలములు మిక్కుటముగ సంచితములై ప్రకోపమునొంది తుదకు ప్రాణహరముగ నేర్పడును. కావున అవసరమై నప్పుడు శోధనచికిత్సను ఏమరక యథావిధిగ జేయుంట ముఖ్యము.

వాతాదిదోషశోధనకాలము

మూ. శ్రావణే కార్తికే చైత్రే మాసి సాధారణే క్రమాత్,
గ్రీష్మవర్షాహిమచితాన్ వాయ్వాదీనాశు నిర్హరేత్. ౧౧౪

వ్యా. గ్రీష్మకాలమున వృద్ధిజెందిన వాతమునకు శ్రావణమాసమునందును, వర్షర్తువున వృద్ధినొందినపిత్తమునకు కార్తీకమాసమునందును, హేమంతశిశిరకాలములయందు వృద్ధినొందినకఫమునకు చైత్రమాసమునందును యథాక్రమముగ శోధనము చేయనగును. వృద్ధినొందినదోషములకు శోధనచికిత్స జేయుటకు పైజెప్పబడినక్రమముగ వాతాదులకు శ్రావణాదిమాసములు సామాన్యముగ నుండును. కాబట్టి అట్టిదోషములకు పైజెప్పిన కాలమునందే శోధనము నుపయోగించవలెనని భావము.

రోగాధిక్యమునందు శోధనకాలము

మూ. స్వస్థవృత్తమభిప్రేత్య వ్యాధౌ వ్యాధివశేన తు,
కృత్వా శీతోష్ణవృష్టీనాం ప్రతీకారం యథాయథమ్. ౧౧౫
ప్రయోజయేత్క్రియాం ప్రాప్తాం క్రియాకాలం న హాపయేత్,

వ్యా. పైజెప్పబడిన శోధనచికిత్సార్థకాలనియమము రోగములులేక స్వస్థతనుండువారి నుద్దేశించి చెప్పబడినది. వ్యాధి యుత్కటముగ నున్నచో నాయావ్యాధి ననుసరించి శోధనకాలమును నిర్ణయించుకొనవలెను. అది యెట్లు లనగా:—శోధనమునకు అయుక్తమైనకాలమునందును శీతము ఉష్ణము వర్షము అనువానికి యథాక్రమముగ ప్రతీకారముజేసి యావశ్యములగుశోధనాదిక్రియల జేయవలెను. గాని తగినకాలముకాదని తత్కాలమున నావశ్యకముగ జేయవలసినచికిత్స జేయ నుపేక్షింపదగును. అట్లుచేసినచో వ్యాధి బలవత్తరమగును. కావున చికిత్సావసరమును విడువదగదని భావము.

సందిగ్ధావస్థనందు రోగములకు చికిత్సాక్రమము

మూ. వికారాణామకుశలో న జిహ్రీయాత్కదాచన,
న హి సర్వవికారాణాం నామతోఽస్తి ధ్రువా స్థితిః. ౧౧౬
సఏవ కుపితో దోషః సముత్థానవిశేషతః,
స్థానాన్తరాణి చ ప్రాప్య వికారాన్ కురుతే బహూన్. ౧౧౭
తస్మాద్వికారప్రకృతీరవస్థానాన్తరాణి చ,
బుద్ధ్వా హేతువిశేషాంశ్చ శీఘ్రం కుర్యాదుపక్రమమ్. ౧౧౮

వ్యా. రోగముల కన్నిటిని పేరులును వానిలక్షణములును వైద్యకతంత్రములయందు విపులముగ నిరూపింపబడినవి. అయినను కొన్నివ్యాధులకు వానిపేరులును స్థానాదులును నిర్ణముగ దెలిసికొనుట కష్టసాధ్యముగ నుండును. కావున కేవలము పేరులంబట్టియే రోగపరిస్థితులు గమనించి యియ్యది యని నిర్ణయించుట వలనుపడకుండును, అట్టియెడ వైద్యవరుడు వ్యాధియొక్క పేరు తనకు స్ఫుటముగ దెలియలేదని సిగ్గుపడి

చికిత్స మానియుండక అట్టిరోగముయొక్క స్వరూపలక్షణాదులంబట్టి వాతాదిదోష సంబంధమును గమనించి ఇయ్యది యని నిర్ణయించి అట్టిరోగదోషాదులకు ప్రతికూలములగు చికిత్సల గల్పించి ప్రతీకారము చేయందగును.

మరియు వాతాదిదోషములతో నేదైన నొకటి కారణముచే స్వస్థానమునువదలి యితరస్థానమున జేరినచో ననేకరోగముల గలుగజేయును. కాబట్టి వైద్యుఁడు సరిగ రోగ పరిస్థితిని గమనించుట కష్టముగ నున్నను అట్టిరోగోత్పత్తికి ముఖ్యకారణములుగ నుండు వాతాదిదోషములను రోగహేతుభేదములను, స్థానవిశేషములను, నిదానభేదములను చక్కగ నెరింగి తగినచికిత్స గల్పించి చికిత్స జేయువలెను.

## హేతువిపరీతాది చికిత్సాభేదములు

మూ. హేతువ్యాధివిపర్యస్తవిపర్యస్తార్థకారిణః,
ఉపక్రమాస్తు యై రోగాః స్వనిదానవిపర్యయాత్. ౧౧౯
చికిత్సే దనుబన్ధే తు సతి హేతువిపర్యయమ్,
త్యక్త్వా యథాయథం వైద్యో యఞ్జ్యాద్వ్యాధివిపర్యయమ్,
తదర్థకారివాదోషే పక్వేత్విద్ధేచ పావకే. ౧౨౦
హితమభ్యఞ్జనస్నేహపానవస్త్యాదియుక్తితః,

వ్యా. చికిత్స రోగహేతువునకును, రోగమునకును, హేతువ్యాధులరెండిటికిని విపరీతంబులై మూడువిధములు. మరియు హేతువునకు విరుద్ధముగాకున్నను హేతువిప రీతార్థకరంబును, వ్యాధికి విపరీతముగాకున్నను వ్యాధి విపరీతార్థకరంబును, హేతువ్యాధులు రెంటికిని విరుద్ధముగాకున్నను నారెంటికిని విరుద్ధార్థకరంబునునై మరల మూడువిధముల నుండును. (ఇవియన్నియుం గలిసి హేతువిపరీతము, వ్యాధివిపరీతము, హేతువ్యాధి విపరీతము, హేతువిపరీతార్థకారి, వ్యాధివిపరీతార్థకారి, హేతువ్యాధి విపరీతార్థకారియు నని చికిత్స యారువిధములుగ నుండు నని భావము.)

అందు ఏచికిత్సచే వ్యాధికి కారణములైన మిథ్యాహారవిహారాదులకు విరుద్ధము లైనగుణాదులుకల యౌషధాదులచే వైద్యులు రోగములకు చికిత్సజేయుదురో అయ్యది హేతువిపరీతచికిత్స యనబడును. రోగము ఒక్కదోషముచేతనేగాక ఇతరదోషానుబంధ మున జనించినపుడు రోగకారణములగుదోషములకు చికిత్స పరస్పరవిరుద్ధగుణములుగ నుండును కావున హేతువిపరీతచికిత్స జేయ వలనుపడదు; అట్టియెడ హేతువిపరీతమును వదలి కేవలము వ్యాధికి విపరీతమైనచికిత్సను జేయనగును.

దోషములు పక్వములై జఠరాగ్ని దీప్తికల్గియున్నప్పుడు హేతువ్యాధులకు విరుద్ధముగాకున్నను హేతువుకైనను, వ్యాధికైనను, రెంటికైనను విరుద్ధమగువ్యాధి

శమనరూపమైనఫలమును గల్గించుహేతువ్యాధి విపరీతార్థకరములగు అభ్యంజనము, స్నేహపానము, వస్తిప్రయోగము మున్నగుచికిత్సలజేయవలెను.

ఇచ్చట నీవివరణము నెఱుంగునది:—అయాజ్వరాదిరోగములకు జేయునట్టిచికిత్స పైజెప్పినరీతిగ హేతువిపరీతాదిభేదములచే నారువిధముల నుండును. అందు రోగములకు హేతువులైన యాహారవిహారాదులకును వాతాదిదోషములకును విరుద్ధములగు గుణాదులుగల యౌషధాన్నవిహారాదుల నుపయోగించుట హేతువిపరీతచికిత్స, రోగములకు విరుద్ధములైన యౌషధాదుల నుపయోగించుట వ్యాధి విపరీతచికిత్స, హేతువ్యాధుల రెండిటికిని విరుద్ధములగునౌషధాదుల నుపయోగించుట హేతువ్యాధి విపరీతచికిత్స, హేతువునకు విరుద్ధగుణముగాకున్నను వ్యాధి నివృత్తిరూపమగువిరుద్ధఫలమును గలిగించు నౌషధాదుల నుపయోగించుట హేతువిపరీతార్థకారిచికిత్స, వ్యాధికి విరుద్ధము (గుణాదులచే)గాకున్నను వ్యాధిని నివర్తింపజేయు నౌషధాదుల యుపయోగము వ్యాధివిపరీతార్థకారిచికిత్స, హేతువ్యాధులు రెండిటికిని విరుద్ధగుణములుగాకున్నను ఆరెంటికిని విరుద్ధముగ వ్యాధిని శమింపజేయు నౌషధాదుల నుపయోగించుట హేతువ్యాధివిపరీతార్థచికిత్స. ఇత్తెరంగున నారువిధములైన చికిత్సాభేదముల నెఱుంగునది. మరియు నీయారింటి ననుసరించి యౌషధాహారవిహారాదుల కుదాహరణములు మున్నగువిషయములు మాచే విరచితములగు మాధవనిదానవ్యాఖ్యానమునందును, వాగ్భటనిదానవ్యాఖ్యానమునందును విస్తరముగ వివర్ణింపబడినవి. విస్తరభీతిచే మరల వాని నియ్యెడ వివరించుట మానితిని. కావున నందు జూచునది.

## బృంహణలంఘనాదిచికిత్సాభేదములు

మూ. తత్ర హేతువిపర్యస్తో ద్విధా బృంహణలఙ్ఘనాత్. ౧౨౧
బృంహణం స్యాద్బృంహత్త్వాయ లాఘవాయ చ లఙ్ఘనమ్,
శోధనం శమనం చేతి తౌ పృథగ్ద్వివిధౌ తయోః. ౧౨౨
బహిర్నిస్సారయేద్దోషాన్ సమానోన్నదీరయత్యపి,
సమీకరోతి విషమాన్ ద్విప్రకారస్తు బృంహణః. ౧౨౩
కల్ప్యతే శమనాయైవ వాయోః పిత్తానిలస్య చ,

వ్యా॰ పైజెప్పినరీతిగ హేతువిపరీతమైనచికిత్స బృంహణము లంఘనము ననుభేదములచేత రెండువిధములు. అందుకృశించినశరీరమును స్థూలముగ బలియజేయునది బృంహణచికిత్స. స్థూలముగనుండు శరీరమును కృశతనొందించునది లంఘనరూపచికిత్స. (ఇందు బృంహణ మనుదానికి సంతర్పణ మనియు, లంఘన మనుదానికి అపతర్పణ మనియు

నామాంతరములు వాగ్భటాదులచే "ఏకస్సంతర్పణ స్తత్ర ద్వితీయశ్చాపతర్పణః" ఇవి మున్నగువాక్యములచే జెప్పబడినవి.)

మరియు పైజెప్పబడిన బృహాణలంఘనములు రెండును ఒక్కొక్కటి శోధనము శమనము నని రెండేసిభేదములు కల్గియుండును. లోననుండుదోషములను బైటవెడలించి సమములుగ నుండుదోషములను రేపెట్టకుండునది శోధనము. విషమములుగ నుండుదోష ములను సమస్థితి నొందించునది శమనము. పైజెప్పినరీతిగ శోధన శమనరూపములచే రెండు విధములైన బృంహణౌషధములును వాతమును పిత్తవాతమును శమింపజేయనేగాని ప్రకో పింపజేయవు. (లంఘనరూపమైన శోధనముమాత్రము ఒకానొకపుడు వాతమును పిత్తవాత మును ప్రకోపింపజేయును అని భావము).

## బృంహణక్రియార్హులు

మూ. బృంహయేద్వ్యాధిభైషజ్యమద్యస్త్రీశోకకర్శితాన్. ౧౨౮
భారాఽధ్వోరఃక్షతక్షీణరూక్షదుర్బలవాతలాన్,
గర్భిణీం సూతికాం బాలవృద్ధాన్ గ్రీష్మేఽపరానపి. ౧౨౯
మాంసక్షీరసితాసర్పిర్మధురస్నిగ్ధవస్తిభిః,
స్వప్నశయ్యాసుఖాభ్యఙ్గస్నాననిర్వృతిహర్షణైః. ౧౩౦

వ్యా. వ్యాధి, ఔషధము, మద్యపానము, స్త్రీసంభోగము, శోకము, బరువును మోచుట, త్రోవనడుచుట, ఉరఃక్షతము అను నీకారణములచే కృశత్వనొందినవారును; రూక్షశరీరములుగలవారును, బలహీనులును, వాతప్రకృతికలవారును, గర్భవతియు, ప్రస వించినబాలింతరాలును, బాలురును, వయోవృద్ధులును బృంహణచికిత్సజేయ నర్హులు. మరియు గ్రీష్మఋతువున సర్వసాధారణముగ నందరకును బృంహణచికిత్స చేయందగును. మరియు పైజెప్పినవారికి మాంసము, పాలు, చక్కెర, నెయ్యి, మధురముగ స్నిగ్ధముగ నుండు వస్తిక్రియలు, నిద్ర, మంచము మెత్త మున్నగువానిపై సుఖముగ పరుండి యుండుట, అభ్యంగస్నానము, మనోవ్యాకులములేక సుఖముగ నిశ్చింతగ నుండుట, సంతోషమును గల్గించుట మొదలగువానిచే బృంహణక్రియను జేయనగును. అందును వ్యాధివశమున కృశించినవారికి పైజెప్పిన మాంసాద్యాహారములచే విశేషముగ బృంహణ క్రియను జేయవలెను.

## బృంహితలక్షణము

మూ. బృంహితే స్యాద్బలం పుష్టిః తత్సాధ్యామయసంక్షయః,

వ్యా. పైజెప్పిన బృంహణక్రియను చక్కగజేసినచో శరీరబలంబును పుష్టియు చక్కగ కల్గును. అట్టి బృంహణక్రియచే సాధింపదగినరోగము నివర్తించును. అట్టిలక్షణములబట్టి బృంహణక్రియ చక్కగ పనిచేసెనని యెఱుంగునది.

బృంహణాతియోగమునగల్గురోగములు

మూ. అతిస్థౌల్యాపచీమేహజ్వరోదరభగన్దరాన్. ౧౨౭
కాసపన్న్యాసకృచ్ఛ్రామకుష్ఠాదీంస్తాతిబృంహణాత్,

వ్యా. బృంహణచికిత్సను అధికముగజేసినచో శరీరము మిక్కిలి స్థూలమగును. అపచి ప్రమేహము, జ్వరము, ఉదరము భగందరము, కాసము, సన్న్యాసమనుమానసికవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, అశ్మరీరోగము, కుష్ఠము మున్నగు ననేకరోగముల గల్గించును.

శోధన-శమన-చికిత్సావాంతరభేదములు

మూ. నిరూహో వమనం కాయశిరోరేకోఽస్రవిస్రుతిః. ౧౨౮
లఙ్ఘనే పఞ్చధా శుద్ధిః; సప్తధా శమనం పునః,
పాచనం దీపనఃక్షుత్తృడ్వ్యాయామాతపమారుతాః. ౧౨౯

వ్యా. నిరూహవస్తి, వమనము, కాయవిరేచనము, శిరోవిరేచనము (నస్యము), రక్తమోక్షణము నని లంఘనరూపమైన శోధనచికిత్స యైదుభేదములు కల్గియుండును. శమనౌషధము పాచనము, దీపనము, క్షున్నిగ్రహము (ఆకలిని నిరోధించుట), తృష్ణానిగ్రహము (దప్పిని నిరోధించుట), వ్యాయామము (శరీరమునకు ఆయాసమును బుట్టించుకుస్తీ మున్నగువానిని జేయుట), ఆతపము (ఎండనుండుట), మారుతము (గాలిని సేవించుట) అని యేడువిధములు. (ఈయేడును లంఘనరూపములైన శమన-చికిత్సాభేదములు).

లంఘన-చికిత్సార్హులు

మూ. మేహామదోషాతిస్నిగ్ధజ్వరోరుస్తమ్భకుష్ఠినః. ౧౩౦
విసర్పవిద్రధిప్లీహాశిరఃకణ్ఠాక్షిరోగిణః,
స్థూలాంశ్చ లఙ్ఘయేన్నిత్యం శిశిరేత్వపరానపి. ౧౩౧

వ్యా. ప్రమేహము, ఆమదోషము మిక్కిలి స్నిగ్ధమైనశరీరముగల్గియుండుట, జ్వరము, ఊరుస్తంభము, కుష్ఠము, విసర్పము, విద్రధి, ప్లీహము శిరోరోగము, కంఠరోగము, నేత్రరోగము, శరీరస్థౌల్యము, అను నీరోగములుకలవారు ఎల్లప్పుడును లంఘనచికిత్స కర్హులు. మరియు శీతకాలమునందు పైజెప్పినరోగులేకాక స్వస్థతనున్నవారును కూడ లంఘనక్రియ నాచరింపదగుదురు. స్థూలశరీరులకు ఎల్లపుడు లంఘనముజేయంబను.

లంఘనోపయోగక్రమము

మూ. తత్ర సంశోధనైః స్థౌల్యబలపిత్తకఫాధికాన్,
క్షుత్తృష్ణానిగ్రహైర్దోషైస్త్వార్తాన్మధ్య బలైర్దృఢాన్. ౧౩౨
సమీరణాతపాయాసైః కిముతాల్పబలైర్నరాన్,

వ్యా. మరియు లంఘనక్రియకు అర్హాతకలవారిలో శరీరస్థౌల్యంబును బలంబును పిత్తకఫములును అధికముగ కలవారికి శోధనరూపమైన లంఘనచికిత్సను ప్రయోగింపనగును. మధ్యబలములగు నామదోషాదులచే బీడితులగుదృఢకాయులకు ఆకలిని నిగ్రహించుట, దప్పిని నిరోధించుట అనులంఘనమును ప్రయోగింపనగును. స్వల్పబలముకలదోషములచే బీడింపబడినవారికి గాలినిసేవించుట, ఎండలోనుండుట, వ్యాయామము అను నీలంఘనచికిత్స లను ప్రయోగింపవలెను.

అపతర్పణమునగల్గుగుణము

మూ. శాన్తి రామవికారాణాం భవతిత్యపతర్పణాత్. ౧౩౩

వ్యా. పైజెప్పినవిధముగ బలాదులతారతమ్యమును గమనించి లంఘనచికిత్స నాచరించినచో నామదోషమున సంభవించినరోగములన్నియు శాంతినొందును.

దోషబలతారతమ్యముచే లంఘనోపయోగక్రమము

మూ. త్రివిధం త్రివిధేదోషే తత్సమీక్ష్య ప్రయోజయేత్,
తత్రాల్పే లంఘనం పథ్యం మధ్యే లఙ్ఘనపాచనమ్. ౧౩౪
ప్రభూతే శోధనం తద్ధి మూలాదున్మూలయేన్మలాన్,

వ్యా. దోషము స్వల్పముగ నున్నపుడు లంఘనముజేయుట యుక్తము. మధ్యబలముగ నుండునపుడు లంఘనపాచనములజేయుట యుత్తమము. దోషము మిక్కిలి ప్రబలముగనుండునెడ శోధనరూపమైనలంఘనము జేయుట యుత్తమము. శోధనము మలములను మొదలంట నిర్మూలముజేయును కావున దోషము బలవత్తరమైనపుడు శోధనమునే యుపయోగించుట సమంజసము. ఇత్తెఱంగున అల్పమధ్యప్రబలభేదములచే మూడుతెఱంగులైన దోషములయొక్కబలతారతమ్యమును గమనించి పైజెప్పినరీతిగ లంఘనము నుపయోగించవలెను.

లంఘితలక్షణము

మూ. విమలేన్ద్రియతాసర్గో మలానాం లాఘవం రుచిః. ౧౩౫
క్షుత్తృట్సహోదయశ్శుద్ధహృదయోద్గారకణ్ఠతా,
వ్యాధిమార్దవముత్సాహ స్తన్ద్రానాశశ్చ లఙ్ఘితే. ౧౩౬

వ్యా. లంఘనక్రియచేసినప్పుడు ఇంద్రియములు నిర్మలములుగనుండుట, మలమూత్రాదులు సరళముగ వెడలుట, శరీరము చుల్కనైయుండుట, నోట రుచికల్గుట, ఆకలియు దప్పియు సమకాలముననగల్గుట, హృదయంబును త్రేపులును కంఠంబును ఆమసంబంధము లేక నిర్దుష్టములుగనుండుట, వ్యాధి యౌద్ధత్యము తగ్గియుండుట, ఉత్సాహముపుట్టుట, కునికిపాటులేకుండుట ఈలక్షణములుకల్గినచో లంఘనచికిత్స చక్కగ పనిచేసినదని యెఱుంగనగును. (పైజెప్పినవానిలో రెండుమూడులక్షణములు కల్గెనేని లంఘనము చక్కగ పనిచేసినది యనియే యూహింపనగును.)

లంఘనాతియోగమునగల్గురోగములు

మూ. అతికార్శ్యం భ్రమః కాస స్తృష్ణాధిక్యమరోచకః,
స్నేహాగ్ని నిద్రాదృక్ఛ్రోత్ర శుక్రౌజః క్షుత్స్వరక్షయః. ౧౩౭
వ స్తి హృన్మూర్ధజఙ్ఘోరు త్రికపార్శ్వరుజాజ్వరః,
ప్రలాపోర్ధ్వానిలగ్లాని చ్ఛర్ది పర్వాస్థిభేదనమ్. ౧౩౮
వర్చో మూత్రగ్రహాద్యాశ్చ జాయన్తేఽతి విలఙ్ఘనాత్,

వ్యా. లంఘనమును అధికముగజేసినచో శరీరము మిక్కిలి కృశతనొందును. ఒడలు తిరుగును. దగ్గుకల్గును. దప్పి యధికమగును. నోట రుచితప్పును, శరీరమున స్వాభావికముగ నుండుజిడ్డు నశించును. జఠరాగ్ని మందగించును. నిదుర బట్టదు. నేత్ర శ్రోత్రేంద్రియములవ్యాపారములు నశించును. శుక్రంబును ఓజస్సును క్షీణించును. ఆకలి నశించును, కంఠస్వరము హీనస్వరమగును. వస్తియందును హృదయమునందును శిరస్సునందును పిక్కలయందును తొడలయందును నడుముక్రిందిభాగమునను ఇరుప్రక్కల యందును తీవ్రమైననొప్పి కల్గును. జ్వరమువచ్చును. ప్రలాపంబును ఊర్ధ్వశరీరమున వాతరోగంబును బడలికయు వాంతియు కల్గును. వ్రేళ్లు మున్నగువానిగణుపులయందును అస్థులయందును పగులదీయునట్లు బాధకల్గును. మలమూత్రములు బద్ధగించును. ఇవియేగాక యితరములగువ్యాధులును సంభవించును.

బృంహణలంఘనములవిశేషవిధి

మూ. నబృంహయేల్లఙ్ఘనీయాన్ బృంహ్యాంస్తు మృదులఙ్ఘయేత్. ౧౩౯

వ్యా. లంఘనమున కర్హులగువారికి బృంహణము జేయ నవసరమున్నను బృంహణము జేయంజనదు. బృంహణక్రియార్హులకు లంఘనముజేయ నవసరమున్నచో మృదువైన లంఘనమునుపయోగింపనగును. (మరియు నట్టిపరిస్థితియందు సంతర్పణ అపతర్పణోభయ రూపమైనచికిత్సను దేశకాలాదిబలముల కనుగుణముగ నుపయోగించి యుపచరింపనగును.)

ఈవిషయమును వాగ్భటాచార్యులు "యుక్త్యావా దేశ కాలాది బలతస్తానుపాచరేత్" అనువాక్యముచే నుపదేశించిరి.

## వ్యాధి విపరీతచికిత్సాభేదములు

మూ. అపథ్యానాం పరిత్యాగాత్ పథ్యానాం పరిశీలనాత్,
సేవనాద్భైషజస్యేతి త్రిధా వ్యాధి విపర్యయః. ౧౮౦

వ్యా. వ్యాధికి పథ్యములుగాని (వ్యాధిని వృద్ధినొందించు) యాహారాదుల విడచుట, వ్యాధికి పథ్యకరములై వ్యాధిని నివర్తింపజేయ సమర్థములైన యాహారాదులసేవించుట, వ్యాధికి విరుద్ధమై వ్యాధిని హరింపజేయునౌషధములసేవించుట అను నీమూడును వ్యాధి విపరీతచికిత్సలగును. (పైజెప్పినరీతిగ వ్యాధి విపరీతచికిత్స మూడువిధములని భావము).

## సిద్ధౌషధప్రయోగము

మూ. సిద్ధానామపియోగానాం పూర్వేషాం దార్ఢ్యమావహన్. ౧౮౧
సప్తాహేన క్రియాలాభే క్రియామన్యాం ప్రయోజయేత్,

వ్యా. ఔషధయోగములు శాస్త్రసిద్ధములై యనేకపర్యాయములు ప్రయోగించుటచే వ్యాధిని వృత్తియందు నమ్మకముకల్గియున్నను అట్టియౌషధమును ప్రయోగించుటచే నేడుదినములవరకును గుణములేకుండునెడ, ఆయౌషధమును విడిచి వేరొకయౌషధమును ప్రయోగింపనగును.

## వ్యాధిక్షీణుడు విడువదగినవి

మూ. శీతోదకోపచారిత్వం వ్యవాయం రాత్రిజాగరమ్,
వేగోపరోధవ్యాయామాః క్రోధశోకహిమాతపాః. ౧౮౨
ప్రవాతేయాతయానాధ్వభాష్యాత్యాసనసంస్థితీః,
నీచాత్యుచ్చోపధానాహస్స్వప్నధూమరజాంసిచ. ౧౮౩
వ్యాధిక్షీణః త్యజేత్ప్రాయః సర్వాకర్మస్వయం క్రమః,

వ్యా. చల్లనినీళ్లచే స్నానపానాద్యుపచారములజేసికొనుట, స్త్రీసంభోగముచేయుట, రాత్రులయందు నిదురమేల్కొనియుండుట, మలమూత్రాదివేగముల నిరోధించుట, దేహపరిశ్రమమును జేయుట, కోపపడుట, దుఃఖించుట, మంచును ఎండను సేవించుట, మిక్కిలి తీవ్రమైనగాలిలో నుండుట, వాహనములపై సవారిచేయుట, త్రోవనడచుట, బిగ్గరగ మాటలాడుట, చాలకాలము కూర్చొనియుండుట, లేక నిలబడియుండుట, మిక్కిలి పొట్టిగనైనను ఎత్తుగనైననుండుతలగడపై తలనిడిపరుండుట, పగటియందు నిదురించుట,

పొగయందును దుమ్మునందు నుండుట ఈపనుల నన్నిటిని రోగములచే క్షీణించినవాడు వదలియుండవలెను. అన్నిచికిత్సలయందును పైజెప్పినవానిని బొత్తుగ వదలియుండవలెను.

మతికొన్ని విరుద్ధక్రియలు

మూ. యాయాః క్రియాః కృతాస్తస్య కుపితః కుర్వతే భృశమ్. ౧౪౪
తద్రోగవృద్ధిం మరణ మన్యావావ్యాపదోభృశమ్,

వ్యా. రోగికి యేయేపనులవలన రోగము ప్రకుపితమై వృద్ధినొందునో, లేక మరణమునైనను ఇతరములగురోగములనైనను కల్గించునో అట్టిపనులనన్నిటిని బొత్తుగ విడువవలెను. ఇది వ్యాధివిపరీతమగు సామాన్యచికిత్స.

వ్యాధినిశ్శేషతకావశ్యకత

మూ. నివృత్తోపి పునర్వ్యాధిః అల్పేనాయాతి హేతునా,
దేహేమార్గీకృతే దోష శేషే సూక్ష్మఇవానలః. ౧౪౫
తస్మాత్తమనుబధ్నీయాత్ ప్రయోగేణానపాయినా,

వ్యా. తగినచికిత్సలచే వ్యాధినివర్తించినను దోషసంచారమునకు మార్గముగ నేర్పడినశరీరమునందు లేశమాత్రమైనను దోషము లీనముగనున్నచో స్వల్పమైనకారణము దొరకినను, (మిక్కిలి సూక్ష్మముగ మిగిలియున్న నిప్పు స్వల్పమైనయాధారముదొరకినను వృద్ధినొంది దహించువిధముగ) మరల వ్యాపించి బాధింపందొడంగును. కావున వ్యాధి హరించినను కొన్నిదినములవరకును తగినచికిత్సను జేయుచు పథ్యములగునాహారాదుల నియతిదప్పక యాచరించవలెను.

పత్థ్యసేవనావశ్యకత

మూ. ఔషధేన వినావ్యాధిః పథ్యాభ్యాసేన శామ్యతి. ౧౪౬
న తు పథ్యవిహీనస్య భేషజానాం శతైరపి,

వ్యా. ఔషధములేకున్నను కేవలము పత్థ్యము నభ్యసించుటచేతనే వ్యాధి శాంతి నొందును. ఆహారాదులయందు పత్థ్యనియమములేక యెన్నియౌషధములసేవించినను వ్యాధి నివర్తికానేరదు. కావున పత్థ్యము నభ్యసించుట ముఖ్యకర్తవ్యము.

పథ్యాభ్యాసక్రమము

మూ. సాత్త్యత్వాత్పదభావాద్యా పత్థ్యం ద్వేష్యత్వమాగతమ్. ౧౪౭
కల్పనావిధిభిస్తైస్తైః ప్రియత్వంగమయేత్పునః,
మనసోహ్యానుకూలేన తుష్టిరూర్జామతిర్బలమ్. ౧౪౮
సుఖోపభోగతాచ స్యాత్ వ్యాధేశ్చాతః పరిక్షయః,

సాత్మ్యదోషత్రయవ్యాధి వైషమ్యేనచ యద్రుచిః. ౧౪౯
తస్మాత్పథ్యోపచారజ్ఞః యోగేనాన్నం వికల్పయేత్,

వ్యా. పథ్యకరమైనపదార్థము తనమనసు కింపుగాక ద్వేషబుద్ధి యేవస్తువునందు కల్గియున్నను అట్టిపథ్యమును ప్రతిదినమునందు నభ్యాసముచేసియైనను పావు అర ముప్పావువంతున అలవాటుచేసియైనను ఆయాసంస్కారాదికల్పనా భేదముచేత సంస్కరించి నాల్గవపాలుగనైన కొంచెముకొంచెముగ నానాట నలవాటుచేసి యిష్టమైనదానినిగ జేసికొనవలెను. ఆరీతిగ మనసు కనుకూలముగ జేసికొనినచో దానివలన మనస్సంతోషంబును, మనోబలంబును, బుద్ధియు, శరీరబలంబును, సుఖానుభవంబును కల్గి వ్యాధియు నానాట నివర్తించును. సాధ్యములగువాతాదిదోషత్రయములకును వ్యాధికిని విరుద్ధములైన గుణములుకల వస్తువులయం దభిరుచి ముఖ్యముగ రోగికి కలుగవలెను. అట్టిపథ్యసేవనముచేత వ్యాధి శాంతినొందును కావున పథ్యోపచారములను దెలిసినవైద్యుఁడు తత్తదనుగుణముగ వ్యాధ్యాదిపరిస్థితుల ననుసరించి యాహారమును పథ్యకరముగ గల్పించవలెను.

## అన్నపానాదు లహితములైనచో జేయువిధి

మూ. అన్నపానౌషధం దోషమాత్రాకాలాద్యపేక్షయా. ౧౫౦
అహితే నాపి సాత్మ్యేన కేనచిత్సహితం హితమ్,
సాత్మ్యం హ్యాశుబలం ధత్తే నాతిదోషబలం హ్యపి. ౧౫౧

వ్యా. ఆయావ్యాధులకు నిర్ణీతములైన అన్నము పానము ఔషధము ఈమూడును దోషము పరిమాణము కాలము మున్నగువాని ననుసరించి తత్తదనుగుణముగ తనకలవాటుతో (సాత్మ్యమై)నుండు హితము కాని (అపథ్యకరమైన) వానితోఁగూర్చి యుపయోగించిన అట్టియన్నపానౌషధములుకూడ పథ్యముగ నగును. ఏలనః—చిరకాలము నలవాటుచేసి (సాత్మ్యమై)యుండుద్రవ్యము మిక్కుటముగ దోషములను బలపర అతిశీఘ్రముగ శరీరమునకు బలమును కల్గించును. (కావున అట్టిసాత్మ్యమైనద్రవ్యము హితముగాకున్నను దానితోఁగలిపి హితాన్నపానౌషధముల నుపయోగించినచో సాత్మ్యమైనయహితపదార్థగుణమును తిరస్కరించి యన్నపానాదులు తమగుణములను శీఘ్రముగ జూపి పనిసేయునని భావము).

## మండపేయాదిలక్షణములు

మూ. సిక్థైర్విరహితో మణ్డః పేయాసిక్థసమన్వితా,
ఘనసిక్థావిలేపీస్యాత్ తేన ప్రస్థోన్మితే జలే. ౧౫౨
ద్రవ్యేభ్యోఽర్ధపలం దత్వా కుర్యాదర్ధావశేషితమ్,

తస్మిన్ పలేన లాజానాం భృష్టాద్వాతణ్డులాద్యవాత్. ౧౫౩
మణ్డమాసిక్థవిక్లిత్తైః ప్రసృతే నార్ధశేషితమ్,
పేయాం విలేపీయడవేత్యాద్దర్వీలేపనాత్పచేత్. ౧౫౪
కృతాకృతరసాయూషాః స్నేహాదిరసవర్జితాః,
స్వల్పమాంసపటుస్నేహోదకలావణికస్మృతాః. ౧౫౫
క్షీణభాగత్రిభాగార్థం దిశేత్తు గురులాఘవమ్,

వ్యా. మెతుకులు లేకుండుద్రవముగ కాచబడినగంజి మండ మనబడును. మెతుకు లుండునట్లు కాచబడినగంజి పేయ యనబడును. మెతుకులు విశేషముగ నుండునట్లు కాచబడినగంజి విలేపి యనబడును. మరియు నొక ప్రస్థమాత్ర జలమునం దర్థపలము బియ్యమును వైచి జలమునం దర్థభాగము మిగులునట్లు కాచబడినగంజి మండ మనబడును. ఒక ప్రస్థపరిమితమగుజలమున పరిపేలాలనైనను వేచబడినబియ్యమునైనను యవలనైనను ఒకపలమాత్రమును వైచి యర్థభాగము మిగులునట్లు కాచబడినది మండ మనబడును. ప్రసృతమాత్ర జలమున పైజెప్పినరీతిగ ద్రవ్యమునుజేర్చి యర్థభాగము మిగుల కాచబడినగంజి పేయ యనబడును. కుడపమాత్ర జలమున పైజెప్పినరీతిగ ద్రవ్యమునుచేర్చి గరిటె కంటికొనునట్లు కాచబడినగంజి విలేపి యనబడును. మఱియు యూష యనునది కృతము అకృతము నని రెండువిధములు. అందు నూనె ఉప్పు కారము చేర్చి కాచబడినపప్పుకట్టు కృత మనబడును. నూనె మున్నగువానిని జేర్చక కాచబడినపప్పుకట్టు అకృత మనబడును. స్వల్పముగ మాంసమును ఉప్పునుజేర్చి నీళ్లనుబోసి కాచబడినకట్టు లావణిక మనబడును. అట్టియూషములలో మొదటికృతమనునది నాల్గవపాలు చుండునట్లును, రెండవది అకృతమనునది మూడవపాలు చుండునట్లును, మూడవదియగులావణికము అర్థభాగము చుండునట్లును పక్వముజేయంజను. ఈమూడును నొకదానికన్న నొకటి లాఘవము కల్గియుండును.

కృతాకృతలక్షణము తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"అస్నేహలవణం సర్వమకృతం కటుకైర్వినా, విజ్ఞేయం లవణస్నేహకటుకైః సంస్కృతం కృతమ్".

## ఉష్ణోదకభేదము

మూ. యత్క్వాథ్యమానం నిర్వేగం నిర్ధనఫేనం స్యాన్నిర్మలం లఘు,
ద్రవ్యైకశ్లేష్మఘ్నసః ప్రస్థం కఫఘ్నం పాదశేషితమ్. ౧౫౬
స్యాత్పాదహీనం పిత్తఘ్నం హీనమర్ధేన వాతనుత్,
కేవలార్ధకృతం తోయం త్రిదోషశమనం లఘు. ౧౫౭

వ్యా॰ నీళ్లు కాచునపుడు వాసనయు నురుగును లేకయున్నచో నయ్యది నిర్మలంబును చల్లనయు నైయుండును. మఱియు ఆకూడోషమును హరించునట్టిశుంఠి మున్నగు ద్రవ్యమును కర్షమాత్రమునందు ఒకప్రస్థపరిమిత మగుజలమునుబోసి నాల్గవపాలు మిగులునట్లు చుండకాచిన నయ్యది కఫమును హరించును. అట్టిజలమును నాల్గవపాలు చుండి మూడుభాగములజలము మిగులునట్లు కాచిన నయ్యది పిత్తమును హరించును. సగపాలు మిగులునట్లు కాచబడిన నయ్యది వాతమును హరించును. ద్రవ్యమునుజేర్పక జలమును మాత్రము సగము మిగులునట్లు కాచిన నయ్యది త్రిదోషముల శమింపజేయును. తేలికగ నుండును.

## రాళ్లు మున్నగువానివేడిచే కాగిననీళ్లగుణము

మూ॰ పాషాణరూప్యమృద్ధేమజతుతాపార్కతాపితమ్,
పానీయముష్ణం శీతం వా త్రిదోషఘ్నం తృడార్తినుత్. ౧౫౭

వ్యా॰ రాయి వెండి మట్టి పెళ్లలు బంగరు లక్క అనునీద్రవ్యముల వేడిగ కాల్చియావేడిచేనైనను ఎండవేడిచేనైనను కాచబడినజలము వేడిగనున్నను చల్లనైనను త్రిదోషముల హరించును. డప్పిచే గల్గుబాధను పోనడచును.

## పిత్తాధిక్యమునజలతాపవిధి

మూ॰ తప్తేపయసినిర్వాప్య మణిముక్తే సముద్ధరేత్,
శీతం హితమిదం వారిపిత్తే పిత్తాధికేతథా, ౧౫౮

వ్యా॰ చంద్రకాంతము మొదలగుమణులుగాని మంచిముత్తియములుగాని నిప్పులో వెచ్చజేసి నీటిలో ముంచి యానీటిని వడియగట్టి చల్లగానుండుదానిని పిత్తదోషమందు పిత్తాధిక్యముగలరోగములందును పానముచేయించవలెను.

## సౌమ్య - ఆగ్నేయౌషధములు, వానిస్థానము

మూ॰ హిమవద్విన్ధ్యశైలాభ్యాం ప్రాయోవ్యాప్తావసున్ధరా,
సౌమ్యం పత్రాదితత్రాద్యం ఆగ్నేయం వైన్ధ్యమౌషధమ్.

వ్యా॰ భూమియంతయు హిమవత్పర్వతముచేతను వింధ్యపర్వతముచేతను ప్రాయికముగ వ్యాప్తమైయుండును. అందు హిమవంతముననుండు ఆకులు మున్నగుసౌషధములన్నియు సౌమ్యగుణము కల్గియుండును. వింధ్యమునంగలయౌషధములన్నియు ఆగ్నేయ (అగ్నిసంబంధమైన) గుణము కల్గియుండును.

## అనూపాదిదేశములగ్రహింపదగినయౌషధములు

మూ॰ స్వాదూనాం యోగ్యఆనూపః కటుకానాంతు జాఙ్గలః,
కషాయతిక్తయోరమ్లపట్వోస్సాధారణస్తయోః,

వ్యా. మధురరసములుకలయౌషధములను గ్రహించుటకు అనూప(జలప్రాయమైన) ప్రదేశముయోగ్యమైనది. కటురసముగల యౌషధముల గ్రహించుటకు జాంగల(స్వల్పమైన జలము వృక్షాదులుకల) ప్రదేశముయుక్తము. తక్కిన కషాయ-తిక్త, అమ్ల-లవణరసములు గల యౌషధముల గ్రహించుటకు సాధారణప్రదేశము యుక్తము.

మధురాదివద్రసములకు బలవత్తరకాలనియమము

మూ. రసాః కట్వమ్లలవణస్వాదుతిక్తకషాయకాః ౧౭౦
భవన్తి బలవన్తస్తాః ఘర్మాదిష్వృతుషు క్రమాత్,

వ్యా. కటు(కారము)-అమ్ల(పులుపు)-లవణ (ఉప్పు)-స్వాదు(తీపి) - తిక్త(చేదు)-కషాయ (వగరు) రసములుకల -యౌషధద్రవ్యములు గ్రీష్మాదిఋతువులారిటియందును వరుసగ మిక్కిలి బలవత్తరములై యుండును. (కటురసౌషధము గ్రీష్మఋతువునందును, అమ్లరసౌషధము వర్షర్తువునందును, లవణరసౌషధము శరదృతువునందును, మధురరసౌషధము హేమంతఋతువునందును, తిక్తరసౌధము శిశిరఋతువునందును, కషాయరసౌషధము వసంతర్తువునందును వరుసగ వీర్యవంతములై యుండునని భావము). కావున ఆయాఋతువునందు పైజెప్పినరీతిగ మధురాద్యౌషధముల గ్రహించుట యుక్తము.

గ్రహింపదగినయౌషధలక్షణము

మూ. ధన్వసాధారణే దేశే సమే సన్మృత్తికే శుచౌ. ౧౭౧
శ్మశానచైత్యాయతనశ్వభ్రవల్మీకవర్జితే,
మృదౌ ప్రదక్షిణజలే కుశరోహిషసంస్కృతే. ౧౭౨
అఫాలకృష్టేఽనాక్రాన్తే పాదపైర్బలవత్తరైః,
శస్యతే భేషజం జాతం యుక్తం వర్ణరసాదిభిః. ౧౭౩
జన్త్వజుష్టం దవాదగ్ధం అవిదగ్ధంచ వైకృతైః,
భూతైశ్ఛాయాతపామ్బ్వాద్యైః యథా కాలనిషేవితమ్.

వ్యా. శీతోష్ణపరిస్థితులు సమముగను, మిట్టపల్లములుగాక చదరముగను, మంచి సత్తువయైన మట్టికల్గినదియు, శ్మశానము పదుగురు గుమిగూడుస్థలమునుగాక బొరియలును పుట్టలును లేక మృదువై ప్రదక్షిణముగ వ్యాపించుజలముకల్గి కుశలు పచ్చికయు కల్గి నాగలిచే దున్నబడక ప్రబలమైనవృక్షములచే నాక్రమింపబడకుండునదియు నై పరిశుద్ధమైన ప్రదేశమున జనించినయౌషధము మిక్కిలి ప్రశస్తము. మఱియు నాయౌషధము మంచివర్ణము మధురాదిరసమును కల్గి పురుగులు మున్నగుజంతువులచే నాక్రమింపబడక కార్చిచ్చుచేనైనను ఇతరవికృతులచేనైనను దగ్ధముకాక యుండవలెను. ఎండ నీడ జలము

మున్నగుపంచభూతములగుణముచే నవసరమైన యాయాకాలములయందు అనుగుణముల సేవింపబడియు నుండవలెను. (పైజెప్పినగుణములు పూర్తిగ కల్గినయౌషధము గుణోత్తరమై గ్రాహ్యమై యుండు నని భావము).

భేషజముగ్రహించుక్రమము

మూ. అథకల్యాణచరితః శ్రాద్ధశ్శుచిరుపోషితః,
చతుర్దిక్షు బలిం దత్వా సురామాంసాక్షతాదిభిః. ౧౬౬
"దైవతేభ్యో నమస్తేభ్యో నివ స్తీహాయే శ్రితాః,
గన్తు మర్హాస్త్వసంక్రుద్ధాః త్యక్త్వేమం వాసమవ్యయమ్.
భైషజ్యార్థం గృహీష్యామి సర్వప్రాణభృతామిమమ్,
వృక్షం నలోభాన్నక్రోధాత్ బ్రాహ్మణార్థే విశేషతః." ౧౬౭
మన్త్రేణానేన విధినా రక్షాబన్ధనమాచరేత్,
అపరేద్యుర్నచేత్కించిత్తత్ర వైకృత మద్భుతమ్. ౧౬౮
యుగమాత్రోద్గతే సూర్యే విధాయ స్వస్తివాచనమ్,
పూర్వాగ్రముత్తరాగ్రం వా పాతయే దుద్ధరేత్తతః. ౧౬౯
"యేన త్వాం ఖనతే బ్రహ్మా యేన త్వాం ఖనతే హరిః,
తేనాహం త్వాం ఖనిష్యామి పఞ్చశాఖేన పాణినా." ౧౭౦
(ఇతి ఖననమంత్రమ్)
"ఓం నమస్త్వస్త్వోషధిభ్యః పూర్వాపరాభ్యవిష్యథ,
వైకైకస్మిన్ మహాద్వీర్యం కురుధ్వం ప్రార్థయామివః. ౧౭౧
ఓం ఔషధేశ్వరి, పచపచ, దహదహ, హనహన,
దారయదారయ, విఘ్నాన్, తుభ్యంనమః. ౧౭౨
(ఇదంగ్రహణమన్త్రమ్)

వ్యా. ఔషధమును గ్రహింపదలచినమనుజుడు శుభలక్షణములతోగూడి భక్తిశ్రద్ధలుకలవాడై శుభదినమున నుపవసించి తాను గ్రహింపదలచిన యౌషధిరూపమైన చెట్టుకు నాల్గుదిక్కులయందును మద్యము మాంసము అక్షతలు మున్నగువానిచే బలినిచ్చి, "దైవతేభ్యో-విశేషతః" అనుమంత్రముచే రక్షగట్టి, యారాత్రి యూరకుండవలెను. పిమ్మట మరుసటిదినమున నాయౌషధిచెంత కరిగి పరిశీలించగా నాయౌషధికి సంబంధించి యేవిధమైన యద్భుతంబును వికృతంబునులేని చిహ్నముల గమనించునది. అట్టి వికృతిలేని యెడ ఉదయకాలమున రెండుబారల ప్రొద్దైనపిమ్మట స్వస్తివాచనముచేసి, "యేనత్వాం—

పాణినా" అనుమంత్రముచే త్రవ్వి, యాయౌషధిని తూర్పుకొసగనైనను ఉత్తరపుకొసగనైనను పడునట్లుచేసి, పిమ్మట "ఓం నమస్స్వ...తుభ్యంనమః" అనుమంత్రముచేత వేరు మున్నగునౌషధముల గ్రహించునది. చిన్నచెట్టుగ నున్నచో పైమంత్రముచే పెల్లగించి వేరు మున్నగుదానిని మంత్రపూర్వకముగ గ్రహించునది.

"ఏహస్తముచేత బ్రహ్మయు విష్ణువును నిన్ను త్రవ్వెదరో అట్టిహస్తముచేత నిన్ను త్రవ్వెదను" అని ఖననమంత్రమున కర్థము. "ఓయౌషధములారా! మీకు నమస్కారము. ప్రతియౌషధమునందును గొప్పవీర్యమును కల్గియుండుడు" అని యౌషధ గ్రహణమంత్రమున కర్థము.

"ఈవృక్షము నాశ్రయించియుండు దేవతలకెల్ల నమస్కారము. ఈవృక్షమును సకలప్రాణులకును హితమునుజేయుటకై అందును విశేషముగ బ్రాహ్మణులనిమిత్తము ఔషధముజేయుటకై గ్రహించెదను; కాని యీవృక్షమును ఆత్మలాభమునకును, క్రోధముచేతను చెరుపదలంచినవాడనుకాను; కావున నీవృక్షము నాశ్రయించియుండు మీరెల్లరును నాయందు కినుకలేక యీవృక్షమును వదలి వేరొండుచోటికి బొండు; వేడెదను" అని రక్షాబంధనమంత్రమున కర్థము.

ఓషధులభద్రపరచుక్రమము

మూ. గృహీతమేవం వాతాగ్ని రజోభిరనుపాహతమ్,
ప్రచ్ఛన్నం యోగ్యపాత్రస్థం ప్రాగుదగ్ద్వారలక్షితే. ౧౭౩
నివాతాంశే ప్రవాతాంశే బలిపుష్పోపహారిణి,
గుప్తే సద్మని శిక్యేతు స్థితం కాలేచ కల్పయేత్. ౧౭౪

వ్యా. పైజెప్పినక్రమము ననుసరించి గ్రహించబడినయౌషధులును యుక్తమగు పాత్రలో నునిచి గాలిచేతను నిప్పుచేతను ధూళిచేతను చెడకుండునట్లు పైని మూతమూసి తూర్పువాకిలియైనను ఉత్తరపువాకిలియైనను కలిగి పూజార్థమైనపుష్పములు మున్నగు ద్రవ్యములతోగూడి గుప్తముగనుండు ఇంటిలో గాలివీచుప్రదేశమునందైనను గాలిలేని స్థలమునందైనను ఉట్టిమీద పదిలముగ నుంచునది. ఇత్తెరంగున పదిలముగ నుంచబడి యౌషధమును అవసరమైనపుడు ఉపయోగించునది.

ఓషధులు నిలవయుండుకాలము

మూ. సక్షీరం తదసంపత్తే అనతిక్రాన్తవత్సరమ్,
ఋత్యంశస్తం గుడక్షౌద్ర ధాన్యకృష్ణావిడఙ్గకమ్. ౧౭౫

వ్యా. వెనుక జెప్పినభద్రత్రలేకున్నను పాలతోఁగూడియుండు చెట్లయొక్క మూలికలు ఒకసంవత్సరమువరకు నిలవయుండును. బెల్లము, తేనె, దనియాలు, పిప్పళ్లు, వాయువిళంగములు అనునవి ప్రాతబడినవే శ్రేష్ఠములుగా నుండును.

గ్రాహ్యమైన ఆవుయొక్క పాలు మొదలైనవాని వివరణము

మూ. పయోబాష్కయణం గ్రాహ్యం విణ్మూత్రాం తప్పనీరుజాం,
వయోబలవతాం ధాతు పిఞ్ఛశృంగసిరాదికమ్. ౧౬౬

వ్యా. ఈనినఒకసంవత్సరమునకు లోపలనుండు అవుయొక్క పాలను గోమయమును గోమూత్రమును గ్రహింపనగును. అట్టియావులు రోగములులేక యుండవలెను. మరియు కొన్నిజంతువుల రక్తాదిధాతువులను నెమలి మున్నగువానిపింఛమును కొమ్ములను నరములు మున్నగువానిని ఔషధమునకై గ్రహించవలసినప్పుడు మిక్కిలి బలిష్ఠములై రోగాదులచే బీడింపబడక మంచివయసున నుండుజంతువులనుండి గ్రహించవలెను.

పచ్చివిగనే యుపయోగింపవలసినయోషధులు

మూ. వాశాకుటజకూశ్మాణ్డ శతావర్యమృతాబలా,
కురణ్టైరణ్డపనసఖర్జూరబిసభూస్తృణాః. ౧౬౭

పఞ్చమూలం లఘుమహత్తృణాఖ్యం మాంసమార్ద్రికమ్,
శారిబామ్బుఘనోశీరం కమలం కన్దమాదకమ్. ౧౬౮

నిత్యార్ద్రమేవ యోజ్యం తత్ యదిశుష్కం నవీర్యదమ్,

వ్యా. అడ్డసరము, కొడిసెపాల, పెద్దగుమ్మడి, పిల్లిపీచర, తిప్పతీగె, చిట్టాముట్టి పేరాముట్టి, గోరింట, ఆముదపుచెట్టు, పనస, ఖర్జూరపుచెట్టు, తామర మున్నగువానికాడలు, అవురుగడ్డి, లఘుపంచమూలములు, మహత్పంచమూలములు, తృణపంచమూలములు, మాంసము, అల్లము, సుగంధపాల, కురువేరు, తుంగగడ్డలు, వట్టివేరు, తామరపువ్వులు, జలమునబుట్టినతామరకలువ మున్నగువానిదుంపలు వీనిని ఔషధమునకై గ్రహించునపుడు పచ్చివిగనే చేర్పనగును. అవి యెండినచో వీర్యవంతములు కానోపవు. (కావున పచ్చివే శ్రేష్ఠము లని భావము).

త్వక్సారములు (పట్టలనేగ్రహించవలసినయోషధులు)

మూ. ద్విక రఞ్జారభూజమ్బూకుటజలవఙ్గాదిషు త్వచో గ్రాహ్యాః,
శ్యామాశ్వమారచిఞ్చాచిత్రకనీల్యాదితో మూలాత్. ౧౬౯

వ్యా. కానుగు, కలుగానుగు, అరటి (పెద్దవేము), నేరేడు, కొడిసెపాల లవంగపుచెట్టు ఇవిమున్నగువానిని గ్రహించవలసినచో ఈచెట్లపట్టను గ్రహించవలెను. మరియు

నల్లతెగడ, గన్నేరు, చింతచెట్టు, చిత్రమూలము, నీలిచెట్టు ఇవిమున్నగువానిపట్ట గ్రహించవలసినచో వీనివేరుపట్టలను గ్రహింపవలెను.

బెరడునువిడిచిగ్రహింపదగినవి

మూ. నిస్త్వక్ శుణ్ఠ్యమృతాభీరులశునం బాలబిల్వకమ్,

వ్యా. శుంఠి, తిప్పతీగె, భీరు (పిల్లిపీచర), ఉల్లి, బాలబిల్వములు (లేతమారేడుకాయలు) ఇవి పైబెరడును విడదీసి లోపలిభాగములు గ్రహింపనగును.

విశేషవిధిలేనిస్థలమున సామాన్యపరిభాష

మూ. అనిర్దిష్టప్రసిద్ధేషు మూలం గ్రాహ్యం త్వగాదిషు,
ద్రవేఽను క్తేజలం, కాలేప్రాతః, అం శేసమాంశతా,

వ్యా. ఎచ్చటనైననోషధులయోగమునందు ఓషధినామమాత్రమును నిర్దేశించి యాయోషధియొక్క వేరుపట్ట మున్నగునంగముల విశేషముగ జెప్పనియెడ వేరును మాత్రము గ్రహింపనగును. తైలాదియోగములయందు ద్రవవిశేషములగు పాలురసములు మున్నగువానిని నిర్దేశించకున్నయెడ సామాన్యముగ నచ్చోట జలమును గ్రహించవలెను. ఔషధమును సేవించుట మున్నగుకృత్యములకు కాలమును విశేషవిధిగ నిర్దేశించనిచో ప్రాతఃకాలమని నిర్ణయించునది. కొన్నియౌషధముల యోగములయందు ఓషధిద్రవ్యముల పరిమితిని వేరువేరుగ జెప్పనియెడ సమభాగములని నిర్ణయించునది.

1. శోధనాదిగణములు, (అందు వమనములగల్గించుద్రవ్యగణము)

మూ. వక్ష్యన్తే వ్యవహారార్థాశ్శోధనాదిగణాః పరమ్, మదనమధుకలమ్బానింబబింబీవిశాలాత్రపుసకుటజమూర్వాదేవదాలీక్రిమిఘ్నాః,
బిదుళదహనచిత్రాః కోశవత్యౌకరఞ్జః కణలవణవచైలాసర్షపా
శ్ఛర్దనాని. ౧౮౦

వ్యా. ఈశాస్త్రమునందు నచ్చటచ్చట వ్యవహరించుటకు లోకమున వాడుకకొరకును శోధనాదిగణద్రవ్యము లీక్రింద వివరింపబడును:—మ్రంగ, ఇప్ప, అనుగు, వేప, దొండ, పెద్దపాపర, చేదుదోస, కొడిసెపాల, చాగ, దేవదాళి (డావరడంగి), వాయువిడంగములు, నీరుప్రబ్బలి, చిత్రమూలము, నీరుప్రబ్బలి, చిత్రమూలము(?), ఎలుకచెవి యాకు, చేదుబీర, పెద్దబీర, కానుగు, పిప్పళ్లు, ఉప్పు, వస, ఏలకులు, ఆవాలు ఇవి వమనములు గల్గించుద్రవ్యములు.

2. విరేచనద్రవ్యగణము

మూ. నికుమ్భ కుమ్భ త్రిఫలాగవాక్షీస్నుక్ .శఙ్ఖినీ నీలిని తిల్వకాని,

శ్యామాకకమ్పిల్లకహేమదుగ్ధాదుగ్ధాని మూత్రాణి విరేచనాని.

వా. నాగదంతి, తెగడ, త్రిఫలము (కరకతాడిఉసిరిక), పాపరబుడమ, బొంత జెముడు, శంఖిని (తెల్లదింటెన), నల్లదింటెన, లొద్దుగు, జేల, కంపిల్లకము, స్వర్ణక్షీరి, ఆవు మున్నగువానిపాలు, వానిమూత్రములు ఇవి విరేచనముల గల్గించుద్రవ్యములు. (విరేచనగణము).

### 3. నిరూహణవస్తిగణద్రవ్యములు

మూ. మదనకుటజకుష్ఠదేవదాలీ మధుకవచాదశమూలదారురాస్నాః,
యవమిసికృతవేధనం కులుత్థో మధులవణత్రివృతో నిరూహణాని.

వ్యా. మ్రంగకాయ, కొడిసెపాల, చెంగల్వకోష్టు, దేవదాళి, ఇప్ప, వస, దశమూలములు, దేవదారు, సన్నరాష్ట్రము, యవలు, పెద్దసదాప, ఆవడ, ఉలవలు, తేనె, సైంధవలవణము, తెగడ ఇవియన్నియు నిరూహవస్తిక్రియకు ఉపయోగించుద్రవ్యములు.

### 4. శిరోవిరేచనద్రవ్యగణము

మూ. కిల్లాపామార్గవ్యోషదార్వీ సురాలాబీజం శైరీషం బార్హతంశైగ్రవంచ, సారోమాధూకః సైన్ధవం తార్క్ష్యశైలం త్రుట్యౌపృథ్వీకాశోధయన్త్యుత్తమాఙ్గమ్, ౧౮౩

వ్యా. వాయువిడంగములు, ఉత్తరేణి, త్రికటుకములు, మ్రానిపసుపు, శ్రేష్ఠమైన సర్జరసము, దిరిసనపుగింజలు, ములకవిత్తులు, మునగవిత్తులు, ఇప్పచెట్టుయొక్క చేవ, సైంధవలవణము, ఎండినరసాంజనము, పెద్దయేలకులు, చిన్నయేలకులు, హింగుపత్రి ఇవియన్నియు శిరోవిరేచనద్రవ్యములు.

### 5. వాతహరద్రవ్యములు

మూ. భద్రదారునతం కుష్ఠం దశమూలం బలాద్వయమ్,
వాయుం వీరతరాదిశ్చ విదార్యాదిశ్చ నాశయేత్. ౧౮౪

వ్యా. దేవదారు, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, దశమూలములు, చిట్టాముట్టి, పేరాముట్టి క్రిందచెప్పబడు వీరతరాదివిదార్యాదిగణముల ద్రవ్యములు ఇవియన్నియు వాతమును హరింపజేయును.

### 6. పిత్తహరద్రవ్యములు

మూ. దూర్వానంతా నింబవాశాత్మగుప్తా గుంద్రాభీరుశ్శీతపాకీ ప్రియఙ్గుః, న్యగ్రోధాదిః పద్మకాదిస్థిరేద్వే పద్మం వన్యాంశారిబాదిశ్చ పిత్తమ్. ౧౮౫

వ్యా. గరికె, రేగటిదూలగొండి, వేము, అడ్డసరము, దూలగొండి, కాకివెదురు, పిల్లిపీచర, కురువింద, ప్రేంకణము ఇవిచేరి దూర్వాదిగణము. ఈదూర్వాదిగణమును, క్రింద చెప్పబడు న్యగ్రోధాదిగణంబును, పద్మకాదిగణంబును ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, తామర, దుందిలము, శారిబాదిగణంబును ఇవియన్నియు పిత్తమును హరించుద్రవ్యములు.

### 7. కఫహరద్రవ్యములు

మూ. ఆరగ్వధాదిరర్కాదిర్ముష్కకాద్యోఽసనాదికః,
సురసాదిస్సముస్తాదిర్వత్సకాదిర్బలాసజిత్. ౧౮౬

వ్యా. ఈక్రిందచెప్పబడు ఆరగ్వధాదిగణము, అర్కాదిగణము, ముష్కకాదిగణము, అసనాదిగణము, సురసాదిగణము, ముస్తాదిగణము, వత్సకాదిగణము ఈయేడు గణములు గలద్రవ్యములు కఫమును హరించును.

### 8. జీవంత్యాది (జీవనీయ) గణము

మూ. జీవన్తి కాకోళ్యౌ ద్వే మేదే ముద్గమాషపర్ణ్యౌచ,
ఋషభకజీవకమధుకం చేతి గణో జీవనీయాఖ్యః. ౧౮౭

వ్యా. పాలకూర, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, అడవిపెసర, అడవిమినుము, ఋషభకము, జీవకము, అతిమధురము ఇవి యన్నియు జేరి జీవన్త్యాదిగణ మనబడును. (ఇదియే జీవనీయగణ మని నామాంతరముచే జెప్పబడును).

### 9. విదార్యాదిగణము, దానిగుణము

మూ. విదారిపఞ్చాఙ్గులవృశ్చికాలీ వృశ్చీరదేవాహ్వాయశూర్పపర్ణ్యః,
కణ్డూకరీజీవనహ్రాస్వసంజ్ఞే ద్వేపఞ్చకే గోపసుతాత్రిపాదీ. ౧౮౮
విదార్యాదిరయం హృద్యో బృంహణో వాతపిత్తహా,
శోషగుల్మాఙ్గమర్దోర్ధ్వశ్వాసకాసహరో గణః. ౧౮౯

వ్యా. తెల్లనేలగుమ్ముడు, చిట్టాముదపుచెట్టు, తేలుమణిచెట్టు, గలిజేరు, దేవదారు, కారుమినుము, దూలగొండి, జీవనపంచమూలము, (పెల్లిపీచర, కాకోళి, మనుబాల, జీవకము, ఋషభకము), హ్రాస్వపంచమూలము (వాకుడు, ములక, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, పల్లేరు), సుగంధపాల, హంసపాది ఇవియన్నియుంజేరి విదార్యాదిగణమని చెప్పబడును. ఈగణమునందలి ద్రవ్యము హృదయమునకు వాతమును జేయును. శరీరమునకు పుష్టినిగల్గించును. వాతపిత్తములు, శోష, గుల్మము, ఒడలినొప్పులు, ఊర్ధ్వశ్వాసము, కాసము వీనినన్నిటిని హరించును.

## 10. శారిబాదిగణము, దానిగుణము

మూ. శారిబోశీరకాంశ్మర్య మధూకశిశిరద్వయమ్, ౧౯౦
యష్టీపరూషకం హన్తి దాహపిత్తస్రతృడ్జ్వరాన్. ౧౯౧

వ్యా. సుగంధపాల, వట్టివేళ్లు, పెగ్గుమ్ముడు, ఇప్ప, తెల్లనిచందనము, రక్తచందనము, అతిమధురము, చిట్టీత ఇవియన్నియుఁజేరి శారిబాదిగణము. ఈగణద్రవ్యములు సర్వాంగతాపమును, పిత్తరక్తమును, దప్పిని, జ్వరమును హరించును.

## 11. పద్మకాదిగణము, దానిగుణము

మూ. పద్మకపుణ్డ్రౌవృద్ధితుగర్ధ్యః శృఙ్గ్యమృతాదశజీవనసంజ్ఞాః,
స్తన్యకరాహతమారుతపిత్తాః ప్రీణనజీవనబృంహణవృష్యాః.

వ్యా. పద్మకము, ప్రపౌండరీకము, వృద్ధి, తుగాక్షీరి, ఋద్ధి, కర్కాటకశృంగి, తిప్పతీగె జీవనీయగణమున జెప్పబడిన పదిద్రవ్యములు. ఇవియన్నియుఁజేరి పద్మకాదిగణమనబడును. ఈగణద్రవ్యములు వాతపిత్తములహరించును. చనుబాలను కల్గించును. ఇంద్రియాదులకు ప్రీణనమగును. ఓజస్సును వృద్ధినొందించును. ఇంద్రియపుష్టిని కల్గించును.

## 12. పరూషకాదిగణము, దానిగుణము

మూ. పరూషకం వరాద్రాక్షాకట్ఫలం కతకోత్పలమ్,
రాజాహ్వాందాడిమం శాకం తృణ్మూత్రమయవాతజిత్. ౧౯౩

వ్యా. చిట్టీత, త్రిఫలములు, ద్రాక్ష, కాయఫలము, చిల్లగింజ, కలువ, పాలకూర, దానిమ్మ, టేకు ఇవియన్నియుఁజేరి పరూషకాదిగణ మనబడును ఈగణద్రవ్యములు దప్పిని, వాతరోగమును మూత్రరోగములను హరించును.

## 13. అంజనాదిగణము, దానిగుణము

మూ. అఞ్జనం ఫలినీమాంసీ పద్మోత్పలరసాఞ్జనమ్,
సైలామధూకనాగాహ్వాం విషాన్తర్దాహపిత్తనుత్. ౧౯౪

వ్యా.. స్రోతోఞ్జనము (సౌవీరాఞ్జనము), ప్రేంకణము, జటామాంసి, తామర, కలువ, రసాఞ్జనము, ఏలకులు, ఇప్ప, నాగకేసరములు ఇవియన్నియుఁజేరి అంజనాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు విషములను, అంతస్తాపమును, పిత్తమును హరించును.

## 14. పటోలాదిగణము, దానిగుణము

మూ. పటోలకటురోహిణీచన్దనం మధుస్రవగుడూచిపాఠాన్వితమ్,
నిహన్తి కఫపిత్తకుష్ఠజ్వరాన్ విషజ్వరమరోచకం కామలామ్,

వ్యా. చేదుపొట్ల, కటుకరోహిణి, చందనము, చాగ, తిప్పతీగె, విమబొద్ది ఇవి యన్నియుంజేరి పటోలాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు కఫమును, పిత్తమును, కుష్ఠములను, విషమును, వాంతిని, అరోచకమును, కామలను హరించును.

## 15. గుడూచ్యాదిగణము, దానిగుణము

మూ. గుడూచీ పద్మకారిష్టధాన్యకం రక్తచన్దనమ్,
పిత్తశ్లేష్మజ్వరచ్ఛర్ది దాహతృష్ణాఘ్నమగ్నికృత్. ౧౯౬

వ్యా. తిప్పతీగె, పద్మకము, వేప, దనియాలు, రక్తచందనము ఇవియన్నియు జేరి గుడూచ్యాదిగణము. ఈగణద్రవ్యములు పిత్తమును, కఫమును, జ్వరమును, వాంతిని, సర్వాంగతాపమును, దప్పిని హరించును. జఠరాగ్నిని దీపింపజేయును.

## 16. ఆరగ్వధాదిగణము, దానిగుణములు

మూ. ఆరగ్వధేన్ద్రయవపాటలకాకతిక్తా నిమ్బామృతామధురసాస్రువ
వృక్షపాఠాః, భూనిమ్బసైర్యకపటోలకరఞ్జయుగ్మసప్తచ్ఛదాగ్ని
సుషవీఫలబాణఘోణ్టాః. ౧౯౭

ఆరగ్వధాదిర్జయతి చ్ఛర్దికుష్ఠవిషజ్వరాన్,
కఫకణ్డూప్రమేహాంశ్చ దుష్టవ్రణవిశోధనః. ౧౯౮

వ్యా. రేల, కొడిసెపాల, పాదిరి, గురిగింజ, వేము, తిప్పతీగె, చాగ, పుల్లవెలగ, చిరుబొద్ది, నేలవేము, ములుగోరింట, చేదుపొట్ల, కానుగు, కలుకానుగు, ఏడాకులపొన్న, చిత్రమూలము, ఆరె, మ్రంగకాయ, నల్లగోరింట, పోక ఇవియన్నియుంజేరి ఆరగ్వధాది గణమని చెప్పబడును. ఈగణద్రవ్యములు వాంతి. కుష్ఠములు, విషము, జ్వరము, కఫము, దురద, ప్రమేహము అను నీవ్యాధుల హరించును.

## 17. అసనాదిగణము, దానిగుణములు

మూ. అసనతినిశభూర్జశ్వేతవాహప్రకీర్యాః ఖదిరకదరభణ్డీశింశపామేష
శృఙ్గ్యః, త్రిహిమతలపలాశాజోజ్గకశ్శాకసాలాః క్రముకధవకులిఙ్గ
చ్ఛాగకర్ణాశ్వకర్ణాః, ౧౯౯

అసనాదిర్విజయతే శ్విత్రకుష్ఠకఫక్రిమీన్,
పాణ్డురోగం ప్రమేహంచ మేదోదోషనిబర్హణః. ౨౦౦

వ్యా. వెగిస, సెమ్మి, భుజపత్రి, మద్ది, సెమలియడుగుమ్రాను, చంద్ర, వెలిచంద్ర దిరిసనము, శింశుప(ఇరుగుడు), ఒద్ది, మేషశృంగి, త్రిహిమము (శ్వేతచందనము, రక్త చందనము, పీతచందనము), తాటి, మోదుగ, అగరు, టేకు, ఏపి, పోక, ధవవృక్షము,

కర్కాటకశృంగి, నల్లమద్ది, గన్నేరు ఇవియన్నియుజేరి అసనాదిగణమని చెప్పబడును. ఈగణద్రవ్యములు శ్విత్రము, కుష్ఠము, కఫము, క్రిములు, పాండురోగము, ప్రమేహము, మేదోరోగము అను నీవ్యాధుల హరించును.

## 18. వరణాదిగణము, దానిగుణము

మూ. వరణాసైర్యకయుగ్మశతావరీదహనమోరటబిల్వవిషాణికాః,
ద్విబృహతీద్వికరఞ్జజయాద్వయం బహుళపల్లవదర్భరుజాకరః.
వరణాదిః కఫం మేదో మన్దాగ్నిత్వం నియచ్ఛతి,
ఆమవాతం శిరశ్శూలం గుల్మంచాన్తస్సవిద్రధిమ్. ౨౦౨

వ్యా. ఉలిమిరి, ఎఱ్ఱనిగోరింట, పచ్చగోరింట, పిల్లిపీచర, చిత్రమూలము, చాగ, మారేడు, ఒద్ది, వాకుడు, ములక, కానుగు, కలుగానుగు, తక్కెల, కరకకాయ, మునగ, కుశదర్భ, ఆదొండ ఇవియన్నియుజేరి వరణాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు కఫమును, మేదోవృద్ధిని, అగ్నిమాంద్యమును, ఆమవాతమును, తలనొప్పిని, గుల్మమును, అంతర్విద్రధిని వీనినన్నింటిని హరించును.

## 19. ఊషకాదిగణము, దానిగుణము

మూ. ఊషకస్తుత్థకం హిఙ్గు కాసీసద్వయసైన్ధవమ్,
సశిలాజతుః కృచ్ఛ్రాశ్మగుల్మ మేదః కఫాపహం.

వ్యా. ఊషకము (చవుడు) మైల్లుత్తము, ఇంగువ, కాసీసము, పుష్పకాసీసము, సైంధవలవణము, శిలాజతువు ఇవియన్నియుజేరి ఊషకాదిగణ మనబడును. ఈగణము మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని, గుల్మమును, మేదోరోగమును, కఫరోగమును హరించును.

## 20. వీరతరాదిగణము, దానిగుణము

మూ. వేల్లంతరారణి కబూకవృషాశ్మభేదగోకణ్టకోత్కట సహచరబాణకాశాః, వృక్షాదనీనలకుశద్వయగుణ్ఠగున్ద్రాభల్లూకమోరటకురణ్టకరమ్భపార్థాః. ౨౦౩
వర్గోవీరతరాద్యోఽయం హన్తి వాతకృతాన్ గదాన్.
అశ్మరీశర్కరామూత్ర కృచ్ఛ్రాఘాతరుజాహరః. ౨౦౪

వ్యా. వట్టివేరు, కూరనెల్లి, ఈశ్వరమల్లిక, అడ్డసరము, పాషాణభేది (కొండపిండిబొద్ది), పల్లేరు, ఇత్కట (జిలుగు), పచ్చని ములుగోరింట, నల్లగోరింట, రెల్లు, బదనిక, కిక్కిసగెడ్డి, సూక్ష్మస్థూలభేదములచే రెండువిధములైనదర్భలు, గుండ (ఫులుగు), గుంద్ర (గడ్డిలోనొకవిధమైనది), భల్లాక(కోలపొన్న), చేకొణిద, పచ్చగోరింట, దుష్టపు, పార్థ

(ప్రొద్దుతిరుగుడుపువ్వుచెట్టు) ఇవియన్నియుజేరి వీరతరాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు వాతరోగములు, అశ్మరి, మూత్రశర్కర, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము అనునీరోగముల పోగొట్టును.

## 21. లోధ్రాదిగణము, దానిగుణము

మూ. లోధ్రశాబరకలోధ్రపలాశాజిజ్జినీ సరళకట్ఫలయుక్తాః,
కుత్సితాజ్గకదళీగతశోకాః సైలవాలు పరిపేలవమోచాః.
విషలోధ్రాదికోనామమేదః కఫహారోగణాః,
యోనిదోషహరస్తమ్భిన్యా వర్ణ్యోవిషవినాశనః. ౨౦౬

వ్యా. లొద్దుగు, తెల్లలొద్దుగు, మోదుగు, కచోరము, సరలదేవదారు, కట్ఫలము, సన్నరాష్ట్రము, అరటి, అశోకము, కూతురుబుడమ, తుంగముస్తలు, అందును ఇవియన్నియు జేరి లోధ్రాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు మేదోరోగమును, కఫరోగమును యోనిరోగములను హరించును. మలమూత్రాదుల స్తంభింపజేయును. శరీరమునకు వర్ణమును గల్గించును. విషదోషముల హరించును.

## 22. అర్కాదిగణము

మూ. అర్కాఽలిర్కానాగదన్తీ విశల్యాభార్గీరాస్నా వృశ్చికాలీ త్రిజాతమ్, ప్రత్యక్పుష్పీపీతతైలోదకీర్యాశ్వేతాయుగ్మం తాపసానాంచ వృక్షః. ౨౦౭

వ్యా. జిల్లేడు, తెల్లజిల్లేడు, నాగదంతి, చన్నచెర్లగడ్డ, భారంగి, సన్నరాష్ట్రము, తేలుమణిచెట్టు, త్రిజాతకము. ఉత్తరేణి, పీతతైల (కాకిదొండ), కానుగు, గినియ, పసరుగినియ, తపసిచెట్టు (గారచెట్టు) ఇవియన్నియుంగలిసి అర్కాదిగణ మని చెప్పబడును.

## అర్కాదిగణగుణములు

మూ. అయమర్కాదికోవర్గః కఫమేదోవిషాపహః,
క్రిమికుష్ఠప్రశమనో విశేషాద్వ్రణశోధనః. ౨౦౮

వ్యా. పైజెప్పిన అర్కాదిగణద్రవ్యములు కఫమును, మేదోరోగమును విషదోషమును, క్రిములను, కుష్ఠములను, శ్రమమును, మనోవ్యాధులను హరించును. విశేషముగ వ్రణములను శుద్ధిజేయును.

## 23. సురసాదిగణము, దానిగుణము

మూ. సురసయుగఫణిజ్జా కాలమాలావిడజ్గం ఖరబుసవృషకర్ణీకట్ఫలం
కాసమర్దః, క్షవకభుకసిభార్గీ కాముకాకాకమాచీ కులహాలవిష
ముష్టీ భూస్తృణంభూతకేశీ. ౨౦౯

సురసాదిగణశ్శ్లేష్మమేదః కృమి నిషూదనః,
ప్రతిశ్యాయారుచిశ్వాసకాసఘ్నో వ్రణశోధనః. ౨౧౦

వ్యా. తులసి, నల్లతులసి, గగ్గెర, నల్లగగ్గెర, వాయువిడంగములు, మరువము, ఎలుక చెవియాకు, కట్ఫలము, కసివెంద, దుష్టపుచెట్టు, చాతరాసి, బారంగి, పిప్పలి, కాంచి, నేల కనుము, విషముష్టి, కామంచిపూరి, జటామాంసి ఇవియన్నియుఁజేరి సురసాదిగణ మన బడును. ఈగణద్రవ్యములు శ్లేష్మమును, మేదోరోగమును, క్రిములను, పీనసమును, అరుచిని, శ్వాసమును కాసమును హరించును, వ్రణముల శుద్ధిచేయును.

## 24. ముష్కకాదిగణము, దానిగుణము

మూ. ముష్కకస్నుగ్వరాద్వీపి పలాశధవశింశపాః,
గుల్మమేహాశ్మరీపాణ్డు మేదోఽర్శః కఫశుక్రనుత్. ౨౧౧

వ్యా. మొక్కపుచెట్టు, పెద్దజెముడు, త్రిఫలములు, చిత్రమూలము, మోదుగ, చంద్ర, ఇరుగుడు ఇవియన్నియుఁజేరి ముష్కకాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు గుల్మమును, ప్రమేహమును, అశ్మరీరోగమును, పాండురోగమును, మేదోరోగమును, అర్శోరోగమును, కఫరోగమును, శుక్రదోషమును హరించును.

## 25. వత్సకాదిగణము, దానిగుణము

మూ. వత్సకమూర్వాభార్గీకటుకామరిచంఘుణప్రియాస్నుక్చ,
ఏలాపాఠాఽజాజీకట్వఙ్గపచాఽజమోదసిద్ధార్థాః. ౨౧౨
జీరకహిఙ్గువిడఙ్గం పశుగన్ధాపఞ్చకోలకం హన్తి,
చలకఫమేదః పీనసగుల్మజ్వరశూలదుర్నామ్నః. ౨౧౩

వ్యా. కొడిసె, చాగ, బారంగి, కటుకరోహిణి, మిరియాలు, తెల్లఅతివస, జెముడు, ఏలకులు, విషబొద్ది, జీలకర, పెద్దమ్రానుకాయలు, వసఓమము, తెల్లనియావాలు, పెద్ద జీలకర, ఇంగువ, వాయువిడంగములు, వాయింట, పంచకోలములు ఇవియన్నియుఁజేరి వత్స కాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు వాతకఫములను, మేదోరోగమును, పీనసమును, గుల్మమును, జ్వరమును, శూలలను, దుర్నామమనురోగమును హరించును.

## 26. వచాది-హారిద్రాదిగణములు, వానిగుణములు

మూ. వచాజలదదేవాహ్వానాగరాతివిషాభయాః,
హారిద్రాద్వయయష్ట్యాహ్వాకలశీకుటజోద్భవాః. ౨౧౪
వచాహారిద్రాదిగణావామాతీసారనాశనౌ,
మేదః కఫాఢ్యపవనస్తన్యదోషనిబర్హణౌ. ౨౧౫

వ్యా. వస, తుంగగడ్డలు, దేవదారు, శుంఠి, అతివస, కరకకాయ ఇవియన్నియుం జేరి వచాదిగణ మనబడును. పసుపు, మ్రానిపసుపు, అతిమధురము, నక్కతోకపొన్న, కొడిసెపాల ఇవియన్నియుంజేరి హారిద్రాదిగణ మనబడును. ఈరెండుగణముల ద్రవ్యములును ఆమాతిసారమును, మేదోరోగమును, కఫరోగమును, అఢ్యవాతమును, స్తన్యదోషముధ హరించును.

## 27-28. ప్రియంగ్వాది, అంబష్ఠాదిగణములు, వానిగుణములు

మూ. ప్రియఙ్గుపుష్పాఞ్జనయుగ్మపద్మపద్మాద్రజో యోజనవల్ల్యనన్తాః,
మానద్రుమో మోచరసస్సమఙ్గాపున్నాగశీతం మదనీయ హేతుః.
అమ్బష్ఠామధుకం నమస్కరీ నన్దీవృక్షపలాశకచ్ఛురాః,
రోధ్రం ధాతకి బిల్వపేశికట్వఙ్గః కమలోద్భవం రజః. ౨౧౭
గణా ప్రియఙ్గ్వమ్బష్ఠాదీ పక్వాతీసారనాశనా,
సన్ధానీయాహితాపి త్తే వ్రణానామపిరోపణా. ౨౧౮

వ్యా. ప్రేంకణము, పుష్పాంజనము, స్రోతోంజనము, సౌవీరాంజనము, పద్మ (స్వనామప్రసిద్ధము), తామరపువ్వునందలికేసరములు. మంజిష్ఠి, ప్రాచీతీగెలు, బూరుగుచెట్టు, బూరుగుచెట్టుబంక, మెట్టదామర, పొన్న, చందనము, ఆరెచెట్టు ఇవియన్నియుంజేరి ప్రియంగ్వాదిగణ మనబడును. మయూరశిఖి, యష్టిమధుకము, ముణుంగుదామర, నందివర్ధనము, మోదుగు, దూలగొండి, లొద్దుగు, ఆరె, మారేడు, దుందిలము, పద్మకింజల్కములు ఇవియన్నియుంజేరి అంబష్ఠాదిగణము. ఈరెండు (ప్రియంగాది అంబష్ఠాది) గణములును పక్వమైనయతిసారమును నశింపజేయును. విరిగినఅవయవముల నతుకజేయును. పిత్తరోగములయందు పథ్యకరములు. వ్రణముల నార్చును.

## 29. ముస్తాదిగణము, దానిగుణము

మూ. ముస్తావచాగ్నిద్వినిశాద్వితిక్తా భల్లాతపాఠా త్రిఫలావిషాఖ్యాః,
కుష్ఠంత్రుటీహైమవతీచ; యోని స్తన్యామయఘ్నా మలపాచనాశ్చ.

వ్యా. తుంగగడ్డలు, వస, చిత్రమూలము, పసుపు, మ్రానిపసుపు, కటుకరోహిణి, గురిగింజలతీగె, నల్లజీడి, చిరుబొద్ది, త్రిఫలములు, అతివిషము, చెంగల్వకోష్టు, ఏలకులు, తెల్లనివస ఇవియన్నియుంజేరి ముస్తాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు యోనిరోగములను హరించును. స్తన్యరోగమును పోగొట్టును.

## 30. న్యగ్రోధాదిగణము

మూ. న్యగ్రోధ పిప్పలసదాఫలలోధ్రయుగ్మజమ్బూద్వయార్జున కపీతన

సోమవల్కాః, వృతూప్లవంజుళకదమ్బపలాశనన్దికోల ప్రియాళు
విరళామధుకం మధూకమ్. ౨౧౯

వ్యా. మఱ్ఱి, రావి, అత్తి, లొద్దుగు, తెల్లలొద్దుగు, నేరేడు, చిన్ననేరేడు, మద్ది, కలురావి, సోమిండ, చింతచెట్టు, ప్రబ్బలి, కడిమి, మోదుగు, నందివర్ధనము, రేగు, మొరళి, తుమికి, అతిమధురము, ఇప్ప ఇవియన్నియుంజేరి న్యగ్రోధాదిగణ మనబడును.

## 30. న్యగ్రోధాదిగణగుణము

మూ. న్యగ్రోధాదిర్గణో వ్రణ్యః సంగ్రాహీ భగ్నసాధనః,
మేదః పిత్తాస్రతృడ్దాహ యోనిదోషనిబర్హణః. ౨౨౦

వ్యా. ఈన్యగ్రోధాదిగణద్రవ్యములు వ్రణముల నార్చును. మలాదులబంధించును. విరిగినయవయవముల నతుకజేయును. మేదోరోగమును పిత్తరక్తరోగములను దప్పిని తాపమును హరించును. యోనిదోషముల శమింపజేయును.

## 31. ఏలాదిగణము, దానిగుణము

మూ. ఏలాయుగ్మతురుష్కనిమ్బఫలినీ మాంసీజలధ్యామకం, స్పృక్కా
చోరకచోచపత్ర తగరస్థౌణేయజాతీరసాః, శుక్తి ర్వ్యాఘ్రనఖో
మురాహ్వామగురుశ్రీవాసకం కుఙ్కుమం, చణ్డాగుగ్గులుదేవధూప
ఖపురాః పున్నాగనాహ్వాయమ్. ౨౨౧
ఏలాదికో వాతకఫౌ విషంచ వినియచ్ఛతి,
వర్ణప్రసాదనః కణ్డూపిటికా కోఠనాశనః. ౨౨౨

వ్యా. పెద్దయేలకులు, చిన్నయేలకులు, తురుష్కధూపము, చెంగల్వకోష్టు, ప్రేంకణము, జటామాంసి, కురువేరు, ధ్యామకము స్పృక్కయనుగంధద్రవ్యములు, కచోరములు, లవంగపుచెక్క, లవంగపత్రి, గ్రంథితగరము, దవనము, బోళము, నఖంచిప్పలు వ్యాఘ్రనఖము, మరువము, అగరు, మడ్డిపాలు, కుంకుమపువ్వు, చండ, గుగ్గిలము, సర్జరసము, కుందురుష్కము, సురపొన్న, నాగకేసరములు ఇవియన్నియుంజేరి యేలాదిగణ మనబడును. ఈగణద్రవ్యములు కఫవాతములను విషమును హరించును. శరీరవర్ణమును నిర్మలముగజేయును. దురదను పిటికలను పొడలను హరించును.

## 32. కణాదిగణము, దానిగుణము

మూ. కణావహ్నివచా వత్సకోలగ్రన్థికముస్తకాః,
విశ్వైలాతివిషాకాస్తీ చవ్యం మరిచ దీప్యకమ్,
భార్గీ మూర్వా నిమ్బబీజం జీరసర్షపరామఠమ్.

కణాదివర్గో వాతఘ్నః కఫశ్వాసవినాశనః,
అగ్నిసాదం ప్రతిశ్యాయం గ్రహణీ మర్శసంజయేత్.

వ్యా. పిప్పళ్లు, చిత్రమూలము, వస, కొడిశపాల, మోడి, తుంగముస్తలు, శొంఠి, ఏలకులు, అతివస, రేణుకలు, చవ్యము, మిరియాలు, వామము, గంటుభారంగి, చాగనార, వేపవిత్తులు, జీలకఱ్ఱ, ఆవాలు, ఇంగువ ఇవి కణాదిగణము. ఈకణాదిగణము వాతమును, కఫమును, శ్వాసమును, అగ్నిమాంద్యమును, ప్రతిశ్యాయము (పడిసెము)ను, గ్రహిణిని, అర్శస్సును బోగొట్టును.

## 33. శ్యామాదిగణము, దానిగుణము

మూ. శ్యామాదన్తీ ద్రవన్తీ క్రముకకుటరణీ శఙ్ఖినీ చర్మసాహ్వా, స్వర్ణక్షీరీ గవాక్షీ శిఖరి రజనికాచ్ఛిన్నరోహా కరంజాః, బస్తాన్త్రీ వ్యాధిఘాతో బహలబహురస స్తీక్ష్ణవృక్షాత్ఫలాని, శ్యామాద్యోః హన్తిగుల్మంవిషమరుచికఫంహృద్రుజం మూత్రకృచ్ఛ్రమ్.

వ్యా. నల్లతెగడ, నేలదంతి (నేర్వాళము), ఎలుకచెవియాకు, పట్టికాలోధ్రము, తెల్లతెగడ, శంఖపుష్పి, సంబరేణు, స్వర్ణక్షీరి, తెల్లదింటెన, ఉత్తరేణి, కంపిల్లము, తిప్పతీగె, కానుగు, గొలిమిడి, రేల, చెఱకు, వరగోగుపండు ఇవియన్నియుజేరి శ్యామాదిగణమనబడును. ఈగణద్రవ్యములు గుల్మమును, విషమును, అరుచిని, కఫమును హృద్రోగమును, మూత్రకృచ్ఛ్రమును హరించును.

## ద్రవ్యాలాభమున తుల్యగుణద్రవ్యాభ్యనుజ్ఞ

మూ. త్రయస్త్రింశదితిప్రోక్తాః వర్గాః తేషు త్వలాభతః,
యుఞ్జ్యాత్తద్విధమన్యచ్చ ద్రవ్యంజహ్యాదయౌగికమ్.

వ్యా. ఇత్తెఱంగున వమనగణము మొదలు శ్యామాదిగణమువరకుంగల ద్రవ్యగణములు ముప్పదిమూడు చెప్పబడినవి. ఇందు ఆయాగణములతో పరిగణింపబడిన ద్రవ్యములయందు ఏదైన కొన్నిదొరకనియెడ రసవీర్యవిపాకప్రభావాదులచే నాద్రవ్యములకు సమానములైన యితరద్రవ్యములను ఆయాయౌషధయోగములయం దుపయోగించునది. మరియు గణద్రవ్యములలో నెవ్వియైన నౌషధయోగములకు దగనివియని తోచినచో వానిని విడిచి తక్కిన (యుక్తమగు)వానిని మాత్రము చేర్పనగును.

ఈవిషయమునే సుశ్రుతాచార్యుడును "సమీక్ష్యదోషభేదాంశ్చ గణాన్ భిన్నాన్ ప్రయోజయేత్ పృథఙ్మిశ్రాన్ సమస్తాంశ్చ గణాన్ వా వ్యస్తసంహతాన్" అనువాక్యముచే నుపదేశించిరి. దోషాదిభేదములను గమనించి పైజెప్పినగణములను వేరువేరుగనైనను, కుమ్మరిగనైనను ఉపయోగింపవలె నని భావము.

మరియు నిట్టి ద్రవ్యగణములింకయు ననేకములు కలవు. అయినను అందు మూడుగణములు ప్రధానములని యిచ్చట ప్రత్యేకముగ నిర్దేశింపబడినవి.

అలాభప్రతినిధి

మూ. క్షౌద్రాలాభే జీర్ణగుడ స్తేషు హితస్స్యాత్,
క్షీరాలాభే ముద్గమసూరస్వరసోఽపి,
వ్రీహి శ్శాలేః ఖణ్డమలాభేచ సితాయాః,
రూప్యవాన్యత్కాఞ్చన రూప్యానుపపత్తౌ. ౨౨౦

వ్యా. ఏదైన నొకయౌషధయోగమునందు తేనెను జెప్పియుండ నయ్యది దొరకనిచో దానికిబదులుగ ప్రాతబెల్లమును జేర్చునది. మరియు నిత్తెఱంగుననే ఆవుపాలు దొరకనియెడ పెసలస్వరసమునైనను చిరుసెనగలస్వరసమునైనను జేర్పనగును. రాజనములు దొరకనియెడ సామాన్యములగు వరిధాన్యమునైనను, చక్కెరదొరకనియెడ కల్కండనైనను జేర్చునది. బంగారుగాని వెండిగాని దొరకనియెడ సామాన్యముగ వెండినైన జేర్పనగును.

వర్గద్రవ్యముల నుపయోగించుటచే గల్గుగుణము

మూ. ఏతే వర్గాదోషదోష్యాద్యపేక్షం కల్కక్వాథస్నేహలేహాదియుక్తాః, పానే నస్యేఽన్వాసనేఽన్తర్బహిర్వాలేపాభ్యఙ్గై ర్ఘ్నన్తి రోగాన్ సుకృచ్ఛ్రాన్. ౨౨౧

వ్యా. పైజెప్పినవర్గములను దోషము దూష్యము వయస్సు బలము మున్నగువాని ననుసరించి, తత్తదనుగుణముగ కల్కము క్వాథము స్నేహము లేహము కషాయము మున్నగునౌషధములుగ గల్పించి, పానము నస్యము అనువాసనవస్తి అంతర్లేపము బహిర్లేపము, అభ్యంగనము మొదలగువానికై వైద్యవరుడు ప్రయోగించినయెడల మిక్కిలి కష్టసాధ్యములుగ నుండురోగములును శాంతినొందును.

మాత్రాకల్పనవిధి

మూ. మాత్రాయాః నవ్యవస్థాస్తి వ్యాధిం కోష్ఠం బలం వయః,
ఆలోచ్య దేశకాలౌచ యోజ్యా తద్వచ్చకల్పనా. ౨౨౨

వ్యా. ఔషధములపరిమాణము వ్యాధిబలమును, కోష్ఠభేదమును, రోగియొక్క బలమును, వయస్సును, జాంగలాదిదేశభేదమును, శీతోష్ణాదికాలభేదమును అనుసరించి తత్తదనుగుణముగ మారుచుండును; కావున వైద్యవరుడు పైజెప్పినవ్యాధి కోష్ఠాదిభేదముల ననుసరించి చక్కగ నాలోచించి పరిమితిని కల్పించి యుపయోగించునది.

### మానపరిభాష

మూ. కాకిణీరాజికామాత్రా కాకిణీనాం చతుష్టయమ్,
వ్రీహిః, చతుష్టయం తేషాం గుఞ్జా, గుఞ్జా చతుష్టయమ్. ౨౨౩
పణం, పణద్వయం గుఞ్జాద్వితయంచాపిధానకః
ధానకానాం త్రయం శాణం, నిష్కం స్యాత్తచ్చతుష్టయమ్.
షట్కం తు వటకం కోలం బదరం ద్రుఖ మస్యతు,
అక్షః పిచుః పాణితలం సువర్ణం కబలగ్రహః. ౨౨౪
కర్షో బిడాలపదకః తిన్దుకః పాణిమానికా,
కర్షావష్టమికాశుక్తిః తే ద్వేషోడశికా పలమ్. ౨౨౫
ఆమ్రం చతుర్థికాముష్టిః ప్రకుఞ్చో బిల్వమేవచ,
ద్వేపలే ప్రసృతిః, తౌద్వావఞ్జలిః, కుడవశ్చ తౌ. ౨౨౬
మానికా, మానికాద్వన్ద్వః ప్రస్థః, ప్రస్థచతుష్టయమ్,
ఆఢకం, భాజనం కంసః పాత్రం, పాత్రచతుష్టయమ్. ౨౨౭
కల్పనా కలశో న్మానో ద్రోణః కుమ్భోఘటోర్మణః,
ద్రోణస్య ద్వితయం శూర్పః ఘటౌ ద్వౌఖారికావహః. ౨౨౮
తులాపలశతం, తాసాం వింశతిర్భార ఉచ్యతే,

వ్యా. (ఎండమావులలో కనబడునది అణువు అనబడును. అట్టి యణువులు ఆరుచేరిన నొకమరీచి యగును. ఆమరీచులు ఆరైన నొకరాజిక యనబడును. ఈవిషయము "జాలాన్తరగతైః సూర్యకరైర్వంశీవిలోక్యతే, షడ్వంశిభిర్మరీచిస్స్యాత్ తాభిష్షడ్భిస్తు రాజికా" అనుశ్లోకముచేత తంత్రాంతరమున చెప్పబడినది.)

అట్టి రాజిక కాకిణి యనబడును. అట్టి కాకిణులు నాల్గు ఒకవ్రీహి యగును. నాల్గువ్రీహులు ఒకగుంజ యగును. నాల్గుగుంజలు ఒకపణము. రెండుపణములును రెండు గుంజలును చేరి యొకధానక మగును. మూడుధానకములు ఒకశాణము. నాల్గుశాణములు ఒకనిష్కము. ఆరునిష్కములు కోలము, బదరము, ద్రుఖము, అక్షము, పిచు, పాణితలము, సువర్ణము, కబలగ్రహము, కర్షము, బిడాలపదకము, తిందుకము, పాణిమానిక యనియు చెప్పబడును. రెండుకర్షములు అష్టమిక యగును. రెండు అష్టమికలు ఒకశుక్తి యనబడును. ఈశుక్తి షోడశిక, పలము, ఆమ్రము, చతుర్థిక, ముష్టి, ప్రకుంచము, బిల్వము అని పర్యాయములచే చెప్పబడును.

రెండుపలములు ప్రసృతి యనబడును. రెండుప్రసృతులు ఒకయంజలి యగును. రెండుఅంజలును ఒకకుడవము. ఇదియే మానిక యనియు చెప్పబడును.

రెండుమానిక లొకప్రస్థము. నాల్గుప్రస్థము లొకయాఢకము. ఇదియే భాజనము, కంసము, పాత్రము నని చెప్పబడును.

నాల్గుపాత్రములు ఒకకలశ మనబడును. ఇయ్యది ద్రోణము, ఉన్మానము, కుంభము, ఘటము, అర్మణము నని చెప్పబడును.

రెండుద్రోణములు ఒకశూర్ప మనబడును. ఇయ్యది ఖారిక, వహము నని చెప్పబడును. నూరుపలములు ఒకతుల యనబడును. అట్టితులలు ఇరువదియైన నొకభార మగును. (ఇరువదివందలపలములు ఒకభార మని భావము).

(ఇత్తెఱంగున మానపరిభాష చెప్పబడినది: ఈమానపరిభాషావిషయమై వైద్యకతంత్రములయందు పలుదెఱంగుల భిన్నభిన్నములుగ జెప్పబడినది. అందు కళింగమాన మనియు మాగధమాన మనియు రెండుభేదములజెప్పి, ఆరెంటిలో మాగధమానము శ్రేష్ఠ మనియు "కాళింగం మాగధం చైవ ద్వివిధం మానముచ్యతే, కాలిఙ్గాన్మాగధం శ్రేష్ఠం మానం మానవిదోవిదుః" అనుశ్లోకముచే కొందఱుతంత్రకారులు చెప్పిరి. ఈతంత్రమున జెప్పినపద్ధతికిని ప్రాచీనతంత్రకారులపద్ధతికిని భేదము చాల కనబడును. విస్తరభీతిచే నిట నావిమర్శనము విడువబడినది).

ద్విగుణము వేయుద్రవ్యములు, పలమానవిభేదము

మూ. శుష్కేష్వేవత్విదం మానం ద్విగుణం తదసంభవాత్. ౨౩౦
తేషు క్షీరఘృతార్ద్రేషు కుడవాదావపిద్రవే,
ద్రవ్యేతు నైతన్నిత్యార్ద్రే పలం విద్యాద్దశాఖయోః. ౨౩౧
రసకల్కకషాయాణాం ప్రస్థం షోడశభిః పలైః,
మస్తుకాఞ్జికలాజానాం అమ్బునః క్షీరమూత్రయోః. ౨౩౨
ద్వాత్రింశతాథవింశత్యా తైలమాక్షికసర్పిషామ్,
గుడస్య సప్తదశభిః దధ్నస్స్యాత్పఞ్చషట్పభిః. ౨౩౩

వ్యా. పైజెప్పిన మానపరిభాష ననుసరించి యందుజెప్పినవిధానముగ శుష్కద్రవ్యములజేర్చుతరి నుపయోగించునది. పండినవి లేక వానికిబదులుపచ్చివి యుపయోగించునెడ రెట్టింతగ జేర్పనగును. మఱియు నందును పాలు, నెయ్యి, ఆర్ద్రద్రవ్యములు వీనిని జేర్పవలసినచోట కుడవమునకు లోనగుపరిమాణములను యథోక్తముగనే గ్రహించునది. కుడవమునకు పైనిప్రమాణమును గ్రహించునెడ ద్విగుణముగ గ్రహించునది. (ఈవిషయమునే

"ప్రస్థాదిమానమారభ్య ద్విగుణం తద్ద్రవార్ద్రయోః" అని తంత్రాంతరమున జెప్పిరి). మఱియు నిత్యముగ నార్ద్రములనే గ్రహించవలసినద్రవ్యములనుమాత్రము ద్విగుణముగ గ్రహింప నక్కఱలేదు. మఱియు పదికరక కాయలు ఒకపల మగును.

మఱియు స్వరసము, కల్కము, కషాయము వీనిని కొలుచునప్పుడు పదునారుపలములపరిమితిగల్గిన ప్రస్థము నుపయోగించునది. మీగద, కాంజికము, పేలాలగంజి, పాలు, మూత్రము వీనిని గ్రహించుతరి ముప్పదిరెండుపలములపరిమితిగల ప్రస్థముచే కొలువనగును. నూనె, మాక్షికము (తేనె), నెయ్యి, వీనిని కొలుచునపుడు ఇరువదిపలములపరిమితిగల ప్రస్థముచే కొలువనగును. బెల్లమును గ్రహించునపుడు పదునేడుపలముల ప్రస్థమును గ్రహించునది. పెరుగును గ్రహించునపుడు ఇరువదియైదుపలముల ప్రస్థమునే గ్రహించవలెను.

## పంచవిధకషాయభేదములు, వాని యుత్పత్తికారణములు

మూ. కషాయయోనయః పఞ్చరసాః లవణవర్జితాః,
రసః కల్కః శృతః శీతః ఫాణ్టశ్చేతి ప్రకల్పనా. ౨౩౪
పఞ్చైవ కషాయాణాం పూర్వపూర్వం బలాధికాః,

వ్యా. లవణరస మొక్కటిదక్క తక్కిన మధుర-అమ్ల-తిక్త-కటు-కషాయములను ఐదురసములును కషాయకల్పనమునకు ప్రధానకారణ (ఉత్పత్తికారణ)ములగును. (మధురరసద్రవ్యముల జేర్చి చేయబడినది మధురకషాయము, అమ్లరసద్రవ్యములచేనైనది యమ్లకషాయము, తిక్తరసముచేనైనది తిక్తకషాయము, కటురసముచేనైనది కటుకషాయము, కషాయరసముచేనైనది కషాయము నని యాయారసభేదములచే కల్పింపబడినది యైదువిధములుగ కషాయ ముండు నని భావము).

మఱియు నట్టిద్రవ్యములచే సిద్ధముచేయబడినకషాయము స్వరసము, కల్కము, శృతము, శీతము, ఫాంటము నని యైదువిధముల నుండును. అట్టిభేదములు కల్పనాభేదముచే నగును. పైజెప్పినరీతి నైదువిధములైనకషాయములలో వెనుకవెనుక నొకటికన్న నొకటి యధికమైన బలము కల్గియుండును. (ఫాంటకషాయమునకన్న శీతకషాయంబును, దానికన్న శృతకషాయంబును, అంతకన్న కల్కంబును, కల్కమునకన్న స్వరసంబును అధికవీర్యవంతములై యుండు నని భావము).

## స్వరసకల్పనము

మూ. సద్యస్సముద్ధృతాత్ క్షుణ్ణాత్ యః పతేత్పరిపీడనాత్. ౨౩౫
స్వరసస్సభవేత్తస్య మధ్యమానం చతుష్పలమ్,

వ్యా. అప్పుడులేసిన పచ్చియౌషధమును మెత్తగ నలుగగొట్టి బలవంతముగపిండి నచో స్రవించినరసము స్వరస మనబడును. అట్టిస్వరసముయొక్క మధ్యమమైనపరిమాణము నాల్గుపలములు.

ప్రకారాంతరముగ స్వరసకల్పనము

మూ. ప్రస్థం గృహీత్వాచూర్ణస్య తోయస్య ప్రస్థమావపేత్. ౨౩౬
అహోరాత్రస్థితం పూతం తద్ధి స్వరసవద్భవేత్,

వ్యా. పైజెప్పినరీతిగ స్వరముచేయ వలనుపడనియౌషధులను చూర్ణముచేసి యొక ప్రస్థమాత్రమును గ్రహించి యందు జలము నొకప్రస్థమాత్రమునుగూర్చి యొకయహోరాత్రకాలము ఊరనిచ్చిమరుసటిదినమున గ్రహించి వడియగట్టిన సారసము స్వరసము నకు సమానగుణముగ నుండును.

మఱియు తంత్రాంతరమునందు స్వరసకల్పనమున ప్రకారాంతరముల నిట్లు చెప్పిరి:—"ఆదాయ శుష్కద్రవ్యం వా స్వరసానామసంభవే, జలేఽష్టగుణితే సాధ్యం పాదశిష్టంచ గృహ్యతే. స్వరసస్య గురుత్వాచ్చ పల మర్ధం ప్రయుజ్యతే, నిశోషితం చాగ్నిసిద్ధం పలమాత్రం రసం పిబేత్." (స్వరసకల్పనమునకు పైజెప్పినరీతిగ పచ్చివి ద్రవ్యములు దొరకనియెడల యెండినద్రవ్యమును గ్రహించి ఆద్రవ్యమున కెనిమిదింతలనీళ్లుపోసి నాలవపాలు మిగులునట్టులు కాచి వడగట్టి స్వరసమునకు బదులుగ నుపయోగించునది. అయ్యది పక్వమైనదియగుటంజేసి వీర్యాధికమై యుండును; కావున దాని నర్ధపలమాత్రము సేవింపనగును. లేక అట్టియెండినద్రవ్యమును నలుగగొట్టి నీటిలో వైచి రాత్రియం దూరనిచ్చి మరుసటిదినమున కాచి వడగట్టి గ్రహించునది. దీనిని ఒకపలమాత్రముసేవింప నగును) ఇట్టి కల్పనముగూడ స్వరసమునకు సమానగుణముగ నుండునని భావము.

కల్క-శీత-ఫాంటకల్పనములు

మూ. కల్కస్య కర్షమాలోడ్యం తద్ద్రవస్య పలత్రయే. ౨౩౭
షట్పలే వా పలం ద్రవ్యాత్ శీతో రాత్రిం దివం స్థితమ్,
సద్యోఽభిషుతపూతస్తు ఫాణ్టస్తోయ చతుష్పలే. ౨౩౮

వ్యా. ద్రవ్యమును కర్షమాత్రముచేర్చి యందు మూడుపలములు నీళ్లుపోసి నూరి యందు రసమును దీసిన నయ్యది కల్క మనబడును. ఒకపలము పరిమితికలద్రవ్యమున ఆరుపలములు నీళ్లుపోసి యొకరాత్రియు పగలును నానబెట్టిన నయ్యది శీతకషాయ మన బడును. పచ్చిదియైనను ఎండినదియైనను ఓషధిని ఒకపలమును గ్రహించి అందు నాల్గుపల ముల మితముగ నీళ్లుపోసి మెత్తగ నూరి అప్పుడే వడగట్టి గ్రహించిన నయ్యది ఫాంట మనబడును.

### శృతకషాయకల్పనవిధి

మూ. ద్రవ్యపలేద్వాత్రింశత్పలసలిలం కృథితమష్టమాంశస్థం,
దోషేషు షోడశాష్టమపాచనిరూఢం విలాపయేచ్ఛృతవత్.

వ్యా. ఒకపలముపరిమితికల ద్రవ్యమున ముప్పదిరెండుపలములు నీళ్లుపోసి యెనిమిదవపాలు మిగులునట్లుకాచిన నయ్యది శృతకషాయ మనబడును. మఱియు వాతమునందు పదునారవపాలు మిగులకాచబడినకషాయమును, పిత్తమున నెనిమిదవపాలు మిగులకాచబడినకషాయంబును, కఫమున నాల్గవపాలు మిగులకాచబడినకషాయంబును ఉపయోగింపందగును. ఇది వాతాదిదోషత్రయము ననుసరించినకషాయపాకవిధి.

### స్నేహకషాయకల్పనము

మూ. ద్రవ్యాణి షోడశగుణే సలిలే క్వాథయేత్తతః,
చతుర్థశేషం క్వాథోఽయం గ్రాహ్యం స్యాత్ స్నేహసాధనే.

వ్యా. స్నేహపాకవిధి ననుసరించి తైలఘృతాదులపక్వము చేయునప్పుడు అందు కషాయముల జేర్పవలసినచో నట్టికషాయమును ద్రవ్యమునకు పదునారుభాగములు నీళ్లు కలిపి నాల్గవపాలు మిగులునట్లు కాచి యాకషాయమును జేర్చి స్నేహములపక్వము జేయనగును.

### కషాయద్రవ్యభేదముచే పాకకాలనియమము

మూ. ద్వాదశాహం తు సారాణాం మూలానాం సప్తవాసరః,
వల్లీనాం త్ర్యహమేకాహం పాకస్స్యాచ్ఛాకధాన్యయోః ౨౮౦

వ్యా. స్నేహపాకమునకు కావలసినకషాయమును సిద్ధముచేయునపుడు కషాయద్రవ్యముచే గల్గినదియైనచో నట్టికషాయమును పండ్రెండుదినములు పాకముచేయవలెను. అట్టిద్రవ్యము వేళ్లుగా నున్నపుడు ఏడుదినములు పాకముచేయవలెను. అయ్యది తీగలైనచో మూడుదినములు పాకముచేయనగును. ఆకుదినుసులును ధాన్యములు నైనయెడ ఒకదినముమాత్రము పాచనముచేసిన చాలును.

### స్నేహపాకమునకల్కాదిప్రమాణము

మూ. స్నేహపాకేత్వ మానోక్తౌ చతుర్గుణవివర్ధితమ్,
కల్కస్నేహద్రవం యోజ్యం; అధీతే శౌనకః పునః. ౨౮౧
స్నేహేసిద్ధ్యతి శుద్ధామ్బునిష్క్వాథస్వరసైః క్రమాత్,
కల్కస్య యోజయేదంశం చతుర్థం షష్ఠమష్టమమ్. ౨౮౨

వ్యా. తైలము మున్నగుస్నేహములను పక్వముచేయునపుడు కల్కస్నేహద్రవములకు వేరువేరపరిమాణమును జెప్పనియెడ, కల్కమునకు నాలుగింతలు స్నేహద్రవ్యమును,

స్నేహద్రవ్యమునకు నాల్గింతలు కషాయస్వరసాదిద్రవద్రవ్యములును చేర్చి విధిప్రకారము స్నేహమును పక్వము జేయునది.

మఱియు కేవలము జలమునుమాత్రము జేర్చి స్నేహమును పక్వముచేయవలసినయెడ స్నేహద్రవ్యమునకు నాల్గవపాలు కల్కమును జేర్పనగును. కషాయమునుజేర్చి పక్వము జేయవలసెనేని తైలమునకు ఆరవపాలు కల్కమును జేర్పనగును. ఆకులు మున్నగువాని స్వరసమునుగూర్చి పక్వము జేయవలసినయెడ తైలమునకు ఎనిమిదవపాలు కల్కమును జేర్చవలెను. ఈనిర్ణయమును శౌనకమహర్షి చెప్పిరి.

మఱియు "దుగ్ధే దధ్నిరసే తక్రే కల్కో దేయో ఽష్టమాంశకః" అని తంత్రాంతరమున జెప్పబడినది. పాలనైనను పెరుగునైనను స్వరసమునైనను జేర్చి తైలము పక్వము జేయవలసియెడ స్నేహమునకు ఎనిమిదవపాలు కల్కమును గూర్పనగు నని భావము.

### స్నేహపాకమున క్షీరాదిపాకవిధానము

మూ. క్షీరమస్త్వారనాళానాం పాకో నాస్తి వినామ్భసా,
తస్మాద్వీర్యవిముక్త్యర్థం తోయం దద్యా చతుర్గుణమ్. ౨౮౩

వ్యా. పాలు, పెరుగుమీదిమీగడ, గంజి అను నీమూటికి నీటిసంబంధములేక పాకము కల్గదు. కావున వీనినిగూర్చి తైలాదులను పక్వముజేయవలసినప్పుడు కల్కము పక్వసారము స్నేహములగలయుటకై తైలమునకు నాల్గింతలునీళ్లు కలిపి తైలపాకవిధిగ కాచవలెను.

మరియు పెరుగునైనను, మాంసరసమునైనను, మజ్జిగనైననుగూర్చి తైలాదుల పక్వము జేయవలసినప్పుడును కల్కద్రవ్యము పాకమునొంది వానిసారము తైలమున సంక్రమించుటకై స్నేహద్రవ్యమునకు నాల్గింతలు నీళ్లు కలుపవలెను. ఈవిషయము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"దుగ్ధే దధ్నిరసేతక్రే కల్కో దేయోఽష్టమాంశకః, కల్కస్య సమ్యక్పాకార్థం తోయ మత్ర చతుర్గుణమ్."

### స్నేహపాకమున కల్కకషాయాది నిర్ణయము

మూ. నిర్యాసోక్తా మాత్రకల్కః తత్రస్నేహతుల్యక్షీరః,
కల్కః కార్యోనిర్యాసాద్యైః కల్కద్రవ్యైర్నిర్యాసోవా. ౨౮౪

ఏతైలమందైనను కషాయము వేరుగాజెప్పి కల్కద్రవ్యములపరిమాణము ప్రత్యేకముగా జెప్పబడియుండినచో నందు క్షీరము స్నేహద్రవ్యమునకు సమపరిమాణముగా వేయవలెను. ఏతైలమందైనను కషాయద్రవ్యములుచెప్పి కల్కద్రవ్యములు చెప్పనప్పుడు కషాయద్రవ్యములనే స్నేహమునకు నాల్గవవంతుగా కల్కమును జేయవలెను. అట్లే

కల్కద్రవ్యములమాత్రముచెప్పి కషాయద్రవ్యములను జెప్పనప్పుడు కల్కద్రవ్యముల తోనే కషాయవిధానముతో గషాయమునుగూడ బెట్టి చేర్చవలెను.

క్షీరాదులగూర్చునపుడు తైలపాకకాలనియమము

మూ. క్షీరేద్విరాత్రం స్వరసేత్రిరాత్రం స్నేహః కషాయేషు తు పఞ్చ రాత్రం, తక్రారనాళేపునరేకరాత్రం పక్త్వా పునః పాకసిద్ధి ర్విధేయః. ౨౮౫

వ్యా. పాలనుజేర్చి స్నేహములపక్వముజేయుయెడ రెండురాత్రులు కాచవలెను. స్వరసముచేర్చుయెడ మూడురాత్రులును, కషాయమును జేర్చుయెడ నైదురాత్రులును, గంజినిజేర్చునపుడు ఒకరాత్రికాలంబును కాచి తైలపాకవిధిప్రకారము పాకావస్థ నెరింగి పక్వముచేయనగును.

స్నేహసామాన్యముగ పక్వలక్షణము

మూ. నాఙ్గులిగ్రాహితాకల్కే సస్నేహేఽగ్నౌ నశబ్దతా,
వర్ణాదిసమ్పచ్చ యదా తదైనం శీఘ్రమాహరేత్. ౨౮౬

వ్యా. తైలాదులు పక్వమగునపుడు అందలికల్కమును వెలికిందీసి వ్రేళ్లచేత నలిపిన యెడ వ్రేలికంటక, తైలమును నిప్పుపైవైచిన చుయ్యనుశబ్దము కలుగక, తైలమున మంచి రంగును వాసనయు కల్గినచో అప్పుడు తైలము సిద్ధమైనదని యెరింగి అప్పుడేదించవలెను.

మరియు "వర్తివత్ స్నేహకల్కస్స్యా ద్యదాఙ్గుల్యావిమర్దితః, శబ్దహీనోగ్నిని క్షిప్తః స్నేహస్సిద్ధోభవేత్తదా" అని తంత్రాంతరమున జెప్పియున్నది కావున తైలమునం దలి కల్కమును వ్రేళ్లతో నలిపినయెడ చేతి కంటుకొనక వత్తివలె నుండునేని స్నేహము సిద్ధమైన దని యెరుంగునది.

ఘృత-తైల-లేహములకు వేరువేరపక్వలక్షణములు

మూ. ఘృతస్య ఫేనోపశమః తైలస్యచ తదుద్భవః,
లేహస్య తన్తు మత్త్వాప్సు మజ్జనం నైవశీర్యతే. ౨౮౭

వ్యా. ఘృతమును పక్వముచేయునపుడు నురుగు శమించి తేటగ నుండినచో ఘృతము సిద్ధమైన దనియు, తైలమును పక్వముజేయుతరి నురుగుకల్గినయెడ తైలము సిద్ధ మైనదనియు, చక్కెర మున్నగువానిజేర్చి లేహమును పక్వముజేయుతరి అయ్యది పైకె త్తినతీగవలెనుండి యుండజేసి నీళ్లలో వైచిన నయ్యది నీళ్లలో కలియక మునింగినయెడ లేహము సిద్ధమైన దనియు నెరుంగునది.

**మృదు-చిక్కణ-ఖర-పాకములు. వానిలక్షణములు**

మూ. పాకస్స్యాత్త్రివిధస్తత్ర మృదౌపిచు నివర్తకః,
చిక్కణస్స్పర్శమాత్రేణ కల్కశ్ఛ్రియతి నిమ్నతామ్. ౨౮౭
ఖరేమణిరవఃకంసే శర్కరాచూర్ణకర్కశః,
దగ్ధోఽతఊర్ధ్వం నిష్కార్యం శ్యామం స్యాదగ్నిమాన్ద్యకృత్.

వ్యా. పైజెప్పినతైలాదులపాకము మృదు-చిక్కణ-ఖరములను భేదములచే మూడు విధములు. అందు తైలాదులతో గూడ జేర్చి పక్వముచేయబడిన కల్కరూపమైన పిప్పి తైలమునం గలియక వేరుగ నేర్పడియుండిన నయ్యది మృదుపాకము. అట్టి కల్కమును ముద్దజేసి చేతనంటినయెడ మెత్తవడి పల్లముగ నేర్పడునేని అయ్యది చిక్కణపాకము. (దీనినే మధ్యపాక మని యితరతంత్రకారులు నుడివిరి). అట్టి కల్కమునీసి పళ్లెమున బిఱ్ఱుగవైచినచో గంటవలె మ్రోతపుట్టి చేతికి కర్కశమై చక్కెరవలె విడివిడిగ విరిసిన నయ్యది ఖరపాక మనబడును. అంతకన్న పాకము ముదిరిన నయ్యది నల్లగ మాడియుండును. ఇది దగ్ధపాక మనబడును. ఈపాకముకల్గినచో నాయౌషధము పనికిరాదు. దాని నుపయోగించిన కాయాగ్ని మందగించును.

మరియు పైజెప్పినమూడుపాకములకన్న తక్కువగ (పచ్చిగల్గి) ఉండుపాకము ఆమపాకము. ఇదికూడ నిష్ప్రయోజనము. అంతియగాక గురుత్వముకల్గి అగ్నిమాంద్యమును కల్గించును. ఈవిషయము తంత్రాంతరమున నిట్లున్నది:—"ఆమపాకశ్చ నిర్వీర్యో వహ్నిమాంద్యకరో గురుః."

**త్రివిధస్నేహపాకములకు ప్రత్యేకోపయోగము**

మూ. మృదుర్నస్యేఖరోఽభ్యఙ్గే పానే వస్తౌచ చిక్కణః,

వ్యా. నస్యమున కుపయోగించెడిది మృదుపాకముగను, అభ్యంగనమున కుపయోగించు తైలము ఖరపాకముగను, పానమునకును వస్తికర్మలకును ఉపయోగించుతైలము చిక్కణపాకముగను ఉండవలెను.

**కొన్నిఘృతములను సేవించవలసిననియమము**

మూ. అనిస్సృతం వృషఘృతం దాధికం షట్ఫలం ఘృతమ్. ౨౯౦
కల్యాణకం పఞ్చగవ్యం తిక్తాఖ్యం వృషసాధనమ్,
పాతవ్యం; నిస్సృతంపేయం బాలస్థవిరదుర్బలైః. ౨౯౧

వ్యా. వృషఘృతము, దాధికఘృతము, షట్ఫలఘృతము, కల్యాణఘృతము, పంచగవ్యఘృతము, తిక్తకఘృతము ఇవియన్నియు వృష్యసాధనములు. వీనిని పానముచేయు

నపుడు పడగట్టకయే త్రాగవలెను. బాలురును వృద్ధులును బలహీనులును మాత్రము పడ గట్టి త్రాగవలెను. (వీరికి జీర్ణశక్తి తక్కువగనుండును. కావున పడగట్టి త్రాగవలె నని భావము.)

అభయాపాకవిధి

మూ॥ హరీతకీ పాకవిధౌ భేషజానాం తులాద్వయమ్,
అష్టద్రోణజలేమానం పక్త్వాస్మిన్నష్టశేషితే. ౨౫౨
పథ్యాసహస్రం గోమూత్రే స్విన్నం సూచీ చికుట్టితమ్,
తులాంగుడాత్ పృథక్ప్రస్థం ఘృతాత్తైలాద్రసాదపి. ౨౫౩
నిక్షిప్యపక్త్వామాసార్థం సద్యః క్వాథేఽవచారయేత్,
హరీతక్యస్థిసంభిన్నే తన్మజ్జాఞ్జనసన్నిభమ్. ౨౫౪
అరిష్టం తస్తు మృద్వీప్రలేపీజ్వాలనేపునః,
సుగన్ధముదకేక్షిప్తం క్షణాన్మజ్జతిలోహవత్. ౨౫౫
నశీర్యతే తతశ్శుద్ధాం బుద్ధ్వాదక్వాతయోపమః,
శీతే తస్మిన్ దశపలం చూర్ణాన్మధ్వాఢకం క్షిపేత్. ౨౫౬

వ్యా॥ హరీతకీపాకవిధానము క్రిందజెప్పంబడును. అట్టిపాకవిధానయోగమున జెప్పినఔషధములను రెండుతులలు (రెండువందలపలములు) గ్రహించి యెనిమిదిద్రోణముల పరిమితమైన నీళ్లలో బోసి యెనిమిదవపాలు మిగులునట్టులు కాచియుంచునది. పిదప వేయికరకకాయలను గోమూత్రమున వైచి యుడికించి సూదులతో బొడిచి పైజెప్పిన కషాయమున నుంచునది. మరియు నొకతులము (నూరుపలములు) బెల్లమును, నెయ్యి తైలము మాంసరసము వీనిని ప్రత్యేక మొక్కొకప్రస్థంబును కరకకాయలతోగూడ కషాయమున నుంచునది. ఇత్తెఱంగున నన్నిటి నొకటిగ పైజెప్పినకషాయమునగూర్చి అర్ధ మాస(పదునైదుదినముల)కాలము పక్వముచేసి దించునది. అట్టియెడ కరకకాయను పగుల గొట్టిన దానిలోనుండుపప్పు కాటుకవలె నల్లగనుండును. అందుండు అరిష్టము (ద్రవరూప మైన యౌషధము) తీగెసాగి గరిటె కంటికొనును. నిప్పునవైచినచో మంచివాసనకల్గి, ఉద కమునవైచినయెడ క్షణముననే యినుపముక్కవలె మునింగి విరియబడక యుండవలె గుంద్రనై యుండును. అయ్యది చల్లబడినపిదప అందు జేర్పదగినద్రవ్యములను పదిపలములు చూర్ణముచేసి వస్త్రగాలితముజేసి కలుపునది. పిదప నాఢకపరిమితముగ తేనె కలుపునది. ఇదియ హరీతకీపాకవిధానము.

### అరిష్టాదులయందు గుడమాక్షికాది పరిమాణము

మూ. అరిష్టేషు తు సర్వేషు ద్రోణే శతపలం గుడాత్,
మాక్షికం తు గుడస్యార్ధం యోజయేన్మతిమాన్ భిషక్. ౨౫౭
చిరావస్థాయిషు పునః ద్విగుణం త్రిగుణం పునః,
చిరావస్థాస్వకిట్టేషు పాకే క్షిప్తే తు వారిణి. ౨౫౮
శుద్ధేన బుద్బుదోత్థానం దేయో౽త్రావాపచూర్ణతః,
గుడస్య దశమో భాగః క్రమేణ నవమో౽ష్టమః,
క్షౌద్రం గుడార్ధమభయాం వినా శేషేషు పూర్వవత్. ౨౫౯

వ్యా. అన్నివిధములైనయరిష్టములయందును ద్రోణపరిమితజలమున నూరుపలములు బెల్లము చేర్పనగును. తేనెను బెల్లములో సగపాలుండునట్లు (ఏబదిపలములు) చేర్పవలెను. అట్టియరిష్టములు చిరకాలమువర కుండవలసినచో తేనెను ద్విగుణముగ జేర్పనగును. అట్టి యరిష్టములయందు కిట్టములేక చిరకాల ముంచవలసినయెడ త్రిగుణముగ తేనెను గూర్పనగును. అట్టి యరిష్టములపాకమునందు శుద్ధమైనజలమును వైచినయెడ నీటిలో బుడగలులేవక యుండును. అదియే మంచిపాకము. మఱియు నీపాకవిధియందు బెల్లమును పదియవపాలును జెప్పనగును. అయ్యది చిరకాల ముండవలసెనేని చూర్ణమునకు తొమ్మిదవపాలును, పిప్పిలి లేకయుంచునెడ యెనిమిదవపాలును బెల్లమును జేర్పవలెను. ఆబెల్లమునం దర్ధభాగము తేనెను జేర్పవలెను. ఈనియమము అభయాపాకమునదప్ప తక్కినయరిష్టపాకములకు జెప్పబడినది.

### ఆసవాదులకు ధాన్యపుటనిక్షేపము

మూ. ఆసవాష్షాడబాలేహ్యాః పథ్యాశ్చాధికశక్తయః,
భవన్తి మాసం పక్షం వా ధాన్యమధ్యేనిధాపనాత్. ౨౬౦

వ్యా. ఆసవములును, షాడబములును, లేహ్యములును, పథ్యము (పైజెప్పినరీతిగ పక్వముచేయబడిన కరకకాయలును)లును ధాన్యమున నుంచుటచే మిగుల శక్తికల్గియుండును; కావున పైజెప్పిన ఆసవాదులను ఒకనెలదినములైనను పదునైదుదినములైనను ధాన్యమధ్యమున నుంచునది.

### ఆసవాదులకు వీర్యహీనకాలనియమము

మూ. షణ్మాసాదవరం చూర్ణం స్నేహస్సంవత్సరాత్పరమ్,
త్రివర్షాణ్యభయారిష్ట స్సంవత్సరచతుష్టయాత్. ౨౬౧

వ్యా॰ చూర్ణము ఆరుమాసములవరకును చెడక వీర్యవంతముగ నుండును. ఘృత తైలాదిస్నేహములు ఒకసంవత్సరకాలము వీర్యవంతముగ నుండును, అభయాపాకము మూడుసంవత్సరములకాలము వీర్యవంతముగ నుండును. అరిష్టములు నాల్గువత్సరముల కాలము వీర్యవంతములుగ నుండును. (పైజెప్పిననియతకాలము నతిక్రమించినచో నాయాయౌషధాదులు చెడి వీర్యహీనములగు నని భావము).

చూర్ణాదులసేవించుపరిమితి

మూ॰ చూర్ణమోదకయోర్మాత్రా కర్షో లేహస్య తత్పలమ్,

వ్యా॰ చూర్ణములను మోదకములను సేవించునపుడు ఒకకర్షప్రమాణంబును, లేహము నొకపలపరిమితంబును సేవింప నగును.

గుడశోధనము

మూ॰ అథ స్వయం ద్రవీభూతే క్వాథ్యమానే గుడే జలమ్. ౨౬౨
ద్రవ్యైస్తత్తత్ప్రయోగోక్తైః జీవన్త్యావా శృతం జలమ్,
ఘనేతు ద్విగుణం, తస్య చించావల్కలభస్మచ. ౨౬౩
శతభాగికమావాప్య మలినీభూతముద్గతమ్,
అపోహ్య ఫేనం విపచేత్ గుడస్యైవం విశోధనమ్. ౨౬౪

వ్యా॰ బెల్లము ద్రవముగ నున్నయెడ అట్టిబెల్లమును ఒకపాత్రలోవేసి ప్రొయి మీద నునిచి యుడుకునపుడు శుద్ధజలమునైనను, ఆయాయౌషధయోగములజెప్పిన ద్రవ్యములతో సిద్ధమైనజలమునైనను, పాలకూరనుచేర్చి కాచబడినజలమునైనను బెల్లమునకు సమభాగముగ జేర్చునది. ఆబెల్లము ద్రవముగాక గడ్డగనుండునేని పైజెప్పినజలమును బెల్లమునకు రెండింతలు చేర్చునది. మఱియు చింతచెక్కలబెరడును కాల్చి బూడిదగాజేసి యాబూడిదను బెల్లమునకు నూరవభాగము కలుపునది. పిమ్మట కాచినచో మలినమైన నురుగు బెల్లముపై తేలును. అట్టినురుగును దూరం బుచ్చి పక్వముచేసి బెల్లమును గ్రహించి ఆయాయోగములజేర్చునది. ఇట్టిసంస్కారమును జేసినచో బెల్లము దోషరహితమై శుద్ధముగ నేర్పడును. ఇదియేగుడశోధనక్రమము.

గుగ్గులుశోధనము

మూ॰ నిదిగ్ధికామృతావాశా ముస్తారిష్టకుకూలకైః,
జలం పక్త్వా తదుష్మాయాం గుగ్గులుం తేన శోధయేత్. ౨౬౫
లేఖనే గవ్యమూత్రేణ హరిద్రాయారసేనవా,
క్షీరేణ రోపణే మేదః కఫయోస్సంక్షయే పునః. ౨౬౬

త్రైఫలేన కషాయేణ సర్వత్రయుతమమ్భసా,
అష్టమాంశప్రమాణేన లేహవత్సాధుసాధితమ్. ౨౬౭
శీతం భాణ్డే నవే వేణునాడ్యాం వాధారయేన్మృదు,

వ్యా. వాకుడు, తిప్పతీగె, అడ్డసరము, తుంగగడ్డలు, వేము వీనిని కాల్చి బూడిదచేసి యాబూడిదను నీళ్లలో బోసి కాచి యాపాత్రకు గుడ్డ వాసెనగట్టి దానిపై గుగ్గిలమును పొడిజేసి యునిచి పైని మూకమూసి ఆనీటిచే నావిరిచే గుగ్గిలమును పక్వము జేయునది. ఇట్లుజేసినచో గుగ్గిలమున మలినమువదలి శుద్ధమగును. గుగ్గిలమును లేఖనమున కుపయోగించునెడ అవుపంచితమునసైనను పసుపురసమునందైనను పైజెప్పినరీతిగ నావిరిచే పక్వముచేసి యుపయోగించునది. వ్రణములమాన్పుటకై యావుపాలచేతను, మేదోవృద్ధి యందును కఫప్రకోపమునందును త్రిఫలకషాయముచేతను, తక్కినరోగములయందు శుద్ధ జలముచేతను పైజెప్పినరీతిగ శుద్ధిచేసి యుపయోగించునది. పైజెప్పినరీతిగ పక్వముజేయు నపుడు ద్రవమునకు ఎనిమిదవపాలు గుగ్గిలమునుజేర్చి లేహపక్వముగజేసి చల్లారినపిదప క్రొత్తదుత్తలోనైనను, వెదురుగొట్టమునందైనను పదిలముగ నుంచునది.

మండూరశోధనక్రమము

మూ. అతిపక్వైర్బదిరాఙ్గారైః ర్హాత్రైగ్ధాతమయోమలమ్. ౨౬౮
నిర్వాపితం గవాం మూత్రే శ్నతశశ్చూర్ణితం రసైః,
భృఙ్గామలకమత్స్యాక్షీ హారిద్రాణాం విపాచయేత్. ౨౬౯
సర్వవ్యాధిషు యుఞ్జ్యాత్తం శుద్ధమఞ్జనసన్నిభమ్,
స్నేహోక్తం లోహరజో భృష్టం స్వరసేఽపి రాత్రిదార్వీణాం,
పృథగేవ సప్తకృత్వః భర్జితమఖిలామయే యోజ్యమ్. ౨౭౦

వ్యా. (కంసాలకొలిములయందు ఇనుము నునిచి యూదినచో నినుమునుండి మలినమంతయు చిట్టెము గట్టును. ఇదియే అయోమల మనబడును.) అయ్యది యరువది సంవత్సరములు గడచినదియైనచో శ్రేష్ఠము. అట్టి పాతయినుపచిట్టెమును, నిప్పులో వైచి యూది యెఱ్ఱగ కాలనిచ్చి గోమూత్రమున చల్లార్చునది. ఇత్తెఱంగున నూరుపర్యాయ ములుచేసి నూరి పొడిచేయునది. పిమ్మట గుంటకరగరాకురసము, ఉసిరికకాయలరసము, పొన్నగంటియాకురసము, పసుపురసము ఈరసములయందునిచి యుడకబెట్టిన కాటుక వలె మెత్తనై నల్లగ నుండును. ఇదియే మండూరశుద్ధిక్రమము. ఇట్టి మండూరమును సకలవ్యాధులయందు నుపయోగించునది.

మరియు పైజెప్పినరీతిగ గోమూత్రమున భావనచేసినమండూరచూర్ణమును నూనెలో తడిపి కాచి పసుపుయొక్కయు మ్రానిపసుపుయొక్కయు స్వరమునుబోసి వేచవలెను. ఇత్తెఱంగున నేడుపర్యాయములు వేచి సకలరోగములయందు నుపయోగించునది. ఇది యొకవిధమైన మండూరశుద్ధి.

శిలాజితుశోధనము

మూ. సమగిరిజమష్టగుణితే నిష్కాథ్యం వా వనౌషధం తోయే,
తత్సురసతాం యాతం సంక్షిప్తం ప్రతీపేద్రసంభూయః. ౨౭౧
సైవసైన్వరేవం క్వాథైః భావ్యం వారాణ భవేత్సప్త,
శుష్కంతు యావదార్ద్రం యాత్యేనం భావనారసైస్తావత్.

వ్యా. శిలాజితును దానికి సమానమగుశోధన ఓషధులను ఎనిమిదిరెట్లు నీటిలో వేసి కషాయము కాచి యది వడకట్టి అందులో నీశిలాజిత్తును వైచికరిగించి ఎండించుచు తిరిగి కషాయమును వైచుచు నాయాశోధకకషాయములతో నేడేసిమారులు భావనను చేయవలెను.

ఇట్లు ఎండించినను శిలాజిత్తు ఎప్పుడు ముద్దగనే యుండునో అంతవరకు కషాయములతో భావనలుచేయవలెను. ఇదియే శిలాజితుశోధనము.

శిలాజితును ఎండించినప్పుడు ఎండవేడికి పైకితేలుచుండుశిలాజితును పాత్రాంతరమున వైచి అడుగున నుండుకషాయభాగమును పారబోయుచుండవలెను.

అమృతశర్కరావిధానము

మూ. గుడూచ్యాజాతసారాయాః ఖణ్డాజజ్జరితాజలే,
ఆసుత్యగాలితోమణ్డః శుష్కశ్చామృతశర్కరా. ౨౭౩

వ్యా. తిప్పతీగెను మిక్కిలి ముదిరినదానిగ చూచి తెచ్చి పచ్చిగనుండునపుడే తునియలుగ ఖండించి నీళ్లుపోసి మెత్తగ నూరి యారసమును వడియగట్టి తీసికొని పొయిమీద నునిచి నీరంతయు చుండునట్లు కాచిన పాత్రకడుగున తెల్లనిచక్కెర నిలుచును. ఇది యమృతశర్కర యనబడును. (అనగా తిప్పసత్తు.)

లాక్షాగృహకన్యారసాహరణప్రకారము

మూ. కుళుత్థక్షారలోధ్రోన్మిష్ణతో యైస్లాక్షారసం హరేత్,
హారీతకీరజోఘర్షాత్ ద్రావయేద్గృహకన్యకాః. ౨౭౪

వ్యా. లక్కయొక్కరసమును తీయవలె ననినచో ఉలవలు కాల్చినబూడిద లొద్దుగు పట్ట వీనిని వేడినీటిలో వైచి యందు లక్కను వైచి మఱిగించినచో లక్క జలములో కలిసి ద్రవరూప మగును. దానిని వడగట్టి యుపయోగించుకొనవలెను.

కలబాదమట్టబిళ్లలలో కరకకాయచూర్ణమును వైచి పిసికినచో పలచనిద్రవము గావచ్చును.

### క్షారపాకవిధానము

మూ. గోమూత్రస్యామ్బసాం వాపి తోళితం షడ్భిరాఢకమ్,
క్షారకమ్బలశాటీభిః డోలాయన్త్రేణ గాలయేత్. ౨౭౫
యావత్పిచ్ఛిలరక్తాచ్ఛ స్తీక్ష్ణో జాత స్తథాచతమ్,
గృహీత్వా క్షారనిష్యన్దం పచేత్ స్థాల్యాం విఘట్టయన్. ౨౭౬
పక్వే పాదావశిష్టేఽస్మిన్ క్షారస్సపునరాయసే,
శుక్తి శఙ్ఖాదికం వహ్నౌత స్తం నిర్వాపితం పునః. ౨౭౭
తేనైవం పిష్టనచ్చాన్యల్లేఖనం లవణౌషధమ్,
మితం పలైర్ద్వాదశభిః ప్రతివాపం వినిక్షిపేత్. ౨౭౮
పరితస్సుతరాంచాతో తర్వ్యాతమువఘట్టయేత్,
సబాష్పైశ్చ యదోత్తిష్ఠేత్ బుద్బుదైర్లేహవత్పునః. ౨౭౯
మాయూరాణాంచ పిఞ్ఛానాం కేశానాం చాపి శాతనమ్,
అవతార్యతదాశీతం యవరాశావయోమయే. ౨౮౦
స్థాపనీయం స తు పరం ప్రయోజ్యస్స ప్తవాసరాన్,
బలార్థం క్షీరపానీయే క్షారామ్బుపునరావపేత్. ౨౮౧
నాతితీక్ష్ణం మృదుశ్లక్ష్ణం పిచ్ఛిలం శీఘ్రగశ్శితః,
శిఖరీసుఖనిర్వాప్యో స్సన్ధిశ్నిచ నాతిరుక్. ౨౮౨
క్షారోదశగుణశ్శస్త్రాత్తేజసా మపి కర్మకృత్,
శతేన పఞ్చవింశత్యా పఞ్చభిశ్చ పలైర్మితః. ౨౮౩
ద్రవ్యం లవణచూర్ణంచ తోయం క్షారావథావపేత్,

వ్యా. క్షారకల్పనకు చెప్పబడినముష్కకాదుల బూడిదను గోమూత్రముగాని శుద్ధోకముగాని ఒక అఢకమున కారుఆఢకములుపోసి కలిపి నారగుడ్డతోగాని కంబళి గుడ్డతోగాని డోలాయంత్రమువలె గట్టి యం దీద్రవమును పోసి అడుగున పాత్రనుంచి యిందలి క్షారోదకమును వడకట్టవలెను.

ఆక్షారోదకము కొంచెము జిగురుగను ఎఱ్ఱనితేటరంగును కలిగియుండునప్పుడు ఆక్షారోదకమును ఇనుపపాత్రలో పోసి ప్రొయిమీదబెట్టి కలుపుచు పాకముచేయవలెను.

అందు నాల్గవభాగము మిగులునప్పుడు ఆలుచిప్పలు, శంఖములు నిప్పులో కాల్చి యందు ముంచుచు చల్లార్చవలెను.

పిమ్మట నాక్షారద్రవములోనే ఆశంఖములు మెదవైనవియు ఇంకను లేఖనార్థము చెప్పబడినలవణక్షారాదులును బాగుగా నూరి యందు కలుపవలెను. ఇట్లు కలపవలసిన ద్రవ్యములపరిమాణము 12 పలము లుండవలెను.

పిమ్మట నంతటను బాగుగా గరిటెతో కలుపుచుండవలెను. అక్షార మావిరితో బుడగలువచ్చుచు లేహ్యమువలె గట్టిపడి నెమలిపింఛపుకండ్లవంటిరంగుతో నాబుడగలు కనపడుచుండునప్పుడు దానిని దింపవలెను.

అట్లు దింపి చల్లారినతరువాత యినుపబుడ్డిలో నునిచి యవరాశిలో నేడు దినములు పూడ్చియుంచి తరువాత నుపయోగింపవలెను.

అగ్నిబలముకొరకు పానముచేయవలసినక్షారమును పాలలోగాని మంచినీటిలోగాని స్వల్పముగా వైచి త్రాగవలెను.

ఇట్లు పాకముచేయబడినక్షారమునకు ఎక్కువ తీక్ష్ణము గాకుండుట, మృదువుగా నుండుట, జిగురుగానుండుట, శీఘ్రముగా పనిచేయుట (వ్యాపించుట) చిన్నబుడగలు కట్టియుండుట, సుఖముగా మాన్పదగినపుండును జేయుట, ఎక్కువపీడనుకలిగింపకుండుట అనునవి యుత్తమగుణములు.

క్షారము శస్త్రముకంటె పదిరెట్లును అగ్నికంటె పదిరెట్లును ఎక్కువగా కార్యమును సాధించును.

క్షారకల్పనములో క్షారము ఎండిపోయినప్పుడు నూటయిరువదియైదుపలముల క్షారములో అయిదుపలములు క్షారద్రవ్యము లవణములును చేర్చవలెను. నీరు క్షారమునకు దగినట్లు చేర్చుట యుక్తము.

## స్నేహపాకక్రమము

మూ. అథ ప్రశస్తే దివసే యజమానానురోధిని. ౧౮౪
దేవాన్ విఘ్నేశసూర్యాదీన్ అశ్వినౌ బ్రాహ్మణానపి,
అర్చితాన్ గన్ధపుష్పాద్యైః అర్చయిత్వాభిషగ్వరః. ౧౮౫
కవాటద్వన్ద్వఘటితః ప్రాగుదగ్ద్వారలక్షితే,
మహానసే చతుశ్శాలధూమమార్గైరలఙ్కృతే. ౧౮౬
కృతనిగ్దేవతాపూజే సజ్జు ష్టే మఙ్గళస్వనైః,
నిర్భిన్నమణుశశ్చిన్నం ప్రక్షాళ్యతుణ్ణమౌషధమ్. ౧౮౭

రూక్షేకుచిన్యథోదీప్తే తామ్రాయోమృణ్మయేదృఢే,
రక్షితే లోహబన్ధేన కుమ్భే నిక్షిప్యసామ్భసి. ౨౮౮
చుల్ల్యాం లోహేష్టకామయ్యాం గోపుచ్ఛసదృశాకృతౌ,
ధూమచ్ఛిద్రసమేతాయాం ప్రాగ్భిత్తి ముపసేదుషి. ౨౮౯

"అగ్నయే ప్రజాపతయే స్వాహా; సోమాయ భానవే స్వాహా, ఓషధిభ్యోన్యదేవతాభ్యస్స్వాహా, శూలినేపినాకినేస్వాహా, బ్రహ్మణేవిష్ణవే స్వాహా, దేవ్యైభువనేశ్వర్యైస్వాహా."

ఏభిః మన్త్రైః ప్రణిహితైః హోమేన జ్వలితైశ్చ తైః,
మృదునా వాయునా కాష్ఠైః శుష్కైస్త్వక్పరివర్జితైః. ౨౯౦
అగ్నౌ ప్రగక్షిణావర్తే సురభిస్నిగ్ధపాలితే,
నిశ్శబ్దే పద్మినీపత్ర స్నిగ్ధాశ్చే త్సూచితాయుషి. ౨౯౧
ఆరోపయేదుపస్థాతా తతో మహతివిష్టరే,
సుఖోపవిష్టస్సతతం సర్వతశ్చావలోకయన్. ౨౯౨
దర్వ్యావఘట్టయన్నల్పేనాగ్నినాపరిసర్పతా,
సాధయేత్ .........

వ్యా. పంచాంగశుద్ధి మున్నగులక్షణములతో గూడి యజమానునకు తారాబల చంద్రబలాదియుయుక్తముగనుండు శుభదినమున, యజమానునకు ఇష్టదేవతలను వినాయకుని సూర్యుడు మున్నగుదేవతలను అశ్వినీదేవతలను సద్బ్రాహ్మణులను గంధము పుష్పములు మున్నగుపూజాద్రవ్యములచేత భక్తిశ్రద్ధలతో వైద్యవరుడు పూజించవలెను. పిమ్మట రెండుతలుపులచే నొప్పిదములగు రెండుద్వారములు తూర్పు ఉత్తరదెసలయందు కల్గినదియు, పొగ బైటవెడలుటకు వసలిగమార్గములు కల్గినదియునగు పాకశాలయందు, మంగళధ్వనులు మ్రోగుచుండ, ఇంద్రాదిదిక్పాలకులం బూజించి, తైలమునకై చేర్పవలసినయౌషధములను మట్టిలేకుండునట్లు శుభ్రముగ కడిగి, తునియలుగజేసి సన్నగ చూర్ణముజేసి, తామ్రపాత్రమునందైనను ఇనుపపాత్రమునందైనను, మట్టికుండయందైనను నీళ్ళుపోసి అందుపైజెప్పిన యౌషధద్రవ్యముల నుంచునది. అట్టిపాత్రము ఇనుపకమ్మలచే పదిలముగ కట్టబడి యుండవలెను. పిదప ఇనుముచేనైనను ఇటికరాళ్లచేనైనను గోపుచ్ఛాకారముగనుండునట్లు పొగబైటపోవుటకు దగినరంధ్రములుండునట్లును ప్రొయిని సిద్ధముజేసి, అందగ్నిని విధ్యుక్తముగ నునిచి "అగ్నయే...భువనేశ్వర్యైస్వాహా" అనునీమంత్రము

లచే హోమముచేసి చక్కగ కొండి పైపట్టలేకుండు సమిధల నునిచి సన్ననిగాలిచే జ్వలింపజేయునది. ఆయగ్నిలో కల్గుజ్వాల ప్రదక్షిణముగతిరుగుచు చూచుటకు స్నిగ్ధమై శబ్దములేక తామరరేకులవలె మంచికాంతిగల్గియున్నచో రోగికి ఆయువు పూర్తిగనున్న దని యెఱుంగనగును. అట్టిజ్వాలతోగూడిన ప్రొయిమీద పైజెప్పినయామథభాండమును బెట్టునది. పిమ్మట వైద్యుడు విశాలమైనసుఖాసనముపై పదిలముగ గూర్చుండి యాభాండ మును నల్గెడల చక్కగ పరిశీలించుచు గరిటెచేత తైలమును అడుగంటనీయక గలియ బెట్టుచు మితమైనమంటచే తైలపాకవిధిప్రకారము పక్వముచేయునది.

## స్నేహావతరణక్రమము

మూ. .........అథశస్త్రేఽహ్ని ప్రలిప్తే గోశకృజ్జలైః. ౨౯౩
బ్రాహ్మణాదిక్రమవశాత్ చతుస్త్రిద్వ్యేకహస్తతాం,
మణ్డలే చతురశ్రే వాచూర్ణైశ్చిత్రే ర్విచిత్రితే. ౨౯౪
చన్దనాక్షతపుష్పాద్యైః అర్చితే తస్య వా మతః,
పూర్ణకుమ్భం ప్రతిష్ఠాప్య దీపంచ ఘృతపూరితమ్. ౨౯౫
పూర్వస్యాం దిశి విఘ్నేశం పూజయిత్వాలిభక్తితః,
ప్రాగాదిదిక్షువిన్యస్య క్రమేణైవ హి తండులమ్. ౨౯౬
ముద్గం కుళుత్థం నిష్పావం సమాషం రాజమాషకమ్,
తిలంచ సర్వతో వాపి తీవ్ర్వాదూర్వాయవాక్షతాన్. ౨౯౭
రాజశాలించ తన్మధ్యే మధ్యే హోమాదిభాజనే,
పుణ్యాహం ఘోషయన్ ఛత్రం చామరం చాపి ధారయన్.
నవవస్త్రే స్రుతప్రాయం దర్వ్యాపేతం భిషగ్జితమ్,
రజ్జ్వాదృఢతరంబధ్వా చతుర్దణ్డేన పీడయేత్. ౨౯౯
పురాణం వర్జయేద్వస్త్రం సచ్ఛిద్రం ద్విగుణీకృతమ్,
ఘోషైస్తుతృప్తిమాప్నోతి బ్రహ్మా విష్ణుశ్చశాన్తినా. ౩౦౦
దీపేన నీలకణ్ఠస్తు శాలిభిర్లోకపాలికాః,
అశ్వినావుదకుమ్భేన మణ్డలేన దివాకరః. ౩౦౧
మఙ్గళైర్మణిభిర్లక్ష్మీః సోమః పుష్పాక్షతాదిభిః,
తామ్బూలదానాత్సర్వేచ తస్మాదుక్తం న లఙ్ఘయేత్. ౩౦౨

వ్యా. పైజెప్పినరీతిగ స్నేహము పక్వమైనపిదప శుభదినమున నింటియందొక ప్రదేశమున గోమయజలముచే శుభ్రముగ నలికి మండలముగనైనను చతురశ్రముగ (నాల్గుకోణములుగ) నైనను మండలమును జేయవలెను. ఆమండలము బ్రాహ్మణులకు నాల్గు చేతులవిస్తీర్ణంబును క్షత్రియులకు మూడుచేతులవిస్తీర్ణంబును, వైశ్యులకు రెండుచేతుల విస్తీర్ణంబును, శూద్రుల కొకచేతివిస్తీర్ణంబునై యుండవలెను. అట్టిమండలముల నానా వర్ణములుకల చూర్ణములచే చిత్రముల నేర్పరచి, చందనము అక్షతలు మున్నగువానిచే బూజించి, ఆమండలమునకు వామభాగమున నీటిచే నిండియుండుకుంభము నొకదానిని నిలిపి నేతిదీపము నుంచునది.

మరియు తూర్పుదిక్కున వినాయకుని బూజించి, యామండలమున తూర్పున బియ్యమును, ఆగ్నేయమున పెసలను, దక్షిణమున ఉలవలను, నిర్‌ఋతిదిక్కున అనుము లను, పడమట ఉద్దులను, వాయుదిక్కున అలచందలను, ఉత్తరమున నువ్వులను, ఈశాన్య మున రాజనములను వరుసగ నుంచి, అన్నిదిక్కులయందును గరికను అక్షతములను యవ లను చల్లి, ఆమండలమధ్యభాగమున బంగరు మున్నగువానిచేనైన పాత్ర నునిచి పుణ్యాహ మంత్రములజదువుచు ఛత్రచామరముల ధరించి, యాపాత్రముఖముపై నొకక్రొత్తవస్త్ర మును గప్పి తైలాదులను అందుబోసి వడగట్టి అందు నిలిచినపిప్పిని మూటగ నొకదారముచే గట్టి కిట్టికోలతో నొత్తిపట్టి ఔషధమును గ్రహించునది.

మరియు నట్టియెడ వడగట్టుటకైనగుడ్డ ప్రాతదిగను చినిగినదిగను మడతవేసినదిగను ఉండగూడదు. మరియు మంగళఘోషములచే బ్రహ్మయును, శాంతికర్మచే విష్ణువును, దీపముచే నీశ్వరుండును, శాలిధాన్యముచే లోకపాలకులును, జలపూర్ణకుంభముచే నశ్వినీ దేవతలును, మండలముచే దినకరుండును, మంగళవాద్యములచేతను మణులచేతను లక్ష్మియు, పుష్పములు అక్షతలు మున్నగువానిచే సోముండును, తాంబూలదానముచే తక్కినదేవత లందరును తృప్తినొందుదురు; కావున పైజెప్పినవానినన్నిటిని తప్పక యాచరించవలె నని భావము.

## స్నేహములను భద్రపరచువిధానము

మూ. అథ శుద్ధేన పట్టేన ఛాదితం సూత్రసంయుతమ్,
స్వనుగుప్తం శుచౌ దేశే సుస్థిరం వినివేశయేత్. ౩౦౩
అజ్ఞానాద్వాస్తు లోభాద్వాకృతే విధివిపర్యయే,
రక్షితా అపి నిర్యాన్తి భూతైర్భేషజశక్తయః. ౩౦౪

వ్యా. పైజెప్పినరీతిగ వడియగట్టినస్నేహమును భాండమునందుబోసి పరిశుద్ధమైన గుడ్డను భాండముపై మూసి దారముచే బిగియునట్టులు వానెనగట్టి పరిశుద్ధమైనస్థలమున

పదిలముగనుండునట్లు భద్రపరచవలెను. మగియు తెలియకనైనను వస్తులోభముచేనైనను పైజెప్పినపద్ధతికి విరుద్ధముగ జేసినచో నాయౌషధము సొంతజాగ్రత్తతో గాపాడినను, ఆయౌషధమునందలి వీర్యమును భూతము లాకర్షించును. కావున విధికి విరుద్ధముగ జేయంజనదు.

### సిద్ధౌషధవిభాగము

మూ. త్రిభాగమగ్నయేఽశ్విభ్యాం అతిథిభ్యో నివేద్యచ,
ఔషధస్య చతుర్థాంశం కర్తాస్వీకర్తు మర్హతి. ౩౦౫

వ్యా. సిద్ధమైనయౌషధమును నాల్గుభాగములుచేసి యందొకభాగమును అగ్నిదేవునకును, రెండవభాగమును అశ్వినీదేవతలకును, మూడవభాగమును అతిథులకును ఇచ్చి (సమర్పించి) నాల్గవభాగమును యజమానుడు గ్రహింపనగును.

### ప్రాణాచార్యసన్మానము

మూ. అర్చయేద్ధనధాన్యాద్యైః ప్రాణాచార్యం నవామ్బరైః,
ఔషధారమ్భవేళాయాం తేన రోగః ప్రశామ్యతి. ౩౦౬

వ్యా. పైజెప్పినరీతిగ పరిశుద్ధమైనయౌషధమును సేవించుసమయమున ప్రాణదానముంజేయ సమర్థుడగువైద్యుని ధనధాన్యాదులచేతను నూతనవస్త్రములచేతను తొలుత సత్కరించి పిమ్మట నౌషధమును సేవింపందగును. అట్లు సత్కరించుటచే రోగము శాంతి నొందును.

### ఔషధమును సేవించుక్రమము

మూ. శ్రద్ధావాన్ ప్రాఙ్ముఖశ్శుద్ధో వైద్యేనోదఙ్ముఖేనసః,
"బ్రహ్మరుద్రాశ్విదక్షేన్ద్ర భూచన్ద్రార్కానలానిలాః. ౩౦౭
ఋషయస్సౌషధగ్రామా భూతసఙ్ఘాశ్చ పాన్తువః,
రసాయనమివర్షీణాం అమరాణా మివామృతమ్. ౩౦౮
సుధేవోత్తమనాగానాం భైషజ్యమిదమస్తు తే,"
మన్త్రేణానేన భైషజ్యం మాత్రాభి రభిమన్త్రితమ్. ౩౦౯
నిమీలితాక్షస్సేవేత పాత్రం కుర్వీతభూముఖమ్,

వ్యా. ఔషధమును సేవించునపుడు మిక్కిలి శ్రద్ధకల్గి పరిశుద్ధుడై తూర్పుముఖముగ తాను కూర్చుండి, ఉత్తరముఖముగ కూర్చునియున్నవైద్యునిచేత "బ్రహ్మరుద్రా... మిదమస్తుతే" అనుమంత్రము నుచ్చరించి యభిమంత్రింపబడిన యౌషధమును కన్నులనరమోడ్పుగమూసికొని సేవించి తోడనే యౌషధపాత్రమును భూమిపై బోరగిల నుంచవలెను.

(బ్రహ్మ, రుద్రుడు, అశ్వినీదేవతలు, దక్షుడు, ఇంద్రుడు, భూదేవి, చంద్ర సూర్యులు, అగ్ని, వాయుదేవుడు, మహర్షులు ఔషధసముదాయముతోగూడిన భూత సంఘములు, వీరందరును నిన్ను కాపాడుదురుగాక! ఈయౌషధము ఋషులకు రసాయనమునుబోలియు, దేవతల కమృతమునుబోలియు, ఉత్తములగునాగులకు సుధనుబోలియు, నీకు సుఖమును కల్గించుగాక! యని మంత్రార్థము).

### ఔషధమును సేవించవలసినకాలనియమము

మూ. యుఞ్జ్యాదనన్నమన్నాదౌ మధ్యేఽన్తేఃబలాన్తరే, ౩౧౦
గ్రాసే గ్రాసే ముహుస్సాన్నం సాముద్గం నిశిచౌషధమ్,
కఫోద్రేకేగదేఽనన్నం బలినోః రోగరోగిణోః. ౩౧౧
అన్నాదౌ విగుణేఽపానే సమానే మధ్యఇష్యతే,
వ్యానేన్నే ప్రాతరాశస్య సాయమాశస్య తూత్తరే. ౩౧౨
గ్రాసగ్రాసాన్తయోః ప్రాణేప్రదుష్టే మాతరిశ్వని,
ముర్ముహుర్విషచ్ఛర్ది హిధ్మాతృట్ శ్వాసకాసిషు. ౩౧౩
యోజ్యం సభోజ్యం భైషజ్యం భోజ్యైశ్చిత్రై రరోచకే,
కమ్పాక్షేపకహిధ్మాసు సాముద్గం నిశిభోజనమ్. ౩౧౪
ఊర్ధ్వజత్రువికారేషు స్వప్నకాలే ప్రశస్యతే,
ఇత్యౌషధానాం సిద్ధానాం ప్రయోగః.........

వ్యా. పైజెప్పినవిధముగ నౌషధము నుపయోగించుతరి ఆయావ్యాధి రోగిబలాబలము మున్నగువానిపరిస్థితులబట్టి యీక్రింద వివరించుప్రకారము ఔషధమును సేవింపదగును:—భుజింపబడిన యాహారముజీర్ణమైనప్పుడును, అన్నమును భుజింపబోవుముందు క్షణమునను, భోజనమధ్యకాలమునందును, భోజనాంతమందును, ఒకకబలమును తినినపిదపను, ప్రతికబళము నడుమను, కాలనియమములేక మాటిమాటికిని, అన్నముతోగూర్చియు, సాముద్గముగను, రాత్రి నిదురించుసమయమందును ఔషధమును సేవింపదగును. (సాముద్గమనః—భోజనసమయమున నొకకబలమునుభుజించి ఔషధమును సేవించి పిమ్మట భుజించుట యని యర్థము).

కఫప్రకోపమున గల్గినరోగమునందును, రోగియు రోగంబును మిక్కిలి ప్రబలముగ నున్నప్పుడును భుజించినయాహారము జీర్ణమై పరగడుపుతో నున్నపుడు ఔషధమును సేవింపనగును. అపానవాతము ప్రకోపించినపుడు అన్నమును భుజించుటకుముందును, సమానవాతము ప్రకోపించినపుడు భోజనమధ్యకాలమందును, వ్యానవాతము ప్రక

పితమైనపుడు ప్రాతఃకాలమున భుజించినయుత్తరక్షణంబునను, ఉదానవాతము ప్రకోపించి నపుడు సాయంకాలము భుజించినయుత్తరక్షణంబునను, ప్రాణవాతము ప్రకోపించినపుడు ప్రతికబలాంతముననను, ఔషధమును సేవింపనగును. మరియు విషము, వాంతి, ఎక్కిళ్ళు, దప్పి, శ్వాసకాలములు ఈరోగములయందు కాలనియమములేక మాటిమాటికిని ఔషధము నుపయోగించవలెను. అరోచకమునందు రుచికరములైనయాహారపదార్థములయందు ఔషధమునుగూర్చి యుపయోగింపనగును. కంపవాతము, ఆక్షేపకవాతము, ఎక్కిళ్లు ఈవ్యాధులయందు రాత్రిభోజనకాలమున సాముద్గముగ నౌషధమును సేవింపనగును. కంఠమునకు పైభాగమునజేరిన వ్యాధులయందు రాత్రివేళ భుజించినిదురించుటకుముందు ఔషధమును సేవింపనగును. ఇత్తెఱంగున సిద్ధౌషధకుల ప్రయోగించు క్రమము చెప్పబడినది

స్నేహస్వేదప్రాముఖ్యము

మూ. ...............అథ ప్రవక్ష్యతే. ౩౧౫

సస్నేహస్వేద సహితా క్రియా కాచిత్ప్రవర్తతే,
తస్మాదాదౌ క్రియా హ్యేనస్నేహస్వేదవిధిర్నృణామ్. ౩౧౬

వ్యా. వివిధమైనచికిత్సజేయవలెనన్నను ప్రాయికముగ స్నేహస్వేదవిధుల నాచరించి చేయవలసియుండును. కావున స్నేహస్వేదవిధులు మునుమున్ను చెప్పబడును.

స్నేహార్హులు

మూ. స్వేదసంశోధ్యమద్యస్త్రీ వ్యాయామాసక్తచిన్తకాః.
వృద్ధబాలాబలకృశరూక్షాః క్షీణాస్రరేతసః. ౩౧౭
వాతార్తస్యన్దతిమిరి దారుణా ప్రతిభోధినః,
స్నేహ్యాః............

వ్యా. స్వేదనమున (చెమటవెడలించుట) కర్హుడును, వమనవిరేచనాదిశోధనచికిత్స కర్హుడును, మద్యపానము స్త్రీసంభోగము వ్యాయామము ఈకృత్యములయందాసక్తి కలవాడును, ఎల్లపుడును మనస్సున చింతించువాడును, వృద్ధులు, బాలురును, బలహీనులును, కృశించినశరీరముకలవారును, రూక్ష(జిడ్డులేని)శరీరముకలవారును, రక్తము క్షీణించినవారును, శుక్రము క్షీణించినవారును, వాతవ్యాధిపీడితులును, స్రోతోబంధముకలవారును, తిమిరమను నేత్రరోగముకలవారును, కడుకష్టముచే నిదురమేల్కాంచువారును వీరందరును స్నేహకర్మ కర్హులగుదురు.

స్నేహానర్హులు

మూ. ..........నత్యాతి మన్దాగ్ని తీక్ష్ణాగ్ని స్థూలదుర్బలాః, ౩౧౮

ఊరుస్తమ్భాతిసారామగళరోగగరోదరైః,
మూర్ఛాచ్ఛర్ద్యరుచిశ్లేష్మ తృష్ణా మద్యైశ్చ పీడితాః. 319
అపప్రసూతాయుక్తేచ నస్యే వస్తే విరేచనే,

వ్యా. జఠరాగ్ని మిక్కిలి మందగించినవారును, జఠరాగ్ని మిక్కిలి తీవ్రముగ కలవారును, మిక్కిలి స్థూలమైనశరీరముకలవారును, మిక్కిల బలములేనివారును; ఊరుస్తంభవాతము, అతిసారము, ఆమదోషము, గళరోగము, విషము, ఉదరరోగము, మూర్ఛ, వాంతి, అరోచకము, కఫము, దప్పి, మదాత్యయము అను నీవ్యాధులచే బీడింపబడిన వారును; గర్భస్రావమయినస్త్రీలును స్నేహకర్మ కర్హులుకారు. మరియు నస్యమును వస్తికర్మను విరేచనమును జేసికొనినవారును నస్యకర్మమునకు అర్హులు కారు. (పైజెప్పిన వారిలో నతితీక్ష్ణాగ్నికలవారికి స్నేహకర్మచేసిన జఠరాగ్ని మరింత వృద్ధినొంది వికార హేతువు గానగును. అతిస్థూలునకు అగ్నియు మేదస్సును మిక్కుటముగ వృద్ధినొందును. అతిదుర్బలునకు జీర్ణశక్తిలేమింజేసి స్నేహకర్మచే వైపరీత్యము కల్గును కావున వీరికి స్నేహకర్మ నిషేధింపబడినది యని యెఱుంగునది.)

## స్నేహప్రయోగక్రమము

మూ. యుక్త్యావచారయేత్ స్నేహం భక్ష్యాద్యన్నేన వస్తిభిః. 320
నస్యాభ్యఞ్జనగణ్డూషమూర్ధకర్ణాక్షితర్పణైః.

వ్యా. ఘృతము మొదలగుస్నేహద్రవ్యములను మాత్రా, కాలము, భూమి దేహము, దోషములు మున్నగువాని కనుగుణముగ కల్పించి, భక్ష్య-భోజ్య-లేహ్య-పేయ రూపములైన యాహారపదార్థములతోగూర్చి యుపయోగించునది. మఱియు పైజెప్పిన రీతిగ ఘృతాదిస్నేహద్రవ్యములను నిరూహానువాసనఉత్తరవస్తులమూలమునను, నస్యము అభ్యంజనము గండూషము శిరోవస్తి యనుశిరస్సంతర్పణక్రియచేతను, కర్ణపూరణరూపమైన కర్ణసంతర్పణక్రియచేతను, నేత్రపూరణరూపమైన అక్షిసంతర్పణక్రియచేతనుస్నేహకర్మను ప్రయోగింపందగును.

## ఆహారానుగుణముగగూర్చి స్నేహోపయోగము

మూ. ప్రాఙ్మధ్యోత్తరభక్తోఽసౌ అధోమధ్యోర్ధ్వదేహజాన్. 321
వ్యాధీన్ జయేద్బలం కుర్యాత్ అఙ్గానాంచ యథాక్రమమ్,

వ్యా. పైజెప్పినస్నేహమును భోజనమునకుముం దుపయోగించిన అధోదేహమున జనించినరోగములు శమించును. భోజనమధ్యకాలమున నుపయోగించిన మధ్యదేహమున జనించినవ్యాధులు శమించును. భోజనోత్తరకాలమున బ్రయోగింపబడినయెడ ఊర్ధ్వశరీర

మున గల్గినరోగములు శమించును. మఱియు పైజెప్పినక్రమముగ నుపయోగించినచో శరీరమునందలి యధోమధ్య ఊర్ధ్వాంగములకు వరుసగ బలమును కల్గించును.

స్నేహానుగుణముగ స్నేహోపయోగక్రమము

మూ. ఘృతం ససైన్ధవం శుద్ధం సవ్యోషం పవనాదిషు. 3౨౨
స్యాత్సద్యస్స్నేహనం తద్వత్ అథశ్చసగుళస్సరః,
ద్రాక్షాధాత్రీరసైర్దధ్నాసవ్యోషం సాధితంఘృతమ్. 3౨3

వ్యా. స్నేహవిధియందు ఘృతము నుపయోగించునెడ వాతమునందు సైంధవలవణముతోఁగూర్చియు, పిత్తమున శుద్ధఘృతము, కఫమున త్రికటుకములగూర్చియు నుపయోగించునది. మఱియు ద్రాక్షారసము, ఉసిరికకాయలరసము, పెరుగు, త్రిఫలములు వీనినిగూర్చి సాధింపబడినఘృతము సద్యస్స్నేహనమగును. (సేవించినతోడనే శరీరమును స్నిగ్ధముగ జేయునది సద్యస్స్నేహన మనబడును).

సుకుమారాదులకు స్నేహోపయోగక్రమము

మూ. సుకుమారం శిశుం వృద్ధం స్నేహప్రద్వేషిణం భృశమ్. 3౨౪
తృష్ణార్తముష్ణకాలేచ సహాభక్తేన పాయయేత్,

వ్యా. మిక్కిలి సుకుమారునకును, శిశువునకును, వృద్ధునకును, స్నేహద్రవ్యమును ద్వేషించుస్వభావముకలవానికిని, దప్పిగొనినవానికిని, స్నేహద్రవ్యమును అన్నముతోఁగూర్చి యుపయోగించవలెను.

మఱియు నుష్ణకాలమున స్నేహము నుపయోగించునెడ పైజెప్పినరీతిగ నాహారపదార్థములతోఁగూర్చి యుపయోగించవలెను.

సద్యస్స్నేహనము

మూ. యేసద్యస్స్నేహనాస్స్నేహాః తేపరం లవణాన్వితాః. 3౨౫

వ్యా. ఘృతము, తైలము, వస, మజ్జ అనునీనాల్గును స్నేహద్రవ్యములు. ఈనాల్గిటియందును లవణము నధికముగ జేర్చినచో నయ్యవి సద్యస్స్నేహనములు (అప్పుడే స్నిగ్ధముగ జేయునవి)యగును. (లవణము స్రోతస్సులయందు వ్యాపింప స్రవింపజేయునదియు, రూక్షగుణములేనిదియు, మిగుల సూక్ష్మములగు స్రోతస్సులయందు సంచరించునదియు, తొలుత శరీరమునండెల్ల వ్యాపించి జీర్ణమగువ్యవాయిగుణము కల్గినదియు నగును కావున అట్టిలవణముతోఁగూడిన స్నేహద్రవ్య మేదియైనను శరీరమున శీఘ్రముగ వ్యాపించి జీర్ణమగును. కావున తత్కాలముననే శరీరమును స్నిగ్ధముగ జేయునని భావము).

స్నేహసమ్యగ్యోగ-అయోగ-అతియోగలక్షణములు

మూ. వాతానులోమ్యం దీప్తాగ్నిం వర్చస్స్నిగ్ధమసంహతమ్, 3౨౬

స్నేహోద్వేగః క్లమః సమ్యక్ స్నిగ్ధే రూక్షే విపర్యయః,
అతిస్నిగ్ధేతు పాణ్డుత్వం ఘ్రాణవక్త్రగుదస్రుతిః. 3 ౨౭

వ్యా. స్నేహవిధిప్రయోగముచేత చక్కగ స్నిగ్ధుడైనయెడ వాత మనులోమముగ సంచరించును. జఠరాగ్ని దీపించును. జిడ్డుతో (స్నేహద్రవ్యముతో)గూడి ద్రవమైన మలము వెడలును. స్నేహపానమునందు భయము కల్గును. బడలిక కల్గును. చక్కగ స్నిగ్ధముకానినాడు పైజెప్పినగుణములకు విరుద్ధములగుగుణములు కల్గును. (వాతానులోమగమనాదులు కల్గవని భావము).

మిక్కిలి యధికముగ స్నిగ్ధమైననాడు పాండువర్ణంబును, నాసికయందును నోటియందును గుదమునందును స్రావము కల్గును.

స్నేహవ్యత్యాసమునకు చికిత్స

మూ. క్షుత్తృష్ణోల్లేఖన స్వేదరూక్షపానాన్న భేషజమ్,
తక్రారిష్టం ఖలోద్దాలయవశ్యామాకకోద్రవాః. 3 ౨౮
పిప్పలీ త్రిఫలాక్షౌద్ర పథ్యాగోమూత్రగుగ్గులుః,
యథా స్వంప్రతిరోగఞ్చ స్నేహవ్యాపదిసాధనమ్. 3 ౨౯

వ్యా. పైజెప్పినస్నేహవిధిని యథోక్తమునకన్న వ్యత్యస్తముగ జేయుటవలన గల్గిన రోగములయందు ఆకలిదప్పులను నిగ్రహించుట, వమనము జేయుట, చెమటపుట్టించుట, రూక్షములగునన్నపానములను ఔషధములను సేవించుట, మజ్జిగను అరిష్టములను ఉపయోగించుట, ఖల మను వ్యంజనవిశేషము, ఉద్దాలక మనుశాలిధాన్యములు, యవలు, చామలు, ఆరుకలు, పిప్పలి, త్రిఫలములు, తేనె, కరకకాయలు, గోమూత్రము, గుగ్గిలము ఇవియన్నియు నుపయోగింపదగును. మఱియు నాస్నేహవ్యాపత్తునగల్గినరోగములయందు ఆయారోగములకు దగిన-చికిత్సల నుపయోగించునది.

విరూక్షణసమ్యగ్యోగ - అతియోగలక్షణములు

మూ. విరూక్షణే లఙ్ఘనవత్ కృతాతికృతలక్షణమ్,

వ్యా. స్నేహకర్మకు విరుద్ధమైనది విరూక్షణము. (అనగ శరీరమును రూక్షముగ జేయుచికిత్సావిశేషము). అట్టివిరూక్షణముయొక్క సమ్యగ్యోగాతియోగలక్షణములను లంఘనమునకు జెప్పిన సమ్యగ్యోగ-అతియోగలక్షణములబట్టియే యెఱుంగునది. ఎట్లులన:— బాగుగ చేయబడినలంఘనమునకు జెప్పియుండు విమలేంద్రియత్వాదిలక్షణములే బాగుగ జేయబడిన విరూక్షణమునకును లక్షణములగును. అధికముగ లంఘనము చేసినప్పుడు కల్గు కృశత్వాదిలక్షణములే అధికముగ జేయబడినవిరూక్షణమునందును కల్గును. స్నేహవ్యా

పత్థ్యచికిత్స విరూక్షణముగ నుండును కావున అట్టివిరూక్షణవ్యత్యాసమున గల్గులక్షణము లిచ్చట ప్రసక్తి ననుసరించి వివరింపబడియె.

స్నేహపానమున పథ్యవిధి

మూ. యాన్యహాని పిబేత్తాని తావన్త్యేవ నియన్త్రితః. 330

వ్యా. మరియు నెన్నిదినములు స్నేహపానముచేయునో అన్నిదినములు తదనుగుణముగ పథ్యాహారాదుల జేయవలెను.

స్నేహాభ్యాసమునగల్గుఫలము

మూ. దీప్తాన్తరాగ్నిః పరిశుద్ధకోష్ఠః ప్రతిగ్రధాతుర్బ్బలవర్ణయుక్తః,
దృఢేన్ద్రియో మన్దజరశ్శతాయుః స్నేహోపసేవీపురుషః ప్రదిష్టః.

వ్యా. ఎప్పుడును స్నేహము నుపయోగించుపురుషునకు జాఠరాగ్నిదీప్తి కల్గును. కోష్ఠము పరిశుద్ధమగును. రసాదిధాతువులు వృద్ధినొంది నానాట వృద్ధిజెందును. శరీరబలంబును కాంతియు కల్గును. చక్షురాదీన్ద్రియములు దృఢములై వానివానికృత్యములయందు జాగ్రత్త కల్గియుండును. ముసలితనము ప్రబలము కాకయుండును. ఇంతియేకాక నూరు వత్సరములవరకును సుఖముగ నారోగ్యముతో జీవించియుండును. ఇత్తెఱంగున మునిపుంగవులచే జెప్పబడెను.

స్వేదవిధి, తద్భేదములు

మూ. స్వేదస్తాపోపనాహోష్మద్రవభేదాచ్చతుర్విధః,

వ్యా. తాపము, ఉపనాహము, ఊష్మము, ద్రవము అను నీభేదములచేత స్వేదము నాల్గువిధములు.

తాపస్వేదము

మూ. తాపోఽగ్నితప్తవసనఫాలహస్తతలాదిభిః. 332

వ్యా. నిప్పునకాచబడిన వస్త్రము, ఫాలము (ఇనుపకారు), అరచెయ్యి ఇవిమొదలగువానిచే కాపుబెట్టి చెమటబుట్టించిన నయ్యది తాపస్వేద మనబడును.

ఇచ్చట "హస్తతలాదిభిః" అను నాదిశబ్దముచేత కొయ్య ఇసుక మంటిపిడత కంచుపాత్ర మున్నగునవి గ్రహింపబడును; కావున వీనిలో నెద్దానినైన నిప్పునకాచి కాపుపెట్టనగునని యెఱుంగునది.

ఉపనాహస్వేదము

మూ. ఉపనాహోవచాకిణ్వ శతాహ్వాదేవదారుభిః,
ధాన్యైస్సమస్తైర్గన్ధైశ్చ రాస్నైరణ్డజటామిషైః. 333

ఉద్రిక్తలవణై స్స్నేహాశుక్తతక్రపరిస్రుతైః,
కేవలే పవనే; శ్లేష్మసంసృష్టే సురసాదిభిః. 338
పద్మకాద్యైస్తు పిత్తేన సాల్వణాఖ్యైః పునః పునః,

వ్యా॰ "ఉపనహ్యతే (బధ్యతే చర్మపట్టాదినా)-ఉపనాహః" అనువ్యుత్పత్తిచేత చర్మము గుడ్డ మొదలగువానిచే నౌషధవిశేషములఁగూర్చి కట్టుఁగట్టి చెమటఁబుట్టించుక్రియకు ఉపనాహస్వేదమని పేరుకల్గినది. అదియెట్టులన:—వస, సురాబీజము, సదాప, దేవదారు అను నీద్రవ్యములనాల్గటిని; స్నేహము, పులిగంజి, మజ్జిగ, పాలు, అను నీద్రవములఁబోసి నూరి అందు ఉప్పును అధికముగఁజేర్చి కలియఁబెట్టి యుడికించి చెమటఁబుట్టింపవలచినచోట నునిచి చర్మము మున్నగువానిచే కట్టుఁగట్టునది. మరియు నిత్తెఱంగుననే నువ్వులు, అగిసె విత్తులు, మినుములు మున్నగు నుష్ణవీర్యములైనధాన్యములనైనను; చెంగల్వకోష్ఠు, అగరు, గ్రంథితగరము, తులసి మున్నగుగంధద్రవ్యములనైనను; సన్నరాష్ట్రము, ఆముదపుగింజలు, జటామాంసి, అనునీద్రవ్యములనైనను; పైఁజెప్పినరీతిగ స్నేహము పులిగంజిమున్నగుద్రవములతో నూరి కలిపి చర్మము మున్నగువానిచే కట్టుగట్టునది. ఇదియు నుపనాహస్వేదమగును. ఈచెప్పిన యుపనాహస్వేదమును కేవలము వాతమాత్రము ప్రకోపించిన యపుడు చేయవలెను. వాతము కఫముతోఁగూడి ప్రకోపించినపుడు సురసాదిగణద్రవ్యములను పైఁజెప్పినరీతి పక్వముచేసి యుపనాహముచేయునది. పిత్తముతోఁగూడి వాతము ప్రకోపించినపుడు పద్మకాదిగణద్రవ్యములఁగూర్చి పైఁజెప్పినరీతి నుపనాహముచేయునది. ఇత్తెఱంగున పైఁజెప్పినమూఁడువిధములైన ఉపనాహస్వేదములను వరుసగ కేవలవాతమునందును, కఫసంసృష్టవాతమునందును, పిత్తసంసృష్టవాతమునందును పలుమరు నుపయోగించునది. ఈయుపనాహస్వేదములు మూఁడును సాల్వణస్వేద మను నామాంతరముచే జెప్పఁబడును.

## ఉపనాహస్వేదబంధనక్రమము

మూ॰ స్నిగ్ధోష్ణవీర్యైర్మృదుభిః చర్మపట్టైరపూతిభిః, 339
అలాభేవాతజిత్పత్ర కౌశేయావికశాటకైః,
బద్ధం రాత్రౌ దివాముఞ్చేత్ ముఞ్చే ద్రాత్రౌ దివాకృతమ్.

వ్యా॰ స్నిగ్ధంబును ఉష్ణవీర్యంబును దుర్గంధరహితంబునై మెత్తగనుండుచర్మపట్టము చేత నుపనాహస్వేదమునందు బంధనముచేయవలెను. ఒకవేళ అట్టి చర్మపట్టము దొరకని యెడ వాతహారమయిన యాముదపాకు, కౌశేయము (నారమడిగుడ్డ), కంబళము మున్నగు వానిచేనైన బంధనము చేయవలెను. అట్టి చర్మపట్టాదులచే పైఁజెప్పినపద్ధతిప్రకారము కట్టుకట్టునెడ రాత్రులయందు కట్టినదానిని పగటియందును, పగలుకట్టినకట్టును రాత్రుల

### ఊష్మస్వేదప్రకారము

మూ. ఊష్మాతూత్కారికాలోష్టకపాలోపలపాంసుభిః,
పత్రభఙ్గేన ధాన్యేవ కరీషసికతాతుషైః. ౩౩౭
అనేకోపాయసంతప్తైః ప్రయోజ్యో దేశకాలతః,

వ్యా. ఉత్కారిక (యవలు మినుములు ఆముదపువిత్తులు ఆగసివిత్తులు కుసుమవిత్తులు వీనిని పక్వముచేసి చేయబడినముద్ద), మంటిగడ్డ, చిల్లపెంకులు, రాయి, ధూళి, ఆకుల సమూహము, ధాన్యము, పిడుకలు, ఇసుక, ఊక వీనిలో నెద్దానినైన తగునుపాయములచే మిక్కిలి వేడియగునట్లుచేసి, దానియావిరిచే దేశకాలదోషదూష్యాదుల చక్కగ గమనించి చేయబడినస్వేదము ఊష్మస్వేద మనబడును. (ఆవిరిచే చేయబడిన స్వేదనము ఊష్మస్వేదము).

### ఊష్మస్వేదరూపనాడీస్వేదము

మూ. సుఖోపవిష్టం స్వభ్యక్తం గురుప్రావరణావృతమ్,
హస్తిశుణ్డికయానాడ్యా స్వేదయేద్వాతరోగిణమ్. ౩౩౮

వ్యా. పైజెప్పినద్రవ్యములను చక్కగ వేడిచేసి ప్రక్కన గొట్టముకల యొక పాత్రలో నునిచి మూతి మూసి, వాతరోగముకలవానికి అభ్యంజనముచేయించి సుఖముగ నొకచోట (గాలిలేనిప్రదేశమున కూర్చుండబెట్టి, పైజెప్పినపాత్రమును వానిచెంత నిడి యొకదట్టమైన (దుప్పటి మొదలగు) గుడ్డను క్రమ్మి, యాపాత్రముయొక్క గొట్టము నుండి యావిరిని శరీరముపై ప్రసరింపజేసి చెమటపుట్టించునది. దీనిని నాడీస్వేదమని తంత్రాంతరమున జెప్పిరి.

### రెండువిధములైనద్రవస్వేదము

మూ. ద్వివిధస్తు ద్రవస్వేదః పరిషేకావగాహతః,
తైలధాన్యామ్లగోమూత్ర క్వాథయూషపయోరసైః. ౩౩౯
పరిషేకో; ఽవగాహస్తు వాతజిత్స్నేహపూరితే,
కోష్ఠే కటాహే ద్రోణ్యాం వా తత్ర యోజ్యో విశేషతః. ౩౪౦

వ్యా. ద్రవస్వేదము పరిషేకమనియు, అవగాహమనియు రెండువిధములు. తైలము పులిగంజి, గోమూత్రము, వాతహరౌషధములచే సిద్ధమైనకషాయము, వాతహరద్రవ్యములచే సిద్ధముచేయబడినయూషము, పాలు, మాంసరసము, అనునీద్రవములను సుఖోష్ణముగజేసి దానిచే శరీరముపు తడిపి చెమటపుట్టించిన నయ్యది పరిషేకస్వేద మనబడును. పెద్దగొట్టమునందైనను, పెద్దకటాహమునందైనను, గొప్పతొట్టియందైనను వాతహార

ద్రవ్యములచే సిద్ధమైన తైలాదిస్నేహములను నిండించి అందు అవగాహనము జేయునది. ఇదియే అవగాహస్వేదము.

ద్రవస్వేదవిధానమును వాగ్భటాచార్యు లిట్లుపదేశించిరి:—"శిగ్రు వీరణకైరణ్డ కారఞ్జసురసార్జకాత్, శిరీషవాసావంశార్క మాలతీదీర్ఘవృన్తతః; పత్రభఙ్గై ర్వచాద్యైశ్చ మాంసై శ్చానూపవారిజైః, దశమూలేన చ పృథక్ సహితైర్వాయథామలమ్; స్నేహవద్భి స్సురాశుక్త వారిక్షీరాదిసాధితైః, కుమ్భీర్గలన్తీర్నాడీర్వా పూరయిత్వా రుజార్దితమ్; వాససాచ్ఛాదితం గాత్రం స్నిగ్ధం సిఞ్చేద్యథా సుఖమ్ తైరేవవాద్రవైః పూర్ణం కుణ్డం సర్వాఙ్గగేఽనిలే; అవగాహ్యాతుర స్తిష్ఠేత్ అర్శః కృచ్ఛ్రాదిరుక్షుచ." (మునగ, వీరణము, చిట్టాముదము, కానుగు, తులసి, గన్నేరి, దిరిసినము, అడ్డసరము, వెదురు, జిల్లేడు, జాజి, పెద్దమ్రాను వీనియాకులు వచాదిగణద్రవ్యములును అనూపజంతువులయొక్కయు జలజంతువులయొక్కయు మాంసము, దశమూలములు, అను నీద్రవ్యములలో నొక్కొకదానినైనను, కొన్నిటినైనను, లేక అన్నింటినైనను, ఆయాదోషహరములగు ఘృతాదులలో నొకస్నేహద్రవ్యమునజేర్చి ; సుర, శుక్తము, జలము, క్షీరము వీనిని వాతాదిదోషానుగుణ్యముగ కలిపి సిద్ధముచేయబడినకషాయము నొకకుండలోనైనను, గరిగెపిడతలోనైనను, వెదురుగొట్టములోనైనను నిండించి రోగిశరీరముపై గుడ్డగప్పి పైజెప్పినకషాయముచే సుఖోష్ణముగ తడుపవలెను. ఇది పరిషేకరూపమైన ద్రవస్వేదము.

మరియు వాతము సర్వశరీరమున వ్యాపించియుండునపుడును, అర్శోరోగము మూత్రకృచ్ఛ్రము మొదలగువ్యాధులయందును పైజెప్పినకషాయముచే నిండినతొట్టెలో రోగి ప్రవేశించి కూర్చుండిన నయ్యది యవగాహస్వేదము.)

## తాపాదిస్వేదములకు ప్రత్యేకవిషయములు

మూ. తాపోష్మణీ కఫప్రాయే ఉపనాహో ద్రవః పునః,
సమీరణే శ్లేష్మణివా కంచిత్పిత్తసమన్వితే. ౩౪౧
నిర్వాతం గృహమాయాసః గురుప్రావరణం భయమ్,
ఉపనాహాహవక్రోధ భూరిపానం క్షుధాతపః. ౩౪౨
స్వేదముత్పాదయేదేభిః వాతశ్చేచ కఫావృతే,

వ్యా. కఫప్రచురమైనవాతమునందు తాపస్వేదంబును ఊష్మస్వేదంబును చేయందగును. కొంచెముగ పిత్తముతోగూడిన వాతమునందును, కఫమునందును ఉపనాహద్రవస్వేదముల రెంటిని ఉపయోగింపనగును. కఫముచే వాత మావరింపబడినయప్పుడు గాలిలేనియింటనుండుట, శరీరమున కాయాసముకల్గించుపనులజేయుట, గుహలో ప్రవేశించుట,

శరీరముపై పట్టులగప్పికొనుట, భయపడుచుట, ఉపన్యాహాస్వేదము, యుద్ధము, కోపము, అధికముగ పానముజేయుట, ఆకలి, ఎండ అను నీకృత్యములచే చెమటబుట్టించవలెను.

స్వేదకర్మయందు కొన్నివిశేషనియమములు

మూ. నివాతేఽన్తర్బహిస్స్నిగ్ధః జీర్ణాన్న స్స్వేదమాచరేత్. 383
అల్పం వంక్షణయోస్స్వల్పం దృఙ్ముష్కహృదయేనవా,
పద్మోత్పలాదిభిస్సక్తు పిణ్డ్యావాచ్ఛాద్యచక్షుషీ. 384
శీతై ర్ముక్తావలీపద్మముకుళోత్పలభాజనైః,
ముహుః కరైశ్చ సజలైః స్విద్యతోహృదయం స్పృశేత్. 385

వ్యా. స్వేదకర్మజేసికొనదలచినవాడు స్నేహపానముచే శరీరాంతర్భాగమునను, అభ్యంగనముచే శరీరముపైభాగమునను స్నిగ్ధుడై భుజించినయాహారము చక్కగ జీర్ణమైన సమయమున, గాలిలేనిప్రదేశమున జేరి స్వేదకర్మనుజేసికొనవలెను. మరియు స్వేదకర్మము జేయునపుడు గజ్జలయందు స్వల్పముగను, నేత్రములయందును వృషణములయందును హృదయముపైని మిక్కిలి స్వల్పముగను జేయనగును లేక కన్నులు మున్నగుస్థలములయందు స్వేదకర్మ జేయకుండుట కడుశ్లాఘ్యము.

మరియు స్వేదకర్మజేయునపుడు తామరపువ్వులు, కలువలు, వెదురుబియ్యపుపిండి యుండ వీనిలో నొకదానిచే కన్నులు మూసియుంచవలెను. చల్లగనుండు ముత్యాలహార ములచేనైనను, తామరమొగ్గలచేనైనను, కలువపువ్వులచేనైనను, చల్లగనుండుపాత్రములచే నైనను, జలముతోగూడియుండు అరచెయ్యిచేనైనను స్వేదకర్మచేసికొనువానిరొమ్మును పలుమారు స్పృశించవలెను.

సమ్యక్ స్విన్నలక్షణములు

మూ. సమ్యక్ స్విన్నేహిమార్థిత్వం స్వేదస్రావోఽఙ్గమార్దవమ్,
లాఘవం కేపథుస్స్తమ్భః శీతశూలక్షయోఽపిచ. 386

వ్యా. చక్కగ స్వేదవిధిచేసినప్పుడు చలువను కోరును. చెమట అడ్డులేక ధారాళ ముగ వెడలును. శరీరము మృదువగును. తేలికగనుండును. వణకు స్తంభించును. శరీరమున చల్లదనంబును శూలనొప్పియు శాంతినొందును. (ఇట్టిలక్షణములబట్టి స్వేదవిధి చక్కగ జేయబడినది యని యెఱుంగునది).

మఱియు పైజెప్పినలక్షణములచే చక్కగ స్విన్నుడని తెలిసి అంగములను మృదు వుగ మర్దనముజేసికొని వేడినీళ్లలో స్నానముచేసి, స్నేహవిధికి జెప్పినయుపచారముల జేసి కొనవలెనని వాగ్భటాచార్యులు చెప్పిరి.

## స్వేదకర్మ చేయదగనివారు

మూ. నస్వేదయేదతిస్థూలరూక్షదుర్బలమూర్ఛితాన్,
స్తమ్భనీయక్షతక్షీణక్షామమద్యవికారిణః. 382
తిమిరోదరవీసర్పకుష్ఠశోషాఢ్యరోగిణః,
పీతదుగ్ధదధిస్నేహ మధూన్ కృతవిరేచనాన్. 383
భ్రష్టదగ్ధగుదగ్లాని క్రోధశోకభయార్దితాన్,
క్షుత్తృష్ణాకామలాపాణ్డుమేహినః పిత్తపీడితాన్. 384

వ్యా. మిక్కిలి స్థూలమైనశరీరముకలవానికిని, శరీరము జిడ్డులేక రూక్షముగనుండు వానికిని. బలహీనులకును, మూర్ఛ, రోగముకలవారికిని, స్తంభనక్రియార్హ్యులకును, ఉరఃక్షత రోగముకలవానికిని, ధాతువులు క్షీణించినవానికిని, కృశించినవానికిని, మద్యపానముచే వికృతిజెందినవానికిని, తిమిర మను నేత్రరోగము ఉదరరోగము విసర్పము కుష్ఠము శోష ఆఢ్యరోగము (వాతరక్తము) అను నీరోగములుకలవారికిని, పాలు పెరుగు స్నేహద్రవ్యము తేనె వీనిలో దేనినైన పానముజేసినవానికిని, విరేచనౌషధమును సేవించినవానికిని, అతిసారమునైనను క్షారాగ్నికర్మలచేనైనను గుదము స్వస్థానమునుండి భ్రష్టముగను దగ్ధముగను ఉండువానికిని, బడలిక క్రోధము శోకము భయము వీనితోగూడియుండువానికిని ఆకలిదప్పులచే పీడింపబడినవానికిని, పాండువుచేతను ప్రమేహముచేతను పీడింపబడినవారికిని, పిత్తం బధికరించినవానికిని, గర్భవతియు పుష్పవతియు ప్రసవించినదియు నగుస్త్రీకిని వీరి కందరకును స్వేదకర్మ చేయంజనదు. ఒకవేళ పైజెప్పినవారికి విషూచి మున్నగుప్రాణాపాయకరములగు క్రూరవ్యాధులు సంభవించి ఆవశ్యకముగ స్వేదకర్మను జేయవలసినట్టు తటస్థమైనప్పుడు మృదువుగ స్వేదకర్మమును చేయనగును.

ఇచ్చట నీవివరణము తెలియంగునది:—మిక్కిలి స్థూలశరీరునకు స్వేదకర్మము జేసినయెడ మేదస్సు క్షీణించి మిక్కుటముగ శరీరమునకు సంక్షోభము కల్గును. రూక్షశరీరుడు మున్నగువారికిజేసిన అతికార్శ్యము కల్గును. ఆకలిదప్పులుకలవారికిచేసిన శరీరమున మిక్కిలి బడలికకల్గును. కామలపాండురోగముకలవారికి చేసినపిత్తము మిక్కిలి ప్రకోపించి వ్యాధి ప్రబలమగును. పిత్తరోగముకలవారికిజేసిన పిత్తము వృద్ధినొంది రోగ మధికమగును. గర్భిణికిజేసినచో గర్భమునకు ఆపత్తుకల్గి కష్టము సంభవించును. రజస్వలకుజేసినయెడ రక్తస్రావమధికమగును. ప్రసవించిన స్త్రీకి జేసినయెడ శరీరము మిక్కిలి కృశించి బలహీన మగును. కావున పైజెప్పినవారికి స్వేదవిధి చేయదగ దని భావము.

స్వేదకర్మార్హులు

మూ. శ్వాసకాసప్రతిశ్యాయహిధ్మాధ్మానవబన్ధిషు. 3౫౦
స్వరభేదానిలవ్యాధిశ్లేష్మామస్తమ్భగౌరవే,
(అంగమర్దకటీపార్శ్వపృష్ఠకుక్షీహనుగ్రహే)
మహత్త్వేముష్కయోఃఖల్ల్యాంఆయామేవాతకణ్టకే, 3౫౧
మూత్రకృచ్ఛ్రార్బుదగ్రన్థి శుక్రాఘాతాఢ్యమారుతే,
స్వేదం యథా యథం కుర్యాత్ తదౌషధవిభాగతః. 3౫౨

వ్యా. శ్వాసకాసములు, పీనసము, ఎక్కిళ్లు, కడుపుబ్బరము, మలబంధము, స్వరభేదవము, వాతరోగము, కఫరోగము, ఆమరోగము, శరీరస్తంభము, శరీరము బరువుగనుండుట, (ఒడలినొప్పి, నడుము ఇరుప్రక్కలు వీపు కుక్షి దవుడలు ఇవి పట్టుపట్టియుండుట) అండవృద్ధి, ఖల్లివాతము, ఆయామవాతము, వాతకంటకము, మూత్రకృచ్ఛ్రము, అర్బుదవ్రణము, గ్రంథి, శుక్రాఘాతము, ఆఢ్యవాతము, అను నీరోగములుకలవారికి ఆయారోగములకు జెప్పియుండుఔషధముల నుపయోగించి స్వేదకర్మమును యథాక్రమముగ జేయనగును.

ఇచ్చట ఆఢ్యవాత మనగ నూరుస్తంభవాత మని యర్థము. ఊరుస్తంభమునకే ఆఢ్యవాత మని పర్యాయనామము. ఈవిషయమును మాధవకరుడు "తమూరుస్తమ్భమిత్యాహుః ఆఢ్యవాతమథాపరే" అనువాక్యమున జెప్పెను.

స్వేదాతియోగజనితరోగములు, దానిచికిత్స

మూ. పిత్తాసృక్కోపతృణ్మూర్ఛా స్వరాఙ్గసదనభ్రమాః,
సన్ధిపీడాజ్వరశ్యావరక్తమణ్డలదర్శనమ్. 3౫3
స్వేదాతియోగాచ్ఛర్దిశ్చ; తత్ర స్తమ్భనమౌషధమ్.

వ్యా. స్వేదకరాతియోగమున రక్తపిత్త ప్రకోపము కల్గును. దప్పి, మూర్ఛ, స్వరభంగము, శరీరకార్శ్యము ఇవి కల్గును. మరియు ఒడలు తిరుగును. కీళ్లయందు బాధ కల్గును. జ్వరమువచ్చును. శ్యామరక్తవర్ణముగల పొడలుకల్గును. వాంతికల్గును. ఈవ్యాధులయందు స్రోతస్సులస్తంభింపజేయుచికిత్సలు చేయనగును.

మరియు వాగ్భటాచార్యుడు:—"విషక్షారాగ్న్యతీసారచ్ఛర్దిమోహాతురేషుచ" అనిచెప్పెను. విషము, క్షారకర్మ, అగ్నికర్మ, అతిసారము, వాంతి, మూర్ఛ, వీనిచే బాధనొందినవారికి నిస్తంభనౌషధము ప్రయోగింపదగదని భావము.

స్వేదప్రాశస్త్యము

మూ. స్నేహస్వేదావనభ్యస్య కుర్యాత్సంశోధనం తు యః. 3౫౮
దారుశుష్కమివానామే శరీరం తస్య దీర్యతే,

వ్యా. స్నేహస్వేదవిధుల జేయకయే వమనవిరేచనాదిశోధన-చికిత్స జేసినచో వారి శరీరము, (ఎండినకొయ్యను వంచినయెడ వంగకుండుటయేగాక చీలువిధముగ) శరీరము చెడిపోవును. కావున శోధనాది-చికిత్స కన్నిటికంటె స్నేహస్వేదవిధులు చాల ముఖ్యము లని భావము.

స్వేదకర్మమునగల్గుఫలము

మూ. అగ్నేర్దీప్తిర్మార్దవంత్వక్ప్రసాదం భక్తశ్రద్ధం స్రోతసాం నిర్మలత్వం
కుర్యాత్స్వేదో జాడ్యతన్ద్రాపహారం స్తబ్ధాంసన్ధిం చేష్టయత్యాశుతస్య.

వ్యా. పైజెప్పినవిధిప్రకారము స్వేదకర్మను జేసినచో జఠరాగ్ని దీపించును. చర్మము నిర్మలమయి మృదువుగ నుండును. అన్నముపై శ్రద్ధకల్గును. స్రోతస్సులన్నియు నిర్మలము లగును. జడత్వము కునికిపాటు నివర్తించును. సంధిబంధములు స్తంభించి కదలకుండినచో వానిని అట్టిబంధమువదలించి పనులయందు సమర్థములుగ జేయును.

పంచకర్మలు, వానినాచరింపదగినకాలములు

మూ. ఛర్దిర్విరేకో ద్వావస్తీ నావనం కర్మపఞ్చకం,
జీర్ణాన్తే వమనం దేయం, కఫే; జీర్ణే విరేచనమ్. 3౫౯
వస్త్యనన్నే కాంక్షతో ఽన్నం సాయం భుక్త్వాతు నావనం,

వ్యా. వమనము, విరేచనము, నిరూహ అనువాసభేదములచే రెండు తెఱంగులైనవస్తులు, నావనము (నస్యకర్మము) అను నీయైదును పంచకర్మము లనబడును. అందు వమనమును భుజించినయాహారము జీర్ణమగుసమయమున జేయందగును. కఫము ప్రకోపించినపుడు వమనము యుక్తము. భుజించినయాహారము జీర్ణమైనపిదప అన్నవిరేచనమును జేయించవలెను. ఆహారము పూర్తిగ జీర్ణించి యాహారముపై నిచ్ఛబొడమినపుడు వస్తికర్మ జేయవలెను. సాయంకాలమున భుజించినపిమ్మట నస్యకర్మను జేయనగును.

కఫ-పిత్తప్రకోపమున వమన-విరేచనవిధి

మూ. కఫే విదధ్యాద్వమనం సంయోగే వాకఫోల్బణే. 3౬౦
తద్వద్విరేచనంపిత్తే...............

వ్యా॥ కఫమునందును కఫం బధికముగనుండు దోషసంయోగమునందును వమనవిధిని జేయవలెను. మరియు పిత్తప్రకోపమునందును దోషసంసర్గమున పిత్తం బధికముగ నున్నపుడును, విరేచనమును జేయించవలెను.

### వమనము జేయింపదగినవారు

మూ॥.........విశేషేణతు వామయేత్,
నవజ్వరాతిసారాధః పిత్తాసృగ్రాజయక్ష్మిణః. ౩౫౭
కుష్ఠమేహాపచిగ్రన్థి శ్లీపదోన్మాదకాసినః,
శ్వాసహృల్లాసవీసర్ప స్తన్యదోషోర్ధ్వరోగిణః. ౩౫౮

వ్యా॥ నూతనజ్వరము, అతిసారము, అధోగతరక్తపిత్తము, రాజయక్ష్మము, కుష్ఠము, ప్రమేహము, అపచి, గ్రంథి, శ్లీపదము (బోదకాలు), ఉన్మాదము, కాసశ్వాసములు, హృల్లాసము, విసర్పము, స్తన్యదోషము, శరీరోర్ధ్వభాగమునందలిరోగములు, అను నీరోగము లన్నిటియందును విశేషముగ వమనము జేయించవలెను.

### వమనకర్మానర్హులు

మూ॥ అవామ్యాగర్భిణీరూక్షః క్షుధితో నిత్యదుఃఖితః,
బాలవృద్ధకృశస్థూలహృద్రోగి క్షతదుర్బలాః. ౩౬౦
ప్రసక్తవమథు ప్లీహ తిమిరక్రిమికోష్ఠినః,
ఊర్ధ్వప్రవృత్తవాయ్వస్ర దత్తవస్తిహతస్వరాః. ౩౬౧
మూత్రాఘాత్యుదరీగుల్మీ దుర్వమోఽత్యగ్నిరర్శసః,
ఉదావర్త భ్రమాష్ఠీలా పార్శ్వరుగ్వాతరోగిణః. ౩౬౨
ఋతే విషగరాజీర్ణ విరుద్ధాభ్యవహారతః,

వ్యా॥ గర్భిణిస్త్రీలు, రూక్షశరీరులు, ఆకలికలవారు, ఎల్లప్పుడు దుఃఖించుస్వభావముకలవారు, బాలురు, వృద్ధులు, కృశించినవారు, స్థూలశరీరులు, హృద్రోగము, ఉరఃక్షతము అనురోగములుకలవారు, దుర్బలులు, వమనోన్ముఖముగనుండువారు, ప్లీహము తిమిరము (నేత్రరోగము) కోష్ఠమున క్రిములుకలవారు, శరీరమునం దూర్ధ్వభాగమున వాతరోగమైనను రక్తరోగమైనను కలవారు, వస్తికర్మను చేయించుకొనినవారు, కంఠస్వరము క్షీణించినవారు, మూత్రాఘాతము, ఉదరరోగము, గుల్మరోగము, అర్శస్సు, ఉదావర్తము, భ్రమము, అష్ఠీల, ప్రక్కనొప్పి, వాతరోగము అను నీవ్యాధులుకలవారు, మిక్కుటముగ నగ్నిదీప్తికలవారు, వీరందరును వమనము జేయింపందగరు.

మరియు పైఁజెప్పినబాలవృద్ధాదులకు * విషసంబంధము గరసంబంధము, అజీర్ణము, విరుద్ధాన్నభక్షణము, ఇవికల్గినపుడు తప్పదక్కినసమయములందు వమనము జేయింపఁదగదు. (పైనిషేధింపబడిన బాలవృద్ధాదులకు విషాదిసంబంధముకల్గినపుడు మాత్రము తప్పక వమనము జేయింపవలెననియు, తక్కినకాలములయందు వమనము నిషిద్ధమనియు భావము.)

వమనముచేయించినచో గర్భిణిస్త్రీలకు గర్భమునకు హానికల్గును. ఆకలికలవానికి బలము నశించును. బాలవృద్ధాదులు ఔషధతీవ్రత కోరుపలేకుండుటంజేసి వారికి బలహాని కల్గును. హృద్రోగముకలవారికి హృదయమునకు చెరుపుకల్గును. వమనోన్ముఖము గనుండువారికి ఉదానవాతము ఊర్ధ్వభాగమునజెంది ప్రాణములగూడ పెకలింపజూచును. కావున బాలాదులకు వమనము నిషేధింపబడినది. అట్టివారికిని విషాదిసంబంధముకల్గిననాడు ఉపాయాంతరముచే విషాదులు నివర్తింపవు కావున వమనముచేయింపనగును. దానివలన వారి కేలాటిహానియు కల్గదు.

## సర్వశోధనకర్మలకునర్హులు

మూ. ప్రసక్తవమథోః పూర్వే ప్రాయేణా మజ్వరేఽపిచ. 3౬3
ధూమాన్తైః కర్మభిర్వర్జ్యాః సర్వైరేవత్వజీర్ణినః,

వ్యా. పైఁజెప్పినరీతిగ గర్భిణిమొదలు 'ప్రసక్తవమథు' అనుదానికి ముందు కలపదునొకండుగురును ఒకవమనమునకేగాక ధూమపానమువరకు జెప్పిన (వమన-విరేచన-వస్తి-నస్యము-ధూమపానము) కర్మలకు ప్రాయికముగ అర్హులుకారు. ఆమజ్వరము కలవాడును పైఁజెప్పినవమనాదికర్మల కర్హుడు కానోపడు. మరియు అజీర్ణరోగముకలవాడు వమనాది విధులకును ధూమపానగండూషాదివిధులకును అన్నింటికిని అర్హులుకారు. ఇచ్చట ప్రాయేణ అనుటచేత నెనిమిదిమాసముల గర్భవతియగు స్త్రీకిమాత్రము నిరూహవస్తి నిషిద్ధముకాదు. 'తు' అని చెప్పుటచేత తాత్కాలికముగ సంభవించినయజీర్ణమునందుమాత్రము వమనము చేయింపదగు నని తెలిసెడి.

## విరేచనములకర్హులు

మూ. విరేకసాధ్యాగుల్మార్శో విస్ఫోటవ్యఙ్గకామలాః. 3౬౪
జీర్ణజ్వరోదరగరచ్ఛర్ది ప్లీహాహలీమకాః,
విద్రధి స్తిమిరం కాచః స్యన్దః పక్వాశయవ్యథా. 3౬౫
యోని శుక్రాశ్రయాదోషాః కోష్ఠగాః క్రిమయో వ్రణాః,
వాతాసృగూర్ధ్వగం రక్తం మూత్రాఘాతశకృద్గ్రహాః. 3౬౬

*విష మనగా స్థావరజంగమవిషము. గర మనగా కృత్రిమవిషము.

వమ్యాశ్చ కుష్ఠమేహాద్యాః..................

వ్యా. గుల్మము, అర్శోరోగము, విస్ఫోటము, వ్యంగము (మంగు), కామల, జీర్ణజ్వరము, ఉదరము, విషము, ఛర్ది, ప్లీహవృద్ధి, హాలీమకము, విద్రధి, తిమిరము, కాచము, స్యందము, పక్వాశయమునగల్గుబాధలు, యోనిరోగములు, శుక్రరోగము, కోష్ఠగతరోగములు, క్రిమిరోగము, వ్రణములు, వాతరక్తము, ఊర్ధ్వగతరక్తపిత్తము, మూత్రాఘాతము, మలబంధము అను నీరోగములుకలవారు విరేచనము జేయించుట కర్హులు. మరియు వమనమున కర్హులని చెప్పబడిన కుష్ఠము మొదలు ఊర్ధ్వరోగమువరకుంగల పండ్రెండురోగములు కలవారును విరేచనమున కర్హులు. (కుష్ఠాదిరోగముల పండ్రెంటియందును వమనమైనను విరేచనమైనను జేయనగు నని భావము).

విరేచనమున కనర్హులు

మూ. ..................నతురేచ్యోనవజ్వరీ
అల్పాగ్న్యధోగపిత్తాస్రక్షతపాయ్వతిసారిణః. 362
సశల్యాస్థాపితక్రూరకోష్ఠాతి స్నిగ్ధశోషిణః.

వ్యా. నూతనజ్వరము, మందాగ్ని, అధోగతరక్తపిత్తము, గుదస్థానమునగాయము, అతిసారము అను నీరోగములుకలవారును, శల్యముతోగూడినవారును, నిరూహవస్తినిచేసికొనినవారును, క్రూరమైనకోష్ఠముకలవారును, మిక్కిలి స్నిగ్ధమైనశరీరముకలవారును, క్షయరోగులును, వీరందరును ఒకప్పుడును విరేచనముల కర్హులుకారు.

ఇచ్చట నీ విశదము నెరుంగునది:—జ్వరప్రారంభముననే విరేచముచేయించినచో అపక్వములైనదోషములు వెలివడి దానంజేసి వాతము ప్రకోపించును. జఠరదీప్తి కొద్దిగనున్నపుడు బలహీనుడుగ నుండును కావున విరేచనములచే మరింతబలహీనత కల్గును. అధోగతరక్తపిత్తమున విరేచనంబు లధికములై ప్రాణాపాయము కల్గును. గుదము క్షతమైనప్పుడు విరేచనములైనచో ప్రాణాంతకములైన యుపద్రవములు కల్గును. శల్యముతోగూడియుండునపుడు గాయములయందు వాతము ప్రవేశించి ప్రాణముల హింసించును. నిరూహవస్తిచేసికొనినవాడు ఔషధవేగమును సహింపనోపడు; కావున బలహాని కల్గును. క్రూరకోష్ఠునకు కోష్ఠమునందలిదోషములు చక్కగ బైటవెడలక హృదయశూల, ఆనాహము, ఛర్ది, మూర్ఛ, బడలిక మొదలగునుపద్రవములుకల్గి ప్రాణహానియు సంభవించును. మిక్కిలి స్నిగ్ధకోష్ఠునకు విరేచనము లధికములై బలము క్షీణించును. క్షయరోగముకలవానికి ధాతువులు మరింత క్షీణములై యపాయము కల్గును. కావున పైజెప్పినరోగములయందు నెప్పుడును విరేచనము జేయింపగూడదని భావము.

## వమన-విరేచనములకు ప్రధానౌషధములు

మూ. అసాత్మ్యపూతిబీభత్సం దుర్దర్శంచ హితం వమౌ. 3౬౮
వమనే మదనం శ్రేష్ఠం త్రివృన్మూలం విరేచనే,
నిత్యమన్యస్యతు వ్యాధివిశేషేణ నిశిష్టతా. 3౬౯

వ్యా. రోగికి సాత్మ్యముకానిదియు, దుర్గంధముగలిగియుండునదియు, మనసు కింపు కానిదియు, చూడ సహ్యముకానిదియు నగుసౌషధాది ద్రవ్యములు వమనమునకు మిక్కిలి హితకరములు. మరియు వమనమునకు మ్రంగకాయయు, విరేచనమునకు తెగడవేరును మిక్కిలి ప్రశస్తములు. ఈరెంటిని వ్యాధివిషయము నపేక్షింపక సామాన్యముగ వమనవిరేచనములకు ప్రధానముగ నుపయోగింపదగును. (మ్రంగకాయకన్న నితరములగు డావరడంగి మున్నగువమనౌషధములు జ్వరాదిరోగవిశేషములయం దుపయోగ్యములు. మ్రంగకాయమాత్ర మగుగాక వ్యాధిసామాన్యముగ నుపయోగింపందగియుండును కావున నియ్యది వమనౌషధములలో మిగుల శ్రేష్ఠము. అట్లేరంగుననే తెగడకన్ననితరములగువిరేచనౌషధములు ఆయావ్యాధివిశేషములయం దుపయోగింపందగియుండును. తెగడమాత్రము వ్యాధి సామాన్యముగ నుపయోగింపందగినది. కావున నియ్యది విరేచనౌషధములలో కడు ప్రశస్తము. ఈయభిప్రాయమునే "త్రివృత్సుఖవిరేచనానామ్" అని చరకాచార్యులు శాసించిరి).

## సంతర్పణముచేగల్గిన రోగములయందు వమనౌషధప్రయోగము

మూ. వత్సకాదిప్రతీవాపః కషాయః ఫలమజ్జతః,
నిమ్బార్కాన్యతరక్వాథ సమాయుక్తో నియచ్ఛతి. 3౭౦
బద్ధమూలా నపివ్యాధీన్ సర్వాన్ సన్తర్పణోద్భవాన్,

వ్యా. మ్రంగకాయలగింజలలోనిపప్పు నుదకమున వైచి చక్కగ కషాయము కాచి, అందు వత్సకాదిగణద్రవ్యములను సమభాగముగ గ్రహించి చూర్ణముచేసి కలిపి, వేపకషాయమునైనను జిల్లేడుకషాయమునైననుచేర్చి త్రాగించినయెడ సంతర్పణక్రియచే కల్గినవియు, చిరకాలముగ ననుసరించి రూఢమూలములైనవియునగు రోగములన్నియు నివర్తించును.

## సంతర్పణమునగల్గినరోగములకు వమనౌషధములు

మూ. శిశిరేవాథమధ్యస్థా త్రృష్ణా ఘ్రాణాదికామయే. 3౭౧
తైలాభ్యక్తశిరోఽజ్గేన పీతస్థితవతాతపే,
సర్వప స్తైలయుక్తో వా హరిమఞ్జరిపత్రజః. 3౭౨

సార్కపత్రే స్రుతః పాత్రే ఋంధో వా శ్వాసకాసజిత్,
తద్వత్కృతః కఫే శ్యామా రసోవాససిధావితః, ౩౭౩
ద్రావితః కాఞ్జికాళాంప్లేన కిఞ్చిత్తైలసమన్వితః,

వ్యా॥ పైజెప్పినరీతిగ సంతర్పణముచే తృష్ణసాసారోగములు మున్నగువ్యాధులు కల్గినయెడ శిశిరకాలమున అట్టివానికి తైలముచే శిరస్సును సర్వాంగములను అభ్యంగనము చేసి, పేయాదులపానముచేసిన రోగిని యెండలో నుండ నియమించి ఉత్తరేణియాకుల స్వరసమును తైలమున కలిపి, జిల్లేడాకులతో గూడిన పాత్రలోబోసి వడగట్టి పానము చేయించినచో శ్వాసకాసములను హరించును. మరియు కఫము ప్రకోపించినపుడు తెగడ రసమును పైజెప్పినరీతిగ జిల్లేడాకుపాత్రతో గడ్డచేసి వడబోసి కొంచెముగ తైలమునుజేర్చి పులిగంజిలో కలిపి త్రాగించినచో కఫము శమించును.

## వమనౌషధప్రయోగము, వమనములచేయువిధానము

మూ॥ అథ సాధారణే కాలే స్నిగ్ధస్విన్నం యథావిధి. ౩౭౪
శ్లేష్మవమ్యముత్క్లిష్టకఫం మత్స్యమాషతిలాదిభిః,
నిశాసుప్తం సుజీర్ణాన్నం పూర్వాహ్ణే కృతమఙ్గళమ్. ౩౭౫
నిరన్నమీషత్ సుస్నిగ్ధం పేయయాపీతసర్పిషమ్,
వృద్ధబాలాబలక్లీబభీరూన్ రోగానురోధతః. ౩౭౬
ఆకణ్ఠం పాయయేన్మద్యం క్షీరమిక్షురసం రసమ్,
వ్యాధికోష్ఠాద్యనుగుణం ద్రవ్యం సక్షౌద్రసైన్ధవమ్. ౩౭౭
ప్రాఙ్ముఖం పాయయేత్; పీతో ముహూర్తమనుపాలయేత్,
తన్మనాజాతహృల్లాస ప్రసేకశ్ఛర్దయేత్తతః. ౩౭౮
అఙ్గుళీభ్యామనాయస్తో నాళేన మృదునాథవా,
గళతాల్వరుజన్ వేగానప్రవృత్తాన్ ప్రవర్తయన్. ౩౭౯
ప్రవర్తయన్ ప్రవృత్తాంశ్చ జానుతుల్యాసనేస్థితః,

వ్యా॥ పైజెప్పినప్రకారము వమనయోగ్యత్వాయోగ్యతలను చక్కగ గమనించి శీతోష్ణపరిస్థితులు సమముగనుండు శ్రావణాదిమాసములయందు స్నేహస్వేదవిధ్యుక్తప్రకారము స్నిగ్ధస్విన్నశరీరుడును, వమనకరంబులగు మత్స్యమును మినుములు నువ్వులు మొదలగుద్రవ్యములచే స్వస్థానమునుండి వెలిపరుపబడిన కఫముకలవాడును, వమనము జేయింపదలచినదినమునకు ముందుదినమున రాత్రియందు స్వస్థముగ నిదురించినవాడును, భుజింప

బడినయాహారము చక్కగా జీర్ణమైనవాడును, ఉదయకాలమున దేవ-బ్రాహ్మణ-అగ్ని-గురు-వృద్ధ-పూజలు జేసి స్వస్తివాచనముల నొందినవాడును, ఆహారము జేయకుండువాడును నగు వమనార్హపురుషునకు ఆయారోగానుగుణముగ సిద్ధముచేయబడినదియు, తేనెతోడను సైంధవలవణముతోడనుగూడినదియు నగు వమనౌషధమును, మృదుమధ్యక్రూరకోష్ఠభేదముల గమనించి, శక్తివనుసారముగ మాత్రను కల్పించి, తూర్పుముఖముగ కూర్చుండబెట్టి త్రాగించవలెను.

మరియు వమనము జేయించుటకు పూర్వము బహిఃస్నేహనము చేసి పేయయవాగుం జితో గలిపినఘృతమును తొలుత త్రాగించి పిదప వమనౌషధమును పైజెప్పినవిధి ప్రకారము త్రాగించవలెను. మరియు వృద్ధుడు బాలుడు స్త్రీ భయపడుస్వభావముకలవాడు నపుంసకుడు వీరిలో నెవ్వరికైన వమనము చేయించవలసినయెడల ఆయారోగానుగుణ్యముగ కంఠము వరకు మద్యమునైనను, క్షీరమునైనను, చెరకురసమునైనను, మాంసరసమునైనను త్రాగించి, పిదప పైజెప్పినవిధి ప్రకారము వమనౌషధమును త్రాగించవలెను.

మరియు నౌషధమును పానముచేసినరోగి వమనమునకు ఒకముహూర్తకాలము దానియందే మనస్సునిడి ప్రతీక్షించి, పిదప మోకాలంతపొడవుగలపీఠముపై గూర్చుండి నోట నోకిరింతలువచ్చుతరి రెండుచేతివ్రేళ్లచేనైనను, మృదువుగనుండు ఆముదపుచెట్టుకాడ మున్నగువానిచేనైనను, కంఠమునందును నోటిలో దవుడలయందైనను బాధకలుగనీయక, రాకయుండువమనమును పెకలించి, వచ్చినవమనమును అడ్డగించక వమనముల వెడలించవలెను.

### వమనకాలోపచారములు, వమనసమ్యగ్యోగలక్షణము

మూ. ఉభే పార్శ్వే లలాటంచ వమతశ్చాస్య ధారయేత్. ౩౮౦
ప్రపీడయే త్తథానాభిం పృష్ఠంచ ప్రతిలోమతః,
పిత్తస్య దర్శనంయావత్ చ్ఛేదోవా శ్లేష్మణోభవేత్. ౩౮౧

వ్యా. వమనములు అగుచుండునపుడు మనుజునిరెండుపార్శ్వములను నుదుటిని పరిచారకులు గట్టిగపట్టుకొని వీపునందును నాభిస్థానమునకు ప్రతిలోమముగ మర్దించవలెను. మరియు పిత్తపసరు బైలువెడలునంతకాలమైనను, లేక కఫము నశించునంతవరకైనను వమనములు చేయించవలెను.

### వమనమునందు పాకప్రతీక్షానిషేధము

మూ. అపక్వం వమనం దోషం పచ్యమానం విరేచనమ్,
నర్హారేద్వమపస్యాతః పాకం నప్రతిపాలయేత్. ౩౮౨

వ్యా॰ వమనౌషధము పాకమునొందకయే దోషమును వెడలించును. విరేచనౌషధము జీర్ణమగుచుదోషమును వెడలించును; కాబట్టి వమనవిధియందు ఔషధముయొక్క పాకమును నిరీక్షింపబనిలేదు.

హీనవేగమునం దౌషధప్రయోగము

మూ॰ హీనవేగః కణాధాత్రీ సిద్ధార్థలవణోదకైః,
వమేత్పునః పునః .............

వ్యా॰ వమనౌషధముచే వమనవేగముతక్కువయైయెడల పిప్పళ్లు, ఉసిరికపప్పు, తెల్లావాలు, సైంధవలవణము వీనిని ఉదకమున కలిపి మాటిమాటికి త్రాగి పలుమారు వమనము చేయించవలెను.

వమనాయోగలక్షణములు

మూ॰ .........తత్ర వేగానామప్రవర్తనమ్, 363
ప్రవృత్తిస్సవిబన్ధావా కేవలస్యౌషధస్యవా,
అయోగస్తేన నిష్ఠీవ కణ్డూకోఠజ్వరాదయః. 364

వ్యా॰ వమనాయోగమునందు (వమనౌషధము చక్కగ పనిచేయనియపుడు) వమన వేగము కలుగకుండును, లేక వమనములు ధారాళముగ వెడలక బద్ధగించి కొంచెముగ వెడలును, లేక దోషము బైటవెడలక ఔషధముమాత్రము బైటవెడలును. ఇవి వమనాయోగలక్షణములు. దానివలన నోట నీరువెడలును. శరీరముపై దురదయు దద్దురులును జ్వరంబును సంభవించును.

వమనసమ్యగ్యోగ-అతియోగలక్షణములు

మూ॰ నిర్విబన్ధం ప్రవర్తన్తే కఫపిత్తానిలాః క్రమాత్,
సమ్యగ్యోగేఽతియోగేతు ఫేనచన్ద్రికరక్తవత్. 365
వమితం క్షామతాదాహః కణ్ఠశోషస్తమోభ్రమః,
ఘోరావాయ్వామయాః మృత్యుః జీవశోణితనిర్గమాః. 366

వ్యా॰ వమనౌషధసమ్యగ్యోగమునందు కఫపిత్తవాతములు వరుసగ కొంచెమైన అడ్డులేక బైటవెడలును. ఇదియే సమ్యగ్యోగలక్షణము వమనాతియోగమునందు నురుగుతోడను, నెమలిపురికన్నువంటిరంగుకల గుండ్రనిబిందువులతోడను, రక్తముతోడనుగూడి వమనమగును. శరీరము బలహీనమగును. తాపము కల్గును. గొంతెండును. కన్నులు మూచుకొనిపోవును భ్రమించినట్లుండును ఒడలు తిరుగునట్లుండును. ఘోరములగువాతరోగములు కల్గును,

జీవమున కాధారమైనశుద్ధరక్తము బైలువెడలి మరణముకూడ సంభవించును. ఇవి వమనాతియోగలక్షణములు.

వమనానంతరకర్తవ్యాహారాదినియమము

మూ. సమ్యగ్యోగేచ వమితే క్షణమాశ్వాస్యపాయయేత్,
ధూమత్రయస్యాన్యతమం, సాయాహ్నే క్షుధితస్తతః. ౩౮౭
ఉష్ణామ్బుపరిషిక్తాఙ్గో ముద్గాఢకీకులత్థజైః,
యూషైర్జాఙ్గలమాంసానాం రసైర్వాల్పోదనం భజేత్. ౩౮౮

వ్యా. పైజెప్పినరీతిగ సమ్యగ్యోగలక్షణయుక్తముగ వమనములైనయెడ నట్టి రోగాతురుని శీతవాతాద్యుపచారములచే క్షణకాలము సేదదేర్చి, స్నిగ్ధ-మధ్య-తీక్ష్ణభేదములచే మూడువిధములైన ధూమభేదములలో నొకదానిని సేవింపజేయవలెను. పిదప సాయంకాలమున చక్కగ నాకలికల్గియున్నపుడు సుఖోష్ణముగ నుండునీళ్లచే స్నానము చేయించి, పెసలు కందిపప్పు ఉలవలు వీనిలో నొకదానిచే సిద్ధమైన కట్టుతోనైనను, జాంగలమాంసరసముతోనైనను ఎఱ్ఱవరిబియ్యపుఅన్నమును భుజింపజేయవలెను.

వమనాయోగేపునర్వమనవిధి

మూ. వమనం మృదుకోష్ఠేన క్షుద్వతాల్పకఫేనవా,
అతితీక్ష్ణం మృదుస్తోకమజీర్ణే దుర్బలేన వా. ౩౮౯
పీతం ప్రయాత్యధస్తస్మిన్నిష్టహానిర్మలోదయః,
వామయేత్తం పునస్స్నిగ్ధం స్మరన్ పూర్వమనుక్రమమ్. ౩౯౦

వ్యా. మృదుకోష్ఠముకలవాడును, ఆకలికలవాడును, స్వల్పముగ కఫముకలవాడును, మిక్కిలి తీక్ష్ణమైన వమనౌషధమును సేవించినను, ఆహారము జీర్ణముగాకుండునప్పుడును, మిక్కిలి కష్టముచే వమనములగుస్వభావముకలవాడును, మిక్కిలి మృదువైన వమనౌషధమును సేవించినను, లేక పరిమాణమునకన్న మిక్కిలి తక్కువగ వమనౌషధమును సేవించినను ఆయౌషధము అధోమార్గమున వెడలును; కాని తనకిష్టముగ వమనములగల్గింపనోపదు. దోషము (కఫము)మాత్ర మధికరించును. అట్టియెడ వానికి మరల స్నేహవిధి జేసి మునుపటివలె మరల వమనములజేయింపనగును. వమనవిధికి జెప్పినవిధులనన్నిటిని క్రమముగ నాచరించునది.

వమనముచేగల్గునుపద్రవములకుచికిత్సలు

మూ. యదాతు వమనం పీతం సహాచ్ఛర్దయతే తదా,
మాతులుంగం వ్యోషచూర్ణంచ తక్రమణ్డేన పాయయేత్. ౩౯౧

వ్యా. వమనౌషధము పాకమునొందకయే దోషమును వెడలించును. విరేచనౌషధము జీర్ణమగుచుదోషమును వెడలించును; కాబట్టి వమనవిధియందు ఔషధముయొక్క పాకమును నిరీక్షింపబనిలేదు.

హీనవేగమునం దౌషధప్రయోగము

మూ. హీనవేగః కణాధాత్రీ సిద్ధార్థలవణోదకైః.
వమేత్పునః పునః ............

వ్యా. వమనౌషధముచే వమన వేగముతగ్గినయెడల పిప్పళ్లు, ఉసిరికపప్పు, తెల్లావాలు, సైంధవలవణము పిసని ఉదకమున కలిపి మాటిమాటికి త్రాగి పలుమారు వమనము చేయించవలెను.

వమనాయోగలక్షణములు

మూ. .........తత్ర వేగానామప్రవర్తనమ్. 393
ప్రవృత్తిస్సవిబన్ధావా కేవలస్యౌషధస్యవా,
అయోగస్తేన నిష్ఠీవ కణ్డూకోఠజ్వరాదయః. 394

వ్యా. వమనాయోగమునందు (వమనౌషధము చక్కగ పనిచేయనియపుడు) వమనవేగము కలుగకుండును, లేక వమనములు ధారాళముగ వెడలక బద్ధగించి కొంచెముగ వెడలును, లేక దోషము బైటవెడలక ఔషధముమాత్రము బైటవెడలును. ఇవి వమనాయోగలక్షణములు. దానివలన నోట నీరువెడలును. శరీరముపై దురదయు దద్దురులును జ్వరంబును సంభవించును.

వమనసమ్యగ్యోగ-అతియోగలక్షణములు

మూ. నిర్విబన్ధం ప్రవర్తన్తే కఫపిత్తానిలాః క్రమాత్,
సమ్యగ్యోగేఽతియోగేతు ఫేన చన్ద్రికరక్తవత్. 395
వమితం క్షామతా దాహః కణ్ఠశోషస్తమోభ్రమః,
ఘోరావాయ్వామయాః మృత్యుః జీవశోణితనిర్గమాః. 396

వ్యా. వమనౌషధసమ్యగ్యోగమునందు కఫపిత్తవాతములు వరుసగ కొంచెమైన అడ్డులేక బైటవెడలును. ఇదియే సమ్యగ్యోగలక్షణము వమనాతియోగమునందు నురుగుతోడను, నెమలిపురికన్నువంటిరంగుకల గుండ్రనిబిందువులతోడను, రక్తముతోడనుగూడి వమనమగును. శరీరము బలహీనమగును. తాపము కల్గును. గొంతెండును. కన్నులు బూచులుగ్రమ్మినట్లుండును ఒడలు తిరుగునట్లుండును. ఘోరములగువాతరోగములు కల్గును,

జీవమున కాధారమైనశుద్ధరక్తము బైలువెడలి మరణముకూడ సంభవించును. ఇవి వమనాతియోగలక్షణములు.

## వమనానంతరకర్తవ్యాహారాదినియమము

మూ. సమ్యగ్యోగేన వమితే క్షణమాశ్వాస్యపాయయేత్,
ధూమత్రయస్యాన్యతమం, సాయాహ్నే క్షుధితస్తతః. ౩౭౭
ఉష్ణామ్బునాపరిషిక్తాఙ్గో మాద్గాఢకీకులత్థజైః,
యూషై ర్జాఙ్గలమాంసానాం రసైశ్చాల్పోదనం భజేత్. ౩౭౮

వ్యా. పైజెప్పినరీతిగ సమ్యగ్యోగలక్షణయుక్తముగ వమనములైనయెడ అట్టి రోగాతురుని శీఘ్రవాతాద్యుపచారములచే క్షణకాలము సేదదీర్చి, స్నిగ్ధ-మధ్య-తీక్ష్ణభేదములచే మూడువిధములైన ధూమభేదములలో నొకదానిని సేవింపజేయవలెను. పిదప సాయంకాలమున చక్కగ నాకలికల్గియున్నపుడు సుఖోష్ణముగ నుండునీళ్లచే స్నానము చేయించి, పెసలు కందిపప్పు ఉలవలు వీనిలో నొకదానిచే సిద్ధమైన కట్టుతోనైనను, జాంగలమాంసరసముతోనైనను ఎఱ్ఱవరిబియ్యపుఅన్నమును భుజింపజేయవలెను.

## వమనాయోగేపునర్వమనవిధి

మూ. వమనం మృదుకోష్ఠేన క్షుద్వతాల్పకఫేనవా,
అతితీక్ష్ణం మృదుస్తోకమజీర్ణే దుర్వమేన వా. ౩౭౯
పీతం ప్రయాత్యథస్తస్మాదిష్టహానిర్మలోదయః,
వామయేత్తం పునస్స్నిగ్ధం స్మరన్ పూర్వమనుక్రమమ్. ౩౮౦

వ్యా. మృదుకోష్ఠముకలవాడును, ఆకలికలవాడును, స్వల్పముగ కఫముకలవాడును, మిక్కిలి తీక్ష్ణమైన వమనౌషధమును సేవించినను, ఆహారము జీర్ణముగాకుండునప్పుడును, మిక్కిలి కష్టముచే వమనములగుస్వభావముకలవాడును, మిక్కిలి మృదువైన వమనౌషధమును సేవించినను, లేక పరిమాణమునకన్న మిక్కిలి తక్కువగ వమనౌషధమును సేవించినను ఆయౌషధము అధోమార్గమున వెడలును; కాని తనకిష్టముగ వమనములగల్గింపనోపదు. దోషము (కఫము)మాత్ర మధికరించును. అట్టియెడ వానికి మరల స్నేహవిధి జేసి మునుపటివలె మరల వమనముల జేయింపనగును. వమనవిధికి జెప్పినవిధులనన్నిటిని క్రమముగ నాచరించునది.

## వమనముచేగల్గునుపద్రవములకుచికిత్సలు

మూ. యదాతు వమనం పీతం సహాచ్ఛర్దయతే తదా,
మాత్రికం వ్యోషచూర్ణంచ తక్రమణ్డేన పాయయేత్. ౩౮౧

పవనే నాతివమతో హృదయం యస్య పీడ్యతే,
తస్మై స్నిగ్ధామ్లలవణైః దద్యాత్ పిత్తకఫేఽన్యథా. 3౯౨
వమనస్యాతియోగేతు శీతామ్బుపరిషేచితః,
పిబేత్ఫలం రసైర్హృద్యైః సఘృతక్షౌద్రశర్కరమ్. 3౯3
సోద్గారాయాంఛర్ద్యాం ధాన్యముస్తయోః,
సమధూకాఞ్జనం చూర్ణం లేహయేత్ క్షౌద్రమిశ్రితమ్. 3౯౪
వమతోఽన్తః ప్రవిష్టాం జిహ్వాయాం కబలగ్రహాః,
స్నిగ్ధామ్లలవణాః హృద్యాః యూషమాంసరసాహితాః. 3౯౫
ఫలాన్యమ్లాని ఖాదేయుః తస్య చాన్యేఽగ్రతో నరాః,
నిస్సృతాంతు తిలద్రాక్షాకల్కలిప్తాం ప్రవేశయేత్. 3౯౬
వాగ్గ్రహేఽనిలరోగేతు ఘృతమాంసావసాధితామ్,
యవాగూం తనుకాం దద్యాత్ స్నేహస్వేదౌచ కాలవిత్.

వ్యా. యథావిధిగ పానముచేయబడిన వమనౌషధము వమనమైనచో త్రిఫలచూర్ణమును తేనెతోగలిపి సేవించి మజ్జిగమీదితేటను అనుపానముగ త్రాగవలెను.

మరియు వమనము లధికముగ నగుటచే వాతము ప్రకోపించి హృదయమున బాధ కల్గినచో స్నిగ్ధంబులును అమ్లలవణరసంబులు నగువానిని సేవింపందగును. పిత్తకఫములచే బాధకల్గినయెడ పైజెప్పిన స్నిగ్ధాదులకు వ్యతిరేకములగువానిని సేవింపవలెను.

వమనము లధికముగ నైనచో చల్లనినీట స్నానముచేసి ద్రాక్షపండ్లరసమునందు పరిపేలాలపిండిని నేతిని తేనెను చక్కెరను కలిపి సేవింపదగును.

త్రేపులతోగూడివమన మధికముగ నగుచున్నచాగ, దనియాలును తుంగముస్తెలును అతిమధురమురసాంజనము వీని నన్నిటిని చూర్ణముజేసి తేనెలో కలిపి సేవించవలెను.

వమనములగుసమయమున నాలుక లోనికి లాగికొనిబోయినయెడ స్నిగ్ధంబులును అమ్లరసంబులును హృదయమున కనుకూలంబులును నగుద్రవ్యములచే చేయబడిన కబలగ్రహంబులును, యూషంబులును, మాంసరసంబులును మిక్కిలి హితకరములు. మరియు ఎదుటివారు పులుపు అధికముగగలపండ్లను వానియెదుట నమలవలెను. (అట్లుజేసినయెడ వానికి లోపలికిబోయిననాలుక యథాస్థితికి మరలవచ్చు నని యభిప్రాయము).

వమనములగుటచేత నాలుక వెలుపలికి (ప్రమాణమునకన్న నధికముగ) వ్రేలుచున్నయెడ నువ్వులను ద్రాక్షపండును కల్కముచేసి నాలుకకు పూసి మరల లోనికి ప్రవేశింపజేయవలెను.

వాతవ్యాధివిశేషముచేత నోరు పట్టుపట్టియున్నచో నేతిని మాంసమునుగూర్చి సాధింపబడినయవాగువును పలుచగ నియ్యనగును. పిమ్మట స్నేహస్వేదవిధులను కాలోచితముగ చేయనగును.

వమనప్రయోజనము

మూ. కాసోపలేప స్వరభేదనిద్రాతన్ద్రాస్య దౌర్గన్ధ్యవిషోపసర్గాః,
కఫప్రసేకగ్రహణీవికారాః శామ్యన్తి జన్తోః వమతః కదాచిత్.

వ్యా. కాసము, ఉపలేపము (నోరు-జిడ్డుగలిగియుండుట), కంఠస్వరభేదము, అతినిద్ర, తంద్ర, నోటికంపు, విషముచేగల్గువ్యాధులు, నోట కఫము వెడలుట, గ్రహణిరోగములు ఇవియన్నియును వమనములుచేయించుటవలననవి శమించును. మరల నొకపుడును సంభవింపవు.

వమితునకు విరేచనవిధి

మూ. అథైనం వా మితం భూయః స్నేహస్వేదోపపాదితమ్,
శ్లేష్మకాలే గతేజ్ఞాత్వా కోష్ఠం సమ్యగ్విరేచయేత్. ౩౯౯

వ్యా. చక్కగ వమనము చేయించబడినపురుషునకు మరల స్నేహస్వేదవిధుల జేయించి మృదు-మధ్య-క్రూర-కోష్ఠభేదముల జక్కగ నెఱింగి, శ్లేష్మకాలమునువదలి యితర కాలమునందు విరేచనము జేయించవలెను.

వాతాదులయందు విరేచనములకై త్రివృచ్చూర్ణోపయోగక్రమము

మూ. వాతేఽమ్లేన త్రివృచ్చూర్ణం కిఞ్చిన్నాగరసైన్ధవమ్. ౪౦౦
పిత్తేసాజ్యసితాక్షౌద్రం క్షీరేక్షు త్రిఫలారసైః,
పిబేత్కఫేపీలురసమూత్రమద్యామ్లకాఞ్జికైః. ౪౦౧
పఞ్చకోలాదిచూర్ణైశ్చయుక్త్వాయుక్తం కఫాపహైః,

వ్యా. (తెగడవ్రేళ్లనుదెచ్చి దానిపైబెరడు లోపలనరమువలె నుండుకట్టెను దూరంబుచ్చి పైబెరడునుమాత్రము నలియకొట్టి యెండనెండించి మెత్తగ చూర్ణముచేసి యుంచుకొనునది).

విరేచనములచేయించవలసినయవసరమున పైజెప్పిన తెగడచూర్ణమున కొంచెము శుంఠిని సైంధవలవణమును పొడిచేసి కలిపి వాతరోగములయందు పుల్లనిగంజిలోకలిపి యుపయోగించవలెను. పిత్తరోగములయందు పైజెప్పిన త్రివృచ్చూర్ణములో చక్కెరను తేనెను ఆవునేతిని కలిపి, ఆవుపాలతోనైనను, చెరకురసముతోనైనను, త్రిఫలములకషాయ

ముతోనైనను కలిపి త్రాగవలెను. కఫరోగమునందు పైజెప్పినచూర్ణమున కఫమునుహరించునట్టి పంచకోలాదిచూర్ణము కలిపి గోగురసము; గోమూత్రము, మద్యము, కలినీళ్లు, కాంజికము వీనిలో నొకదానితోగూర్చి త్రాగవలెను.

### విరేచనమునకు వ్యోషాదిగుటికలు

మూ. వ్యోషత్రిజాతకామ్భోజక్రిమిఘ్నామలకైస్త్రివృత్. ౪౦౨
సర్వైస్సమాసమసితాః క్షౌద్రేణ గుళికీకృతాః,
మూత్రకృచ్ఛ్రజ్వరచ్ఛర్దికాసశోషభ్రమక్షయే. ౪౦౩
తాపే పాణ్డ్వామయేఽల్పేఽగ్నౌ శస్తాస్సర్వవిషేషుచ,

వ్యా. త్రికటుకములు (శొంఠి, పిప్పళ్లు, మిరియాలు), త్రిజాతకము (ఏలకులు, ఆకుపత్రి, దాల్చినచెక్క), తుంగగడ్డలు, వాయువిడంగములు, ఉసిరికకాయలబెరడు ఇవియన్నియు సమభాగములు, వీనికన్నిటికిని సమభాగము తెగడవేళ్లపట్ట, తెగడవేళ్లకు సమభాగము పంచదార, వీనినన్నిటి నొకటిగజేర్చి చూర్ణముజేసి తేనెకలిపి గుటికలు చేయునది. ఈగుటికలు మూత్రకృచ్ఛ్రము, జ్వరము, కాసము, వాంతి, క్షయము, శోఫ, భ్రమము (ఒడలుతిరుగుట), తాపము, పాండురోగము, అగ్నిమాంద్యము, సర్వవిషోపద్రవములు మున్నగురోగములయందు మిక్కిలి ప్రశస్తమైనది. (విరేచనకరము).

### విరేచనకరతర్పణౌషధము

మూ. త్వగేలాభ్యాం సమానీలీ తైస్త్రివృత్ తైశ్చ శర్కరా. ౪౦౪
చూర్ణం ఫలరసక్షౌద్రసక్తుభిస్తర్పణం పిబేత్ (భజేత్),
వాతపిత్తకఫోత్థేషు రోగేష్వల్పానలేషుచ. ౪౦౫
నరేషు సుకుమారేషు నిరపాయం విరేచనమ్.

వ్యా. లవంగవుపట్ట, ఏలకులు ఈరెండును సమభాగములు; ఈరెంటికిని సమభాగము నీలివేళ్లు, వీనికన్నిటికిని సమభాగము తెగడవేళ్లు ఇత్తెరంగున వీనినన్నింటిగూర్చి చూర్ణముజేసి యాచూర్ణమునకు సమభాగము పంచదారనుకలిపి త్రిఫలకషాయముగ కలిపి అందు తేనెయు సత్తుపిండియుఁగూర్చి పానముచేసిన సుఖముగ చక్కగ విరేచనములగును. ఇయ్యది వాతపిత్తకఫములచే జనించినరోగములయందును, జఠరాగ్ని మందగించినవారికిని మిక్కిలి సుకుమారమైన తత్వముకలవారికిని ఉపద్రవములులేక సుఖకరమై యపాయము గల్గింపని విరేచనౌషధము. మిక్కిలి ప్రశస్తమైనది.

### విరేచనమునకువ్యోషాదియోగము

మూ. వ్యోషత్రిజాతకం ముస్తావిడఙ్గం గ్రన్థికాభయా. ౪౦౬

ధాత్రీచ సమభాగాని త్రివృదష్టగుణానిచ,
దన్త్యాః భాగద్వయం షడ్భిః సితాసైన్ధవ మాత్రికాః. ౮౦౭
ఏతైరుపహితం భాగైః జగ్ధ్వాశీతోదకం పిబేత్,
వస్తి రుక్సంజ్వరచ్ఛర్ది శోషపాణ్డుభ్రమాపహమ్. ౮౦౮
నిర్వ్యత్రణ మిదం శ_స్తం విషఘ్నంచ విరేచనమ్,

వ్యా. త్రికటుకములు, త్రిజాతకము, తుంగగడ్డలు, వాయువిడంగములు, గ్రంథికము, కరకకాయలు, ఉసిరికకాయలబెరడు, తెగడ ఇవియన్నియు సమభాగములు; దన్తి రెండుభాగములు, చక్కెర సైంధవలవణము, తేనె ఇవి మూడును కలిసి ఆరుభాగములు, ఇత్తెఱంగున వీనినన్నిటిని, కలిపి తిని చల్లనినీళ్లు త్రాగినచో వస్తియందుకల్గునొప్పి, జ్వరము, వాంతి, శోఫ, పాండురోగము, భ్రమము వీనినన్నింటిని పోగొట్టును. విషమును హరించును. ఇయ్యది పథ్యములేనివిరోచనౌషధము.

### హరీతకీకల్పము, విరేచనకరేక్షుఖండములు

మూ. హరీతకీ మపి త్రివృద్విధానేనోపకల్పయేత్. ౮౦౯
లిమ్పే ద_న్తస్త్రివృతయాద్విధాకృత్వేక్షుఖణ్డికామ్,
ఏకీకృత్యచ తాం స్విన్నాం పుటపాకేన భక్షయేత్. ౮౧౦

వ్యా. "వాతామమేపిభేద_న్తైః" అని యుపక్రమించి చెప్పబడినతెగడ విధాన ప్రకారమే కరకకాయలనుగూడ విరేచనమునకై యుపయోగించునది. మరియు చెరకు తుంటను నిలువున రెండుగ చీల్చి దానిలో ప్రక్కతెగడమూర్ణమును లేపనమునుజేసి రెండుబద్దల నొకటిగజేర్చి పుటపాకవిధిప్రకారము పక్వముజేసి నమలి దానిరసమును మ్రింగినచో సుఖముగ విరేచనములగును.

### సుధాకల్పము

మూ. సుధాభిన_త్తిదోషాణాం మహా_న్తమపి సఞ్చయమ్,
ఆశ్వేతకష్ట(విష్టమ్భా) విభ్రంశాన్నైవతాం కల్పయేదతః. ౮౧౧
మృదౌ కోష్ఠేఽబలే బాలేస్థవిరేదీర్ఘరోగిణి,
కల్ప్యాష్ఠీగుల్మోదరగరత్వగ్రోగమధుమేహిషు. ౮౧౨
పాణ్డౌ దూషీ విషే శూఫే దోషవిభ్రా_న్తచేతసి,
సాక్షీక్ష్మాకణ్టకై_స్తీక్ష్ణైః బహుభిశ్చ సమాచితా. ౮౧౩

వ్యా. జెముడు మిక్కిలి వృద్ధిచెంది చిరకాలమునుండి సంచితమైయుండుదోష సముదాయము అతిశీఘ్రముగ భేదించును. అయినను అయ్యది మిగుల కష్టమును కలుగ

జేసి యుపద్రవముల దెచ్చిపెట్టును ; కావున మృదుకోష్ఠముకలవారికిని, బలహీనులకును, బాలురకును, వృద్ధులకును, చిరకాలమునుండి రోగములచే పీడింపబడినవారికిని ఉపయోగింప జనదు.

మరియు గుల్మరోగము, ఉదరరోగము, విషోపద్రవములు, చర్మరోగము, మధుమేహము, పాండురోగము, దూషీవిషము, వాపు, వాతాదిదోషత్రయమునగల్గినచిత్తభ్రమము అను నీరోగములయందు బొంతజెముడుపాలు విరేచనమునకై యుపయోగింపందగును. మరియు మిక్కిలి వాడియైనముండ్లుగల్గిన జెముడు మిగుల ప్రశస్తమైనది.

విరేచనౌషధానుపానములు

మూ. త్వక్కేసరామ్రాతకదాడిమైలాసితోపలామాతులుఙ్గైః,
మద్యైశ్చతైస్తైశ్చమనోఽనుకూలైః యుక్తానిదేయానివిరేచనాని.

వ్యా. లవంగపుపట్ట, నాగకేసరములు, ఆమ్రాతకము (కొండమామిడి), దానిమ్మపండ్లరసము, ఏలకులు, ఖండశర్కర, తేనె, మాదీఫలరసము, పలుదెఱంగులైనమద్యములు ఇవిమున్నగువానిలో నెవరికి ఏది మనసు కింపుగనుండునో వానిలో విరేచనౌషధమునుకలిపి వారివారి కిప్పించవలెను.

విరేచనౌషధము వాంతికాకుండుటకై యుపచారము

మూ. ఔషధే పీతమాత్రస్య సిఞ్చేచ్ఛీతామ్బునాముఖమ్,
ఛర్దేర్విఘ్నార్థముష్ణామ్బు శోధితాం తస్మభేమ్మృదమ్. ౪౧౫
ఆర్ద్రాం సురభిమాజిఘ్రేత్ గంధం సౌగన్ధికాదిచ,

వ్యా. విరేచనౌషధమును త్రాగినతోడనే ఔషధము వాంతికాండుటకై చల్లనినీళ్లను ముఖముపై చల్లవలెను. మరియు ఎండలో కాలియుండు మట్టిపెల్లపై వేడినీళ్ళు బోసి తడిపి దానివాసనను ముక్కుతో నాఘ్రాణించవలెను. సౌగంధికము మున్నగుపుష్పములవాసనను మూర్కొనవలెను.

విరేచనాతియోగమున నుపచారములు

మూ. నివాతే సుఖశయ్యాస్థో విబన్ధార్థం పిబేజ్జలమ్. ౪౧౬
అల్పాల్పముష్ణం శీతామ్బునస్పృశేన్న ప్రవేశయేత్.

వ్యా. విరేచనము అధికముగ నగుచున్నపుడు గాలిలేనిప్రదేశమున సుఖశయ్యపై నిశ్చలముగనుండి విరేచనములభించుటకై మిక్కిలి కొంచెముగ వేడికల్గియుండునీళ్లను కొంచెముగ త్రాగవలెను. చల్లనినీటిని చేత తాకకూడదు త్రాగదగదు.

వమనవిరేచనములయందు స్వేదాదిప్రవృత్తిక్రమము

మూ. స్వేదప్రసేకభైషజ్య కఫపిత్తానిలాః క్రమాత్. ౪౧౭
యథాచ్ఛర్ద్యాం ప్రవర్తన్తే తథాచైవవిరేచనే,
సమీరమూత్రవిట్పిత్తశ్లేష్మాణ్యన్తేచ మారుతః. ౪౧౮

వ్యా. వమనౌషధమును సేవించినపుడు తొలుత చెమటయు, పిదప నోటనీరుగారుటయు, పిమ్మట నౌషధము వెడలుటయు కల్గును. అటు పిమ్మట కఫంబును పిత్తంబును వాతంబును వరుసగ వెడలును. అట్లేఅగుననే విరేచనౌషధమును సేవించినపుడు తొలుత నపానవాతంబును, పిదప మూత్రమలపిత్తకఫంబులును వరుసగ వెడలి కడపట అపానవాతము వెడలును. ఇదియే వమనవిరేచనౌషధములయందు పద్ధతి.

విరేచనములుకానియప్పుడు చేయవలసినయుపచారములు

మూ. ఉత్తేజనార్థం భైషజ్యం స్యాప్రవృత్తౌతు పాయయేత్,
ఉష్ణామ్బు;స్వేదయేదస్య పాణితాపేనచోదరమ్. ౪౧౯

వ్యా. విరేచనౌషధమును సేవించినప్పుడు విరేచనములు కాకుండునెడ ప్రవృత్తింప జేయుటకై వేడినీళ్లను త్రాగవలెను. అరచేతిని నిప్పునకాచి యావేడిచే నుదరముపై కాపుపెట్టి చెమటపుట్టింపవలెను. విరేచనౌషధమును సేవించిననాడు విరేచనములు స్వల్పముగనైనచో నాడు మితముగ నాహారముచేసి మరుసటిదినమున మరల విరేచనౌషధమును త్రాగవలెను.

విరేచనాయోగ - అతియోగలక్షణములు

మూ. హృత్కుక్ష్యశుద్ధిః పరిదాహకణ్డూ విణ్మూత్రసఙ్గాఅపిహీనయోగే,
మూర్ఛాగుదభ్రంశకఫాతియోగాఃశూలోద్గమశ్చాతివిరిక్తలిఙ్గమ్.

వ్యా. హృదయంబును కుక్షియు శుద్ధము గాకుండుట, శరీరసంతాపము, దురద, మలమూత్రములు వెడలక బద్ధగించుట ఈలక్షణములు విరేచనౌషధము చక్కగ పనిచేయనినాడు కల్గును. (ఈలక్షణములబట్టి విరేచనౌషధము చక్కగ పనిచేయలేదని యెఱుంగవలె నని భావము.)

మరియు విరేచనము లధికముగనైనచో మూర్ఛగ్రమ్మును. గుదము వెలివడును. కఫం బధికముగ వెడలును. కడుపులో శూల పుట్టును. (ఈ లక్షణములు కనుపించినపుడు విరేచనము లధికముగనైనదని యెరుంగునది).

మరియు నష్టాఙ్గహృదయమున అతివిరిక్తలక్షణము లిట్లు చెప్పబడినవి:—శ్లేష్మపిత్త ముదకం శ్వేతం కృష్ణం సలోహితమ్, మాంసధావనతుల్యం వా మేదః ఖణ్డాభమేవ

వా, గుదనిస్సరణం తృష్ణా భ్రమో నేత్రప్రవేశనమ్, భవన్త్యతివిరిక్తస్య తథాతి వమనా మయాః." (విరేచనాతియోగమున మలపిత్తకఫవాతములు క్రమముగ బైలువెడలినపిదప శ్లేష్మపిత్తసంబంధములేక తెల్లగనైనను, నల్లగనైనను, కొంచెము రక్తయుక్తముగనైనను, లేక మాంసమును కడిగిననీళ్లవలెనైనను, లేక మేదస్సుయొక్కఖండముతో సమానముగ నైననుండు ఉదకము బైటవెడలును. దప్పి యధికమగును. ఒడలు తిరుగును. కన్నులు లోనికి లాగికొనియుండును. మరియు వమనాతియోగమునగల్గు శరీరకార్శ్యము మున్నగు లక్షణములును కన్పట్టును.)

విరేచనసమ్యగ్యోగలక్షణములు

మూ. గతేషు దోషేషు కఫాధికేషు తన్వ్యాలఘుత్వే మనసశ్చతుష్టౌ,
గతేఽనిలేచాప్యనులోమభావం సమ్యగ్విరిక్తం మనుజంవ్యవస్యేత్.

వ్యా. పైజెప్పినక్రమముగ మలపిత్తకఫవాతాదిదోషములు వరుసగ బైటవెడలి శరీరము చుల్కనైయుండి మనస్సుకు సంతోషముకల్గి వాతము అనులోమగతినొంది యున్నచో విరేచనౌషధమున చక్కగ పనిచేసిన దని యెఱుంగునది.

ఔషధము జీర్ణముగాకుండులక్షణములు

మూ. దాహోఽఙ్గసదనం మూర్ఛాభ్రమక్లమశిరోరుజః,
అరతిర్బలహానిశ్చ సావశేషౌషధాకృతిః. ౮౨౨

వ్యా. విరేచనౌషధము జీర్ణమై విరేచనముల వెంట బైటవెడలవలెను. అటుగాక ఔషధము కోశమున శేషించినచో శరీరతాపము, ఒడలినొప్పులు, మూర్ఛ, ఒడలుతిరుగుట, బడలిక, తలనొప్పి, పనులయం దిచ్ఛలేకుండుట, బలహాని ఈలక్షణములు కల్గును.

జీర్ణౌషధలక్షణములు

మూ. అనులోమోఽనిలస్స్వాస్థ్యం క్షుత్తృష్ణార్జో మనస్వితా,
లఘుత్వ మిన్ద్రియోద్గారశుద్ధిర్జీర్ణౌషధాకృతిః. ౮౨౩

వ్యా. వాత మనులోమముగనుండుట, శరీరము స్వస్థముగనుండుట, ఆకలిదప్పులు కల్గియుండుట, మనస్సు నిర్మలముగనుండుట, చక్షురాదీన్ద్రియములు చుల్కనై వానివాని కృత్యములయందు సమర్థములైయుండుట, త్రేపులు శుద్ధముగ వెడలుట ఈలక్షణములు కల్గినచో నౌషధము జీర్ణమైనదని యెరుంగునది.

విరేచనౌషధసేవనమునలంఘనము

మూ. మన్దవహ్నిమసంశుద్ధం అక్షామం దోషదుర్బలమ్,
అదృష్టజీర్ణలిఙ్గంచ లఙ్ఘయేత్పీతమౌషధమ్. ౮౨౪

వ్యా. విరేచనౌషధమును సేవించినపిదప నగ్నిదీప్తిలేక ఆఁకలికల్గకున్నను, విరేచనములు కాకున్నను, శరీరమున బడలిక కల్గకున్నను, దోషములచే దుర్బలముగనున్నను, విరేచనౌషధము జీర్ణముకాకున్నను, ఈయైదులక్షణములయందును మనుజునకు లంఘనము చేయింపవలెను.

### పేయాదిసేవనక్రమము

మూ. పేయాం విలేపీమకృతం కృతంచ యూషం రసంత్రీనుభయంతథైకం,
క్రమేణ సేవేతనరోఽన్నకాలాన్ ప్రధానమధ్యావరశుద్ధిశుద్ధః.

వ్యా. విరేచనముచే గల్గుశుద్ధి ఉత్తమమధ్యమ అధమము లని మూఁడు తెఱఁగుల నుండును; అట్టిశుద్ధులచే శుద్ధుఁడైనమనుజుఁడు పేయాదులను మూఁడు అన్నకాలములయందును, రెండు అన్నకాలములయందును, ఒక అన్నకాలమునందును వరుసగ సేవించవలెను. అది యెట్టు లనః—

ఉత్తమశుద్ధిచే శుద్ధుఁడైనవాఁడు మొదటిదినమున రెండు అన్నకాలములయందును పేయను సేవించవలెను. రెండవదినమున ఒక అన్నకాలమునందును మూఁడవదినమున రెండు అన్నకాలములయందును విలేపిని సేవింప నగును. నాల్గవదినమున రెండు అన్నకాలముల యందును, ఐదవదినమున మొదటియన్నకాలమునందును ఇటుల మూఁడు అన్నకాలముల యందును అపక్వమైన (శుంఠి లవణము మొదలగువానిచే సంస్కారముచేయబడని) యూషమును సేవించవలెను. ఇటులనే మూఁడు అన్నకాలములను విభజముచేసి * కృతాకృతరసముల సేవించవలెను. ఇత్తెఱఁగున నేడుదినములు గడిచినపిదప క్రమముగ స్వాభావికమైన మామూలు భోజనమును భుజింపవలెను. ఇత్తెఱఁగుననే మధ్యమశుద్ధిచే శుద్ధుఁడైన వానికిని, అధమశుద్ధిచే శుద్ధుఁడైనవానికిని యథాక్రమముగ పేయాదిక్రమము నూహించుకొనవలెను.

### పేయాదిక్రమసేవనప్రయోజనము

మూ. యథాఽణురగ్నిస్తృణగోమయాద్యైస్సన్ధుక్ష్యమాణో భవతి క్రమేణ,
మహాన్ స్థిరస్సర్వపచ స్తథైవ శుద్ధస్య పేయాదిభిరన్తరగ్నిః.

వ్యా. మిక్కిలి స్వల్పముగనుండు అగ్ని తృణములు పిడకలు పొట్టు మున్నగు వానిచే రగులబెట్టినచో నానాట క్రమముగ వృద్ధినొంది పెద్దదియై గొప్పదై యన్నింటిని దహించుటకు సమర్థమగుభంగి వమనాదులచే శుద్ధుఁడుగ నుండుమనుజుని జాఠరాగ్నియం

---

* కృత మనగా స్నేహాదిసంస్కారము(తిరుగబోత)చేసినది. అకృత మనగా దానిని చేయనిది.

వైశేష్యిన క్రమముగ పేయాదులసేవించుటచే నానాట వృద్ధినొంది యాహారపదార్థముల నన్నింటిని పచింప సమర్థముగా నగును.

విరేచనవ్యాపత్సామాన్యచికిత్స

మూ. అజీర్ణినశ్శ్లేష్మవతో వ్రజత్యూర్ధ్వం విరేచనమ్,
అతితీక్ష్ణోష్ణలవణమహృద్యమతిభూరివా. ౪౨౭
తత్రచ్ఛర్దితా వ్యాపత్ సిద్ధిశ్చ న తథా పిబేత్,
ఆశయే తిష్ఠతి తతః తృతీయం నావచారయేత్. ౪౨౮
అన్యత్ర సాత్మ్యాద్ధృద్యాద్వా భేషజాన్నిరపాయతః,

వ్యా. అజీర్ణముకలవానికిని, శ్లేష్మమధికముగ వృద్ధినొందినవానికిని మిక్కిలి తీక్ష్ణముగనైనను, ఉష్ణవీర్యముగనైనను, లవణముగనైనను, మనసు కింపుకానిదిగనైనను, అధిక ప్రమాణముగలదిగనైన నుండువిరేచనౌషధము నిప్పించిన నయ్యది శరీరోర్ధ్వభాగమును జెంది వమనముల గల్గించును. దానివలన విరేచనములు కాకుండుటయేకాక దోషము వృద్ధి చెందును. అట్టివానికి పూర్వ మేదోషమువలన విరేచనముకాకుండెనో అట్టిదోషమును శమింపజేసి, మరల స్నేహకర్మను జేయించి విరేచనౌషధమును యుక్తియుక్తముగ నిప్పించవలెను. మరల రెండవతూరి ప్రయోగింపబడిన విరేచనౌషధంబును ఆమాశయంబున నిలువక మునుపటివలెనే వమనంబైనచో నట్టివానికి మరల మూడవతూరి విరేచనౌషధము నిప్పింపదగదు. అయినను ఔషధము రోగికి మనస్సు కింపుగను, ఉపద్రవముల గల్గించనిదిగను, సాత్మ్యంబుగను నుండునెడ మూడవపర్యాయముగూడ విరేచనౌషధము నిప్పింపదగును.

విరేచనాయోగమునగల్గునుపద్రవములు

మూ. అస్నిగ్ధస్విన్నదేహస్య పురాణం రూక్షమౌషధమ్. ౪౨౯
దోషానుత్క్లేశ్య నిర్హర్తుం అశక్తం జనయేద్గదాన్,
విభ్రంశం శ్వయథుం హిక్కాం తమసోదర్శనం తృషమ్. ౪౩౦
పిణ్డికో ద్వేష్టనం కణ్డూమూర్వోస్సాదం వివర్ణతామ్,

వ్యా. రోగియొక్కశరీరమునకు స్నేహస్వేదకర్మములజేయించక ప్రాతదిగను రూక్షముగనుండునౌషధమును విరేచనముల కిప్పించినచో నయ్యది దోషములను వానివానిస్థానములనుండి చలింపజేసి, వెడలింప సమర్థముకాక విభ్రంశము, వాపు, ఎక్కిళ్లు, చీకటి గ్రమ్మినట్లు కన్నులు కానరాకుండుట, దప్పి, పిక్కలయందు వడదీయుసట్లు నొప్పి, దురద, తొడలయందునొప్పి, వైవర్ణ్యము అను నీయుపద్రవములను కల్గించును.

విరేచనమున మలమూత్రాదివేగముల నిరోధించుటచే గల్గునుపద్రవములు

మూ. పీతౌషధస్య వేగానాం నిగ్రహాన్మారుతాదయః. ౪౩౧
కుపితా హృదయంగత్వా ఘోరం కుర్వన్తి హృద్గ్రహమ్,
హిధ్మాపార్శ్వరుజాకాసదైన్యలాలాఽక్షివిభ్రమైః. ౪౩౨
జిహ్వాం ఖాదతి నిస్సంజ్ఞో దన్తాన్ కటకటాపయన్,
నగచ్ఛేద్విభ్రమం తత్ర వామయేదాశుతం భిషక్. ౪౩౩

వ్యా. విరేచనౌషధమును సేవించినవాడు మలమూత్రవాతాదివేగముల నడ్డగింపం జనదు. అట్లు లడ్డగించినయెడ వాతాదిదోషములు మిక్కుటముగ బ్రకోపించి హృదయమునజేరి మిక్కిలి క్రూరముగ రొమ్ము పట్టుపట్టును. మరియు ఎక్కిళ్లు, పార్శ్వశూలాల, కాసము, బలహీనత, నోటనీరు వెడలుట, కండ్లుతిరుగుట, నాలుకను కొరుకుట, మైమరచుట, పటపట యని పండ్లుకొరుకుట, ఇవి మున్నగునుపద్రవముల గల్గించును. అట్టియెడ వైద్యుడు పొరబడక రోగికి శీఘ్రముగ వమనము జేయించవలెను.

విరేచనాతియోగము

మూ. బహ్వతీక్ష్ణం క్షుధార్తస్య మృదుకోష్ఠస్య భేషజమ్,
హృత్వాశు విట్పిత్తకఫాన్ ధాతూనాస్రావయేద్ద్రవాన్. ౪౩౪

వ్యా. మిక్కిలి యాకలికలవానికిని. మృదువైనకోష్ఠముకలవానికిని విరేచనౌషధమును మితిమీరియిచ్చినను, మిక్కిలి తీక్ష్ణమైనయౌషధము నిచ్చినను, ఆయౌషధము మల-పిత్త-కఫములను వరుసగ నతిశీఘ్రముగనే వెడలించి, పిదప ద్రవరూపములగు రసరక్తాదిధాతువులను అధికముగ బైటవెడలించును. ఇదియే విరేచనాతియోగ మనబడును.

విరేచనాతియోగ-చికిత్స

మూ. తత్రాతియోగే మధురైః శేషమౌషధముల్లిఖేత్,
యోజ్యోఽతి వమనే రేకో విరేకే వమనం స్మృతమ్. ౪౩౫
పరిషేకావగాహాద్యైః సుశీతైస్స్తమ్భయేచ్ఛ్రుతిమ్,
గుదభ్రష్టం కషాయైశ్చ స్తమ్భయిత్వా ప్రవేశయేత్. ౪౩౬

వ్యా. పైజెప్పినవిరేచనాతియోగమునందు కోష్ఠమున శేషించియుండు విరేచనౌషధమును మధురద్రవ్యముల నుపయోగించి బైటవెడలింపనగును. అటుచేసినను వమనం బధికముగనైనచో మృదువుగ విరేచనమున కిప్పించవలెను. విరేచనం బధికముగనైనచో మృదువైన వమనౌషధమును ప్రయోగింపవలెను. మిక్కిలి చల్లనైయుండు జలాదులచే పరిషే

కంబును, అవగాహంబును, చల్లనిగాలిసేవించుట మొదలగునుపచారంబులును చేయదగును. ఇట్టి శీతోపచారాదులచేత విరేచనముల నిలుపవలెను. మరియు విరేచనాతియోగమున గుదము స్వస్థానమునువిడిచి వెలికి వెడలినచో కషాయగుణముగలయౌషధముల బ్రయోగించి విరేచనముల నిలిపి గుదమును యథాస్థానమున నిలుపునది.

### విరేచనౌషధము వెడలనియెడల చేయువిధానము

మూ. అప్రవృత్త్యామలాద్ద్రవ్యం సాత్మీభూతం నజీర్యతి,
వమనం వా విరేకం వా తస్మాత్సాక్ష్యంచ యోజయేత్. ౪౩౭

వ్యా. మలములు బైటవెడలనియెడ విరేచనౌషధద్రవ్యము సాత్మ్యమై జీర్ణము కానేరదు. కావున పైజెప్పినరీతిగ వమనమునైనను విరేకమునైనను చేయించి యౌషధమును బైటవెడలింపవలెను.

### సంశోధనఫలము

మూ. బుద్ధిప్రసాదం బలమిన్ద్రియాణాం ధాతుస్థిరత్వం జ్వలనస్యదీప్తిమ్, చిరాచ్చపాకం వయసఃకరోతి సంశోధనం సమ్యగుపాస్యమానమ్. ౪౩౮

వ్యా. వమనవిరేచనరూపమైనసంశోధనమును శాస్త్ర-అనుభవములననుసరించి శాస్త్రీయముగ జాగ్రత్తతో నుపయోగించినయెడ బుద్ధికి నిర్మలత్వంబును, చక్షురాదీంద్రియములకు బలంబును, రసరక్తాదిధాతువులకు స్థిరత్వంబును, జాఠరాగ్నిదీప్తియు చక్కగ కలిగి యౌవనరూపమైనవయసు చిరకాలమువరకును స్థిరముగ నుండును. (కావున సంశోధనమును యథోక్తముగ నుపయోగింపవలె ననుట.)

### వస్తికర్మ నుపయోగించవలసినవిషయము

మూ. వాతోల్బణేషు దోషేషు వాతే వా వస్తి రిష్యతే,

వ్యా. వాతం బధికముగనున్న దోషములయందును, లేక కేవలవాతమునందును వస్తికర్మ చేయనగునది ఋషివరులచే నిర్ణయింపబడినది. (మరియు కేవలవాతమునందును, వాతపిత్తములయందును, వాతకఫములయందును వస్తిని బ్రయోగించుట యుక్త మని సర్వాంగసుందరవ్యాఖ్యానమున జెప్పబడినది.)

### వస్తికర్మత్రైవిధ్యము

మూ. ఉపక్రమాణాం సర్వేషాం సోఽగ్రణీః; త్రివిధశ్చ సః. ౪౩౯
నిరోహోఽన్వాసనో వస్తి రుత్తరః.........

వ్యా. పలుతెఱంగులైనచికిత్సలలో వస్తికర్మ మిగుల ప్రధానమైనది అయ్యది నిరూహము, అనువాసనము, ఉత్తరవస్తియు నని మూడు తెఱంగుల నుండును.

వస్తి యన చిమ్మనగ్రోవి; కషాయములనైనను పాలనైనను తైలములనైనను చిమ్మనగ్రోవిచే శరీరమున లోభాగమున ప్రవేశింపజేసిన నయ్యది నిరూహవస్తి యనబడును.

తైలము, ఘృతము మున్నగుస్నేహద్రవ్యములను చిమ్మనగ్రోవిచే లోనికి ప్రవేశింపజేసిన నయ్యది అనువాసనవస్తి యనబడును. ఉత్తరమార్గము లగు మేఢ్రాదిరంధ్రముల నుండి వస్తిప్రయోగముచేయుట ఉత్తరవస్తి యని చెప్పబడును.

ఈవిషయము "కషాయ క్షీరతైలై ర్యో నిరూహస్సనిగద్యతే, యస్స్నైహైర్దీయతే సస్యాదనువాసననామకః" అనువాక్యములచే తంత్రాంతరమున జెప్పబడినది.

## నిరూహవస్తికర్హార్హులు

మూ. ................తేనసాధయేత్,
గుల్మానాహఖుడప్లీహ శుద్ధాతీసారశూలినః. ౨౨౦
జీర్ణజ్వరప్రతిశ్యాయ శుక్రానిలమలగ్రహాః,
వర్ధాశ్మరీరజోనాశాః దారుణాంశ్చానిలమయాః. ౨౨౧

వ్యా. గుల్మము, ఆనాహము (కడుపుబ్బరము), ఖుడవాతము, ప్లీహవృద్ధి, శుద్ధాతిసారము, శూల, జీర్ణజ్వరము, పీనసము, రేతోబంధము, వాతగ్రహము (వాతము శరీరమున సంచరించక స్తంభించుట), మలబంధము, వర్ధరోగము, అశ్మరి, రజోనాశము, క్రూరములగువాతరోగములు అను నీవ్యాధులచే పీడితులగురోగులకు నిరూహవస్తిచే చికిత్సచేయనగును.

## నిరూహవస్తికర్హానర్హులు

మూ. అనాస్థాప్యాస్త్వతి స్నిగ్ధః క్షతోరస్కో భృశం కృశః,
ఆమాతిసారీవ మిమాః సంశుద్ధోద త్తనావనః. ౨౨౨
శ్వాసకాసప్రమేహార్శోహిథ్మాధ్మానాల్పవహ్నయః,
శూనపాయః కృతాహారో బద్ధచ్ఛిద్రోదకోదరీ. ౨౨౩
కుష్ఠీచ మధుమేహీచ మాసాః సప్తచ గర్భిణీ,

వ్యా. అతిస్నిగ్ధుడు, ఉరఃక్షతరోగముకలవాడు, మిక్కిలి కృశించినవాడు, ఆమాతిసారరోగముకలవాడు, వమనరోగి, శోధనచికిత్సచేసికొనినవాడు, నస్యకర్మ చేయించుకొనినవాడు, కాసశ్వాసము ప్రమేహము అర్శస్సు ఎక్కిళ్లు ఆధ్మానము అను నీరోగములుకలవారు, స్వల్పమైన జాఠరాగ్నికలవాడు, గుదస్థానమున వాపుకలవాడు, ఆహారము చేసినవాడు, బద్ధగుదోదరము జలోదరరోగముకలవాడు, కుష్ఠరోగి, మధుమేహరోగము

కలవాడు, వీరి కొకప్పుడును నిరూహవస్తిచేయంజనదు. మరియు ఏడుమాసముల గర్భము కలస్త్రీకిని నిరూహవస్తి చేయంజనదు.

ఇచ్చట నీనిర్ణయము తెలియంగునది:—నిరూహవస్తి అతిస్నిగ్ధశరీరునకు దోషములను స్వస్థానమునుండి బైలుపరచి వాపును ఉదరరోగమును కల్గించును. ఉరఃక్షతునకును కృశించినవానికిని శరీరనాశమును శీఘ్రముగ గల్గించును. ఆమాతిసారముకలవానికి దోషములను బాగుగ శమింపజేయకశరీరమందున మిక్కుటముగ బాధకల్గించును. వమనరోగికి దోషములను స్వస్థానమునుండి చలింపజేసి యూర్ధ్వభాగమునజేర్చును. వమనవిరేచనములచే శోధనచికిత్సజేసికొనినవానికి బలహీనముగనుండుదేహమున మరింత బలహీనతను కల్గించును. నస్యకర్మచేసికొనినవానికి ఊర్ధ్వభాగమునందలి స్రోతోమార్గములు తెరువబడియుండుటం జేసి యాపత్తును కల్గించును. కాసశ్వాసములు మున్నగురోగములుకలవారికి దోషములు స్వస్థానమునుండి బైలుపడియుండుటవలన నాదోషములు ఊర్ధ్వభాగమునకు కొనిపోయి చేర్చును. అర్శస్సు మొదలగురోగములుకలవారికి మరణము కల్గించును. అల్పమలముకలవారికి జడత్వము స్తబ్ధత్వము మొదలగునుపద్రవముల గల్గించును. గర్భిణిస్త్రీకి గర్భనాశమును కల్గించును. కావున స్నిగ్ధాదులకు నిరూహవస్తిచికిత్స నిషేధింపబడినది యని తెలియంగునది.

ఆస్థాపన-అనువాసనములకనర్హులు

మూ. ఉదరీచప్రమేహీచకుష్ఠీస్థూలశ్చమానవః. ౪౪౪
అనవస్థాపనీయాస్తేనానువాస్యాఃకదంచన,

వ్యా. మరియు నుదరరోగముకలవాడును, ప్రమేహరోగియును, కుష్ఠరోగియును, స్థూలశరీరుడును ఆస్థాపనానువాసనవస్తులకు అర్హులు కానేరరు.

అనువాసనవస్తికర్హులు

మూ. ఆస్థాప్యా ఏవచానువాస్యాః విశేషాదతివహ్నయః,
రూక్షకేవలవాతార్తాః.........

వ్యా. నిరూహవస్తి కర్హులుగనుండువారలందరును అనువాసనవస్తికిని అర్హులుగ నుండెదరు. మరియు నధికముగ నగ్నిదీప్తికలవారును, కేవలము రూక్షశరీరులును, కేవల వాతముచే పీడింపబడినవారును, వీరు విశేషముగ ననువాసనవస్తికర్మకు అర్హులుగ నుందురు.

అనువాసనవస్తి కనర్హులు

మూ. ...................నతూదావర్తపీడితాః,
అనాస్థాప్యాస్తథా పాణ్డు కామలా క్షయ పీనసాః. ౪౪౫

నిరన్నప్లీహావిడ్భేద గురుకోష్ఠకఫోదరాః,
అభిష్యన్ది కృశస్థూల క్రిమికోష్ఠాఢ్యమారుతాః. ౨౨౬
పీతే విషే గరేఽపచ్యాం శ్లీపదీగలగణ్డవాన్,

వ్యా. ఉదావర్తవ్యాధిచే పీడితులును, నిరూహవస్తి కర్హులుకానివారందరునుకూడ ననువాసనవస్తికిని అర్హులుకారు. మరియు పాండురోగము, కామల, క్షయము, పీనస అనునీరోగములుకలవారును, ఆహారములేనివారును, ప్లీహవృద్ధి, మలబంధము, గురుత్వము, కోష్ఠరోగము, కఫరోగము, ఉదరరోగము, కృశత, స్థౌల్యము, కృమికోష్ఠము, అఢ్యవాతము అను నీరోగములుకలవారును, విషమును గరమును పానముచేసినవారును, అపచి, శ్లీపదము, గలగణ్డము అనునీరోగములుకలవారును అనువాసనవస్తిచికిత్సకు అర్హులు కారు. (పైజెప్పినపాండువు మున్నగురోగముకలవారికి అనువాసనవస్తి చికిత్సచేసినచో దోషముల స్వస్థానమునుండి బైలుపరచి ఉదరరోగమును కల్గించును; కావున అనువాసనవస్తికర్తకు అర్హులు కారని భావము).

## వమనవిరేచనాదికాలనిర్ణయము

మూ. పక్షాద్విరేకో వమితే తతః పక్షాన్నిరూహణమ్. ౨౨౭
సద్యో నిరూఢశ్చాన్వాస్యః సప్తరాత్రాద్విరేచితః,

వ్యా. ఉత్తమమైన శుద్ధిచే శుద్ధుడైనవమితునకు ఒకపక్షకాలమునకుపిమ్మట విరేచనముచేయించవలెను. పిమ్మట విరేచనముచేయించికొనినవానికి ఒకపక్షమునకుపైని నిరూహవస్తి చేయించవలెను. ఇత్తెరంగున నిరూహవస్తి చేయించుకొనినవానికి అప్పుడే అనువాసనవస్తి చేయించవలెను.

## నిరూహవస్తి కషాయపరిమితినిర్ణయము

మూ. నిరూహమాత్రా ప్రథమే ప్రకుంచో వత్సరాత్పరమ్. ౨౨౮
ప్రకుంచవృద్ధిః ప్రత్యబ్దం యావత్షట్ప్రసృతాస్తతః,
ప్రసృతం వర్ధయేదూర్ధ్వం ద్వాదశాష్టాదశస్యతమ్. ౨౨౯
ఆసప్తతేరిదంమానం దశైవ ప్రసృతాః పరమ్.

వ్యా. మొదటిసంవత్సరమున కషాయము, స్నేహము వీనితోగూడియుండు నిరూహవస్తిప్రమాణము ఒకప్రకుంచము (ఒకపలము), ఒకసంవత్సరమునకుపైని ఆరుప్రసృతములు (పండ్రెండుపలములు) అగువరకును సంవత్సరమున కొక్కొక ప్రకుంచమువంతున వృద్ధిచేయుచుండవలెను. దానికిపైని ప్రతిసంవత్సరమునందును ఒక్కొక ప్రసృతమువంతున వృద్ధిచేయుచుండవలెను. పండ్రెండువత్సరములవయసుకలవానికిని పండ్రెండుపలములు

ప్రమాణముకలకషాయములు నిరూహవస్తిపరిమితి యని తెలియవలెను. పిదప పదుమూడవ సంవత్సరము మొదలు పదునేడవసంవత్సరమువరకును ప్రతిపత్సరమున రెండేసిపలముల చొప్పున నిరూహవస్తికషాయప్రమాణమును వృద్ధిచేయవలెను. పదునెనిమిదవసంవత్సరము నకు పండ్రెండుప్రసృతములు (ఇరువదినాల్గుపలములు) నిరూహవస్తికషాయ ప్రమాణము. పదునెనిమిదవవత్సరము మొదలు డెబ్బదిసంవత్సరములవరకును పైజెప్పిన ఇరువదినాల్గుపల ములకషాయమునే నిరూహవస్తి కుపయోగింపనగును. డెబ్బదిసంవత్సరములకుపైని నిరూహ వస్తికషాయమును పదిప్రసృతము (ఇరువదిపలము) లుపయోగింపనగును. డెబ్బదివత్సర ములవయసునుండి ఎంతవయసైనను నిరూహవస్తికషాయమును ఇరువదిపలముల కధికముగ నుపయోగింపంజనదు.

—॥ వయోభేదముచే ననువాసనవస్తిపరిమాణనిర్ణయము ॥—

మూ. యథా యథం నిరూహస్య పాదోమాత్రానువాసనే,

వ్యా. పైజెప్పినరీతిగ ఒకసంవత్సరమువయసు మొదలు వయోభేదమునుబట్టి నిర్ణయింప బడిన నిరూహవస్తికషాయప్రమాణమును గమనించి, ఆయావయసుకు జెప్పినప్రమాణముతో నాల్గవవంతుపరిమితికలఔషధమును అనువాసనవస్తియందు కల్పింపనగును. (ఎట్టులనః— ఒకసంవత్సరమువరకును నిరూహవస్తికషాయప్రమాణము ఒకపలము చెప్పబడినదిగాన, ఆ వయసున అనువాసనవస్తి కషాయమును పలములో నాల్గవభాగము (కాలుపలము) ఉప యోగింపనగును. ఇత్తెఱంగుననే వయోభేదమునుబట్టి ప్రసృతాదిప్రమాణములో నాల్గవ వంతుపరిమితిని ఆయావయోనుగుణముగ నూహించి కల్పించునది.)

—॥ అనువాసనవస్తివిధానము ॥—

మూ. ఆస్థాప్యం స్నేహితం స్విన్నం శుద్ధం లబ్ధబలం పునః. ౨౫౦
అన్వాసనార్హం విజ్ఞాయ పూర్వమేవానువాసయేత్,

వ్యా. నిరూహవస్తి కర్హుడును, స్నేహవిధిచేత స్నిగ్ధశరీరుడును, స్వేదవిధిచేత శరీర మున చెమటపుట్టింపబడినవాడును, వమనవిరేచనములచేత శరీరమునందలి యూర్ధ్వాధో భాగములురెంటియందును శుద్ధిచేసికొనినవాడును, పైజెప్పినశోధనాదివిధానములచే గల్గిన బలహీనము నివర్తించి యథాస్థితిగ మరల బలమునొందినవాడు నగుమనుజుడు అనువాసన వస్తికి అర్హుడని యొఱింగినవానికి అనువాసనవస్తికర్మను జేయనగును.

—॥ అనువాసనవస్తియోగ్యతైలయోగములు ॥—

మూ. శతిపుష్కరక్తైలా పదనామదారుభిః,

శతాహ్వాకుష్ఠయష్ట్యాహ్వా వచాభిన్నమ్బుతాశనైః. ౨౫౧

సుపిష్టైర్ద్విగుణక్షీరం తైలం తోయ చతుర్గుణమ్,
పక్త్వావస్తౌ విధాతవ్యం మూఢవాతానులోమనమ్. ౪౫౨
అర్శాంసిగ్రహణీదోషం అనాహం విషమజ్వరమ్,
కట్యూరుపృష్ఠకోష్ఠస్థాన్ వాతరోగాంశ్చ నాశయేత్. ౪౫౩

వ్యా. కచోరములు, పుష్కరమూలము, పిప్పళ్లు, ఏలకులు, మ్రంగకాయ, దేవదారు, సదాప, చెంగల్వకోష్టు, అతిమధురము, వస, తిప్పతీగె, చిత్రమూలము, వీనినన్నిటిని మెత్తగ చూర్ణముచేసి, తైలమునకు రెట్టింతపాలును, నాల్గింతనీళ్లను కలిపి, పైజెప్పిన కల్కద్రవ్యములచూర్ణమును కలిపి తైలపాకవిధిగ పక్వముచేసి వస్తియంత్రమూలముగ నుపయోగించునది. ఈవస్తికర్మవలన స్తంభించినవాతమును అనులోమముగ సంచరించును. మరియు అర్శోరోగము, గ్రహణిరోగము, కడుపుబ్బరము, విషమజ్వరము, కటియందును తొడలయందును వీపునందును కోష్ఠమునందును కల్గినవాతరోగంబులును నశించును.

---

## వస్తికర్మకు రెండవతైలయోగము

మూ. వచా పుష్కరకృష్ణైలామదనామరసిన్ధుజైః,
కాకోలీ ద్వయయష్ట్యాహ్వా ద్విమేదా చతురఙ్గులైః. ౪౫౪
పాఠా జీవకజీవన్తీ ముస్తా కట్ఫలచన్దనైః,
సరళా గురుభిల్వామ్బువాజి గన్ధాగ్నివృద్ధిభిః. ౪౫౫
పిష్టైస్తైలం పచేత్ క్షీర పఞ్చమూలరసాన్వితమ్,
గుల్మానాహాగ్నిసాదార్శో గ్రహణీమూత్రసంగినామ్. ౪౫౬
అన్వాసనవిధాయుక్తం శస్యతేఽనిలరోగిణామ్
సైన్ధవే నాగ్నివర్ణేన శస్తంచానిలజిత్ ఘృతమ్. ౪౫౭

వ్యా. వస, పుష్కరమూలము, పిప్పళ్లు, ఏలకులు, మ్రంగకాయ, దేవదారు, సైంధవలవణము, కాకోళి; క్షీరకాకోళి, అతిమధురము, మేద, మహామేద, రేల, చిరుబొద్ది, జీవకము, పాలకూర, తుంగగడ్డలు, కాయఫలము, చందనము, తెగడ, అగరు, మారేడు, తుంగగడ్డలు, పెన్నేరుగడ్డ, చిత్రమూలము, వృద్ధి వీనినన్నిటిని చూర్ణముచేసి నువ్వులనూనెకు రెట్టింత ఆవుపాలును, పంచమూలకషాయము నాల్గింతలును కలిపి, అందుపైజెప్పిన చూర్ణమును కలిపి, తైలపాకవిధిగ పక్వముచేసి యాతైలమును వాతరోగపీడితులకు అనువాసనవస్తిచేయుటకై యుపయోగించుట చాల ప్రశస్తము. మరియు గుల్మరోగము, కడుపుబ్బరము, అగ్నిమాంద్యము, అర్శోరోగము, గ్రహణీదోషము, మూత్రబంధము అను

నిరోగములయందును అనువాసనవస్తికై యుపయోగించునది. మరియు సైంధవలవణమును నిప్పులో నెట్టిగకాల్చి దానిని ఆవునేతిలో ముంచి యాఘృతముచే ననువాసనవస్తిచేయించిన వాతవ్యాధులు శమించును.

స్నేహవస్తికికాలనిర్ణయము

మూ. శీతే వసన్తేచ దివాఽఽ రాత్రౌ కేచిత్తతోఽన్యదా,
న రాత్రౌ ప్రణయేద్వస్తిం దోషోత్క్లేశోహి రాత్రితః. ౨౫౭
స్నేహో వీర్యయుతః కుర్యాదాధ్మానం గౌరవం జ్వరమ్,

వ్యా. శీతకాలమైన హేమంతశిశిరఋతువులయందును, వసంతఋతువునందును పగటిపూట వస్తికర్మను చేయవలెననియు, తక్కిన గ్రీష్మ-వర్షా-శరదృతువులుమూటియందును రాత్రిపూట వస్తికర్మ చేయవలెననియు ఋతుభేదముచే కాలనియమమును కొందరు వచించిరి. రాత్రిపూట వస్తిప్రయోగముజేసినచో దోషముల ప్రకోపింపజేయును. మరియు నాస్నేహద్రవ్యము మిక్కిలి వీర్యవంతమై కడుపుబ్బరమును, ఒడలిభారమును జ్వరమును కల్గించును; కావున నొకప్పుడు రాత్రివేళలందు వస్తిప్రయోగము జేయంజనదు. అన్నిఋతువులయందును పగటిపూటనే వస్తికర్మచేయవలెనని ధన్వంతరిమతానుసారులు నిర్ణయించెదరు.

పగలువస్తికర్మచేసినందునగల్గుగుణము

మూ. అహ్నిస్థానస్థితేదోషే, వహ్నౌచ నరసాన్వితే. ౨౫౮
స్ఫుటస్రోతో మృదుం దేహం స్నేహశాజః పరిసర్పతీ,
అల్పపిత్తకఫం రూక్షం భృశం వాతరుజార్దితమ్. ౨౬౦
భుక్తజీర్ణాశనం తంతు రాత్రావప్యనువాసయేత్,

వ్యా. పగటియందు వాతాదిదోషములు వానిస్థానములయందుండును. జఠరాగ్ని యాహారరసము కలియకయుండును. స్రోతోరంధ్రములు అడ్డులేక స్ఫుటములుగనుండును. శరీరము మృదువైయుండును. కావున అట్టి పగటిపూట వస్తిని ప్రయోగించినచో శరీరమున స్నేహౌషధము శీఘ్రముగ వ్యాపించును. మరియు పిత్తకఫములు స్వల్పమైశరీరము మిక్కిలి రూక్షమైవాతరోగము తీవ్రముగ నున్నపుడు అట్టిరోగికి అన్నముబెట్టి అయ్యది జీర్ణమైనపిమ్మట రాత్రియందైనను అనువాసనవస్తి చేయనగును.

వస్తిప్రయోగవిధానము

మూ. అభ్యక్తస్నాతముచితాత్ పాదహీనం హితం లఘు. ౨౬౧
అస్నిగ్ధరూక్షమశితం సానుపానం ద్రవాదిచ,

కృతచఙ్క్రమణం ముక్తవణ్మాత్రం శయనే సుఖే. ౪౬౨
నాత్యుచ్ఛ్రితే న చోచ్ఛీర్షే సంవిష్టం వామపార్శ్వతః,
ఉత్పాదాస్తే క్షవస్పన్దకాసహాసాదివర్జితమ్. ౪౬౩
సంకోచ్య దక్షిణం సక్థి ప్రసార్యచ తతోఽపరమ్,

వ్యా. వైద్యుడు అనువాసనవస్తిచేయవలసినవానిని ముందుదినము అభ్యంగనస్నానముచేయించి వాడు మామూలుగ భుజించుదానికన్న నాల్గవపాలు తక్కువగ నుండునదియు, పథ్యకరంబును, శీఘ్రముగ జీర్ణమగునదియు, కొంచెము జిడ్డుకల్గినదియు, కొంచెము రూక్షముగ నుండునదియు, అనుపానముతోగూడినదియు, ద్రవాదిరూపంబును నైన యాహారమును భుజింపజేసి, కొంతసేపు పాదచారిగ సంచరించినపిదప మలమూత్రముల విసర్జింపజేసి, పిమ్మట వానిని మిక్కిలి పొడవుకానిదియు, మిక్కిలి యెత్తుకాక మితమైనతలగడకల్గినదియు నగుశయనముపై కుడితొడను ముడుచుకుని యెడమతొడను చాచుకొని యెడమప్రక్క నొత్తిగిలియుండునట్టు లొత్తగిలిపరుండియుంట నియమించి, తుమ్ము దగ్గు నవ్వు మొదలగునవిలేక శరీరమును కదలించకయుండునట్లుచేసి పిమ్మట వస్తిప్రయోగము చేయనగును.

## వస్తిపీడనవిధి

మూ. అథాస్య నేత్రం ప్రణయేత్ స్నిగ్ధే స్నిగ్ధముఖం గుదే. ౪౬౪
ఉచ్ఛ్వాస్య వస్తేర్వదనం బద్ధ్వా హస్తమకంపయన్,
పృష్ఠవంశం ప్రతితతో నాతి ద్రుతవిలంబితమ్. ౪౬౫
స్నేహం కదుష్ణం సిన్ధూత్థమిసిచూర్ణావచూర్ణితమ్,
నాతివేగం న వా మన్దం సత్వదేవ ప్రపీడయేత్. ౪౬౬

వ్యా. వస్తియంత్రముయొక్కద్వారములో నుచ్ఛ్వాసవాతమునుపూరించి యయ్యది బైటవెడలకుండునట్లు ద్వారమును బంధించి యాయంత్రముననుండు మూతిగొట్టమునకు చమురుపూసి, పరుండియుండిన రోగియొక్కగుదరంధ్రమునకును జిడ్డుకల్గియుండునట్లు చమురుపూసి, మిక్కిలి త్వరపడకయు జాగుసేయకయు వస్తియంత్రముయొక్క గొట్టమునునిచి, అతివేగంబును అతిమందంబునుగాక వెన్నెముక కభిముఖముగనొకటేపర్యాయము చేతిని కదలింపక ప్రయోగించవలెను. అందు ప్రయోగించుస్నేహశాపథము గోరువెచ్చగ నుండవలెను. సైంధవలవణమును సదాపవిత్తులను చూర్ణముచేసి కలిపి ప్రయోగించవలెను.

## మలమూత్రములు వెడలినచో జేయదగినకృత్యము

మూ. మలమూత్రోదయే భూయః ప్రణయేత్తదపోహ్యాచ,

సావశేషంచ కుర్వీత వాయుశ్శేషేహి తిష్ఠతి. ౪౬౭

వ్యా. పైజెప్పినరీతిగ వస్తిని ప్రయోగించునపుడు మలమూత్రములు వెడలినచో వానిని వెడలించి మరల మునుపటివస్తిలోని శేషమునుప్రయోగించునది. మరియు వస్తిలోనిఔషధము కొంచెము మిగిలియుండగనే వస్తిపీడనముచేయుట విరమింపవలెను ఎందువలననగా వస్తిలో తుదకు వాయువు శేషించియుండును. కాబట్టి ఆవాయువు ప్రేవులలోనికి పోయి బాధించును.

## వస్తిప్రయోగానంతరకృత్యము

మూ. ఏవం ప్రణిహితే వస్తౌ ఉత్తానాజ్ఞస్య వాక్ఛతమ్,
పాణిపాదతలే స్వత్ర పాణినా తాడయేత్ స్ఫిచౌ. ౪౬౮
తతః పార్ష్ణిభ్యాం తథా శయ్యాం పాదతశ్చ త్రిరుత్క్షిపేత్,
తతః ప్రసారితాఙ్గస్య సోపధానస్య పార్ష్ణికే. ౪౬౯
ఆహన్యాత్ ముష్టినాఙ్గం చ స్నేహేనాభ్యజ్యమర్దయేత్,
వేదనార్తమితి స్నేహో న హి శీఘ్రం నివర్తతే. ౪౭౦
యోజ్యశ్శీఘ్రం నివృత్తేఽన్యః స్నేహోఽతిష్ఠన్న కార్యకృత్,

వ్యా. పైజెప్పినప్రకారము స్నేహవస్తిని ప్రయోగించినపిదప వానిని వెలికిల పరుండబెట్టి నూఱుఅక్షరముల నుచ్చరించునంతకాలము నిరీక్షించి పిమ్మట రోగియొక్క పిరుదులపైభాగమునందును, కాళ్లచేతులయందును చేతితోమెల్లగ కొట్టవలెను. పిమ్మట కాళ్లప్రక్కశయ్యను మూడుపర్యాయములు పైకెత్తవలెను. పిమ్మట రోగిని కాళ్లచేతులు చాచి పరుండబెట్టి తలకిందతలగడ యెత్తుగానుండునట్లు పెట్టి ప్రక్కలయందు పిడికిటిచే గ్రుద్దవలెను. మరియు నారోగి వేదనవలన మిక్కిలి పీడింపబడియుండుటవలనను, స్నేహము శీఘ్రముగ వెడలకుండును. ఒకవేళ స్నేహము నిలువక శీఘ్రముగ బైటవెడలినచో స్నేహవస్తి కార్యకారి కానోపదు కావున శరీరముపై స్నేహమునుపూసి మర్దించి మరల వస్తిప్రయోగమును చేయునది.

## వస్త్యనంతరభోజనవిధి-అనాగతస్నేహానువాసననిషేధము

మూ. దీప్తాగ్నిమాగతస్నేహం సాయాహ్నే భోజయేల్లఘు. ౪౭౧
నైవ చా నాగతస్నేహం ద్వితీయేప్యనువాసయేత్,

వ్యా. అనువాసనవస్తిచేసినపిదప అట్టిస్నేహద్రవ్యము బైటవెడలి ఆకలి పూర్తిగ కల్గియున్నచో అట్టివానికి సాయంకాలమున తేలికయైనయాహారమును పెట్టవలెను,

స్నేహము బైటవెడలనియెడ రెండవదినమునకుగూడ అన్నముపెట్టకూడదు. రెండవదినము మరల ననువాసనవస్తి చేయవలెను.

## స్నేహము వెడలుటకు కాలనియమము

మూ. నివృత్తికాలః పరమః త్రయోయామా స్తతః పరమ్. ౪౭౨
అహోరాత్రముపేక్షేత పరతః ఫలవర్తిభిః,
తీక్ష్ణైర్వావస్తిభిః కుర్యాత్ యత్నం స్నేహనివృత్తయే. ౪౭౩
అతిరౌక్ష్యాదనాగచ్ఛన్ న చేజ్జాడ్యాదిదోషకృత్,
ఉపేక్షేతైవ హితతోఽధ్యుషితశ్చ నిశాం పిబేత్. ౪౭౪
ఆస్థాపితః కృతచ్ఛర్ది విరేకాన్యతర స్తథా,
ప్రాతర్నాగరధాన్యాభ్యాం కోష్ణం కేవలమేవవా. ౪౭౫

వ్యా. స్నేహవస్తినిచేసినపిదప మూడుయామములకాలము స్నేహనివృత్తికి ముఖ్యమైనకాలము అంతకుపైన నొకయహోరాత్రకాలమువరకు స్నేహమును వెడలించుటకై ప్రయత్నముచేయక యుపేక్షింపనగును. అప్పటికిని స్నేహము బైటవెడలనిచో ఫలవర్తులచేగాని తీక్ష్ణములగువస్తువుల బ్రయోగించుటచేనైన స్నేహము నాకర్షింప యత్నముచేయవలెను. మరియు మిక్కిలి రూక్షగుణమువలన స్నేహము బైలువెడలక నిలిచి జడత్వము అగ్నిమాంద్యము మున్నగుదోషముల (ఉపద్రవముల) గల్గించకయున్నచో స్నేహము నాకర్షింపకయే యుపేక్షచేయవచ్చును. అటుపిమ్మట నొకరాత్రియంతయు నిరాహారముగనుండి మరుసటిదినా డుదయమున శుంఠిని దనియాలుచేర్చి యుక్తముగ కాచబడిన వేడినీళ్లనైనను, లేక కేవలము వేడినీళ్లనైనను సుఖోష్ణముగ త్రాగించవలెను. మరియు ఆస్థాపనవస్తిజేసినపుడు పైజెప్పినరీతిగ కాలము నిరీక్షించి పిదప వమనమునైనను విరేచనమునైనను చేయించి పిమ్మట పైజెప్పినరీతి నుష్ణోదకమును త్రాగించవలెను.

## స్నేహవస్త్యంతరముఅనువాసనవస్తిప్రయోగము

మూ. అన్వాసయేత్తృతీయేఽహ్ని పఞ్చమే వా పునశ్చతమ్,
యథాగ్నిస్నేహపక్తిస్స్యాత్ అతోఽత్యుల్బణమారుతాన్,
వ్యాయామనిత్యాన్ దీప్తాగ్నీన్ రూక్షాంశ్చ ప్రతివాసరమ్,

వ్యా. ఆరోగికి మరల మూడవదినముననైనను, అయిదవదినముననైనను అనువాసనవస్తి చేయించవలెను. లేక రోగియొక్క జాఠరాగ్నిబలము ననుసరించి స్నేహము పక్వమగునట్లు రెండవదినమునందైనను అనువాసనవస్తి చేయించనగును. మరియు వాతం బధిక

ముగనుండువారికిని, వ్యాయామముచేయుటవాడుకకలవారికిని, జాఠరాగ్ని తీవ్రముగ నుండువారికిని, రూక్షమైనతత్వముకలవారికిని ప్రతిదినంబును అనువాసనవస్తి చేయందగును.

అనువాసనవస్తి సమ్యగ్యోగాదిలక్షణము

మూ. సమ్యగినాతియోగాశ్చ తస్య స్యుస్స్నేహపీతవత్. ౪౭౭
కిఞ్చిత్కాలం స్థితోయశ్చ న పురీషోఽతివర్తతే,

వ్యా. స్నేహవస్తియొక్క సమ్యగ్యోగ-హీనయోగ-అతియోగములను స్నేహపానమునకుజెప్పిన సమ్యక్-హీనఅతియోగలక్షణములబట్టియే (స్నేహవస్తికిని) యెఱుంగునది. మరియు అనువాసనవస్తిచేసినపుడు స్నేహము కొంచెముకాలము నిలిచియుండి పురీషము అధికముగ బైటవెడలక వాతము అనులోమముగ సంచరించుచు పురీషము స్నేహముతో గూడి కొంచెముగ బైటవెడలినచో అనువాసనవస్తి చక్కగ పనిచేసెనని యెఱుంగనగును.

అనువాసనవస్తివ్యాపత్తులు

మూ. శీతోఽల్పోవాతికే పిత్తేఽత్యుష్ణః కఫేమృదుః. ౪౭౮
అతిభుక్తే గురుర్వర్చ స్సఞ్చయేఽల్పబిలస్తథా,
దత్తస్తైరావృతస్నేహో నాయాత్యభిభవాదపి. ౪౭౯

వ్యా. వాతము అధికముగనుండురోగికి శీతవీర్యముగలయౌషధమునుగూర్చియైనను, లేక ఔషధమును స్వల్పముగగూర్చియైనను వస్తికర్మచేసినను; పిత్తము ప్రకోపించినపుడు మిక్కిలి యుష్ణమైనయౌషధమునుజేర్చి వస్తికర్మజేసినను ; కఫము ప్రకోపించినపుడు మృదువైనవస్తిని ప్రయోగించినను; మిక్కుటముగ భుజించినపుడు గురుగుణముకలవస్తిని ప్రయోగించినను; మలము మిక్కుటసంచితమైనపుడు పరిమితిచేనైనను వీర్యముచేనైనను స్వల్పబలమైనవస్తిని ప్రయోగించినను, అట్టివస్తి అయోగముజెంది(చక్కగ పనిచేయక), పైజెప్పిన శీతాదికారణములచేత మరింత వృద్ధినొందిన వాతాదిదోషములచే నావరింపబడి గుదమార్గమునుండి బైలువెడలకయుండును.

అభుక్తాదులకు స్నేహవస్తిజనితోపద్రవచికిత్స

మూ. అభుక్తే శూనపాయోర్వా పేయామాత్రాశితస్యచ,
గుదే ప్రణిహితస్స్నేహో వేగాద్ధావత్యనావృతః. ౪౮౦
ఊర్ధ్వకాయం తతః కణ్ఠాదూర్ధ్వేభ్యః ఖేభ్యఏత్యపి,
కణ్ఠాదాగచ్ఛతస్తస్మిన్కణ్ఠగ్రహవిరేచనైః. ౪౮౧
ఛర్దిఘ్నైభిః క్రియాభిశ్చ తస్య కుర్యాన్నిబర్హణమ్,

వ్యా॰ ఆహారమును భుజించినవానికి స్నేహవస్తిని ప్రయోగించినను, గుదము ఉబ్బియుండువానికి స్నేహవస్తి నుపయోగించినను, పేయయనుగంజినిమాత్రము భుజించినవానికి స్నేహవస్తి నుపయోగించినను, అడ్డులేక అతివేగముగ శరీరమునందెల్ల వ్యాపించి శరీరోర్ధ్వభాగమునజేరి కంఠమునకు పైభాగముననుండు గొంతు నాసిక మున్నగురంధ్రములనుండి బైలువెడలును. మరియు పైజెప్పినరీతిగ స్నేహము బైలువెడలినచో కంఠగ్రహము, వాంతిని నిలుపునట్టిచికిత్సలు, విరేచనము మొదలగుచికిత్సలచే స్నేహము కంఠమున జేరకుండునటుల సదుపాయమును జేయనగును.

ఆహారము జీర్ణించినప్పుడు వస్తికర్మానర్హత

మూ॰ జ్వరం విదగ్ధ భక్తస్య కుర్యాత్ స్నేహః ప్రయోజితః. ౪౮౨

వ్యా॰ భుజించినయాహారము పూర్తిగ జీర్ణమైనప్పుడు స్నేహవస్తిని ప్రయోగించినచో జ్వరమువచ్చును.

అపక్వస్నేహవస్తివలన కల్గునుపద్రవములు, వానిచికిత్స

మూ॰ నాపక్వం ప్రణయేత్ స్నేహం గుదం సహ్యుపలిమ్పతి,
తతః కుర్యాత్సతృణ్మోహ కణ్డూశోఫాంః క్రియాత్ర వా. ౪౮౩
తీక్ష్ణోవస్తిః తథా తైలం అర్కపత్ర రసే శృతమ్,

వ్యా॰ చక్కగపాకముచెందనిస్నేహమును వస్తికర్మయందు ప్రయోగించినచో నయ్యది గుదమునం దంటుకొని దప్పి, మూర్ఛ, జిల, వాపు మొదలగునుపద్రవముల గల్గించును. అట్టియెడ తీక్ష్ణములగువస్తులను ప్రయోగించవలెను. మరియు జిల్లేడాకులరసమును కలిపి పక్వముచేయబడినతైలమును గుదమునకు పూయనగును.

నిశ్శేషవస్తిప్రయోగజనితోపద్రవములు, వానిచికిత్స

మూ॰ అనుచ్ఛ్వాస్యతుబద్ధే వా దత్తే నిశ్శేషవవవా. ౪౮౪
ప్రవిష్టః క్షుభితోవాయుశ్శూలతోదకరోభవేత్,
తత్రాభ్యజ్గోగుదేస్వేదః వాతఘ్నాన్యశనానిచ. ౪౮౫

వ్యా॰ వస్తియంత్రద్వారమునుండి గాలినిపోనివ్వక ద్వారమునుమూసి వస్తిప్రయోగముజేసినను, లేక వస్తియంత్రమునందలి కషాయాదులను నిశ్శేషముగ ప్రయోగించినను వాతము లోపల ప్రవేశించి ప్రకోపమునొంది శూలను పోట్లను కల్గజేయును. అట్టియెడ గుదస్థానమున నభ్యంగస్వేదములజేయించి వాతహరములగునన్నపానాదుల నుపయోగించవలెను.

వేగముగ వస్తి ప్రయోగించుటచే గల్గినవ్యాపద్రచికిత్స

మూ. ద్రుతం ప్రణీతే నిష్కృష్టే సహసోత్క్షిప్త ఏవ వా,
స్యాత్కటీగుదజఙ్ఘోరువస్తిస్తమ్భార్తిభేదనమ్. ౪౮౬
భోజనం తత్ర వాతఘ్నం స్వేదాభ్యఙ్గాస్సవస్తయః. ౪౮౭

వ్యా. వస్తియంత్రమును అతిశీఘ్రముగ నాకర్షించినను. త్వరితముగ ప్రయోగించినను, అతిశీఘ్రముగ పైకెత్తినను; నడుము, గుదస్థానము, పిక్కలు, తొడలు, పొత్తికడుపు ఇవి స్తంభించి పోటును, పగులదీయునటులనొప్పియుం కల్గును. అట్టియెడ వాతహరమగుభోజనంబును, స్వేద-అభ్యంగ-వస్తువునుచేయుట యుక్తముగ నుండును.

అనువాసనవస్త్యనంతరము నిరూహవస్త్యావశ్యకత

మూ. ఇతి స్నేహైస్త్రిచతురైః స్నిగ్ధే స్రోతోవిశుద్ధయే,
నిరూహం శోధనం యుఞ్జ్యాత్ అస్నిగ్ధే స్నేహనంతనోః. ౪౮౮

వ్యా. పైజెప్పినప్రకారము మూడునాల్గుఅనువాసనవస్తులవలన రోగి స్నిగ్ధుడైనపుడు స్రోతస్సు శుద్ధము లగుటకు శోధనకరమైన నిరూహవస్తిని ప్రయోగింప నగును. రోగి స్నిగ్ధుడుకానియెడల మరల శరీరమునకు స్నేహకర్మను జేయవలెను.

నిరూహవస్తిప్రయోగము

మూ. పఞ్చమేఽథ తృతీయేవా దివసే సాధకే శుభే,
మధ్యాహ్నే కిఞ్చిదావృత్తే ప్రవృత్తే బలిమఙ్గళే. ౪౮౯
అభ్యక్తస్వేదితోత్సృష్టమలం నాతిబుభుక్షితమ్,
అవేక్ష్య పురుషం దోషభేషజానీతిచాదరాత్. ౪౯౦
వస్తిం ప్రకల్పయేద్వైద్యః తద్విద్వైద్యభిస్సహ,

వ్యా. పిదప ననువాసనవస్తిని జేసిన మూడవదినమునందైనను ఐదవదినమునందైనను మధ్యాహ్నము తిరిగినపిమ్మట శుభకరమైనవేళలో బలిపూజాదిదైవికకర్మలనలిపి అభ్యంజన స్వేదకర్మలను విధ్యుక్తముగజేసికొని, యథాకాలమున మలమూత్రాదుల విసర్జించి మిక్కిలి ఆకలిలేక కొంచెముగ నాకలిగల్గియుండుసమయమున రోగియొక్కప్రకృతిని దోషమును, ఔషధము గుణాదులను రోగియొక్కసాత్మ్యమును బలమును, ఇవి మున్నగుతదనుకూల విషయములను చక్కగ నాలోచించి, రోగివయసున కనుగుణముగ పరిమితిని కల్పించి వైద్యశాస్త్రమును జక్కగ తెలిసినవైద్యులసాహాయ్యమునుపొంది, మిగుల ప్రయత్నముతో నిరూహవస్తిని ప్రయోగింపవలెను.

నిరూహవస్తిక్వాథకల్పనము

మూ. క్వాథయే ద్వింశతిపలం ప్రస్థేష్వష్టౌ ఫలానిచ. ౪౯-౧

వ్యా. నిరూహవస్తికి నిర్ణయించినద్రవ్యములలో నిరువదిపలముల పరిమితిద్రవ్యములను, ఎనిమిదిపలములు మ్రంగకాయలను, ఈద్రవ్యములసముదాయమునకు పదునారు భాగము లధికముగ జలమునజేర్చి నాల్గవపాలు మిగుల కాచవలెను.

వాతాదులయందు నిరూహవస్తి స్నేహపరిమితి

మూ. తతః క్వాథాచ్చతుర్థాంశం స్నేహం వాతేఽనుకల్పయేత్,
పిత్తే స్వస్థేచ షష్ఠాంశం అష్టమాంశం కఫాధికే. ౪౯-౨

వ్యా. వాతము ప్రకోపించియుండువానికి పైజెప్పినప్రకారము సిద్ధముచేయబడిన కషాయమునకు నాల్గవపాలు స్నేహద్రవ్యము గూర్చవలెను. పిత్తం బధికముగనుండు వానికిని స్వస్థతనుండువానికిని పైజెప్పినక్వాథములో నారవభాగము స్నేహమును జేర్ప నగును. కఫం బధికముగనుండువానికి పైజెప్పినక్వాథమునకు నెనిమిదవపాలు స్నేహద్రవ్యమును జేర్పనగును. వాతపిత్తకఫములు మూడును అధికముగ సమానములై యుండునపుడును, స్వస్థముగ నుండునపుడును క్వాథమునకు ఎనిమిదవపాలు స్నేహమును జేర్పనగును.

మూ. సర్వత్రచాష్టమం భాగం కల్కాద్భవతి వా యథా,
నాత్యచ్ఛసాన్ద్రతావస్తేః పలమాత్రం గుడస్యచ. ౪౯-3
మధుపట్వాదిశేషం చ యుక్త్యా సర్వం తదేకతః,
ఉష్ణామ్బుకుమ్భీబాష్పేణ తప్తం ఖజసమాహతమ్. ౪౯-౪
ప్రక్షిప్యవస్తౌ ప్రణయేత్ పాయౌనాత్యుష్ణశీతలమ్,
నాతిస్నిగ్ధం న వా రూక్షం నాతితీక్ష్ణం న వా మృదు. ౪౯-౫
నాత్యచ్ఛసాన్ద్రం నో నాతిమాత్రం నా పటునాలిచ,
లవణం తద్వదమ్లంచ........

వ్యా. వాతపిత్తకఫములకు మూటికిని కల్కద్రవములో నెనిమిదవపాలు స్నేహద్రవ్యమునుచేర్చినను చేర్చవచ్చును. వస్తి మిగుల తేటగ ఘనముగ నుండకుండునటులు కల్కమును సిద్ధముచేయవలయును. మరియు నాకల్కమునందు ఒకపలముప్రమాణము బెల్లమును, తేనె, లవణము, మొదలగు తక్కినద్రవ్యములనుకూడ యుక్తియుక్తముగ జేర్చుకొనవలెను (ఇచ్చట ఆదిశబ్దముచేత మాంసరసము, సుర, ఆసవము, మూత్రము, క్షీరము, కాంజికము, అనునవి గ్రహింపబడును).

పైజెప్పియుండుద్రవ్యముల నన్నిటిని పాత్రలోజేర్చి వేడినీళ్లతోకూడియుండు ఒకఖుంగకుండయొక్క సీటియావిరిచేత పాత్రయందలి ద్రవ్యములను వెచ్చజేసి గరిటెచేత బాగుగ కలియబెట్టి అత్యుష్ణంబును, అతిశీతలంబును, అతిస్నిగ్ధంబును, అతిరూక్షంబును, అతితీక్ష్ణంబును మిక్కిలి తేటయు అతిమృదువును ప్రమాణాధికంబును హీనప్రమాణంబును లవణాధికంబును అమ్లాధికంబును గాకుండునట్లు పైయౌషధంబును సిద్ధపరచి వస్తియంత్రములోజేర్చి గుదమునందు ప్రయోగించవలయును.

## మతాంతరమున నిరూహావస్తిద్రవ్యసంయోజనక్రమము

మూ. ................పఠ న్త్యన్యేతు తద్విదః. ౪౯౬

మాత్రాం త్రిపలికాం కుర్యాత్ స్నేహమాక్షికయోః పృథక్,
కర్షార్థం మాణిమన్థస్య స్వస్థే కల్కపలద్వయమ్. ౪౯౭
రసక్వాథామ్లమాత్రాణాం పలాని దశకల్పయేత్,
మాక్షికం లవణం స్నేహం కల్కం క్వాథ మితి క్రమాత్. ౪౯౮
ఆవపేతనిరూహాణాం ఏషసంయోజనేవిధిః.

వ్యా. స్నేహద్రవ్యమును తేనెను ప్రత్యేకము మూడుపలములును, సైంధవలవణము అర్థకర్షపరిమితంబును, స్వస్థతనుండువానికి కల్కము రెండుపలములును, రసము క్వాథము పులుపురసము మున్నగుద్రవద్రవ్యములు పదిపలములును నిరూహావస్తికి జేర్చవలెనని కొందరాయుర్వేదవేత్తలు చెప్పెదరు. మరియు నొకభాండమున తొలుత తేనెనుబోసి మర్దనము చేసి, పిదప లవణమునువేసి మర్దనముచేసి మిశ్రము చేయవలెను. పిమ్మట స్నేహద్రవ్యమును, తర్వాత కల్కమును, పిమ్మట క్వాథమును వరుసగకలిపి సిద్ధముచేయవలెను. ఇత్తెరంగున మిశ్రముచేయబడినద్రవ్యములు సమరసములుగ నగును. వస్తిద్రవ్యములను పైజెప్పినక్రమముగ సంయోగముచేసినచో నిరూహావస్తి వ్యాపత్తులేక చక్కగ పనిచేయును. నిరూహావస్తి ద్రవ్యసమ్మేళనక్రమము ఇదియే యని యెరుంగునది.

## తీక్ష్ణమృదువస్తిస్వరూపము

మూ. తీక్ష్ణత్వం మూత్రపీల్వగ్ని లవణక్షారసర్షపైః. ౪౯౯
ప్రాప్తకాలం విధాతవ్యం ఘృతక్షీరైస్తు మార్దవం,

వ్యా. వస్త్యౌషధములకు గోమూత్రము, వరగోగు, చిత్రమూలము, లవణములు, క్షారములు, ఆవాలు, వీనిచేరికవలన తీక్ష్ణత్వము కలుగును. ఆవునెయ్యి, ఆవుపాలు ఈరెండు చేరుటచేత మృదుత్వము కలుగును. కావున యుక్తకాలములో రోగియొక్కబలదోషప్రవృత్త్యాదుల ననుసరించి తత్తదనుగుణముగ పైజెప్పినతీక్ష్ణమృదుద్రవ్యములచేర్చి వస్తికర్మను చేయునగును.

### శ్లేష్మవాతరోగములకు ఏరండాదివస్తి

మూ. ఏరండమూలాత్త్రిఫలం పలాంశాత్ తథాపలాశంలఘుపంచమూలం,
రాస్నాబలాఛిన్నరుహాశ్వగంధాపునర్నవారగ్వధ దేవదారు.
పలాని చాష్టౌ సలిలాఢకాభ్యాం విపాచయేదష్టమశేషితేస్మిన్,
వచాశతాహ్వా హపుషా ప్రియంగు యష్టీకణావత్సకబీజముస్తమ్.
దద్యాత్సుపిష్టంసహతార్క్ష్యశైలమక్షప్రమాణంలవణాంశయుక్తం,
సమాక్షికస్తైలయుతస్సమూత్రో వస్తిర్జయేల్లేఖనదీపనోసా. ౫౦౨
జంఘోరుపాదత్రికపృష్ఠకోష్ఠహృద్గుహ్యశూలం గురుతాం విబంధమ్, గుల్మాశ్మవర్ధ్మ గ్రహణీగుదోత్థాం స్తాం స్తాంశ్చరోగాన్ కఫవాత జాతాన్. ౫౦౩

వ్యా. ఆముదపువేళ్లు మూడుపలములు, మోదుగపప్వు మూడుపలములు, హ్రస్వపంచమూలములు 1 పలము, దుంపరాష్ట్రము, చిట్టాముట్టి, తిప్పతీగె, పెన్నేరుగడ్డ, గలిజేరు, రేల, దేవదారు ఇవి దినుసుకు ఒక్కొక్కపలము; మ్రంగకాయలు ఎనిమిదిపలములు వీని నన్నిటిని నలగగొట్టి ఒకపాత్రమునవైచి అందు రెండు ఆఢకములు జలముపోసి ఎనిమిదవపాలు మిగులునట్లు కషాయముకాచి అందులో వస, సదాపవిత్తులు, బోడతరము, ప్రేంకణము, అతిమధురము, పిప్పళ్లు, కొడిసెపాలవిత్తులు, తుంగగడ్డలు అనునీవస్తువులను ప్రత్యేకము కర్షప్రమాణముచొప్పున చక్కగ నూరి కలిపి అందు సైంధవలవణము నొకకర్షము చేర్చి దానిలో తేనెను, నువ్వులనూనెను, గోమూత్రమును పోసి, విధిప్రకారము వస్తిని ప్రయోగించినపిక్కలు, తొడలు, కాళ్ళు, వెన్నెముకకు క్రిందిభాగము, వీపు, కోష్ఠము, రొమ్ము, గుదము వీనియందలిశూలలు, గురుత్వము, మలబంధము, గుల్మము, అశ్మరి, అండవృద్ధి, గుదాంకురములు, కఫవాతమువలన జనించు ననేకరోగములును ఇవియన్నియు నివర్తించును. మఱియు నీవస్తి మలమును భేదించి అగ్నిదీపనమును కల్గించును.

### పిత్తరోగహరవస్తి

మూ. యష్ట్యాహ్వరోధ్రాభయ చందనైశ్చ శృతం పయోగ్ర్యం కమలోత్పలైశ్చ, సశర్కరాక్షౌద్రయుతం సుశీతం పిత్తామయాన్ హన్తి సజీవనీయమ్. ౫౦౪

వ్యా. అతిమధురము, లొద్దుగు, వట్టివేరు, చందనము, తామరపువ్వు, నల్లకలువలు వీనిని సమభాగములుగ జేర్చి ఆవుపాలలోవేసి చక్కగ కాచి అందులో చక్కెర, తేనె

జీవనీయాగణద్రవ్యములు వీనిసన్నిటిని కలిపి శీతముగ వస్తికర్మను ప్రయోగించిన పిత్త రోగములన్నియు హరించును.

—॥ నిరూహవస్తి ప్రయోగాంతరకర్తవ్యము ॥—

మూ. ఉత్తానో దత్తమాత్రేతు నిరూహే తన్మనా అపి,
కృతోపధానస్సఞ్జాతవేగశ్చోత్కటుకః సృజేత్. ౫౦౫

వ్యా. నిరూహవస్తిని ప్రయోగించినతోడనే వెలికలవరుండి తలగడమీద నాను కొని నిరూహవేగమునందు మిక్కిలి గమనముకలవాడై ఉండవలెను. నిరూహవేగము కలుగునప్పుడు నిరాటంకముగ వదలిపెట్టవలెను.

—॥ వేగాభావమున మరల నిరూహవస్తిప్రయోగము ॥—

మూ. ఆగతౌ పరమః కాలో ముహూర్తో మృత్యవేపరమ్,
తత్రానులోమికం స్నేహక్షారమూత్రామ్లకల్పితమ్. ౫౦౬
త్వరితం స్నిగ్ధతీక్ష్ణోష్ణం వస్తిమన్యం ప్రపీడయేత్,
విదధ్యాత్ఫలవర్తిం వా స్వేదనోత్త్రాసనాదిచ. ౫౦౭

వ్యా. నిరూహవస్తి వేగముయొక్క ఆగమనకాలము ఒకముహూర్తపరిమిత మగును. అంతకన్న నధికకాలమగునేని మరణమును కల్గించును. నిరూహవస్తివేగము ముహూర్తకాలమునకుపైన బైటవెడలకున్నయెడ అనులోమకరంబును, స్నేహము యవ క్షారము గోమూత్రము తక్రము కాంజికము మొదలగునట్టిద్రవ్యములచేత సిద్ధముచేయ బడినదియు, స్నిగ్ధముగను ఉష్ణముగను ఉండునదియునగు వేరేనిరూహవస్తిని త్వరితముగ ప్రయోగింపనగును. లేక అర్శస్సులకుజెప్పిన మ్రంగకాయతోగూడిన ఫలవర్తినైన నుప యోగింపవలెను. మరియు చెమటపుట్టింపవలెను. భయమును కల్గింపవలెను.

—॥ వేగాభావమునం దుపాయాంతరము ॥—

మూ. చత్వారస్తైలగోమూత్ర దధిమణ్డామ్లకాఞ్జికాత్,
ప్రసృతాః సర్షపైః పిష్టైః విట్సఙ్గానాహభేదినః. ౫౦౮
విదధ్యాత్ఫలవర్తిం వా స్వేదనోత్త్రాసనానిచ,

వ్యా. మరియు నువ్వులనూనె, గోమూత్రము, పెరుగుమీదితేట, పులిగంజి వీనిని నాల్గుప్రసృతములు కూర్చి అందు ఆవాలు నూరి కలిపి వస్తినిప్రయోగించిన మలమును భేదించును. కడుపుబ్బరము తీరును, లేక ఫలవర్తిని ప్రయోగించి చెమటపుట్టించి భయ పెట్టవలెను,

—● ద్వితీయ-తృతీయాదినిరూహవస్తిప్రయోగము ●—

మూ. స్వయమేవ నివృత్తేతు ద్వితీయోవస్తిరిష్యతే. ౫౦౯
తృతీయోఽపి చతుర్థోఽపి యావద్వాసుసిరూఢతా,

వ్యా. పైజెప్పినరీతిగ ఫలవర్తి మున్నగువానిప్రయోగము లేకయే స్వయముగ నిరూహవస్తి బైలువెడలినచో రెండు మూడునాల్గుపర్యాయములు నిరూహవస్తిని ప్రయోగింపనగును. లేక సంఖ్యానియమములేక బాగుగ నిరూఢత్వము కల్గునంతవరకును నిరూహవస్తిని ప్రయోగించవలెను. (ఇట్లు చెప్పుటచేత ఫలవర్తి మున్నగువానిని ప్రయోగించి మిక్కిలి ప్రయాసచేత నిరూహవస్తి బైటవెడలినప్పుడు మరియొకనిరూహవస్తిని ప్రయోగింపజనదని తెలిసెడి.)

—● నిరూహవస్తిసమ్యగ్యోగాదులు, సమ్యగ్యోగమునపత్థ్యము ●—

మూ. విరిక్తవచ్చ యోగాదీన్ విద్యాత్ యోగేతు భోజయేత్.
కోష్ణేన వారిణా స్నాతం ధన్వమాంసగసోదనమ్,

వ్యా. నిరూహవస్తియందు సమ్యగ్యోగ-అతియోగ-అయోగములను విరేచనమునకుజెప్పిన సమ్యగ్యోగాదులవలె నెరుంగునది. మరియు నిరూహవస్తి సమ్యగ్యోగమున రోగిని సుఖోష్ణమైనవేడినీళ్లతో స్నానముచేయించి, తేలికయైన జాంగలమాంసరసములో నన్నము తినిపించవలెను.

—● నిరూహవస్త్యనంతరము ఉష్ణోదకస్నానగుణము ●—

మూ. వికారాయే నిరూహస్య భవన్తి ప్రచలైర్మలైః. ౫౧౧
తే సుఖోష్ణామ్బుసిక్తస్య యాన్తి భుక్తవతశ్శమమ్,

వ్యా. నిరూహవస్తియందు స్వస్థానమునుండి చలించినవాతాదిదోషములచే గల్గు వికారములు సుఖోష్ణమైనవేడినీళ్లలో స్నానముచేసి పత్థ్యముగ నాహారమును భుజించినచో నట్టివికారములు శాంతినొందును. (కావున నిరూహవస్తి సమ్యగ్యోగమునందు సుఖోష్ణజలమున స్నానముచేసి హితముగ భుజించుట ముఖ్యకర్తవ్యము).

—● న్యూనాధికవస్తి ప్రయోగజనితోపద్రవములు ●—

మూ. కుర్వతో వేగసంరోధం పీడితో వాతిమాత్రయా. ౫౧౨
అస్నిగ్ధలవణోష్ణో వా వస్తిరల్పోఽల్పభేషజః,
మృదుర్వామారుతే నోర్ధ్వం విక్షిప్తో ముఖనాసికాత్. ౫౧౩
నిరేతి మూర్ఛాహృల్లాస తృడ్దాహాదీన్ ప్రవర్తయన్.

వ్యా. మలమూత్రవాతాదివేగముల నడ్డగించువానికి వస్తికర్మను ప్రయోగించినను, లేక వస్తికర్మమును అధికముగ జేసినను, స్నేహమును లవణమును జేర్చక ఉష్ణవీర్యములగు నౌషధముల జేర్చి వస్తి నుపయోగించినను, స్వల్పప్రమాణముగ నౌషధమును జేర్చియైనను అల్పవీర్యమైన యౌషధమును జేర్చి ప్రయోగించినను, మృదువైన వస్తిని ప్రయోగించినను, ఆవస్త్యౌషధములు ప్రకుపితవాతముచే నూర్ధ్వభాగమున వ్యాపింపబడి మూర్ఛ, హృల్లాసము, దప్పి, సర్వాంగతాపము మున్నగునుపద్రవములగల్గించి నోటినుండియు ముక్కులనుండియు బైటవెడలును.

## న్యూనాధికవస్త్యాదిజనితోపద్రవోపచారములు

మూ. మూర్ఛావికారం దృష్ట్వాస్య సిఞ్చేచ్ఛీతామ్బునాముఖమ్. ౫౧౪
వ్యజేవాక్షమవాశా ఛ ప్రాణాయామం చ కారయేత్,
పృష్ఠపార్శ్వోదరం మృజ్యాత్ కరైరుష్ణైరధోముఖమ్. ౫౧౫
కేశేషూత్క్షిప్య ధున్వీత భీషయే ద్వ్యాళదంష్ట్రిభిః,
శస్త్రోల్కారాజపురుషైః వస్తిరేతి తథా హ్యధః. ౫౧౬
పాణివస్త్రైర్గళాపీడం కుర్యాన్నమ్రియతే యథా,

వ్యా. రోగికి వస్తికర్మను విధిప్రకారముగాక వ్యత్యస్తముగ నుపయోగించినచో మూర్ఛవికారము కల్గును. అట్టిసమయమున వానిముఖముపై చల్లనినీళ్లను చల్లవలెను. బడలిక శమించునంతవరకును వీవనచే మెల్లగ గాలివీవ నగును. వానిని ప్రాణాయామముచేసి శ్వాసబంధన మొనర్చునట్లు చేయవలెను. అరచేతులను నిప్పున వేడియగునట్లు కాచి యాచేతులతో వానినడుమునందును, ప్రక్కలయందు, కడుపుపైనను మెలమెల్లగ క్రిందికిదిగజార రాయవలెను. మరియు వానిని బోరగిలపనుండబెట్టి వానివెండ్రుకలనుబట్టి పైకెత్తి విదిలించవలెను. సర్పములు, కోరలుగలక్రూరజంతువులు, ఆయుధములు, కొరవి, రాజభటులు మొదలగు వానిని జూపి భయపరుపవలెను. ఇట్లు చేసినచో శరీరమున పైభాగములో జేరిన నిరూహావస్త్యౌషధము క్రిందికి దిగజారును. మరియు వానికి ప్రాణమున కపాయములేకుండ చేతితో కంఠమును బిగబట్టవలెను. లేక వస్త్రముచేనైనను కంఠమును కట్టవలెను.

ఇట్లుచేసినచో ప్రాణోదానవాతము లడ్డగింపబడుటంజేసి అపానవాతము తనమార్గమున సంచరించుచు పైభాగమును జెందియుండు వస్త్యౌషధమును క్రిందిభాగమునకు శీఘ్రముగ లాగికొను నని భావము. ఈవిషయమున వాగ్భటాచార్యు లిట్లు నుడివిరి:—
"ప్రాణోదాననిరోధాద్ధిసుప్రసిద్ధతరాయనః, అపానః పవనో వస్తిం తమాశ్వేవాపకర్షతి"

మాధుతైలికాదివస్తులు

మూ. నారీణాం సుకుమారాణాం రాజ్ఞాం స్థవిరబాలయోః. ౫౧౭
దోషసంశోధనం బల్యం వర్ణకృన్మాధుతైలికమ్,
దోషఘ్నో యాపనస్సిద్ధః వస్తి రుత్తరతశ్చసః. ౫౧౮
మృదుత్వాత్పాదహీనత్వాత్ అకృత్స్నవిధిసేవనాత్,
ఏకవస్తి ప్రణాయిత్వాత్ సిద్ధవస్తిష్వయన్త్రిణా. ౫౧౯
ఫలం చ విపులం దృష్టం వ్యాపదామప్యసమ్భవః,
యోజ్యాస్తతస్సుఖేనైవ నిరూహక్రమమిచ్ఛతా. ౫౨౦

వ్యా. స్త్రీలకును, సుకుమారశరీరులకును, ప్రభువులకును, ముసలివాండ్రకును, బాలురకును, మాధుతైలికవస్తి నుపయోగించవలెను. ఇయ్యది దోషములను శోధించును. బలమును శరీరకాంతిని కల్గించును. మరియు యాపనవస్తి దోషహారమైయుండును. సిద్ధవస్తియు ఉత్తరవస్తియు దోషహారములై యుండును. మరియు మాధుతైలము, యాపనము, సిద్ధవస్తి, ఉత్తరవస్త అను నీనాల్గువస్తువులు, మృదుత్వము కల్గియుండుట చేతను, పాదాంశము తక్కువగనుండుటచేతను, వస్తివిధానమునంతయు ననుసరింపక యాచరించుటవలనను, ఒకటేవస్తిని ప్రయోగించుటచేతను పథ్యనియమము విశేషముగ లేదు. పైజెప్పినమృదుత్వాదిగుణములు కల్గియున్నను అట్టివస్తిప్రయోగమువలన ఫల మధికముగ నుండును. వస్తివ్యాపత్తులు కల్గవు. కావున బలమునుకోరువారు పైజెప్పినవస్తులను సుఖముగ నుపయోగింపవచ్చును.

మరియు మాధుతైలికవస్తిలక్షణమును ప్రాచీనాచార్యు లిట్లు నుడివిరి:—"యస్మాన్మధు చ తైలం చ ప్రాధాన్యేనాతివర్తతే, మాధుతైలికఇత్యేషః విజ్ఞేయోవస్తిచిన్తకైః." ఈవస్తియందు తేనెయు నువ్వులనూనెయు ప్రధానద్రవ్యములుగ నుండుటంజేసియియ్యది మాధుతైలిక మని చెప్పబడు నని భావము.

మరియు సిద్ధవస్తిలక్షణ సుశ్రుతులచే నిట్లుచెప్పబడినది:—"యస్మిన్ యుక్తే యథా వస్తౌ ధ్రువా సిద్ధిః ప్రకీర్తితా, సిద్ధవస్తిరితి ఖ్యాతః మునిభిస్తత్వదర్శిభిః." ఏవస్తిని ప్రయోగించినచో శరీరమునకు బలమును, పుష్టియు, సుఖాదులును కల్గునోఅయ్యది సిద్ధవస్తి యని భావము. ఈలక్షణముచేత పైజెప్పిన నాల్గువస్తువులును సిద్ధవస్తు లని తెలిసెడి.

మాధుతైలికవస్తిప్రయోగము

మూ. మధు తైలే సమే కర్షః సైన్ధవో ద్విపిచుర్భిడమ్ (మిసిః),

ఏరణ్డమూలక్వాథేన నిరూహో మాధుతైలికః. ౫౨౧
రసాయనం ప్రమేహార్శః క్రిమిగుల్మాన్త్రవృద్ధినుత్,
సయష్టి మధుకశ్చైషః చక్షుష్యో రక్తపిత్తజిత్. ౫౨౨

వ్యా. తేనెయు, నువ్వులనూనెయు సమభాగంబులు, సైంధవలవణము ఒకకర్షము, సదాపవిత్తులు రెండుకర్షములు వీనినన్నిటిని ఆముదపువేళ్లకషాయములో కలిపి నిరూహవస్తి నుపయోగించిన నయ్యది మాధుతైలికవస్తి యనబడును. ఇయ్యది వీర్యమును (శుక్రమును) వృద్ధినొందించును. ప్రమేహమును, అర్శస్సును, క్రిమిరోగమును, గుల్మమును, అండవృద్ధిని హరించును. పైజెప్పినకషాయములో అతిమధురమును చేర్చి ప్రయోగించినయెడ కన్నులకు మిక్కిలి హితముగ నుండును. రక్తపిత్తమును హరించును.

వాతహరప్రసృతవస్తి

మూ. క్షీరాద్విప్రసృతౌ కార్యౌ మధుతైలఘృతాత్త్రయః,
ఖజేన మథితో వస్తిః వాతఘ్నో బలవర్ణకృత్. ౫౨౩

వ్యా. ఆవుపాలు రెండుప్రసృతము (నాల్గుపలము)లు, తేనె, నువ్వులనూనె, ఆవునెయ్యి ఈమూడును చేరి మూడుప్రసృతములు (అనగా ప్రత్యేకము రెండేసిపలములు) వీనినన్నిటిని ఒకటిగ జేర్చి కవ్వముతో చిలికి వస్తిప్రయోగముచేసిన వాతరోగములను హరించి శరీరబలమును కాంతిని కల్గించును.

ఉత్తరవస్తిప్రయోగమున కర్హులు

మూ. వస్తౌ రోగేషు నారీణాం యోనిగర్భాశయేషుచ,
ద్విత్రాస్థాపనశుద్ధేభ్యో విదధ్యాద్వస్తి ముత్తరమ్. ౫౨౪

వ్యా. స్త్రీలకును పురుషులకును వస్తి(మూత్రపుతిత్తి)లో కల్గినరోగములయందును, స్త్రీలకు యోనియందును గర్భాశయమునందు కల్గురోగములయందును, ఆట్టిస్త్రీపురుషులకు తొలుత రెండుమూడు ఆస్థాపనవస్తులచే శోధనముచేసి పిమ్మట ఉత్తరవస్తిని ప్రయోగించవలెను. (గుదమునకంటె నుత్తరమార్గమున ప్రయోగింపబడుటవలన ఉత్తరవస్తి యని యియ్యది చెప్పబడును.)

ఉత్తరవస్తిద్రవప్రమాణము

మూ. తస్య శుక్తిః ప్రకుఞ్చోవా మాత్రాస్య స్నేహవస్తివత్,

వ్యా. ఉత్తరవస్త్యౌషధమునందు స్నేహద్రవ్యమును శుక్తిప్రమాణమునైనను ప్రకుంచప్రమాణమునైనను స్నేహవస్తివలె జేర్పనగును.

వస్త్యౌషధము బైటవెడలనిచో చికిత్స

మూ. అనిస్సృతౌ వేషణీం చ వస్తి ద్వారే ప్రవేశయేత్. ౫౨౫

పీడయే ద్వాప్యధోనాభేః నిబద్ధో త్తరవ స్తినా,
ఆరగ్వధస్యపత్త్రేషు నిర్గుణ్డ్యాస్స్వరసేనచ. ॥౨౬
కుర్యాద్గోమూత్రపిష్టేషు వ స్తిం చాపి ససైన్ధవైః,
ముద్గైలాస్సషపై స్తుల్యా ప్రవిభజ్యానయాంసిచ. ॥౨౭
వ స్తే రాగమనాద్గాయ తాన్నిదధ్యాచ్ఛలాకయా,
అగారధూమకంబృహతీ పిప్పలీ ఫలసైన్ధవైః. ॥౨౮
కృతాం వా శుక్తిమాత్రాస్తు అపిష్టై స్సహనాగరైః,
వస్తి దోషహరోఽపితం వస్తుయష్టిక్వాథయుతం మధు. ॥౨౯
క్షీరవృక్షకషాయోవాక్షీరంవాథ్యశ (పీడితమ్),

వ్యా. ఉత్తరవస్తిని ప్రయోగించినపుడు వస్త్యౌషధము నియతకాలమునకు బైట వెడలకున్నయెడ ఏషణిశలాకను వస్తియంత్రద్వారమున ప్రవేశపెట్టవలెను. లేక రోగి యొక్క బొడ్డుకు క్రిందిభాగమున చేతితో పిసకవలెను. మరియు ఆముదపుటాకులను వావిలాకురసముచేనైనను గోమూత్రముచేనైనను మర్దనముచేసి అందు సైంధవలవణమును కల్పి మరల నుత్తరవస్తిని చేయవలెను. మరియు వస్తియంత్రముయొక్కరంధ్రమును పెసరగింజదూరునంతైనను, ఏలకిగింజదూరునంతైనను ఆవగింజదూరునంతైనను పరిమితి కల్గియుండవలెను. అట్టిపరిమితి వయోభేదమునుబట్టి యుపయోగింపదగియుండును. అట్టిరంధ్రముల నుండి వస్త్యౌషధము వెడలుటకై శలాకను ప్రయోగింపదగును. మరియు కరిదూపము, వాకుడు, పిప్పళ్లు, మ్రంగకాయ, సైంధవలవణము, వీనినన్నిటిని శుక్తిప్రమాణముజేర్చి శుంఠినిగూర్చి నూరి వస్తి ప్రయోగము చేయవలెను. మరియు వస్త్యౌషధము వెడలినపిమ్మట బాధకల్గినచో అతిమధురముకషాయమున తేనెనైనను, అత్తి మొదలగుక్షీరవృక్షకషాయమునైనను, క్షీరమునైనను ప్రయోగింపవలెను.

## ఉత్తరవస్తిసాధ్యరోగములు

మూ. శుక్రం తూష్ణం శోణితం చాఙ్గనానాం పుష్పోద్రేకం తస్య నాశం చ కష్టమ్, మూత్రాఘాతం మూత్రదోషప్రవృద్ధం యోని వ్యాధిం సంస్థితం చాపరాయు. ॥౩౦
శుక్రోచ్ఛోషం శర్కరామశ్మరీంచ శూలం వస్తే వఙ్క్షణౌ మేహ నేచ, ఘోరానన్యాస్వస్తిజాంశ్చాపిరోగాన్ హిత్వామేహానుత్తరం హన్తివస్తిః. ॥౩౧

వ్యా. పురుషులకు శుక్రంబును స్త్రీలకు శోణితంబును ఈరెంటియందుకల్గిన ఉష్ణమును, స్త్రీలకు కల్గినఆర్తవరక్తాధికస్రావమును, అట్టియార్తవనాశమును, మూత్రదోషముచే వృద్ధినొందిన మూత్రాఘాతమును, స్త్రీలకు యోనిలో సంభవించెడివ్యాధులను, శుక్రశోషమును, మూత్రశర్కరను, అశ్మరీరోగమును, మూత్రాశయమునందును గజ్జలయందును మేఢ్రమునందును కల్గినశూలలను వీసినన్నిటిని ఉత్తరవస్తి హరించును. మరియు ప్రమేహములుతక్క తక్కినవస్తి జనితక్రూరవ్యాధులనన్నిటిని కూడ ఉత్తరవస్తి హరించును.

## నస్యవిధి, నస్యార్హరోగములు

మూ. ఊర్ధ్వజత్రువికారేషు విశేషాన్నస్యమిష్యతే,
నాసాహిశిరసోద్వారం తేన తద్వ్యాప్యహన్తితాన్. ॥౩౨

వ్యా. మెడకొంకులకు పైభాగమున జనించురోగముల కన్నిటికిని విశేషముగ నస్యము నుపయోగించవలెను. నాసిక శిరస్సుకు ద్వారముగ నుండునుకావున నాసారంధ్రములనుండి యుపయోగింపబడిన చూర్ణతైలాదులు నాసారంధ్రములనుండి లోభాగమున చెవులు భ్రూమధ్యము కన్నులు కంఠము శిరస్సు ముఖము మొదలగువానియందు ప్రవేశించి శిరమున వ్యాపించి వానియందు జనించునట్టిరోగములను పోగొట్టును.

## విరేచననస్యోపయోగవిషయములు

మూ. విరేచనం శిరశ్శూలజాడ్యస్యన్దగళామయే,
శోఫగణ్డక్రిమిగ్రన్థి కుష్ఠాపస్మారపీనసే. ॥౩౩
కల్కాద్యైరవపీడస్తు తీక్ష్ణైర్మూర్ధవిరేచనః,
ధ్మానం విరేచనశ్చూర్ణః................

వ్యా. (విరేచనము, బృంహణము, శమనము నని నస్యము మూడువిధములు.) అందు విరేచననస్యమును తలనొప్పి, జడత్వము, స్యన్దము, కంఠరోగములు, శోఫ, గండరోగము, కృమిరోగము, గ్రంథి, కుష్ఠము, అపస్మారము, పడిసెము వీనియందు విశేషముగ విరేచననస్యము నుపయోగించునది.

స్నేహద్రవ్యము లేక తీక్ష్ణద్రవ్యములయొక్క కల్కాదులచేతనే నాసారంధ్రములనుండి దోషముల వెడలింపజేసిన నస్యాది అవపీడన మను శిరోవిరేచననస్య మగును.

మరియు మిరియములు మున్నగువానిని చూర్ణముచేసి యాచూర్ణమును నాసారంధ్రములనుండి పీల్చి దోషమును వెడలించిన నస్యాది ధ్మానమను శిరోవిరేచన నస్యము.

## విరేచననస్యోపయోగక్రమము

మూ. .............యుఞ్జ్యాత్తం ముఖవాయునా. ॥౩౪

షడఙ్గులద్విముఖయా నాడ్యా భేషజగర్భయా,
సహ భూరితరం దోషం చూర్ణత్వాదపకర్షతి. ॥3॥

వ్యా॥ ఆరంగుళములనిడుపును ఊర్ధ్వాధోభాగములయందు రంధ్రములును లోపల త్రికటుకములు మున్నగుసౌషధములచూర్ణముచే నిండింపబడినగొట్టముచేత నాచూర్ణమును ముఖవాతమువలన నాకర్షించి లోన ప్రవేశింపజేయవలెను. అట్టిచూర్ణము లోపల నుండు అనేకదోషములను వైలుపరచును. ఇత్తెరంగుననే కల్కాక్వాథాలగూడ గొట్టముచే లోపలికి ప్రవేశింపజేయవలెను. (లోపలిదోషముల వెడలించుటంజేసి యియ్యది విరేచననస్య మన బడును).

## బృంహణనస్యోపయోగవిషయములు

మూ॥ బృంహణంవాతజే శూలే సూర్యావర్తే స్వరక్షయే,
నాసాస్యశోషవాక్సఙ్గే కృచ్ఛ్రబోధేఽపబాహుకే. ॥3౬

వ్యా॥ వాతప్రకోపమున కల్గినశూల, సూర్యావర్తమనుశిరోరోగము, స్వరము క్షీణమైయుండుట, నాసారంధ్రములును నోరును ద్రవము లేక యెండుట, నోట మాట వెడలక బద్ధగించుట, కన్నులదెరచుటకు కష్టముగ నుండుట, అపబాహుక మనువాతరోగము, ఈరోగము లన్నిటియందును బృంహణనస్యము నుపయోగింపనగును.

## బృంహణనస్యకల్పనము

మూ॥ బృంహణం ధన్వమాంసోత్థ రసాఽసృక్ఖపురైరపి,

వ్యా॥ జాంగలదేశమునబుట్టిన జంతువులమాంసరసముచేతను, వానిరక్తముచేతను, చెట్ల జిగురుచేతను బృంహణనస్యమును, తీక్ష్ణగుణములేని స్నేహద్రవ్యములచేతను బృంహణన స్యమును కల్పింపవలెను.

## శమననస్యోపయోగవిషయములు

మూ॥ శమనం నీలికావ్యఙ్గకేశదోషాక్షిరాజిషు. ॥3౭

వ్యా॥ శమననస్యమును నీలిక, వ్యంగము, కేశదోషము, కన్నులయందు రేఖలు ఏర్పడుట, ఈమున్నగువ్యాధులయందు శమననస్యము నుపయోగింపనగును.

మరియు తీక్ష్ణగుణరహితములగు ఘృతాదిస్నేహములచేతను మాంసాదులచేతను క్షీరముచేతను జలముచేతను శమననస్యమును కల్గించవలెను. ఈవిషయమును వాగ్భటా చార్యులు "శమనం యోజయేత్పూర్వైః క్షీరేణ చ జలేన చ" అనువాక్యముచే చెప్పిరి.

## శమననస్యోపకల్పనము

మూ॥ యథా స్వం యోగికస్నేహైః యథాస్వంచ ప్రసాధితైః,

వ్యా. ఆయాదోషములకు అనుగుణములై స్నేహాదులను తత్తద్రోగానుగుణముగ సంస్కరించి శమనవస్తి నుపయోగింపనగును.

మర్శప్రతిమర్శనస్యస్నేహమాత్రాభేదములు

మూ. మర్శశ్చ ప్రతిమర్శశ్చ ద్విధా స్నేహోఽత్ర మాత్రయా. ౫౩౮
ప్రదేశన్యఙ్గులీ పర్వద్వయాన్మగ్నసముద్ధృతాత్,
యావత్పతత్యసౌబిన్దుః దశాష్టౌ షట్క్రమేణ తే. ౫౩౯
మర్శస్యోత్కృష్టమధ్యోనా మాత్రాస్తా ఏవచ క్రమాత్,
బిన్దుద్వయోనాః కల్కాదేః............

వ్యా. పైజెప్పిననస్యభేదములయందు స్నేహముయొక్క మాత్రాభేదముచే మర్శమనియు, ప్రతిమర్శ మనియు రెండువిధములు. మఱియు ఔషధములో బొటనవ్రేలికి ప్రక్కవ్రేలిని రెండుగణుపులవరకు లోపల మునుగునటుల ప్రవేశింపజేసి ఆవ్రేలితో బొటనవ్రేలినిజేర్చి యెత్తినయెడల నెంతయౌషధమువచ్చునో అయది బిందు వనబడును. అట్టిబిందువులు పదియైనచో మర్శనస్యమునకు ఉత్తమమాత్ర యనియు, ఎనిమిదిబిందువులైనచో మధ్యమమాత్ర యనియు, ఆరుబిందువులైనచో అధమమాత్ర యనియు నెఱుంగునది. మరియు పైజెప్పినఉత్తమ-మధ్యమ-అధమమాత్రలకు వేరువేరుగ నిర్ణయించినబిందు పరిమాణములో రెండేసితక్కువజేసి కల్కస్వరసాదులకు ఉత్తమమధ్యమఅధమమాత్రల కల్పించునది. (కల్కస్వరసాదులకు ఎనిమిదిబిందువులైనచో నుత్తమమాత్ర యనియు, ఆరుబిందువులైనచో మధ్యమమాత్ర యనియు, నాలుగుబిందువులైనచో నధమమాత్ర యనియు భావము.)

నస్యకర్మానర్హులు

మూ. ............యోజయేన్నతు నావనమ్. ౫౪౦
తోయమద్యగరస్నేహ పీతానాం పాతుమిచ్ఛతామ్,
భుక్తభక్తశిరస్స్నాతా స్నాతుకామస్రుతాసృజామ్. ౫౪౧
నవపీనసవేగార్త సూతికాశ్వాసకాసినామ్,
శుద్ధానాం దత్తవస్తీనాం తథా నార్తవదుర్దినే. ౫౪౨
అన్యత్రాత్యయికాద్వ్యాధేః..........

వ్యా. ఉదకమును మద్యమును స్నేహమును విషమును త్రాగినవారికిని, వీనిని త్రాగ నిచ్చగొనినవారికిని, అన్నమును భుజించినవారికిని, శరీరస్నానమునుచేసినవారికిని, శిరస్స్నానముచేయ నిచ్చగొనినవారికిని, రక్తమోచనముచేసికొనినవారికిని, క్రొత్తగ పడిసెముపట్టిన

వానికిని, మలమూత్రవాతముల వేగముచే పీడింపబడినను బాలింతరాలికిని, శ్వాసకాసరోగపీడితులకును, వమనవిరేచనములచే శోధనచికిత్స చేసికొనిన వానికిని, వస్తికర్మ చేసికొనిన వారికిని నస్యకర్మను జేయదగదు. మఱియు వర్షఋతువుగాక తక్కినఋతువులయందు మేఘము లావరించియున్నపుడును నస్యకర్మ చేయఁజనదు. మఱియు నస్యకర్మచేతనే నివర్తింపదగిన రోగములు సంభవించినపుడు పైజెప్పిననిషిద్ధులకును నిషిద్ధకాలమునందును నస్యకర్మ అవశ్యముగ జేయవచ్చును.

## నస్యప్రయోగకాలనిర్ణయము

మూ. ............అథ నశ్యం ప్రయోజయేత్,
ప్రాతశ్శ్లేష్మణి మధ్యాహ్నే పిత్తే సాయం నిశో౽చలే. ॥౪౩
స్వస్థవృత్తేతు పూర్వాహ్ణే శరత్కాలవసన్తయోః,
శీతే మధ్యన్దినే గ్రీష్మే సాయం వర్షాసుసాతపే. ॥౪౪
వాతాభిభూతే శిరసి హిధ్మాయామపతానకే,
మన్యాస్తమ్భే స్వరభ్రంశే సాయం ప్రాతర్దినేదినే. ॥౪౫

వ్యా. శ్లేష్మవ్యాధులయందు ప్రాతఃకాలమునను, పిత్తరోగములయందు మధ్యాహ్నకాలమునను, వాతరోగములయందు సాయంకాలమునను రాత్రికాలమునను నస్యమును ప్రయోగించవలెను. మఱియు రోగములు లేక స్వస్థవృత్తమున నుండువానికి శరద్వసంతఋతువులలో ప్రాతఃకాలమునందును, హేమంతశిశిరఋతువులలో మధ్యాహ్నకాలమునందును, గ్రీష్మఋతువులో సాయంకాలమునందును, వర్షఋతువులో సూర్యునకు అడ్డములేక యెండకాయునపుడును నస్యప్రయోగము చేయవలెను. మఱియు శిరమున వాతరోగము సంభవించినవానికిని, ఎక్కిళ్ళు అపతానకము మన్యాస్తంభము స్వరభ్రంశము అను నీరోగములచే బాధింపబడినవారికిని ప్రతిదినమున సాయంప్రాతఃకాలములు రెంటియందును నస్యప్రయోగము చేయవలెను.

మఱియు పైజెప్పినవానికంటె నితరరోగములయందు ఒకదినముమార్చి మఱియొక దినము ఉదయసాయంకాలములు రెండిటియందును నస్యమును ప్రయోగించవలెను. ఇత్తెఱంగున నేడుదినములవరకు నస్యప్రయోగము చేయనగును కాని అంతకుపైదీర్ఘకాలము ప్రయోగింపదగదు. ఈవిషయమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి:—"ఏకాహాంతర మన్యత్ర సప్తాహంచ తదాచరేత్."

## నస్యమును ప్రయోగించుక్రమము

మూ. స్నిగ్ధస్విన్నోత్తమాఙ్గస్య ప్రాక్కృతావశ్యకస్యచ,

నివాతశయనస్థస్య జత్రూర్ధ్వాం స్వేదయేత్పునః, ॥౪౬॥
అథోన్నాసన్నదేహస్య పాణిపాదే ప్రసారితే,
కించిదున్నతపాదస్య కించిన్మూర్ధవినామితే. ॥౪౭॥
నాసాపుటం పిధాయైకం పర్యాయేణ నిషేచయేత్,
ఊష్మామ్బుతప్తం భైషజ్యం ప్రణాడ్యాపిచునాథవా. ॥౪౮॥

వ్యా. నస్యకర్మ చేయదలచినవానికి తొలుత శిరస్సుకు స్నేహకర్మను పిమ్మట స్వేదకర్మను చేయించి; నిత్యము అవశ్యకముగ నెరవేర్పదగిన మలమూత్రవిసర్జనదంతధావనాది కృత్యములజేయించి, వానిని గాలిలేనిప్రదేశమున నమర్చియుండుశయ్యపై పరుండ నియమించి, వానిమెడకొంకులకు పైభాగమున మరల చెమటపుట్టించి, పిదప వంకరటింకరగాక చక్కగనుండునట్లు వెలికిల బరుండ నియమించి, కాళ్లుమాత్రము కొంచెము ఎత్తుగనుండునట్లు కాళ్లక్రింద తలగడపెట్టి, తలమాత్రము కొంచెము వెనుకప్రక్కకు వంగునట్లునిచి, ఒకముక్కురంధ్రమును మూసి, వేడినీటియావిరిచే కొంచెము వెచ్చనైనయౌషధమును ముందుచెప్పినగొట్టముచేతనైనను ప్రత్తిచేతనైనను నాసారంధ్రమున లోనికిప్రవేశించునట్లు విడువవలెను. పిమ్మట నానాసారంధ్రమును మూసి రెండవనాసారంధ్రమున పైజెప్పినరీతిగనే యౌషధమును ప్రయోగింపవలెను. (ఈవిషయమునే ''పర్యాయేణ నిషేచయేత్'' అని మూలమున చెప్పియున్నది.)

నస్యప్రయోగానంతరకృత్యము

మూ. దత్తే పాదతలస్కంధ కర్ణాదీనివిమర్దయేత్,
శనైరుచ్ఛింఘ్యనిష్ఠీవేత్ పార్శ్వయోరుభయోస్తతః. ॥౪౯॥
ఆభేషజక్షయాదేవం ద్విస్త్రిర్వానస్యమాచరేత్
మూర్ఛాయాం శీతతోయేన సించేత్ పరిహరన్ శిరః. ॥౫౦॥

వ్యా. పైజెప్పినరీతిగ నస్యప్రయోగముచేసినపిదప అరకాళ్లయందును, భుజములపైనను, (అరచేతులయందును) చెవులయందును, నుదుటియందును, మెడపైనను చేతితో మర్దనముచేయవలయును. పిమ్మట నోట జనించుకఫమును మెల్లగ బార్లి కఫముతోకూడి ఇరుపార్శ్వముల వెడలుకఫమును కారియుమియవలయును. పైజెప్పినక్రమముగ ఔషధము నిశ్శేషమగువరకు నుమియుచు రెండుమూడుపర్యాయములు నస్యమును ప్రయోగించవలయును. నస్యప్రయోగము చేయునపుడు మూర్ఛకలిగినచో చల్లనినీళ్లతో శిరస్సుతప్ప తక్కినయంగములను తడుపవలెను. (విరేచననస్యమును ప్రయోగించినపిదప, దోషదేశసాత్మ్యములకనుగుణముగ స్నేహప్రయోగము చేయవలయును.)

నస్యప్రయోగసమయమున నిషిద్ధకృత్యములు

మూ. దీయమానే పునర్నస్యే స్వప్నవో(క్షు)ఃఖన స్త్రథః,
త్యజే ద్వీద ప్రహాసౌచ నస్యకర్త్రే కతినా న్తరమ్. ౫౫౧

వ్యా. నస్యమును ప్రయోగించునపుడు కదలుట, చీదుట, కోపపడుట, మాట లాడుట, నవ్వుట ఇవి మున్నగుకృత్యములను జేయంజనదు.

నస్యధూమాదిప్రయోగానర్హులు

మూ. ననస్యమూనసప్తాబ్దే నాతీతాశీతివత్సరే,
నచోనాష్టాదశేధూమః కబలో నూనపంచమే. ౫౫౨
నశుద్ధిరూనదశమేన చాతిక్రాంతసప్తతౌ,

వ్యా. ఏడుసంవత్సరములవయసుకు లోబడినవానికిని, ఎనుబదివత్సరములవయసుకు మయిబడినవానికిని నస్యమును ప్రయోగింపజనదు. పదునెనిమిదివత్సరములవయసుకు తక్కువ యయినవానికి ధూమపానముచేయుట తగదు. అయిదుసంవత్సరములు పూర్తికానివానికి కబలమును ప్రయోగింపంజనదు. పదిసంవత్సరములకు తక్కువయైనవానికిని డెబ్బదివత్సర ముల వయసుమీరినవానికిని వమనవిరేచనాదిసంశోధనము చేయదగదు.

ప్రతిమర్శనస్యప్రశంస

మూ. ఆజన్మమరణం శస్తః ప్రతిమర్శస్తు వస్తివత్. ౫౫౩
మర్శవచ్చగుణాన్ కుర్యాత్ సహిశీతో (నిత్యో)పసేవనాత్,
నచాత్ర యంత్రణా నాపి వ్యాపదోభ్యమర్శవద్భయమ్. ౫౫౪

వ్యా. ప్రతిమర్శమనునస్యము వస్తివలెనే పుట్టిననాటనుండి మరణాంతము నియత ముగ నుపయోగింపనగును. ఇయ్యది మర్శమనునస్యమువలె సుఖోచ్ఛ్వాసాదిసుగుణము లను నిత్యోపయోగమువలన గల్గించును. మఱియు నీనస్యమున ఉష్ణోదకాద్యుపసేవనము మున్నగు పథ్యనియమములు లేవు. శీతోదకాద్యుపసేవనమువలని మర్శనస్యమునందువలె నేత్రస్తబ్ధత్వాదివ్యాపత్తులు ప్రతిమర్శనస్యమునం దొకప్పుడును గల్గదు. (కావున ప్రతి మర్శనస్యము జన్మాంతరమువరకును నిరాటంకముగ నుపయోగింపదగినది యని భావము.)

ప్రతిమర్శనస్యమున కర్హులును, అనర్హులును

మూ. ప్రతిమర్శం క్షతక్షీణబాలవృద్ధసుఖాత్మసు,
ప్రయోజ్యోఽకాలవర్షేఽపి; నత్వేష్టోదుష్టపీనసే. ౫౫౫
మద్యపీతేఽబలశ్రోత్రే క్రిమిదోషితమూర్ధని.
ఉత్కృష్టోత్క్లిష్టదోషేషు హీనమాత్రతయాహిసః. ౫౫౬

వ్యా. గాయములు తగిలినవానికిని, శిరము క్షాళించినవానికిని, బాలురకును, వృద్ధులకును, సుకుమారులకును, అకాలవర్షము కురియునప్పుడును పైన ఎన్న ప్రతిమర్శనస్యము నుపయోగింపదగును.

మరియు నాసారోగములతో జేసినదుష్టపీనసరోగముకలవానికిని, మద్యపానము చేసినవానికిని, చెవిరంధ్రముల ప్రతిబంధముకలవానికిని, శిరమున క్రిమిరోగముకలవానికిని, స్వస్థానమునుండి చలించి వృద్ధినొందినదోషములచే పీడితునకును, ప్రతిమర్శనస్యము ప్రయోగింపంజనదు. ఈ ప్రతిమర్శనస్యము తక్కువయైనమాత్ర కల్గినదిగావున దోషములు స్వస్థానమున వృద్ధినొంది చలించుచుండునపుడు వానిని మరలింప సామర్థ్యము లేకయుండును, కావున దోషచలనమున దీని నుపయోగింపందగదు.

### ప్రతిమర్శప్రయోగకాలము

మూ. శీతా (నిశా) హర్భుక్తవాన్తాహస్స్వప్నాధ్వశ్రమరేతసామ్.
శిరోఽభ్యఞ్జనగణ్డూష ప్రస్రావాఞ్జనవర్చసామ్. ॥౫౨
దన్తకాష్ఠస్య హాసస్య యోజ్యోఽన్తేఽసౌ ద్విబిన్దుకః,

వ్యా. రాత్రికాలము, పగటికాలముయొక్క అంతమునందును, భోజనము, వమనము, పగటినిద్ర, త్రోవనడచుట, శ్రమగల్గించుపనిచేయుట, సంభోగము, శిరోఽభ్యంజనము, గండూషము, మూత్రోత్సర్జనము, అంజనము, మలవిసర్జనము, దంతధావనము, నవ్వు అను నీపనులు చేసినవెంటనే రెండుబిందువులపరిమితికల ప్రతిమర్శనస్యమును ప్రయోగింపనగును.

### ప్రతిమర్శపరిమాణము

మూ. ఈషదుచ్ఛిఙ్ఘనాత్స్నేహః యావద్వక్త్రం ప్రపద్యతే. ॥౫౩
నస్యే నిషిక్తం తం విద్యాత్ ప్రతిమర్శం ప్రమాణతః,

వ్యా. స్నేహమును కొంచెముగ నుపయోగించునపుడు నాసారంధ్రములనుండి నోటితో ప్రవేశించునంతపరిమితి నుపయోగింపనగును. అట్టిప్రమాణమును కల్పించి నస్యమును నాసారంధ్రములనుండి ప్రయోగించవలెను.

### నస్యమునకు తైలప్రాశస్త్యము

మూ. తైలమేవచ నస్యార్థే నిత్యాభ్యాసే నశస్యతే. ॥౫౪
శిరసశ్శ్లేష్మధామత్వాత్ స్నేహాః స్వస్థస్య నేతరే.

వ్యా. శిరస్సు కఫమును ప్రధానమైనస్థానము కావున నస్యమునకై నువ్వులనూనెను నిత్యముగ నుపయోగించవలెను. తక్కినస్నేహద్రవ్యములు శ్లేష్మమును వృద్ధినొందించునవి

కావున వానిని నస్యమునకై యుంపయోగింపంజనదు. (నూనెమాత్రము కఫహర మని భావము.)

నస్యాభ్యాసమున గల్గుగుణములు

మూ. ఘనోన్నత ప్రసన్నత్వక్ స్కన్ధగ్రీవాస్య వక్షసః. ॥౬౦

దృఢేన్ద్రియా స్త్వవికలాః (స్త్వపలితాః) భవేయుర్నస్యశీలినః,

వ్యా. పైజెప్పబడిన నస్యములను యథోక్తముగ నభ్యాసముచేసి యుంపయోగించువారికి చర్మము గట్టిపడి ప్రసన్నతగల్గి దృఢముగ నుండును. మూపులు, కంఠము, ముఖము, రొమ్ము ఇవియన్నియు దృఢములై యుండును. చక్షురాదీంద్రియములు పటుత్వముకల్గి వానికృత్యములయందు సమర్థములై ప్రవర్తించును. వెండ్రుకలు నెరియక నలుపుకల్గి వృద్ధినొందును.

(ఇచ్చట నీవిషయము తెలియంగునది:—స్వల్పపరిమాణముచే ప్రయోగింపబడునది ప్రతిమర్శనస్యము. కావున నిది అలస్యముగ పనిచేయును. మర్శమనునస్యము అధికపరిమాణముకల్గినది కావున తీవ్రముగ పనిచేయును. ఈమర్శమునందు అపథ్యసేవనాదులచే నుపద్రవములు కల్గును. ప్రతిమర్శము సౌమ్యమగుటవలన నొకప్పుడును ఉపద్రవముల గల్గింపదు. ఈరెంటికిని యిదియే తారతమ్యము.) ఇదియే నస్యవిధి.

ధూమపానవిధి:—

ధూమపానప్రయోజనము

మూ. జత్రూర్ధ్వం కఫవాతోత్థ వికారాణామజన్మనే. ॥౬౧

ఉచ్ఛేదాయచజాతానాం పిబేద్ధూమం సదాత్మవాన్,

వ్యా. మనోనిశ్చయముకల్గి హితములగు నాహారవిహారాదులసేవించుమానవుడు మెడకొంకులకు పైభాగమున కఫవాతరోగములు కల్గకుండుటకును, ఒకవేళ పొరబాటున జనించినను అయ్యవి నివర్తించుటకును ఎల్లప్పుడును ధూమమును పానముచేయవలెను.

ధూమపానభేదములు, దాని కర్హులు, అనర్హులు

మూ. స్నిగ్ధోమధ్యస్సతీక్ష్ణశ్చ వాతే వాతకఫేకఫే. ॥౬౨

యోజ్యో నరక్తపిత్తార్తి విరిక్తోదరమేహిషు,

తిమిరోర్ధ్వానిలాధ్మాన రోహిణీదత్తవస్తిషు, ॥౬౩

మత్స్యమద్యదధిక్షౌద్ర క్షీరస్నేహవిషాశిషు,

శిరసోఽభిహతే పాణ్డురోగే జాగరితే నిశి. ॥౬౪

వ్యా. స్నిగ్ధము, మధ్యము, తీక్ష్ణము సని ధూమము మూడు తెఱంగులనుండును. ఆమూటిలో స్నిగ్ధధూమమును కేవల వాతమునందును, మధ్యమధూమమును కఫముతో గూడినవాతమునందును, తీక్ష్ణధూమమును కేవలకఫమునందును ఉపయోగింపనగును.

మరియు రక్తపిత్తము, విరేచనములైనప్పుడును, ఉదరరోగము, ప్రమేహము, తిమిరమను నేత్రరోగము, ఊర్ధ్వవాతము, కడుపుబ్బరము, రోహిణియనురోగము అను నీరోగములుకలవారు ధూమపానము (పొగపీల్చుట) జేయందగదు.

మరియు వస్తికర్మనుచేసికొనినవారును, మత్స్యములు మద్యము పెరుగును పాలు తేనె స్నేహద్రవ్యములు విషము ఈద్రవ్యముల నుపయోగించుకొనినవారును, శిరస్సునం దభిఘాతముకల్గినవారును, పాండురోగపీడితులును, రాత్రియందు నిదురమేల్కాంచిన వారునుకూడ ధూమమును పానముజేయందగదు.

ఇచ్చట పైజెప్పినరీతిగ వాతకఫములకుమాత్రము ధూమపానము విధించుటచే పిత్తమునకు ధూమపానము నిషిద్ధమని తెలియుటచే రక్తపిత్తమునకూడ ధూమపానము నిషిద్ధమని యేర్పడినను ప్రత్యేకముగ రక్తపిత్తమున నిషేధించుటంజేసి, పిత్తప్రకృతికలవానికి కఫరోగము సంభవించినపుడును ధూమపానము కూడదని యేర్పడుచున్నది. లేశమాత్రమైనను పిత్తసంబంధముకల్గినప్పుడు ధూమపానము కూడ దని ముఖ్యాభిప్రాయము.

అకాలధూమపానముచే గల్గుదోషములు, వానియుపచారము

మూ. రక్తపిత్తాన్ధ్యబాధిర్యతృణ్మూర్ఛామదమోహకృత్,
ధూమోఽకాలేఽతిపీతో వా; తత్ర శీతో విధిర్హితః. ౫౦౫

వ్యా. అకాలమునందును పైజెప్పినరీతిగ నిషిద్ధములైన రక్తపిత్తాదిరోగములయందును ధూమపానముచేసినను ప్రమాణమునకంటె నధికముగ ధూమపానముచేసినను రక్తపిత్తము అంధత్వమును బధిరత్వమును దప్పిని మూర్ఛను మదము (లిక్కు)ను మోహము (చిత్తనాశము)ను కలిగించును. అట్టియెడ ఘృతపానము నస్యము పరిషేకము మున్నగు శీతోపచారములచేయుట మిక్కిలి హితకరము.

ధూమమును విడచుక్రమము

మూ. ముఖేనైవోద్వమేద్ధూమం నాసయాదృగ్విఘాతకృత్,
ఆక్షేపమోక్షైః పాతవ్యో ధూమస్తు త్రిస్త్రిభిస్త్రిభిః. ౫౦౬

వ్యా. నాసారంధ్రములచేనైనను నోటితోనైనను పీల్చబడినపొగను నోటినుండియే బయటవెడలింపవలయును కాని ముక్కులనుండి బయట వెడలింపదగదు. అటుగాక ముక్కులనుండి వెడలించినచో కన్నులకు తిమిరరోగము మొదలగువానిచే హానికలుగును. మరియు

ధూమపానము చేయునపుడు మూడేసిమార్లు లోపలికిపీల్చి మూడేసిమార్లు బయట వెడలిం చవలయును.

### ధూమపానక్రమము

మూ. శరావసమ్పుటచ్ఛిద్రే నాడీం న్యస్యద్దశాఙ్గుళామ్,
అష్టాఙ్గుళం వా వక్త్రేణ కాసవాన్ ధూమమాపిబేత్. ౫౬౭

వ్యా. రెండుశరావముల (మూకుళ్ల)ను సంపుటముగ జేసి యందు ద్వారము జేసి యారంధ్రమున పదియంగుళములైనను ఎనిమిదియంగుళములైనను పొడవుగల యొక గొట్టము నునిచి యాగొట్టమునుండి నోటితో పొగను పీల్చవలెను.

(పొగలేని నిప్పుకణములను ఒకచిన్నమూకుటిలోనునిచియందు స్నేహద్రవ్యముతో గూడియుండు కాసహరములగు చూర్ణము మున్నగునౌషధము నునిచి, దానిపై నొకమూ మూకుడుమూసి యామూకుళ్లసందును మూసి, పైమూకుడు మధ్యభాగమున నొకరంధ్రము చేసి యారంధ్రమున పది లేక యెనిమిదిఅంగుళములపొడవుగల యొకగొట్టము నిమిడించి యాగొట్టమును నోట నుంచుకొని పొగను పీలువనగును.)

### ధూమపానమున గల్గుఫలము

మూ. కాసశ్శ్వాసః పీనసోవిస్వరత్వం పూతిర్గన్ధః పాణ్డుతా కేశదోషః,
కర్ణాస్యాక్షిస్రావకణ్డ్వార్తిజాడ్యం తన్ద్రా హిధ్మా ధూమపం నస్పృశన్తి. ౫౬౮

వ్యా. కాసము, శ్వాసము, పడిసెము, కంఠస్వరము మారియుండుట, నోటియందును ముక్కులయందును దుర్గంధము, పాండువు, వెండ్రుకలకు వర్ణముమారుట మొదలగు రోగములు, చెవులయందును నోటియందును కన్నులయందును నీరుగారుట, దురద, శూల, జడత్వము, మైకము (కునికిపాటు), ఎక్కిళ్ళు అను నీరోగములన్నియు ధూమపానము చేయు మనుజునిచెంత నొకప్పుడును జేరవు. (ఒకవేళ పైజెప్పినవ్యాధులువచ్చినను ఈధూమ పానముచే నివర్తించును.) ఇదియే ధూమపానవిధి.

### చతుర్విధగణ్డూషభేదములు, వానివినియోగము

మూ. చతుష్ప్రకారో గణ్డూషః స్నిగ్ధశ్శమనశోధనౌ,
రోపణశ్చ, త్రయస్తత్ర త్రిషు యోజ్యాశ్చలాదిషు. ౫౬౯
అన్త్యోవ్రణఘ్నః...................

వ్యా. స్నిగ్ధము, శమనము, శోధనము, రోపణము నని గండూషము నాల్గుతెఱం గుల నుండును. అందు స్నిగ్ధగండూషము వాతప్రకోపమునందును, శమనగండూషము పిత్త

ప్రకోపమునందును, శోధనగండూషము కఫప్రకోపమునందు, వ్రణముల మాన్పుటకై రోపణగండూషమును క్రమముగ నుపయోగింపవగును.

స్నిగ్ధాదిచతుర్విధగండూషలక్షణములు

మూ. .........స్నిగ్ధోత్ర స్వాద్వమ్లపటుసాధితైః,
స్నేహైః సంశమన స్తిక్త కషాయ మధురౌషధైః. ౫౭౦
శోధన స్తిక్తకట్వమ్ల కటూష్ణైః రోపణః పునః,
కషాయతిక్తకైః.........

వ్యా. పైజెప్పిననాల్గుగండూషములలో తీపి పులుపు ఉప్పు అనురసములుగలద్రవ్యములను కలిపి స్నేహద్రవ్యముచే సిద్ధముచేయబడినది స్నిగ్ధగండూషము. చేదు, వగరు, తీపి అనురసములుకల చేదుపొట్ల వేము నేరేడు మామిడి ఇప్ప మున్నగువానికషాయము, శర్కరోదకము తేనె మున్నగుద్రవ్యములజేర్చి సిద్ధముచేయబడినది శమనగండూషము. చేదు కారము పులుపు ఉప్పు అనురసములుకలద్రవ్యములను, ఉష్ణవీర్యములగుద్రవ్యములనుగూర్చి సిద్ధముచేయబడినది శోధనగండూషము. వగరును చేదును కలయౌషధములగూర్చి సిద్ధము చేయబడినది రోపణగండూషము.

గండూషములయందు స్నేహాద్యుపయోగము

మూ. .........తత్ర స్నేహః క్షీరం మధూదకమ్. ౫౭౧
శుక్తం మద్యం రసం మూత్రం ధాన్యామ్లంచ యథాయథమ్,
కల్కైర్యుక్తం విపక్వం వా యథాస్పర్శం ప్రయోజయేత్.

వ్యా. పైజెప్పినగండూషములలో స్నేహము, క్షీరము, మధూదకము, శుక్తము, మద్యము, మాంసరసము, మూత్రము, ధాన్యామ్లము వీనిని అయాదోషానుగుణముగ కల్కములతోగూర్చి పక్వముచేసి శీతలముగగాని ఉష్ణముగగాని స్పర్శానుకూలముగ నుపయోగింపనగును.

గండూషమును ప్రయోగించునియమము

మూ. తన్మనస్కస్సుఖాసీనః నివాతేకిఞ్చిదాతపే,
ప్రసన్నముదితస్కన్ధ కపోలోఽచలకన్ధరః. ౫౭౩
క్రమాద్వక్త్ర చతుర్భాగ త్రిభాగార్ధాంశపూరణమ్,
హీనమధ్యోత్తమాం మాత్రాం ద్రవాణాం కోలసమ్మితమ్.౫౭౪
కల్కం వానాభ్యవహరన్ కిఞ్చిదున్నమితాననః,

వ్యా. గాలిలేక కొంచెము ఎండకల్గిన ప్రదేశమున సుఖముగ కూర్చుండి ప్రసన్నమై సంతోషముతో గూడిన స్కంధకపోలములును, నిశ్చలమైన మెడయుకలవాడై గండూషమునందే మనస్సునునిచి గండూషము చేయవలెను. మరియు గండూషౌషధమును నోటిలో నాలుగోభాగమును పూరించినచో హీనమాత్ర, నోటిలో మూడవభాగమును పూరించినచో మధ్యమమాత్ర, నోట సగపాలు నిండునట్లుపూరించినచో నుత్తమమాత్ర. ఈమాత్రానిర్ణయము ద్రవరూపమైనగండూషమునకు చెప్పబడినది. కల్కమైనచో రేగుపండంతపరిమితముగ నుంచుకొనునది. అట్టిద్రవరూపమగుసౌషధమునైనను కల్కమునైనను మ్రింగక కొంచెముగ ముఖమును పైకెత్తి గండూషముచేయునది.

గండూషకబలపరిమాణము

మూ. అసఞ్చార్యేవగణ్డూషః కరండకకపోలయోః. ౧౨౧
సఞ్చారయుక్తాః కబలః పర్యాయేణైవ ధారయేత్,
కఫపూర్ణాస్యతాయావత్ స్రవద్ఘ్రాణాక్షితాతదా. ౧౨౩

వ్యా. నోట కదలించుటకు సాధ్యముగానట్లు సంపూర్ణముగ నౌషధమునుంచుకొన్నచో గండూషమనియు, కదలించుటకు దగినట్లు ఔషధము నుంచుకొన్నయెడ కబలమనియు చెప్పబడును. ఈగండూషకబలములను పర్యాయముగ నొకటిమార్చి యొకటి నుపయోగించునది. మరియు నోరు కఫము పూర్ణమగువరకైనను, కన్నులనుండియు నాసారంధ్రములనుండియు ద్రవము వెడలునంతవరకైనను గండూషమును ధరించియుండవలెను.

దంతహర్షాదులయందు తిలకల్కోదకగండూషము

మూ. దన్తహర్షే దన్తచాలే ముఖరోగే చ వాతకే,
సుఖోష్ణమథశీతం వా తిలకల్కోదకం హితమ్. ౧౨౨

వ్యా. దంతహర్షమునందును, దంతచలనమునందును, ముఖరోగమునందును, వాతరోగమునందును, నువ్వులకల్కముచే సిద్ధమైనజలమును చల్లగనైనను సుఖోష్ణముగనైనను గండూషముచేయుట చాల హితకరము.

గండూషధారణమున తైలమాంసరసోపయోగము

మూ. గణ్డూషధారణేనిత్యం తైలం మాంసరసోఽథవా,

వ్యా. గండూషధారణమునం దెల్లపుడును తైలమునైనను మాంసరసమునైన నుపయోగించుట హితకరము.

కొన్నిరోగములయందు ఘృతాద్యుపయోగము

మూ. ఊషాదాహాన్వితే పాకే క్షతే చాగన్తుసమ్భవే. ౧౨౪

విషక్షారాగ్నిదగ్ధేచ సర్పిర్ధార్యం పయోఽథవా,

వ్యా॥ మంటతాపముకలనోటిపుండునందును, ఆగంతుకకారణములచేనైన గాయమునందును, విషముచేతను క్షారముచేతను అగ్నిచేతను కాలియున్నను, నేతినైనను పాలనైనను గండూషముగ ధరించవలెను.

—॥ మాక్షికగండూషధారణగుణము ॥—

మూ॥ వైశద్యం జనయత్యాస్యే సన్దధాతిముఖేవ్రణాన్. ౫౭౯
దాహతృష్ణాప్రశమనం మధూగణ్డూషధారణమ్,

వ్యా॥ తేనెను గండూషముగ ధరించినయెడ నోరు నిర్మలముగనుండును. నోటివ్రణముల నార్చును. తాపమును దప్పిని శమింపజేయును.

—॥ ధాన్యామ్లగండూషగుణము ॥—

మూ॥ ధాన్యామ్లమాస్యవైరస్య మలదౌర్గన్ధ్యనాశనమ్. ౫౮౦
తదేవా లవణం శీతం ముఖశోషహరం పరమ్,

వ్యా॥ ధాన్యామ్లగండూషము నోటియొక్క అరుచిని మాలిన్యమును దుర్గంధమును హరించును. మరియు నాధాన్యామ్లమును ఉప్పుచేర్చక చల్లగ గండూషధారణముచేసినయెడ మిక్కుటముగ ముఖశోషమును (గొంతెండుటను) హరించును.

—॥ క్షారోదక-ఉష్ణోదకగండూషగుణము ॥—

మూ॥ ఆశుక్షారామ్బుగణ్డూషోభినత్తిశ్లేష్మణశ్చయమ్. ౫౮౧
సుఖోష్ణోదకగణ్డూషైర్జాయతే వక్త్రలాఘవమ్,

వ్యా॥ సర్జక్షారము యవక్షారము మున్నగుక్షారములతోగూడినజలమును గండూషముచేసినచో కఫసంచయమును అతిశీఘ్రముగ హరించును. సుఖోష్ణమైన వేడినీళ్లతో గండూషముచేసిన నోరు చుల్కనై యుండును.

—॥ స్నేహగండూషధారణగుణము ॥—

మూ॥ ఓష్ఠస్ఫుటనపారుష్య ముఖశోషద్విజామయాః. ౫౮౨
సమ్యక్ స్వరోపఘాతశ్చ స్నేహగణ్డూషధారణాత్,

వ్యా॥ స్నేహద్రవ్యములను గండూషముచేసినచో పెదవులు పగులుటను కఱకుబారియుండుటను మాన్పును. కుత్తుకయెండుటను దంతరోగములను, కంఠస్వరముయొక్క అభిఘాతమును మాన్పును.

—॥ ఖదిరాదికబలగ్రహగుణము ॥—

మూ॥ ఖదిరక్షీరవృక్షాదిమేదామ్బుకబళగ్రహః. ౫౮౩

అరోచకాస్య వైరస్య మలపూతిప్రసేకజిత్,

వ్యా॥ చంద్ర, అత్తి రావి జువ్వి అను క్షీరవృక్షములు, వెలిచంద్ర వీనినిచేర్చి కాచబడినకషాయమును కబలగ్రహముచేసినయెడ అరోచకమును, నోటికి రుచి తెలియకుండుటను నోటిలో మాలిన్యమును, దుర్గంధమును, నోరు నీరుకారుటను మాన్పును.

**వక్త్రదాహమున మధ్వాదికబలగ్రహము**

మూ॥ దగ్ధవక్త్రే మధుక్షీరసితాసర్పిస్తిలోత్తరైః. ౫౦౮

వ్యా॥ క్షారాదులచే నోరు కాలినయెడ తేనె, పాలు, చక్కెర, నువ్వులు వీనినన్నిటిని గూర్చి కబలగ్రహముచేసినచో హితకరము.

**త్రివిధప్రతిసారణము, దానియుపయోగము**

మూ॥ కల్కరసక్రియాచూర్ణం త్రివిధం ప్రతిసారణమ్,
యుఞ్జ్యాత్తత్కఫరోగేషు గణ్డూషవిహితౌషధైః. ౫౦౯

వ్యా॥ కల్కము, రసక్రియ, చూర్ణము నని ప్రతిసారణము మూడు తెఱంగుల నుండును. అట్టి త్రివిధప్రతిసారణమును గండూషమునకు జెప్పినయౌషధములచే సిద్ధము చేసి కఫరోగములయం దుపయోగింపనగును.

ఇచ్చట జలము మున్నగుద్రవములను జేర్చి నూరబడినది కల్కమనియు, తేనె మున్నగువానిగూర్చి ద్రవరూపముగ జేయబడినది రసక్రియయనియు, పొడిగాచేయబడినది చూర్ణమనియు మూడిటికిని భేదము నెఱుంగునది. మరియు "గణ్డూషవిహితౌషధైః" అని సామాన్యముగ జెప్పినను, ప్రతిసారణము కఫహరము కావున కఫహరశోధనగండూషమునకు జెప్పిన యౌషధములగూర్చి ప్రతిసారణముచేయవలె నని యెఱుంగునది.

**త్రివిధముఖాలేపము, వానిపరిమాణము**

మూ॥ ముఖాలేపస్త్రిధాదోషవిషహావర్ణకృచ్చసః,
ఉష్ణో వాతకఫే శస్తః శేషే ష్వత్యర్థశీతలః.
త్రిప్రమాణశ్చతుర్భాగత్రిభాగార్ధాంగుళోన్నతః, ౫౧౦

వ్యా॥ దోషహరము, విషహరము, వర్ణకరము నని ముఖాలేపము మూడువిధములు. వాతకఫరోగములయందు ఉష్ణముగనుండు ముఖాలేపము హితకరము. పిత్తరోగమునందును, వాతపిత్తరోగమునందును, విషమునందును, మిక్కిలి శీతలమైన ముఖాలేపము, హితకరము. మరియు పైజెప్పిన మూడువిధములగు ముఖాలేపములు వరుసగ అంగుళములో నాల్గవవంతును, మూడవవంతును, అర్ధభాగంబును ఘనముకల్గియుండవలెను. (దోషహరముఖాలేపము కాలంగుళప్రమాణము దళముగను, విషహరముఖాలేపము అంగుళ

ములో మూడవవంతు ప్రమాణము దళముగను, వర్ణకరముఖాలేపము అర్ధాంగుళపరిమాణము దళముగను ఉండవలెనని భావము).

## ముఖాలేపధారణక్రమము

మూ. అశుష్కస్య స్థితిస్తస్య శుష్కో దూషయతిచ్ఛవిమ్. ౧౮౭
తమార్ద్రయిత్వాపనయేత్ తదన్తేఽభ్యఙ్గమాచరేత్,

వ్యా. పైజెప్పిన ముఖాలేపములను ఎండక తడిగనే యుండునంతవరకు నుంచుట ప్రశస్తము. అటుగాక యెండినచో చర్మమును ముఖకాంతిని చెరచును; కావున నొకవేళ ముఖాలేపము ఎండినను దానిని నీళ్లచే తడిపి విడదీసినపిమ్మట నభ్యంగనము చేయవలెను.

## పీనసాదులయందు ముఖాలేపనిషేధము

మూ. న యోజ్యః పీనసేఽజీర్ణే దత్తనస్యే హనుగ్రహే. ౧౮౮
అరోచకే జాగరితే.........

వ్యా. పడిసెముపట్టినపుడును, అజీర్ణరోగమునందును, నస్యప్రయోగము చేసినప్పుడును, హనుగ్రహరోగమునందును, అరోచకమునందును, నిదుర మేల్కొంచినప్పుడును పైజెప్పినముఖాలేపము నుపయోగింపంజనదు.

## ముఖాలేపసేవనఫలము, దానగల్గుగుణము

మూ. .........స చ హన్తి సుయోజితః,
అకాలపలితవ్యఙ్గ వలీతిమిరనీలికాః. ౧౮౯
ముఖాలేపనశీలానాం దృఢం భవతి దర్శనమ్,
వదనం చాపరిమ్లానం శ్లక్ష్ణం తామరసోపమమ్. ౧౯౦

వ్యా. విధిప్రకారము చేయబడినముఖాలేపము అకాలమునగల్గుపలితము (వెండ్రుకలు నెరయుట)ను, మంగును, ముసలితనమున ఒడలిపైగల్గుముడతలను, తిమిర మను నేత్రరోగమును, నీలిక మను రోగమును హరించును.

మరియు ముఖాలేపనమును నియతముగ నలవాటుచేసినచో కనుచూపు దృఢముగ నుండును. ముఖము వాడక మృదువై తామరపువ్వువలె కాంతియుక్తమైయుండును.

## శిరస్సున నుపయోగింపదగినచతుర్విధతైలములు

మూ. అభ్యఙ్గ సేక పిచవః వస్తిశ్చేతి చతుర్విధమ్,
మూర్ధతైలం బహుగుణం తద్విద్యాదుత్తరోత్తరమ్. ౧౯౧

వ్యా. శిరమున నుపయోగింపదగినతైలములు అభ్యంగమనియు, సేకమనియు, పిచువనియు, వస్తి యనియు నాల్గుతెరంగులు. ఈనాల్గిటిలో క్రమముగ నుత్తరోత్తరము

(అభ్యంగమునకన్న సేకంబును, సేకమునకన్న పిచువును, దానికన్న వస్తియు) గుణాధికముగ నుండును. (ఇచ్చట శిరముపై తైలము నునిచి మర్దనముచేయుట యభ్యంగ మనియు, శిరస్సుపై తైలమును ధారగా విడచుట సేకమనియు, ప్రత్తినైనను గుడ్డముక్కనైనను తైలమున దడపి శిరస్సుపైనుంచుట పిచు వనియు, క్రిందచెప్పబడు శిరోవస్తివిధిప్రకారము శిరమున తైలమును ధరించుట వస్తి యనియు తెలియుగునది).

చతుర్విధతైలోపయోగవిషయములు

మూ. తత్రాభ్యఙ్గః ప్రయోక్తవ్యో రౌక్ష్యకణ్డూమలాదిషు,
అరూంషికా శిరస్తోద దాహపాక వ్రణేషుచ. ॥౨
పరిషేకః; పిచుః కేశపాతస్ఫుటనధూపనే,
నేత్రస్తమ్భేచ; వస్తిస్తు ప్రసుప్త్యర్దితజాగరే. ॥3
నాసాస్యశోషే తిమిరే శిరోరోగేచ దారుణే,

వ్యా. పైజెప్పిననాల్గిటిలో నభ్యంగతైలమును శిరమున రూక్షగ (జిడ్డులేక) నున్నప్పుడును, దురదకల్గినపుడును, మురికిచేరినప్పుడును ఉపయోగింపందగును. పరిషేక తైలమును అరూంషిక యనురోగమునందును, తలపోటునందును, తలకు వేడిచేసినప్పుడును, తలలో పొక్కులులేచినప్పుడును, ఉపయోగింపందగును. పిచువనుతైలమును వెంద్రుకలూడునపుడును, వెండ్రుకలుచిట్లునప్పుడును, నాసాదిరంధ్రములయందు పొగవెడలునట్లున్నపుడును, కన్నులు స్తంభించినప్పుడును ఉపయోగింపందగును. వస్తియనుతైలమును చర్మముపై స్పర్శజ్ఞానముతప్పినప్పుడును, అర్దితవాతమునందును, రాత్రినిదురమేల్కొంచినప్పుడును, నాసారంధ్రములును నోరును ద్రవములేకయెండినప్పుడును, తిమిరమనునేత్రరోగమునందును, క్రూరమైనశిరోరోగమునందును ప్రయోగింపనగును.

శిరోవస్తివిధానము

మూ. విధిస్తస్య నిషణ్ణస్య పీఠేజానుసమే మృదౌ. ॥౪
శుద్ధాక్తస్విన్నదేహస్య దినాన్తే గవ్యమాహిషమ్,
ద్వాదశాఙ్గులవిస్తీర్ణం చర్మపట్టం శిరస్సమమ్. ॥౫
ఆకర్ణబన్ధనస్థానం లలాటే వస్త్రవేష్టితే,
చేలవేణికయాబద్ధ్వా మాషకల్కేన లేపయేత్. ॥౬
ఊర్ధ్వం కేశభువోయావత్ ద్వ్యఙ్గుళం ధారయేచ్ఛృతమ్,
ఆవక్త్రనాసికోత్క్లేదాత్; దశాష్టౌషట్సులాదిషు. ॥౭

మూ. త్రాసహస్రాణ్యరుజేత్వేకమ్ స్కన్ధాదిమర్దయేత్,
ముక్తస్నేహాస్య, పరమం సప్తాహం తస్య సేవనమ్. ౫౯౹౹

వ్యా. శిరోవస్తిచేయవలసినరోగికి తొలుత వమనవిరేచనాదులచే కోష్ఠమును శుద్ధముచేసి, తైలాదులచే నభ్యంగనముచేయించి, స్వేదవిధిచే నొడలిపై చెమటపుట్టించి, మోకాలెత్తుగల్గి మృదువుగనుండునాస్తరణముపై వానిగూర్చుండబెట్టి, సాయంకాలమున నైనను రాత్రికాలమునందైనను వానినుదుట గుడ్డచుట్టి, పండ్రెండుఅంగుళముల ప్రమాణముగల్గి శిరమునకు సమమైచెవులవరకు కట్టదగినంతగొడ్డుచర్మమునైనను ఎనుబోతుచర్మమునైనను గుడ్డపేలికచేత శిరమునందు గట్టిగకట్టి, మినుపపిండిచేత దానిపై లేపనము చేసి, పిమ్మట వ్యాధిదోషదూష్యాదుల కనుగుణముగ పక్వముచేయబడి సుఖోష్ణముగనుండు స్నేహమును తలవెండ్రుకలకుపైన నొకటిరెండంగుళముల ప్రమాణము నిలిచియుండునట్లు ధారగ విడువవలెను. (ఇదియే శిరోవస్తి) పిదప నాస్నేహద్రవ్యమును నాసారంధ్రముల నుండియు నోటనుండియు నీరువెడలునంతకాలము ధరింపవలెను.

మరియు అట్టిశిరోవస్తిని వాతవ్యాధులయందు పదివేల (౧౦౦౦౦) అక్షరముల నుచ్చరించునంతకాలంబును, పిత్తప్రకోపమున నెనిమిదివేల (౮౦౦౦) అక్షరముల నుచ్చరించునంతకాలంబును, కఫరోగమున నారువేల (౬౦౦౦) యక్షరముల నుచ్చరించునంత కాలంబును ధరింపవలెను. రోగములు లేక స్వస్థతనుండువాడు వేయి (౧౦౦౦) అక్షరముల నుచ్చరించునంతకాలము ధరింపవలెను.

పైజెప్పినపరిమితికాలము ధరించినపిదప శిరోవస్తిని విప్పి రోగియొక్కశిరస్సు మెడ మొదలగునంగములను వాతముగ మర్దనముచేసి పైజెప్పినరీతిగ నుష్ణోదకాదులచే నుపచరించవలెను.

ఇత్తెఱంగున శిరోవస్తిచేయుటకు పరమావధికాలము ఏడుదినములు. (అనగా మూడు, లేక నాల్గు, లేక యేడుదినములకాలము శిరోవస్తిని ప్రయోగింపదగునని భావము)

## కర్ణపూరణధారణవిధి

మూ. ధారయే త్పూరణం కర్ణే కర్ణమూలం విమర్దయేత్,
రుజాయామార్దవం యావన్ మాత్రాశతమవేదనే. ౬౦౹౹

వ్యా. కర్ణమూలమున మర్దనముచేయుంచు చెవిలో బాధతగ్గునంతవరకును కర్ణపూరణమును ధరింపవలెను. రోగములులేక స్వస్థముగనుండువాడు నూరుమాత్రలకాలము కర్ణపూరణమును ధరించనగును. (కర్ణపూరణ మన తైలాద్యౌషధములచే చెవులను నిండించుట యని యెఱుంగునది.)

మఱియు మాత్రాలక్షణమును వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి "యావత్పర్యేతి హస్తాగ్రం దక్షిణం జానుమణ్డలమ్. నిమేషోన్మేషకాలేన సమం మాత్రా తు సాస్మృతా." దక్షిణహస్తాగ్రమును దక్షిణజానుమండలము నెంతకాలములో చుట్టివచ్చునో అట్టికాలము మాత్రాకాల మనబడును. అయ్యది నిమేషోన్మేషకాలమునకు సమముగ నుండును.

## మూర్ధతైలసేవనమున గల్గుఫలము

మూ. కచసదనసితత్వపిఞ్జత్వం పరిపుటనం శిరసస్సమీరరోగాన్,
జయతి జనయతీన్ద్రియప్రసాదం స్వరహనుమూర్ధబలంచ మూర్ధతైలమ్. ౬౦౦

వ్యా. పైజెప్పినయభ్యంజనాదివిధులచే శిరమున తైలాదులనుంచుకొన్నయెడ తలవెండ్రుకలూడుట, నెరియుట, పింగళవర్ణముగనుండుట, వెండ్రుకలకొనలుచిట్లుట మొదలగువెండ్రుకలదోషములను; శిరస్సును సంభవించువాతరోగములను హరించును. మఱియు చక్షురాదీంద్రియములు నిర్మలములుగనుండును. కంఠస్వరంబునకును దవుడలకును శిరస్సుకును బలము కల్గును.

## నేత్రరోగములయం దాశ్చ్యోతనవిధి

మూ. సర్వేషా మక్షిరోగాణా మదావాశ్చ్యోతనం హితమ్,
ఆశ్చ్యోతనమభిష్యన్దే యుఞ్జీతోర్ధ్వం దినద్వయాత్. ౬౦౧

వ్యా. పలువిధంబులైననేత్రరోగములయందును తొలుత నాశ్చ్యోతనముజేయుట మిక్కిలి హితకరము. అట్టి యాశ్చ్యోతనమును అభిష్యందాదినేత్రరోగములయందు వ్యాధి సంభవించినపిదప రెండుదినములకుపిమ్మట నుపయోగించవలెను.

ఆశ్చ్యోతనలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది.—"ఉన్మీలితేఽక్షిణిద్వ్యఙ్గుళే బిన్దుభిర్ద్వ్యఙ్గుళాద్ధితమ్" కన్నులను తెరిచి రెండంగుళములయెత్తునుండి యౌషధబిందువులను కన్నులలో విడచుట యాశ్చ్యోతన మని యర్థము.

మఱియు "అవ్యక్తేష్వేవరుజాదిష్వేవం తుల్యగుణం పక్ష్మపరిహారేణ అక్షికోశాలేపనం, తచ్చబిడాలకసంజ్ఞకమ్" అని యష్టాఙ్గసంగ్రహమున జెప్పబడినది. రోగములివ్యక్తములని స్పష్టముగ దెలియనియప్పుడు రెప్పలనువదలి నేత్రకోశమునజేయబడు ఆలేపము బిడాల మనబడును. ఇయ్యది యాశ్చ్యోతనముతో సమానగుణముకల్గియుండునని భావము.

మఱియు "రక్తోదకణ్డూఘర్షాశ్రుదాహరాగనిబర్హణమ్" అని వాగ్భటుడుచెప్పెను కావున కన్నులయందు నొప్పి, సూదులతో బొడిచినట్లుపోటు, దురద, ఇసుకపారినట్లు

బాధ, కంటిలో నీరుకారుట, మంట ఇవియన్నియు సాశ్చ్యోతనముచే నివర్తించునని యెఱుంగునది.

ఆశ్చ్యోతనవ్యత్యయముచే గల్గునుపద్రవములు

మూ. అత్యుష్ణతీక్ష్ణం యదోగం దృజ్నా శాయాతి సేచనమ్,
అతిశీతంతు కురుతే నిస్తోద స్తమ్భవేదనాః. ౬౦౨.
కషాయవర్త్మతాం ఘర్షం కృచ్ఛ్రాదున్మేషణం బహు,
వికారవృద్ధిమత్యల్పం సంరమ్భమపరిస్రుతమ్. ౬౦౩

వ్యా. మిక్కిలి యుష్ణముగను తీక్ష్ణముగనునుండు ఆశ్చ్యోతనము కన్నులకు (రోగములను ఎరుపును) నాశమును కలిగించును. మిక్కిలి శీతలముగనుండుఆశ్చ్యోతనము సూదులచే పొడిచినట్లుపోటును నేత్రస్తంభమును కన్నులనొప్పిని కంటికలకను కల్గించును. మఱియు నేత్రఘర్షము (ఒకటితోనొకటి రెప్పలు అంటుకొనుట) మొదలగునుపద్రవములు కలుగును. ఆశ్చ్యోతనమును అధికముగ జేసినయెడ మిక్కిలి కష్టముగ కన్నులదెరచునటుల జేయును. మిక్కిలి స్వల్పముగ వేసినయెడ నేత్రరోగమును వృద్ధిజేయును. అపరిస్రుతమైన ఆశ్చ్యోతనము కన్నులను కలకబారజేయును.

ఆశ్చ్యోతనోపద్రవచికిత్స

మూ. సర్పిషాతు సుఖోష్ణేన యోజ్యశ్చ్యోతోహిమేనవా,

వ్యా. పైజెప్పినయుపద్రవమును కల్గినప్పుడు నేతిని సుఖోష్ణముగనైనను చల్లగనైనను కన్నులలో నుంచవలెను.

ఆశ్చ్యోతనసమ్యగ్యోగాదిలక్షణములు

మూ. కాల స్తర్పణవద్యోగే సమ్యగ్జాన్యనాధికే అపి. ౬౦౪

వ్యా. ఆశ్చ్యోతనముయొక్క సమ్యగ్యోగ-హీనయోగ అతియోగములకాలనియమమును తర్పణవిధిప్రకారముగ నెఱుంగునది.

అంజనప్రయోగము

మూ. అథాఞ్జనం శుద్ధతనోః నేత్రమాత్రాశ్రితే మతే,
పక్వలిఙ్గాల్పశోఫాతి కణ్డూపైచ్ఛిలలక్షితే. ౬౦౫
మన్దఘర్షాశ్రురాగేఽక్ణి ప్రయోజ్యం ఘనదూషికే,
(ఆర్తేపి త్తకఫాసృగ్భిః మారుతేన విశేషతః.) ౬౦౬

వ్యా. వమనాదులచే శుద్ధమైనశరీరము కలపురుషునకు మలము శరీరమునందు వ్యాపింపక కన్నులయందుమాత్రము చేరియున్నపుడు, కన్నులయందు స్వల్పముగ శోఫయు,

అధికమైనజిలయు, పిచ్ఛిలత్వమును మొదలగుపక్వలక్షణములు కల్గును. అట్టియెడ అధిక మైనసంఘర్షణము, కంటిసీరు, విరుపు, అధికమైనమలము ఇవికల్గినపుడును, పిత్తము, కఫము, వాతము వీనిచే కన్నులుపీడింపబడినప్పుడును విశేషముగ నంజనము నుపయోగింపనగును.

త్రివిధాంజనములు, వానిలక్షణములు

మూ. లేఖనం రోపణం దృష్టిప్రసాదనమితి త్రిధా,
అఞ్జనం; లేఖనం తత్ర కషాయామ్లపటూషణైః. ౬౦౭
రోపణం తిక్తకైర్ద్రవ్యైః; స్వాదుశీతైః ప్రసాదనమ్,

వ్యా. లేఖనము, రోపణము, దృష్టిప్రసాదనము నని అంజనము మూడువిధముల నుండును. అందు వగరు పులుపు ఉప్పు కారము అనురసములుకలవస్తువులగూర్చి సిద్ధము చేయబడినది లేఖనాంజనము (ఇయ్యది శుక్రార్మాదినేత్రరోగములయందు శస్త్రముచే ఛేదించినట్లు కంటిదోషమును లేఖనముచేయుంటంజేసి లేఖనమని చెప్పబడును.) చేదురసము గలద్రవ్యములచే సిద్ధముచేయబడినది రోపణాంజనము. (ఇయ్యది యభిష్యందాదిరోగ ములయందు కంటిలో వ్రణమును మాన్పుటంజేసి రోపణాంజన మనబడును.) మధురము గను శీతవీర్యముగను నుండుద్రవ్యములచే సిద్ధముచేయబడినయంజనము ప్రసాదనము. (ఇయ్యది కన్నులయందలి మలినమును పోగొట్టుటంజేసి ప్రసాదనాంజనమని చెప్పబడును.)

త్రివిధాఞ్జనకల్పనములు

మూ. పిణ్డోరసక్రియాచూర్ణం త్రిధైవాంజనకల్పనా. ౬౦౮
గురౌ మధ్యే లఘౌ దోషే తాః క్రమేణ ప్రయోజయేత్,

వ్యా. పిండము (ముద్దగనుండునది), రసక్రియ (ద్రవరూపముగనుండునది), చూర్ణము(పొడి)నని అంజనకల్పనము మూడువిధములు, ఈమూటిలో పిండరూపమైన యంజనమును దోషము మిక్కిలి ప్రబలముగనుండునపుడును, రసక్రియాంజనమును దోషము మధ్యబలముగనుండునప్పుడును, చూర్ణరూపాంజనమును దోషము స్వల్పముగ నుండునపుడును వరుసగ నుపయోగింపవలెను.

"పిణ్డీ కబలికాప్రోక్తా బద్ధ్వా తే పట్టవస్త్రకైః" అను తంత్రాంతరవచనముచే ఔష ధములను నూరి యుండజేసి కన్నులపైబెట్టి వస్త్రపట్టాదులచే గట్టబడినయంజనము పిండ రూపమైన యంజన మని తెలిసెడి.

త్రివిధాఞ్జనశలాకలు

మూ. ప్రశస్తా లేఖనే తామ్రీ రోపణే కాలలోహజా. ౬౦౯
అఙ్గుళీచ సువర్ణోత్థా రూప్యజాచ ప్రసాదనే,

వ్యా. లేఖనాంజనమును ప్రయోగించుటకు రాగిచే చేయబడినశలాక ప్రశస్తము. రోపణాంజనమును ప్రయోగించుటకు ఇనుముచే చేయబడినశలాక ప్రశస్తము లేక వ్రేలిచే నైన రోపణాంజనమును ప్రయోగింపవచ్చును. బంగరుచేనైనను వెండిచేనైనను చేయ బడినశలాక ప్రసాదనాంజనమును ప్రయోగించుటకు చాల ప్రశస్తము. మరియు దశాం గుళాతనుర్మధ్యే శలాకాముకుళాననా" అని వాగ్భటుడు చెప్పెను. పదియంగుళములపరి మాణంబును నడుమ సన్నగను, కొనయందు మొగ్గవంటిముఖమును గలశలాకను అంజన ప్రయోగమున కర్హ్వమనిభావము.

త్రివిధాఞ్జనముల ప్రమాణము

మూ. పిణ్డస్య తీక్ష్ణద్రవ్యస్య మృదుద్రవ్యాకృతస్యచ. ౬౧౦
హారేణుమాత్రం ద్విగుణం ప్రమాణం కథయన్త్యపి,
రసక్రియాయామప్యేవఞ్ఛ విడంగఫలమాత్రకమ్. ౬౧౧
శలాక్యాద్విగుణాం తీక్ష్ణే చూర్ణేచ త్రిగుణాం మృదౌ,

వ్యా. తీక్ష్ణద్రవ్యములచే జేయబడినపిండమను నంజనమునకు రేణుకయంత ప్రమాణ ముపయోగింపదగును. మృదుద్రవ్యములచే జేయబడినపిండాంజనము రెండురేణుకలంత ప్రమాణ ముపయోగింపనగును. రసక్రియయనునంజనము ఒకవాయువిడంగమంతపరిమితి నుపయోగింపవలెను. తీక్ష్ణద్రవ్యములచే చేయబడినచూర్ణాంజనము రెండుశలాకలపరిమితి ముపయోగింపనగును. మృదుద్రవ్యములచే జేయబడినచూర్ణాంజనము మూడుశలాకల ప్రమాణ ముపయోగింపదగును.

అంజన ప్రయోగకాలము

మూ. ప్రాతస్సాయంచ సతతం ముద్రిక్తేదేయమఞ్జనమ్. ౬౧౨
అత్యుద్రిక్తే బలాసేతు లేఖనీయేఽథవాగదే,
కామమహ్న్యపి నాత్యుష్ణే తీక్ష్ణమక్ష్ణిప్రయోజయేత్. ౬౧౩

వ్యా. దోషములు వృద్ధినొందియుండునపుడు ఉదయకాలమునందును సాయం కాలమునందును రెండుపూటలు అంజనమును ప్రయోగింపదగును. కఫము మిక్కిలి యధిక ముగ ప్రకోపించినపుడును, లేఖనక్రియకు అర్హమైన శుక్రార్మము మున్నగురోగముల యందును మిక్కిలి తీవ్రమైనయెండలేని మధ్యాహ్నకాలమునగూడ తీక్ష్ణమైన అంజన మును ప్రయోగింపదగును.

రాత్రులయందు అంజననిషేధము

మూ. నరాత్రావతిశీతేఽతి నేత్రే తీక్ష్ణాఞ్జనం హితమ్,

దోషమస్రావయత్ స్తమ్భకణ్డూజాడ్యాదికారితత్. ౬౧౪

వ్యా॥ రాత్రుల నేత్రము కఫాధిక్యమువలన నతిశీతలముగ నుండును. రాత్రులయందు సౌమ్యగుణము ప్రధానముగనుండును. అట్టి రాత్రులయందు తీక్ష్ణాంజనమును ప్రయోగించినచో కంటిదోషములను స్రవింపజేయ సమర్థముగాక స్తంభము దురద జడత్వము మున్నగు నుపద్రవముల గల్గించును. కావున రాత్రిపూట అంజనము నొకప్పుడును ప్రయోగింపంజనదు.

### ప్రత్యాంజనము

మూ॥ తీక్ష్ణాఞ్జనాభిసంతప్తే నయనే తత్ప్రసాదనమ్,
ప్రయుజ్యమానం లభతే ప్రత్యఞ్జనసమాహ్వయమ్. ౬౧౫

వ్యా॥ మిక్కిలి తీక్ష్ణమైనయంజనమును ప్రయోగించుటచే కన్నులయందు సంతాపమధికమైనయపుడు అట్టితాపము శమించుటకై ప్రయోగింపబడినయంజనము ప్రత్యంజనమని చెప్పబడును.

### అంజనప్రయోగనిషిద్ధులు

మూ॥ నాఞ్జయే ద్భీతవమితవిరిక్తాఽశితవేగితే,
క్రుద్ధజ్వరితతాన్తాక్షి శిరోరుక్ శోకజాగరే. ౬౧౬
అదృష్టేఽర్కే శిరస్స్నాతే పీతయోర్ధూమమద్యయోః,
అజీర్ణేఽగ్న్యర్కసన్తప్తే దివాసుప్తే పిపాసితే. ౬౧౭

వ్యా॥ భయముజెందినవాడు, వమనవిరేచనములజేసికొనినవాడును, అప్పుడే భుజించినవాడును, మలమూత్రాదివేగములుకల్గినవాడును, కోపావిష్టుడును, జ్వరపీడితుడును, అతిసూక్ష్మముగను అతిప్రకాశముగనునుండువస్తువులజూచుటచేత శ్రమనొందిననేత్రములు కలవాడును, తలనొప్పిచే బాధింపబడినవాడు, దుఃఖముసంభవించినవాడును, రాత్రి నిదుర మేల్కొనియున్నవాడును, శిరస్స్నానముజేసినవాడును, ధూమమును మద్యమును పానము చేసినవాడును, అజీర్ణరోగియు, నిప్పుసెగచేతను ఎండచేతను సంతాపమునొందినవాడును, పగలునిదురించినవాడును, దప్పిగొన్నవాడును నగు మనుజునకు అంజనమును ప్రయోగింపంజనదు. మరియు మేఘాదులచే గప్పబడిసూర్యుడు కానబడకుండునపుడును అంజనప్రయోగము చేయదగదు.

### నిషిద్ధాంజనములు

మూ॥ అతితీక్ష్ణమృదుస్తోక బహ్వాచ్ఛఘనకర్కశమ్,
అత్యర్థశీతలం(స్తబ్ధం) తప్తమఞ్జనం నావచారయేత్. ౬౧౮

వ్యా. మిక్కిలి తీక్ష్ణంబును, అతిమృదువును, మిక్కిలి కొంచెంబును, మిక్కిలి యధికంబును, మిక్కిలి తేటనైనదియు, మిక్కిలి ఘనంబును, మిక్కిలి కర్కశంబును, మిక్కిలి శీతంబును, అత్యుష్ణంబును నగు అంజనమును ప్రయోగింపదగదు.

అంజనప్రయోగానంతరనియమములు

మూ. అథానున్మీలయన్ దృష్టిమన్తస్సఞ్చారయేచ్ఛనైః,
అఞ్జితే వర్త్మనీకిఞ్చిత్ చాలయేచ్చైవమఞ్జనమ్. ౬౧౯
నేత్రం వ్యాప్నోతి సహసానచోన్మేషనిమేషణమ్,
నిష్పీడనం వా వర్త్మభ్యాం క్షాళనం వాసమాచరేత్. ౬౨౦

వ్యా. విధ్యుక్తప్రకారము కన్నుల కంజనమును ప్రయోగించినపిదప కన్నులను తటాలున తెరవక నేత్రగోళములోపలనే మెలమెల్లగ గ్రుడ్డును ఇటునటు కదలించవలెను. పిదప కనురెప్పలను మెలమెల్లగ నల్లార్చవలెను. ఇట్లుచేసినచో అంజనౌషధము కండ్లలో నల్గడల శీఘ్రముగ వ్యాపించును. పైజెప్పినవిధికి విరుద్ధముగ నిమేషోన్మేషముల జేయకూడదు. రెప్పలను నలపకూడదు. నీళ్లచే కడుగగూడదు.

నేత్రాంజనప్రక్షాళనము

మూ. అపేతౌషధసంరమ్భం నిర్వృతం నయనం యదా,
వ్యాధిదోషర్తుయోగ్యాభిః అద్భిః ప్రక్షాళయేత్తతః. ౬౨౧

వ్యా. అంజనౌషధముయొక్క వేగము నివర్తించి నేత్రములుపోటు మున్నగుబాధలేక సుఖముగ నుండునప్పుడు, ఆయారోగములకును వాతాదిదోషములకును వసంతాది ఋతువులకును యుక్తమగుజలముచేత కన్నులను కడగవలెను. (ఇదియె అంజనవిధి.)

తర్పణప్రయోగవిషయము

మూ. నయనేతామ్యతి స్తబ్ధే శుష్కేరూక్షేఽభిఘాతితే,
వాతపిత్తాతురేజిహ్మే శీర్ణపక్ష్మవిలేక్షణే. ౬౨౨
కృచ్ఛ్రోన్మీలసిరాహర్షసిరోత్పాతతమోఽర్జునైః,
స్యన్దమన్థాన్యతోవాతవాతపర్యయశుక్లకైః. ౬౨౩
ఆతురే శాంతరాగాశ్రుశూలసంరమ్భదూషితే,
నివాతే తర్పణం యోజ్యం శుద్ధయోర్మూర్ధకాయయోః. ౬౨౪
కాలే సాధారణే ప్రాతః సాయంచోత్తానశాయినః,

వ్యా. కన్నులు వాడినట్లుండుట, స్తంభించియుండుట, ఎండియుండుట, స్నిగ్ధములుగాక రూక్షములైయుండుట, అభిఘాతమును పొందియుండుట, వాతపిత్తవ్యాధులచే

పీడింపబడియుండుట, రెప్పవెండ్రుకలూడుట, చూపు స్ఫుటముగ లేకుండుట, కృచ్ఛ్రోన్మీలనము సిరాహర్షము సిరోత్పాతము తిమిరము అర్జునము అభిష్యందము అధిమంథము అన్యతోవాతము వాతపర్యయము శుష్కాక్షిపాకము అను నీనేత్రరోగములచే పీడింపబడియుండుట, నేత్రములయం దెరుపును కన్నీరును శూలంబును మలంబును శాంతమైయుండుట, ఇట్టి సమయములయందు మనుజునకు విరేచననస్యముచే శిరస్సును వమనవిరేచనములచే శరీరమును శుద్ధములుగజేసి, సౌమ్యాగ్నేయములుగాక సాధారణమైన వసంతాదికాలములందు గాలియెండదుమ్ములేక యున్నగునవిలేనిప్రదేశమున శయ్యపై తర్పణముజేసికొనదలచిన వానిని వెలికిల బరుండ నియమించి ప్రాతఃకాలమునందైనను సాయంకాలమునందైనను తర్పణక్రియను జేయవలెను.

### తర్పణవిధానము

మూ. యవమాషమయీంపాలీం నేత్రకోశాద్బహిస్సమామ్. ౬౩౫
ద్వ్యఙ్గులోచ్చాం దృఢాం కృత్వా యథా స్వంసిద్ధమావపేత్,
సర్పిర్నిమీలితే నేత్రే తప్తామ్బుప్రవిలాయితమ్. ౬౩౬
ఆపక్ష్మాగ్రాత్.........

వ్యా. యవలనైనను మినుములనైనను మెత్తగ నూరి యాపిండిముద్దచేత నేత్రకోశమునకు వెలిప్రక్కల రెండుపార్శ్వములయందును రెండంగుళములపొడవుగ దృఢముగ నుండునట్లు నేత్రములకు పాదివలె నుండునట్లు కట్టగకట్టి, దోషదూష్యాదుల కనుగుణముగ సిద్ధముచేయబడినఘృతమును వేడినీళ్లయావిరిచేకరిగించి రోగి కన్నులమూసికొని యుండు నపుడు రెప్పవెండ్రుకలు మునుగునంతవరకు కన్నులపై విడువవలెను.

మఱియు వాగ్భటాచార్యులు "నక్తాన్ధ్యవాతతిమిరకృచ్ఛ్రబోధాదికేవసామ్" అని చెప్పిరి. రేచీకటి, వాతరోగము, తిమిరరోగము, కృచ్ఛ్రోన్మీలనము మున్నగురోగముల యందు దోషదూష్యాదుల కనుగుణముగ సిద్ధముచేయబడినవస (క్రొవ్వు)ను వేడినీళ్లచే కరిగించి పైజెప్పినవిధముగ కన్నులపైవిడువవలె నని యర్థము.

### తర్పణౌషధధారణకాలపరిమాణము

మూ. .........అథోన్మేషంశనకైస్తస్యకుర్వతః,
మాత్రాం విగణయేత్తత్ర వర్త్మసన్ధిసితాఽసితే. ౬౩౭
దృష్టౌచ క్రమశోవ్యాధౌ శతంత్రీణిచ పఞ్చచ,
శతాని సప్తచాష్టౌచ దశమన్థే దశానితే. ౬౩౮
పిత్తే షట్స్వస్థవృత్తేచ బలాసే పఞ్చధారయేత్,

వ్యా. పైజెప్పినరీతిగ ఘృతాదులను కంటిపై నునిచినపిదప రోగి మెల్లమెల్లగ కను రెప్పలదెరచునప్పుడు, వర్త్మగతరోగములయందు నూరుమాత్రలను, సంధిగతరోగముల యందు మూడువందలమాత్రలను, సితగతరోగములయందు ఐదువందలమాత్రలను, అసిత గతరోగములయందు ఏడువందలమాత్రలను, దృష్టిగతరోగములయందు ఎనిమిదివందల మాత్రలను వరుసగ నెంచవలెను. మఱియు మాథరోగమునందు వేయిమాత్రలను, వాత రోగమునందు వేయిమాత్రలను, పిత్తరోగమునందును రోగము లేక స్వస్థతనుండునప్పు డును ఆరువందలమాత్రలను, కఫమునందు ఐదువందలమాత్రలను, ఎంచవలెను. (అనగ పైజెప్పిననిర్ణయప్రకారము ఆయారోగమునకు జెప్పినమాత్రాకాలముపరకును ఆయా రోగమునందు ఘృతమును రోగి కన్నుల నుంచుకొనియుండి పిమ్మట కన్నుల దెరువవలెనని భావము.)

### తర్పణానంతరకర్తవ్యవిధి

మూ. కృత్వాపాఙ్గే తతో ద్వారం స్నేహం పాత్రే తు గాలయేత్, ౬౨౯
పిబే ద్ధూమంచ నేక్షేతవ్యోమరూపంచ భాసురమ్,

వ్యా. పైజెప్పినరీతిగ నాయాదోషానుసారముగ నియతకాలమువఱకును ఘృత మును ధరించి పిదప కంటికొనయందు పైజెప్పియుంచబడినసాళిలో నొకద్వారముచేసి యందుండివచ్చునట్టిస్నేహము నొకపాత్రలోనికి దీసికొనవలెను. పిదప కంటిచేరువ నుంచ బడినపిండిని విడదీసి తుడిచి కఫము శమించుటకై ధూమపానముచేయించి, పిమ్మట కన్ను లను కడిగి మితముగ భుజింపజేయవలెను. మఱియు నాదినము ఆకాశమును ఎండను మిక్కిలి ప్రకాశమైనవస్తువులను జూడదగదు.

### వాతాదిదోషములయందు తర్పణనియమము

మూ. ఇత్థం ప్రతిదినం వాయౌ, పిత్తే త్వేకాన్తరం, కఫే. ౬౩౦
స్వస్థేచ ద్వ్యన్తరం దద్యాత్, ఆతృప్తే రితి యోజయేత్,

వ్యా. పైజెప్పినక్రమము ననుసరించి వాతప్రకోపమున ప్రతిదినంబును తర్పణ క్రియచేయుచుండవలెను. పిత్తమునందు ఒకదినమును విడిచి మరుదినమువంతున తర్పణ క్రియ చేయుచుండవలెను. కఫమునందును స్వస్థతనుండునప్పుడును నడుమ రెండేసిదినములు మాని తర్పణక్రియ చేయుచుండవలెను. ఇత్తెఱంగున క్రిందజెప్పబడుతృప్తలక్షణములు గానవచ్చునంతకాలము తర్పణక్రియను విడువక చేయుచుండవలెను.

### తర్పణముచే తృప్త్యాదిలక్షణములు

మూ. ప్రకాశక్షమతాస్వాస్థ్యం విశదం లోచనం లఘు. ౬౩౧
తృప్తే, విపర్యయో౽తృప్తే,౽తి తృప్తే శ్లేష్మజారుజః,

వ్యా. నేత్రములకు పూర్తిగ తృప్తికల్గినప్పుడు ప్రకాశముగనుండువస్తువులను చూచుశక్తి దృష్టికి కల్గును. నేత్రములు నిర్మలములై రోగములులేక స్వస్థతనుండును. కనురెప్పలు బరువులేక చుల్కనగ నుండును. పూర్తిగ దృప్తిజెందనియెడల పైజెప్పిన తృప్తలక్షణములకు విరుద్ధము (ప్రకాశము మున్నగువాని సహింపలేక విశదముకాక కను రెప్పలు బరువు)గ నుండును. తర్పణక్రియచే నధికముగ తృప్తినొందినయెడ కఫసంబంధములగుదురద మొదలైనరోగములు కల్గును. (ఇది తర్పణవిధి).

పుటపాకవిధి

మూ. స్నేహాపీతాతనురివక్లాన్తాదృష్టిర్హి సీదతి. ౬౩౩
తర్పణానన్తరం తస్మాత్ దృగ్బలాధానకారణమ్,
పుటపాకం ప్రయుఞ్జీత పూర్వోక్తేష్వేవయక్ష్మసు. ౬౩౪

వ్యా. స్నేహమును పానముచేసినవానిశరీరము బడలియుండును. అట్లేఅంగుననే తర్పణవిధిచేత స్నేహపానముచేసిన నేత్రంబును బలముతగ్గియుండును; కాబట్టి తర్పణవిధి సేవించినపిమ్మట, వెంటనే దృష్టికి బలముకల్గునిమిత్తము పుటపాకమును ప్రయోగించవలెను. తర్పణవిధికి అర్హములగురోగము లన్నిటియందును పుటపాకవిధి చేయందగును.

దోషానుగుణముగ పుటపాకభేదములు

మూ. స వాతే స్నేహనశ్లేష్మసహితే లేఖనోహితః,
దృగ్దౌర్బల్యేఽనిలే పిత్తే రక్తే స్వస్థే (రక్తేపిత్తే) ప్రసాదనః. ౬౩౫

వ్యా. (స్నేహనము, లేఖనము, ప్రసాదనము నని పుటపాకము మూడు తెఱంగుల నుండును.) అందు వాతప్రకోపమున స్నేహనపుటపాకంబును, కఫముతోగూడిన వాత ప్రకోపమునందు లేఖనపుటపాకంబును, చూపునకు శక్తిహీనమైనప్పుడును, వాతపిత్తమునందును, కేవలపిత్తమునందును, రక్తప్రకోపమునందును, రోగములేవియుం లేక స్వస్థతనుండునప్పుడును ప్రసాదనపుటపాకంబును ప్రయోగింపనగును.

పుటపాకప్రయోగక్రమము

మూ. నేత్రే తర్పణవద్యుఞ్జ్యాత్, రూక్షస్నేహనమధ్యమమ్,
శతం ద్వే త్రీణిమాత్రాణాం, కోష్ణౌ పూర్వౌ హిమం పరమ్.
ధూమపోఽన్తే తయోరేవ, యోగాస్తత్రచ తృప్తివత్,

వ్యా. పైజెప్పినరూక్షణ (లేఖన) - స్నేహన-మధ్యమ(ప్రసాదన)ములను పుటపాకములమూడిటిని క్రమముగ తర్పణవిధిప్రకారము నేత్రములయందు ధరించునది. మరియుం లేఖనపుటపాకమును నూరుమాత్రలకాలములవరకును, స్నేహనపుటపాకమును రెండువందల

మాత్రలకాలంబును, ప్రసాదనపుటపాకమును మూడునూరదలమాత్రలకాలంబును ధరింపవలెను. మరియు స్నేహనలేఖనపుటపాకములను సుఖోష్ణముగను, ప్రసాదనపుటపాకమును శీతముగను ప్రయోగింపనగును. మరియు స్నేహనలేఖనపుటపాకముల ప్రయోగించినవెంటనే కఫముశమించుటకై ధూమపానము చేయందగును. మరియు పైజెప్పిన పుటపాకములు మూడిటికిని సమ్యగ్యోగాదులయోగ అతియోగములను తర్పణమునకు జెప్పిన సమ్యగ్యోగాదులబట్టియే లక్షణముల నూహించునది.

తర్పణపుటపాకానర్హులు

మూ. తర్పణం పుటపాకంచ నస్యానర్హేన యోజయేత్. ౬౩౭

వ్యా. పైజెప్పిన తర్పణ-పుటపాకములను నస్యమునకు అర్హులుకానివారికి ప్రయోగింపంజనదు. ("యోజయేన్నతు నావనం తోయమద్యగరస్నేహ"అని యుపక్రమించి నస్యకర్మ నిషేధింపబడినవారికి తర్పణపుటపాకములగూడ నుపయోగింపంజనదని భావము)

తర్పణ-పుటపాకములయందు వాతాహారాదులు

మూ. యావన్త్యహాని యుఞ్జీత ద్విస్తతో హితభా(భు)గ్భవేత్,
మాలతీమల్లికాపుష్పైః బద్ధాక్షో నివసేన్నిశి. ౬౩౮

వ్యా. ఎన్నిదినములు తర్పణపుటపాకముల జేసికొనునో అన్నిదినంబులకన్న రెట్టింపు దినములకాలము వాతాహారవిహారముల నల్పుచు నుండవలెను. మరియు రాత్రులయందు జాజిపువ్వులను మల్లెపువ్వులను కన్నులపై నునిచి కట్టుకట్టికొని యుండవలెను.

నస్యాదికర్మలకావశ్యకత

మూ. సర్వాత్మనా నేత్రబలాయ యత్నం కుర్వీత నస్యాఞ్జనతర్పణాద్యైః,
దృష్టిశ్చ నష్టా వివిధంజగచ్చ తమోగుణం జాయత ఏకరూపమ్.

వ్యా. లోకమున మనుజులకు కన్నులుచెడినచో ప్రపంచమంతయు గాఢాంధకారము గ్రమ్మినవిధముగ ఘటపటాదివస్తుపరిజ్ఞాన మించుకేనియు లేక యేకాకారమై యే పనిని సాధింపజాలక మూఢులై యుందురు. కాబట్టి యెన్నివిధములనైన నస్య-అంజన-తర్పణ-పుటపాకాదులతత్తదుచితముగ విధ్యుక్తప్రకారము జేసికొనుచు, ఎన్నివిధములనైన కన్నుల గాపాడికొనుట ముఖ్యకర్తవ్యము. ("సర్వేన్ద్రియాణాం నయనం ప్రధానమ్"అను నభియుక్తోక్తికూడ నేత్రములకు ప్రాధాన్యమునే తెలుపుచున్నది.)

సిరావ్యధనవిధానము రక్తమోక్షోపాయము

మూ. సిరావ్యధశ్చికిత్సార్ధం ప్రణీతశ్శల్యతన్త్రకైః,
యథా సమ్యక్ప్రణిహితః వస్తిః కాయచికిత్సకైః. ౬౪౦

ప్రచ్ఛనేనైకదేశస్థం గ్రన్థిజం జలజన్మభిః,
హరేచ్ఛృఙ్గాదిభి స్సుప్తమసృక్ గ్వాప్యపి సిరావ్యధైః. ౬౨౧

వ్యా. కాయచికిత్సలో కాయచికిత్సకులచేత వస్తిప్రధానముగ నెట్లుచెప్పబడెనో, అదేవిధముగ శల్యచికిత్సయందు శల్యతంత్రజ్ఞులచేత సిరావ్యధనము చికిత్సార్థమై యుపదేశింపబడినది. మరియు శరీరమునందేకదేశమున రక్తముచెడియున్న గంట్లుపెట్టియు గ్రంధిరూపముగనున్నచో అట్టిదుష్టరక్తమును జలగల ప్రయోగించియును, సుప్తమైకదలకున్న రక్తమును కొమ్ములు మున్నగువానిచేతను వెడలింపవలెను. రక్తముచెడి శరీరమున వ్యాపించియున్నచో సిరావ్యధనముచేతను వెడలింపవలెను.

## సిరావేధనమున కనర్హులు

మూ. నతూనషోడశాతీత సప్తత్యబ్దస్రుతాసృజాం,
అస్నిగ్ధాస్వేదితాత్యర్థస్వేదితానిలరోగిణామ్. ౬౨౨
గర్భిణీ సూతికాజీర్ణ పిత్తాసృక్ శ్వాసకాసినామ్,
అతీసారోదరచ్ఛర్ది పాణ్డు సర్వాఙ్గశోధినామ్. ౬౨౩
స్నేహపీతే ప్రయుక్తేషు తథా పఞ్చసుకర్మసు,
నాయన్త్రితాం సిరాం విధ్యేత్ నతిర్యఙ్నాప్యనుత్థితామ్. ౬౨౪
నాతిశీతోష్ణవాతాభ్రైః (భ్రే) (అ) ష్వన్యత్రాత్యయికాద్గదాత్,
విషోపసర్గాచ్చ..................

వ్యా. పదునారువత్సరములకు లోబడినవయసుకలవారును, డెబ్బదివత్సరములవయసుకుమించినవారును, రక్తస్రావముచేసికొనినవారును, స్నేహస్వేదములజేసికొనినవారును, గర్భిణీస్త్రీలును, ప్రసవించినబాలింతరాండ్రును, వాతరోగముచేతను అజీర్ణము పిత్తరక్తము, శ్వాసకాసములు అతిసారము ఉదరరోగము, ఛర్ది, పాండువు, సర్వాంగశోఫ అనునీరోగములచే పీడితులును సిరావ్యధనముచేసికొనందగదు. మరియు స్నేహపానముచేసినపుడును, వమనవిరేచనాదిపంచకర్మలజేసికొనినపుడును, సిరావ్యధనము చేసికొనందగదు. మరియు శిరసు బంధింపక వ్యధనముచేయంజనదు. అడ్డముగ వేధింపకూడదు. పొడవుగ పైకిలేవకుండ వేధింపదగదు. అతిశీతలముగనుండుకాలమునను, ఆకసమున మేఘములు ఆవరించియుండునపుడును, సిరావ్యధనముచేయంజనదు. మిక్కిలి వేడిగల్గినకాలమునను అధికముగ గాలివీచుసమయమునను సిరావ్యధనము చేయకూడదు. మరియు నతికష్టమైనరోహిణివిషాదిక మొదలగుతీవ్రవ్యాధులయందుమాత్రము పైజెప్పినసిషిద్ధకాలములయందుకూడ

అవసరమైనచో సిరావ్యధనము చేయవచ్చును. విషముచే బాధకల్గినప్పుడును పైనిషిద్ధ కాలములయందుకూడ సిరావ్యధనము చేయవచ్చును.

ఋతుభేదముచే సిరావ్యధన కాలము

మూ. .........హితః కాలే గ్రీష్మేతు శీతలే. ౬౪౫
వ్యధే ద్వర్షాసు, హేమన్తే మధ్యాహ్నేచ సిరావ్యధః,

వ్యా. గ్రీష్మకాలమున ఎండలేక చల్లగనుండుసమయమున సిరావ్యధనము చేయవలెను. వర్షర్తువునందు మేఘావరణములేనిసమయమునను, హేమంతఋతువున మధ్యాహ్నవేళయందును సిరావ్యధనముచేయనగును.

సిరావేధనక్రమము

మూ. అథస్నిగ్ధతనుస్సజ్జ సర్వోపకరణో బలీ. ౬౪౬
కృతస్వస్త్యయనస్స్నిగ్ధ రసాన్న ప్రతిభోజితః (జనః)
అగ్నితాపాతపస్విన్నో జానూచ్చాసనసంస్థితః. ౬౪౭
మృదుపట్టాత్తకేశాన్తో జానుస్థాపితకూర్పరః,
ముష్టిభ్యాం వస్త్రగర్భాభ్యాం మన్యే గాఢం నిపీడయేత్. ౬౪౮
దన్తప్రపీడనోత్కాస (చ్ఛ్వాస) గణ్డాధ్మానానిచాచరేత్,
పృష్ఠతోయన్త్రయేచ్చైనం వస్త్రమావేష్టయన్నరః. ౬౪౯
కన్ధరాయాం పరిక్షిప్యన్యస్యాన్తర్వామతర్జనం,
ఏషోఽన్తర్ముఖవర్జ్యానాం సిరాణాం యన్త్రణే విధిః. ౬౫౦
తథా మధ్యమయాఙ్గుళ్యా వైద్యోఙ్గుష్ఠవిముక్తయా,
తాడయేత్, ఉత్థితాం జ్ఞాత్వా స్పర్శాఙ్గుష్ఠప్రపీడనైః. ౬౫౧
కుఠార్యాలక్షయేన్మధ్యే వామహస్తగృహీతయా,
ఫలోద్దేశేషు నిష్కంపం సిరాం తద్వచ్చమోక్షయేత్. ౬౫౨
తాడయన్ పీడయంశ్చైనాం విధ్యేద్వ్రీహిముఖేనతు,

వ్యా. సిరావ్యధనముచేసికొనువానికి శరీరమును స్నేహములచే స్నిగ్ధముగజేసి, వస్త్రము, స్నేహము, గైరికము మున్నగునుపకరణముల సిద్ధముచేసి శరీరపుష్టికలపురుషుడు పూజావిధులను మంగళహోమాదులను యథోక్తముగ నెరవేర్చి, స్నిగ్ధంబును రసవంతంబునైన యాహారమును భుజింపజేసి, ఎండచేతను అగ్నిచేతను తాపస్వేదమునుచేయించి మోకాటిపొడవు యెత్తుకలపీఠముపై రోగిని కూర్చుండబెట్టి పలుచనిగుడ్డచే వానికేశముల (తలవెండ్రుకల)నుకట్టి, వానిమోచేతులను మోకాళ్లపై నునిచి, పిడికిట గుడ్డను ఇముడ్చుకొని

యాపిడికిటిచేత వానివెన్నుప్రక్క పెద్దనరములను దృఢముగ మర్దించవలెను. అట్టిసమయమున రోగి పండ్లుకొరుకుచు దగ్గుచు నుచ్ఛ్వాసమును విడుచుచుండవలెను.

మరియు పైజెప్పినవిధముగ కూర్చుండురోగియొక్క వీపునందును గొంతుపైనను గుడ్డచుట్టి దానిమధ్యమందు ఎడమబొటనవ్రేలును దృఢముగనునిచి సిరలను కట్టవలెను. ఇది ముఖమునదక్క తక్కినస్థలములనుండుసిరలను కట్టునట్టివిధి యని తెలియునది.

పిదప బొటనవ్రేలితో చేరకుండు ఎడమచేతి నడిమివ్రేలుతో నాసిరను కొట్టవలెను. పిదప స్పర్శముచేనైనను బొటనవ్రేలితో నదుముటచేనైనను సిరపైకిలేచినదని తెలిసికొని యాసిరయొక్క నడుమ ఫలోద్దేశముల నునిచి కదలకుండ ఎడమచేతపట్టుకొని కుఠారిక యనునాయుధముచేత ఆసిరను గుర్తుపెట్టుకొనవలెను. వ్రీహిముఖమను నాయుధముచేత మరల నాసిరను ఒకమారు తాడనముచేసి బొటనవ్రేలితో బాగుగ నదుముకొని వ్రీహిముఖమను నాయుధముచేతనే ఆసిరను గ్రుచ్చవలెను.

నాసికా-జిహ్వాధోభాగసిరలవేధించుక్రమము

మూ. అఙ్గుష్ఠేనోన్నమయ్యాగ్రే నాసికాముపనాసికామ్. ౹౹౹౩
అభ్యున్నతవిదష్టాగ్ర జిహ్వాస్యాథ తదాశ్రయామ్,

వ్యా. నాసికాగ్రమును బొటనవ్రేలిచే పైకెత్తిపట్టుకొని నాసికాసమీపమున నుండుసిరను వేధించ(గ్రుచ్చ)వలెను. పైతాలుప్రదేశమున కఠిముగ నాలుకనుదీసికొనివచ్చి యానాలుకయొక్క కొనను దంతములచే బాగుగ కరచికొనియుండునపుడు నాలుకకు అధోభాగమునందుండుసిరను వేధించవలెను.

హస్తసిరావ్యధనక్రమము

మూ. విధ్యేద్ధస్తసిరాంబాహావనాకుఞ్చితకూర్పరే. ౹౹౹౪
బద్ధ్వాసుఖోపవిష్టస్య ముష్టిమఙ్గుష్ఠగర్భిణీమ్,
ఊర్ధ్వం వేధ్యప్రదేశాచ్చ పట్టికాం చతురఙ్గులే. ౹౹౹౫

వ్యా. చేతిలో సిరావ్యధనము చేయవలసినప్పుడు రోగిని సుఖముగ కూర్చుండ నియమించి మోచేతులు వంచక చక్కగ చేతిని చాపి యుంచి బొటనవ్రేలు అరచేతిలో నిమిడియుండునట్లు పిడికిలిబట్టించి చేతిలో సిరావ్యధనముచేయదలచిన ప్రదేశమునకు పైభాగమున నాల్గంగుళములదూరమున గుడ్డచే బిగియకట్టి హస్తమునందు సిరను వేధించవలెను.

పాదమున సిరావేధనక్రమము

మూ. పాదేతు సుస్థితేఽధస్తాత్ జానుసన్ధేర్నిపీడితే
గాఢంకరాభ్యామాగుల్ఫం చరణే తస్యచోపరి. ౹౹౹౬

ద్వితీయం కుఞ్చితే కిఞ్చిత్ ఆరూఢే హస్తవత్తతః,
బద్ధ్వావిద్యేత్సిరాం, ఇత్థమనుక్తేష్వపిలక్షయేత్. ౬౫౭

వ్యా. పాదమును సుస్థముగ భూమిపై నుంచుకొనియుండునపుడు మోకాలిసంధికి క్రింద చీలమండవరకు బిగువుగ హస్తములచే మర్దించి, క్రింద నునిచి యుండుకాలిపై రెండవకాలిని కొంచెముగ వంచియుంచుకొనియుండునపుడు వేధించవలసినస్థానమునకు పైభాగమున హస్తమునకు చెప్పినవిధముగ గుడ్డనుకట్టి పాదములయందు సిరను వేధించవలెను. ఇత్తెఱంగుననే అనుక్తములగు తక్కినస్థలములయందును సిరావ్యధనముచేయుటకు తగినవిధానముల నూహించి స్వబుద్ధిచే గల్పించి సిరావ్యధనముచేయునది.

ప్రదేశభేదముచే నుపయోగించుశస్త్రములు

మూ. మాంసలే నిక్షిపేద్దేశే వ్రీహ్యాస్యం వ్రీహిమాత్రకమ్,
యవార్థమస్థ్నాముపరిసిరాం విధ్యేత్కుఠారయా. ౬౫౮

వ్యా. అధికముగ మాంసముకలిగి బలిసియుండుప్రదేశమున వడ్లగింజంతప్రమాణముగల వ్రీహిముఖమును శస్త్రమును ప్రయోగింపవలెను. మఱియు అస్థులపై నుండు సిరలను వేధించునపుడు కుఠారిక యనుశస్త్రమును అర్ధయవప్రమాణము ప్రయోగించవలెను.

సమ్యక్స్రావలక్షణములు

మూ. లాఘవం వేదనాశాన్తిః వ్యాధివేగపరిక్షయః,
సమ్యగ్విస్రావితే లిఙ్గం ప్రసాదో మనసస్తథా. ౬౫౯

వ్యా. సిరావ్యధనముచే దుష్టరక్తము చక్కగ వెడలినప్పుడు శరీరము చులకనై బాధ నివర్తించును. వ్యాధియొక్క వేగము నశించును. మనస్సు నిర్మలముగ నుండును. ఇట్టి లక్షణములబట్టి దుష్టరక్తము చక్కగ స్రవించె నని యెఱుంగునది.

సమ్యగ్విద్ధాదిలక్షణములు

మూ. సమ్యగ్విద్ధే స్రవేద్ధారా యన్త్రే ముక్తేతు న స్రవేత్,
అల్పకాలం వహత్యల్పం దుర్విద్ధాతైలచూర్ణనైః. ౬౬౦
సశబ్దమతివిద్ధేతు స్రవేద్దుఃఖేన ధార్యతే,

వ్యా. పైజెప్పినవిధిప్రకారము సిరావ్యధనముచేసినప్పుడు ఆట్టిసిర చక్కగ వేధింపబడినచో రక్తము ధారగస్రవించును. కట్టుబడినకట్టును విప్పినచో రక్తము స్రవించక తనంతనే నిలుచును. బాగుగ వేధింపబడనియెడ కొద్దికాలముపఱకు రక్తము కొంచెముకొంచెముగ స్రవించునుగాని ధారాళముగ వెడలదు. ప్రమాణమునకన్న నధికముగ వేధింపబడిన

సిరనుండి రక్తము శబ్దముతోఁగూడి యధికముగ స్రవించును. అట్టియెడ తైలమును చూర్ణమును ప్రయోగించినను మిక్కిలి కష్టముచే రక్తము నిలుచునుగాని తనంతట నిలువదు.

అప్రవృత్త స్రావమునకు వేల్లాదిలేపము

మూ. అసమ్యగస్రే స్రవతి వేల్లవ్యోషనిశానతైః. ౬౬౧
సాగారధూమలవణతైలై ర్దిహ్యాత్సిరాముఖం,
సమ్యక్ప్రవృత్తే కోష్ణేన తైలేన లవణేనచ. ౬౬౨

వ్యా. రక్తము బాగుగ స్రవించకుండినయెడ వాయువిడంగములు, త్రికటుకములు, పసుపు, గ్రంథితగరము, కరిదూపము, లవణము వీనినన్నిటిని మర్దించి ముద్దగజేసి దీనిచేత సిరయొక్క ద్వారమున లేపముచేయునది. రక్తము బాగుగ స్రవించునపుడు కొంచెము ఉష్ణముగ నుండు తైలమున లవణము కలిపి సిరాముఖమున పూయవలెను.

దుష్టరక్తము స్రవించుక్రమము

మూ. అగ్రే స్రవతిదుష్టాస్రం కుసుమ్భాదివపీతికా,
సమ్యక్స్రుత్వాస్వయం తిష్ఠేత్ శుద్ధం తదితి నాహరేత్. ౬౬౩

వ్యా. కుసుంభపుపువ్వునందు రక్తవర్ణంబును కొంచెముగ పచ్చనిరంగును కలిసియుండును. అట్లేఅంగుననే చెడ్డరక్తంబును మంచిరక్తంబును సిరలయందు చేరియుండును. అట్టిసిరను వేధించి రక్తమును స్రవింపజేయునపుడు పీతవర్ణముకలిసిన దుష్టరక్తము తొలుత స్రవించిపిమ్మట శుద్ధరక్తము తనంతనదే స్రవించక నిలిచిపోవును. దుష్టరక్తము బాగుగ స్రవించి మంచిరక్తము ఒకవేళ తనంత నిలువనిచో నేమరియుండక అట్టిమంచిరక్తమును గమనించి స్రవించకుండునట్లు లాపవలెను. రక్తము ప్రాణమునకు ముఖ్యాధారము కావున నయ్యది స్రవించినచో హానికల్గును; కావున శుద్ధరక్తమును వెడలనీయక యాపుట ముఖ్యమైనపని.

రక్తస్రావమునమూర్ఛాదులయందుచేయదగినవిధానము

మూ. యన్త్రం విముచ్యమూర్ఛాయాం వీజితేవ్యజనైః పునః,
స్రావయేన్మూర్ఛతిపునస్త్వపరే ద్యుస్త్ర్యహేపివా. ౬౬౪

వ్యా. సిరావ్యధనముచే రక్తమును స్రవింపజేయునపుడు మూర్ఛగ్రమ్మినయెడ యంత్రము నూడదీసి విసరుచు శీతోపచారములచే రోగినిసేదదేర్చి కొంతకొంతసేపు అగి మరల రక్తమును స్రవింపజేయవలెను. మరల రోగికి మూర్ఛగ్రమ్మునెడ దుష్టరక్తమునుకూడ నాడినమున స్రవింపజేయక నిలిపి మరుసటిదినమునసైనను, మూడవదినమునసైనను రక్తమును స్రవింపజేయవలెను.

దుష్టరక్తస్రావానంతరకృత్యము

మూ. స్రుతే రక్తే శనైర్యన్త్ర మపనీయహిమామ్బునా,
ప్రక్షాళ్య తైలప్లోతాక్తం బన్ధనీయం సిరాముఖమ్. ౬౬౫

వ్యా. దుష్టరక్తము బాగుగ స్రవించినపిదప యంత్రమును మెల్లమెల్లగా నూడదీసి సిరాముఖమును చల్లనినీళ్లచే కడిగి దానిపై తైలమును బూసి గట్టిగ బంధింపవలెను.

వాతాదిదుష్టరక్తలక్షణము

మూ. వాతాచ్ఛ్యావారుణం రూక్షం వేగస్రావ్యచ్ఛఫేనిలం,
పిత్తాత్పీతాసితం విస్రమస్కన్ద్యుష్ణం సచన్ద్రికమ్. ౬౬౬
కఫాత్ స్నిగ్ధమసృక్పాణ్డు తన్తుమత్పిచ్ఛిలం ఘనం,
సంసృష్టలిఙ్గం సంసర్గాత్ త్రిదోషం మలినావిలమ్. ౬౬౭

వ్యా. వాతమువల్ల చెడినరక్తము శ్యామారుణవర్ణంబులు కలిసి రూక్షమై నురుగుతోగూడి తేటనై వేగముగ వెడలి స్రవించును. పిత్తముచే దుష్టమైనరక్తము పచ్చని రంగును నలుపును దుర్గంధంబును కల్గి చంద్రకముతో గూడి చిక్కనై స్రవించును. కఫముచే దుష్టమైనరక్తము స్నిగ్ధంబును, పాండువర్ణంబును, తీగెవలె నుండునదియునై స్రవించును. రెండేసిదోషములచే చెడినరక్తము అట్టి రెండుదోషములకు వేరువేరజెప్పినలక్షణములతో గూడినదయి స్రవించును. దోషత్రయముచే దుష్టమైనరక్తము త్రిదోషములకు వేరువేరజెప్పినలక్షణములన్నియు కలిసి కలకబారి మలినమై స్రవించును.

క్షీణాదులకు రక్తస్రావకాలనియమము

మూ. అశుద్ధం స్రావయేద్భూయః సాయమహ్న్యపరేపివా,
క్షీణస్య బహుదోషస్య మూర్ఛయాభిద్రుతస్యవా. ౬౬౮
స్నేహోపస్కృతదేహస్య పక్షాద్వ్యాభ్యశదూషితం,

వ్యా. వాతాదులచే దుష్టమై చెడినరక్తమును పైజెప్పిననియమమును విడువక రక్తమును స్రవింపజేసి, మరల నాటిసాయంకాలముననైనను మరుసటిదినమునైనను రక్తమును స్రవింపజేయవలెను. మఱియు శరీరము క్షీణించి దోషము ప్రబలముగనుండి మూర్ఛగ్రమ్ముచున్నయెడ అట్టివానికి స్నేహవిధానముచే స్నిగ్ధశరీరునిగజేసి యొకపక్షకాలమునకుపైన వానికి మరల సిరావ్యధనముచేసి రక్తమును స్రవింపజేయవలెను.

దుష్టరక్తసావశేషానుజ్ఞ

మూ. కిఞ్చిచ్ఛేషేఽపి దుష్టాస్రే నైవ రోగోఽతివర్తతే. ౬౬౯
సశేష మప్యతోధార్యం న చాతిస్రుతిమాచరేత్,

వ్యా. చెడ్డరక్తము కొంచెము మిగిలియున్నను రోగము వృద్ధికానేరదు; కావున దుష్టరక్తము కొంచెము శేషించియున్నపుడే రక్తస్రావమును నిలుపవలెను. శుద్ధరక్తము ప్రాణాధారమైనది కావున అధికముగ స్రవింపజేసినయెడల హాని కల్గును. కావున కొంచెము దుష్టరక్తము మిగిలియున్నను బాధకముగాదు. గాన ఎప్పుడైనను రక్తము నధికముగ స్రవింపజేయరాదు.

పైజెప్పినరీతిగ శేషించినదుష్టరక్తమును శమనౌషధములచే శమింపజేయవలెను. ఈవిషయమును సుశ్రుతు లిట్లుపదేశించిరి:—"సశేషం దుష్టరుధిరమపి కుర్యాద్విచక్షణః, న చాతి ప్రస్రుతిం కుర్యాత్ శేషం సంశమనైర్జయేత్"

దుష్టరక్తస్రావపరిమాణము

మూ. అశుద్ధం బలినోఽప్యస్రం న ప్రస్థాత్ స్రావయేత్పరమ్. ౬౨౦
అతిస్రుతేవా మృత్యుస్స్యాద్దారుణావాచలామయాః,

వ్యా. బలిష్ఠుడుగనుండుపురుషునకైనను దుష్టరక్తమును ప్రస్థపరిమాణమునకన్న నధికముగ వెడలింపదగదు. అట్లుకాక ప్రమాణమున కధికముగ స్రవింపజేసినచో మరణము సంభవించును. లేక దారుణములగువాతరోగములు కల్గును.

స్థానభేదముచే రక్తస్రావపరిమాణభేదము

మూ. శాఖాసూపరమాన్తంతు శోణితస్యావసేచనమ్. ౬౨౧
ముఖే పాదావశేషం స్యాత్ అర్ధమన్యత్ర శేషయేత్,

వ్యా. హస్తపాదములయందు రక్తశోధనముచేయునపుడు దుష్టరక్తము పూర్తిగ స్రవించి తనంతట శుద్ధరక్తము నిలబడునంతవరకు రక్తస్రావము చేయనగును. ముఖమున రక్తమోక్షముచేయునెడ నాల్గవపాలు మిగులునట్లును, తక్కినస్థలములయందు దుష్టరక్తములో సగము మిగులునట్లును రక్తస్రావముచేయనగును.

వమనాదులయందు ప్రస్థపరిమితి

మూ. వమనేచ విరేకేచ తథా శోణితమోక్షణే. ౬౨౨
సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః,

వ్యా. వమనమునందును విరేచనమునందును రక్తమోక్షణమునందును ప్రస్థపరిమాణముచెప్పుతరి పదుమూడున్నరపలము ఒకప్రస్థమని గ్రహింపవలెను. (అనగా 16 పలములు కాదని భావము.)

రక్తము స్రవించకుండుటకు కారణములు

మూ. భీమూర్ఛాభయమత్తశైథిల్య కుణ్ఠశస్త్రాతితృప్తయః. ౬౨౩

క్షోమత్వావేగితాస్వేదా రక్తస్యాస్రుతిహేతవః,

వ్యా॰ భయము, మూర్ఛ, యంత్రము(కట్టు)ను దృఢముగగాక శిథిలముగ ప్రయోగించుట, శస్త్రమునకు పదనులేకుండుట, అధికముగ తృప్తిగల్గినట్లు భుజించియుండుట, బలహీనము, మలమూత్రవాతాదివేగములు కల్గియుండుట, చెమటపుట్టించకయుండుట ఈకారణములచేత రక్తము ధారాళముగ వెడలదు. పైజెప్పినకారణములు రక్తస్రావమునకు ప్రతిబంధకములు కావున అట్టిభయాదులు కల్గియుండునపుడు రక్తమోక్షణము చేయంజనదని భావము.)

దుష్టరక్తమును వెడలింపనిచో గల్గురోగము

మూ. అనిర్స్రుతేతు దుష్టాస్రే రాగశ్వయథువేదనాః. ౬౭౪

వ్యా॰ పైజెప్పినరీతిగ దుష్టమైనరక్తమును వెడలింపకున్నయెడ శరీరము ఎఱ్ఱబడును. వాపు కల్గును. పోటు మొదలగుబాధలు కలుగును.

రక్తాతిస్రావమునకు ప్రతిక్రియ

మూ. అతిస్రుతే హి రుధిరే సేకశ్శీతేన వారిణా,
స్వాదుశీతకషాయాన్నపానమాలేపనం హితమ్. ౬౭౫
సిరాగతం వా విభ్రష్టం ఏణాదిహారిణాద్యసృక్,
పాతవ్యం తేన వా దర్భమృదితే నానువాసనమ్. ౬౭౬
ఉపచారైరుపచరే ద్వ్యథాయాథ ముపద్రవాన్,
తామేవ వా సిరాం విధ్యేత్ వ్యథాత్తస్మాదనన్తరమ్. ౬౭౭
సిరాముఖం వా త్వరితం దహేత్తప్తశలాకయా,

వ్యా॰ రక్తము అధికముగ స్రవించినచో చల్లనైయుండుసీళ్లచే తడుపవలెను. మరియు మధురంబును శీతంబును కషాయరసంబులైన యన్నపానాదులును ఆలేపనంబును హితకరము. మరియు జింక లేడి మున్నగుజంతువులరక్తమును త్రాగవలెను. లేక అట్టి రక్తములచే ననువాసనము (వస్తికర్మ)చేయనగును. అట్టిసమయమున సంభవించినయుపద్రవములను తత్తదనుకూలముగ నుపచారములజేయవలెను. మరియు మునుపు వేధించియుండుప్రదేశమునకు సమీపమున మరల నాసిరను వేధించవలెను. లేక అతిశీఘ్రముగ రక్తము స్రవించుసిరాముఖమును కాల్చబడినశలాకచేత కాల్చవలెను.

సిరావ్యధనమున నిమిత్తనిర్ణయము

మూ. వామపాదతలే కక్షే. దక్షిణే చరణే తథా. ౬౭౮

వామహస్తే లలాటేచ వధ్యే త్వఙ్ఛసిరాః క్రమాత్,
అథవా పాదయోః పాణ్యోః ఫాలే సప్తదినాన్తరమ్. ౬౭౯
అపాఙ్గే ద్వేలలాటేచ జిహ్వాయాం శిరసీ తథా,
ద్వేచోపనాస్యే వేద్ధవ్యే వేద్ధవ్యే చోపకర్ణయోః. ౬౮౦
ఉత్తరేఽహాని సంస్థాప్యా ధ్ధార్యం సమవజాయతే,
ఉత్తరేఽహానిసంగ్రాహ్యా లలాట్యాతుచిరంరుజి. ౬౮౧
అక్షిరోగేతు న స్రావ్యే త్యవోచ ద్భగవాన్నిమిః,

వ్యా॥ ఎడమకాలు, చంకలు, దక్షిణపాదము, వామహస్తము, నుదురు అను నీయైదుస్థలములయందలిసిరలు వేధింపవగును. లేక పాదములయందలిసిరలను హస్తముల యందలిసిరలను నుదుటిసిరలను ఏడుదినములకులోపల వేధింపనగును. మరియు నేత్రాంత ములయందు రెండుసిరలును, నుదుటియందును, కొలుకయందును, నాసాసమీపస్థలముల రెంటియందును, రెండుచెవులసమీపస్థలములయందును సిరల వేధింపదగును. మరియు కర్ణములయందు సిరావ్యధనముచేయునప్పుడు సిరావ్యధనముచేసిన మరుసటిదినము రక్త స్రావమును నిలుపవలెను. లలాటమున సిరావ్యధనముజేయునప్పుడును మరుసటిదినమున రక్తమును నిలుపవలెను. బాధ అధికముగనుండునేని చిరకాలమునకు రక్తమును నిలుప వలెను. నేత్రవ్యాధులయందు ఒకప్పుడును రక్తస్రావము చేయదగదు. ఇత్తెఱంగు (పైజెప్పిన రీతిగ)నిమియనురాజర్షి నిర్ణయించిచెప్పెను.

## జలగలభేదము

మూ॥ జలౌకసోఽనృణాం యే చ చతుః పఞ్చషడఙ్గులాః. ౬౮౨
తాసుచాల్పశిరస్కన్థాః సుకుమారాస్తనుత్వచః,
అథః కాయే స్త్రియస్థూలాః పుమాం సస్తు విపర్యయే. ౬౮౩
అర్ధచన్ద్రసమాకారాః ఫురోవృత్తాశ్చతాసుతం,
చిరోత్థే బహుదోషేచ పుమాంసోఽన్యత్ర తు స్త్రియమ్. ౬౮౪

వ్యా॥ జలగలు మనుజులయొక్క అంగుళములచే నాల్గు, లేక ఐదు, లేక ఆరంగుళ ములపరిమాణము నిడివికల్గియుండును. అందు చిన్నతలలుకల్గి సుకుమారములై నిండిపైభాగ మున పలుచనిచర్మముకల్గి స్థూలములైయుండునవి స్త్రీజాతిలోచేరినవి. ఇందుకు విరుద్ధ లక్షణములుకల్గి అర్ధచంద్రునిబోలె వంకరలైయుండు ప్రక్కవర్తులాకారములైనవి పురుష జాతిలోచేరినవి. ఈరెండిటిలో చిరకాలమునుండి యనుసరించియుండురోగమునందును,

ప్రబలమైన దోషముకలరోగమునందును పురుషజాతిజలగలను ప్రయోగింపవలెను. తక్కిన దోషములయందు స్త్రీజాతిజలగలను ప్రయోగించునది.

విషముతోఁగూడినజలగలలక్షణము

మూ. దుష్టామ్బుమత్స్యభేకాహి శవకోథమలోద్భవాః,
రక్తాశ్శ్వేతాభృశం కృష్ణాః చపలాస్థూలపిచ్ఛిలాః. ౬౫౪
ఇన్ద్రాయుధవిచిత్రోర్ధ్వ రాజయోరోమశాశ్చతాః.
స్థూలమధ్యాః పరేక్లిష్టాః పృథ్వ్యోమన్దవిచేష్టితాః. ౬౫౬
అగ్రాహిణోఽల్పపాయినో దుష్టోదకసముద్భవాః,
సవిషావర్జయేదేవ.........

వ్యా. ఆకలములు పడియుండుటచే చెడినసీటియందును, మత్స్యములు కప్పలు పాములు మున్నగునవి చచ్చిచెడినసీటియందును, మురుగుళ్లయందును, పుట్టినజలగలు విషముతోఁగూడియుండును. అయ్యవి రక్తవర్ణంబులును, శ్వేతవర్ణంబులును, కృష్ణవర్ణంబులునై స్థూలములుగను మిక్కిలి చలనస్వభావంబులుగను పిచ్ఛిలంబులునై యుండును. మరియం నవి ఇంద్రధనుస్సువలెను చిత్రవర్ణములైనరేఖలు నిడుపుగకల్గి రోమములతోఁగూడియుండును. అందు కొన్ని మధ్యభాగమున స్థూలములై నిడుదలై మెల్లగ సంచరించుస్వభావము కల్గియుండును. చెడినసీటిలోఁబుట్టిన కొన్నిజలగలు చక్కగ పట్టుకొనజాలవు. ఒకవేళ పట్టుకొనినను రక్తమును కొద్దిగపీల్చును. ఇవియన్నియు విషముతోఁగూడెనజలగలు. కావున వీని నెన్నడును రక్తమును పీల్చుటకై యుంపయోగింపంజనదు.

విషరహితజలూకాలక్షణము

మూ. .........తతశ్శుద్ధామ్బుసమ్భవాః. ౬౫౭
నిర్విషాశ్శైవలశ్యావాః వృత్తానీలోర్ధ్వరాజయః,
యుక్తాజ్ఞాశ్శీఘ్రపాయినో బలవత్యోమహాశనాః. ౬౫౮
కషాయ పృష్ఠాస్తన్వఙ్గో కిఞ్చిత్పీతోదరాశ్చయాః,

వ్యా. కలువలు తామరనాచు కల్గి శుద్ధమై నిర్మలముగ నధికమైనజలమున బుట్టిన జలగలు విషరహితములుగ నుండును. అయ్యవి పాచివలె శ్యామవర్ణము కల్గి గుండ్రములై నల్లనియూర్ధ్వరేఖలు కల్గి యుండును.అతిదీర్ఘంబులును హ్రస్వంబులును కాని యాకారము కల్గియుండును. రక్తమును అతిశీఘ్రముగ పీల్చును. మిక్కిలి అధికముగ రక్తమును త్రాగును. వానివీపు కషాయ(మంజిష్ఠి)వర్ణము కల్గి కొంచెము పచ్చనైనయుదరభాగంబును కృశించినశరీరంబును కల్గియుండును.

## రక్తపానముచే మదించినజలగలస్వరూపము

మూ॰ తాఅప్యసమ్యగ్వమనాత్ ప్రతతంచ నిపాతనాత్. ౬౮

సీదంతి సలిలం ప్రాప్య రక్తమత్తా ఇతి త్యజేత్,

వ్యా॰ పైజెప్పినరీతిగ విమరహితములైనజలగల నోటినుండి దుష్టమైనరక్తమును కక్కించవలెను. అట్లేఱంగురక్తమును చక్కగ గ్రక్కించకుండుటచేతను ఎల్లప్పుడు రక్తమును పానముచేయుటవలనను రక్తముచే మత్తిల్లియుండును. వానిని యుదకముచే నిండిన కుండలో నునిచిన కదలక సంకటపడుచుండును. అట్టిమదించినజలగలను రక్తస్రావమునకై యుంపయోగింపంజనదు.

## జలూకాప్రయోగక్రమము

మూ॰ అథేతరాస్సరజనిసర్షపేఽమ్బుసీసంప్లుతాః. ౬౯

అవన్తి సోమే తక్రే వా పునశ్చాశ్వాసితాజలే,

నీరుజో మృత్కరీషాభ్యాం కుఠార్యాపి విఘర్షయేత్. ౬౧

లాఘయేద్ఘృతమృత్తస్య రక్తశస్త్రనిపాతనైః,

పిబన్తీరున్నతస్కన్ధాశ్ఛాదయేన్మృదువాససా. ౬౨

వ్యా॰ పిదప మంచిలక్షణములుకలజలగను పసుపు ఆవాలు ఈ రెండిటికల్కముతో గూడిన జలమునందైనను కాంజికమునందైనను మజ్జిగలోనైనను ఈదునట్లుచేసి పిదప శుద్ధమైన జలమున నీదించి దోషరహితముగజేసి మట్టి బూడిదెపేనితోగాని కుఠారితోగానివాని శరీరమును రాయవలెను. రోగి శరీరమున రక్తమును వెడలించవలసినచోట మట్టిని నెయ్యిని కలిపియుంచియైనను, శస్త్రముచే గ్రుచ్చి రక్తమును వెడలించియైనను, అచ్చోటనే జలగను కరిపించవలెను. జలగ తలయెత్తి రక్తమును పీల్చునప్పుడు పలుచనిగుడ్డచే క్రమ్మ(కప్ప) వలెను. అట్లుమూయుటచేత ఈగలు మొదలగువానిచే బాధలేక జలగలు శరీరమున దుష్టరక్తమును బాగుగ పీల్చును.

## జలూకాదంశమోక్షణకాలము

మూ॰ దంశస్యతోదేకణ్డ్వాం హి స్యాదత్తే శుద్ధశోణితమ్,

విజ్ఞాయతామపనయేత్ రక్తగ్రన్థేర్నముఞ్చతి. ౬౩

న చేత్తైన్ధవచూర్ణేన తస్యాముఖమవాకిరేత్,

వ్యా॰ జలగ కరచికొనినచోట పోటుగాని దురదగాని పుట్టినచో జలగ మంచిరక్తమును పీల్చుచున్నదని రూహించి ఆజలగను రక్తమును పీల్వనీయక విడదీయవలెను. అయ్యది రక్తపానమునుండి మరలి పట్టువిడువనిచో యెడ సైంధవలవణమును దానినోటిపై చల్లవలెను.

జలూకావమనక్రమము

మూ. పటుమైలాక్తవదనాం శ్లక్ష్ణఖడ్గనరూషితామ్. ౬౯౪
వామయే దధవా చిఞ్చా ఫలామ్లాక్తముఖామిమాం,

వ్యా. జలగలను విడదీసినపిదప వానినోటిపై సైంధవలవణముతో గూడిన యూనెను పూసి సన్నని బియ్యపుటూకనుచల్లి వమనము చేయించవలెను. లేక చింతపండుపులుసునైన జలగనోటనుంచినచో నయ్యది రక్తమును వెడలగ్రక్కును.

శేషించినదుష్టరక్తస్రావము

మూ. అశుద్ధౌ స్రావయేద్దంశాత్ హరిద్రాగుడమాక్షికైః. ౬౯౫

వ్యా. జలగలవిడదీసిన వెనుక దుష్టరక్తము మిలిగియున్నచో పసుపు, బెల్లము, తేనె ఈమూడిటిని జలగకాటున నునిచి శేషించినదుష్టరక్తమును మరల వెడలించవలెను.

రక్తమోచనానంతరము చేయదగినయుపచారము

మూ. విస్రావితాసృజస్సద్యః శీతైః ప్రక్షాళితం జలైః,
శతధౌతాజ్య పిచునాతద్దంశమవకుణ్ఠయేత్. ౬౯౬
పీతమాత్రం జలూకాభిః పరిషిఞ్చేద్ఘృతేనవా,
శోణితం స్థాపనీయేన స్థాపయిత్వా ప్రసాదయేత్. ౬౯౭

వ్యా. పైజెప్పినరీతిగ జలగల ప్రయోగించి దుష్టరక్తమును వెడలించినవెనుక జలగకరిచిన కాటును చల్లనినీళ్లచే శుభ్రముగకడిగి, శతధౌతఘృతముచే తడుపబడినప్రత్తిచే గప్పవలెను. లేక ఘృతముచే తడుపవలెను. మరియు సిరావ్యధనమునజెప్పినవిధులప్రకారము రక్తమును మరల యథాస్థానమున నిలుపనగును. మరియు నయ్యది ప్రసన్నముగ (నిర్మలముగ)నగుటకు దగినయుపచారములను జేయునది.

శేషరక్తసంధారణము

మూ. ఉత్క్లిష్టశేషసంధృత్యై కషాయస్వాదుశీతలైః,
ప్రయోగై స్తత్రయోగాద్యాః సిద్ధయశ్చ సిరాస్వివ. ౬౯౮

వ్యా. శుద్ధమైనరక్తమును జలగపీల్చునపుడు, స్థానమునుండి చలించియున్నపుడు దానిని స్వస్థానమున నిలుపుటకై కషాయమధురరసంబులును శీతలంబులునై యౌషధముల ప్రయోగించుటచే నుపచరించునది. ఈవిషయమై ఔషధయోగములను సిరావ్యధనమున జెప్పినవానిని గ్రహించునది.

దుష్టరక్తస్రావఫలము

మూ. దుష్టరక్తాపగమనాత్ సద్యోరోగరుజాంశమః,

వ్యా. చెడ్డరక్తము బైటవెడలుటచేత తాత్క్షణముననే రోగములు దానగల్గుబాధలును శమించును. వాపు తాపము మున్నగునుపద్రవంబులును శాంతినొందును.

శుద్ధరక్తము వెడలుటచే గల్గునుపద్రవములు, వానియుపచారములు

మూ. శుద్ధాస్రేఽతిస్రుతే దంశస్సకణ్డూశ్శోథవేదనః. ౧౯౯
భ్రమమూర్ఛాజ్వరమదాః క్రియా యోజ్యా యథాయథం,

వ్యా. శుద్ధమైనరక్తము అధికముగ వెడలినచో జలగ కరచినకాటునందు దురదయు వాపును పోటును కల్గును. మరియు ఒడలు తిరుగును. మూర్ఛగ్రమ్మును. జ్వరమువచ్చును. తిక్కయెత్తిన ట్లుండును. అట్టియెడ నాయాయుపద్రవములకు దగినయుపచారములజేసి వానిని శాంతినొందింపవలెను.

పర్యుషితదుష్టరక్తస్రావావశ్యకత

మూ. అశుద్ధం చలితం స్థానాత్ స్థితం రక్తం వ్రణాశ్రయే. ౨౦౦
వ్యమ్లీభవేత్పర్యుషితం తస్మాత్తత్స్రావయేత్పునః,

వ్యా. దుష్టమైనరక్తమును జలగలు పీల్చునప్పుడు స్వస్థానమునుండి చలించి వ్రణమునసే ఆశ్రయించి చిరకాల మున్నయెడ నయ్యది విశేషముగ పులిసి కుళ్లును. కావున అట్టిదుష్టరక్తశేషమును మరల స్రవింపజేయవలెను.

జలగలు దుష్టరక్తమును పీల్చుక్రమము

మూ. సంపృక్తా ద్దుష్టశుద్ధాస్రాత్ జలూకాదుష్టశోణితమ్. ౨౦౧
ఆదత్తే ప్రథమం హంసః క్షీరం క్షీరోదకాదివ,
రక్షేత్ రక్తమదాద్భూయః సప్తాహంతానపాతయేత్. ౨౦౨

వ్యా. దుష్టరక్తంబును మంచిరక్తంబును రెండునొకటిగ (పాలునీళ్లువలె) కలిసియుండును. అట్టియెడ నీళ్లుగలిసినపాలను హంసగ్రహించుభంగి మంచిరక్తమునకలిసినదుష్టరక్తమునే జలగలు తొలుత పీల్చును. (జలగలకు చెడ్డరక్తమునందు రుచి యధికముగ నుండును కావున తొలుత చెడ్డరక్తమునే పీల్చి పిమ్మట మంచిరక్తమును పీలువ నారంభించును; కావున ఆసమయము కనిపెట్టి జలగలను విడదీయవలెనని భావము). మరియు నొకతూరి రక్తమును పీల్చినజలగలు రక్తపానమునంజేసి మత్తిల్లియుండును, కావున అట్టిజలగలను ఏడుదినములవరకు కాపాడి మదము అణగినపిదప మరల రక్తమును పీల్చుట కుపయోగింప నగును.

### శృంగలక్షణము

మూ. హ్రస్వమధ్యోత్తమాయామేఽష్టౌ దశద్వాదశాఙ్గుళం,
సర్వతః సమరంధ్రంచ చర్మనద్ధాగ్రచూచుకమ్. ౭౦౩
త్రియఙ్గుళప్రవేశాస్యం గవాం శృఙ్గం ప్రయోజయేత్,
విషమారుతరక్తామ్బుదుష్టాస్యస్యాప్యభాషణే. ౭౦౪

వ్యా. రక్తమును పీల్చుటకైన గోశృంగము (పశువులకొమ్ము) ఎనిమిదియంగుళముల పొడవు కల్గియున్నయెడ హ్రస్వప్రమాణము. పదియంగుళములనిడివియున్నచో మధ్య ప్రమాణము. పండ్రెండు అంగుళప్రమాణ మున్నయెడ ఉత్తమప్రమాణము. అయ్యది నిడివి యెంతయుండునో అంతవరకును రంధ్రము సమప్రమాణముగ నడ్డులేకయుండవలెను. దానిచివరను చర్మము కట్టియుండవలెను. ఆగొట్టము యొక్కద్వారము మూడువ్రేళ్లు ప్రవేశించునంతటివైశాల్యము కల్గియుండవలెను. అట్టిగొట్టమును విషము, వాతము, రక్తము, జలము ఈనాల్గిటిచే నోరు దుష్టమై మాటలాడ సాధ్యముకాకుండునపుడు దుష్టరక్తమును పీల్చుటకై యుపయోగింపనగును.

### శృంగముతో రక్తమోక్షణక్రమము

మూ. గాత్రం బధ్వోపరదృఢం రజ్జ్వాపట్టేనవాససా,
స్నాయు సన్ధ్యస్థి మర్మాణి త్యజన్ ప్రచ్ఛనమాచరేత్. ౭౦౫
అధోదేశప్రవిసృతైః పదైరుపరిగామిభిః,
నగాఢఘనతిర్యగ్భిః నపదే పదమాచరేత్. ౭౦౬

వ్యా. శృంగముచేత రక్తమోక్షము చేయవలసినస్థానమునకు పైభాగమున దారముచేనైనను, గుడ్డపేలికచేనైనను గట్టిగ బిగకట్టి యచ్చట నుండుస్నాయువులను సంధులను అస్థులను మర్మములను వదలి క్రిందినుండి పైకివ్యాపించునట్లు శస్త్రముచే కాటుబెట్టవలెను. అట్టికాటు మిక్కిలి లోతునను అడ్డముగను వ్యాపింపకుండవలెను. మరియు కాటుపై మరియొకకాటు బెట్టదగదు. (అట్టికాటున శృంగమును (కొమ్మును) ఉనిచి దుష్టరక్తమును పీల్చవలెనని భావము)

### రక్తమోక్షణముచేసినవారికిఘృతసేచనము

మూ. స్రుతాసృజః ప్రదేహాద్యైః శీతైస్స్యాద్వాయుకోపతః,
సతోదకణ్డూశోఫస్తం సర్పిషోష్ణేన సేచయేత్. ౭౦౭

వ్యా. పైజెప్పినరీతిగ రక్తమోక్షణముచేసికొనినవానికి శీతములగు ప్రలేపాదుల జేసినచో వాతము ప్రకోపించి పోట్లును దురదయు కల్గినవాపుసంభవించును. కావున రక్తమోక్షణముచేసినవానికి సుఖోష్ణమైననేతిని పూయవలెను.

—॥ ఆమ్లభక్షణనిషేధము ॥—

మూ. సర్వాఙ్గశోఫః క్షీణానాం ఆమ్లభోజనసంభవః,

వ్యా. మరియు రక్తమోక్షణముచే క్షీణదేహులు పులుపుగలపదార్థముల భుజించినచో సర్వాంగమునందును శోఫ సంభవించును.

—॥ రక్తమోక్షణముచేయదగనివారు ॥—

మూ. దుర్నామోదరశోఫార్త గర్భిణీ పాణ్డురోగిణామ్. ౨౦౮
ప్రమేహాణాంచ శ్వయథో ర్నవిస్రావ్యాః కథఞ్చన,

వ్యా. దుర్నామమనురోగముకలవారికిని, ఉదరరోగముకలవారికిని, సర్వాంగశోఫకలవారికిని, గర్భిణీస్త్రీలకును, పాండురోగముకలవారికిని, వాపుతోగూడినప్రమేహరోగులకును రక్తమోక్షణము చేయందగదు.

—॥ శస్త్రాదులకన్న క్షారముప్రశస్తము ॥—

మూ. సర్వశస్త్రానుశస్త్రాణాం క్షారశ్శ్రేష్ఠోబహూనియత్. ౨౦౯
ఛేద్యభేద్యాదికర్మాణి కురుతే విషమేష్వపి,
దుఃఖాపచార్యశస్త్రేషు తేన సిద్ధిమయాత్స్వచ. ౨౧౦
అతికృచ్ఛ్రేషు రోగేషు యచ్ఛపానేపి యుజ్యతే,

వ్యా. ఛేదనభేదనాదికృత్యములకుగాను శస్త్రములును ఉపశస్త్రములును పలువిధముల చెప్పబడినవి. అట్టి శస్త్రోపశస్త్రముల కన్నిటిలో క్షారము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఏల యనః—క్షారము శస్త్రాదిసాధ్యములైన ఛేద్యభేద్యలేఖ్యాదివ్రణాదులయందు ఛేదనభేదనాదికృత్యములను సుఖముగ జేయును. మిక్కిలి కష్టముచేత శస్త్రప్రయోగముచేయదగిన నాసార్శస్సు అర్బుదము మున్నగురోగములయందును, హెచ్చుతగ్గులైనివిషమస్థితినుండుప్రదేశములయందును, శస్త్రప్రయోగముచేతను సాధింప నలవికానివ్రణములయందును, మిక్కిలి ప్రకోపమునొంది కష్టసాధ్యములైనవ్రణాదులయందును క్షారము సుఖముగ నుపయోగింపదగియుండును. క్షారము కేవలము బాహ్యరోగములకేగాక అంతర్గతరోగములయందు పానాదులకును ఉపయోగింపదగియుండును. ఇట్టికారణములచేత క్షారము శస్త్రాదులకన్న మిక్కిలి శ్రేష్ఠతమమైనదియని యెరుంగునది.

—॥ పానలేపనములకు క్షారోపయోగము ॥—

మూ. సపేయోఽర్శోఽగ్ని సాదాశ్మగుల్మోదరగరాదిషు. ౨౧౧
యోజ్యస్స్నాతాన్మషశ్విత్రబాహ్యార్శః కుష్ఠ సుప్తిషు,
భగన్దరాపచి (ర్బుద) గ్రన్థినాడీదుష్టవ్రణాదిషు. ౨౧౨

వ్యా॥ మరియు సాక్షారము అర్శోరోగమునందును, అగ్నిమాంద్యమునందును, అశ్మరిగుల్మము ఉదరము విషము అస్థానము శూల మున్నగురోగములయందును పానము చేయదగినదియగును.

మశకము, శ్విత్రము, బాహ్యార్శస్సు, కుష్ఠము, సుప్తి స్పర్శము తెలియకచర్మము మొద్దుబారియుండుట), భగందరము, అపచి, (అర్బుదము), గ్రంథి, దుష్టములగునాడీ వ్రణములు, వీనియందు లేపనమునకై యుపయోగింపనగును.

పిత్తాదిరోగములయందు క్షారనిషేధము

సు॥ సతూభయేఽపి మోక్తవ్యః, పిత్తే రక్తేచ లేఖనే (బలేఽబలే),
జ్వరేఽతిసారే హృన్మూర్ధరోగే పాణ్డ్వామయేఽరుచౌ. ౭౧౩
తిమిరే కృతసంశుద్ధౌ శ్వయథౌ సర్వగాత్రగే,
భీరుగర్భిణ్యృతుమతీ ప్రోద్వృత్తఫలయోనిషు. ౭౧౪
విషపీతేఽక్షిపాకేచ పీతమద్యే ప్రమేహిణి,
అజీర్ణేఽన్నే శిశౌ వృద్ధే ధమనీ సన్ధిమర్మసు. ౭౧౫
తరుణాస్థి సిరాస్నాయు సేవనీగళనాభిషు,
దేశేఽల్పమాంసేవృషణ మేఢ్రస్రోతో నఖాన్తరే. ౭౧౬
వర్త్మరోగాదృతేఽక్ష్ణోశ్చ శీతవర్షోష్ణదుర్దినే,

వ్యా॥ పిత్తరోగము, రక్తరోగము, బలాధిక్యము, మిక్కిలి బలహీనము, జ్వరము, అతిసారము, హృదయరోగము, శిరోరోగము, పాండురోగము, అరోచకము, తిమిరమను నేత్రరోగము అను నీరోగములయందును; వమనవిరేచనాదిశోధనచికిత్స జేసికొనినప్పుడును, భయస్వభావముకలవాడును, గర్భవతులైనస్త్రీలును, ఋతుమతులైనస్త్రీలును, ప్రోద్వృత్తఫలయోని యను ఉదావృత్తరోగములస్త్రీలును, విషపానముచేసినప్పుడును, అక్షిపాకమను నేత్రరోగమునందును, మద్యపానముచేసినప్పుడును, ప్రమేహరోగమునందును, భుజించినయాహారము జీర్ణముకాకుండునప్పుడును, శిశువులును (బాలురును), వృద్ధులును, ధమనుసంధులు మర్మములు తరుణాస్థిసిరలు స్నాయువులు సేవనులు కంఠము నాభి అను నీశరీరావయవప్రదేశములయందును, స్వల్పముగమాంసముగల స్థలమునందును, వృషణములు మేఢ్రము స్రోతస్సులు అను నీప్రదేశములయందును, గోళ్లనడుమను, అను నీవిషయములయందు పైజెప్పినక్షారమును పానమునకును లేపనమునకునుకూడ నుపయోగింపదగదు. మరియు వర్త్మరోగ మొక్కటిదక్క తక్కిననేత్రరోగములయందును క్షారము నుపయోగింపదగదు. (వర్త్మరోగమునమాత్రము క్షారము నుపయోగింపవచ్చును.) మరియు

శీతకాలమైన హేమంతశిశిరఋతువులయందును, గ్రీష్మకాలమునందును, వర్షర్తువునందును, మేఘములు ఆవరించియుండుసమయములయందును, పైజెప్పినక్షారమును పాసాలేపనముల కుపయోగింపంజనదు.

ఇచ్చట ఉద్ద ౯ ౧త్తఫలయోని అనుదానిలక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"వేగదావర్తనాద్యోనిం ప్రపీడయతిమారుతః, సఫేనిలం రజః కృచ్ఛ్రాత్ ఉదావృత్తం విముఞ్చతి. ఇయం చాపదుదావర్త." వాతము వేగముగ యోనిని పీడించి నురుగుతోగూడియుండుశోణితమును యోనినుండి మిక్కిలి కష్టముచే వెడలించును. ఇయ్యది యుదావర్తమను యోనివ్యాపత్తు అని భావము.

## సర్వకర్మోపయోగ్యక్షారము

మూ. తాలకర్కటికారమ్భా చ త్రాకోర క్తమార్గషః,              ౭౧౭
తిలకాణ్డాశ్చ తత్క్షారే సిద్ధే క్షారపలం క్షిపేత్,
సముద్రశుక్తేః క్షారంచ క్షారోఽయం సర్వకర్మసు.              ౭౧౮

వ్యా. తాటియాకులు, దోసచెట్టు, అరటి, పుట్టక్రోవు (కొక్కులు), ఎఱ్ఱనితోటకూర, నువ్వులచెట్లకాడలు వీనినన్నిటిని క్షారపాకవిధిప్రకారము పక్వముచేసి, అందు సముద్రమునసుండుముత్తెపుచిప్పలక్షారము నొకపలముచేర్చి క్షారపక్వముచేసిన యియ్యది క్షారకర్మల కన్నిటికిని యుపయోగింపదగియుండును.

## క్షారపాకప్రక్రియ

మూ. సాగరశుక్తిపలాశ ద్వాత్రింశత్పలికభసిత ముష్ణేన, ప్రక్షాళ్యాస కృదూషరమర్యావశేషపక్వేన, అర్ధాధకేన పక్త్వా చతుష్పలైశ్శంఖనాభిభస్మైశ్చ.              ౭౧౯

తస్మిన్ దర్వీపాకే సబుద్బుదస్నృతే భవేత్క్షారః, ద్రోణం పలాశకదళీఖరమఞ్జరీణాం క్షారస్య షడ్భిరహిమైరుదకార్మకైశ్చ, తావత్పచేద్భవతి భస్మజహీసుమం వసత్పిచ్ఛమచ్ఛమపరం పరిగృహ్యయత్నాత్.              ౭౨౦

క్షారేణ కమ్బలికయాపటశాటికైర్వా తత్రాచలం సితమనుస్రుతమాదరేణ, మత్తస్య శఙ్ఖశకలస్య పలాన్యథాష్టౌ క్షిప్త్వాత్ర భస్మపయసా పరిపిష్టకల్కైః.              ౭౨౧

దన్తీద్రవన్త్యతివిషాఖిలకాలమూలకజ్కుష్ఠరామఠవచాచిరిబిల్వ

పత్రైః, సస్వర్జికా జ్వాలనలాఙ్గలికాహ్వామూలై రర్ధార్ధపాలికమితై రపి సార్ధమేభిః. ౭౨

సంసాధ్య తత్ర భిషజా స తథా విపక్వః క్షారోదయో భవతి నైవ తనుర్నసాన్ద్రో, తేనైకవిద్ధవిధినాన పునర్భవన్తి దుష్టారుజోన్నృష నగా ఇవ వజ్రదగ్ధాః. ౭౩

వ్యా. సముద్రములోని అలుచిప్పలభస్మము మోదుగుకట్టెకాల్చినబూడిదె వీనిని 32 పలములు తీసి మద్యములో చవుడుకలిపి వెచ్చబెట్టి దానితో ననేకసార్లు తడిపి వడ గట్టి యామద్యము నొకఆర్ధాఢకమును పాకముచేయుచు నందు నాల్గుపలములు శంఖనాభి కాల్చినభస్మమును కలిపి గరిటె కంటుకొనునంత చిక్కగా నగువఱకు పాకముచేసి బుడగలు వచ్చుచుండగా తీసిన నిది యొకవిధమగుక్షార మగును.

*మోదుగుక్షారము, అరటిక్షారము, ఉత్తరేణిక్షారము వీనిని కలిపి ద్రోణముంచి అందు వేడినీరు ఆరుఅర్మణములుచేర్చి అది యెఱ్ఱగా నగువరకు వండవలెను. అటుపిమ్మట జిగురుగలిగి తేటగానుండు నద్దానినితీసి కంబళిగుడ్డతోగాని చక్కనినూలుగుడ్డతోగాని దానిని వడకట్టి యాక్షారరసములో కొంతతీసి యందు కాల్చినశంఖపుముక్కలు 8 పల ములుపడవేసి యాభస్మోదకముతోనేనూరి యదియు, పిన్ననేపాళము, పెద్దనేపాళము వీని వేళ్లు, అతివస, ఎఱ్ఱచిత్రమూలము, కంకుష్ఠము, ఇంగువ, వస, చిరిబిల్వముఆకులు, గుగ్గి లము, తెల్లచిత్రమూలము, పాత్తిగడ్డ వీనిని ప్రత్యేకము అరపలముచొప్పున దానిలో కలిపి తిరిగి చక్కగా వెనుకటివిధముగా దర్వీప్రలేపము కలుగువరకువండి ఎక్కువ గట్టి పడనివ్వక తీసిన నిది యొకక్షారమగును. ఈక్షారముచే నేరోగమునకు చికిత్సించినను తిరిగి రోగముపుట్టదు. ఎట్లనగా నింద్రునివజ్రమనదగు పిడుగుపడిచో చెట్లు ఎట్లుతిరిగి అంకు రింపవో అటులనే అని తెలియవలెను.

## క్షారమును ప్రయోగించువిధానము

మూ. క్షారసాధ్యే గదేచ్ఛిన్నే లిఖితే స్రావితే తథా,
క్షారం శలాకయా దత్త్వా ప్లోతప్రావృతదేహయా,
మాత్రాశతముపేక్షేత క్షారకర్మవిచక్షణః,
వర్త్మరోగేషు నిర్భుజ్య వర్త్మనీ పిచునాపునః. ౭౪
మధూచ్ఛిష్టేన వాచ్ఛాద్యకృష్ణభాగం వినిక్షిపేత్,

*క్షార మనగా బూడిదెనునీటిలో కలిపి అనేకసారులు డోలాయంత్రములో వడ గట్టిననీరు.

పద్మపత్ర తనుక్షారలేపో ఘ్రాణేఽర్బుదాదిషు. ౨౨౫
ప్రత్యాదిత్యం నిషణ్ణస్య సమున్నమ్యాస్య నాసికామ్,
మాత్రాశ్శతమ్యాత్వఞ్చాశత్ తద్వారర్శసికర్ణజే. ౨౨౬
పిచుభిష్పాణినాచాత్ర ద్వారం ప్రచ్ఛాద్యవాక్షతమ్,

వ్యా. క్షారప్రయోగముచే సాధింపదగిన అర్శస్సు అర్బుదము మున్నగురోగముల యందు అట్టి అరోగ్యంకురములు మున్నగువానిని ఛేదనలేఖనముల జేసినపుడును రక్తమోక్షణము చేసినపుడును సన్నకుకు గుడ్డపేలికనుజుట్టి అట్టివ్రణమున క్షారము(పైజెప్పినశలాకచే) నుంచవలెను. పిదప నూరు అక్షరముల నుచ్చరించునంతకాల మూరకుండవలెను. ఇది సామాన్యముగ క్షారప్రయోగవిధి.

మరియు క్షారసాధ్యములగువర్త్మ (కనురెప్పల)రోగములయందు కనురెప్పల పెలికిల దీసి నల్లగ్రుడ్డును ప్రత్తిచేనైనను, తేనెమైనముచేనైనను మూసి అందు తగలనీయక కనురెప్పలయందుమాత్రము క్షారమును శలాకముచే నుంచవలెను. మరియు వర్త్మములయందుపయోగించుక్షారము తామరపువ్వులంత పలుచగనుండవలెనుగాని అంతకన్న దళముగ నుండకూడదు. నాసికార్బుదము మున్నగురోగములయందును తామరపువ్వురేకంతపలుచగనుండునట్లు క్షారమును ప్రయోగింపవలెను. మరియు నాసికార్బుదరోగములయందు రోగిని సూర్యున కభిముఖముగ కూర్చుండబెట్టి నాసికాగ్రమును పైకెత్తి క్షారమును నునిచి యేబదిమాత్రలకాలము ధరించవలెను. (కన్నులుమాత్రము మిక్కిలి సుకుమారములైనవి కావున స్వల్పమాత్రాకాలమే కన్నులలో ధరించవలెను.) మరియు చెవులలో సంభవించు అర్శోరోగమునందును పైజెప్పినరీతిగనే క్షారమును ప్రయోగింపనగును. కర్ణార్శస్సున చెవిరంధ్రమును(క్షారము చెవిరంధ్రములో చొరనీయక) మూసి ప్రయోగింపనగును.

## క్షారప్రమార్జనాద్యుపచారములు

మూ. క్షారం ప్రమార్జనేనానుపరిమృజ్యావగమ్యచ. ౨౨౭
సుదగ్ధం ఘృతమధ్వక్తం తత్ప్రయోమస్తుకాఞ్జికైః,
నిర్వాపయేత్తదాసాజ్యైః స్వాదుశీతైః ప్రలేపయేత్. ౨౨౮
అభిష్యన్దీనిభోజ్యాని యోజ్యాని క్లేదనాని (య) చ,
యదిచ స్థిరమూలత్వాత్ క్షారదగ్ధం నశీర్యతే. ౨౨౯
ధాన్యామ్లబీజయష్ట్యాహ్వాతిలైరాలేపయేత్తతః,
శోధనాని ప్రలేపాశ్చ కషాయాస్తైలవర్తయః. ౨౩౦
ప్రణాధికారే యచ్చోక్తం తచ్చాత్రాపి నియోజయేత్,

వ్యా. పైజెప్పినరీతిగ క్షారమును ప్రయోగించి నియమితమైనమాత్రకాలము నిరీక్షించి పిదప వస్త్రము మొదలగువానిచే క్షారముఁ దుడిచి క్షారము చక్కఁగ పనిచేసినదా? లేదాయని చక్కఁగ గమనించి క్షారముచే చక్కఁగ దగ్ధమైనస్థలమున తేనెను నేతిని కలిపి పూసి, పాలచేనైనను పెరుగుమీఁది తేటచేనైనను కాంజికముచేనైననుకడిగి మధురంబులును చల్లనివియునైనవస్తువులను నేతిలోఁ కలిపి పూయవలెను. క్షారవిధి జేసినపిదప కఫమును వృద్ధి నొందించునవియును నగుమినుములు పెరుగు మున్నగునన్నపానాదులను క్షారముచే దగ్ధమైన స్థానము శిథిలమగుటకై యుపయోగించవలెను.

మరియును క్షారముచే దగ్ధమైనస్థానము రోగము దృఢమైనమూలము కల్గియుండుటవలన శిథిలము(పైజెప్పినయాహారాదులచే)కాకుండునెడ రోగముకల్గినస్థలమున ధాన్యామ్ల బీజము (పులిసినయన్నము), అతిమధురము, నువ్వులు ఈమూఁటిని నూరి లేపనముచేయ నగును.

మరియును వ్రణాధికారమునజెప్పిన వ్రణశోధనములైన ప్రలేపములును, కషాయములును, వర్తులును మున్నగునవి యుపయోగింపనగును.

## క్షారసమ్యగ్దగ్ధాదిలక్షణములు

మూ. యథామృదుసమస్పర్శం పక్వజామ్బవసన్నిభామ్. ౭౩౧
ఈషత్ స్ఫుటితతామ్రాగ్రం సమ్యగ్దగ్ధం తదావదేత్,
విపర్యయేతు దుర్దగ్ధం కణ్డూజాడ్యాదిభిస్తథా. ౭౩౨
క్షారః తత్ర పునఃపాత్యః; శోఫజ్వరవిసర్పకైః,
దాహరాగశిరోరోగపాకరక్తాతివిస్రవైః. ౭౩౩
ఊష్మణా మూర్ఛయా చాపి దగ్ధమత్యర్థమాదిశేత్,

వ్యా. క్షారమును ప్రయోగించినస్థలమున మృదువై సమస్థితినుండి చక్కఁగ పండిన నేరేడుపండువంటిరంగుకల్గి కొంచెము చిట్లినట్లు చీలికలుకల్గి కొసయందు తామ్రవర్ణము కల్గియున్నచో నయ్యది క్షారముచే చక్కఁగ దగ్ధమైన(కాలువబడిన)దని యెఱుంగునది. పైజెప్పినలక్షణములకు విరుద్ధముసుండి దురద, మొద్దుబారియుండుట మున్నగులక్షణములు కానవచ్చినచో బాగుగ దగ్ధముకాలేదని యెఱుంగునది. అట్టియెడ మరల క్షారమును ప్రయోగింపనగును.

మరియును క్షారమును ప్రయోగించినపుడు ఆస్థలమున వాపును, జ్వరంబును, విసర్పంబును, అధికముగమంటయును, ఎరుపురంగును, తలనొప్పియును, పుండును, అధికముగ రక్త

స్రావంబును అవిరివచ్చునట్లు ఉష్ణంబును, మూర్ఛయుకల్గినచో క్షారముచే మిక్కిలి కాలిన దని (అతిదగ్ధమని) యెఱుంగునది.

## నాసాదిఇంద్రియములయతిదగ్ధలక్షణములు

మూ. గుదే విశేషాద్విణ్మూత్రసంరోధాతి ప్రవర్తనమ్. 234
పుంస్త్వోపఘాతో మృత్యుర్వాగుదస్య సదనాద్ధ్రువమ్,
నాసాయాంనాసికా వంశదరణా కుఞ్చనోద్భవః. 235
భవేచ్చ విషయాజ్ఞానం తద్వత్ శ్రోత్రాదికేష్వపి,

వ్యా. క్షారముచే గుదస్థానము విశేష(అధిక)ముగ దగ్ధమైనచో మలమూత్రములు వెడలకుండును. లేక ఒకప్పుడు మలమూత్రము లధికముగ వెడలును. పురుషత్వము (వీర్యము)నష్టమగును. గుదము అధికముగ చీలి దానంజేసి మరణముకూడ సంభవించును.

మరియు క్షారముచే నాసిక అతిదగ్ధమైనచో ముక్కుదూలము పగులును. ముక్కు ముడుచుకొనును. ముక్కునకు వాసనను గ్రహించుశక్తి చెడిపోవును. ఇట్లేయెఱుంగునవే చెవులు మున్నగునింద్రియములు యధికముగ దగ్ధములైనపుడు ఆయాయింద్రియవ్యాపారముల నుడిగి చెడిపోవును.

## క్షారాతిదగ్ధోపచారములు

మూ. జ్వరాతిసారమూర్ఛా_ర్తిర్వమనం క్షారవిభ్రమే. 236
పాయయేదతివేగే (యోగే) తుతంచ శీఘ్రం ఘృతం దధి,
సగుడం వా దధిరసం తైలం వా ససితోపలమ్. 232
స్వరసస్య కపిత్థామ్లాద్దాడిమామలకా_త్తథా,
ద్వౌప్రస్థౌసర్పిషః ప్రస్థం పచేత్ క్షారా_ర్తినుత్ ఘృతమ్. 238

వ్యా. క్షారము యథోక్తముగకాక వ్యస్తముగ పనిచేసినచో జ్వరము, అతిసారము, మూర్ఛ, పోటు మున్నగుబాధ, వమనము మున్నగునుపద్రవములు సంభవించును. అట్టి పైజెప్పిన అతిదగ్ధమునందు అతిశీఘ్రముగ పెరుగును నేతిని కలిపి త్రాగించవలెను. లేక బెల్లమును పెరుగులో కలిపి త్రాగించవలెను. మాంసరసమునైనను, పంచదారతో కూడిన తైలమునైనను త్రాగించవలెను. మరియు వెలగపులుసును, దానిమ్మపులుసును, ఉసిరికకాయల పులుసును రెండేసిప్రస్థములును, నెయ్యి యొకప్రస్థమును కలిపి ఘృతపాకవిధి ననుసరించి పక్వముచేసి యాఘృతమును సేవించినచో క్షారాతియోగమున గల్గినయుపద్రవములు శాంతినొందును.

### క్షారవిధిచేరక్తాతిస్రావమునకుపచారములు

మూ. శోణితే నాతివృత్తేతు బాహ్యేన్త్వాగ్ని సిరావిధిః,
అతిప్రవృత్తం పూర్వోక్తై రాశునిర్వాపయేన్మహుః. 239
వాతపిత్తహరాశ్చేష్టాః సర్వాశ్చ శిశిరాః క్రియాః,
అతోఽధిక ప్రమాణం యః తద్దాహ్యేవసకృద్ధహేత్. 240
యానం పానం దివాస్వప్నం గుర్వాన్నమతిభోజనమ్,
వ్యాయామం కలహం చైవ కృతక్షారవిధిస్త్యజేత్. 241

వ్యా. క్షారముచే రక్తము విశేషముగ స్రవించునెడ సిరావ్యధనమునందు రక్తాతియోగమునకు జెప్పినయుపచారములను, అగ్నితాపంబును చేయునది. అంతట నిలువక మిక్కుటముగ రక్తము స్రవించునెడ పైజెప్పినఘృతము మస్తు అరనాళము మున్నగువానిచే నుపచరించి నిలుపనగును. వాతపిత్తహరంబులును, పలుదెరంగులైన శిశిరోపచారంబులు నన్నియు మిక్కిలి హితకరములు. అంతట నిలువక మిక్కిలి రక్తము స్రవించునెడ సిరావిధియందు చెప్పినరీతిగ పలుమారు అగ్నిచే (దహింపదగినస్థలముల)పలుమారు దహించునది.

మరియు గుఱ్ఱములు మున్నగువానిపై సవారిచేయుట, కల్లు సారాయి మున్నగు వానిని త్రాగుట, పగలు నిదురించుట, గురుత్వముచేయునాహారముల భుజించుట, మితిమీరి భుజించుట, దేహమునకు శ్రమమును కల్గించుపనులజేయుట, కలహమాడుట వీని నన్నిటిని క్షారకర్మ జేసికొనినవాడు విసర్జింపవలెను.

### క్షారకర్మజ్ఞానావశ్యకత - దానిప్రాశస్త్యము

మూ. విషాగ్నిశస్త్రాశనిమృత్యుకల్పఃక్షారోభవత్యల్పమతిప్రయుక్తః,
సఏవ సమ్యఙ్మతిమత్ప్రయుక్తఃరోగాన్నిహన్యాదచిరేణఘోరాన్.

ఇతిక్షారవిధిః.

వ్యా. తెలివితక్కువయగువైద్యుడు విధానంబును అనుభవజ్ఞానంబును తెలియక క్షారము నుపయోగించినచో నయ్యది విషమును అగ్నిని శస్త్రమును మృత్యువునుబోలి ప్రాణహరంబై యుండును. అట్టిక్షారమే విధానము అనుభవమును చక్కగ తెలిసి దేశకాల దోషదూష్యాదుల చక్కగ నెఱింగిన వైద్యవరునిచే ప్రయోగింపబడినచో మిక్కిలి క్రూరతరములగురోగముల నన్నింటిని అతిశీఘ్రముగ రూపుమాపి యమృతతుల్యమై యారోగ్యము నొనగూర్చును. (కావున క్షారమును మిక్కిలి జాగరూకుడై యుపయోగింపవలె ననుట).

### అగ్నికర్మ, దాని శ్రేష్ఠత్వము

మూ. అగ్నిః క్షారాదపి శ్రేష్ఠః తద్దగ్ధానామసంభవాత్,
భేషజక్షారశస్త్రైశ్చ న సిద్ధానాం ప్రసాధనాత్. ౨౮౩

వ్యా. అగ్నికర్మ క్షారప్రయోగమునకన్న మిగుల శ్రేష్ఠము, ఏలన:—నిప్పుచే కాల్చబడినఅర్శస్సు మొదలగురోగములు మరల నొకప్పుడును జనింపవు. మరియు ఔషధముచేతను క్షారములప్రయోగించుటచేతను శస్త్రములచే ఛేదనాదికృత్యములుచేసినను శమించకుండురోగములు అగ్నికర్మ (నిప్పునకాల్చుట)చే శాంతినొందును; కావున నీరెండు కారణములచే నగ్నికర్మ మిగుల శ్రేష్ఠమైనది.

### అగ్నికర్మను చేయదగినస్థానములు

మూ. త్వచిమాంసే సిరాస్నాయు సన్ధ్యస్థిషు సయుజ్యతే,

వ్యా. చర్మమునందును, మాంసమునందును, సిరలయందును, స్నాయువులయందును సంధుల (కీళ్ల) యందును, అస్థులయందును అగ్నికర్మను జేయందగును.

### చర్మమునందును మాంసమునందును అగ్నిదాహము చేయుక్రమము

మూ. భ్రూశిరశ్శంఖమూర్ధరోగేషు అభిష్యన్దవిమన్థయోః. ౨౮౪
అజగ్లానౌ చర్మకీలేమషకే తిలకాలకే,
సంస్తమ్భే సరుజేవాఙ్గే శస్త్రశ్శరశలాకయా. ౨౮౫
పిప్పల్యజాశకృత్సూర్యకాన్తగోదన్తవర్తిభిః,
త్వగ్దాహో గణ్డమాలాయాం అన్త్రవృద్ధౌ తథార్బుదే. ౨౮౬
అర్శోభగన్దరగ్రన్థి దుష్టనాడీవ్రణేషుతు,
పూయాలసేఽవ గాఢేచ వ్రణే సూచీ శలాకయా. ౨౮౭
జామ్బవౌష్ఠమధూచ్ఛిష్ట మధుస్నేహవసాగుడైః,
హేమాయస్తామ్రరజత కంస్యైర్మాంసే దహేద్భిషక్. ౨౮౮

వ్యా. కనుబొమలయందును, కణతలయందు శిరమునందును కల్గినరోగములయందును, అభిష్యన్దమను నేత్రరోగములయందును, విమన్థమనురోగమునందును, అవయవములు బడలినప్పుడును, చర్మకీలము మషము తిలకాలకము అనుచర్మగతరోగములయందును, స్తంభించి నొప్పితోగూడియుండు అవయవమునందును, ఈరోగము లన్నిటియందును బాణమువలె నుండుశలాకచేనైనను, పిప్పలికొమ్ము మేకపెంటిక ఈరెంటిచేనైనను, సూర్యకాంతము గోదంతము వత్తి మున్నగువానిచేనైనను అగ్నికర్మను చర్మముపై జేయవలెను.

(పైజెప్పిన శరశలాకాదులను నిప్పున విద్యుక్తముగ కాల్చి కనుబొమలు మున్నగుస్థలముల యందు జనించినరోగములయందు చర్మముపైన కాల్చవలెనని భావము).

మరియు గండమాల, ఆంత్రవృద్ధి, అర్బుదము, అర్శోరోగము, భగందరము, గ్రంథి, దుష్టములగునాడీవ్రణములు, పూయాలసము, అవగాఢ (మిక్కిలి లోతుగాబుట్టిన) వ్రణములు ఈవ్రణరోగములన్నిటియందును, సూదులచేనైననుశలాకములచేనైనను, జాంబవౌష్ఠమనుశలాకుచేనైనను మైనము, తేనె, స్నేహద్రవ్యము, వస, బెల్లము అనువీని కాల్చియైనను, బంగరు ఇనుము రాగి వెండి కంచు అనువీలోహములచేనైనను మాంసము నందు కాల్చవలెను.

సిరాదులయందగ్నికర్మచేయువిధానము

మూ॥ శ్లిష్టవర్త్మన్యసృక్స్రావే...వద న్తనాడ్యుపపక్ష్మసు,
నీల్యసమ్యగ్వ్యధేచ్ఛిన్నే సన్ధిఃస్నాయుసిరాస్థిసీ. ౭౪౯
లగణేచ సిరాదీనాం దాహే మాంసోదితైర్హితః,

వ్యా॥ శ్లిష్టవర్త్మము, అసృక్స్రావము అనునేత్రరోగములయందును, దంతనాడి యను దంతరోగమునందును, ఉపపక్ష్మమను నేత్రరోగమునందును, నీలికమను రోగము నందును, సిరావ్యధనముచేయునప్పుడు సిరావ్యధమున అసమ్యగ్యోగముకల్గినప్పుడును, సిరచ్ఛిన్నమైనపుడును పైజెప్పిన (మాంసదాహమునకుజెప్పిన) మైనము మున్నగువానిచేతను శలాకలచేతను సిరాదాహము చేయవలెను. మరియు సిరలు, సంధులు, స్నాయువులు, సిరలు, అస్థులు వీనినిగూడ పైజెప్పినజాంబవౌష్ఠాదులచేతనే అగ్నికర్మ చేయదగును.

అగ్నికర్మకనర్హులు

మూ॥ నదహేద్గ్రీష్మశరదోః అన్యేద్వాక్షారవారితాన్. ౭౫౦
అన్తశ్శల్యాసృజోభిన్నకోష్ఠాన్ భూరివ్రణాతురాన్,

వ్యా॥ ఎండకాలమునందును శరత్కాలమునందును అగ్నికర్మ చేయుంజనదు. మరియు క్షారకర్మకు నిషేధింపబడినవారందరును అగ్నికర్మకు తగరు. మరియు లోపల శల్యముకల వారును, భిన్నమైనకోష్ఠముకలవారును, వ్రణములచే మిక్కిలి పీడింపబడినవారును అగ్ని దాహమునకు అర్హులుకారు. (అగ్నికర్మయనగ శలాకాదులను నిప్పున కాల్చి రోగముకల్గిన చోట వానిచే రత్తువేయుట యని భావము).

పిత్తప్రకృతిగలవాని కగ్నికర్మచేయువిధానము

మూ॥ పైత్తికం వాత్యయాయుక్తే విహితోష్ణప్రతిక్రియమ్. ౭౫౧

పిచ్ఛిలాశేంచ విదహేత్ ...................

వ్యా. మరియు పిత్తప్రకృతికలవానికి ఉష్ణమునకు దగిన ప్రసిక్రియనేమి మాట పైజెప్పిననిషిద్ధకాలమునందును అగ్నికర్మ చేయదగును. పిచ్ఛిలమైనవ్రణాదులయందును అగ్నికర్మ చేయదగును.

రక్ష వేయుపద్ధతి

మూ. .........అథ దాహార్హమాతురమ్,
ప్రాక్ఛిరశ్శాయినం స్నిగ్ధైః ప్రబలైరవలమ్బితైః (తమ్) 2౫౨
చామ్బవోష్ఠాదిభిస్తప్తైః దీప్తాగ్నిసదృశప్రభైః,
అర్ధేన్దు బిన్దువలయస్వస్తికప్రతిసారణైః 2౫3
సరేఖాష్టాపదైర్వ్యాధిస్థానానుగుణకల్పనైః,
విదిహేద్భిషగాసమ్యగ్దాహాలక్షణసమ్భవాత్. 2౫౪

వ్యా. రక్ష వేయవలసినరోగిని తూర్పుప్రక్క తలయుండునట్లు పరుండబెట్టి వానికి స్నేహితులును బలశాలురు నగువారు కదలనీయక రోగిని పట్టుకొనియుండ నియమించి, వ్యాధి రక్ష వేయవలసినస్థానము మున్నగువాని కనుగుణముగ అర్ధచంద్రాకారముగనైనను బిందురూపముగనైన గుండ్రముగనైనను స్వస్తికాకారము(+)గనైన రక్ష వేయవలసిన స్థానమున గుర్తుకై రేఖల నిర్మించి, పిదప జాంబకాష్ఠము మున్నగుశలాకలను నిప్పువలె నెఱ్ఱనగునట్లు కాల్చి వానిచేత పైగుర్తుబెట్టినస్థలమున రక్ష వేయునది. ఇత్తెఱంగున చక్కగ కాలినచిహ్నములు కనిపించునంతవఱకును కాల్పవలెను.

సమ్యగ్దలక్షణములు దాహానంతరకృత్యములు

మూ. వాతోపహితకైర్వ్యక్త్యైః అద్భిశ్చాసిఞ్చయేన్ముహుః,
త్వగ్దాహేశబ్దదుర్గన్ధత్వక్సఙ్కోచ సముద్భవైః. 2౫౫
మాంసదాహేఽల్పశోఫార్తి శుష్కసఙ్కుచితో వ్రణః,
కపోతవర్ణతా చాత్ర, సమ్యగ్దగ్ధే ప్రయోజయేత్. 2౫౬
స్నిగ్ధశీతైస్తు గాక్షీరరక్తచన్దనగైరికైః,
లేపస్సాజ్యామృతైరూర్ధ్వం పిత్తవిద్రధివత్క్రియా. 2౫2
ఇతిపరహితే కాయచికిత్సాసూత్రాధికారః.

వ్యా. పైజెప్పినరీతిగ రతులు వేయునపుడు రోగికి బాధతెలియకుండుటకై వానికి వినుటకు మనసు కింపైనమాటలు చెప్పుచు వానిపై పలుమారు చల్లనినీళ్లు చల్లుచునుండవలెను. మరియు చర్మమున కాల్చునప్పుడు చుయ్యనుశబ్దము పుట్టును. ఇంపుగాని (కమురు) వాసన కల్గును. చర్మము ముడుచుకొనును. ఇట్టిలక్షణములబట్టి చర్మము బాగుగ కాలినదని యెఱుంగునది. మాంసదాహమునందు కొద్దిగ వాపుకల్గును. బాధ అధికముగనుండును. వ్రణము శుష్కించి ముడుచుకొనియుండును. పావురమువలె తెల్లనిరంగుకల్గియుండును. ఇవియే సమ్యగ్దగ్ధ (చక్కగకాలిన) లక్షణములు. అట్టి సమ్యగ్దగ్ధలక్షణములు కానవచ్చిన పిదప స్నిగ్ధంబును శీతంబునైన రక్తచందనమును గైరికమును (కావిరాయిని) నేతితో మెత్తగనూరి రతివేసినస్థలమున పూయవలెను. పిమ్మట పిత్తవిద్రధివలె నుపచారాదుల నాచరించవలెను.

ఇత్తెఱంగున కాయచికిత్సకుసంబంధించినసూత్రాధికారము సమాప్తము.



# పరహితసంహిత

## సర్వరోగసామదాయికప్రాయశ్చిత్తాధికారః, పఞ్చమోఽధికారః



మూ. అథ కర్మక్షయోపాయః హేతువ్యాధివిపర్యయౌ,
క్లేశాసహత్వాత్తత్రాద్యే గాందద్యాద్వ్యాధికర్శితః. ౧
ఏకాం కృచ్ఛ్రేఽతి కృచ్ఛ్రే ద్వేతిస్రశ్చాన్ద్రాయణేకృతే,
గవామలాభేనిష్కం వా స్యాచ్ఛకృచ్ఛ్రాతికృచ్ఛ్రకే. ౨
జపేద్వాఽపి (తత్సూక్తం) కూశ్మాణ్డగణహోమకృత్,
సర్వపాపప్రణుత్త్యర్థం; అయం వ్యాధి విపర్యయః. 3

వ్యా. పిమ్మట పాపకర్మక్షీణించుటకు దగినయుపాయము చెప్పబడును:—అట్టి యుపాయము హేతువిపర్యయమనియు, వ్యాధివిపర్యయమనియు రెండువిధములు. (హేతువిపర్యయమన:—వ్యాధిని పుట్టించునట్టి కారణమగు పూర్వపాపమునకు విరుద్ధమయినది. వ్యాధులకు నేరుగ విరుద్ధమైనది రోగవిపర్యయము.) వ్యాధులచే గల్గిన క్లేశము నోర్చుటకుకష్టము కావున అట్టియుపాయముల నాచరించుటకు ముఖ్యమైనది. అందు వ్యాధిపీడితుడు హేతువిపర్యయమునకై కృచ్ఛ్రవ్రతమును జేసినచో నొకగోవును దానము చేయవలెను. అతికృచ్ఛ్రమును చేసినచో రెండుగోవుల దానముచేయనగును. చాంద్రాయణ వ్రతమును జేసినచో మూడుగోవులను దానముచేయవలెను. (అనగా నట్టికృచ్ఛ్రాదులు చేయలేనివాడు గోదానము చేయవలెననిభావము) అట్టిగోవులులేనియెడ ఒకగోవుకు ఒక నిష్కము (నిష్కమనగా ఒకకాసు)వంతున ప్రత్యామ్నాయముగ దానముచేయవలెను. ఇది హేతువిపర్యయమైనయుపాయము. మరియు అట్టిదిచేయలేనివాడు గోవుతోకను పట్టుకొని)గోసూక్తమును జపించి కూశ్మాండగణహోమముల జేసినచో నానావిధపాపము లును శాంతినొందును. ఇదియును హేతువిపర్యయమగును. వ్యాధి విపర్యయమైనయుపాయము ఈక్రిందవిపులముగ రోగప్రతిరూపదానము హోమములు మున్నగునవి చెప్పబడును:—

### ఆరోగ్యమునకు సూర్యోపాసనక్రమము

మూ. ప్రతిమాద్విప్రకారాధిదేవతాదేవతాత్మికా,
ఆదౌతు దేవతా తత్ర తతః పూజ్యాధిదేవతా. ౪

ప్రాయేణ సూర్యస్సర్వేషాం రోగాణా మధిదేవతా,
ఆరోగ్యం భాస్కరాదిచ్ఛే దితి భూత్యాహిచ స్మృతిః. ౫
హేమ్నః పలం తదర్ధం వా తదర్ధం తేన కల్పయేత్,
సూర్యం ద్విలోచనం పద్మే ద్వే దధానం కరద్వయే. ౬
షోడశద్వాదశాష్టౌ వాహస్తాస్తైర్మణ్డలే కృతే,
ద్వాదశేనోత్తరప్రాచ్యాం హస్తోచ్ఛ్రాయాంచ వేదికామ్. ౭

వ్యా॥ ఉపాస్యమైనదేవత అధిదేవతయనియు దేవతయనియు రెండు తెఱంగులు. అట్టిదేవత కధిష్ఠానరూపమైన ప్రతిమలును దేవతాప్రతిమయనియు అధిదేవతాప్రతిమ యనియు రెండువిధములైయుండును. అందు తొలుత ప్రధానదేవతను పూజించి పిదప నధిదేవతను పూజింపదగును. రోగాదులు సంభవించినపుడు అయ్యవి నివర్తించి యారోగ్యముచేకూరుటకై సూర్యుని ఉపాసించవలెను. ఈవిషయమును "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను స్మృతివాక్యము చాటుచున్నది. (కావున నారోగ్యము నభిలషించువారు సూర్యు నుపాసింపవలెను.) అట్టియుపాసనమునకు కావలసినప్రతిమను ఒక పలము, అరపలము, లేక కాల్పలమైనపరిమితికలబంగరుతో రవిప్రతిమను నిర్మించవలెను. అట్టి సూర్యప్రతిమకన్నులును రెండుకమలములతోగూడిన రెండుచేతులును కల్గియుండ వలెను. మరియు పదునారుచేతులైనను, లేక పన్రెండుచేతులైనను, లేక యెనిమిదిచేతులైనను ఆప్రతిమకు కల్గియుండవలెను. అట్టి సూర్యప్రతిమను పైజెప్పినపరిమితిప్రకారము బంగరుచే నిర్మించి యింటిలో నుత్తరమునకును తూర్పునకును నడుమనుండు నీశాన్యదిశ యందు ఒకపన్రెండుమూరలవిస్తీర్ణ ముండునట్లు మండలమును నిర్మింపవలెను. ఆమండల మున వాయుదిశయందు ఒకమూరెడుఎత్తు కల్గియుండునట్లు ఒకవేదికను నిర్మింపవలెను.

### ఆచార్యవరణము

మూ॥ బ్రాహ్మణం వేదశాస్త్రజ్ఞం దాన్తం శాన్తం కుటుమ్బినం,
సత్యసన్ధం సదాచారం యువానం కరుణామృదుమ్. ౮
దరిద్రం మన్త్రతన్త్రజ్ఞం నివృత్తంచ పరిగ్రహాత్,
ఆచార్యం వృణుయాద్భక్త్యా నమస్సత్కారపూర్వకమ్. ౯

వ్యా॥ వేదశాస్త్రములు చక్కగ దెలిసినవాడును, బాహ్యేంద్రియములను అంతరింద్రియములను నిగ్రహించినవాడును, దారపుత్రాదికుటుంబముకలవాడును, సత్యముపల్కు స్వభావముకలవాడును, మంచియాచారములుకలవాడును, దయచే మృదువైనమనస్సుకల వాడును, దరిద్రుడును, మంత్రతంత్రముల జక్కగ దెలిసినవాడును, దుర్దానములలీయ

కుండువాడునునగు సద్బ్రాహ్మణుని మిక్కిలిభక్తి కలవాడై నమస్కారపూర్వకముగ పూజాదివిధుల సత్కరించి తా జేయదలచినశాంతికర్మకుగాను(కృత్యముల నెరవేర్చుటకై) ఆచార్యునిగ వరించవలెను.

బలిదానము

మూ. కృతోపవాసస్తాం రాత్రౌ ప్రతిమామధివాస్యసః,
అర్ధరాత్రౌ యుతో విప్రైః చతుర్భిర్మణ్డలాద్బహిః. ౧౦
ప్రాచ్యాం పాయసమాంసాదిబలిం నిక్షిప్య మన్త్రితః,
"ఆదిత్యాబుభవోరుద్రాః దేవభూతాని పన్నగాః. ౧౧
బలినానేన దత్తేన శాన్తిం కుర్వన్తు సర్వశః,"
జాగృయాత్ ...............

వ్యా. పైజెప్పినరీతిగ నాచార్యుని వరించి నాటిదిన ముపవాసముచేసి సూర్యప్రతిమను ధాన్యము మున్నగువానియం దధివాసముచేయించి, అర్ధరాత్రికాలమందు నల్గురు బ్రాహ్మణులతోగూడి, మండలమునకు బైట తూర్పుదిక్కునపాయసము మాంసము మున్నగు వానిని "ఆదిత్యాబుభవో—సర్వశః" అనుమంత్రము నుచ్చరించుచు బలినుంచి, నాటి రాత్రి జాగరముండునది.(ద్వాదశాదిత్యులును దేవతలును ఏకాదశరుద్రులును పృథివ్యాది పంచభూతములును పన్నగంబులును వీరందరును నాయొసంగు నీబలిదానముచేత తృప్తినొంది శాంతిని కల్గింతురుకాక యని మంత్రమున కర్థము.)

సూర్యాదిపూజావిధానము

మూ. .........ఉపసిస్నాత్వా ధారయేద్వాససీనవే. ౧౨
నిర్మలే చన్ద్రికా శుక్లే శుక్లమాల్యానులేపనః,
సాలంకారం సపర్యాన్తే మణ్డపస్యాధివేదికమ్. ౧౩
మణ్డలం చతురశ్రం వా తన్మధ్యేఽష్టదళామ్బుజమ్,
లిఖిత్వా పిష్టచూర్ణేన తత్రోపర్యుపరిక్రమాత్. ౧౪
తిలానాం పఞ్చచతురః త్రీన్వా ద్రోణా నథాష్టభిః,
పలైశ్చతుర్భిర్ద్వాభ్యాం వా తామ్రపాత్రం కృతం నవమ్. ౧౫
శాలేయై రక్షతైః పూర్ణం సారేణాష్టాక్షరేణతామ్,
స్థాపితాం పఞ్చగవ్యేన వస్త్రాలఙ్కారశాలినీమ్. ౧౬
ప్రతిమాముపవిన్యస్య తత్ర దేవం దివాకరమ్,
దీప్యమానప్రభాచక్రం సాన్ద్రసిన్దూరరోచిషమ్. ౧౭

దివ్యాభరణసంపన్నం రక్తస్రగ్గన్ధవాససమ్,
సాఙ్గహేమారవిన్దస్య కర్ణికాయాం నిషేదుషమ్. ౧౮
మూలే పూర్వాదిమన్త్రాణాం శుక్రాఙ్గారబుధోరగాన్,
గురుమన్దేన్దుకేతూంశ్చ నక్షత్రాణి త్రిశస్త్రిశః. ౧౯
మధ్యతః పూర్వపాత్రాగ్రే రేవత్యన్తానిచాహ్వయేత్,
యథా స్వనామమన్త్రేణ గన్ధపుష్పాక్షతాదిభిః. ౨౦
సర్వోపచారైరభ్యర్చ్య క్షీరాహారం నివేదయేత్,

వ్యా. పైజెప్పినరీతిగ రాత్రిజాగారముచేసి మరుసటినాడుదయమున స్నానముచేసి నిర్మలములై వెన్నెలబోలె తెల్లనైన రెండునూత్రనవస్త్రములను ధరించి తెల్లనిపువ్వుమాలికలను తెల్లనిచందనమును ధరించి పైజెప్పినమంటపమున నుండువేదికయందు మండలాకారముగ నైనను చతురశ్రముగనైనను మండలముచేసి, దానినడుమ ఎనిమిదిరేకులతోగూడిన పద్మాకారముగ పచ్చిపిండిచేత నిర్మించి, దానిపై ఐదుద్రోణములపరిమితమైనను లేక నాల్గుమూడు ద్రోణములపరిమితమైనను నువ్వులు పోసి, ఎనిమిది లేక నాల్గు లేక రెండుపలములపరిమితి కలరాగిచే క్రొత్తగచేయబడినపాత్ర నుంచి, అందు శాలితండులములయక్షతలను నింపి, యాకలశమును పైజెప్పిన యష్టదళపద్మముపై నుంచునది. పిమ్మట వస్త్రాలంకారాదులచే భూషితంబగు సూర్యప్రతిమను సూర్యదేవతాకమైన యష్టాక్షరమంత్రముచే పైజెప్పిన తామ్రకలశముపై నునిచి పంచగవ్యముచే మార్జనముచేయునది. పిదప దేదీప్యమానమైన కాంతిసమూహముకలవాడును, దట్టమైనసిందూరమువంటి కాంతికలవాడును, దివ్యములైన యాభరణములచే నలంకరింపబడినవాడును, ఎఱ్ఱనిపువ్వుమాలికలును గంధంబును వస్త్రములును కలవాడును, పూర్ణముగ వికసించిన బంగరుకమలమునందలి కర్ణిక(బొడ్డు)యందుకూర్చొని యుండువాడును నగుసూర్యభగవానుని యావాహనముచేయవలెను. పిమ్మట శుక్రుడు, అంగారకుడు, బుధుడు, రాహువు, గురుడు, శని, చంద్రుడు, కేతువు అను నీగ్రహము లను పూర్వాదిదిక్కులయందు వారివారికి జెప్పియుండుస్థానమున వారివారిమంత్రములచే నావాహనముచేయవలెను. పిమ్మట నడుమనుంచబడినతామ్రపాత్రకుచుట్టును ఒక్కొక గ్రహమునకు మూడేసినక్షత్రములవంతున అశ్వినిమొదలు రేవతివరకుంగలనక్షత్రముల నిరువదియేడింటిని "అగ్నిర్నః పాతుకృత్తికా" అను మొదలగు ఆయానక్షత్రములమంత్రములచే నావాహనముచేసి, గంధము పుష్పములు అక్షతలు మున్నగు పూజార్హద్రవ్యములచేత షోడశోపచారపూజలజేసి క్షీరాన్నమును నివేదనముచేయవలెను.

శాంతివిధానము

మూ. తత్రైవ సహితో విప్రైః చతుర్భిర్లోహితాన్నవాన్. ౨౧
నిర్వ్రణాన్నవభిర్యుక్తాన్ సూత్రైశ్చామీకరేణవా,
అశ్వస్థానాత్ గజస్థానాత్ వల్మీకాత్తీర్థసఙ్గమాత్. ౨౨
రాజద్వారాచ్చ శకలైః మృత్తికానాంచ చన్దనైః,
రోచనాగుగ్గులుభ్యాంచ పుణ్యతీర్థామ్బుపూరితాన్. ౨౩
పల్లవాలంకృతముఖాన్ శ్వేతవస్త్రేణ వేష్టితాన్,
పఞ్చాభిషేకకలశాన్ స్థాపయిత్వాచ తణ్డులే, ౨౪
ఆపోహిష్ఠాదిభిర్మన్త్రైః హిరణ్యేత్యాదిభిస్త్రిభిః,
పవమానానువాకేన శన్నో దేవ్యనువాకతః. ౨౫
శన్నో వాతానువాకేన ఘోషయే చ్ఛాన్తి వాచనాం,
విధాయకత్వబ్రహ్మోణ్ణం చతురో బ్రాహ్మణాం జపేత్. ౨౬
అయంతేన మితేవార్యైః అర్ధేనచ రణేనవా,
హుత్వాపూర్ణాహుతిం చాన్తే ప్రణీతావోక్షమాచరేత్. ౨౭
అనులోమాద్యథాలిఙ్గం అక్షీభ్యామనువాకతః,
ప్రాఙ్ముఖస్యాజ్యసమ్పాతైః అభ్యజ్యాఙ్గా నిరోగిణః. ౨౮
అభిన్నాగ్రేణ దర్భాణాం హేమగర్భేణ ముష్టినా,
త్రిఃప్రమృజ్యతతశ్శాన్తిం వాచయన్ బ్రాహ్మణైస్సహ. ౨౯
తే స్నానకలశామ్భోభిః అభిషిచ్య స్వయంపునః,
మార్జయిత్వా యథాపూర్వం దర్భగర్భేణ వాససా. ౩౦
రుక్మం తత్ ప్రతిగృహ్ణీయాత్ సదక్షిణమ్........,

వ్యా. పిమ్మట ఆచార్యుడు నలుగురుబ్రాహ్మణులతోఁగూడి నవీనములును ఓడులేనివియునైన ఐదురాగికలశములను అభిషేకార్థమైయుంచవలెను. అట్టికలశములకు నూలుదారములనైనను బంగరుతీగనైనను తొమ్మిదితెచ్చి చుట్టవలెను. మరియు గుఱ్ఱములుండుస్థలమునుండియు ఏనుగులుండుస్థలమునుండియు పుట్టనుండియు తీర్థములు కలియుస్థలమునుండియు రాజద్వారముననుండియు ఇసుకదెచ్చి ఆయిసుకను శ్రీగంధమును, గోరోచనమును, గుగ్గిలమును పైజెప్పినకలశములలోఁ నునిచి, పుణ్యతీర్థములజలముచే నిండించి, అందు పంచపల్లవముల నునిచి తెల్లనివస్త్రములచే నలంకరించి చుట్టి, ఆయైదుఅభిషేకకలశములను పైజెప్పినమంటపమున బియ్యముపై నునిచి యలంకరించునది. పిమ్మట నాచార్యుడు

పైజెప్పినసలుగురుబ్రాహ్మణులతోగూడి, "అపోహిష్ఠామయోభువః" అనుమంత్రములను "హిరణ్యవర్ణాః...భవన్తు" అనుమూడుమంత్రములను, "పవమానస్సువర్జనః—పునాతు" అనునట్టి యనువాకమును, "శన్నోదేవీరభిష్టయ" అను అనువాకమును, "శన్నోవాతః పవతాం" అను అనువాకమును, శాంతివాచనమునకు పారాయణముచేసి, పిమ్మట విధాయకులగు నల్గురుబ్రాహ్మణులును బ్రహ్మయు కలిసి నాల్గు బ్రాహ్మణముల జపించి, హోమమంత్రములచే హోమముచేసి, పూర్ణాహుతిని హోమాంతమునచేసి, ప్రణీతాజలముచేత నాయామంత్రములచే ప్రోక్షించవలెను.

పిమ్మట రోగిని తూర్పుముఖముగ కూర్చుండబెట్టి, అక్షీభ్యాం తే నాసికాభ్యా" అను అనువాకమంత్రములచేత రోగియొక్క అయాఅంగములయందు, అజ్యసంపాతము (హోమముచేయునప్పుడు ప్రతిఆహుతియందును శేషముగనుండు ఆజ్యమును ఒకపాత్రలోనునిచిన అయ్యది ఆజ్యసంపాతము) చేత అభ్యంజనముచేయవలెను. కొనచిట్లకుండు దర్భలచేత బట్టుకొని పిడికిట బంగరునుంచుకొని అట్టిదర్భలచే పైజెప్పినరీతిగ నాయాయంగములయందు అనులోమముగ నభ్యంగనముచేయించి ఆపిడికిలిచే మూడుమార్లు అనులోమముగ (శిరమునుండి పాదములకు) నిమరవలెను. పిమ్మట శాంతిమంత్రముల జపించుచు ఆచార్యుడు తక్కినబ్రాహ్మణులగూడి స్నానకలశములనెత్తికొని అందలిజలముచే రోగికి అభిషేచనముచేయించి, పిదప ఆచార్యుడుమాత్రము స్వయముగ దర్భ చేతబట్టి యాదర్భలచే మంత్రపూర్వకముగ కలశోదకముచే మార్జనముచేసి, కలశమున నుంచిన బంగరుప్రతిమను వస్త్రమును దక్షిణతోగూడ రోగిచేతినుండియు తాను దానమః తీసికొనవలెను. (అయాకలశములమార్జనముచేసినవారు అయాకలశములపై నుంచబడినవస్త్రములను ప్రతిమలను దక్షిణతోగూడ గ్రహించవలెను).

## ప్రతిమాదానాదివిధి

మూ. ...................అథాతురః,

ఉత్తరాభిముఖశ్శ్వేతవస్త్రమాల్యానులేపనః. 31

శాన్తం గ్రహాణాం నిర్వర్త్యబన్ధానాంచ విమోక్షణం,
పూర్వాభిముఖమాచార్య మభ్యర్చ్యప్రతిమామపి. 32

గాం తత్ర దక్షిణాం తస్మై మథ్యాహ్నే సముపస్థితే,
"పద్మోద్భవః పద్మకరః సప్తాశ్వరథవాహనః. 33

ప్రతిమానేన దత్తేన తుష్టస్స్యాజ్జగద్గురుః,
ఇహజన్మనియత్పాపం అన్యజన్మనివాకృతమ్, 34

సప్రత్యయా ప్రత్యయాభ్యాం తత్సర్వం క్షపయత్వసౌ,
మన్త్రేణానేన దత్వా తం ప్రణిపత్యసమాప్యచ. ३५
ఆసీమాన్తమనువ్రజ్య తన్ముఖం నావలోకయేత్,
ఆచార్యేణాప్యనుజ్ఞాతః ప్రవిష్టోభవనం నిజమ్. ३६
ఋత్విగ్భ్యోదక్షిణాం దత్వా కృత్వారాధనమశ్వినౌ,
ధన్వన్తరించ సన్తర్ప్యదీనానాథానుపస్థితాన్. ३७
మఙ్గళధ్వనినాతోయైః ససర్వౌషధిపల్లవైః,
మన్త్రాభిమన్త్రితైస్స్నాతః కృతకౌతుక (బన్ధనైః,) మణ్డనః. ३८
ప్రసన్నతే తాః పుణ్యాహం వాచయిత్వా శతం ద్విజాన్,
తదర్థం వాతదర్థం వా క్రియాసాద్గుణ్యసిద్ధయే. ३९
మృష్టాన్నైర్భోజయిత్వాథ స్వయంభుఞ్జీతబన్ధుభిః,
యేయేరోగాః ప్రబాధన్తే రాజయక్ష్మాజ్వరాదయః. ४०
తేషాం తేషాం ప్రతిచ్ఛన్దదానైస్త్యాజ్యాః ప్రయత్నతః.

ఇతి సర్వరోగప్రాయశ్చిత్తాధికారః.

వ్యా. పైజెప్పినరీతిగ మార్జనాభిషేకములజేసికొని కలశవస్త్రప్రతిమల దానము చేసినపిమ్మట రోగి తెల్లనివస్త్రములను పుష్పమాలికలను చందనాద్యనులేపములను ధరించి, పైజెప్పినరీతిగ శాంతికర్మను చేసి బంధవినిర్ముక్తుడై యాచార్యుని తూర్పుముఖముగ గూర్చుండబెట్టి తాను ఉత్తరాభిముఖుడై ప్రీతితోగూడిన మనస్సుకలవాడైయాచార్యుని బంగరుసూర్యప్రతిమను విధ్యుక్తముగ పూజించి "పద్మోద్భవః పద్మకరః—తత్సర్వం క్షపయత్వసౌ" అనుమంత్రముచే మధ్యాహ్నకాలమున నొకబ్రాహ్మణునకు సూర్యప్రతిమను దాన మిప్పించి దానియంగముగ నొకధేనువును దక్షిణగా నిప్పింపవలెను. ఇత్తెఱంగున ప్రతిమాదానముచేసి, దానముతీసికొనినవానిని పొలిమేరదాటునంతవరకును తోడ నరిగి మరలి వానిముఖమును జూడకయే ఆచార్యునియనుమతివడసి తనయింటికి చేరవలెను. పిమ్మట ఋత్విజులకు దక్షిణనొసంగి, అశ్వినీదేవతలను ధన్వంతరిని పూజించి, అక్కాలమున తటస్థపడిన దరిద్రులను దక్షతలేనివారిని మనస్సుకు తృప్తికల్గునట్లు సంతోషపరచి, మంగళ తూర్యనినాదములతోగూడి, పలుతెఱంగులైనయోషధులతోడను పల్లవాదులతోడనుగూడి మంత్రాభిమంత్రితములైనజలముచే స్నానముచేసి, మనస్సుకు ఉత్సాహమును బుట్టించు నలంకారమును జేసికొని, నిర్మలచిత్తుడై, పుణ్యాహవాచనమును జేసి, నూర్గురికైనను ఏబదుగురి కైనను ఇరువదియైదుగురికైనను చతుర్విధాహారపదార్థములచే మృష్టాన్నమును సంతృప్తిగ

భోజనంబిడి, తానును బంధుమిత్రాదులనుగలిసి భుజింపనగును.ఇట్టి సంతర్పణముజేసిన తాను జేసినశాంతిక్రియ సఫలంబగును. మరియు మనుజులను రాజయక్ష్మజ్వరము మున్నగు నేయే రోగములు బాధించుచుండునో వానివాని ప్రతిరూపమునుజేసి పైజెప్పినరీతిగ శాంతిజేసి నచో నాయారోగములు శాంతినొంది యారోగ్యముకల్గును. ఇదియే రోగవిషయరూప మైన రెండవరూపోపాయము. ("ఆనకర్మశరోపాయిః హేతువ్యాధివిపర్యయః" అని చెప్పినవ్యాధి విపర్యయమైన ఉపాయ మని భావము.

## జ్వర-కాస-శ్వాస-హిక్కల స్వరూపములు

రోగములస్వరూపములు:—

మూ. త్రిపాద్భస్మప్రహరణః రక్తాక్షస్త్రిశిరాజ్వరః. ౪౧
కాసః కూర్మాజసంస్థానో దీర్ఘోదణ్డధరః కృశః,
కరేణ నాదయన్ ఘణ్టాం విస్తృతాక్షోఽతిభీషణః. ౪౨
శ్వాసస్త్రిబాహుః పాశాక్షకమణ్డలుసముజ్జ్వలః,
హిక్కారోగః పిశాచాభిః పతన్నుద్బాహురావృతః. ౪౩

వ్యా. జ్వరము మూడుపాదములును, భస్మాయుధంబును, ఎఱ్ఱనికన్నులును, మూడు శిరస్సులును కల్గియుండును. కాసము తాబేటియంగమును బోలి దీర్ఘమై దండమును ధరించి కృశతనొంది, చేతితో గంటవాయించుచు, తెరవబడినమిడిగ్రుడ్లుకల్గి మిక్కిలి భయంకరాకారమై యుండును. శ్వాసరోగము మూడుహస్తములును, అందొకచేత పాశంబును, వేరొకచేత నక్షమాలికను, మరియొకచేత కమండలమును ధరించియుండును. హిక్కా-(ఎక్కిళ్లు) రోగము పిశాచములచే జుట్టబడి చేతులపై కెక్కికొనియుండును.

## రాజయక్ష్మరోగస్వరూపము

మూ. రాజయక్ష్మా కృశతనుః శరచాపాసితర్జనీః,
దధత్ త్రినేత్రో దంష్ట్రాభ్యాం దష్టోష్ఠో హస్తముద్యతః. ౪౪

వ్యా. రాజయక్ష్మరోగము కృశించినశరీరముకల్గి నాల్గుచేతులయందు బాణంబును ధనువును ఖడ్గంబును తర్జనియు (చూపుడువ్రేలిచే బెదరించుసట్లును)కల్గి, మూడుకన్నులతోగూడి క్రూరములగురెండుకోరలచే పెదవులకరచికొని బెదరించుచు, చంప నుద్యుక్తమైన ట్లుండును.

## అర్శోరోగస్వరూపము

మూ. అర్శోరోగః కృశోవక్త్రః ఖడ్గఖేటభృదూర్ధ్వదృక్,
కపాలమాలాదుర్దర్శః సోష్ణిషః సారభూషణః. ౪౫

వ్యా. అర్శోరోగము కృశించి వక్రమై కత్తిఖేడముల ధరించి పైజాపుల జాచుచు కపాలమాల ధరించుటచే చూడ శక్యముగాక తలపాగకల్గి సారవంతములైన యాభరణములు కల్గియుండును.

గండరోగస్వరూపము

మూ. గణ్డరోగః కరైష్షడ్భిః శంఖచక్రపరశ్వథాః,
ప్రాసచాపశరాన్ బిభ్రత్ ధావన్ శీర్ణశిరోరుహః, ౪౭

వ్యా. గండరోగము ఆరుచేతులుకల్గి, ఆట్టియారుచేతులచే శంఖమును, చక్రమును, పరశువును, ప్రాసము (ఈటె)ను, ధనువును, బాణమును వరుసగ ధరించి, తలవెండ్రుకల విరబోసికొని పరువిడునట్లుండును.

జిహ్వాదంతరోగ, భగందరశ్లీపదరోగములస్వరూపములు

మూ. లమ్బాకారౌ స్ఫిచౌ జిహ్వా దన్తరోగౌ ద్విబాహుకౌ,
భగన్దరగదః ప్రాజః శీర్ణకేశవిబన్ధనః. ౪౭
పఙ్గుః పాశాఙ్కుశధరః పీఠాసీనః కకుద్యుతః,
శ్లీపదః స్త్రీపరస్తున్దః పతన్ క్షురధనుర్ధరః. ౪౮

వ్యా. జిహ్వాదంతరోగములు వ్రేలుచున్న తుంట్లును రెండుచేతులును కల్గియుండును. భగందరరోగము మిక్కిలి యున్నతమై తలవెండ్రుకల విరబోసికొని కాళ్లుకుంటియై చేతుల పాశాంకుశములధరించి మూపురముకల్గి పీఠికపై గూర్చొనియుండును. శ్లీపద(బోదకాలు) రోగము స్త్రీయందాసక్తికల్గి మిక్కిలి బలిసి సురియకత్తిని ధనువును రెండుచేతుల ధరించి యుండును.

మసూరీరోగస్వరూపము

మూ. మసూరీ దశహస్తశ్చ ఖేటదణ్డధనుశ్శరాన్,
ఘణ్టాం పాశాసిం శూలం నాగతర్జనికేవహన్. ౪౯

వ్యా. మసూరీరోగము ఖేటము(డాలు), దండము, ధనువు, బాణము, ఘంట, పాశము, కత్తి, శూలము, నాగము, తర్జని అను నీపదిపరికరణములను పదిచేతుల ధరించి భయంకరముగ నుండును. (మసూరి యనస్ఫోటకము.)

అనుక్తరోగరూపకల్పనము

మూ. అనుక్తేషు తు రోగేషు రోగాగ్నిజ్వాలితేక్షణమ్,
భ్రూభఙ్గభీషణం శక్తిం శూలం పాశాఙ్కుశౌదధత్. ౫౦
చక్రఖడ్గగదావజ్రక్షురప్రాణిధనూంషిచ,

నాసాగ్రన్యస్తతర్జన్యా తర్జయన్ పారిపార్శ్వకాన్. ౫౧
దంష్ట్రాదష్టాధరపుటం దూరాత్పాణిమదక్షిణమ్,
ఉద్యమ్యాభిముఖం ధావత్ ప్రహర్తుం పార్శ్వయోశ్చ్యుతమ్,
విశీర్ణకేశో రోగాణాం ప్రతిరూపం ప్రకల్పయేత్,

వ్యా. పైజెప్పినరోగములుకాక తక్కినరోగములస్వరూపము నీక్రిందజెప్పబడు ప్రకారముగకల్పించునది:—రోగమనేయగ్నిచేత జ్వలించుచున్న నేత్రములుకల్గి బొమ ముడిచే భయంకరమై, శక్తిశూలము పాశము అంకుశము చక్రము ఖడ్గము గద వజ్రము బాణము ధనుస్సు అను నీయాయుధములను చేతులధరించి, చూపుడువ్రేలిని ముక్కుపై నిడికొని చెంతనుండువారిని బెదరించుచు, దంతములచే పెదవి కరచికొని, ఎడమచేతిని, పైకెత్తికొని యెదురుగ పరువిడుచు, ఇరుప్రక్కల వెండ్రుకలవిరబోసికొని, రోగుల చంప బోవునట్లు రూపమును కల్పింపవగును.

## ప్రతిమలకు బంగరుపరిమితి

మూ. శతం తదర్ధమర్ధం వా హేమ్నో నిష్కాణి తేన తు. ౫౩
అతోఽప్యల్పేన యోదద్యాత్ మహాద్దానం నరాధమః;
ప్రతిగృహ్ణాతివాతస్య దుఃఖశోకావహం భవేత్. ౫౪

వ్యా. పైజెప్పినరోగరూపములతో ప్రతిమలను నూరునిష్కములబంగరుచేనైనను ఏబదినిష్కములబంగరుచేనైనను, ఇరువదియైదునిష్కములబంగరుచేనైను చేయవలెను. అటుకాక అంతకన్న తక్కువబంగరుచేత ప్రతిమనుజేసి దానముచేసినచో ఇచ్చినవానికిని తీసికొనినవానికిని దుఃఖము సంభవించును. కావున గొప్పదానమును స్వల్పముగ జేయ దగదు.

## రోగప్రతిరూపదానము

మూ. "యేయేరోగాః ప్రబాధన్తే దేహస్థాస్సతతంతుమామ్,
గృహ్ణీష్వప్రతిరూపంతు సహారోగైర్ద్విజోత్తమ!" ౫౫
మన్త్రేణానేన తద్దద్యాత్ పూర్వరీత్యాకృతార్చనమ్,
బాఢమిత్యేవ గృహ్ణీయాత్ తద్రూపం వ్యాధిభిస్సహః. ౫౬
ఆచార్యోయజమానస్త మనుమాయాచ్ఛ్రుతం పదమ్,
దర్శనస్పర్శనాలాపాన్ వర్షమేతేన వర్జయేత్. ౫౭

వ్యా॥ పైజెప్పినపరిమితి ననుసరించి బంగారుతో నాయారోగ ప్రతిరూపమును యథోక్తముగచేసి పైజెప్పినరీతిగ పూజావిధానమునుజేసి ఆచార్యుని పూజించి "యేయే రోగాః—ద్విజోత్తమ!" అనుమంత్రముచే నాచార్యునికి దానమియ్యవలెను. ఆచార్యుడును అట్టిదానమును 'నీరోగ్య సఫలమగునుగాక' యని రోగ ప్రతిరూపమైన ప్రతిమను రోగి యొక్కరోగములలోగూడ పరిగ్రహించవలెను. పిమ్మట యజమానుడు దానమును పరిగ్రహించిన యాచార్యునివెంట నూరడుగులదూర మరిగి మరలి చూడక తనయింటికి రావలెను. పిమ్మట నొకసంవత్సరకాలము దానమును తీసికొనినవానితో సంభాషణము దర్శనము స్పర్శనము మున్నగుసంబంధములను బొత్తుగ మానవలెను.

"నాదేహమునందు ఏయేరోగములుచేరి నిరంతరముగ నన్ను బాధింపుచుండునో అట్టిరోగముల ప్రతిరూపమైన యీప్రతిమను ఆరోగములనుగూడ నీవు పరిగ్రహించవలెను" అని పైజెప్పినమంత్రమున కర్థము.

క్రూరవారాదులయందుజనించినవ్యాధికిశాంతికర్మ

మూ॥ క్రూరవారా స్తథాతారాః తారాంశవిషనాడికాః,
దర్శ ప్రతిపదష్టమ్యః పఞ్చమ్యాధానపంచకమ్. ౫౯
గ్రహాశ్చోభశ్చతదోర్గే జాతాః ప్రాయేణమృత్యవే,
అతోఽపమృత్యుశాన్త్యర్థం మన్త్రం మృత్యుఞ్జయం జపేత్. ౬౦
గుడూచీం జుహుయాత్తేన క్షీరేణ స్నపయేచ్ఛిగః,
వస్త్రం హిరణ్యమాహారం గాం కృష్ణాం మహిషీం మహీమ్. ౬౧
భైషజ్యం కాలపురుషం దద్యాత్కృష్ణాం స్తిలానపి,
నానుతాపం భజేద్దత్వా దానం దద్యాదమత్సరః. ౬౨
విత్తశాఠ్యం న కుర్వీత భజేద్వైఫల్యమన్యథా,
నక్షత్రేభ్యో బలిం దత్వా గ్రహయజ్ఞం సమాప్యచ. ౬౩
యది కుర్యాత్క్రియాం వ్యాధిః దుస్సాధ్యోప్యామశామ్యతి,

వ్యా॥ అంగారకవారము మున్నగుక్రూరములైనవారములయందును, క్రూరములగు భరణికృత్తిక మున్నగునక్షత్రములయందును, ఆయానక్షత్రములయొక్క విషనాడ్యంశములయందును, అమావాస్య పాడ్యమి అష్టమి పంచమి యనుతిథులయందును, గర్భోత్పత్తియైనతార, జన్మ-విపత్-ప్రత్యక్, నైధనము నను నైదుతారల శని మున్నగుగ్రహములు క్రూరములుగ నున్నపుడును సంభవించినరోగములు ప్రాయికముగ మృత్యువునొందించును.

కావున అట్టియపమృత్యువుతొలగుటకై మృత్యుంజయ("అపమృత్యుమప—స్వాహా"అను) మంత్రమును జపముచేయవలెను. ఆమంత్రముచేతనే గుడూచి (తిప్పతీగె) సమిధలను హోమముచేయవలెను. ఆమంత్రముచే క్షీరము నభిమంత్రించి శిరస్సుపై ప్రోక్షింపవలెను. మరియు వస్త్రమును, హిరణ్యమును, ఆహారపదార్థమును, నల్లనిగోవును, ఎనుమును, భూమిని, ఔషధమును, కాలపురుషుని, నల్లనినువ్వులను దానముచేయవలెను. అట్టిదానములుచేసి పిమ్మట లోభత్వముచే చింతింపగూడదు. మత్సరములేక ద్రవ్యవిషయమున మోసములేక పైజెప్పినదానమును చేయవలెను. అట్టిలోభగుణముచే లోపముచేసినయెడ తానుచేసిన దానము నిష్ఫల మగును. మరియు దుష్టనక్షత్రములకు బలివిధానముచేసి ఆదిత్యాదినవ గ్రహములకును యథోక్తముగ హవనము(హోమము)చేసి పిమ్మట పైజెప్పినదానముల నలుపవలెను. ఇత్తెఱంగున శాంతికర్మను చేసినచో సాధింపరానిక్రూరవ్యాధియును అతి శీఘ్రముగ శమించును.

### జన్మనక్షత్రాదులయందురోగముగల్గినసంభవించుదోషము

మూ. ఆధానజన్మనిధనప్రత్యగాఖ్యవిపత్కరే. ౬౩

నక్షత్రే వ్యాధిరుత్పన్నః క్లేశాయమరణౌ యవా,

వ్యా. గర్భోత్పత్తియైననక్షత్రమునందును, జన్మతారయందును, నైధనతారయందును, ప్రత్యక్ తారయందును, విపత్తారయందును ఈనక్షత్రములలో వ్యాధి సంభవించినచో మిక్కిలి కష్టము కల్గించును. లేక మరణము నొందించును.

### అశ్విన్యాదిజన్మనక్షత్రములగల్గురోగములకు శాంతి

మూ. ఇహార్క్షరాశిజన్మర్క్షోదయసన్థ్యాసునిర్మలే (లః). ౬౪

గాయత్ర్యష్టోత్తరశతం వారం ద్రవ్యైర్ఘృతప్లుతైః.

హుత్వాతన్మణ్డలే పిష్టలిఖితేఽష్టారపఙ్కజే. ౬౫

పాత్రం ప్రతిష్ఠాప్య బలిద్రవ్యయుక్తం కృతార్చనమ్,

దేవతానామమన్త్రేణ స్వాహాన్తే నాత్ర సన్నిధౌ. ౬౬

త్రిశూలిమితస్సింహనామోద్ధృతే ష్వాయుధపాణిషు,

చైత్యశ్మశానాయతనచత్వరామ్బుచతుష్పథే. ౬౭

క్షిపేదారోగశమనాత్ ఇత్థంచాశుద్ధమాశ్విన్నే,

వ్యా. పైజెప్పినజన్మరాశి జన్మనక్షత్రాదులయందు రోగము సంభవించినపుడు ఉదయకాలమునందైనను సంధ్యాకాలమునందైనను స్నానాదులచే నిర్మలుడై పైజెప్పిన

రీతిగ హోమకుండమును ఏర్పరచి హోమద్రవ్యమును నేతిలో తడిపి గాయత్రీమంత్రముచే నూటయెనిమిదిఆహుతులు హోమముచేసి, మండలమును నిర్మించి, అందు బలిద్రవ్యములతో గూడిన పాత్ర నునిచి విధ్యుక్తప్రకారము పూజించి, హోమముచేయు నపుడు ఆయానక్షత్రమునకు జెప్పినదేవతనామము నుచ్చరించి స్వాహాకారముతో బలిపాత్రసన్నిధిలో హోమముచేసి, యాబలిపాత్రమును పైకెత్తి ఆయుధపాణులై రోగికి మూడుసార్లు దిగద్రిప్పి, యాపాత్రమును హుంకారముచేయుచు చైత్యస్థలమునందైనను, శ్మశానమునందైనను, చత్వరప్రదేశమునందైనను, నీటియందైనను, నాల్గుత్రోవలుకలియు స్థలమునందైనను ఉంచునది. రోగము నివర్తించునందాక యిట్లు చేయునది. అశ్వినీనక్షత్రము జన్మతారయైన నానక్షత్రమున నీవిధానము చేయునది.

మూ. యామ్యేతిలగుడక్షౌద్రాణ్యాగ్నేయే తిలతణ్డులమ్. ౧౮
ప్రాజాపత్యేహవిర్హోమోదధ్యన్నం సర్వతోబలౌ,

వ్యా. భరణీనక్షత్రము జన్మనక్షత్రమై యానక్షత్రమున రోగము సంభవించినచో నువ్వులను బెల్లమును తేనెను హోమముచేయవలెను అగ్ని(కృత్తికా)నక్షత్రమైనచో తిలలును బియ్యమును కలిపి చేతితో తడిపి హోమముచేయునది. రోహిణీనక్షత్రమైనయెడ నేతిని హోమముచేయవలెను. ఈమూడునక్షత్రములకును దధ్యన్నమును బలిగా నీయవలెను.

## మృగశీర్షాదినక్షత్రములందుచేయుశాంతి

మూ. ముద్గమాషబలిస్సౌమ్యే గోక్షీరం హోమకర్మణి. ౧౯
పావకం యామ్యవద్రౌద్రే పాయసేన బలిక్రియా,
ఆదిత్యే తణ్డులాన్ హుత్వా బార్హస్పత్యేతు పాయసమ్. ౨౦
శుద్ధాన్నేన బలిం దద్యాత్ సార్పేన్యగ్రోధపల్లవాన్,
సగ్రామ్యౌషధిభిర్హోమోభక్ష్యాన్నేన బలిక్రియా. ౨౧

వ్యా. మృగశిరనక్షత్రమున బలికి పెసలును ఉద్దులును, హోమమునకు ఆవుపాలును ఉపయోగింపనగును. ఆర్ద్రానక్షత్రమున భరణినక్షత్రమునకు జెప్పిన నువ్వులు బెల్లము తేనె ఈమూడిటిని హోమముచేసి పాయసముచే బలిక్రియను చేయవలెను. పునర్వసునక్షత్రమున బియ్యమును, పుష్యనక్షత్రమునకు పాయసమును హోమముచేసి, ఈరెండునక్షత్రములకును శుద్ధాన్నముచే బలిక్రియ చేయవలెను. ఆశ్లేషానక్షత్రమున మఱ్ఱిచిగుళ్లను గ్రామ

మునకుట్టునట్టియౌషధములగూర్చి హోమముచేయవలెను. భక్ష్యములతోఁగూడినయన్న ముచే బలిక్రియను చేయవలెను.

మఖానక్షత్రమునకు

మూ. గాయత్రీమంత్రజాప్యంచ లక్షమేకం ప్రయత్నతః,
హావనం విధివత్కుర్యా త్తర్పణం మార్జనం తథా. ౭౨

గాయత్రీ జాతవేదమంత్రములను రెండులక్షల పర్యాయములు జపించవలయును. పిమ్మట దశాంశక్రమముగ హోమతర్పణమార్జనములను జేయవలయును.

పుబ్బనక్షత్రమునకు

మూ. గాయత్రీ మూలమంత్రేణ పంచలక్షజపః స్మృతః,

ఎనిమిదవభాగము ద్రవ్యమును బ్రాహ్మణునకు దానము చేయవలయును. పిమ్మట లక్షపర్యాయములు గాయత్రీమంత్రమును జపింపవలయును. గోదానము చేయవలయును.

ఉత్తరాఫల్గునీనక్షత్రమునకు

మూ. హరివంశశ్రవణం కుర్యాద్వారమేకం చ తత్పరః. ౭౩
గాయత్రీమూలమంత్రేణ దశాయుతజపః స్మృతః,

హరివంశమును మిగుల భక్తితో బారాయణముజేయవలయును. మఱియు నా మానవుడు తనగృహమునందలి ద్రవ్యమునం దాఱవభాగమును దానముచేయవలయును. పిమ్మట బదివేలు గాయత్రీమంత్రమును జపింపవలయును.

హస్తనక్షత్రమునకు

మూ. జాతవేదేతి మంత్రేణ పంచాయుతజప స్తథా. ౭౪
గోదానం చ విశేషేణ శయ్యాదానం తథా ప్రియే,

తనయింటియందున్న ద్రవ్యములోఁ నెనిమిదవభాగమును పుణ్యకార్యములయం దుపయోగింపవలయును. పిమ్మట నేబదిపర్యాయములు జాతవేదమను మంత్రమును జపింపవలయును. అంతట దశాంశక్రమముగ హోమతర్పణమార్జనములను జేయవలయును. మృష్టాన్నదానమును జేయవలయును. గోదానశయ్యాదానములను జేయవలయును.

చిత్రాదినక్షత్రములు

మూ. హవిష్యాన్నం బలౌ హోమే చిత్రాన్నం త్వాష్ట్రపాలితే. ౭౫
శుద్ధాన్నేన బలిస్తేషాం వాయవ్యే పాయసం యజైః,
ఐన్ద్రాగ్నేః పాయసం హోమే గన్ధమాల్యే బలౌ బలౌ. ౭౬

మైత్రే ఘృతాన్నం హోమార్థే సూరణః కటుకైః పునః,
ఐన్ద్రే హోమేచరుబలిః నైరృతే మూలమౌషధైః. ౨౭
ఆర్యేతు శాలయోహోమే ద్వయోస్తు కృసరోబలౌ,
కుల్మాషావైశ్వదేవర్క్షే హోమార్థే పాయసం బలౌ. ౨౮
గన్ధమాల్యబలిర్హోమే వైష్ణవే రక్తతణ్డులైః,
ఘృతముద్గబలిక్షీర సమిద్ధోమశ్చ భానవే, (వాసవే). ౨౯
హోమే మన్దారపుష్పాణి వారుణీపాయసం బలౌ
ప్రాజాపత్యేచ హవిషాజైకపాత్పరిరక్షితే. ౩౦
పృషదాజ్యేన హవిషా అహిర్బుధ్న్యేబలిః పునః,
అఖణ్డైః పూషదైవత్యే గన్ధమాల్యబలిస్త్రిషు. ౩౧
సర్వలక్షణసంయోగో భక్తిరైన్ద్యద్విజాతిషు,
చికిత్సాయామసిర్వేదః తదారోగ్యస్యలక్షణమ్. ౩౨

ఇతి చతుర్థాధికారః.

ఇతి శ్రీనాథపణ్డితకృతౌ పరహితసంహితాయాం సాధారణకాణ్డః ప్రథమస్సమాప్తః.

ఆతురవృత్తాధికారశ్చతుర్థశ్చ.

వ్యా. చిత్రానక్షత్రమునకు నేతితోకూడినయన్నము బలికిని, హోమమునకు చిత్రాన్నమును ఉపయోగింపనగును. స్వాతీనక్షత్రమునకు శుద్ధాన్నముచే బలియు, యవలతోగూడినపాయసముచే హోమంబును చేయవలెను. విశాఖానక్షత్రమున పాయసమును హోమముచేసి గంధమాల్యములచే బలియుంచేయవలెను. అనూరాధానక్షత్రమున నేతితో కూడినయన్నమును హోమముచేసి ఆవాలతోగూడిన కందగడ్డను హోమముచేయవలెను. జ్యేష్ఠానక్షత్రమున చరువు (పక్వాన్నము)ను హోమముచేసి దానినే బలికి నుపయోగించునది. మూలానక్షత్రమున ఔషధములతోగూడినమూలములను, పూర్వాషాఢానక్షత్రమున శాలితండులములను హోమముచేసి, ఈరెండునక్షత్రములకును కృసరము (పెసలపప్పును నువ్వులను బియ్యమును ఒకటిగజేర్చి పక్వముచేయబడినపులగము)ను బలిచేయునది. ఉత్తరాషాఢానక్షత్రమున కుల్మాషము(ఉడికించినమినుము)లను హోమముచేసి, పాయసమును బలియిచ్చునది. శ్రవణనక్షత్రమున గంధమాల్యములను బలియిచ్చి, ఎఱ్ఱనిబియ్యమును

హోమముచేయునది. ధనిష్ఠానక్షత్రమున పెసలను నేతిని బలియిచ్చి, పాలను సమిధలను హోమముచేయవలెను. శతభిషనక్షత్రమున మందారపుష్పములచే హోమముచేసి, పాయసముచే బలినిచ్చునది. పూర్వాభాద్రానక్షత్రమున భరణీనక్షత్రమునకు జెప్పిననువ్వులను బెల్లమును తేనెను కలిపి హోమముచేయునది. ఉత్తరాభాద్రానక్షత్రమున పృషదాజ్యము (నెయ్యిని పెరుగును కలిపినహవిస్సు)చే హోమముచేయునది. రేవతీనక్షత్రమున ఖండశర్కరచే హోమముచేయునది. మరియుం పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, యను నీమూడునక్షత్రములయందును గంధమాల్యములచే బలిహారణము చేయునది.

మరియుం రోగికి ఉండులక్షణములు మంచివియై, వైద్యునియందును బ్రాహ్మణుల యందును ద్వేషబుద్ధిలేక భక్తికల్గి, చికిత్స జేసికొనుటయందు విసుగుచెందక శ్రద్ధగల్గి యున్నచో నారోగికి ఆరోగ్యము చేకూరు నని యెఱుంగునది.

ఇచ్చట నీవివరణము నెఱుంగునది:—ఎవరికైనను జన్మనక్షత్రమునాడు రోగము సంభవించినచో నయ్యది ప్రబలమై మిక్కిలి కష్టసాధ్యమగును కావున దానికి దగినశాంతి జేయుట యావశ్యకము. అట్టియెడ అశ్విన్యాదినక్షత్రములలో నెయ్యది తనకు జన్మనక్షత్రమగనుండునో ఆనక్షత్రమున రోగముసంభవించినపుడు పైజెప్పినరీతిగ నాయారోగప్రతిరూపమునుజేసి విధ్యుక్తముగ పూజాదివిధుల నెరవేర్చి, ప్రతిమను దానముచేసి పిమ్మట పైజెప్పినరీతిగ నాయానక్షత్రములకు జెప్పినద్రవ్యములచే హోమంబును, బలిహారణంబును చేయవలెను. హోమద్రవ్యములు ఆయానక్షత్రమునకు నిర్ణీతముగనున్నను ఆయాద్రవ్యములను నేతితో తడిపి హోమముచేయవలెను.

మరియు నిచ్చట ఆయానక్షత్రములకు హోమబలిద్రవ్యములనిర్ణయమును వరుసగ చెప్పునప్పుడు మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, అను నీనాల్గునక్షత్రములకుమాత్రము ద్రవ్యనిర్ణయము చెప్పియుండలేదు. గ్రంథకర్త అన్నిటికిని నియతముగ జెప్పి యీనాల్గు నక్షత్రములకుమాత్రము చెప్పకుండుటకు కారణము తెలియదు; కాని ఈవిషయమున గ్రంథపాత ముండునని యూహింపవలసియున్నది.

ఇత్తెఱంగున శ్రీనాథపండితవిరచిత పరహితసంహితయందు సాధారణకాండమనునది ప్రథమకాండము సంపూర్ణము.

ఇతి విశ్వనాథరచితాపరహితబోధిన్యుదారపరతన్త్రా,
పరహిత తన్త్రవ్యాఖ్యాజీయాదాన్ధ్రీసతాం ముదేద్యునిశమ్.

ఇతి శ్రీశ్రీశ్రీకాళహస్తిసంస్థానాస్థానవిద్వద్వరేణ్యులును సర్వతంత్రస్వతంత్రులు నగు బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రులవారిచరణకమలసంసేవాసమాసాదిత పాణినీయావిశాస్త్రవిజ్ఞానసముల్లసితుండును, శ్రీమాన్ వైద్యరత్న పండిత. డి. గోపాలాచార్యులవారి యాయుర్వేదాశ్రమమునం దాస్థానవిద్వాంసుడుగ నున్నవాడును, కౌండిన్యగోత్రవిరాజమాన నుదురుపాటివంశపయఃపారావారసుధాకరుండును, బ్రహ్మశ్రీ అగ్నిచిత్ సీతారామవాజపేయయాజి శ్రీసీతాంబాసోమపీథినీతనూభవుండును నగు వైయాకరణ విద్వాన్ శ్రీ పణ్డిత విశ్వనాథశాస్త్రిచే విరచితంబైన పరహితబోధిని (యను పరహితసంహితాంధ్ర)వ్యాఖ్యానమున సామాన్యకాండ మను ప్రథమకాండ వ్యాఖ్యానము సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1952

# నిఘంటువులు

| | | | |
|---|---|---|---|
| శ్రీకాంతశేషము, సటీక | ... | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | 8 |
| మేదినీకోశము ,, | ... | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరీకోశము ,, | ... | 1 | 0 |
| అమరము, ప్రథమకాండము మూలము టీక | ... | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము | ... | 1 | 0 |
| అమరము, సటీక, పోలంకాగితములు, కలికో | ... | 5 | 0 |
| వావిళ్లనిఘంటువు 1-వ సంపుటము (అ మొదలు ఔ వఱకు) | ... | 10 | 0 |
| ,, 2-వ సంపుటము (క మొదలు ఘ వఱకు) | ... | 12 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృతఆంధ్రనిఘంటువు | | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక ,, | ... | 6 | 0 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యము | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీక, అకారాద్యనుక్రమణికతో | ... | 2 | 0 |
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | ... | 1 | 0 |
| కోటికాలపుకవిత్వము, శ్రీ బ్ర॥ వేమాకావ్యసముగారిది | ... | 3 | 0 |
| తెలుగుసామెతలు with English Translation by Captain Carr | | 2 | 0 |
| Translation Guide, English to Telugu & *Vice Versa* | | 2 | 8 |
| సులక్షణసారము, సటీక, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| ఆంధ్రశబ్దమంజరి, బ్ర॥ సీతారామాచార్యులు | ... | 0 | 8 |
| Sankaranarayana's English-Telugu Dictionary, శ్రీశంకరనారాయణగారి నిఘంటువు, (ఇంగ్లీషుపదములకు తెనుఁగు అర్థముగలది) | ... | 15 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టుడిక్షనరి | ... | 5 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు (సంస్కృతపదములకు తెనుగు అర్థముగలది) | | 3 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యవ్యాకరణము | ... | 0 | 6 |
| ప్రౌఢవ్యాకరణము, బ్ర॥ సీతారామాచార్యులు | ... | 1 | 8 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ... | 1 | 4 |
| డిటో శ్రీబులుసు వేంకటరమణయ్యగారి టీకతో | ... | 3 | 0 |
| లఘువ్యాకరణము, శ్రీ వేదము వేంకటరమణశాస్త్రి | ... | 1 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | ... | 1 | 0 |
| శ్రీరావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెనుగువ్యాకరణము | ... | 1 | 8 |


వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోష్టుబాక్సు 1372 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1